# అనుక్షణికం

## 2

వడ్డెర చండీదాస్




నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ విజయవాడ-2




# ANUKSHANIKAM-2

(Serialised in Andhra Jyothi Weekly 1982-'84)

By

VADDERA CHANDIDAAS

First Edition

May' 85

కథాకాలం 1971-80

రచనాకాలం 1979-81

894 : 8133

Cover Design :
CHANDRA
Hyderabad.

Printers :

Sri Venkata Ramana Printers

Vijayawada-2

Publishers :

**Navajyothi Publications**

Eluru Road, Vijayawada-2.

Price :

**Rs. 35-00**

నాడు సామ్రాజ్యాల నేడు అనుక్షణికం
సిరియాలించిన కీర్తి అపకీర్తి గడించుకున్న
శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారికి...

నేను;(వాంకాంనాంక విశ్వ) సంగీతలోంలుణ్ని,

(వాంకేవాంక) అనురాంగస్త్రీ పతిని,

(వాంకాంనాంకాంనేక) దేవీ శాంక్త్యుణ్ని,

(వాంకాంనాంకా నైకతత్త్వ)

త్రికరణైకాంతుణ్ని.

# శోకతప్తజ్ఞతలు

నన్ను నవలలోకి దించిన తనకు కృతజ్ఞతలు తన ముఖానే చెప్పా లంటే చచ్చే నవ్వొస్తుంది. నవ్వి — చావటం దేనికని. యీ అచ్చు కాగితం చాటునుంచి మొయ్యలేక చచ్చేటన్ని కృతజ్ఞతలు చెప్పాలను కుంటే —

పవిత్రతను కాగితాలమీద శ్లాఘించి తన జీవితాలలో సహించని: యీ అల్పత్వాల నీచత్వాల గుంటనక్కల తోడేళ్ళ మేడిపండు సమాజాన్ని విద్యు దయస్కాంత కాంతిఘాతంలా ప్రతిఘటించగల సత్తా వుందికూడా,

తను కోరుకున్నది పొందినతనం బదులు, బతికినన్నాళ్ళూ యీ ముళ్ళ పంది సమాజాన్ని ప్రతిఘటించటంతోటే సరిపోతే, తిరగబడటం ధ్యేయంగా భావిస్తే తప్పు. అర్థరహిత మనుకున్నందువల్లా—.

తను అనుభవించాల్సొచ్చే రకరకాల మానసిక హింసను చూడలేని తన వూపిరిలో వూపిరైన, అనురాగ మానసం: కనలి విక్రుతమై పోతుం దనిపించినందు వల్లా—,

వొకానొక వాత్సల్య బలహీనత వల్లా—.

“ఆవలి గట్టున నిరీక్షిస్తుంటాను. మీ జీవితాన్ని ‘త్యాగించి’ బతికి; యీ సమాజాన్ని కరుణించి దీవించి రమ్మ”ని అనురాగంతో శాసించిన ప్రియబాంధవికి, నక జీవిత కాలపు తెరమరుగు నుంచి శోకతప్తజ్ఞతలు.

# వడ్డెర చండీదాస్ రచనలు

**హిమజ్వాల**

శరీరాలలో ఆత్మలలో మూల మౌన చేతనా స్తిత్వం ల్చిన సెగ. కాంక్ష మనో సంశోధక రసతత్వ నవల.

**చీకట్లోంచి చీకట్లోకి**

స్త్రీని ప్రధానపాత్రగా తీసుకుని సునిశిత అంతరంగ చిత్రణ చేసిన శక్తివంతమైన కథానిక్కలు

**అనుక్షణికం**

గత దశాబ్దం [1971–80] లోని సాంఘిక రాజకీయ ఆర్థిక తదితర బాహ్య అంశాలలోంచి యువతరపు వైవిధ్య జీవిత అంతరంగ చిత్రణ. ప్రాపంచిక తపను లోంచి వెలువడిన అతీతవాద తాత్విక నవల.

**హిమోహా రాగిణి:**

మార్మికంగా తాను సృష్టించిన నవ్తరాగ స్వరాక్షర మాలిక.

**Desire and Liberation**

తన భారతదేశంలో యీ శతాబ్దంలో వెలువడిన రెండు మూడు నూతన మెటాఫిజిక్స్ దర్శనాలలో వొకటి.

# అనుక్షణం -2

## 68

తర్వాత భర్త రామారావుని ఉద్యోగంలోకి తీసుకున్నారు, సస్పెన్షన్ రద్దుచేసి. ఇన్నాళ్ళకీ జీతం కూడా ఇచ్చారు. అంతా తమాషాగా జరిగింది, రామారావు ప్రమేయం ప్రయత్నంలేకుండా.

లంచం పుట్టని ఒక ప్రభుత్వాధికారిని, ఒకతను అతనికి కావాల్సిన పర్మిటు ఆర్డరు జారీ చెయ్యాలనీ తగిన ప్రతిఫలం ముట్టజెప్తాననీ వేధించుకు తింటూంటే—తను రూల్సు ప్రకారం మాత్రమే చేస్తాననీ లంచం ముట్టే ప్రసక్తేలేదనీ ఖరాఖండీగా చెప్పినప్పటికీ—ఆ వ్యక్తి ఆ అధికారిని బెదిరించటం సాగించాడు.

ఆ స్థితిలో ఆ అధికారి స్పెషల్ బ్రాంచి సి. ఐ. డీ. అధికారులను నేరుగా కలుసుకుని తన పరిస్థితి వివరించాడు "పది రోజులలోగా వాళ్ళకి ఆ పని చెయ్యకపోతే నా అంతం చూస్తామని బెదిరించారు. మళ్ళా యెల్లుండి సాయంత్రం ఆరున్నరకి వొచ్చి కలుస్తామని బెదిరించారు. నేను ముందు గదిలో కూర్చుని వుంటాను. మీరు వెనక గదిలో వుండి వెంటిలేటర్‌లోనుంచి గమనించండి శ్రమ అనుకోక—అంతా మీరే స్వయంగా గ్రహించగలరు"—అని అర్థించితే ఆ సి.ఐ.డి. అధికారి అంగీకరించాడు.

వాళ్ళు వొస్తామన్న రోజున, ఆరున్నరకే ఆ సి.ఐ.డి. అధికారి మరొకరిని తీసుకుని వొచ్చాడు. వెనక గదిలో వాళ్ళని కూచోబెట్టి మర్యాదలు చేశాడు ఆ ప్రభుత్వాధికారి.

ముందు గదిలో ఆ సి. ఐ. డి. అధికారి సూచనలననుసరించి, సోఫా కింద కేసెట్ టేప్‌రికార్డర్ ఆరు గంటలకి ఆన్ చేసి వుంచాడు. చెప్పిన వేళకి సరిగ్గా ఆరున్నరకి అతను వొచ్చాడు.

"యేం నిర్ణయించుకున్నావ్? మూర్ఖంగా ప్రవర్తించకు. పదివేలు కాదు యిరవై వేలు యిస్తాం- యిదుగో" అని వెయ్యి రూపాయల నోట్ల బొత్తి కోటుజేబులోంచి బయటికి లాగి మళ్ళీ లోపలికి తోసేశాడు అతను.

"లంచం తీసుకోవటంగానీ రూల్సుకి భిన్నంగా పర్మిట్లు యెట్లాగోచేసి యివ్వటంగానీ నా నియమానికి విరుద్ధం చెప్పానుగా- సవ్యమైన సహాయం యేది కావాలన్నా—"

"చూడు మిస్టర్ యింతగా యేందుకు అడుగుతున్నానంటే— యీ పర్మిట్ నేను సంపాదించి యివ్వలేకపోతే నా యీ బిజినెస్‌కి పెద్ద యెదురు దెబ్బ తగుల్తుంది. మహామహా వాళ్ళతో చేయించగలిగాను. నువ్వో లెక్క- కాదు. డబ్బుకికూడా లొంగకపోతే యిదుగో—" అని జేబులోంచి మడిచిన చాకు తీసి తెరిచి, "దీనికి పని చెప్పాల్సివొస్తుంది. యేమంటావో చెప్పు. సరిగ్గా నేను చెప్పిన రోజుకి ఆర్డరు నాచేతికివ్వాలి. లేదా అంతే సంగతులు— నీ పెళ్ళాం పిల్లల ఖర్మ—" అని హిందీలో అంటూ చాకుని చేతిలో అటూ యిటూ తిప్పుతూంటే మెరుస్తోంది.

అంతలో దగ్గరికి వేసి వుంచిన గుమ్మం తెరుచుకోవటం, మరు క్షణంలో, గుమ్మంలో సి. ఐ. డి అధికారి "హాండ్స్ అప్" అని, చేతులో పిస్టల్‌తో నుంచుని, ఆయన అసిస్టెంటు ఫ్లాష్ కెమెరాతో రెండు మూడు సార్లు క్లిక్ మనిపించటం జరిగిపోయాయి.

సి ఐ. డీ. అధికారి అసిస్టెంటు తన జేబులోంచి పిస్టల్ తీసి పట్టుకుని ముందుకు అడుగులువేసి, ముందు గుమ్మం తలుపువేసి వొచ్చి, అతని చేతులు వెనక్కి వొంచి బేడీలు వేశాడు. ఆ ప్రభుత్వాధికారి టేప్‌రికార్డర్ తీసి రివైండ్‌చేసి ఆన్‌చేశాడు.

అతను బేడీల చేతులు కదుల్చుతూ గుర్రుగా చూశాడు— చూడటానికి అమాయకుడిలాగా సాత్వికుడిలాగా అనిపించావు. యింత ప్లాను పన్నేవన్న మాట— నీ అంతం చూస్తానురా—అనుకుని "పదండి" అన్నాడు సి.ఐ.డి. అధికారులతో

సి.ఐ.డి. ఆఫీసర్లు ఫోనుచేస్తే జీపు వొచ్చింది. అతనిని తీసుకెళ్ళ

వాళ్ళ ఆఫీసులోన గదిలో పెట్టి ప్రశ్నించటం మొదలు పెట్టారు.

"నీ పేరు?"

"రాంసింగ్."

"మిగతా పేర్లు"

"యింకా పేర్లు లేవు."

గుండుసూదితో మెడమీది వాకనరంలోకి గుచ్చుతూ "చెప్పు నీమిగతా పేర్లు?" అన్నారు

బాధతో కేకపెట్టాడు అతను. సూది తీసేసారు.

ఐదారు పేర్లు చెప్పాడు

"అసలు పేరు?" చెప్పాడు

"యింతకుముందు కేసులు చెప్పు."

చెబుతూంటే తారభర్త రామారావు కేసు బయటపడింది. తార భర్త లంచాలు పుచ్చుకుంటున్నప్పటికీ అంత చిన్న వుద్యోగి గురించి అతనికి తెలియదు. యింద్రారెడ్డి పురమాయిస్తే లంచంతో తానే యెం.సి.బి. వాళ్ళకి చెప్పి యిరికించాడు. తన ప్రేరేపణ వల్లనే అతను ప్రలోభపడి తీసుకున్నట్లు చెప్పాడు. యెవరు చేయించారంటే యింద్రారెడ్డి పేరు చెప్పలేను చెబితే తన ప్రాణాలకే ముప్పులని. "విలేజ్‌నుండి వొచ్చినపార్టీ ముందుగానే పేమెంటు" అని చెప్పాడు. అతను చెప్పినదాన్లో ఆ పార్టీ అతనిని అలా యిరికించమని కోరితే, తను రామారావుని ప్రలోభపెట్టి సాధించినట్టు అర్థం వొచ్చింది. ఆ రకంగా రామారావు బయటపడ్డాడు

పెళ్ళికి ముందున్న స్కూటరే అతనికి మిగిలింది. భార్య కోసం లంచాలు పట్టి కొన్నవన్నీ అమ్ముకోవాల్సి వొచ్చిందిన్నాళ్ళూ. యిప్పుడు ఆ భార్యా లేదు.

మళ్ళీ—తనూ తన ఉద్యోగమూ, తన స్కూటరూ, తన మిత్రులు. ఆ సందర్భంలోనే తన మనసు వికలమైపోయిందనీ తనకు బదిలీ కావాలనీ ప్రాధేయపడుతూ అడిగితే, డిపార్టుమెంటు పై అధికారులు జాలిగా అనిపించి అతను కోరుకున్న గుంటూరికి బదిలీ చేసారు. మళ్ళీ తల్లి దండ్రులకీ తోబుట్టువులకి దగ్గరయ్యాడు. యిన్నాళ్ళూ తార యెవరినీ వుండనిచ్చేదికాదు భర్త తరపువాళ్ళకాదు. ఆమె తరపువాళ్ళొచ్చినా. యీ మూక అంతా వొస్తే తన స్థితి నలుగురిలో తేలికై పోతుంది— అనే భావనతో అందరినీ దూరంగ

వుంచేది. "మా నాన్న నెల్లూరులో లీడింగ్ లాయర్" అనే చెప్పేది. యితర వివరాలు చాకచక్యంగా తప్పించేసేది, చెప్పకుండా.

వూరు వెళ్ళగానే తార గురించి అడిగితే యెప్పుడో తన దారి తను చూసుకుని వెళ్ళిపోయిందని చెప్పాడు రామారావు. మంచి సంబంధం చూస్తామన్నారు. అతనికి ముప్ఫయ్యేళ్ళు దాటలేదింకా. యీ సారి తను పెళ్ళిచూపులకి కూడా వెళ్ళదలుచుకోలేదు, పెద్దవాళ్ళనే చూసికుదర్చమని తలచుకున్నాడు.

## 69

వెంకటావధాని తండ్రి మానసికంగానూ, ఆర్థికంగానూ బాగా దెబ్బతిన్నాడు. వెనకటిలాగా గిట్టుబాటు అవటంలేదు. కాగా తననిబొత్తిగా గిట్టుబాటుకాని ప్రాంతపు స్టేషన్‌కి బదిలీచేశారు. అది స్రవంతి తండ్రి రాఘవ రెడ్డి పలుకుబడివల్ల జరిగింది. నోరు మూసుకుని నువ్వూ నీ కొడుకూ పడి వుండండి. మెదిలారో, నిన్ను వో కేసులో యిరికించటమే కాక పాత కేసు లన్నీ లాగించగలను—అని మళ్ళీ బెదిరింపు కబురుపెట్టాడు రాఘవరెడ్డి.

వెంకటావధాని, ఆస్పత్రి నుంచి యెనిమిది నెలలకి డిశ్చార్జి అయ్యాడు. కుడికాలు కర్రకాలు. అలాగే కుంటుకుంటూ యింట్లోనే వుంటున్నాడు—కవిత్వం చదువుకుంటూ రాసుకుంటూ, ప్రేయసీ నీ వయవంచన నేత్రాలు, ప్రేయసీ నీ స్వార్థ మానసం ప్రేయసీ నీ ప్రియుడి కాష్ఠపు వేడిలో చలి కాచుకో, నీ ప్రియుడి కన్నీటిలో నీ మలిన దేహాన్ని కడుక్కో— అంటూ మకుటాలు కూర్చుకుని గేయాలు రాస్తున్నాడు. 'నా గాయాల గేయాలు' అని పేరు పెట్టాడు.

ఐతే వొకసారి, వుండబట్టలేక— సిటీలో పి. డబ్ల్యుడి యింజనీరుగా వుద్యోగం చేస్తున్న స్రవంతి భర్త ఆచూకీ తెలుసుకుని వెళ్ళి—తమ యిద్దరి సంగతీ చెప్పాడు వెంకటావధాని, వెంకటావధానివంక స్రవంతి భర్త జాలిగా చూసి,"చూడు మిస్టర్ యిట్లా అబద్ధాలాడి కాపరాలు చెడగొట్టటంకంటే అడుక్కు—తినటం గౌరవప్రదం" అన్నాడు. అహం దెబ్బతిన్నట్లుగా అనిపించి "డబ్బుకోసం భార్య ఎట్లాంటిదైనా సరిపెట్టుకునేవాళ్ళం తెలుసుకోగలరు!" అన్నాడు వెంకటావధాని. "షటప్. నీ నీచపు బుద్ధులన్నీ నాకు బాగా తెలుసు గెటవుట్"అని అరిచాడు స్రవంతి భర్త. గుర్రుగా చూసి బయటికి వొచ్చేశాడు వెంకటావధాని.

వంటి మాటలు మొదలెడితే కుమిలిపోయి—

ఆవేదనని, కవిత్వం చదవటంలో రాయటంలోనూ పూడ్చేసెయ్యటం సాధ్యంకాక ఎక్కడున్నా పని చూసుకోవాలన్న ఆలోచనతో వుద్యోగ ప్రయత్నాలు ప్రారంభిస్తే—

విజయ్‌కుమార్ అతని స్థితి గ్రహించి జాలిపడి, వాళ్ళ హోటలూ, మిల్లుల లెక్కలుచూసే పని యిప్పించాడు. వెంకటావధానికి కవిత్వం వొచ్చుగానీ అంకెలురావు. తప్పులుచేసి చివాట్లుతిన్నాడు. "యిదియ్యా బిజినెసు లెక్కల్రా కుంకెదవా. అంకెలు పొరపాటొస్తే వేలల్లో లక్షల్లోమునిగిపోతాం కాగా నీకు యిన్‌కంటాక్సు పాయింటాపువ్వూ తెలిసేడవదు. యెందుకూ పనికిరాని దద్దమ్మవి. విజయ్ చెప్పాడని పెట్టుకుంటే నీతో పెద్ద అవస్థగా వుంది మీదెక్కడున్నావూ వొంగోలా. పోయి రాగిచెంబుచ్చుకు బతకరాదూ! కవిత్వం రాస్తావంటగా—కవిత్వం గివిత్వం దేనికి యాడవను. లెక్కలుసరిగా నేర్చుకుని తగలడు వెంకటీ, లేకపోతే యీ బతుకూ వుండదు." అని వొకటి రెండుసార్లు బాగా వాయించాడు విజయ్‌కుమార్ పింతండ్రి.

అంతటితో కవిత్వం కూడా వొదిలిపోయింది. యిప్పుడు వెంకటావధాని నాలికమీదకి కవిత్వం ముక్కరావటం మానేసింది. కలంలోంచి వొక్క కవిత్వచరణమూ రావటంలేదు

పెన్సిళ్ళు, రూళ్ళకర్ర, అంకెలు, కూడికలు, తీసివేతలు, లెక్కలు— అణాపైసల లెక్కలు—యిన్‌కం టాక్సు వాళ్ళకోసం లెక్కలు తయారుచేసే నిపుణులకి అందించే చిత్తులెక్కలు. యిది యిప్పుడు వెంకటావధాని జీవన ప్రపంచం.

# 70

ఆరకంగా రామనాధం యింట్లోంచి బయటపడిన రవీ గంగీ నేరుగా రాంనగర్ చేరుకుని రవి పాకలోకి వెళ్ళారు.

చెరో రెండు గ్లాసులు మంచినీళ్ళుతాగి పరుపుమీద కూర్చున్నారు.

"నువ్వెంత ధైర్యంగా ప్రవర్తించావు గంగీ! నువ్వేలేకపోతే వాడు నా ప్రాణాలు నిజువునా తీసేసుండేవాడు!"

"గప్పుడంత ధైర్యంగ యెట్ల చేస్తినో యేమొ నాకే తెల్వకున్నది. యిప్పుడు తల్సుకుంటె బుగులేస్తున్నదిమల్ల ఆడికి పోవాల్నంటె"అందిగంగి

"వాడు పరమ క్రూరుడు. వాడి అల్లుడు పరమ నీచుడు. యీ పరిస్థితిలో నువ్వింక ఆ వుద్యోగం చెయ్యొద్దు" అన్నాడు.

"మరి?"

"చేస్తే యింకెక్కడన్నా చేస్తువులే. ముందు ఆ వైపు హయ్యరు. షార్ట్ హ్యాండు ప్రయత్నించు"

"ఆ షార్ట్‌హ్యాండ్ టోర్. టైప్‌రైటింగ్‌హయ్యర్ అంటెచెయ్యగల్గుత"

మధ్యాహ్నం వేళ.

"నీకు ఆకలిగా లేదూ?" అన్నాడు.

"నా టిఫిన్‌బాక్సు ఆడనే వున్నది. ఆ రామ్‌నాధమ్‌కి ధర్మమిచ్చిన!" అని నవ్వింది.

"నాకు యీపూట ఆకలిగాలేదు. నువ్వు యింటికి పెళ్ళి తినిరా" అన్నాడు రవి.

"నాకుగూడ ఆకలిగ లే" అని పరుపుమీద పడుకుని ఆతని చేతిమీద చెయ్యివేసి "నువ్వుగూడ వాని ఫ్యాక్టరీ ఇవద్దు. చాటుగ చంపిన చంపగలడు ఆ బద్మాష్" అంది.

"యేడ్చాడు, నన్నేమన్నా చేస్తే— తెల్లారేసరికి, వాడి ఫ్యాక్టరీలన్నిటికీ పెట్రోలుపోసి తగలేస్తారు వర్కర్లు. ఆ సంగతి వాడికి బాగా తెలుసు. నా జోలికిరాడు. యికముందుఆసలేరాడు. అదీఫ్యాక్టరీలో, ఫ్యాక్టరీకిసంబంధించి"

పైకి జరిగి అతని తొడమీద తల పెట్టుకుంది.

"గంగీ."

"వూ"

"గంగీ-"

"యెప్పట్కి యిట్లనె వుండిపోవాల్ననిపిస్తది నాకు" అంది.

"గంగీ——"

"వూఁ"

"మనం పెళ్ళి చేసుకుందామా?" అన్నాడు

"యెవర్ని?" అని చిన్నగానవ్వి తలఅతనివొళ్ళోకి జరుపుకున్నట్లుగా జరిగింది.

"యీ పిల్లని యీ పిల్లాడు— యీ పిల్లాడిని యీ పిల్ల."

"నీకు యింత దునియాల గిక్రి పోరే నచ్చిందా? నువ్వు గుడ్డోడివి రవీ! అంది.

వొంగి ఆమె నుదుటి మీద ముద్దు పెట్టుకున్నాడు, రవి

అలాగే నవ్వుకుంటూ నిద్రపోయాడు. మెలకువ వొచ్చేసరికి సాయంత్రం ఐదు ఐంది.

యిద్దరూ కలిసి కొమురయ్య యింటికి వెళ్ళారు. రాములింకా రాలేదు. కొమురయ్య, పోశవ్వ వున్నారు.

"ఆకలేస్తున్నది. యేమన్న నాస్త పెట్టు." అంది తల్లిని.

అటుకులూ బెల్లం పెట్టింది.

యిద్దరూ కలిసి తిన్నారు.

టీ తాగుతూండగా రాములు వొచ్చాడు.

"ఆగో, నన్నిడిసేసి మజా అంతా మీరె వుడాయిస్తున్నరా!" అన్నాడు రాములు నవ్వుతూ.

"యేమిట్రా— యెప్పుడొస్తివి, చాయ్ తాగు." అని నవ్వుతో టీ అందించింది అన్నకి.

వొకగుటక వేసి, "రవీసాబ్ యాడికి పోతివి దినామంత కానరాలేదు?" అన్నాడు రాములు.

రామనాధంయింట్లో జరిగినదంతా వివరించారు— రవీ, గంగీయిద్దరూ కలిసి.

విని, భయపడ్డారు కొమురయ్య, పోశవ్వ.

పోశవ్వ సన్నగా యేడుస్తూ, "గంగీ యింక వానికొల్వుకి పోకే" అని కొడుకు వంకా రవి వంకా చూసి, "మీరుగూడ వాని కొల్వుకాన యిడ్సి పెట్టున్రి." అంది.

మరో గంటకి రవి హోటలుకి వెళ్ళి భోజనంచేసి గూటికి చేరుకుని పుస్తకం తెరిచాడు. యెప్పుడు తీరిక చిక్కినా ఆర్థికశాస్త్రం పుస్తకాలు యేవో చదివిస్తూనే వుంటాడు.

యిటీవల సాయిలు రెండు నెలలు జబ్బుపడ్డాడు. అతనికి జీతం లేదు. అతనిభార్య పంచాన పడింది. ఆ భారం తనమీదే వేసుకున్నాడు రవి. ఆనే నెలలో తను బ్యాంకులోను యిప్పించితని సైకిలు చక్రాల బండి—

ఆర్టీసీ బస్సు గుద్దేస్తే తుక్కు తుక్కు ఎంది. తప్పు చాలావరకు డ్రైవరు దే ఐనా, బండీ ఆతనిమీదకే నెట్టేశారు పోలీసులు. ఆ సందర్భంలో పోలీసులతో తగూపడ్డాడు రవి. వర్కర్ల యూనియన్ లీడరని కాస్తతగ్గి మాట్లాడారుగాని —ఆర్టీసీవాళ్ళు నష్టపరిహారం యివ్వటానికి వొప్పుకోలేదు. కోర్టుకి వెళ్ళి గెలిచే వీలూలేదు. అతని బండి రిపేరు చేయించిపెట్టాడు. రెండువొందలైంది యిలాంటివే యేవో పనులు— ఫ్యాక్టరీవాళ్ళవో వాడకట్టువాళ్ళవో.

రాత్రి యెనిమిదింటికి భోజనాలయ్యాక గంగీ రాములూ వాకిట్లో చాప వేసుకుని కూచున్నారు.

"నా కొల్వుపోయె— నీకు కష్టమైతది." అంది గంగి.

"యిన్ని దినాలు నీకు కొల్వుంటెనె గడిచెనా!"

"యెంతైన కష్టమేగద— నాయ్నకు మందులకు చాన పైసలై పోతున్నవాయె. సైపు హయ్యర్ నేర్వు, వుద్యోగం తొందరేమి అంటున్నడు రవిసాబ్." అంది.

"మంచి ఆలోచన. గట్లనెచెయ్యి" అన్నాడు రాములు.

"రాములన్నా—"

"వూఁ."

"మరీ—" అని ఆగిపోయింది.

వొకనిమిషం తరవాత, "యేమొచెప్పవూ" అన్నాడు రాములు.

"నేనూ—నేనూ—"

"నేనూ నేనూ—యేమి నేను? నీవే గంగివి. కండ్లవత్తనె వున్నవు. ముచ్చటేమొ చెప్పు."

"కోపం చేస్తవా?"

"చెయ్య. చెప్పు"

"వగుతవేమొ—"

"వగ. చెప్పు."

"మరి—నేను. రవీసాబ్‌ని లగ్గమాడ్త" అంది.

రాములు వగలబడి నవ్వాడు.

"నీకు పిస పట్టెనే పోరీ? రవీసాబ్ చాన గొప్పాయన. ఆయనెవరను కుంటున్నవ్? చిన్నంతరం పెద్దంతరం మరిస్తివా దోస్తీగా వుంటున్నడని! ఆయన ఆదరికతోటి అట్లనె దో సీగ

నువ్వు జరంత అంగ్రేజి నేర్శి టైప్‌రైటింగ్ నేర్చినసి అనుకుంటివి పిసపిస్సి ఆలోచన్లువెట్టుకోకు" అని దగ్గిరికి జరిగి చెల్లెలి భుజంమీద అప్యాయంగా చెయ్యివేసి, "కోపమ్ చేస్తలేను. నీకు సమ్‌జాయిస్తున్న గంతే." అన్నాడు రాములు.

"లే. రవీసాబ్‌తానె అన్నడు గంగిమనం పెండ్లిచేసుకుందామా? అని"

"యెప్పుడు? నిజమా?"

"యీ పొద్దు· ఆడికెల్లి వొచ్చి రవీసాబ్ యింట్ల కూకుంటిమి అప్పుడు" అంది.

"నేనుచూసి, నిన్ను చేసుకుంటనన్నడే!" అని పరిహాసమాడాడు, రాములు, సంతోషంతో.

"యేమ్? నాకేమి? నల్లగుంటె పుంచిగుండరా?" అంది.

గంగిని, జనం యెలా దాహంగా చూస్తారో, యెలా వెంటపడు తుంటారో, రాములికి తెలుసు. అలా చూసి— అతనికి వాళ్ళమీద వచ్చేకోపం వొస్తూంటుంది కూడా.

"నాయ్నకు అవ్వకు చెప్తివా" అన్నాడు.

"లే" అంది

"చెప్పు."

"నువ్వు చెప్పు" అంది.

"నీ పెండ్లి ముచ్చట నువ్వె చెప్పు" అని యేడిపించటానికి అని, "ముందుగల నేను రవీసాబ్ తోటి మాట్లాడి వొస్త" అని లేచి రవి దగ్గిరికి బయల్దేరాడు

వెళ్ళి నాలుగు నిమిషాలు ఫ్యాక్టరీ విషయాలు మాట్లాడి, "గంగి పెండ్లి ముచ్చటేమొ చెప్పినది. అట్ల అంటివా రవీసాబ్?" అన్నాడు రాములు.

"నీకేమన్నా అభ్యంతరమా" అన్నాడు రవి.

రాములు, అమాంతం రవి రెండు చేతులూ పట్టుకుని, "మేము తక్కువోళ్ళం. నా చెల్లెల్ని యెట్ల యేమిటికి చేసుకుంటరూ- అని అంటి. అంతె. నాకు అభ్యంతరమెట్లుంటది రవిసాబ్! గంగికి గంత అదృష్టమా అని అంటి. అంతె" అన్నాడు.

యింటికి వెళ్ళి తల్లి దండ్రులకి చెప్పాడు రాములు. మహదానందపడి

"గీపోరి పుట్టంగనె అనుకుంటి—ఇది గొప్పింటి పోరి ఐతదని." అంది తల్లి.

మరునటి రోజు రాములు, ఫ్యాక్టరీలో తెలియజేశాడు వార్త.

పెళ్ళి యెంత అట్టహాసంగా చెయ్యాలో మాట్లాడుకుంటున్నారు గుమిగూడి.

రాముల్ని పిలిచి. "పెళ్ళి చాలా సాదాగా సింపుల్‌గా జరిగిపోవాలి. వాళ్ళని ఆ ఆలోచనలన్నీ మానుకోమను. వూరేగింపులూ, వుయ్యాలలూ, వుట్టికొట్టటాలు— కుదరదు." అని చెప్పాడు రవి.

"పెండ్లంటె నగ్గరు వొచ్చి చూశాల చెయ్యాల—" అంది రాములు తల్లి ఆ విషయం చెప్పగానె.

రాములు, "పంతుల్ని పంపినమెప్పుడొ అప్పుకొస్త" అని వెళ్ళి బ్రాహ్మణ్ని సంప్రదించి రవి దగ్గిరికి వెళ్ళి వాళ్ళమ్మ అన్నమాట చెప్పాడు.

"దానికేం తను పిలవదలిచిన వాళ్ళనందర్నీ పిలవమను. బ్రాహ్మలూ మంత్రాలూ అన్నీ వుంటయ్. ఆర్భాటం, అట్టహాసం వొద్దు. నేనెవర్నీ పిలవను ఫ్యాక్టరీనుంచి యెవరూ వొద్దు సాములూ వాళ్ళు వో పదిమంది వుంటారు. అంతె." అన్నాడు. రవి.

"మీ చుట్టాలు, కాలేజీల గోస్తులు—"

"నేనెవర్నీ పిలవదన్నానుగా-" అన్నాడు రవి.

దగ్గర్లోనే మంచిరోజు వుండటంతో పెళ్ళి ఆ వారంలోనే జరిగిపోయింది. పెళ్ళిరోజునే శోభనం కూడా.

రాత్రి పదకొండవుతున్నది. మంచం మీద రవీ గంగీ.

గంగిని దగ్గిరికి తీసుకుని నుదుటి మీదా తల మీదా ముద్దెట్టుకున్నాడు. అతనిని పెనవేసుకుని అతని పెదాలు గట్టిగా ముద్దెట్టుకుంది. అతనిని మీదకి లాక్కుంది.

మహోధృత కెరటం లోపలి అట్టడుగున మునిగిపోయినట్లుగా కంపించిపోయాడు రవి.

అలసటగా వొకరిప్రక్కన వొకరు తృప్తిగా పడుకుని—

"రవీ" అంది

"వూఁ"

"లవ్ మంచిగున్నది" అంది.

అతని జబ్బమీద చెంపఆనించుకుని, అరిచెయ్యి అతనిచెంపకి అద్దింది.

ఆమె కళ్ళలోకి తృప్తిగా చూస్తున్నాడు అతని కళ్ళలోకి చూస్తూ, పైకి జరిగి, అతని పెదాలమీద గట్టిగా ముద్దు పెట్టుకుని, జరిగి, అతని మెడా ప్రక్కన తల ఆనించి చెయ్యి అతని ఛాతీమీద వేసింది.

రవి రెప్పలు వాల్చాడు. మగతగా నిద్ర ఆవరిస్తోంది.

ఛాతీమీద వేళ్ళతో వెంట్రుకలు కదుపుతూ, మెడదగ్గర నాలికతో తాకుతూ, కాలు అతని తొడలమీదుగా వేసి గట్టిగా అదిమింది.

అతను కదలకుండా వుండటం గమనించి, "నిద్రనా?" అంది. "ఊఁ, నిద్రపోదాం, పొద్దుపోయింది."

"అప్పుడే యేం పొద్దుపోయింది. రెండు మూడు గంటలదాక పుస్తకాలు చదువుకుంట వుంటవుగద? నిద్రెట్లొస్తదిప్పుడు? దిల్లగి చేస్తున్నావు!" అని గారాబుగా అని, అతనినికదిపి కుదిపి, అతని పెదాలమీద గట్టిగా ముద్దు పెట్టుకుని, చేత్తో బలంగా పైకి జరుపుకుంటే—జరిగాడు పైకి.

తరవాత— "ఆడ దేనికి? అందరం యీడనే వుందం" అంది

"అది పద్ధతి కాదు. మనింట్లో మనం వుండాలి. ఆ యింటికి రేపు నీ అన్న భార్య వొస్తుంది" అన్నాడు.

"వొచ్చినప్పుడు చూస్కుందం" అంది.

గంగి తల్లిదండ్రులు, రాములు అక్కడే వుండమన్నారు.

రవి వొప్పుకోలేదు.

"కావాలంటే మనింటి నుంచి భోజనం పట్టికెళ్ళి మీ అమ్మానాన్నలకి పెట్టు—మీఅమ్మ చేసుకోలేకపోతే. రాములు వొచ్చి యిక్కడే తిని వెళ్తాడు" అన్నాడు రవి.

ఫ్యాక్టరీలో ఐదువొందలలోను తీసుకున్నాడు. పేచీ పెట్టకుండా యిచ్చారు—పెళ్ళి సందర్భం అని కాకపోయినా, వర్కర్ల యూనియన్ లీడర్ కదా—అని.

ఆ డబ్బుతో వంటకి కావాల్సిన కిరోసిన్ స్టవ్వు, అల్యూమినియం పాత్ర సామగ్రి కొన్నాడు.

యెవరింట్లో వాళ్ళే. రోజూ సాయంత్రం వాళ్ళు వీళ్ళ దగ్గిరికి రావటమో, వీళ్ళు వాళ్ళ దగ్గిరికి వెళ్ళటమో జరుగుతోంది.

గంగి రవి ఫ్యాక్టరీకి వెళ్ళేలోగానే వంట చేసేస్తుంది. మధ్యాహ్నం

వేళ తల్లి దగ్గరికివెళ్ళి నాలుగింటికల్లా వుండి వొస్తుంది.

"యింట్లో వొక్కదానికి యేమీ తోచకపోతే పైపు హయ్యరు నేర్చుకో" అన్నాడు రవి — వొక రోజున.

"నేర్చుకోమంటారా?" అంది

"నీయిష్టం, నేర్చుకోవాలనిపిస్తే. చేస్తే యింట్లోపనులుండకపోవు— నాల్రోజులుపోతే మనిద్దరమే వుండం !" అన్నాడు

"పోరడు కావాల్నా? బిడ్డనా?" అంది గంగి.

"అదేదో నీ చేతుల్లో వున్నట్లు అడుగుతున్నావు!"

"ఆడ కాకుంటె మగ. నేనె కద కనేది" అంది.

"ఆ గులాబీ చెట్టుకు నీళ్ళు సరిగా పోస్తున్నావా!" అన్నాడు రవి.

"దేనిక్కి? అది యెప్పుడు అట్లనె వున్నది!" అంది గానీ రోజూ, నీళ్ళుపోసి కుదురు సరిగా చేస్తూంటుంది.

# 71

## సుబ్రహ్మణ్యం....అటు వేదవతి భర్త తమ్ముళ్ళతో.

యిటు తండ్రి తమ్ముళ్ళతో వొళ్ళుహూనం ఐపోయి, పది రోజులపాటు మంచం మీదనుంచి దిగలేదు.... యింట్లో బాగా లేదని చెప్పి, ముసుగెట్టుకుని.

యింట్లో ఆ వేళకి తల్లితండ్రే వున్నారు. వాళ్ళ వొదిన పక్కవాళ్ళింట్లో వుంది. చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ స్కూళ్ళనుంచి తిరిగిరాలేదు. అన్నకివుద్యోగం మల్కాజిగిరీ వైపు. యింటికి వొచ్చేసరికి యేడు దాటుతుంది.

అందువల్ల ఆ విషయం తల్లికీ, తండ్రికీ తప్ప యింట్లో మరెవరికీ తెలియదు. వాళ్ళిద్దరూ, యింట్లో యెవరితోనూ అనలేదు.

తండ్రి ఆఫీసుకి వెళ్ళేవరకూ లేచేవాడుకాదు. భర్త ఆఫీసుకి వెళ్ళగానే తల్లి లేపి సపర్యలు చేసినట్లుగా ఒజ్జగించి గారాబుగా చూసేది. కాలకృత్యాలు ముగించుకుని మళ్ళీ ముసుగెట్టుకునేవాడు. తిండికి, కాఫీకే లేవటం. అలా పది పన్నెండు రోజులకి లేచి తిరగాల్సొచ్చింది. తండ్రిని తప్పించుకుని తప్పించుకుని తిరిగేవాడు. కొడుకు యెదురుపడినా గమనించనట్లుగా వెళ్ళి

పోయేవాడు తండ్రి.

బుద్ధిగా చదువుకునే తత్వమేమో....బాగానే పరీక్ష రాసినందువల్ల యెం.యే.లో మంచి మార్కులొచ్చాయి. పరీక్షలు ఆ గొడవకి ముందే జరిగి పోవటం మేలైందనుకున్నాడు యెం యే. ఫైనల్లో వుండగా బ్యాంకు పరీక్షలు రాశాడు. రైల్వే సర్వీసు కమిషన్ పరీక్షలు కూడా రాశాడు.

లేచి, యెప్పుడన్నా సాయంత్రం అలా వీధిన నడుస్తూ పోయి.... సుదర్శన్ థియేటర్ ముందో సంగమ్ థియేటర్ ముందో సినిమా బొమ్మలు కనిపించి....వాటిల్లో అర్థనగ్న చిత్రాలు, దిసమొల బొమ్మలు కనిపించి వేదవతి గుర్తొచ్చి; తల విదిలించుకుని గిరుక్కున తిరిగి చరచరా నడిచి యింట్లోకి వొచ్చి పడేవాడు. ప్రబంధకావ్యాలలో శృంగారపద్యాలు చదువుకుని తృప్తిపడటం తప్ప....వేదవతి పరిచయమై తనని దించేసేదాకా అతనికి ఆడ స్పర్శ తెలియదు.

అలా నాలుగు నెలలు గడిచేసరికి బ్యాంకు సెలక్షను వొచ్చింది. మహబూబ్ నగర్‌లో పోస్టింగ్ ఆర్డర్స్ యిచ్చారు.

డిగ్రీలు చేత పుచ్చుకుని సంవత్సరాల తరబడి వుద్యోగం లేకుండా వేలాదిమంది నానా అవస్థలూ పడుతూంటే, యిలా వుద్యోగం వొచ్చినందుకు మహదానంద పడిపోయారు తండ్రీ తల్లీ.

"మన సుబ్బిగాడిది మొదట్నుంచీ అదృష్టజాతకమే. యెం.యే.లో కూడా ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసైపోయాడు దీన్లో కూడా అంచెలంచెలుగా చిగురు కుంటూసాగిపోయి....ఐదేళ్ళలో ఆఫీసరైపోతాడు చూడండి!" అన్నాడు తండ్రి, శాయోజీరావు సంతోషంగా.

వెళ్ళి చేరాడు.

వో చిన్న గది తీసుకుని వుంటున్నాడు. హోటేల్లో భోజనం. అతనుంటున్న యింటి అతనికి వూళ్ళో బట్టల దుకాణం వుంది. అతని భార్యకి ముప్ఫయ్ ఐదేళ్ళుంటాయి. యిద్దరు చిన్న పిల్లలు. వుషారుగా వుత్సాహంగా వుంటుంది. సుబ్రహ్మణ్యం కనిపిస్తేసాఫీగాచక్కగా పలకరిస్తుంది. ఎప్పుడన్నా పిండివంటలేమన్నా వో ప్లేట్లో పెట్టి పంపిస్తుంది. అలాంటప్పుడు, సుబ్రహ్మణ్యం, భయపడిపోతాడు లోలోన.

అంతలో, రెండు రోజులు సెలవుపెట్టి యింటికి జరూరుగా వొచ్చి వెళ్ళమని తండ్రి దగ్గిర్నుంచి వుత్తరం వొస్తే వెళ్ళాడు.

పెళ్ళి సంబంధం. నెల్లూరు ప్రాంతం. యింటరు దాకా చదువుకుంది. 'సంసార పక్షం'గా వుంటుంది. వంటా వార్పూ చక్కగా వొచ్చు.

ఆ పిల్ల తార చెల్లెలు. తార తల్లిదండ్రులు వెనక కూడా కూతురు దగ్గిరికి పెద్దగా రాలేదు. తార ప్రోత్సహించేదికాదు....వొకటి రెండు పర్యాయాలు తండ్రి వొచ్చివెళ్ళాడు. ఆపైన యిటీవలి కాలంలో తార జీవితం తెలిశాక....నలుగురితోనే కాక, ఆఖరికి యింట్లో కూడా తార పేరెత్తటం మానేశారు. ఛీ....అని అసహ్యించుకున్నారు. తండ్రి నరహరి యీసారి సిటీకి వొచ్చి వొక పెళ్ళిళ్ళ పేరయ్యకి చెప్పివెళ్ళాడు, "మంచి సంబంధం కుదిర్చితే బాగా తృప్తి పరుస్తాన"ని. ఆ పెళ్ళిళ్ళ పేరయ్యకి నరహరి గురించి....నెల్లూరి ప్రాంతం గురించీ యేమీ తెలియదు. తూర్పు ప్రాంతాలనుంచి వొచ్చి సిటీలో స్థిరపడి పెళ్ళిళ్ళు కుదుర్చుతూ మనుగడ సాగిస్తున్నవాడు. వొక సందర్భంలో సుబ్రహ్మణ్యం తండ్రి బుంధ్యాల శాయోజీరావు పరిచయంఅయ్యాడు. మాటల సందర్భంలో అతని పిల్లల వివరాలు తెలుసుకున్నాడు. యిప్పుడీపిల్ల గురించి తెలిసి శాయోజీరావుని కలుసుకుని "ఐదువేలు కట్నం యిస్తారు పెళ్ళిలోనే. శేషు. మీవా, పెద్దసంసారం, అందరికీ లాంఛనాలు చూడాలంటే మాటలా, బోలెడవుతుంది. అవన్నీ భరించాలికదా...."అంటూ నచ్చజెప్పి "పిల్లనిచూసుకోండి. నచ్చితేనే. పిల్లతండ్రి నెల్లూరు ప్రాంతంలోనే లాయరు. మీకు అక్కడిదాకా వెళ్ళాల్సిన శ్రమలేదు. యీ వూళ్ళోనే పెళ్ళిచూపులు యేర్పాటు చేయిస్తాను." అని అన్నాడు.

తీరా సంబంధం నచ్చుతుందో లేదో బుజ్జగుకమైనా వెళ్ళాలి ఖర్చులు పెట్టుకుని అంత దూరం....అని సంశయించి, పెళ్ళిచూపులు సిటీలోనే యేర్పాటు చెయ్యమన్నాడు శాయోజీరావు.

ఆ పెళ్ళిళ్ళ పేరయ్య తన యింట్లోనే యేర్పాటు చేశాడు. మరికాస్త గిట్టుబాటు అవుతుందన్న ఆశతో.

పెళ్ళిచూపులకి....సుబ్రహ్మణ్యంతోపాటు తల్లి తండ్రీ వొకచెల్లెలు వెళ్ళారు. శాయోజీరావు పిల్లతండ్రి నరహరితో స్వయంగా మాట్లాడాడు. అతనికి అన్ని విధాలా నచ్చింది.పిల్లకూడా — మెరుపనుకుంటే మెరుపు — చామనచాయ అనుకుంటే చామనచాయ.

అసలు, తారకి మిగతా పిల్లలకీ తీరుతెన్నులోనూ అభిరుచిలోనూ పోలికేలేదు. తార, యీ బికారి కొంపలో తప్పొచ్చానూ....అనుకుంటూ

దేది....తన పెళ్ళి చూపుల సందర్భంలో ఆ మాటే అంది. యిటీవల, "దానిమాట అక్షరాలా నిజం. అది మనబిడ్డ కాదు" అన్నాడు నర హరి వొకటి రెండుసార్లు.

పెళ్ళిచూపులు జరిగిన మరసటి నెలలో పెళ్ళి జరిగింది. సిటీలోనే చేశారు. నెల్లూరులో చేస్తే పెళ్ళిసందర్భంలో యెవరన్నా పెళ్ళికొడుకు తరపు వాళ్ళతో తార ప్రసక్తి తెస్తారేమోనని. అనుకున్నప్రకారం పెళ్ళిలో ఐదువేల రూపాయలు యిచ్చేశారు. అన్ని లాంఛనాలు స్థాయి ననుసరించి బాగానే జరిపారు.

ఆ పైనెలలో శోభనానికి నరహరి వొచ్చి, అల్లుడు సుబ్రహ్మణ్యాన్ని నెల్లూరు వాళ్ళింటికి తీసుకెళ్ళాడు. మూడు రోజులు. యింట్లోనే. సాయంత్రాలు చిన్న బావమరిది అలా వీధిన వూళ్ళోకి తీసుకెళ్ళి తీసుకొచ్చేవాడు.

మొదటి రాత్రి, పాలగ్లాసుతో తెల్ల చీరతో సిగ్గుపడుతూ గదిలో అడుగు పెట్టిన భార్య శాంతని చూసి సంబరపడిపోయాడు, సుబ్రహ్మణ్యం ....ఆ రూపం, ఆ సంప్రదాయికపు వొద్దిక చూసి.

చిన్నగా సరసమాడాడు.

పక్కమీద చేరాక తనకి మహా తమకంగా వుంది. శాంతని దగ్గరికి లాక్కొని గట్టిగా ముద్దెట్టుకుని....ఆరాటం తీర్చేసుకున్నాడు. ఆమె స్తబ్దుగా వుండిపోయింది.

యిష్టంలేదేమో యిలావుండిపోయింది....యెవరినేనా ప్రేమించి, పెళ్ళి చేసుకోదలిస్తే పెద్దవాళ్ళు యీ పెళ్ళి కుదిర్చారేమో....అనుకున్నాడు, సుబ్రహ్మణ్యం.

"మరీ అలా చప్పుగా వుంటావేం? వుత్సాహం లేకండా?" అన్నాడు.

మరి కాసేపటికి, శాంత తనే అతని వీపుమీదకి చెయ్యి వేసింది. దగ్గిరికి జరిగాడు. అతని పెదాలమీద ముద్దెట్టుకుంటూ, అతని కింది పెదవిని పంట నొక్కింది.

సరిగ్గా, వేదవతి అలాగే నొక్కేది. గుర్తొచ్చింది.

'యిదే మొదలైతే అంత నేర్పు యెలావొస్తుంది! ఆ ప్రియుడి దగ్గర నేర్చుకుని వుంటాది' అని అనుకున్నాడు.

ఆపైన ఆ రాత్రికి తాకకండా పడుకున్నాడు.

రెండో రాత్రి....తాకవొద్దనుకున్నాడు గాని....ఆమె మొహం చూసే

ఆ అమాయకత్వం చూస్తే ...దగ్గిరికి తీసుకున్నాడు. ఆరాటం తీరాక, "యింతకు ముందు పెళ్ళిచూపులు జరిగాయా" అన్నాడు.

"వూఁ" అంది.

"యెన్నిసార్లు?"

"మూడు నాలుగు తూర్లు."

"నీకు యెవరూ నచ్చలేదా?"

"వొకరిద్దరు నచ్చారు."

అవును, ఆడదానికి వొకడే యేఁవిఁటి, చాలామంది నచ్చుతారు.... అనుకున్నాడు.

"మరి చేసుకోలేదేం?" అన్నాడు.

"కట్నకానుకలు కుదరలేదట."

మూడో రాత్రి—

రెండు రాత్రులూ గడిపాడుగానీ, మనిషిని సరిగా చూడనే లేదనిపించింది సుబ్రహ్మణ్యానికి. బ్లౌజు హుక్కులు తియ్యటం, చీర పైకి జరపటమేగానీ రూపం కంటినిండా చూడనేలేదని అసంతృప్తిగా అనిపిస్తూంటే—

చీర కుచ్చిళ్ళు లాగేశాడు. లోపావడా నాడా ముడి వూడలాగేశాడు.

సిగ్గుతో కంపించి, అతనికి కనిపించకుండా వుండాలని అతనికి అల్లుకుపోయింది, అమాంతం.

"అవుగా యెంత యిదీ!" అనుకున్నాడు.

ఆ యిదలో శాంతిని బాగా రెచ్చగొట్టాడు.

ఆమెలోని వయసుపొంగు, పొంగులెత్తి అతనిని గట్టిగా కౌగిలించుకుని ముద్దులతో కదలికలతో, మీదకిజరిగి కవ్వించి పక్కకిజారి అతనిని తన మీదకి లాక్కునీ—సుబ్రహ్మణ్యం మైకంలో పడిపోయాడు.

అరగంట తరవాత—యింత చిన్న వయసులో శోభనం నాటికే యింత నేర్పూ తెగువా యెలా వొచ్చినట్లు! అని అసంతృప్తిగా పక్కకిజరిగి పడుకున్నాడు. కళ్ళు మూసుకున్నాడు.

శాంత లేచి బట్టలు వేసుకుని మంచం మీద పడుకుని భర్త వీపుమీద తృప్తిగా చెయ్యి వేసుకుని నిద్రాపోయింది, రెండు నిమిషాల్లో.

సుబ్రహ్మణ్యానికి యెప్పుడో తెల్లవారుజామున గానీ నిద్ర పట్టలేదు.

నాలుగో రోజు పుదయం తను వొచ్చేస్తూ—'తను వొచ్చేస్తున్నాడు

రోజూ వొక్కణ్ణే, యిదేమీ లేకంటా వుండాలి. తనూ అంతేగా—యేమో ఆ ప్రియుడి దగ్గిరికెళ్ళి—' అని ఆలోచన వొచ్చి నీరసించిపోయాడు సుబ్రహ్మణ్యం.

మహబూబ్‌నగర్ వొచ్చి రోజూ బ్యాంక్‌కి వెళ్ళివొస్తూనే వున్నాడు గానీ, మనసు చిరాకుగా వుంటోంది సుబ్రహ్మణ్యానికి.

వో రోజుని వున్నట్లుండి, తల్లికి వుత్తరం రాశాడు—యీహోటేలు తిండి తినలేక చస్తున్నాను, నువ్వన్నా వొచ్చి వొండిపెట్టు—అని. వుత్తరం తండ్రి చూసి—కొడుకు అవస్థ గ్రహించి నవ్వుకున్నాడు. వియ్యంకుడికి వుత్తరం రాశాడు—అబ్బాయి అక్కడ వొక్కడే వుంటున్నాడు. వాడికసలే హోటలు తిండి సరిపడదు. అమ్మాయిని త్వరగా కాపరానికి పంపితే బాగుంటుంది—అని. అట్లాగే. మంచి ముహూర్తం చూసి యేర్పాట్లు చేసి నేరుగా మహబూబ్‌నగర్‌కే తీసుకొస్తాం. యిల్లు చూసి వుంచమనండి— అని నరహరి రాశాడు. ఆ మాటే శాయోజీరావు కొడుక్కి రాశాడు.

సుబ్రహ్మణ్యానికి మహదానందంగా అనిపించింది. బ్యాంకులో అందరికీ చెప్పాడు యిల్లుకావాలని. పొద్దుటా, సాయంత్రం చీకటిపడేదాకా తిరిగాడు యింటికోసం వూరంతా గాలిస్తూ.

వారం రోజుల్లోనే వో పోర్షను తీసుకున్నాడు. వరసగా రెండు గదులు. వంట గది. ఆ వెనక వొక గదిమేర ఖాళీస్థలం. దాన్లోనే బాత్రూం. మరుగుదొడ్డి. మరుగుదొడ్డి సెప్టిక్ టాంక్ కాదు. బక్కెట్ తీసుకుని రోజూ మనిషి వొచ్చి శుభ్రంచేసి తీసుకుపోవాలి. అందుకు వీలుగా వెనకవైపున తలుపు. ఆ తలుపుకి అవతల సన్న సందులాంటి వీధి.

కాపరానికి కావాల్సిన సామగ్రి—మంచం, పాత్ర సామగ్రి, కిరోసిన్ స్టవ్వులు గట్రా అన్నీ పరిమితంగా తన శక్తిని బట్టీ కనీసావసరం మేరకి కానీ—కూతుర్ని తీసుకుని వొచ్చాడు నరహరి. అతని భార్య కూడా వొచ్చింది. భార్యా అత్తమామలూ యింట్లో వుంటే సుబ్రహ్మణ్యానికి తృప్తిగా అనిపించింది. కోర్టు కేసులు అర్జంటువి వున్నాయి వీలుపడదని రెండోరోజునే వెళ్ళిపోయాడు అతని మామ వేదాంతం నరహరి.

వారం రోజుల తరవాత—యింట్లో అందరూ దీని తరవాతివాళ్ళే. సరిగా చూసుకోలేరు. నేను లేకపోతే కష్టం—అని వెళ్ళిపోయింది అతని అత్త కూడా.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోతే వొక రకంగా బాగా అనిపించింది సుబ్రహ్మణ్యానికి — భార్యతో వెనకా ముందు చూసుకోకండా యెలా అందే అలా సరసాలాడుకోటానికి వీలుగా వుంటుందని.

రెండు వారాలు గడిచాయి.

శాంతకి వంటా వార్పూ బాగా వొచ్చు. యిల్లు చక్కగా శుభ్రంగా వుంచుతుంది. పక్కా-విడతో కలివిడిగా మెలుగుతుంది. వొద్దికగా చక్కగా వుంటుంది.

వొకరోజు సుబ్రహ్మణ్యం యింటికి తిరిగి వొస్తూండగా, వాళ్ళవీధి మలుపులోకి వొచ్చేసరికి వాళ్ళింట్లోంచి వొకతను బయటికి వొచ్చి అటు వీధిన వెళ్ళటం గమనించాడు. ప్యాంటూ, స్లాకు, పాతికేళ్ళుంటాయేమో అనిపించింది.

యింట్లోకొచ్చేసరికి గదిలో మంచంమీద పడుకుని పత్రిక చదువుకుంటోంది శాంత.

భార్య వొంక పరిశీలనగా చూశాడు. జుట్టు చెరిగి వుంది. చీర నలిగి వుంది.

"యేం చేస్తున్నావు శాంతా?" అన్నాడు

పత్రిక చదువుకుంటున్నా — చూస్తున్నారుగా!" అంది సన్నగానవ్వి.

"తలుపు బార్లా తీసి?"

"మీరొచ్చే వేళ అని. యిప్పుడే కాఫీకి నీళ్ళు స్టవ్‌మీద పెట్టి వొచ్చి — "

"పక్కా-విడొస్తే కాఫీపెట్టి యిచ్చివేమో అనుకున్నా —"

"అదెట్లా అనుకున్నారు? అసలెవరూ రానిదే యింట్లోకి!" అంది.

ఆ వొచ్చి వెళ్ళినతను — గుమ్మంలోకి వొచ్చి చిన్నగా పిలిచాడు. యెవరూ వినిపించుకోలేదు. తలుపులు తీసివుంటే నాలుగు అడుగులు లోనకి వేసి యెలక్ట్రిసిటీ మీటరు చూసి రీడింగ్ నోట్ చేసుకుని చక్కా వెళ్ళిపోయాడు.

ఆతను పిలిచిన ఆ వేళకి, వంట గదిలో స్టౌ వెలిగిస్తున్న శాంతకి ఆతను చిన్నగా పిలవటం అదీ వినిపించలేదు.

సాలోచనగా చూస్తూ, "అలాగా!" అన్నాడు.

వెళ్ళి కాఫీ కలిపి తెచ్చింది.

తాగుతూ భార్య వొంక పరిశీలనగా చూస్తున్నాడు. రేగిన జుట్టు నలిగిన చీర. కందిన చెంప.

మణికట్టు మీద చెక్కిలి ఆనించుకుని పత్రిక చదువుకుంటూ వుండిపోయింది శాంత. అందువల్ల చెక్కిలి కందింది నలిపినట్లుగా.

ఆ రాత్రి భార్యని తాకాలనిపించలేదు సుబ్రహ్మణ్యానికి.

ఆ రెండో రోజు వుదయం "యివాళ్ళ సెలవేసి యింట్లోవుండిస్తాను" అన్నాడు.

"సెలవు యివ్వరేమో" అంది—అదివరకు వొకసారి— సెలవు పెట్టి యింట్లో వుండిపొండి యివాళ—అని ఆమె అంటే, మొదటి వారంలో సెలవు యివ్వరు—అని చెప్పటం గుర్తొచ్చి.

"అవును నాకు సెలవు యిచ్చేదీ లేనిదీ దీనికే తెలుసు. నేను సెలవు పెట్టకండా పైకి వెళ్ళిపోతే—యెంచక్కా యింట్లో వొక్కతీ అప్రియుడితో" అనుకున్నాడు.

వొకసారి సినిమా హాల్లో విరామసమయంలో అతను బయటికివెళ్ళి వొస్తూండగా—భార్య యెవరితోనో మాట్లాడుతోంది. అతనెవరో సీటుకిందకి వొంగి మాట్లాడుతున్నాడు. సాలోచనగా తల పంకించుకున్నాడు సుబ్రహ్మణ్యం.

"నమస్కారమండీ. మేము మీ పక్క వీధిలో వుంటాం మీవారు బ్యాంకులో పనిచేస్తారు. నా బ్యాంకు పనులకు సంబంధించి యెంతో సహకరిస్తూంటారు." అని కృతజ్ఞతగా చూసి, "మా ఆవిణ్ని తీసుకుని వొకసారి మీ యింటికి వొస్తామండీ." అన్నాడు అతను. "అట్లాగే తప్పకరండి సంతోషం." అంది మర్యాద సూచకంగా చిర్నవ్వు ముఖంతో.

యింట్లో చక్కగా ముస్తాబయితే, "యేవిటా సొవిషోకులు" అంటాడు—మనసులో వేదవతి మెదిలి.

ముస్తాబవకండా వుంటే—మనసుకి నచ్చక, "యేవిటలా జిడ్డు మొహం నువ్వూ—కాస్త శుభ్రంగా తయారవలేవూ? చక్కగా కనిపిస్తే మొగుడన్నవాడు సంతోషిస్తాడనీ లేదు—యేం లేదు" అంటాడు. వొకసారి పక్కావిడ, "పిళ్ళొచ్చేసరికి వొచ్చేసెయ్యొచ్చు. చిన్నాటే. మ్యాట్నీకి వెళ్ళొద్దాం" అని బలవంతం చేస్తే వెళ్ళింది.

సుబ్రహ్మణ్యం యింటికి రాగానే, ఆ విషయం చెప్పింది. "సినిమాకే

వెళ్తే యింట్లో అడుగు పెట్టనేలేదో వెంటనే అంతిదిగా యెందుకు చెప్తుంది!" అనుకున్నాడు.

మరసటి రోజు ప్రశ్నతవితో మాటల సందర్భంలో ఆ సినిమా ప్రసక్తి తెచ్చి "బ్యాంకు వుండిపోయింది గానీ లేకపోతే నిన్న మ్యాట్నీకి వెళ్ళాలవిపించింది." అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అహాఁ," అన్నాడు అతను—బస్టాండుకి వెళ్ళి మిత్రుణ్ని రిసీవ్ చేసుకోవాల్సిన తొందరలో.

'యిది ఆమెతో సినిమాకే వెళ్ళంటే—అనేవాడేగా, అవును వీళ్ళిద్దరూ వెళ్ళారుట—ఆఁ!' అనుకున్నాడు సుబ్రహ్మణ్యం.

యెలావున్నా సూటీపోటీ మాటలు తగులుతూండటంతో దిగులుగా వుంటోంది శాంత. కానీ విషయం యేమిటో ఆమెకి అర్థం అవటంలేదు. మళ్ళీ తనంటే చాలా యిష్టంగానూ వుంటాడు, భర్త.

వొకరోజు, "మా యింటినుండి వుత్తరం వొచ్చింది. మా చెల్లెలికి బాగా జబ్బుగా వుందట" అని అంది శాంత.

"వెళ్తావా?" అన్నాడు.

"మీకు కష్టం కదా వెళ్తే—" అంది.

"అవును—వెళితే నాకు కష్టమేగానీ నీకు హాయేగా— ఆ ప్రియుణ్ని కలుసుకోవచ్చు. అసలు తనూ వాడూ ఉత్తరాలు రాసుకుంటున్నారేమో! అన్ని ఉత్తరాలూ పోస్టు చెయ్యమని నాకే యెందుకివ్వదు? కొన్ని కొన్ని, వీధిచివరన పోస్టులో వేసి వొస్తూంటుంది. తను పైకి వెళ్ళిన వేళ చూసి!" అనుకున్నాడు.

భర్త బ్యాంకుకి వెళ్ళాక తీరికగా యెప్పుడన్నా యింటికి వుత్తరం రాస్తే వీధి చివరన వున్న డబ్బాలో పడేసి వొస్తుంది శాంత.

భర్తని చూసి భయంగా అనిపించి ముభావంగా వుంటే, "అంత యిష్టం లేకపోతే యిక్కడ దేనికి నచ్చినవాళ్ళతోనే వుండొచ్చుగా!" అంటాడు.

"మాటలకి అర్థాలు తీస్తే చాలావొస్తయ్. యేమంటున్నారో నాకు అర్థం కావటం లేదు" అంది వొకసారి.

"కాదూ—నీకిక్కడ బాగుండకపోతే కొన్నాళ్ళు మీ కన్నారింటి కెళ్ళి వుండొచ్చుగా—అని. వెనకటి నుండీ నచ్చిన వాళ్ళుగా!" అన్నాడు.

శాంత, చీర మార్చుకోబోతూ, "కాస్త గదిలోకి వెళ్ళండి. చీర కట్టుకోవాలి" అంటే, "నేనుంటే చీర కట్టుకోటానికేం. పావడా వుందిగా!" అంటాడు.

అలా అని అతను వుండగానే చీర మార్చుకుంటూంటే, "మరీఅంత సానివేషాలేఁవిఁటి— యెదురుగా విప్పి కట్టుకోకపోతే— చెప్తే ఆ గదిలోకి వెళ్తాగా" అంటాడు లోలోన యెక్కడో తెలియకుండా వేదవతి మెదిలి.

రాత్రుళ్ళు—నిద్రపోకుండా మధనపడుతుంటాడు.

ఇలా జరుగుతూండగా—

వాళ్ళ డేూజంటు లీవులో వెడితే నెల రోజులు లీవు వేకేన్సీలో చెయ్యటానికి వొక కుర్ర ఆఫీసరొచ్చాడు.

అతనిది నెల్లూరు. నరహరి వాళ్ళు తెలుసు. మాటల సందర్భంలో సుబ్రహ్మణ్యం అత్తవారి వూరు నెల్లూరని తెలిసి వివరాలు అడిగితే, "లాయరు వేదాంతం నరహరిగారు మా మామగారు." అని అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అట్లాగా! ఆయన చాలా యోగ్యుడు. ఆయన భార్య పిల్లలు అంతా యెంతో మంచివాళ్ళు. చక్కగా వొద్దికగా వుంటారు. ఆతల్లిదండ్రుల పెంపకమే వేరు. పిల్లలంతా యెంతో పద్ధతిగా సాంప్రదాయకంగా వుంటారు. కాకపోతే రెండో కూతురే వాళ్ళ పరువు తీసింది" అన్నాడు

శాంత రెండో కూతురనీ, పెద్దకూతురు గూడూరులో వోహైస్కూలు హెడ్మాష్టరు భార్య అనీ తెలిసిన సుబ్రహ్మణ్యం అయోమయంగా, బిక్కమొహం వేసుకుని చూస్తున్నాడు.

"కావాలని మంగళగిరి ప్రాంతం అతను వొకడు చేసుకున్నాడు. ఆ పిల్ల పేరు తార అనుకుంటాను. మొదటి నుండీ ఆ తీరే వేరు. చుక్కల్లో చూస్తున్నట్లుగా వుండేది. ఐతే చూడగానే గొప్ప ఫిలింస్టార్‌లాగా అనిపించేదనుకో" అన్నాడు.

విషయం గ్రహించి, "ఆఁ ఆఁ అవును. అదేదో ఆ పిల్ల తప్పపుట్టింది" అన్నాడు సుబ్రహ్మణ్యం.

ఆ తరవాత రెండు వారాలకి ఆ ఆఫీసరు వెళ్ళిపోయాడు.

"యేమీ లేకపోతే యెందుకు దాచిపెడతారు? యేదోవుంది— బ రుటికి

పతివ్రతలేగా!" అనుకున్నాడు.

ఆ తరవాత వొకసారి అడిగాడు. "నువ్వు మీవాళ్ళకి రెండో కూతురివి కదూ— మీ అక్కయ్య—" అని.

"అవును. మాఅక్కయ్యని గూడూరుయిచ్చారు. ఆయన హైస్కూలు హెడ్మాస్టరుగా చేస్తున్నారు" అంది.

'పెళ్ళయ్యి కాపరానికెళ్ళి భర్తపరువు పోయేలాగా ప్రవర్తిస్తున్నయింకో అక్క వుండీ-యెలా అంటుందో చూడు! అవునట! నంగనాచిలాగా. నెల్లూరి నెరజాణలన్నారు అందుకే' అనుకున్నాడు.

మనసులో యేదో అనుకుని వూరుకోడు. ములుకుల్లా గుచ్చుకునే సూటీపోటీ మాటలుగా బయటపడుతుంది, ఆ లోపలి యాతన.

చాలాసార్లు వొంటరిగా కూర్చుని యేడుస్తుంది కాంత.

వొకసారి రాత్రిపూట, కాంత చప్పుడపకండా యేడవటం గమనించి "యెందుకా యేడుపు? అక్కడికి నేను విన్నేదో హింసించుకు తింటున్నట్లు" అన్నాడు.

వొకరాత్రి తనకి మెలుకువ వొచ్చి చూస్తే అతను మంచం మీద లేడు. చప్పుడవకండా వంట గదిలో చూసింది. లేడు. వెనక తలుపు వేసి వుంది. ముందుగది గుమ్మం తెరపక్కనుంచి గమనించింది. ముందు గదిలో కుర్చీలో కూర్చుని మోకాళ్ళ మీద తల పెట్టుకుని వున్నాడు.

అలా గమనిస్తూవుండిపోయింది.

ఐదు నిమిషాలు.

తల పైకెత్తాడు.

కిటికీలోంచి లోనకి పడుతున్న వీధి దీపపుకాంతిలో—అతనికళ్ళలో తడి!

చప్పుడవకండా వొచ్చి పడుకుంది. అతను బాగా చిక్కిపోయాడు యీమధ్య —తనలాగానే.

మరో అరగంటకి అతను వొచ్చి మంచంమీద పడుకున్నాడు. ఆమె భుజం మీద చెయ్యేసి అంతలోనే తీసేసి, మంచం అంచుమీదకి జరిగి అటు తిరిగి పడుకున్నాడు. యేమీ గమనించనట్లు వుండిపోయింది.

అతను ఆమెని తాకి చాలా కాలమైంది.

యెప్పుడో అర్ధరాత్రి మెలుకువొచ్చి, ఆ మగతలో కాంతని దగ్గిరికి

లాక్కుని ఆరాటంగా నానా యిదీ చేసి, అలిసిపోయి నిద్రలోకి జారిపోతాడు. పుదయం, ఆదేదీ జరగనట్లుగా వుండిపోతాడు.

మొత్తానికి యెందుకో బాధపడుతున్నాడని గ్రహించింది. తనని సూటీ పోటీ మాటలతో హింసిస్తూవుంటాడు. శీలానికి సంబంధించిన మాటలుకూడా. మళ్ళీ చాలా యిష్టంగానూ వుంటాడు.

వొకసారి అంది,—"మీరెట్లాగో వుంటున్నారు అదోలాగా!" అని.

"యెలావున్నాను! బాగానే వున్నానే నా నుదుటి రాతలాగా! అన్నాడు

ఆమె దిగులుగా కనిపిస్తే, "యేం పాపం మనసు బాగుండలేదా? అవును యీ యింట్లో నీ మనసెలా బావుంటుందిలే!" అన్నాడు.

దిగులంతా దిగమింగుకుని వుత్సాహంగా వుంటే—"యేం చూసుకుని అంత సంతోషం—నలుగురు మొగుళ్ళుండి వాళ్ళందరితోటి అనుభవాన్ని తలుచుకుని పరవశించిపోయినట్లుగా!" అంటాడు—"వూరినుంచి వాడి వుత్తరం వొచ్చి వుండాలి యీ రోజు—లేక, వీడెవడో మధ్యాహ్నం లోపలికి వస్తే మజాగా ...."అనుకుని.

యీ డిశంబరు ఆఖరి వారంలో వుత్తరం వొచ్చింది, సుబ్రహ్మణ్యానికి మామ దగ్గిర్నుంచి- "సంక్రాంతి పండక్కి రావాలి. తప్పక. వీలయితే అమ్మాయిని ఫస్టుకే పంపించు——" అని.

"అవును ముందుగా వెళ్తే దీనికి తనశృంగార లీలలు విశృంఖలంగా తీర్చుకోడానికి వీలుగా వుంటుంది—" అనుకున్నాడు సుబ్రహ్మణ్యం.

రోజులు యిలా గడుస్తున్నాయి.

## 72

రామ్మూర్తి రెండు గంటల నుంచి దీర్ఘంగా తన ఫైనల్ డ్రాఫ్ట్ పేజీలు చూసుకుంటూ—అలసటగా అనిపించి కాగితాలు భద్రంగా బల్ల మీద పెడుతూ—

"—యిది ముగిస్తే బౌండు చేయించి ఆఫీసులో యిచ్చి ఆ తరవాత గైడ్‌కి హారతిపట్టి -హారతి -హా -రతి -ఆ -రతి అరతి యే రతి యీ రతి —రతి ఘాటుగా సువాసన -హాస్పటలు వాసనలాగా హాస్టళ్ళ

స్వరతి వాసన -వాసన స్తన.... స్తన పూర్ణ- అన్నపూర్ణ.... అన్న స్తన పూర్ణ స్తన తార .... పూర్ణ తార పూర్ణ స్తనపూర్ణ.... అన్నపూర్ణ....అన్నమక్కరలేదు ఆ పాఁకదవ లివ్వు.... స్తన పూర్ణ తార పూర్ణ స్తనతార పూర్ణతార....తార కనిపించి యెంతకాలమైందో....యిప్పుడెక్కడున్నారో....ఆ యింట్లో లేరు....యిల్లు కట్టుకున్నారేమో యెక్కడైనా- యెంయే పూర్తి చెయ్యిధూ—దేనికి చేపేం చేస్తుంది ...చేస్తే చేస్తూంటే -కనిపిస్తూంటే....కనిపించకండా కనిపించవంత దూరంగా....చదువై పోయిందిగా నేనే యీ మహానగరం బయట దూరంగా పెడగా....వొంటిగది కుటీరం పూదోట వంటరి నివాస్వహవాసం. కష్టమైనా నిజానికి రావాలనీ....కోరుకుంటూ గుండెల ఆగుండెలగుబ్బలలో లోతుల పూల పాన్పుల ఆర్తిగా ఆరాధనగా సదా నిలుపుకోవాలనీ—నిత్యం మళ్ళీ మళ్ళీ యింకాయింకా అలా గిలాగిలా గలాగిలాగ లాగు లాగి....జారి పోతోంది వెధవది. నడుం వొదులైంది- ప్యాంటు, కుంగడానికి బదులు సాగిందా కాట్సూల్ లాగా....లేక నడుం సన్నబడిందా ...నడుం సన్నని నాగలోకపు నాగినీ వూగనీ తాగనీ తారనీ లాగనీ సాగనీ...."

"హలో రామ్మూర్తీ పెన్నుందా?"

"లేదు" అన్నాడు రామ్మూర్తి.

"పెన్ను లేకండా పర్కెట్లా చేస్తున్నావ్?"

"వూఁ, ఆఁ, పెన్నా—"

"పెన్నాకాదు తుంగభద్రా కాదు. పెన్. ఫౌంటెన్ పెన్ ఆర్ బాల్ పెన్."

"యిదుగో తీసుకో—"

ఆ వొచ్చినతను పెన్ను తీసుకువెళ్ళాడు—వొక గంట తరవాత యిస్తానంటూ.

రామ్మూర్తి ప్యాంటు బిగించుకున్నాడు. శ్రీపతి గదికి వెళ్ళాడు. రెండు దినపత్రికలు, వొక పక్షపత్రిక. తెరిచివుంచిన రెండు పుస్తకాలు. పక్షపత్రికలో మైపాడ్ కేసులో కాంట్రాక్టరుకీ సబిన్స్పెక్టర్‌కీ శిక్ష పడిందంటూ, ఆ యిద్దరు అక్కా చెల్లెళ్ళ వివరాలు.

వున్నవాళ్ళ చక్కని కూతుళ్ళు విలాసంగా సముద్రతీరానికి విహార యాత్రకి వెడితే—యెందుకు వాళ్ళు పాల్పడినట్టు—యేదైనా కక్షవల్లనా

వాళ్ళు కొప్పివంపునా—ఆ వివరాలేం లేవు సరిగా అనుకున్నాడు శ్రీపతి చదివి.

"యేమిటి సంగతులు క్రిష్ణ దేవదాసు సినిమాకొస్తావా?" అన్నాడు రామ్మూర్తి.

"దేశమే వో సినిమాలా వుంది. ప్రణయాలు కలహాలు అపోహలు అపార్థాలు, వ్యభిచారాలు, చెరచటాలు, దొంగతనాలు దోపిడీలు లాంటి సామ్యూలు విషయాలు కాక దేశం—దేశమాత అని వుపమించేట్లయితే. దాని కొంగుకి నిప్పంటుకుందనే చెప్పాలి. యింకా—కిందికి దక్షిణాదికి పాకలేదు గానీ అటు వుత్తరాన తెప్పలిరకాళ్ళగా వుంది యిందిరమ్మ పని. జే. పీ. వూపి పారేస్తున్నాడు బీహార్ బీహారంతా కదిలింది. వుత్తర్ ప్రదేశ్, గుజరాత్, రాజస్తాన్—బెంగాల్ యిందిరమ్మది కాదనుకో—బెంగాల్ బెంగాలీ వాళ్ళదే—తమిళనాడు తమిళనాడు వాళ్ళది లాగా—ప్రజా జీవితం స్తంభించి పోతోంది.

ప్రభుత్వ యంత్రాంగం సాఫీగా పని కొనసాగించటం సాధ్యం కాక పోవచ్చు—"

రామ్మూర్తి బాదుకున్నాడు అతని మూడ్‌కి రుచించక.

—నాలుగైదు నెలలుగా వేడి తగ్గకుండా కొనసాగుతూ మరింత వుధృతం అవుతోందంటే తక్కువగా అంచనా వెయ్యరాదు—

ప్రత్యేకం అనుకోకుండా బయల్దేరి బస్టాపుకి వొచ్చాడు శ్రీపతి. బస్సెక్కాడు.

....రైళ్ళు సరిగా నడవటం లేదు. ఫ్యాక్టరీలు సరిగా పని చెయ్యటం లేదు....

బస్సు దిగి నడుస్తూ—

చోర్ చోర్ — లీనా చందావార్కర్ సినిమా చూశాడు. నడుస్తున్నాడు రోడ్డెంట—

— పాలకులూ స్వార్థానికే పాలిస్తున్నారు. ప్రతిఘటిస్తున్న వాళ్ళూ స్వార్థానికే ప్రతిఘటిస్తున్నారు. లేకపోతే దేశం యింతకాలంగా పాతికేళ్ళొచ్చీ బుద్ధిలేకుండా....

బదాయి—లీనీ చందావార్కర్ సినిమా చూశాడు. వొంటిగంట.

నడుస్తున్నాడు సి.సి నుంచి యూనివర్సిటీ వైపుకి. నడుస్తూ....

....అరగంట ఐంది గడిచిన సంవత్సరం గడిచి- కళ్ళల్లో వెర్రి కేక వేస్తూ.... రాజకీయ కుష్టువ్యాధి కంటే.... సుఖ రోగం -రోగ భోగ భోగ రోగ రాజకీయ సుఖసంభోగ -- రోగ దారిద్ర్య భోగ పాతికేళ్ళ స్వప్న భారం....

## 73

పెళ్ళయ్యాక మొదటి పండుగ, సంక్రాంతి. రవికి గంగికి పండుగ మూడు రోజులూ వాళ్ళ యింట్లోనే వుంటామన్నారు, [illegible], పోలమ్మ, [illegible].

ఉదయం వెళ్ళి రాత్రి వరకూ అక్కడే వుండి రాత్రికి వొస్తున్నారు, రవీ గంగీ-- అక్కడ యిల్లు యిరుకు అని.

పాకలోకి వొచ్చి, రవిని నాలికతో వెక్కిరించింది, గంగి.

“నానోనే యెక్కువ యెర్రగ పండింది” అంది, తాంబూలం నములుతూ.

“అవును మరి నువ్వు యెరుపు కదా!” అన్నాడు.

“యిప్పటికైన నీకు చూపు వొచ్చినట్లున్నదే!” అని నవ్వింది.

“ఏమన్నావ్!” అని జబ్బ పట్టుకొని నొక్కబోయాడు రవి. రెండో చెయ్యి అతని వీపు చుట్టూ తిప్పి సందం క్రిందకి లాగింది బలంగా. వొరిగి పడ్డాడు పరుపు మీదకి. అతని మీదకి పడినట్లు తనూ వొరిగింది.

అతని పెదాలు ముద్దెట్టుకుంటోంది.

ఆమెలో కోర్కె పురివిప్పితే నెమలి నాట్యంలా కాక, శివతాండవంలా వుంటుంది.

కోణార్క దేవాలయంలోని శిల్పం అమాంతం వూపిరి పోసుకొని హిమగిరి మీది కెగిరి శివతాండవం ప్రారంభించినట్లుగ వుంటుంది.

రవికి....కన్యాకుమారి దగ్గర సముద్ర తరంగం ఆ యెత్తుకి లేచి సమస్తాన్నీ ముంచెత్తినట్లుగా అనిపిస్తుంది.

“రోజూనా?” అన్నాడు.

“యేడ? నిన్న మొన్ననేగా! నువ్వు యింట్లో వుంటెనా అసలు మంది పనులకే టైం చాలదు నీకు...జరంత మిగిల్తె పుస్తకాలు. నేను నీకు

గుర్తేరాను నువ్వుగూడ నీకు గుర్తురావు." అని ప్రేమగా ఆప్యాయంగా అతని నుదుటిమీద పెదాలు అద్దింది నుతారంగా.

గంగి వంక తృప్తిగా చూసి కనురెప్పలు వాల్చాడు. భుక్తాయాసం. నిద్రగా వుంది రవికి.

అతని వీపు చుట్టూ చెయ్యేసి దగ్గిరికి లాక్కుంటోంది.

"యివ్వాళ కూడానా?" అన్నాడు.

"నీకు అస్సలు ఆసక్తే లేదేమి?" అని మరింత దగ్గిరికి లాక్కుంది.

"అలిసిపోయాను."

"అవ్ పగలంత ఫ్యాక్టరీల పనిచేసెనొ స్త్రీవి కాదు!"

రోజంతా తిరిగ్గా రాములు వాళ్ళింట్లో కబుర్లు చెప్పుకుంటూ గడిపారు కులాసాగా.

"యింత రంథేం నీకు?"

"పెండ్లి దేనికి?" అంది.

"కేవలం యిందుకేనా?"

"కేవలం యిందుక్కు కాదుగాని, యిందుక్కు కాకుంటె లోకంల యెన్ని పెండ్లిండ్లవుతవో ఆలోచన చెయ్యి."

"వూఁ...." అని విసుక్కుని ఆమె మీదకి జరిగాడు.

ఆ మరసటి రోజూ, పండగ మూడో రోజూ.

రాత్రి యింటికొచ్చాక పక్కమీద రవిని ముద్దెట్టుకుంటోంది. ముద్దుతో ఆగదని రవికి తెలుసు.

"నువ్వు కామ పిశాచానివి." అన్నాడు.

"దినంకి వొకపాలి....లేకుంటె రెండు దినాల కొకపాలి అంతెగదా! వయసులో వున్నోళ్ళు....అంద రైతె దినాన్కి...."

"ఛీ వాగకు" అన్నాడు అసహ్యించుకుంటున్నట్లుగా.

"యేం, అట్ల అసయ్యించుకుంటవ్? యిదేం తప్పుపనా!" అంది.

"చిత్తకార్తి కుక్కల్లా...."

"ధూత్" అని యీసడించుకుంది.

చెయ్యెత్తాడు కొట్టటానికి. అంతలోనే యేదో మహోధృతమైన మహాబలమైన అల వువ్వెత్తున లేచి తనని ముంచెత్తినట్లుగా తగ్గిపోయాడు.

యిలా కొనసాగుతోంది వాళ్ళ వైవాహిక జీవితం. వొకొక్కసారి

ఆమె మనసు రవి మీదనుంచి లోకం మీదకి ప్రసరిస్తుంది. లోకం అంటే—లోకం....లోకంలో మనుషులు-డబ్బు-కార్లు-సౌధాలు-సౌఖ్యాలు.

రెండు రోజుల కొకసారైనా రవితో తృప్తిగా గడిచినప్పుడు—రవే సమస్త లోకంలాగ ఆ పాకే మహా సౌధంలాగ, ఆ గట్టి పరుపు సత్తుపాత్రలు సౌఖ్యాలుగ అనిపించి సంతోషంతో పొంగిపోతుంది గంగి.

రవిని తలుచుకుంటూ, ప్రకృతిలా త్రిగుణాత్మకంగా ప్రేమగా ఆప్యాయంగా దాహంగా అలలు అలలుగా యెగిసి పడుతూ అతనిలో అతనితో దహించుకుపోవాలని గంగి, గంగలా పొంగులెత్తి ప్రవహించాలని పరితపించిపోతూంటుంది—గంగి.

# 74

తార, యెర్ర పడవ కారు నడుపుతోంది. ఆమె ప్రక్కన సూర్యప్రకాశ్.

కారు నడిపేతనం పుటకలోనేవున్నట్లుగా, వొక్క రోజులో డ్రైవింగ్ నేర్చి, యెంతో నేర్పుగా యెంతో వేగంగా—మళ్ళీ యెంతో సేఫ్‌గా డ్రైవ్ చెయ్యగలిగింది.

ఆ కారు ఆమె సొంతానికి వుండిపోయింది. ఆ కారు, తన తొలి కారుగా తన సొంత కారుగా ఫీలవుతుంది. సూర్యప్రకాశ్ ఆ కారు సాధారణంగా పట్టుకోడు. యింకా నాలుగు కార్లు వున్నాయి—వ్యాపార సంబంధంగా కొన్ని వ్యానులు జీపులు కాక.

ఆ కారులో షికార్లు తిరుగుతుంది. హైవే మీగ నూటయాభయ్ కిలోమీటర్ల వేగంతో పోతూండటం ఆమెకి సరదా. బజారు, షాపింగు. కానీ—షాపింగ్‌కి—మార్కెట్లో యేమున్నాయని కొంటుంది!

రెండు మూడుసార్లు యిద్దరూ కలిసి బొంబాయి ఢిల్లీ కలకత్తా వెళ్ళొచ్చారు. చాలా ఖరీదైన వస్తువులు—వేలూ లక్షలూ ఖరీదువి కొంది.

కానీ—

ఆమెని సూర్యప్రకాశ్ యెప్పుడూ వొక కంట కనిపెడుతూ వుంటాడని రెండు మూడు వారాల్లోనే గమనించింది.

ఒకసారి సరే—కారు డ్రైవింగ్ నేర్చుకున్న కొత్తలో ఒక్కతే సాయంత్రం వేళ అలా కారు నడుపుకుంటూ వెళ్ళింది. రియర్ వ్యూ అద్దంలో ఒక కారు అదే వేగంలో రావటం గమనించింది. అది వాళ్ళ కార్లల్లో ఒక కారు. గమనించి పరికించేం ముందుకు వెళ్ళి కారు ఆపి రోడ్డు పక్కన వున్న చెట్ల మరుగులోకి వెళ్ళింది. తన వెనక వొస్తున్న కారు బాగా వేగంగా ముందుకు వెళ్ళిపోయింది. గుర్తించింది కారు నడుపుతున్న వ్యక్తిని—వాళ్ళ డ్రైవర్లలో యెవరూ కాదు. అతని సన్నిహిత వ్యక్తులలో ఒకరు.

ఐదు నిముషాలు ఆగి కారు స్టార్ట్ చేసి ముందుకు సాగింది. నాలుగు ఫర్లాంగుల అవతల ఆ కారు ఆగి వుంది. మనిషి కారులో లేడు. ముందుకు సాగిపోయింది. నాలుగు నిముషాలలో—తన కారు రియర్ వ్యూ అద్దంలోంచి కనిపిస్తున్న ఆ కారు—

అప్పటినుంచి—తన కదలికలను సూర్యప్రకాశ్ యెలా గమనిస్తున్నది గమనించటమే కాక, సూర్యప్రకాశ్ కదలికలు వ్యాపకాలనూ గమనించ సాగింది.

సహోకల్లాపాలప్పుడు తప్ప—యెప్పుడూ అతని పడక గదిలో అత నొక్కడే వుంటాడు. రాత్రంతా తను, తన పడకగదిలో— యింద్రభవనం లాంటి సూర్యమహల్ లోని తన ఖరీదైన అందమైన నడకగదిలో.

చిన్న యిల్లంత వైశాల్యం వుండే అతని గదికి—ఒకవైపు తలుపు తన సెక్రటరీ రోజీ ఆఫీసు గదికి. మరో తలుపు తన ఆఫీసు గదికి. మరో తలుపు బాత్రూంకి.

ఒక రోజున తార కళ్ళకి గంతలు కట్టి "నాతోరా కొన్ని విషయాలు తెలుసుకుందువు" అన్నాడు సూర్యప్రకాశ్.

జబ్బ పట్టుకుని నడిపిస్తున్నాడు. యే గదో యే భాగమో తెలియదు.

లిఫ్ట్ లాంటి దాన్లో కాసేపు కిందకి వెడుతున్నట్లుగా, కాసేపు పైకి వెడుతున్నట్లుగా అనిపించింది.

అంతలోనే మెట్లమీంచి దింపుతున్నాడు

కళ్ళగంతలు విప్పాడు.

వో చక్రాల బంకిలో ఒక స్త్రీ—నలభయ్ ఐదేళ్ళుండవచ్చు. చీర కుచ్చిళ్ళ కిందకి నేలమీన వేళ్ళాడుతున్నాయి. ఒక కాలో రెండు కాళ్ళానో

లేవనిపించింది తారకి, చూడగానే.

"హాయ్ ఆంటీ" అన్నాడు.

"నమస్తే" అంది తార.

"యీ యింటి యిల్లాలివి అని అనటానికి వీలులేని జాతకం. అందు కని తారవి మాత్రమే. నీకేం కావాలో చెప్పు. యీ సూర్యమహల్ కావాలంటే మహల్, యేది కావాలంటే అది తన పేర రాసిస్తా బాబూ— భార్య అన్నట్లుగా—అదో [illegible]. అదో తృప్తి" అంది ఆమె.

అటు వార గోడ దగ్గిరికి తీసుకెళ్ళాడు. అవతలిగా వున్న వొక చిన్న స్టూలు కాలితో జరిపి కూర్చోమన్నాడు. కూర్చుంది.

"ఆ యెదురుగా గోడకి వున్న స్లాట్ లోంచి చూడు" అన్నాడు.

చిన్న గాజు రంధ్రం. వొంటికంటితో మాత్రమే చూడటానికి వీలయ్యే టంత చిన్నది.

చూసింది, వొక కన్ను మూసుకుని తొంగిచూసి—చాలా పెద్ద ఆవరణ, జీపులు, కార్లు, వ్యాన్లు, మనుషులు, చెక్కపెట్టెలు డబ్బాలు యేవేవో వున్నాయి.

అది చూస్తున్నప్పుడు తారకి వొణుకు పుట్టింది.

మళ్ళీ కళ్ళకి గంతలు.

పడకగదిలోకి చేరారు.

"మీరూ—" అని ఆగిపోయింది, తార.

"చాలా పనులు చేస్తాను."

"స్మగ్లింగ్—"

"అదొక్కటే కాదు. చట్ట వ్యతిరేకమైన పన్లో... యీ సంగతులు నీకేకాదు, వీటిని నా ఆజ్ఞలు, సూచనలు, సలహాల ననుసరించి స్వయంగా చేసిపెడుతున్న వాళ్ళున్నారు. వాళ్ళలో యెవరైనా సరే కొంచెం నోరు జారినా, మరుక్షణం యీ లోకంలో వుండరు. నేనిప్పుడు యిక్కడ కూర్చునివున్నాను నీతో మాట్లాడుతూ. కానీ నాకు సంబంధించినంతవరకు యెక్కడ యేం జరుగుతున్నదీ తెలుసు. యెట్లా తెలుసునంటావా? అతీంద్రియ మంత్రతంత్ర శక్తులేంకాదు. అసాధారణ వైజ్ఞానిక సాధనాలతో. అవి మాత్రం నావరకే పరిమితం. యీ నానా కష్టాలు నీకక్కరలేదు. జల్సాగా హాయిగా సుఖంగా విలాసంగా గడిపేసెయ్యి" అన్నాడు.

యీ మధ్యకాలంలో మరికొన్ని తెలుసుకుంది. తనకి ముందు—వొకరి తరవాత వొకరు యిద్దరు స్త్రీలతో అతనికి కాస్త దగ్గరి సంబంధం వుండేదనీ, ఐతే యెవరికీ యింత ఆధిక్యత యివ్వలేదనీ, వాళ్ళిప్పుడు యెక్కడ వుంటున్నదీ తెలుసుకోలేక పోయింది. స్త్రీ లోలత్వం లేదు. దేని కదే. షోగ్గా వుండే సెక్రటరీ రోజీ, సెక్రటరీ మాత్రమే.

తార మంచం మీద వుంది.

అతను సోఫాలో వున్నాడు.

తార కళ్ళలోకి చూస్తూ, "తారా" అన్నాడు. అతని కళ్ళలో కోర్కె.

లేచి మంచం దగ్గిరికివొచ్చాడు. ఆ స్తనాలు, పొట్ట, బొడ్డు—చూసి నిగ్రహించుకోలేక కంపించిపోతాడు.

అతను చీర కుచ్చిళ్ళు లాగకముందే, బ్లౌజు హుక్లు తప్పించక ముందే—తార తన వలువలు వొక్కొక్కటే వొలుస్తూ వుంటుంది. వొకటి వొలిచి సోఫామీదకి, మరొకటి కార్పెట్ మీదకి, మరొకటి పైకి, మరొకటి అతని ముఖం మీదకి విసురుతుంది.

తన స్తనాలనూ పొట్టా బొడ్డూ పొత్తికడుపూ చూస్తూనే రెచ్చిపోయే అతనిని—తార, రకరకాల కవ్వింపు పనులతో పెదాలతో కళ్ళతో స్తనాలతో జబ్బలతో పొట్టతో బొడ్డుతో పొత్తికడుపుతో తొడలతో— విడివిడిగానూ సమిష్టిగానూ వెకిలి కదలికలతో రెచ్చగొట్టి వెర్రెత్తించి — అతని కిందా అతని మీదా పడి పిచ్చెక్కిస్తుంది.

కానీ ఆమె నిద్రాణ ప్రాణి. యేనాడో కాలేజీలో చదివే రోజుల్లో తన పంచరంగుల కన్నెకలల భావనలు—నాడు పెళ్ళిచూపుల నాటితో అంతరించిపోయి—యింద్రారెడ్డితో కారులో షికారు తిరుగుతూ, గదిలో అతని కళ్ళలోకి చూస్తూ—అతని కళ్ళలో కనిపించిన ఆరాధన చూసినప్పుడు తిరిగి అస్పష్టంగా మెదిలినట్లనిపించిన ఆ సంస్పందన భావనలు— సూర్యప్రకాశ్ తన మెడ నరంలో సూది గుచ్చి తనచేత నవ్వించిన క్షణాన శాశ్వతంగా అంతరించాయి.

అప్పటికి వరసగా పదిమంది విటులు వొచ్చి వెళ్ళాక బాధగ హింసగా వొళ్ళూ మనసు హింసపడుతూండగా, పదకొండో విటుడు వొస్తే—తన దాహంతీర్చమని ప్రాధేయపడుతున్నట్లుగా అతనిని నవ్వించి కవ్వించి రెచ్చగొట్టే వెకిలిచేష్టలన్నీ చేసే వేళ్ళలో ఆ క్షణాన ఆ కోర్కె

యెంత వుంటుందో ; తారలో యే క్షణంలోనైనా అంతే కోర్కె వుంటుంది. తనలో యెంతా లేసి ఆ కోర్కెని కొన్నివేల రెట్లలో సహజ నేర్పుతో ప్రవర్తింపటం నేర్చుకుంది.

తారని చూడగానే—కొందరికిమల్లే సూర్యప్రకాశ్‌కి వాళ్ళు వుద్రేకంతో బిగుసుకుపోతుంది. ఆమెని చూడగానే అతనికి మనసవదు; శరీరమవుతుంది. అలా అమాంతం వున్నపళంగా చేతుల్తో పళ్ళతో నిగించి వొత్తి గిచ్చి గుచ్చి వొంగు చల్లార్చుకోవాలనిపిస్తుంది. పశుకామం. పశుకామం అంటే ఫీలింగ్స్‌లేని సెక్సొత్తిడి. గేదె యెదయి—మీదకొచ్చిన దున్నపోతు కిర్రెక్కి—ఆ వొత్తిడి తక్షణం తీరిపోవాలి. ఆ వొత్తిడి గురించి అంతకు ముందుగానీ ఆ తరవాతగానీ యేమీ వుండదు. మనోవ్యాప్తి లేని శారీరకపు అవసరం. వొత్తిడిలోంచి, రాపిడిలోంచి, మాంస ఖండాలను పిండించి వొంగు చల్లార్చుకోవటం.

# 75

హాస్టల్ హాల్లో—

"షేక్ అబ్దుల్లాని కాశ్మీర్‌కి ముఖ్యమంత్రిని అవనిచ్చిందంటే — దేశానికి, ఇందిరమ్మ ముప్పు తెస్తున్నదనటానికి దాఖలా. వాడు, పశ్చిమ తూర్పు పాకిస్థాన్‌లకి తోడు కాశ్మీర్‌ని కొత్త పాకిస్తాన్‌గా చెయ్యాలని చూస్తున్నాడు. ముఖ్యమంత్రి కాదట, ప్రధానమంత్రి అట. ప్రధాని పదవి దేశానికా, రాష్ట్రానికా? కాశ్మీర్ దేశంలోని రాష్ట్రాలలో ఒక రాష్ట్రం కావన్నమాట—" అని దయానంద భారతి హిందీలో చెప్పుకుపోతున్నాడు. కుర్చీలో కూచుని. అతని బొర్ర ముందున్న బల్లకి ఆనుతోంది.

మధ్యలో అందుకుని, "తూర్పు పాకిస్థాన్‌ని యెంత చాకచక్యంగా యెగరగొట్టిందో మర్చిపోయావా!" అన్నాడు వొకతను.

"దేశంలో అన్ని చోట్లా నక్సలైట్లని కూడా అరెస్టు చేయిస్తోంది విచారణ లేకుండా. మొన్న కలకత్తాలో చంపించేసింది" అన్నాడు వొకతను.

"వాళ్ళని చెయ్యాల్సిందే—గూండాగాళ్ళు దొమ్మీగాళ్ళు హంతకులు. కానీ ప్రజాస్వామికంగా శాంతియుతంగా నిరసన తెలియజేస్తున్న వాళ్ళని

. మీసాకింద అరెస్టు చేయిస్తోంటే—"

"మీసా కింద స్మగ్లర్ల సందర్భీ అరెస్టు చేయించిపారేస్తోంది."

"అదంతా నాటకం. అరెస్టయిన వెంటనే బెయిల్ మీద విడుదలై వోబెరాయ్ రివాల్వింగ్ స్విమ్మింగ్‌పూల్‌లో జలకాలాడుతుంటారు— అర డజన మంది దసమొల లంజల్ని పక్కనేసుకుని, జయప్రకాష్‌జీని బెదిరిస్తోంది, అరెస్టు చేస్తానని. చెయ్యనీ, తెలిసొస్తుంది. ప్రజావాహిని వువ్వెత్తున లేచి మీద విరుచుకుపడకపోతే చూడండి. నేను మొన్ననే వొచ్చాను అటు బీహార్, యు. పీ. ప్రాంతాలు తిరిగి పరిశీలించి—"

"దయానంద్ నిన్ను డి హాస్టల్‌కి అర్జంటుగా రమ్మంటున్నారు. వెళ్ళు" అన్నాడు వేదపారాయణ హిందీలో, మెట్లక్కుది నుంచి దిగుతూ.

దయానందభారతి చటుక్కున వెళ్ళిపోయాడు, బయటికి.

అసలు కారణం— వో గదిలోంచి బయటికొచ్చి కారిడార్‌లో నడిచి వొస్తున్నాడు వెంకటేష్. వాళ్ళిద్దరూ, ప్రస్తుతం ముఖాముఖీ యెదురుపడటం అంత మంచిది కాదని.

వెంకటేష్ వొచ్చాడు.

కింది మెట్టుమీద నుంచుని వున్న వేదపారాయణ, "గుడ్ యీవెనింగ్ దోస్త్" అని మెట్లెక్కి వెళ్ళిపోయాడు.

వెంకటేష్ మౌనంగా తల వూపి, బయటికి వెళ్ళిపోబోతూ, ఆగి బల్ల దగ్గిర నుంచుని పత్రికలు తిరగేస్తున్నాడు.

"హలో వెంకటేష్ పత్రికలో శ్రద్ధగా చూస్తున్నావు యేంది?" అంటూ వొచ్చాడు, నిరంజనరావు.

"పొరపాటున యేదైనా వొక చిన్న నిజం కనిపిస్తుందేమోనని వెతుకుతున్నాను." అని యింగ్లీషులో అని గట్టిగా నవ్వాడు వెంకటేష్.

"చాలావరకు జరిగిన విషయాలే రాస్తారుగా!" అన్నాడు. కొత్తగా చేరిన వొకతను. అతను యూత్ కాంగ్రెస్.

"యీ పెట్టుబడిదారీ పత్రికలు వాస్తవాలు రాస్తయ్యా? అసంభవం. యెదురుకాల్పులలో మృతిచెందారని నిరపరాధుల్ని—యేదో మారుమూల పల్లెలో పనిచేస్తున్న ప్రైమరీ స్కూల్ టీచర్‌నో గుమాస్తానో పోలీసు స్టేషన్‌కి పట్టికెళ్ళి—వాణ్ణి చంపి—వీళ్ళదగ్గిర స్టాకున్న నాటు తుపాకుల్లోంచి వొక తుపాకీ, వీళ్ళు స్టోర్‌చేసి వుంచిన ప్రజాపోరాట సాహిత్యంలోంచి

కొన్ని పుస్తకాలు తీసిచూపెడతారు— యితరేతర కారణాలవల్ల. ఆ సంగతి పత్రికలకి తెలియదూ? తెలుసు. నిజంగా తెలియకపోనే వాళ్ళు అనర్హులు, చెప్పింది రాయటం కాదు పత్రికలంటే. నిజం శోధించి రాయాలి—"అన్నాడు యింగ్లీషులో.

"నార్త్‌లో వుద్యమం మొదలైందిగా—అది నెగ్గితే పరిస్థితి మారి పోతుంది."

"నెగ్గితే యేం మారుతుంది? వొక దోపిడి జట్టు పోయి యింకో దోపిడి జట్టు అనుకోవాలి. యీ రకం వుద్యమాలు అర్థరహితం—" అని యింకేదో అంటుండగా—

"హలో కామ్రేడ్ యీ చక్కని ఫిబ్రవరి సాయంత్రాన్ని వేడెక్కిం చేస్తున్నావు!" అని తెలుగులో అంటూ వొచ్చాడు శ్రీపతి.

"యేమ్ చేసేది యీ యిందిరమ్మ తల్లి పుణ్యమా అని!" అన్నాడు వెంకటేష్.

"మీ విరసం చీలిపోయిందిటగా!"

"లే. రియాక్షనరీ క్రూక్ బయటకు పోయిర్రు."

"బయటికి వెళ్ళిన వాళ్ళది యేం విరసం? గిరసంవా?" విన్న వొక కవి మిత్రుడు— కేవలం వుభయకవి మిత్రుడే కాదు. సర్వ కవి మిత్రుడు, వివరిస్తున్నాడు—విరసం అంటే విరిచే రచయితలట. అరసంఅంటే అరిచే రచయితలట. వూరికే సరదాకి అంటున్నాను సుమా." అన్నాడు శ్రీపతి.

"నేను కరసంఅని పెట్టదలిచాను. అంటే కరిచే రచయితల సంఘం" అని అన్నాడు వొకతను.

"కరిచే సామర్థ్యం వున్నవాడు రచయిత అవడు. యేమీ చాతగాక రాయటానికి దిగుతాడు మనిషి. మహా అయితే నేను చేసి యీడవలేను. యిలా చెయ్యొచ్చు చెయ్యండి—అని. మన రామ్మూర్తిగానీ యిప్పుడిక్క డుంటే—చరసం అని స్థాపిస్తాను—అంటే చవటరచయితల సంఘం అని. ఐతే యిది విశ్వవిద్యాలయాలకే పరిమితం. యెందుకంటే అది దాని సహజ లక్షణం—అని వుండును." అని చిన్నగా నవ్వాడు శ్రీపతి.

"రామ్మూర్తి యెక్కడ కనిపిస్తలేడు?"

"నీకు తెలియదా? థీసిస్ సబ్‌మిట్ చేసి వెళ్ళిపోయాడు. వుద్యోగం వేటలో వున్నాడు—సోషల్ వెల్‌ఫేర్ సెల్‌లో యేదో వో టెంపొరరీ

ఖాళీ వుందని తెలిసింది. దానికోసం ప్రయత్నిస్తున్నాడు. అంతలో వూరినుంచి వుత్తరం వొస్తే బందరెళ్ళాడు. యీ బందరు కుర్రాడికేదో పెళ్ళి బందోబస్తు చేస్తున్నట్లున్నాడు వాళ్ళ నాన్న. పెళ్ళి జరిగితే మేలు. ఆడపిల్లొందు దొరికితే కొంత తెరిపిన పడతాడు మన రామమూర్తి" అన్నాడు శ్రీపతి.

రామ్మూర్తి వొళ్ళంతా రాగిరంగు నూగు వెంట్రుకలుంటాయి, పాలిపోయిన యెర్రటి పండుకోతి యెరుపు చర్మం మీద.

"పోవాల, యింజనీరింగ్ కలేజ్ హాస్టల్లో వనున్నది" అన్నాడు వెంకటేష్.

"కాస్త జాగ్రత్తగా మెసలండి. మన కొత్త వీ. సీ. జేబులో పిస్టలూ చాకూ పెట్టుకుని గస్తీ తిరుగుతున్నాడట. మొన్న వొక జటుని విలేశాడట. ఆంధ్ర యూనివర్శిటీలో వియూపకమైన అప్పారాయుని వంటి సాత్వికుడు కాదు" అన్నాడు శ్రీపతి.

"యింపోశెంట్ కోర్టు కాదు యూనివర్శిటీ అంటే. కోర్టులో వేషమేసొక్కని కూర్చొనుడు కాదు వైస్‌చాన్సలర్ షిప్ అంటె. పులులతోటి చెలగాటం ఆడుటని జక్టినే గ్రహిస్తడు." అన్నాడు వెంకటేష్.

"యీ యూనివర్శిటీ గొడవలు పెద్ద తలనొప్పిగా ఐపోయిందినాకు. ఆయ్యా, జగన్మోహనరెడ్డిగారూ మీకు సర్వాధికారాలూ యిస్తున్నాను. మీ యిష్టమొచ్చిన రూలాలూ మిరియాలూ నూరండి అని మన వెంగళ్రాయుడి వారు అన్నాడట. అలా సర్వాధికారాలూ యిస్తేనే యిక్కడికి రావటానికి వొప్పుకున్నాడట" అన్నాడు శ్రీపతి.

"వాని నాకూ గోలీ మన తాన నహీ చల్తా. తన కుర్చీలో తాను కూర్చొని తన పని చేసొక్కమను. అంతె స్టూడెంట్స్ యూనియన్ ప్రాబ్లమ్సల కొచ్చిందంటె — ఫింగలి సాబ్ కొ పకడ్‌కె పింజ్‌రే మె రఖేంగే!" అని బయటికి నడిచాడు వెంకటేష్.

సోషియాలజీ విద్యార్థులు — క్రితం సంవత్సరం తప్పిన అట్లూరి గాంధి, పిరుడు తప్పిన చెరుకూరి వెంకటేశ్వరరావు, గుండు శరగోపం — పేపర్లో సినిమా పేజీల్లో మొఖాలు దూర్చి చూస్తున్నారు మళ్ళీ పరీక్షలు రావే పేమెంట్ యీ నెలలోనే వొచ్చారు.

పంజ్‌బూర్, రొట్టీ, వో పైసా నహీ, పోకెట్‌మార్, మొగుడా పెళ్ళామా, బనా. షాత దేవదాసు, అభిమానవతి, సిద్దార్థ-

"గాంధీతో తిరిగి దగావుకి నామం పెట్టాడు. ఆ గాంధీకేం, వాడి బాబు దగ్గిర పాపిష్టి డబ్బు బోలెడుంది పెరుగుతూ. యీ బికారి వెధవలు మట్టిగొట్టుకుపోతారు. యీ రెండు నెలలైన బుద్ధిగా చదివితే—" అనుకుంటున్నాడు శ్రీపతి.

సిద్ధార్థ సినిమా బొమ్మకేసి కన్నార్పకుండా చూస్తున్నాడు, గాంధీ.

"గాంధీ, ఆ బింకా దినమొదిగా నుంచున్న సిమీ గుంట ముందు మోకరిల్లిన శశీ గుంటణ్ని చూసి లొట్టలేస్తున్నట్లున్నావు. కాన్రాడ్ రూక్స్, హెర్మన్ హెస్సేకి చేసినంత అన్యాయం చెయ్యలేదు. వెడితే నువ్వే అన్యాయమైపోతావు, సిద్ధార్థతో. టీనేజ్ సినిమాకో సైరా సినిమాకో హర్రర్ సినిమాకో వెళ్ళు. పిల్లల్ని వొదిలేసెయ్యి. పాపం చదువుకుంటారు" అన్నాడు శ్రీపతి.

వాళ్ళిద్దరూ గుర్రుగా చూశారు శ్రీపతివొంక. గాంధీతో సినిమా కెడితే ; సినిమా, ఇంటర్వెల్లో బిరియానీ దక్కుతాయి. రెండు పెగ్గులతో నోరు తడిపినా తడవొచ్చు. గాంధీ సహాచర్యంలో, శరగోపం చికెన్ బిరియానీ రుచి. తినాడా కాదా, గడిచిన రెండేళ్ళలో.

"వరంగల్, గుంటూర్లలో పీజీ సెంటర్స్ని యూనివర్సిటీలు చేస్తారట. మరికొన్ని పి. జి. సెంటర్లు పెడతారట. విద్యామంత్రిగారి అభిభాషణ." అన్నాడు నిరంజనరావు.

"బుద్ధిలేకపోతే సరి. పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్య దేనికి సమస్తాం పనికి? గ్రాడ్యుయేషన్ అనవసరం అనుకుంటూంటే పోస్ట్ గ్రాడ్యుయేషన్ విద్య, ఆయా రంగాల్లో విశేషమైన కృషి చేస్తూ వుండిపోవాలిచిన వాళ్ళకిగాని — యిళ్ళలో ఏం తోచకపోతేనూ, యిప్పట్లో వుద్యోగం రాదని తెలిసి యేం చెయ్యటానికీ లేక వొచ్చి చేరటానికి, కట్నం రేటు పెంచుకోటానికీ కాదు" అన్నాడు శ్రీపతి.

"నువ్వే పోవా సిన్మాకు. పోకెట్ మార్ల సైరాబానూ వున్నది. ధర్మేంద్ర గూడ. పోయి నాడు నే చూస్న" అన్నాడు వొకతను.

ఆ రెండో ఆతను "జ్వరంగా వుంది" అన్నాడు.

"ముఖం చూస్తే అట్లా లేదు" అని చెయ్యి పట్టుకుని చూసి, "వెచ్చగా లేదే!" అన్నాడు నిరంజనరావు.

"మరి అదేమి జ్వరమో!" అన్నాడు వొకతను.

"నో జ్వరం అవుతుంది, థెర్మామీటర్‌కే తెలుస్తుంది, పైకి వొళ్ళు వెచ్చగా అనిపించదు" అన్నాడు శ్రీపతి.

"ప్రేమ జ్వరమేమో!" అన్నాడు యింకొకతను.

"ప్రేమజ్వరమైతే వొళ్ళు కాలిపోదూ?" అన్నాడు నిరంజనరావు.

"ప్రేమజ్వరం ఐతే వొళ్ళు వేడెక్కదు. మనసే వేడెక్కుతుంది. ప్రేమజ్వరం తరవాతి జ్వరం విరహజ్వరం — దానికైతే వొళ్ళు వేడెక్కుతుంది. కామ జ్వరానికైతే కొవ్వు వేడెక్కుతుంది. సుఖ జ్వరానికైతే సుఖం వేడెక్కుతుంది అదైతే వో యాంటీ బయాటిక్ మోతాదుతో తగ్గిపోతుంది" అన్నాడు శ్రీపతి.

"అయ్యో, జ్వరములు యెన్ని రకంబులు?" అన్నాడు నిరంజనరావు.

"జ్వరాలు నానా రకాలు. యేడుపు జ్వరాలు, అలక జ్వరాలు, గోడు జ్వరాలు, యీర్ష్య జ్వరాలు — వస్తా. మరోసారి మాట్లాడుకుందాం సుగతా సహాలక్ష జ్వరాల గురించి." అని చటుక్కున లేచి గదిలోకి వచ్చి — సగం దాకా చదివిన నటాన్‌సన్ పుస్తకం, "లిట్‌రేచర్, ఫిలాసఫీ అండ్ సోషియల్ సైన్సెస్" తెరిచాడు శ్రీపతి.

# 76

**అటు** సికిందరాబాదూ యిటు హైదరాబాద్‌లలోని రాంనగరూ ఆ పరిసర ప్రాంతాలు, ముషీరాబాద్‌లో కొన్ని భాగాలూ కలిసిన అసెంబ్లీ నియోజకవర్గంలో యేర్పడిన ఖాళీకి బై యెలక్షన్ నిర్ణయించారు జనవరి మూడో వారంలో.

మార్చిలో యెలక్షన్లు. పోలింగ్ తేదీలు యింకా వెల్లడించలేదు. ఫిబ్రవరి రెండోవారంలో పార్టీల అభ్యర్థుల్ని ప్రకటించారు. యిందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా గోవర్ధన్‌రెడ్డి పేరు ప్రకటించారు.

కాలేజీలలో యితీవల యూత్ కాంగ్రెస్ ప్రాబల్యం తగ్గుతున్నట్లనిపించి, తన అధికృతి తగ్గుతూండటం గమనించుకున్న గోవర్ధన్‌రెడ్డి, మంత్రివర్గంలో వున్న తన బంధువు వొకరి ద్వారా ప్రయత్నించి సీటు సంపాదించాడు. ఆ ప్రాంతలో బాగా పలుకుబడి వున్న రాజ్ రెడ్డి మద్దతు యివ్వ

టానికి అంగీకరించాడు. రాజ్ రెడ్డికి నేరుగ రాజకీయాలలో ప్రవేశించే తలంపు లేదు. ఆ అండతో తనవ్యాపారాలు పెంపుచేసుకునే తలంపు వున్న వాడు. రామనాథం మెషీన్ టూల్స్‌లోంచి నర్సిమ్ము బయటికి వొచ్చేశాక అతనిని చేరదేసి తన ఫ్యాక్టరీల్లో పని యిచ్చి, ప్రాముఖ్యత యిచ్చాడు. కూలి నాలీజనాన్ని కార్మికుల్ని అతను జమ చెయ్యగలడు.

జనసంఘ్, తమ అభ్యర్థిగా మాధవరావు అనే వొకతనిని ప్రకటించింది, ఆ పార్టీ.యీ నియోజకవర్గంలో జనసంఘ్‌కి బలం అంతగా లేదు. ముషీరాబాద్ ప్రాంతంలోని వుద్యోగస్తులు, చదువుకున్నవాళ్ళు, మధ్య తరగతి ప్రజలు, కాస్తే వున్నవాళ్ళు, పై వుద్యోగస్తులు....ముఖ్యంగా హిందువుల్లోంచి వోట్లు పడతాయి. వాళ్ళలోనూ కొందరు యిండిరాగాంధీ పార్టీకే వోటు వేస్తారు.

యికపోతే కమ్యూనిస్టుపార్టీకి ఆచివరలో బాగా బలం వుండేది, వొకప్పుడు ఆ పార్టీకి యీ నియోజకవర్గం పెట్టనికోటలాంటిది.కానీపార్టీ చీలిపోయిన తరవాత ఆ ప్రాబల్యం పోయింది. వొక దశలో ఇరువక్షాలు కలిసి వొక అభ్యర్థిని నిలబెట్టే అవగాహన ఆలోచన యత్నాలు వొకస్థాయిలో జరిగినా....యింటి కుక్క యింటి కుక్కని చేరనివ్వనన్నట్లుగా వాళ్ళ మధ్య సయోధ్య సాధ్యపడలేదు. సి.పి ఐ, సి. పి. ఐ. (యం), చెరో అభ్యర్థిని నిలబెట్టారు.

అటు మెషీన్ టూల్స్ ఫ్యాక్టరీ వర్కర్లు, యిటు రాం నగర్ వాసులు పట్టు బట్టారు, రవిని పోటీ చెయ్యమని. అతనికి మనసులో యిష్టంగానే వుంది. యిండిపెండెంటుగా నామినేషన్ దాఖలు చేశాడు.

పోతే మరో ముగ్గురు, యిండిపెండెంట్లుగా నామినేషన్లు దాఖలు చేశారు. కానీ వాళ్ళకి డిపాజిట్లు దక్కినా గొప్పే.

నామినేషన్లు వుపసంహరించుకునే గడువులోగా వొక యిండిపెండెంటు అభ్యర్థికి ఐదువేల డబ్బు యిచ్చి,యింకా యితర ఆశలు కల్పించి వుపసంహరింపచేయించాడు రాజ్‌రెడ్డి.

ప్రచారం ముమ్మరంగా సాగుతోంది. ప్రభుత్వ యంత్రాంగాన్ని—అనధికారికంగానే కావొచ్చు—బాహాటంగానే వాడుకుంటున్నాడు గోవర్ధన్‌రెడ్డి. డబ్బుకి లోటులేదు. బాగా స్థితిపరుడు. ఖర్చు పెట్టటానికి వెనకాడే తత్వమూ కాదు. రాజ్‌రెడ్డి రవిని తనకి అనుకూలంగా మలుచుకుని తన మిలులో పని

యిచ్చి ఆ ప్రాంతంలో ఆతని పలుకుబడిని తగ్గించాలని చాలా కాలంగా యత్నిస్తూ రకరకాల ఆశలు చూపెడుతూ వొచ్చినా లొంగనందున రవి పట్ల ఆతనికి వైరం వుంది. అందుకు యింకా యెన్నో కారణాలు వున్నాయి. రాజ్‌రెడ్డి దగ్గర పని చేసే కార్మికుల్లో చాలామంది రాంనగర్‌లోనూ ఆ పరిసర ప్రాంతాల్లోనూ వున్నారు. వాళ్ళు తమ సమస్యల గురించి సంప్రదిస్తూండటం, ఆ వైషమ్యానికి ముఖ్య కారణం.

గోవర్ధన్‌రెడ్డికి రవి అంటే వైరం యేమీ లేదు. వ్యక్తిగతంగా వొకరికొకరు తెలియనూ తెలియరు—వొకరిని గురించి వొకరు వినటం తప్ప. రవిని పోటీ చెయ్యవద్దని రాయబారం పంపించి విఫలమయ్యాడు. మొదటిష స్లలో పోటీలోకి కూడా రాలేనివాడు, అంతగా రాయబారం జరిపించినా వినలేదని గుర్రుగా వుందిప్పుడు గోవర్ధన్‌రెడ్డికి.

కాంగ్రెస్—ఐ నాయకులు ముమ్మరంగా ప్రచారం సాగిస్తున్నారు. అటు కమ్యూనిస్టుపార్టీలూ బాగా ప్రచారం సాగిస్తున్నారు. యీ రెండు పార్టీలకీ యేదొక రకంగా మంచి ప్రాబల్యం వుంది ఆ ప్రాంతంలో. రాజకీయ కోవిదుల పరిశీలకుల అంచనా ప్రకారం కాంగ్రెస్ ఐ గెలవటం తథ్యం. తప్పితే సి. పి. ఐ. (యం) గెలవొచ్చునని. కానీ కాంగ్రెస్—ఐ గెలవటం తథ్యం అని చివరికి నిర్ధారించారు. ఆఫీసర్లు వుద్యోగస్తులు కాంగ్రెస్—ఐకి వోటు చేస్తారు....కొందరు జనసంఘ్ అంటే ప్రత్యేక అభిమానం వున్నవాళ్ళు తప్ప. రాజ్‌రెడ్డికి ఆ ప్రాంతంలో అందరితోనూ దగ్గిర సంబంధాలున్నాయి. వర్కర్లు తెలుసు. కాగా, నర్సిమ్లు రవిమీద కసిగా దీక్షతో అహోరాత్రులు కృషి చేస్తున్నాడు. కార్మికుల కూలీనాలీజనం వోట్లను అతను రాబట్టగలడు.

రాములు, సాయిలు, యింకా చాలామంది రవి తరఫున ప్రచారం చేస్తున్నారు. గంగి నలుగురు ఆడవాళ్ళను పోగుచేసి గుడిశ గుడిశకీ వెళ్ళి చెబుతోంది. ఐతే, చదువుకున్న వాళ్ళు, మధ్య తరగతి వాళ్ళ యిళ్ళకి ఆమె వెళ్ళటం లేదు.

రవికి వున్న కొత్త బలమూ అతని స్వభావమూ, వుపన్యాస సామర్థ్యం. గోవర్ధనరెడ్డి వుపన్యసించటంలో పూజ్యం. మంచుని గట్టిగా అరిచినట్లుగా నాలుగు ముక్కలు అనగలడు. ఐతేనేం, అతని తరఫున వేదిక మీద మాట్లాడే ప్రముఖులు యెందరో వున్నారు.

రవికి, వ్యక్తిగతంగా ఆ ప్రాంతంలోని బీదసాదలతో చక్కని

సంబంధాలున్నాయి. యిలా యెలక్షను అనే భావం మనసులో యేమాత్రం లేకండానే తన స్వభావాన్ననుసరించి అవసరాల్లో వున్నవాళ్ళకి తనతో బంది చేస్తూంటాడు— వెనకటినుంచీ. ఆ రకంగా, సీజన్లను బట్టి వుండే అపీ యిపీ పనులు చేసుకుని బతికేవాళ్ళు, కార్మికులు అతనికి కొందరు సన్నిహితంగా తెలుసు.

యెలక్షను దగ్గిర పడుతున్నకొద్దీ ప్రచారం ముమ్మరమైంది.

గోవర్ధన్‌రెడ్డి మందీ మార్బలంతో జీపుల్లో తిరుగుతూ—యిరవై పాతిక వోట్లు వీడి చేతులో వున్నాయనుకున్న ప్రతివాడికీ దువ్వి రకరకాల వ్యక్తిగతమైన ఆశలు చూపెడుతున్నారు అతని అనుచరులు. అప్పటికప్పుడు వాళ్ళ అవసరాలకి కొంత డబ్బు సర్దుతున్నారు.

తనని సమర్థించే కార్మికులు రిక్షాలు తెస్తామంటే కూడా రవి వొప్పుకోలేదు. మీ రిక్షాలు కాంగ్రెస్-ఐ వాళ్ళకి కిరాయికి తిప్పి డబ్బులు తెచ్చుకోండి— వోట్లు నాకు వెయ్యాలనిపిస్తే వెయ్యండి, చాలు—అన్నాడు. కాలినడకనే నియోజకవర్గం అంతా తిరుగుతున్నాడు, కూడా నలుగురైదుగురు కార్మికులు, రాములు, సాయిలు, మరో యిద్దరు మరికొందరు కార్మికుల్ని, కూలినాలి జనాన్ని తీసుకుని జట్లు జట్లుగా యేర్పడి విడి విడిగా తలా కొన్ని ప్రాంతాల్లో ప్రచారం ప్రారంభించారు—అభ్యర్థుల గురించి పార్టీల గురించి వివరిస్తూ. వాళ్ళకి వాళ్ళకే అనిపించిన దాన్ని బట్టీ రవి సూచనలననుసరించీ—యీ పార్టీలు యిన్నాళ్ళుగా వాళ్ళకి వొరగబెట్టింది యేమీలేదనీ, రవి నిస్వార్థంగా పేదప్రజల క్షేమం కాంక్షించే మనిషి అనీ ప్రచారం సాగిస్తున్నారు.

రవి తనతో కేవలం నలుగురు కార్యకర్తలను తీసుకుని ప్రచారానికి దిగాడు. గంగిని కూడా రావొద్దన్నాడు. ఆమె విడిగా యింటింటికీ తిరిగి ఆడవాళ్ళతో ప్రచారం సాగిస్తూనే వుంది. రవి వ్యక్తుల్ని కలుసుకుని విడివిడిగా అర్థించడం చెయ్యడంలేదు. ఆ నేర్పు అతనికి లేదు. చిన్న చిన్న వుపన్యాసాలు యేర్పాటు చేసుకున్నాడు. నాలుకట్టుగో చిన్న వుపన్యాసం సభ. అతని వుపన్యాసం ధోరణి తీరూ తను మాట్లాడుతున్న ప్రాంతాన్నిబట్టి వుంటుంది. వుపన్యసించడం అతని అసాధారణ సామర్థ్యం. కాలేజీలో యింగ్లీషులో మాట్లాడినా, తెలుగులో మాట్లాడినా శ్రోతలందర్నీ ఆకట్టుకునేవాడు....తను చెప్పే విషయంతో యేకీభవించని వాళ్ళతో సహా.

యిందులో కులాల బలం లేదు. కార్మికులు కూడా

ప్రజానీకం. వీళ్ళింకా యస్సీయసీ కులంగా ఏర్పడలేదు....దగుపుకున్న దగుపు కుంటున్న వాళ్ళలోలాగా. రవి కులం అక్కడ కాదు. తెలంగాణా ప్రాంతం లోనే సరిగా తెలియదు. ఖమ్మం దాటి, కమ్మ కులం అంటే తెలియదు కమ్మ అని చెబితే కమ్మ కావున....అంటారు. కాపులో జమ చేసేస్తారు కమ్మకులం, ఇప్పటి బలమైన అగ్రకులాల్లో వొక అగ్రకులం అని తెలియదు. తెలంగాణాలో కులం దృష్ట్యా రెడ్డి కులానికి పోటీ వున్నట్లూ అనిపించదు. రాజకీయంగా....వొక కులంగా అదొక్కటే అగ్రకులంగా అనిపిస్తుంది. అందువల్ల ఆంధ్రప్రాంతంలోలాగా, తెలంగాణాలో రాజకీయంగా కులతత్వానికి ప్రాముఖ్యత లేదు, ఐతే రాష్ట్రం అంతటా యెన్నికలు జరుగుతున్నప్పుడు కొంత ప్రభావం వుంటుంది.

రవి రోజంతా వుపన్యాలిస్తూనే వున్నాడు. ఓరిగ ఏర్పాటు చేసిన పెద్ద పెద్ద సభలు కాదు. అతి చిన్న చిన్న సభలు, వాడకట్టుకో సభ. గోవర్ధన్‌రెడ్డితో యీ విషయం అంటే. "వొల్లితే వోట్లేస్తారు: వొల్లి వొల్లి. వాని నోరువోతది!" అని నవ్వాడు.

రవి వుపన్యాసం, విషయం, సరళి, ధోరణి, భాష—తను మాట్లాడుతున్న ప్రాంతాన్నిబట్టి వుంటాయి.

సీజన్లనుబట్టి అవీయివీ పన్లు చేసుకునే వాళ్ళు యెక్కువగా వున్నచోట — "గింత కాలంగ యిన్ని పార్టీలను గెలిపించిన్రు. కమ్యూనిస్ట్ పార్టీని గెలిపించిన్రు. కాంగ్రెస్ పార్టీని గెలిపించినుర్రి వోట్లేసి వాండ్లను గెలిపిస్తపోతాన్రు మీరందరు. కానైతె మన కేమి చేసిన్రు వాండ్లు? దూపయితె తాగెటందకు నల్లాలైన యెయ్యకపాయె—గల్లీకొకటన్న! మనమంత, చిన్న చిన్న పన్లు చేసొక్కనెటందుక్కె, గాడీ ఖరీద్ చేసెటందుక్కె, పాన్ దుకాన్ పెట్టెటందుక్కె, బర్రెలను కొనుక్కొనెటందుక్కె—యిట్ల మస్తు దందల కోసం సర్కార్ లోన్లు యిస్తమని ప్రచారం చేస్త వొచ్చిన్రు. కొందర్కి యిచ్చిన్రు గూడ. కానైతె, ఆ పైసలు పూరాగా యిస్తున్నరా! సగం పైసలెగద మన చేతుల కొచ్చెడ్ది! గదంత దఫ్తర్ల గొటాల. యీ లోన్ల ముచ్చట యీ కాంగ్రెస్‌పార్టి జేస్తున్న మోసం. యిన్నేండ్ల సంది యెట్లున్నమో యిప్పుడుగూడ అట్లనె వున్నం. మనకష్టాలు అట్లనె వున్నవి. యేమిటుక్కన్నవి? వాండ్లు ఝూటాగాండ్లు. వోట్లకోసం ... ... ... సంగతు సది లేదు. యీడనో

యీ మహా వ్యవస్థని మార్చాలంటే దీర్ఘకాలిక పథకం అవసరం. మరో కొత్త దృక్పథం ఆచరణ యోగ్యమైన సర్వులకూ మేలు కూర్చే కొత్త సిద్ధాంతాన్ని రూపొందించుకోవాలి. కమ్యూనిజమూ కాదు. కేపిటలిజమూ కాదు. అందరికీ అన్నీ సమకూర్చే సమసమాజం వంటి వొక నూతనవ్యవస్థ అవసరం. కాంగ్రెసు కాదు. ఆవడి కాంగ్రెస్‌లో రూపొందించిన సోషలిస్ట్ పేట్టర్న్ విధానం నేతిబీరకాయ వంటిది. ఆదొట్టి నీటి మాట. బూటకం మాట, మోసలి కన్నీళ్ళు కార్చటం మాత్రమే. వాలిబాలని వుండీలేనిస్థితిలో బ్రతుకు దుర్భరం. కష్టాల బాధలతో, అతిథి మర్యాదలతో, పరువు ప్రతిష్ఠల కోసం ప్రాకులాడుతూ— వీటికి సరిపడా ఆర్థిక స్థోమత లేక నానాచావు చస్తున్న మధ్యతరగతి అంటూ వొకటి వున్నదని, అటు కాంగ్రెసు పార్టీకి యిటు కమ్యూనిస్టు పార్టీకి తెలియనే తెలియదు. జనసంఘ వింత విషబీజాలు నాటటంలో నిమగ్నమై వుంటుంది వాళ్ళకి మధ్యతరగతి వారి హైందవ సెంటిమెంట్లని ప్రేరేపించి తమ స్వార్థానికి వాడుకోవటం బాగా తెలుసు అంతేగానీ ఆ మధ్యతరగతి హైందవ సెంటిమెంట్ల జటిల సమస్యల ఆర్థిక సాంఘిక కారణాలను నిర్మూలించే యోచనే లేదు యీరకంగా యిప్పుడున్న పార్టీలు, మధ్యతరగతి ప్రజలకుండే సునిశితమైన సమస్యలను పరిష్కరించుకోటానికి అవసరమయ్యే ఆర్థికస్థోమతని పెంచే ఆలోచనే లేదు........"

పై వుద్యోగస్థులు, డబ్బున్నవాళ్ళు యెక్కువగా వున్న ప్రాంతాల్లో —అటువంటి ప్రాంతాలూ వోటర్లూ యీనియోజకవర్గంలో చాలాతక్కువ. వాళ్ళు తనకి అంత ముఖ్యం కాదు. ఐనా వాళ్ళలో కొందరైనా వేస్తారనే దృష్టితో—

"Why is ourhuman society in such a plight? Why is there hatred between the so-called Haves and Have-nots? Hatred is not the right solution for anything. Communism is sheer utopean nonsensical ideal. Stateless-ness is impossible. Equality should not be indiscriminative. Pay according to ability. Maintain such equality of opportuity justice

and freedom—freedom to be what one wants to be. The state should not impose unnecessary restrictions on individual's activities, likes and dislikes etc............".

రవి వుపన్యాసాలకి అన్ని వర్గాలవాళ్ళూ ఆకర్షితులవటం గమనించిన గోవర్ధనరెడ్డి గ్రూపు గిజగిజలాడిపోయి [illegible] [illegible] అని ఆలోచనలు సాగించారు.

నర్సిమ్మలు రెచ్చిపోయి, రాములు [illegible] పట్టుని [illegible]. రాములు చెయ్యి ఫ్రాక్చరైంది, భుజానికి పెద్ద గాయం [illegible] [illegible] బాగా దెబ్బలు తగిలాయి [illegible] [illegible] [illegible] [illegible] ఆ సమయానికి ఆ వార్త అందుకున్న రవి, వెంటనే అక్కడికి వెళ్ళి [illegible] వాళ్ళని తగ్గమన్నాడు. "అంతేకాదు. ప్రతిచర్యగా [illegible] మళ్ళీ వాళ్ళని తన్నవొద్దు. మనని కొట్టింది కార్మికులు కాదు. కిరాయి గూండాలు. కిరాయి గూండాలకి వోట్లు పడవు. మనకి [illegible] [illegible] అర్థమైంది మనం వాండ్ల బొక్కలిరగదంతే" అన్నాడు.

"వోద్దు గీ తీరున కిరాయి గూండాలను పెట్టి తన్నించిన్రు. మైసలిగ్గి వోట్లు కొనేటందుకు చూస్తున్నారు [illegible] [illegible] తీస్కొని వాండ్లకు వోట్లెయ్యకుంటె సరిపోతది" అని చెప్పి ప్రచారం చెయ్యాలి. అట్లైతే మనమంటె హమ్దర్ది పెర్గుతది పేదప్రజలు మనవైపునె వుంటరుగదా." అని రవి వివరించి ఆ రకంగా ప్రచారం [illegible]టంతో, అగ్నిలో ఆజ్యం పోసినట్లు తన వుపన్యాసాల ఆకర్షణ శక్తికి [illegible] [illegible] తోడుకి [illegible] [illegible] జోడించినట్లయింది.

రేపు పోలింగ్ అనగా గోవర్ధన్‌రెడ్డి పక్షం బాగా డబ్బు పంచి పెట్టారు. పోలింగ్‌రోజున వాటుగా తెగిచిన సారా దుకాణాల్లో తాగబోయించారు. లారీలు, వ్యాన్లు, జీపులు, కార్లు, టాక్సీలు, ఆటోలు, రిక్షాలు — యెలక్షన్ జరుగుతున్నది వొక్క నియోజక వర్గంలోనే కాబట్టి మరింత [illegible] వుగా దొరకటంతో ముమ్మరంగా సరఫరా చేశారు.

వోటింగ్ పూర్తి అయ్యేసరికి ఆసరళి చూసి— గోవర్ధన్‌రెడ్డిగానీ రవిగానీ గెలుస్తాడనీ నిర్ధారించారు, రాజకీయ పరిశీలకులు. వోటర్లలో రవి గెలుస్తాడనే భావం యేర్పడింది.

ఓట్లు లెక్కింపు జరుగుతోంది. రవి వెళ్ళి తన పాకలో పడు కున్నాడు—గంగిని దగ్గిరికి తీసుకుని.

"కౌంటింగ్ యెట్లున్నదో తెల్వుకుందం" అని గంగి అంటే—"మనం చెయ్యాల్సిందంతా చేశాం, తీర్పు ప్రజలది. తాపత్రయం దేనికి? యీ యెలక్షను దృష్టి నాకింతకు ముందెన్నడూ లేదు. అట్లా సంభవించింది గెలిచినా ఓడినా దిగులుపడను పడుకో కౌంటింగ్ పూర్తి అయ్యేవరకూ మధ్యలో యెవర్నీ రావొద్దని చెప్పాను. రారు. పడుకో.—" అని గంగి వీపు మీదుగా చెయ్యితిప్పి కళ్ళు మూసుకున్నాడు. ఐదు నిముషాల్లో నిద్రపోయాడు.

గంగి రెస్ట్లెస్‌గా అటూ యిటూ కదులుతూ వుంది. బయట యే అలికిడి ఐనట్లనిపించినా....కౌంటింగ్ పూర్తి అయ్యి అందరూ వొస్తున్నారేమో అని చెవులు రిక్కించి వింటోంది.

ఆ అర్ధంతా తనొక్కతే పడాల్సొచ్చినందుకు 'మొద్దు' అని అనుకుంది రవిని....అప్యాయతగానే.

తెల్లవారుజామున....బయట కోలాహలంగా జనం....

మెలకువనే వున్న గంగి, తడిక తలుపు తీసి బయటికి వొచ్చింది. పూలదండలతో జనం.

సంతోషంతో మాట రాక వొక క్షణం ఆగి, "మీ రవీ సాబ్ నిద్రపోతున్నడు బేఫికర్‌గ. యేమాయెనోనని నేనొక్కదాన్నే రాత్రంతా బాధపడ్డ!" అంది గంగి.

ఆ చప్పుడికి రవి లేచాడు.

రవీ సాబ్ జిందాబాద్ రవీ సాబ్ జిందాబాద్....రవిగారు జిందాబాద్....ప్రజానాయకుడు రవి జిందాబాద్....

రవి మెడనిండా పూలదండలు.

రవిని బలవంతంగా భుజాలమీదకి యెక్కించుకుని ఊరేగించుకుని నడుస్తున్నారు—రవికి—దింపండి, నడుస్తాను—అనే అవకాశం కూడా ....వ్వకుండా.

మర్నాటి రోజున—రవికి ఘనంగా సన్మానం జరిపించాలనీ పుర ప్రముఖుల్నీ కొందరు మినిస్టర్లనీ పిల్వాలని తీర్మానించుకున్నారు—అతని కార్మిక మిత్రులు. రవి వొప్పుకోలేదు. "సభకి రాజ్‌రెడ్డిని కూడా రప్పించి

నప్పు అది గొప్ప విషయంకాదు. యీచిన్న అవకాశంతో యీవనప్రాంతం లోని మనస్థితిగతులను మెరుగుపరుచుకోటానికి ప్రయత్నిద్దాం" అన్నాడు రవి.

రవి, యం యల్ యే. క్వార్టరు అవసరం లేదు, అదేపాకలో వుంటామంటే గంగి వొప్పుకోవటం లేదు.

వొకరోజున వొక బంట్రోతు క్వార్టరు తాళాలు తీసుకొచ్చాడు. ఆ వేళకి రవి లేడు. గంగి వుంది. తీసుకుంది. వొచ్చాక తెలిసి, దెబ్బలాడ బోయాడు. "అన్నీ నీ యిష్టమేనా, వూరుకుండు" అని కసిరింది. ఆమె వంక చూసి....తగ్గిపోయాడు.

మరునాటి రోజున, "వుండే నువ్వుండు వెళ్ళి గాన్లో. నేనిక్కడే వుంటా" అన్నాడు.

"యీడా ఆడా కూడ వుందం" అంది గంగి

ఆక్వార్టరులోకి సామానూ కుర్చీలూ మంచాలూ అవీ కావాలంది.

"నా దగ్గిర వొక్కపైసా లేదు. యెప్పటికన్నా పెంకుపేలు జమచేతే యీ గుడిశ కొంటాను. నువ్వేం చేసుకుంటావో నాకు తెలవదు....నీదగ్గిరున్న వేల రూపాయలతో." అని నవ్వాడు.

మూడో రోజున ఆమె చేతికి వున్న రెండు బంగారు గాజులు అమ్మి ఆరు మంచి పేము కుర్చీలు, టీపాయ్, కిటికీలకి అందమైన తెరలు, వొక యినప మడతమంచం....ప్లాస్టిక్ నవ్వారు అల్లినది....కొంది.

ఆ గాజులు అమ్మినట్లు చెప్పకుండా, "కుర్చీలు, కర్టెన్సు గిల్లికొని డెకొరేట్ చేసాస్తి" అంది.

ఆ గాజులు యెప్పుడో వాళ్ళ అన్న రాములు చేయించినవి. గంగికి రవి యేమీ కొనలేదు. ఆమె యేదీ కావాలని అడగలేదెన్నడూ.

"వెళ్ళి వుండు హాయిగా." అన్నాడు.

"నువ్వు రాకుంటె యెట్ల? నువ్వు యీ గుడ్శను యిడ్వలేకుంటె యీడనె వుండు. యెమ్మెల్యే యాక్టివిటీస్ పొలిటిక్స్ తెలుస్తవి ఆడవుంటె. రెండు చోట్ల వుందం. పద." అని కదలదీసింది.

మరో కిరోసిన్ స్టవ్వు, కొన్ని అల్యూమినియం పాత్రలు, వొక చక్కని టీ సెట్టు కొంది.

బయటి గది చూడటానికి నిండుగా చక్కగా అందంగా వుంటుంది.

యిస్తే టీ యిచ్చి.

రవి వెళ్ళి అక్కడున్న కావేపూ వాకిట్లోనో వీధిలోనో కేంటీన్‌లోనో వాళ్ళతో వీళ్ళతో మాట్లాడుతూంటాడు. తప్పనిసరి మర్యాదకి, అప్పుడప్పుడు ముందు గదిలోకి తెస్తుంటాడు.

ఐతే, విధిగా రాత్రికి గంగిని తీసుకుని రాంనగర్ వెడతాడు. గంగి వాళ్ళమ్మావాళ్ళింట్లోనో పాకలోనో గడుపుతుంది. రవి వాడకట్టు చుట్టబెట్టి వొస్తుంటాడు. వొచ్చేసరికి బాగా పొద్దుపోతుంది.

"రోజంత యింట్ల వున్న గూడ దిక్కులేదు. యిక అన్నిరాత్రులు మంది ముచ్చట్లతోటి బయటనె వరిపోతె .. యింట్ల పెండ్లమొకతున్నదను కుంటున్నవో, చచ్చిపోయినదనుకుంటున్నవో!" అంది గంగి వొకసారి.

"నీ గొడవ నీదే. వొస్తూనేవున్నాగా యింటికి?" అన్నాడు, రవి.

"నిద్రపోయేటందుకు!" అని పరిహాసంగా నవ్వింది గంగి.

# 77

రాష్ట్రంలోని స్కూళ్ళకి కాలేజీలకి ఫస్ట్రిల్ పద్నాలుగు నుంచి వారంరోజులు సెలవులు ప్రకటించింది ప్రభుత్వం—ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా.

ఫతే మైదాన్‌లో చాలా అట్టహాసంగా యేర్పాటుచేశారు. సర్క్యూట్ టీ. వీ. యేర్పాటుతో సహా—దూరంగా కూచున్న వాళ్ళకి సరిగా కనిపించటం కోసం. వూరంతా ఆర్చిలతో తోరణాలతో అలంకరించారు.

నాంపల్లి రోడ్ ఫుట్‌పాత్‌మీద నడుస్తూ, "యేమిటికీ యీ హంగామా అంతా? తెలుగుకీ తెలుగు దేశానికీ యిప్పుడేం భోగం పట్టినదని? లేక, యేమి ఆపద వొచ్చినదని? ప్రజల ధనాన్ని యిట్లా వృధా చేస్తున్న ప్రభుత్వాన్ని నిలువునా వురితియ్యాలి" అన్నాడు మోహన్‌రెడ్డి.

"స్టెన్‌గన్ పట్టుకోని మినిస్టర్లందర్ని ఫట్ ఫట్ కాల్చి పారెయ్యాలి వొక్కొక్కర్ని గిసుమంటి పన్లు చేస్తె. దీనికోసం. జబర్దస్తీతోటి మంది దగ్గర—వుద్యోగస్తుల తాన పైసలు గుంజుకున్నరు గవర్నమెంట్ ఆఫీసర్లు" అన్నాడు వెంకటేష్.

వాళ్ళతో పాటు మరి కొందరు.

ఫతే మైదాన్ వైపు వొస్తున్నారు. లక్డీకాపుల్ వైపు నుంచి వొస్తున్న రంగారెడ్డి మరో యిద్దరు యెదురయ్యారు.

"నువ్వు వూర్లో వుండటంలేదా రంగారెడ్డీ? సిటీలో వుంటున్నావా?" అన్నాడు మోహన్‌రెడ్డి.

"మస్తు భూమి వున్నది. అంత భూమి నేనేడ దున్నగల! అందుకోసం మా నాయన్నే దున్నిపిస్తున్నడు. యేం జెయ్యాల? బియ్యే ప్రోగ్రామ్ యింక వున్నదికదా. కంప్లీట్ చేస్తున్న యీడనె వుండి" అన్నాడు రంగారెడ్డి.

"యెన్ని దశాబ్దాలు పడుతుంది నీ పరీక్షకి?" అన్నాడు మోహన్‌రెడ్డి

"అన్ని భూములు దున్నెటందుకె నేరం" అన్నాడు వెంకటేష్.

"తీసుకోన్రి. యెవరొద్దన్నరు? సర్కారోండ్లు పీకె వుంచుకోని అధిక ఫలసాయం తీసి యివ్వమంటున్నరు!"

"యీ ప్రభుత్వం దోపిడీ ప్రభుత్వం" అన్నాడు వెంకటేష్.

"మార్స్రని. కాదంటున్ననా!" అన్నాడు రంగారెడ్డి.

"యెక్కడికి బయల్దేరావు?" అన్నాడు మోహన్‌రెడ్డి రంగారెడ్డితో.

"యీ సభలు కలర్ ఫుల్‌గ వుంటవని యీ పోగ్రాం జూస్తా అవంగ వస్తున్న. యీ పానపు కంస్లతోటి చూసి జన్మ తరించి పోద మని!"

"ఆ వాళ్ళని వేరే మార్గంగా వుంచుతారు" అని మోహన్‌రెడ్డి చిన్నగా నవ్వాడు.

"ఐతె యేమాయె!" అని భుజానికి వేళ్ళాడుతున్న ఆకుపచ్చ రంగు చేనేతబట్ట సంచిలోంచి బె నాక్యులర్స్ బయటికి కాస్త తీసి చూపెట్టి—నవ్వాడు రంగారెడ్డి.

అక్కడినుంచి విడిపోయి విప్లవ రచయితల సమావేశం కావాల్సిన చోటుకి వెళ్ళారు మోహన్‌రెడ్డి వెంకటేషు.

మరో గంటకి అంతా కలిసి నిరసన ప్రదర్శన యాత్ర ప్రారంభించారు — శ్రీ శ్రీని వెంటబెట్టుకుని.

వాళ్ళు వెడుతూండగా వొకతను వొచ్చి, మోహన్‌రెడ్డిని పక్కకి పిలిచి, "గాయత్రిని పోలీసులు అరెస్టు చేశారు" అని చెప్పాడు.

"దేనికి? యెక్కడ? మాతో బయల్దేరలేదా?" అన్నాడు మోహన్‌రెడ్డి

వివరించటంలోనే ఆ వివరించటం వుపన్యాస ధోరణిలోకి మళ్ళిందట. అప్పుడు పోలీసులొచ్చి అరెస్టు చేశారట."

"ఆ మాత్రానికేనా!"

"అందుకో యెందుకో—అరెస్టయితే అప్పుడు చేశారు."

"సరె నువ్వు వెళ్ళు. యీ పని ముగియాలిగా. ఆ తర్వాత చూద్దాం. యే స్టేషన్లో వుంచినారో తెలుసుకుని వుండు," అని మోహన్‌రెడ్డి వడివడిగా నడిచి ఆ అందరిలో కలిశాడు.

ఆ మీదట....వీళ్ళందర్నీ పోలీసులు అరెస్టు చేశారు.

శ్రీశ్రీతో సహా అందర్నీ విడుదల చెయ్యాలని విరసం నగర శాఖ కన్వీనర్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాడు.

మాజీ విరసులు కూడా నిరసన తెలియ జేశారు.

ఆ తరవాత యెందుకన్నాగానీ, ప్రభుత్వం అందర్నీ విడుదల చేసింది.

ఆస్థానకవి విశ్వనాథకి, యీ సభల్ని సమర్థిస్తూ శ్రీశ్రీ రాశాడని చెబుతున్న లేఖ గురించి వాదోపవాదాలు చర్చలు జవాబులూ సాగుతున్నాయి.

గాయత్రిని వుంచిన పోలీస్‌స్టేషన్ వాళ్ళు, మోహన్‌రెడ్డి గాయత్రి భర్త అని తెలిసి అతనినీ అరెస్టు చేశారు. యిద్దర్నీ వేరు వేరు గదుల్లో ఆ స్టేషన్లోనే వుంచారు.

ఆ విషయం తెలిసిన మోహన్‌రెడ్డి పింతండ్రి, మినిస్టరుగా వున్న వాళ్ళ బంధువు ద్వారానూ — తెలిసిన పాత పోలీసు అధికారి ద్వారాను మోహన్‌రెడ్డిని విడిపించాడు. అంతేకాక గాయత్రిని అరెస్టుచేసి జైలులో పెట్టి వుంచమని చెప్పించాడు. ఆ విషయం మోహన్‌రెడ్డికీ మరెవరికీ తెలియదు.

విడుదలయిన మోహన్‌రెడ్డి బయటికొచ్చి మిత్రులను కలుసుకుంటే —గాయత్రిని విడుదల చెయ్యలేదని చెబితే ఆ పోలీస్ స్టేషన్‌కి వెళ్ళాడు.

కలుసుకోటానికి వీల్లేదన్నారు.

యెందుకు యే సందర్భంలో యే సెక్షన్ కింద అరెస్ట్ చేశారోచెప్ప మని అడిగితే—అవన్నీ నీకు సంజాయిషీ యిచ్చుకోం పొమ్మన్నారు.

గాయత్రి తండ్రి రామనాథం వెడితే, కలుసుకోనిచ్చారు.

యివన్నీ నచ్చకపోయినా; పసిబిడ్డ తల్లి, కన్నకూతురు అని ప్రాణం పీకిన మీదట, భార్య పోరిన మీదటా, వొచ్చాడు. గాయత్రి ఆ గుమ్మం దాటాక వాళ్ళు కలుసుకోవటం యిదే మొదటిసారి.

"మనకి తెలిసిన లాయరు వొకాయన వున్నాడు. మాట్లాడతాను!" అని చిన్నగా అన్నాడు రామనాథం.

"లాయరేం చేస్తాడు పోలీస్టేషను వాళ్ళని?" అంది గాయత్రి

ఆ రాత్రి పొద్దుపోయాక, సబిన్స్పెక్టర్ డ్యూటీ ముగించుకుని వెడుతూ లోనకి వొచ్చి "యేం చిలకా!" అన్నాడు.

తీక్షణంగా చూసింది.

"బంగారు చిలక. పంచదార చిలక. కాకపోతే కారంలో పడింది." అని ఆమె చెయ్యి అందుకున్నాడు.

చాచి లెంపమీద కొట్టింది.

రక్కున అతని చెయ్యి పడిపోయింది గానీ—

కోపంతో వూగిపోతూ—నాలుగు మూడు నంబర్లు అరిచాడు.

ముగ్గురు కనిస్టీబులొచ్చారు.

"దాన్ని రెక్కలు విరిచి పట్టుకోండిరా. దీని బట్టలు పీకేసి—"

కనిస్టీబులు లాక్కోతున్నారు.

"ఆగండిరా కనిష్ఠపు వెధవలూ." అని అరిచింది. కంచులోహానికి ప్రాణమొచ్చి వుగ్రంగా ఐతే యెలావుంటుందో అలా వుంది ఆ గొంతూ రూపమూ.

కనిస్టీబులు జంకారు.

"మీరు నన్నుగానీ ముట్టుకుంటే డిప్యూటీకో కమిష్నరుకో హోం మినిస్టరుకో యేడ్చుకుంటూ మొరెట్టుకుంటాననుకోకండి. నేను—నేనే స్వయంగా ప్రాణాలు తీసేస్తాను" అని అంటూ గుప్పెట బిగిసిన కుడిచెయ్యి పైకెత్తుతూ "కత్తితో పొడిచి చంపుతాను." అంది.

యీ మహావ్యవస్థ కవచం తొడుక్కున్న వాడు కదా యస్సై, పక పకా నవ్వి—తిడుతున్నాడు బూతులు.

పోలీసు బూతులు. అసలానికి అవీ మామ్మూలు బూతులేగానీ పోలీసునోళ్ళ బూతులు వేరు. అవే బూతులు పడకగదిలో సంభోగవేళ ప్రేమపుగా వాడితే వాటికో రాణింపు వొస్తుంది. డ్రాయింగ్రూంలోనో డైనింగ్ హాల్లోనో ఐతే వొకరకం జుగుప్స వొస్తుంది. చదువురాని కార్మిక కర్షకుల్లో అన్ని వేళలా, యెబ్బెట్టులేని ప్రత్యేకం గమనించని వొక రకపు వాడుకతనం వొస్తుంది. పోలీస్టేషనులో పోలీసు నోళ్ళలో వాటికి వో నీచ

త్వం అవమానం కిరాతకం అమానుషం వొస్తాయి — పోలీసు దెబ్బలకి మల్లే.

గాయత్రి వ్యగ్రంగా చూసింది. ఆ ముందే శక్తివంతమైన చూపుల్లో వాళ్ళ శవాల నీడలు కనిపించినట్లయ్యాయి వాళ్ళకి.

"లేదా ఆలోగానే నేను చచ్చిపోతే మరి కొందరి చేతుల్లో చస్తారు. మీరు ప్రాణాలతో బతికుంటారు. ఎస్, ఓ మాన్, ప్రాణంమీద్మఆశలేనివాళ్ళు రండి వొక్కొక్కరే వరసగా — మిమ్మల్నెలా చంపాలో నాకు తెలుసు రండిరా." అంది.

"అసలిది ఆడది కాదురా! లాక్ చెయ్యండి. నో ఫుడ్" అనివెనక్కి తిరిగాడు యస్సై కచ్చగా.

మరసటి రోజు వుదయం మళ్ళీ వెళ్ళాడు మోహన్‌రెడ్డి. యస్సైతో వాదించటం మొదలెట్టాడు—యెందుకు అరెస్టు చేశారు, యేసెక్షనుకింద— అంటూ.

"అయ్యన్నీ చెప్పక్కర్లా."

"మీసా కిందా?"

"మీసానో గీసానో యేదైతే నీకెందుకు?

"నాభార్య."

"భార్యని అదుపులో వుంచుకోవాలి. నీ పెళ్ళాంమీద చాలా కేసులున్నయ్—ప్రోతల్ కేసూ క్రిమినల్ కేసులతోపాటు."

"వచ్చి అబద్ధాలు. మీకు ఆధారాలేమిటి?"

"అయ్యన్నీ కోర్టులో.

"వొక వ్యక్తిని అరెస్టు చేసిన యెంత సమయంలో మెజిస్ట్రేటుదగ్గిర హాజరుపరచాలో రూల్స్ నాకు తెలుసు" అన్నాడు మోహన్‌రెడ్డి.

"రూల్స్ పోలీస్టేషన్లోకాదు. మీ లా కాలేజీలో. అక్కడికిపో."

"నేను గాయత్రితో మాట్లాడాలి."

"వీలు కాదని చెప్పానా? యే టూ నాట్ ఫోర్.

"బాహర్ చలో సాలా" అంటున్నాడు కనిస్టేబు.

ఆ మరసటి రోజున గాయత్రిని కోర్టులో హాజరుపరిచారు, పోలీసులు. నాలుగైదు అపరాధాలకి నాలుగైదుసెక్షన్ల కింద అరెస్టు చేసినట్లు పోలీసు అధికారి వివరించాడు.

విరామం వేళ, గాయత్రిని, తండ్రి రామనాథం కలుసుకున్నాడు. యిష్టంలేక గుర్రుగావున్నా—కన్నబిడ్డ పసిబిడ్డ తల్లి— ప్రాక్ప్రకృతి భార్య కాకిగోల—వొచ్చాడు.

"కోటిలింగం అని మాంచి లీడింగ్ లాయరు — మనకి దూరపు బంధువు అవుతాడులే. అతనికీ పబ్లిక్ ప్రాసిక్యూటర్ కీ యేవో లాలూచీ లున్నాయిట. పబ్లిక్ ప్రాసిక్యూటర్ని కట్టుకుని నెగ్గుకొస్తానని నమ్మకంగా చెప్తున్నాడు—నేను వెళ్ళి కలుసుకోగా. వొప్పుకో తల్లీ." అన్నాడు రామనాథం.

"లాలూచీ నీచం." అంది గాయత్రి నిదానంగా దృఢంగా.

కోర్టులో కేసు వాదన జరుగుతోంది.

"యీ నేరాలే కాదు. తన వయసు కంటే మించిన మానసిక పరిణతి వుంది యీమెకి. యే స్త్రీకీ వుండనంత ధైర్యం వుంది. షి యీజ్ ఎ పొటెన్షియల్ డేంజర్ టుది నేషన్...." అని ప్రారంభించాడు, పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"అమ్మా నీ కేసు వాదించుకోటానికి న్యాయవాది—" అని మెజిస్ట్రేటు అంటూంటే— అడ్డుకుని,

"యీ కుంటీ గుడ్డీ చెవిటీ అవిటీ అన్యాయాలయంలో న్యాయవాదేమిటి నా మొహం!" అని పరిహాసంగా నవ్వింది గాయత్రి.

"కంటెమ్ప్ట్ ఆఫ్ కోర్ట్ —" అంటూ లేచాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"కంటెమ్ప్ట్ ఆఫ్ కోర్ట్ అవటానికి నేను అసలు యీ న్యాయవ్యవస్థనీ యీ సమాజ వ్యవస్థనీ వొప్పుకుంటేగా! యిది కంటెంప్ట్ ఆఫ్ కోర్ట్ కాదు. యిట్ యీజ్ కంటెమ్ప్ట్ ఆఫ్ బగ్స్ అండ్ లీచెస్...."అని గాయత్రి అంటూంటే—

"షీ యీజ్ క్రేజీ, షి షుడ్ నాట్ బి యెలౌడ్ టు స్పీక్ యిన్ది కోర్ట్" అంటూ లేచాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

మరనటి రోజు విరామ సమయంలో, రామనాథం, మోహన్‌రెడ్డి, యిద్దరు విరస మిత్రులు కలుసుకోగలిగారు.

"మళ్ళీ యీ గొడవల్లోకి దిగనని హామీయిస్తే వొదిలేస్తారు. విను." అన్నాడు తండ్రి, రామనాథం.

"నేనేం గొడవల్లోకి దిగలేదు. నేను నా మార్గాన నా గమ్యంవైపు ప్రయాణిస్తున్నా. గొడవలు చేస్తున్నది ఆ రాస్కెల్స్" అంది.

"వినమ్మా బిడ్డ తల్లివి. చిట్టితల్లి అరుణ—" ఆగిపోయాడు రామనాథం.

"అవును బిడ్డతల్లిని. నాక్కా అరుణే కాదు, కోట్లాది అరుణలు. అందరూ నా బిడ్డలే. బిడ్డల తల్లిని నా బిడ్డలందరికోసం" అంది గాయత్రి.

"విప్లవోన్మాదం. షి హ్యాజ్ బికం క్రేజీ. లెట్ హెర్ కూల్‌డౌన్" అన్నాడు వాకతను.

"పోనీ నువ్వు తప్పుకో గాయత్రీ. నువ్వు జైల్లో పడటం నేను సహించలేను. వాళ్ళు బనాయించిన కేసులన్నీ, నేను నామీద వేసుకుని—వొప్పుకున్నట్లుగానూ వొప్పుకోనట్లుగానూ మాట్లాడి—యే శిక్ష వేస్తే ఆ శిక్ష అనుభవిస్తాను" అన్నాడు మోహన్‌రెడ్డి.

విరసం వాళ్ళ లాయర్లలో వొకతను వొచ్చి కేసు వాదించటం ప్రారంభించాడు. అతను విరసంలోనివాడే. డబ్బు తీసుకోకుండా వీళ్ళ కేసులు వాదించటానికి సిద్ధం. ఐతే విరసానికి తెలియకుండా, పోలీసు అధికారుల ప్రాపకమూ జడ్జీల అభిమానమూ సంపాదించటానికి—కేసుల్ని తెలివిగా నీరు కార్చేస్తూ, పైకి చాలా దీక్షగా గట్టిగా అరిచి వాదిస్తూ.

ఆ రోజు రాత్రి ఆ లాయరు విరసంలో కొందరిని సమావేశపరిచాడు—మహాసభల్లో విరసం రచయితలందరూ విడుదలైన సందర్భంగానూ, తనుగాయత్రి కేసు యెంత బాగా లాక్కొస్తున్నదీ వివరించటానికి. మందు పార్టీ.

నింపిన విస్కీ గ్లాసుల చేతులు పైకి లేచాయి.

"గాయత్రి విడుదల కోసం, విజయం కోసం. విడుదలైన రచయితల ఆనందం కోసం" అన్నాడు ఆ లాయరు.

గ్లాసులు తాటించి—పెదాలకి అనించి గుక్క వేశారు.

"మన ప్రముఖ కవులు అందరూ యీ సమయంలో వుంటే బాగుండును." అన్నాడు వొకతను.

"గాయత్రిని విడిపించటానికి మనమంతా పోరాడదాం" అన్నాడు, విజయ్‌కుమార్.

"మోహన్‌రెడ్డికూడా లేడు."

"పిలుద్దామనుకున్నాగానీ—పాపం, ఆతను తాగడుగా!" అన్నాడు ఆ లాయరు జాలిపడుతున్నట్లుగా.

వొక వరుస ఐంది. మళ్ళీ గ్లాసులు నింపారు. పుచ్చుకుంటున్నారు కైపు సమంగా యెక్కింది అప్పటికే.

ఆంధ్రప్రదేశ్ కాకముందు, ఆంధ్రాలో మద్రాసులో ప్రొహిబిషనున్న రోజుల్లో, శ్రీశ్రీ ఆరుద్రలు హైదరాబాద్ వొచ్చిన వొకసారివాళ్ళో వరదరాజేశ్వరరావు, యేల్చూరి సుబ్రహ్మణ్యం తదితరులు కలిసి, వీధుల్లో తిరుగుతూ యెదురుపడ్డ ప్రతి బార్ గుమ్మమూ యెక్కి దిగుతూ తిరిగారనీ, ఆ సందర్భంలో వాళ్ళు యేవేవో అనుకుంటూ పోయారనీ, అలాఅనుకుంటూ పోయినవన్నీ, "మేమే" అని అచ్చువేసినట్లుగ అనుకునే ఆ "మేమే" లోని చరణాలు వల్లిస్తున్నారు, కొందరు—

"నేనుగానీ ఈ శతాబ్దం మొదట్లో శ్రీశ్రీ కంటే ముందు పుట్టివుంటే శ్రీశ్రీ కంటే గొప్పవాణ్ని ఐ పోయుండేవాణ్ని — సిరిసిరిమువ్వలతో" అన్నాడు విజయ్‌కుమార్.

ఆరుద్ర పురుగులం—అన్నాడు వొకతను.

వైతరణి వరదలం—అన్నాడు యింకొకతను.

యెరుపు దిగని సంజలం—అన్నాడు ఆ లాయరు.

యెదిగీ యెదగని లంజలం—అన్నాడు విజయ్‌కుమార్.

మృత్యువు రవికలో పగిలిన పాలబుడ్డీలం— అన్నాడు రఘురాం.

"ఆహాహాహా" అని హాలు దద్దరిల్లేలా నవ్వులు.

ఆ పుస్తకం అంకితపు కందపద్యం వల్లిస్తున్నాడు వొకతను — "యే పీసం కూడా యే నీళ్ళూ యే సోడా కలపని విస్కీ పానాయాసంగా అవుపోసన చేసేశావోయ్ సెభాస్ శ్రీమాన్ యేసూ—అనేఅంకితం మెప్పు పొందిన యేల్చూరి సుబ్రహ్మణ్యం కంటే నేను గొప్పవాణ్ని." అంటూ పొడవాటి విస్కీ సీసా లేపి నోటికి తగిలించుకోబోయాడు.

మరొకతను, "నీ సొంత సీసా ఐతే అట్లాగే లాగించు నువులే."అని పట్టుకుని సీసా దింపించి, "ఆ కందపద్యం, అంత సొంపుగా శ్రీశ్రీయే రాయగలడు. వొక బెత్తెడు తక్కువగా ఆ శ్రీశ్రీఅంత గొప్పవాణ్ని నేను" అని ఆ సీసా నోట కరవబోయాడు.

"నేనే శ్రీశ్రీని" అని వొకతను అన్నాడు, సీసా లాగి బల్లమీద

పెడుతూ.

"ఆహాహాహా" అని నవ్వులు అరుపులు కూతలు.

బయట బిచ్చగాడి ఆర్తనాదం,

"కూడులేని గూడులేని పక్షిగాల భిక్షగాల" అంటూ గ్లాసు పైకెత్తాడు మరొకతను.

# 78

ఫిబ్రవరిలో రామ్మూర్తి థీసిస్ పూర్తిచేసి సబ్‌మిట్ చెయ్యబోతున్న వేళకే అతని తండ్రి పాండురంగశాస్త్రి వుత్తరం రాశాడు వోసారి వీలుచూసుకుని యింటికి వొచ్చి వెళ్ళమని. థీసిస్ పూర్తి ఐంది. త్వరలో వొస్తున్నట్లుగా వుత్తరం రాశాడు రామ్మూర్తి.

థీసిస్ సబ్‌మిట్ చేశాక, రెండు రోజులు వూరంతా కాళ్ళు నొప్పులు పుట్టేదాకా తిరుగుతూ కళ్ళు నొప్పులు పుట్టేదాకా సినిమాలు చూస్తూ గడిపి —హాస్టల్లో కాషన్ డిపాజిట్ డబ్బు తీసేసుకుని సామాను పుచ్చుకుని వూరికి వెళ్ళాడు.

తండ్రి వో పెళ్ళి సంబంధం చూసి వుంచాడు. ఆవివరలో ఒక సంబంధం-వొచ్చిందిగానీ నచ్చలేదు అతని తండ్రికి. అందువల్ల కొడుక్కి కబురు పెట్టలేదు.

అయిదు వేల కట్నం అంటూంటే: మా అబ్బాయి పి హెచ్. డి. చేశాడు. రేపో మాపో లెక్చరర్ గానీ ఆఫీసరు గానీ కాబోతున్నాడని పది వేలదాకా పలికించాడు అతని తండ్రి.

పెళ్ళిచూపులకి వెళ్ళారు. రామ్మూర్తి దొంగ చూపులు చూశాడేగానీ పెళ్ళికూతుర్ని సమంగా చూడలేకపోయాడు బిడియంవల్ల. బాగానే అనిపించింది అతనికి

చామనచాయ, సన్నగా పొడవుగావుంది. పోలికలు బాగా నేవున్నాయి. బాగానే వుంది. ప్రత్యేకించి చెప్పుకోటానికి యేమీలేదు.

యిన్నాళ్ళూ యెలాగో గడిపేశాడుగానీ, యిప్పుడు పెళ్ళి సంబంధం ఖాయమయ్యేసరికి—లోన ఆరాటంగా వుంది రామ్మూర్తికి.

పెళ్ళి బ్రాహ్మడితో వొంటరిగా ప్రసక్తించి, "మరీ దూరంలో ముహూర్తం పెట్టుకుంటే సెలవు వీలుపడదేమో. వుద్యోగం కాబోతోంది. వుద్యోగంలో కొత్తగా చేరాక సెలవు పెట్టడానికి వీలుకాదు. అందువల్ల అర్ధసంవత్సరమైనా ఆగాల్సి వుంటుంది — లేదంటే యిప్పుడే త్వరలో ముహూర్తం వుండి జరిపించినా నాకు అభ్యంతరం లేదు." అన్నాడు రామ్మూర్తి—అన్నాళ్ళూ ఆగరనీ యెలాగోలాగా చేసి త్వరలో జరిపించేస్తారనీ ఆశిస్తూ.

"మీకేం పరవాలేదు. ఆడపెళ్ళివారు యెన్ని చూసుకుని అమర్చుకోవాలి! ముహూర్తానికేం—వొచ్చే నెలలోనే వాహ మంచి ముహూర్తం వుంది. మీ యిరువురి నాయధేయాల రీత్యా కూడా తగిన లగ్నమే అది." అని అన్నాడు పెళ్ళి బ్రాహ్మడు.

వొచ్చిన పదిరోజులకే, సోషల్ వెల్ఫేర్ డిపార్ట్‌మెంటు నుంచి వుద్యోగ నియామకం కాగితం, యూనివర్శిటీ హాస్టలు నుంచి రీడైరక్టయి వొచ్చింది. ట్రయిబల్ వెల్ఫేర్ సెల్‌లో స్పెషల్ అసిస్టెంటు వుద్యోగం.

వెంటనే బెడ్డింగూ సూట్కేసూ చేత పట్టుకుని బస్సెక్కేశాడు. తిన్నగా హాస్టలికెళ్ళి శ్రీపతి గదిలో సామాను పడేసి స్నానించి—ఆఫీసుకి వెళ్ళి జాయినింగ్ రిపోర్టు యిచ్చాడు.

పని పెద్ద కష్టమేం కాదు. పదిన్నరకి వెళ్ళాలి, ఐదువరకూ వుండాలి. యెక్కువ రోజులు హాస్టల్లో గెస్టుగా వుండటమూ కుదరదు. అక్కడినుంచీ రోజూ యింత దూరం రావటమూ కష్టమనిపించి—గదికోసం ప్రయత్నిస్తున్నాడు సాయంత్రం వేళల్లో.

ఆఫీసరు చెప్పిన పని తంచనుగా లక్షణంగా చేసేస్తాడు రామ్మూర్తి. ఐతే ఆ ఆఫీసరుకి కొంచెం తిక్క, కొంచెం పొగరులాంటివి వున్నాయి.

వొకోక్కసారి "యిదేమిటి యిల్లాగేనా? యబ్బీసీకి తెలిసిన మాత్రం తెలీనదూ?" అని గదమాయిస్తాడు.

తను త్వరలో కాబోతున్న డాక్టర్ రామ్మూర్తి— అని గుర్తొచ్చి మరింత కోపంగా అనిపించి, 'యేకొంపవేరా' అని మనసులో అనుకుంటూ, "యస్సర్" అనేస్తాడు.

వొకసారి "సిది 10—ఎ. టెంపొరరీ పోస్టు. వూస్టు చేసేస్తాను అట్లా అయితే" అని వాయించాడు అకారణంగా.

రామ్మూర్తి, "షటప్" అని అన్నాడుగానీ అది గొంతులోనేవుండి పోయి, "సారీ సర్" అనేశాయి పెదాలు.

యెవరన్నా నిబ్బరంగా పరకాయించి తనని చూస్తుంటే అదోలా బిడియపడి పోతాడు.

నెలరోజులైనా గడవకండా పెళ్ళి ముహూర్తం తేదీ వృత్తాంతం వొచ్చింది.

ఆఫీసరుకి చెబితే, "అటు పెళ్ళి వేడుక పెట్టుకుని దీనిలో దేనికి చేరావ్?" అని గదమాయించాడు.

"అప్పటికింకా తెలియదు సార్. ఎక్కువ రోజులు సెలవు అవసరం లేదు సార్. మ్యారేజ్ అవగానే వొచ్చేస్తాను సార్" అన్నాడు రామ్మూర్తి.

"కొత్తగా వుద్యోగంలో చేరాక—పెళ్ళి సెలవు యివ్వడమే కష్టం — మళ్ళీ శోభనానికంటే సాధ్యపడదు. ఆ కార్యం వొచ్చే యేడాదికి పెట్టు కొనేటట్లయితే సరే లేకపోతే పెళ్ళితోపే యేర్పాటుచేసుకోవాల్సి వుంటుంది" అని తెలిసిన వొకతను చెడుతూంటే పెళ్ళి బ్రాహ్మడికి కబురుపెట్టాడు

రామ్మూర్తి ధ్యాస పెళ్ళికంటే శోభనం మీద వుంది. యెందరి పెళ్ళిళ్ళో చూశాడు. పెళ్ళి గురించి తెలిసిందే. మరొకరి శోభనం చూడ వీలు కాదిది. రామ్మూర్తి ధ్యాస అంతా శోభనంమీద వుంది. 'అన్నాళ్ళు ఆగరులే. అదీ పెళ్ళితోటే యేర్పాటు చేసేస్తారు' అని అనుకుంటూ, తియ్యగావూహించు కుంటున్నాడు రకరకాలుగా.

పెళ్ళిరోజు రానూ వొచ్చింది. జరగనూ జరిగింది. ఆ తంతు జరుగు తూంటే రామ్మూర్తి ధ్యానంతా పెళ్ళికూతురిమీదే వుంది. ఆ సందడిలో వీలయినప్పుడల్లా ఆమెని వీలైన చోటల్లా పరిశీలనగా చూస్తున్నాడు. ఆమె పేరు నిర్మల. ఆ రాత్రికే శోభనం. పెళ్ళి తంతు ఎప్పుడు ముగుస్తుందా అని తొందరపడుతున్నాడు.

తొమ్మిదిన్నరకి పెళ్ళి ఘట్టం ముగిసి, పదిన్నరకి శోభనం ప్రక రణంలో పడింది కార్యక్రమం.

గదిలో—రామ్మూర్తి ; ధోవతి జుబ్బా వుత్తరీయం. యెదురు చూస్తున్నాడు. చేతికి వాచీ వుంది. కొత్తది. అత్తవారు కొనిచ్చారు. సెకండ్ల ముల్లు మహా వేగంగా పరుగుతియ్యటమైతే కనిపిస్తోంది గానీ

ఎంతకీ నిమిషాలు గడుస్తున్నట్టే అనిపించటం లేదు.

'యీ సెకండ్ల ముల్లు యాంటీ క్లాక్ వైజ్ తిరుగుతూ వుండి వుండాలి' —అనుకున్నాడు.

అంతలో, నిర్మలని గుమ్మం లోపలికి పంపి, తలుపులు మూశారు. తలుపుల అవతల నవ్వులు. రామ్మూర్తికి వుత్సాహంగా అనిపించింది, ఆ నవ్వులకి.

జరీ అంచు తెల్ల చీర. జరీ అంచున్న తెల్ల బ్లౌజు. జడలో బుట్టెడు పువ్వులు. పక్కమీద ముందే చల్లి వుంచారు.

చేతిలో పాలగ్లాసుతో గుమ్మంలో నిలుచుని వుంది.

పాలగ్లాసు దేనికో అతనికి అర్థమవలేదు.

గర్భధారణకి స్తన్యానికి చిహ్నంగా అని సోషియలాజికల్ రీతిలో ఆలోచించాడు.

అక్కడేనుంచునిపోయిందేంరాదేం—అనుకుని విసుక్కున్నాడులోన.

వొక నిమిషం తరవాత—సిగ్గుపడుతూండాలి, తను వెళ్ళి తీసుకు రావాలి భుజం చుట్టూ చెయ్యి వేసి—అనుకున్నాడు. మంచం కింద కూచుని వున్నవాడల్లా లేచి నిలుచున్నాడు. కాళ్ళు వొణికాయి.

రవంత తడబడుతున్న అడుగులతో వెళ్ళి పక్కన నుంచున్నాడు. భుజం చుట్టూ చెయ్యి వెయ్యాలనుకున్నాడు. "నిర్మలా" అని పిలవాలనుకున్నాడు. కానీ—చెయ్యి లేవనూ లేదు, గొంతు పెగలనూ లేదు.

మరో నిమిషానికి, ఆమె వీపు వెనకగా చెయ్యి వేసి, "నిర్మలా" అన్నాడు.

ఆమె ముందుకు అడుగులు వేసింది.

మంచం అంచుమీద కూచున్నారు యిద్దరూ.

పాలగ్లాసు మంచం పక్కన వున్న స్టూలు మీద పెట్టింది. ఆ స్టూలు మీద వో ప్లేటు. దాన్లో పళ్ళు. తాంబూలాలు.

అగరొత్తులు, రామ్మూర్తి గదిలోకి రాకముందే వెలిగించారు.

భుజాలు పట్టుకుని మంచం మీద పడుకోబెట్టాడు.

వొంగి, ఆమె పెదాల మీద పెదాలు అతికించాడు. జివ్వున హాయిగా లోపల యేదో గుంజినట్టుగా అనిపించింది. మళ్ళీ ముద్దెట్టుకున్నాడు. మళ్ళీ ముద్దెట్టుకున్నాడు.

నిర్మల అలా వెల్లకిలా పడుకునే వుంది.

బ్లౌజుకి పైనుండి పైపైన కొక్కాలేవే. అలాగే ఆమె ముఖంలోకి చూస్తూ కొక్కేలు విప్పేస్తున్నాడు. ఆమె చెయ్యి అడ్డం పెట్టింది అమాంతం.

అంతటితో ఆ పని ఆపి పక్కన పడుకుని చెంపలు ముద్దెట్టుకున్నాడు

రామ్మూర్తికి అలా వాగ నేవుంచిగానీ—యేది చూడటానికీ వీలవటం లేదు. బొమ్మల్లో తప్ప సాక్షాత్తూ మనిషిని తన కళ్ళతో తానుచూసిన అనుభవం లేదు. మనసు ఆరాటపడుతోంది. వుత్సుకత.

తన ముఖం ఆమె ముఖం పక్కగా వుండిపోయింది. తను యెటు జరగటానికి లేకుండా చేత్తో గట్టిగా అల్లుకుపోయింది.

"కాస్త పక్కకి జరుగు నిర్మలా" అన్నాడు.

ఆమె జరగలేదు.

"జరుగూ" అన్నాడు ప్రేమగా.

మరింత దగ్గిరికి జరిగింది. ఆ వొత్తిడికి అతని వొళ్ళంతా కంపించింది.

ఆమె పెదాలు ముద్దెట్టుకున్నాడు, వొళ్ళంతా యేదో జిల్లుమనీ జివ్వుమని పాకినట్లుగా అనిపించింది.

ఆమె మీదకి జరిగాడు.

ఆమె బాధగా చిన్నగ మూలిగినట్లుగా రవ్వంత సవ్వడి. ఆ తరవాత దీర్ఘంగా ఆమె శ్వాస.

యీ రకం తృప్తి యింతకుముందు యింకెందులోనూ కలగలేదు. యిదేదో దీన్లో వుంది అసలు కిటుకు—అనుకున్నాడు.

అంతలో అర్ధాంతరంగా పక్కకి వొరిగిపోయాడు.

రామ్మూర్తికి పట్టరాని ఆరాటంగా వుంది. ఆ ఆరాటంలో, "చెయ్యి తియ్యి" అని అరిచాడు.

జడుసుకున్నట్లుగా తుళ్ళిపడింది నిర్మల. చెయ్యిపట్టుకున్న జరిగింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

నిజమైనా చూసేశాడు రామ్మూర్తి తొలిసారిగా.

చేత్తో పక్కకి జరిపినట్లు కదిపాడు. గిరుక్కున తిరిగి బొక్కబోర్లా పడుకుంది.

రెండు నిమిషాలు,

మళ్ళీ యిటు తిప్పబోతే ఆమె అలా పరుపుకి అతుక్కున్నట్లుగా పడు కుంది.

రెండు నిమిషాలు.

కితకితలు పెట్టాడు. ఆమె అటూ యిటూ కదిలి తిరిగింది. దిండుమీద కన్నీటి తడి. తడికి, గుండ్రదనం కోల్పోయిన తిలకం దొట్టు.

ఆశ్చర్యంగా చూసి, "నిర్మలా యేడుస్తున్నావా? నిన్ను కష్టపెట్టనా? చెప్పు? నీకు కష్టం కలిగే పనేదీ చెయ్యను చెప్పు". అన్నాడు

ఆమె మౌనంగా వుండిపోయింది.

తను వూహించుకున్నవీ, చదివినవీ, యింకా యెన్నో. తాను చెయ్యటమేకాక ఆమె తానుగ చెయ్యాలని వూహించుకుంటున్న రామ్మూర్తి దిగాలు పడిపోయాడు.

"యెందుకని?" అన్నాడు.

ఆమె మౌనంగ వుండిపోయింది.

"నేనంటే యిష్టం లేదా?" అన్నాడు.

తల అడ్డంగా వూపింది నిర్మల.

రామ్మూర్తి గుండె టక్ మంది.

వొక నిమిషానికి కాస్త స్థిమితపడి "నేనంటే యిష్టమేనా?" అన్నాడు.

తల యింతకు ముందులాగే అడ్డంగా వూపింది.

అర్థంకాక "నోటితో చెప్పు" అన్నాడు.

"నాకు సిగ్గేస్తుంది. అట్లా చూడొద్దు" అంది.

సిగ్గుపడుతున్నదనే తట్టలేదు అతనికి.

హాయిగా చిన్నగా నవ్వేసి, "యీమాత్రానికేముంది!" అని, "యెంత సేపూ నేనేనా నువ్వు నన్ను ముద్దెట్టుకో." అన్నాడు.

ఆమె అలాగే వుండిపోతే, "యిష్టంలేదా నన్ను ముద్దుపెట్టుకోవటం?" అన్నాడు.

ఆమెకి యేడుపొచ్చింది.

మళ్ళీ ఆమెని దగ్గిరికి తీసుకున్నాడు. నేనిదవద పేగ నీ తనేం చెయ్యదేం?"—అనుకున్నాడు.

రెండో రాత్రి—

"నువ్వెందుకట్లా చలిమిడి ముద్దలాగా పడివుంటావ్?

రామ్మూర్తి—తను వూహించుకున్న వెన్నో గుర్తొస్తూంటే.

కానీ ఆమెకి ప్రత్యేకం యేమీ తెలియదు. అతనేమన్నా చేస్తుంటే బాగానే అనిపించింది నిర్మలకి. సిగ్గుగా అనిపించింది.

రామ్మూర్తికి విన్నటంత బాగా అనిపించలేదు.

మూడో రాత్రి—

"నువ్వు పల్లెటూరి మొద్దువి. రాచ్చిప్పవి" అన్నాడు కసిగా.

వొంటిన వొక్క నూలుపోగు కూడా లేకండా పీకేశాడు. ఐనా ఆ వొళ్ళు అతనిని రెచ్చగొట్టటం లేదు. ఆ వొంట్లో ఆ శక్తి వున్నట్లనిపించటం లేదు. తన ఆగాటం కొద్దీ తనేదో తిప్పలు పడటం తప్ప—ఆ వొళ్ళు తనని ముంచెత్తెయ్యాలనీ యేదేదో వూహించుకునే రామ్మూర్తికి మండుకొచ్చింది—దీనితో జన్మంతా గడపాలి కాబోలు—అనుకుని.

మరింత ప్రయత్నించాడు—ఆమెని కదల్చటానికి. ఆ వొంట్లోనూ మనసులోనూ ఆ యిదేం కనిపించలేదతనికి.

[illegible] తేలిపోతూ అమాంతం నేల మీదపడి కాలిబాటన కాళ్ళీడ్చుకుంటూ పోతున్నట్లుగా అనిపించింది, రామ్మూర్తికి.

రామ్మూర్తికి; వెళ్ళిన వెంటనే యిల్లు చూసి వుంచమని యిరుపక్షాల పెద్దలూ చెప్పారు.

గదికోసం యెలాగూ తిరుగుతూనే వున్నాడు. యిప్పుడు అనుకోకండా మూడు గదుల వాటా వొకటి దొరికింది. ఆమాటే రాశాడు యింటికి. రామ్మూర్తికి వొంటరిగా పడుకుంటే బాగాలేదు. యేదో వొత్తిడి తీర్చుకోవాల్సింది యిబ్బంది పెడుతున్నట్లుగా అనిపించింది. కానీ వూహాలు, వుద్రేకాలూ, పొంగులూ, రంగులు లేవు.

ఫలానా రోజు మంచిరోజు మీ మామగారు అత్తగారు అమ్మాయిని కాపరానికి తీసుకుని వొస్తున్నారని తండ్రి రాశాడు.

స్టేషనుకి వెళ్ళాడు. బోలెడు సామాను. రెండు మంచాలు, పాత్రసామగ్రి గోనసంచులు, బుట్టలు, మూటలు. 'పార్సెల్ చెయ్యకూడదూ' —అనుకున్నాడు అన్నీ అలా చూస్తే చిరాగ్గా అనిపించింది రామ్మూర్తికి. పెళ్ళాం వొంక చూస్తే—ఆ చీరకట్టూ తీరూ—చప్పగా అనిపించింది.

అత్తమామలు వారం రోజులుండి అన్నీ అమర్చి వెళ్ళారు. గ్యాసు స్టౌ కూడా పట్టుకొచ్చారు. యెప్పుడో కొని వుంచారట కూతురికోసం. పాత్ర

సామగ్రి—స్టీలుది సమంగానే వుంది. మంచం వొకటి చాలా బావుంది. రెండోది చిన్న మంచం. నిర్మలకంటె వాళ్ళే నయం అనుకున్నాడు.

వారం రోజులు గడిచాయి. వారం రాత్రులూ గడిచాయి. అతను వూహించుకున్నంత యిదిగా వుండటం లేదు. కొత్త చిరాగ్గా అనిపిస్తోంది.

వొక రోజున, "పలెటూరి మొద్దులాగా అట్లా చీర బిగదీసి అంత పైకి కట్టుకుంటావేం. కిందకి కట్టుకో అందరిలాగా. వూరంతా తిప్పి చూపెడతాను. కళ్ళు లేవూ? గమనించలా?" అన్నాడు,

ఆ మరసటి రోజు సినిమా ప్రోగ్రాం అనుకున్నారు.

బయల్దేరారు. హాలుదగ్గిర వొకరిద్దరు నిర్మల పొట్టకేసి చూస్తున్నారు—చూపు ఆమె బొడ్డులో గుచ్చి.

రామ్మూర్తి గిలగిల్లాడిపోయాడు. నిర్మలమీద మండుకొచ్చింది.

ఆమె పవిట పొట్ట మీదనే వుంది, పక్కనుంచి బొడ్డు కనిపిస్తుంది—ప్రత్యేకించి శ్రద్ధగా చూసేవాళ్ళకి.

సినిమా నుంచి యింటికొచ్చాక, "సిగ్గులేదూ. అట్లా బొడ్డూ గిడ్డూ మగాళ్ళకి చూపెట్టుకుంటూ తిరగటానికి?" అని కసిరాడు.

నిర్మల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"యెందుకేడుస్తావ్? ప్రతిదానికీ యేడుపొకటి. అందరూ పుట్టగానే యేడుస్తారు. నువ్వు కడుపులోనే యేడుపు మొదలెట్టివుంటావు." అన్నాడు.

రామ్మూర్తి జీవితంలో పైకి యెడాపెడా యేదంటే అది అనగలిగింది యీ నిర్మలనొక్కదాన్ని. తాళికట్టించుకుని నోరెత్తలేని రాని, అతి సాత్వికంగా కనపించే నిర్మలని.

వొకసారి తీక్షణంగా చూసి వొక చురక అంటించివుంటే, రామ్మూర్తి మళ్ళీ అలా ప్రవర్తించలేడని నిర్మలకి యీ జన్మకి స్ఫురించకపోవొచ్చు.

"మాట్లాడవేం?" అని కసిరాడు.

"మీరే చెప్పారుగా అట్లా కట్టుకోమని" అంది భయంభయంగా, వినిపించీ వినిపించనంత నెమ్మదిగా.

"యింట్లో కట్టుకోవాలి అట్లా. బయట జనమందరికీ బట్టవిప్పుకుని చూపెట్టుకోమన్నానా?" అన్నాడు.

పదిరోజులకే—ఆమె రూపం, అవయవాలు—యేవీ అతని దృష్టిని ఆకర్షించటం లేదు. రెచ్చగొట్టటం ఆదిలోనే జరగలేదు.

రోజులు గడుస్తున్నాయి.

రాత్రిపూట, ఆమెని సమీపించేముందు— పొంకంగా బింకంగావుండి కవ్వించే రెచ్చగొట్టే అవయవాల చూపుల రకరకాలబొమ్మలు, రకరకాలభంగిమల్లోవున్నవి— అలాంటి పుస్తకాలు కాసేపు చూస్తున్నాడు.

రామ్మూర్తికి నిర్మలకూడా ఆఫీసరు లాగానే అనిపిస్తోంది. వొక్కచేతేడా. అక్కడ, తను—చివాట్లు తింటాడు. యిక్కడ చివాట్లు పెడతాడు.

ఆఫీసరు మగదుస్తులేసుకుని తనని వాయిస్తాడు. తను నోరెత్తకుండా పడివుంటాడు. నోరెత్తటం రాదు. నోరెత్తలేడు. నిర్మల ఆడదుస్తులేసుకుని, తను వాయిస్తే నోరెత్తకుండా పడివుంటుంది. నోరెత్తటం రాదు. నోరెత్త లేదు. యీ యిద్దరూ వొక్కలాగే అనిపిస్తున్నారు. తన జీవితంకూడా అలాగే అనిపిస్తోంది.

నిర్మలకి అప్పుడే నెలతప్పింది. అని నిర్మలకి అంత స్పష్టంగా విభజనగా తెలియదు. రామ్మూర్తికి ఆ గమనింపు లేదు.

రామ్మూర్తికి తన జీవితం— గంతలూ లేవు గానుగా లేదుగానీ— గానుగెద్దు జీవితంలా అనిపిస్తోంది.

అంతలో ఆ వుద్యోగం వూడింది. యిళ్ళకి వుత్తరాలు రాశారు అలా అని. ఆమె తండ్రి, రెండు వేల రూపాయలకి డిమాండు డ్రాఫ్టు పంపించాడు—వుద్యోగం లేదని యిదవకండి, యేదొకటి ఆదే వొస్తుంది మళ్ళీ— అని. అతని తండ్రి, నెలనెలా కొంత పంపుతూంటాను. పోస్టు డాక్టొరల్ ఫెలోషిప్ వొస్తుందేమో ప్రయత్నించు—అని రాశాడు.

"దరిద్ర జాతకం దానివి నువ్వొచ్చావు వుద్యోగం వూడింది." అని తిట్టాడు.

ఆమెకి యేడుపొచ్చింది. యేడిస్తే యేడ్చినందుకు తిడతాడు అందుకని ఆపుకుని చాటుగా యేడుస్తోంది.

"నాతో పెళ్ళి అనుకున్నాకేగా యీ వుద్యోగం వొచ్చింది. యిన్నాళ్ళైనా వుంది నా అదృష్ట జాతకం వల్ల. లేకపోతే మీకు యేదీ రాకపోను." అని అనటం రాదు నిర్మలకి.

మళ్ళీ నిర్మల కావాలి. యెవరివైపూ ఆసక్తిగా చూడకూడదు తన వొంకే చూడాలి. తనంటేనే యిష్టపడాలి. తను లేకపోతే ఆమె బ్రతకలేదు— అన్నట్టుగా వుండాలి.

నిర్మల కావాలి. తను జీవించే తను తృణీకరించలేని సమాజానికి నిర్మల చిహ్నం. కాగా, వొక ప్రాథమికపు బొత్తిడి తీర్చుకోటానికైనా నిర్మల కావాలి.

రామ్మూర్తికి నిర్మల చాలా చప్పగా వుంది. తన జీవితం కూడా చాలా చప్పగా వుంది.

నలుగురు పిల్లలు పుట్టుకొస్తే కాస్త వుప్పదనంగాకూడా వుంటుంది.

# 79

వుూళ్ళో యెగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో జయప్రకాష్ నారాయణ్ సభ యేర్పాటైంది. చాలాకాలం తరవాత అతని సభ యీ వూళ్ళో. అదీ, యిటీవల రాజకీయ పరిస్థితులు—ముఖ్యంగా వుత్తర భారత ప్రాంతంలో జరుగుతున్న ఆందోళనోద్యమాల దృష్ట్యా ఆ వుద్యమాలకి రథసారథిగా వున్న దేశ రాజకీయ కురువృద్ధ నాయకుడు—అందునా యిన్నాళ్ళు అస్త్ర సన్యాసం చేసి యీనాడు రంగంలోకి దిగటం వొక ప్రత్యేకత. ప్రజాబాహుళ్యం కదిలిరావటం మరో ప్రత్యేకత. అతను వుద్యమం ప్రారంభించినంత మాత్రాన, ప్రజాబాహుళ్యం కదిలివొస్తుందా? తెరమరుగున పడిపోయిన యీ ముసిలాయన యిప్పుడు బయటికొస్తే, యెవరు పట్టించుకుంటారనలుకి? అందుకు తగిన కారణాలు, పరిస్థితులు వుండబట్టే అతనికి ఆ ప్రాముఖ్యం వొచ్చి వుండాలి. పరిస్థితి అలాంటిది కాబట్టే అసలు దిగాడు. యిలాంటి ప్రశ్నలతో మీమాంసతో నలుగురూ అనుకుంటున్నారు.

వుస్మానియా నుంచి దయానందభారతి కులశేఖరరావు వేదపారాయణ నిరంజనరావు శ్రీపతి గుర్లింగం తదితరులు మూడు నాలుగు వందల విద్యార్థులు బయల్దేరారు. జె. పి సభకిగాను, ఆర్టీసీ వాళ్ళని అడిగితేనో యేమో అదనంగా బస్సులు వేశారు.

బస్సులు ఖాళీగా వొస్తున్నాయి సిటీలోంచి. వొస్తూనే విద్యార్థులు చొరబడుతున్నారు. బస్సులు వెళ్ళిపోతున్నాయి వెంటవెంటనే.

వొక బస్సులో ; టిక్కెట్లు కొనం—అని మొరాయించారు విద్యార్థులు పదిమంది. కొనకూడదంటే కొనకూడదన్నారు యిరవైమంది

డ్రైవరు బస్సు ఆపేశాడు. అందులో యెక్కువగా జనసంఘ్ అభిమాను లున్నారు. దయానందభారతి తదితరులున్నారు.

"యిది మనం యేదైనా వుద్యమం ప్రారంభించిన సందర్భమైనాకాదు —వుత్తరాన ప్రారంభమైంది. యింకా దిగువకి వొచ్చి దక్షిణాదినకూడా ముమ్మరంగా ప్రారంభమయ్యే సమయం రాలేదు. మనం వెళ్తున్నది వొక మహానాయకుడు వొక మహా మనీషి వుపన్యాసం వినటానికి. దయచేసి టిక్కెట్లు కొనండి. లేదంటే మీరు మన్నిస్తే అందరికీ టిక్కెటు నేనుతీసు కుంటాను." అని హిందీలో విజ్ఞప్తి చేశాడు దయానందభారతి.

వీడెక్కడ దొరికాడు?—అని వొకరు, జిడ్డుగ డు— అని వొకరు, కేంపస్ జె పీ— అని వొకరు, జూనియర్ వాజ్‌పేయ్—అని వొకరు అంటున్నా ; అందరూ టిక్కెట్లకి డబ్బులు తీశారు. బస్సు కదిలింది.

శ్రీపతి చొరబడిన బస్సులో నిరంజనరావు, గుర్లింగం తదితరులు వున్నారు.

కోఠీలో దిగి నడుస్తున్నారు. కోఠీ మూలమీద పాత పత్రికలు అమ్మే చోట—వొకక్షణం శ్రీపతి ఆగబోతే—"యిప్పుడేం పుస్తకాలు పదవయ్యా బాబూ" అన్నాడు నిరంజనరావు—అంటూ వొక దినమొల బొమ్మ వున్న పుస్తకం వొంక చూస్తున్నాడు. ఆ పక్కనే రాధాక్రిష్ణన్ బొమ్మ వున్న పుస్తకం వుంది—పత్రికలాంటిది, వెడల్పాటిది. ఆ మొన్న అతను చని పోయిన సందర్భంలోది.

"మీ రాధాకిష్నన్ ఫిలాస్‌ఫర్‌కి మన కేంపస్‌లో వొక స్టేట్యూ పెట్ట మని అడగరాదూ?" అన్నాడు గుర్లింగం, శ్రీపతితో.

"మా ఫిలాసఫరేంటి?" అన్నాడు శ్రీపతి.

"నీది ఫిలాసఫీగా—"

"నాది ఫిలాసఫీ కాదు. యేదీకాదు. చదివి వొదిలేసెయ్యటమే అంత టితో సరి." అని, "ఐనా రాధాక్రిష్ణన్ యేమంత చెప్పుకో తగిన ఫిలాస ఫర్ కాదు" అన్నాడు శ్రీపతి.

చుట్టూవున్న అయిదారుగురు ఆశ్చర్యంగా చూశారు.

"అదెట్లా? వొరల్డ్ ఫేమస్ ఫిలాసఫర్ కదా" అన్నాడు గుర్లింగం.

"యూనివర్శిటీ పంతులు. వైస్‌చాన్సలర్. మంచి స్కాలర్. భార తీయ దర్శన గ్రంథాలు బాగా చదివినవాడు. పెడాన్టిక్— వక్త. యెంబాసి

దర్‌గా పైకి ప్రాకాడు. వైస్‌ప్రెసిడెంటు మెట్టు యెక్కాడు. ప్రెసిడెంటు సింహాసనం అధిష్ఠించాడు, అలాంటి వున్నతరాజకీయస్థితిలోని వారిప్రాపకం కోసం గొప్పతత్వవేత్తఅంటూ వందిమాగధగీతాలు వొంగ్రపెట్టడంప్రారభిం చారు. ఆయన సొంత సిద్ధాంతం—కపిలుడికో కణాదుడికో — వుపనిష త్కారుల కున్నట్లు, శంకరాచార్యుడి కున్నట్లు ప్లేటోకో కాంట్‌కో హెగిల్‌కో హెడెగ్గర్‌కో—అలా యెందరికో వున్నట్లు—తన సొంత తత్వశాస్త్రం— మెటఫిజిక్సో, యెపిస్టమాలజీనో, యీస్థటిక్సో, పోలటిక్సో మరొకటో వుండాలి. ఆయన సొంతం అని చెప్పతగింది, చెప్పుకోతగినదేం లేదు. గొప్ప స్కాలర్. ఫిలాసఫీ గురించి పుస్తకాలు రాశాడు. ఫిలాసఫీ చరిత్ర రాశాడు. వ్యాఖ్యానాలు రాశాడు. సొంతంగా చెప్పిందేం లేదు. ప్రపంచంలోని సవాలక్ష తత్వ మహాచార్యులలో ఆయనా వొకడు. మత సంబంధంగా వో పిసరంత సొంతంగా వుంటే వుందేమో. యింకో యాభై యేళ్ళు పోయాక ఫిలాసఫీలో వొక స్కాలర్‌గా బహుగ్రంథ కర్తగా మిగులుతాడు. ఆల్‌బర్ట్ ఐన్‌స్టీన్‌ని యిస్రాయిల్ దేశపు ప్రెసిడెంటు పదవిని అధిష్ఠించమని అర్థించి ఆహ్వానిస్తే చిరునవ్వుతో తిరస్కరించాడు.” అని శ్రీపతి వాళ్ళ మొహాలు చూసి, ‘బుద్ధిలేని తనంగా యెందుకీ సోది చెప్పాను వీళ్ళకి! పాపం, వాళ్ళ మొహాలు, జాలేస్తోంది, చూస్తోంటే— ఐనా కదలకుండా నుంచున్నందుకు అందరికీ టీ యిప్పించుతాను—ప్రత్యేకంగా—మీటింగు తరవాత.’ అని అనుకుని, కదిలాడు—శ్రీపతి.

శ్రీపతి, యెప్పుడో పొరపాట్న సుదీర్ఘంగా మాట్లాడతాడు. సాధా రణంగా, యెలాంటి విషయాన్నీ వొక ముక్కలో వరికేసో విరిచేసో మెరిపించో జార్చేసో చెణికో క్షణంలో ముగిస్తాడు. అందుకేనేమో శ్రీపతి మాటలంటే చాలామంది యిష్టపడతారు.

సభా ప్రాంగణంలో జనసందోహం.

ఆడవాళ్ళు యెక్కువగా వున్న వైపుల, ఆంకినీడు మరి నలుగురితో గిరగిరా తిరుగుతున్నారు. చూసి, ‘వీడింకా యీ చీదర తిరుగుడు మానలేద న్నమాట!’ అనుకున్నాడు శ్రీపతి.

అటునుంచి తన జట్టుతో వొస్తూ దయానందభారతి, “హలో శ్రీపతి జర్నలిస్టుని....ప్రసంగంలోని సూక్ష్మమర్మాలు గ్రహించి వుంచుకుంటావని తలుస్తాను.” అన్నాడు హిందీలో.

"జర్నలిస్ట్ నికాదు. యిప్పుడు జర్నలిజం చదువుతున్నాను. అదీ ఐపోవొచ్చింది. యింతకుముందు అవీయివీ చదివినట్లుగా." అన్నాడు శ్రీపతి. అని, అక్కడే స్థిరంగా నుంచుని, చూపుడువేలు కణుపుతో పెదవిపైదవొత్తు కుంటూ అంతా పరిశీలనగా చూస్తున్నాడు.

దయానందభారతి ముందుకు నడిచాడు. చుట్టూ పదిమంది జనసంఘీ. యులున్నారు. వెళ్ళి వో ముగ్గురు జనసంఘ లీడర్లని కలుసుకున్నాడు. వీళ్ళని పరిచయం చేశాడు.

వాళ్ళ దగ్గిర మొరార్జీ నిరవధిక నిరాహార గ్రత ప్రస క్తి వొచ్చింది.

"యిట్ యీజ్ హై టైం దట్ ఆల్ నాన్ కమ్యూనిస్ట్ అపోజిషన్ పార్టీస్ షుడ్ యునైట్—అని జె పి గారు అంటున్నారట" అన్నాడు, వొక ఆంధ్ర ప్రాంతపు జనసంఘ నాయకుడు.

"గుజరాత్‌లో యిందిరమ్మకి మంచినీళ్ళు కూడా పుట్టకండా చేశాడు మొరార్జీభాయ్. ప్రజలంతా ఆయన వెనక వున్నారు. నిస్వార్థ వృద్ధ నాయకుడు. అన్యాయంగా కిందకి నెట్టేసింది యిందిర" అన్నాడు వొకతను హిందీలో.

"నేను కాషాయం బట్టల సన్యాసినేగానీ నా కొడుకు దొమ్మరి గుడిశల్లో దూరతాడన్నట్లు—తనయుడు కాంతిభాయ్ సంగతేమిటి!" అన్నాడు వొక జనసంఘీయుడు.

"అది వేరే అంశం. యీ పరిస్థితుల్లో అనవసరం. అదుగో కార్యక్రమం మొదలవుతోంది. జయప్రకాష్‌జీ యేం చెప్తాడో విందాం." అన్నాడు వొకతను.

సభ—ప్రారంభమైంది ; ముగిసింది.

జనం గుంపులు గుంపులుగా విడివిడిగా, తోసుకుంటూ తప్పుకుంటూ తిరుగుముఖం పట్టారు

"టోటల్ రెవల్యూషన్ అంటున్నాడే జే. పీ. రెవల్యూషన్ —పావు రెవల్యూషనూ అర రెవల్యూషనూ వుంటదా? రెవల్యూషనంటే? సర్వోదయం కూడా రెవల్యూషనే అనగలడు!" అన్నాడు మోహన్‌రెడ్డి.

"రాడికల్ ఛేంజ్ అంటున్నాడు. రాడికల్ అంటే యేమిటని—జ్ఞానోదయం వంటి మానసిక పరివర్తన కాబోలు వినోబా యీడనే పోచంపల్లిలోనే గదా మొదలెట్టినాడు భూదాన యజ్ఞమంటూ. వాళ్ళది కాని భూమ్ని

అసలు యీభూమ్మీదలేని భూమిహృదయ పరివర్తనం పేరుతో దానంచేసినారు భూస్వాములు" అన్నాడు సుబ్బారెడ్డి.

"యింతకీ రాడికల్ అంటే యేమిటి?" అన్నాడు శ్రీపతి చిన్నగా.

శ్రీపతి అలా యేదన్నా చిన్నగా అడిగితే, చమత్కారంగా దెబ్బతీసి భుజంమీద ఆప్యాయంగ చెయ్యేసి తట్టటానికే అన్న అనుభవం బాగావున్న వాడు, సుబ్బారెడ్డి.

"యీ కాంటెక్స్టులో వేరే మీనింగ్—" అని సుబ్బారెడ్డి తప్పుకో బోతుంటే ; వెంకటేష్ అందుకుని, "రాడికల్ అంటె రెవల్యూషనరీ నాన్ –కన్‌ఫార్‌మిస్ట్, నాన్ కన్‌వెన్షనల్, నాన్—ఫేసిక్, ఫియర్‌లెస్‌నెస్ రేదర్ ఫెరోషియస్" అన్నాడు.

"ఫెరోషియస్‌నెస్ రెవల్యూషనరీ తనం కాదనుకుంటాను. రాడికల్ అంటేవన్ హూ గోస్ టుది రూట్స్ అనిఅర్థం అని విన్నాను—అంటేరాడికల్ అంటేతీసుకున్న అంశపుమూలతత్వంలోకివెళ్ళిలోలోతుగానిశితంగా సమగ్రంగా గమనించి గ్రహించి—దాన్ని నిర్భయంగా చెప్పి ఆచరించగలవాడని చెప్పగా విన్నాను. మీకంతా రాడికల్స్ మీకు తెలియాలి అందుగురించి బాగా. నాదేదో వినికిడి జ్ఞానం" అన్నాడు శ్రీపతి.

సుబ్బారెడ్డి విషయం తప్పిస్తూ, "శ్రీపతీ లాస్ట్‌వీక్‌లో నీ కోసం వచ్చినా, యాడికో పోయినావట. బోంబేకా?" అన్నాడు.

"పూణేకి. అక్కడ దిలీప్‌కుమార్‌రాయ్ ఆశ్రమం వుంది—" అని శ్రీపతి అంటూంటే మధ్యలోఅందుకుని, "బాబాల మంత్రాలకు చింతకాయలు రాలవు." అన్నాడు సుధీర్.

"చింతకాయలు మంత్రాలు చదివినా రాలవు. కత్తులు ఝళిపించినా రాలవు. కొంకికర్రతోనో, చెట్టెక్కో కోయాలి. బాగా పండితే మాత్రం అవే రాలిపడతాయి. మరీ బాగా పండిపోతే, బుగిలిపోతే—సిద్ధాంతాలైనా రాలి పోక తప్పదు. అది ప్రకృత ధర్మం—" అని శ్రీపతి మొదలెడితే—

"యేదో పూనాఆశ్రమం అంటున్నావు" అని మళ్ళించాడు సుబ్బారెడ్డి.

"ఆఁ—ఆ పూణేఆశ్రమంలో దిలీప్‌కుమార్‌రాయ్ యిందిరాదేవి అని వున్నారు. పూర్వాశ్రమంలో ఆ యిందిరాదేవి వొక యువ జమీందారుభార్య. వయసులోనే వుంది. యీ దిలీప్‌కుమార్‌రాయ్ ఆవిడకో యేదో గ్రంథం పాగించాక పీకలమీదకొచ్చి — యిద్దరు కలిసి ప్రేమించి భాగమైన పొందిచేసికి

చెక్కేసారు. అక్కడ ఆ జోడుకి యేదో జ్ఞానోదయం ఐందట • ఆ దరి మిలా యీ ఆశ్రమం నెలకొల్పారు. క్రిష్ణ భక్తి పారవశ్యంతో పాడుతూ చిందులేస్తారు రోజూ. వీళ్ళ అనుచర భక్త శిష్యులూ వున్నారు. వొకో్క శుభఘడియన శ్రీక్రిష్ణుడు—బాలశ్రీక్రిష్ణుడట—లేకపోతె మానం మీద ఛాయపడుతుందనో యేమో — వొచ్చి ఆమెని స్పృశిస్తాడట. అంతట ఆ రోజున ఆమె వొంటి నుంచి గొప్ప పరిమళం వెలువడుతుందిట. అదేదో చూదామని వెళ్ళి అక్కడ మఖాం వేశాను, ఆ శుభ గడియ కోసం. వొక రోజున—పగలో రాత్రో సరిగా గుర్తులేదు. ఆమె శయ్యా గృహంలో వుండగా వొచ్చి పరామర్శించాడట. వొంటినే ఐవుంటుంది. లేకపోతే పరి మళం వొంటికెలా అంటుతుంది అప్పుడు ఆమె దగ్గిరికివెళ్ళి అడిగాను—"

"ముసలిదా?"

"కాదు, వయసుదీ కాదు. వయసు మళ్ళని వేళమించిపోని వయసు!" అని నవ్వి, "ఆమెను అడిగాను—ఆ పరిమళం గురించి. కొద్దిగా నాకూ తెలుస్తోంది ఆ పరిమళం పీలుస్తోంటే. చెయ్యి జాపి, "తాకు బాబూ." అంది. ముంజేతిపైద వేళ్ళు ఆనించాను. తాకిన నా వేళ్ళని ముక్కుదగ్గిర పెట్టు కుంటే అదో చక్కని వింత పరిమళం. చెయ్యికడుక్కున్నా, స్నానించినా— రెండు రోజుల వరకు వుండిపోయింది వేళ్ళకి ఆ పరిమళం."

"ఆదేదో బూటకమ్. నిన్నేదో భ్రమలో పడేసి వుంటుంది" అన్నాడు సుధీర్.

"భ్రమ ఐతే సంతోషిద్దును. భ్రమకంటే మించిన ఆనందం యేం వుంటుంది!"

"వూఁ—ఆ ముచ్చటేమైందో చెప్పు."

"యింకేం లేదు. ఆ పరిమళం నిజం" అన్నాడు శ్రీపతి.

"వొంటికి పూసుకుందేమో."

"అలాంటి పరిమళమూ కాదు. నేను భూమ్మీద చాలా పరిమళాలు చూశాను. పూసుకున్నదీ కాదు."

"ఐతే దివ్యమహిమ అని నమ్ముతావా" అన్నాడు సుధీర్.

"దివ్య మహిమల గురించి నాకేం తెలియదు గానీ—వెనక రచయిత శరత్‌బాబు వుత్తరాల పుస్తకంలో చదివిన గుర్తు— యీ దిలీప్‌కుమార్ రాయీ తనూ, యేవో వనమూలికలుంటాయనీ అవి వొక పద్ధతిలో తింటే

వొంట్లోంచి పరిమళాలు వొచ్చే వీలుంటుదనీ, అవి యెవరో వొక సిద్ధుడికి తెలుసట అనీ, ఆ సిద్ధుడి ఆచూకీ తెలియటం లేదనీ—వున్న ప్రసక్తి ఆ మూలికలేవో యీదిలీప్‌కుమార్‌రాయ్,అప్పటి కుర్రదిలీప్‌కుమార్‌రాయ్ సంపాదించి అప్పటి ఆ యిందిర గుంటకి తినిపించి వుండొచ్చు—"

"దిస్ యీజ్ క్లోజర్ టు ది సైంటిఫిక్" అన్నాడు వెంకటేష్ సంతృప్తిగా.

"సైంటిఫిక్ మహా స్లిప్పరీ. బొత్తిగా విలికడ లేకండా పోతోంది. సైంటిఫిక్‌కి క్లోజర్‌గా లేనిదంతా కొట్టిపారెయ్యక్కర్లేదు. కొన్నాళ్ళకి సైంటిఫికే అలాంటి దానికి క్లోజర్‌గా వెళ్ళొచ్చు. ఇటీవలి రష్యన్ సైన్సు పరిశోధనల్లో సగభాగం పెరా....యెంపిరికల్, పెరా—యిండక్టివ్ రీతిలో సాగుతోంది—" అంటున్నాడు శ్రీపతి.

అటునుంచి వొస్తున్న గ్నానేష్వర్. "హలో కామ్రేడ్స్." అని శ్రీపతి వొంక చూసి, "నువ్వు కాదులే" అన్నాడు.

"నేను కామ్రేడ్‌ని కాదని నేనెప్పుడూ అనలేదే!" అన్నాడు శ్రీపతి.

"అట్లకాదు. కామ్రేడ్ అంటె ఫ్రండ్ అని గూడనట గద! ఆ మీనింగ్‌ల కాదు! వాళ్ళోలె." అన్నాడు గ్నానేష్వర్.

"వాళ్ళు నాలాంటి నీలాంటి మనలాంటి వాళ్ళే. నీ పేరు గ్నానేష్వర్. నా పేరు శ్రీపతి. వాళ్ళ పేరు మరొకటి. అంతా మట్టిలో కలిపేదే. అందుకే సినిమా మట్టిలో కలిస్తే పోదూ గ్నానేష్వర్! యే సినిమాకి?" అని నవ్వాడు శ్రీపతి.

"శ్రీపతీ నువ్వంటే నాకు యిందుకోసమే చాలా యిష్టం" అని యింగ్లీషులో అని, "యిష్క్ యిష్క్ యిష్క్—కి పోదమనుకుంటున్న—దేవ్ జీనత్ ఉన్నరు" అన్నాడు గ్నానేష్వర్.

"ముసలోడికి దసరా పండగన్నట్లు ఆ దేవానంద్‌కి ఆ కుర్రగుంట దొరికితే వాళ్ళేదో గొడవ పడుతున్నారు. నీకేం ప్రేమ గొడవొయ్ గ్నానేష్వర్, రేపో యెల్లుండో మీవాళ్ళు చూసిన వో కనక గజలక్ష్మిని లక్షణంగా సంతోషంగా పెళ్ళాడబోయేవాడికి!" అన్నాడు శ్రీపతి.

ఆ దగ్గర్లో కనిపించిన యిరానీ హోటల్లోకి వెళ్ళారు అందరూ. బన్ను తిని టీ తాగారు. యెవరి బిల్లు వాళ్ళే యిచ్చుకున్నారు.

అందరూ సినిమాలకి సిద్ధమయ్యా

వడ్డెర చండీదాస్

మోహన్‌రెడ్డి యింటికి వెడతానని వెళ్ళాడు. గాయత్రిని రెండు రోజుల క్రితం దాకా జెయిల్లోనే వుంచారు. వొంట్లో బాగా లేదు. అందుకే, యీ సభకి ఆమె రానిది కూడా.

విజయ్‌కుమార్ "జీవనజ్యోతి" సినిమాకి తయారయ్యాడు. మరో యిద్దరు.

వెంకటేష్ సుధీర్‌లు అమితాబ్ సైరాబానుల జమీర్‌కి తయారయ్యారు.

"మరి నువ్వో సినిమాకేనా?" అన్నాడు సుబ్బారెడ్డి శ్రీపతిని.

"నేను వొకటే అరా సినిమాలు చూడను. అన్ని రంగుల సినిమా చూస్తాను—అప్నే రంగ్ హజార్." అన్నాడు శ్రీపతి.

అప్నే రంగ్ హజార్ సినిమాలో లీనా చందావార్కర్ సంజీవ్ కుమార్‌లు వున్నారు.

"యింటి దగ్గర పనుండాది" అని నడక సాగించాడు సుబ్బారెడ్డి

యీ నైట్‌కి లేట్ అవుతుందనీ తనకి వంట చెయ్యొద్దని యింట్లో చెప్పి వొచ్చాడు, సుబ్బారెడ్డి.

ఆబిడ్స్ దగ్గిర చైనీస్ రెస్టారెంట్‌కి వెళ్ళాడు. గంటసేపు—పద్దెనిమిది రూపాయల బిల్లు. యిరవై రూపాయల నోటు బిల్లు పళ్ళెరంలో వొదిలి, బేరర్ సెల్యూట్ అందుకుని బయటికొచ్చాడు. తన స్కూటర్ ఆ పక్కనే వున్న తాజ్‌లో వొదిలి వెళ్ళాడు మీటింగుకి.

టోకెన్ యిచ్చి స్కూటర్ తీసుకున్నాడు. పావుగంటలో మలక్‌పేటలో వున్నాడు. తలుపు తట్టాడు. నిద్ర కళ్ళతో తలుపు తెరిచింది, భార్య కౌసల్యమ్మ.

బట్టలు మార్చుకున్నాడు. ముఖమూ కాళ్ళూ చేతులూ చల్లని నీళ్ళతో కడుక్కున్నాడు. పడకగదిలోకి వొచ్చాడు.

మంచం మీద భార్య పక్కన, ఫ్యాన్ గాలి కింద నిద్రోతున్న కూతుర్ని చేతులతో జాగ్రత్తగా యెత్తి పక్కనున్న చిన్న మంచం మీద పడుకోబెట్టి—భార్య పక్కన చేరి దగ్గిరికి లాగి బుగ్గ కొరికాడు నొప్పెకుండా.

"యిప్పుడేంది, అద్దరాత్తిరి మద్దెల దరువన్నట్లు—నాకు నిద్రమత్తుగ వున్నది" అంది.

"యేదో వొక మత్తు వుంటేనేబాగు. నిద్ర మత్తులోమరీబాగుంటది."

"యేమి, మీరు మందుమత్తులో వున్నారా?" అంది.

సుబ్బారెడ్డి, సాధారణంగా సొంత డబ్బుతో వొంటరిగా తాగడు.

"లేదు నీ మత్తులో వున్నా" అన్నాడు.

సుబ్బారెడ్డి ఉదయం లేచి కాలకృత్యాలు ముగించుకుని— యిటీవల విరసం నుంచి విడిపోయిన కవులు కొందరి ప్రకటనలకి సంబంధించి ఘాటుగా వో వివరణ వ్యాసం రాయటానికి కూర్చున్నాడు.

"మీ కోసం మన పక్క వీధిలో కడాకు వుండెటాయన వొచ్చాడు." అంది భార్య కౌసల్యమ్మ వొచ్చి.

"యెవడు? లేనని చెప్పలేకపోయినావా?" అని కసిరాడు.

"మంచీ మర్యాద అక్కర్లేదా? వొకే వీధిలో వుంటాం. మంచికీ చెడ్డకీ తోడుగా వుండాల్నా వొద్దా? ఆయనెవరనుకుంటున్నారు? ఆరోజు మీరు వూరిలో లేరు. అర్ధరాత్రి వైలలో మన పాపకి సీరియస్‌గా ఐతే ఆయనె వొచ్చి డాక్టర్ని పిల్చుకవొచ్చి యెంత సాయం చేసినాడు! లెండి" అంది.

"లేనని చెప్పు."

ముందు గది గుమ్మంలో నుంచుని వున్న అతనికి యిదంతా విని పిస్తోంది. మొహమాటాన్నా యరక్కపోయి - అని అనుకుని తిరిగి గప్ చిప్‌గా వెళ్ళిపోవాలనుకుంటూండగా—

కౌసల్యమ్మ వొచ్చి, ఆప్యాయంగా చూస్తూ, "బాత్రూంలో వున్నారు. వొస్తారు కూర్చోండి" అంది.

యిప్పుడు వెళ్ళిపోయినా బాగోదనిపించి, లోనకి అడుగులు వేసి కూచున్నాడు అతను.

మూడు నిముషాలకి వొచ్చి, "మీరా యెవరో వొచ్చారంటే యెవరో అనుకున్నాను" అన్నాడు సుబ్బారెడ్డి, నవ్వు ముఖం పెట్టి.

కూచున్నాడు. అతనిని చూడగానే సుబ్బారెడ్డికి వో పని గుర్తొచ్చింది.

"మీ ఆఫీసరు గురించి కొంచెం యిన్ఫర్మేషన్ కావాలి. ఆయనతో మాకు తెలిసినవాళ్ళకి వొక పని కావాలి. యెవరితో చెప్పించితే వింటాడో—" అని ఆగిపోయాడు సుబ్బారెడ్డి.

సుబ్బారెడ్డికి అతనితో అంతగా పరిచయం లేదు. వీధిలో కనిపించటం బస్సుదగ్గిర యింటో, కూరలు సంచితో వోస్తూనో కనిపిస్తాడు. తనెప్పుడూ

స్కూటర్ మీద. యెప్పుడన్నా తారస పడితే నాలుగు మాటలు. నలభ య్యేళ్ళ లోపే వుంటాయి గాని చూడటానికి యింకా చాలా యెక్కువ వయసులాగా అనిపిస్తాడు. బాగా నెరిసిన తల. ముడతలు పడుతున్న చర్మం. హెడ్ క్లర్కుగా వుద్యోగం.

"వాకే వీధిలో వుంటాం. తెలిసినవాళ్ళు అడుగుతున్నారని అరమరి కలు లేకండా చెప్పేస్తున్నాను. వాడు డబ్బుకే వింటాడు. కత్తుల సారధి అని వొకడున్నాడు. యింకా అట్లాగే కొందరున్నారు. వాళ్ళలో వొకణ్ని పట్టు కోండి. వాడి కమీషన్ వాడు పుచ్చుకుని రేటు మాట్లాడి పని చేయించిపెడ తారు" అన్నాడు అతను.

అతని ముఖంలో మంచితనం యెందుకో చాలా దిగులుగా అనిపిస్తు న్నాడు. దిగులుగానూ కాదు. చాలా బాధగా.

"థాంక్స్ ఫర్ ది యిన్ఫర్మేషన్. యెట్లా అడగటమా మీ వంటి వారిని—అపార్థం చేసుకుంటారేమో అని కాస్త వెనుకాడాను" అన్నాడు సుబ్బారెడ్డి.

రెండు కప్పులతో కాఫీ తెచ్చి బల్లమీద పెట్టింది కౌసల్యమ్మ.

"యిప్పుడీ శ్రమ దేనికి తల్లీ? వొస్తూ యింట్లో పుచ్చుకునే వొచ్చాను" అని, సుబ్బారెడ్డితో, "చెప్పటానికి వెనకాడాల్సింది యిందులో యేముందండీ! మరొకరికైతే యిదే విషయంలో యింకోలాగా చెప్పివుందును. మీకు యివాళ కాలేజీలకి సెలవా? మీరేదో స్టూడెంట్లకి రెవల్యూషనరీ లీడర్ అని విన్నాను" అన్నాడు అతను.

"యిఁహీఁ" అని, "రెవల్యూషనరీ ఆర్గనైజేషన్లో వర్క్ చేస్తూం టాను. ఆరకంగా స్టూడెంట్స్‌తో కాస్తసంబంధాలు యెక్కువగా వుంటాయి". అన్నాడు సుబ్బారెడ్డి.

"యేఁవిఁ స్టూడెంట్లో యేఁవిఁటో—— ఛీ"

"చిన్నవాళ్ళు కదా——"

"యీ యిల్లు అమ్మేసెయ్యాలనిపిస్తోంది. మీకు తెలిసినవాళ్ళకి యెవరికన్నా కావలిస్తే చెప్పండి కాస్త. ఆ రోజుల్లో యిదంతా యిట్లా అభి వృద్ధి చెందలేదు. అప్పట్లో తక్కువలోనే దొరికింది. యీ చిన్న కొంపా దొడ్డీ. ఆ తరవాత తరవాత యీ పెద్ద పెద్ద బిల్డింగ్స్ లేచాయి. అవతల, ఆవైపున—— ఆ పుణ్యాత్ముడెవడో కాలేజీకి పాత మహలు దానంచేశాడు."

పాపభీతి వల్లనో, టాక్స్ యెగ్జెంప్షన్ పొంది బ్లాక్ మనీ మరింత పెంచుకోటానికో"

"యెందుకన్నా చెయ్యనీండి, యిటు ప్రక్కన యీ కాలేజీ పెట్టడం మా చావుకొచ్చింది. ఛీ, ఛండాలపు వెధవలు— మీ స్టూడెంట్స్‌ని తిడుతున్నానని మీకు కోపమొస్తుందేమోగానీ—"అని ఆగిపోయాడు.

అతని ముఖంనిండా విషాదం. కలవరపెట్టే విషాదం లాంటి విషాదం.

"యేదో స్టూడెంటు కుర్రాళ్ళు కదా—"

"స్టూడెంటు కుర్రాళ్ళైతే మాత్రం—ఛీ—మనుషుల్లాగా ప్రవర్తించనప్పుడు—ఛీఛీ—పోనీండి—మేస్టర్లు మీ దగ్గిర దేనికి—వీళ్ళ న్యూసెన్స్ వల్ల కొంప అమ్ముకుపోదామనిపిస్తోంది" దుఃఖారానికి కుంగినట్టుగా అనిపించాడు.

"చెప్పండి. ఫరవాలేదు. మేస్టర్లనేముంది. యేమన్నా గొడవ—"

"ఆ యెదురుగా మూడో యిల్లు లేదూ—పైన స్టూడెంట్లకి యిచ్చి తగలడ్డారు. వాళ్ళకేం పిల్లాపీచూ లేని ముసలివాళ్ళు...."

యితనికి యింటరు చదువుతున్న అమ్మాయి వుంది. పదిహేడేళ్ళుండవచ్చు. యింకో అమ్మాయి, పదకొండు. యెనిమిదేళ్ళ పిల్లడు.

"....ఆ పైన చేరారు, దాన్లోవుండే వాళ్ళేకాదు. బయటినుండి కొందరొచ్చి చేరతారు కోతిమూక. కోతులే నయం. కుక్కలనుకోండి. అక్కడినుండి యింట్లోకి— మా పెద్దమ్మాయి—యెంత వయసండీ—మొన్ననే పదిహేనెళ్ళాయి. ఆ పసిదాన్ని దొడ్లో మసలనివ్వరండీ. వెధవ మాటలూ వాళ్ళూ—అక్కడనే కాద—యీ కాలేజీ పుణ్యమా అని యీ లొకాలిటీ అంతా—ఛీ కుక్క వెధవలు—అక్కడ వీధి మూలమీదా, అవతల ఆ టిక్కీ హోటల్ ముందరా—వొహచోటనేమిటి—సర్వాంతర్యాముల్లాగా—యిటీవల గమనించాను— అటు బస్టాపు దగ్గిరా అంతటా చీదర కుక్కలు — యికిలింపులూ సకిలింపులూ చొంగ కారుస్తూ తోకాడిస్తూ మొరుగుతూ— వీళ్ళు కుక్కలండీ— కుక్కలకి వొక్క చిత్తకార్తే— యీ కుక్కలకి నిత్య చిత్తకార్తె — బలాదూరు కుక్కలు — ఆడవాళ్ళు కాలేజీలకి వెళ్ళే వేళా బజారుకెళ్ళే వేళా—యిట్లా వీధుల్లోపడి నానాగొడవలు చెయ్యకపోతే వీళ్ళ ప్రతాపం

యేర్పాటుచేయించుకోకూడదూ యీ దురద రాయుళ్ళ? పీళ్ళూ వాళ్ళూ అని లేదు. విచక్షణే లేదు. యెవరెలాంటి వాళ్ళనేదే లేదు. మొన్నొక రోజున మా ఆవిడ పరీ యిద్దై యేదో అన్నాడట — అంతటితో, నీ కూతురు కంటే నువ్వే పసందుగా వున్నావే భామా— అంటూ కూశారట. తన వయసెంత! వాళ్ళ వయసెంత? కొంప అమ్ముకుని పోదామనిపిస్తోంది గానీ, యీ వెధవ జట్లు వూరంతా విస్తరించుకుని వున్నారు. యెక్కడికని పోయేది! కోపమైతే ఐంది వో కుక్కని పట్టుకుని కత్తితో పొడిచే సెయ్యాలన్నంత పంతుకొచ్చింది ఆ రోజునైతే— నిన్న సాయంత్రానికి సాయంత్రం — నేను కల్పించుకుందామనుకున్నాను గానీ నా మర్యాద మాత్రం దక్కుతుందనేంవిఁటీ—" అని బాధ యేకబికిన వెళ్ళగక్కేసరికి, కొన్త భారం దిగినట్లయి, శ్వాస పీల్చుకున్నాడు దీర్ఘంగా.

"చూడండి శాస్త్రిగారూ యీ కుర్రాళ్ళతో బాధే అనుకోండి— యెందరో వుండరండీ పది శాతం. అంతె. వాళ్ళే యీ అంతటికీ కారణం. దె ఆర్ నాట్ యీవెన్ సీరియస్. ఆకతాయితనం—"

మధ్యలోనే అందుకుని, "ఆకతాయితనం యేంవిఁటండీ. అన్నేళ్ళొచ్చి అంత నీచంగా ప్రవర్తించడం! ఆ మధ్య యెగ్జిబిషన్లో — వెనకనుండి యెవరో తోస్తే పడినట్లుగా మీదకి వొరుగుతాడొకడు. పీళ్ళూ వాళ్ళూ అని లేదు. ఆడది కనబడితే చాలు. అన్ని చదువుల వాళ్ళూ — తండ్రులు జీతాలు కట్టి కాలేజీలకి పంపిన పాపానికి— మీరు మేస్టర్లు—మీకీ బాధలు తెలియవు" అన్నాడు.

"వాళ్ళకి ఆ విచక్షణా వుండదండీ. ఆమధ్య మా పింతల్లికూతురు మా యింట్లో కాలేజ్‌లో చదువుకుంది. తనకీ తప్పలేదు. అంతదాకా దేనికి, మేస్టర్లమై మాకుమాత్రం తప్పుతుందా ఆ దుర్గతి! ఆ మధ్య నేనూ మా ఆవిడ వెళ్తూంటే వెనకనుండి కొంటె వాగుడు, పిల్లికూతలు, నక్క అరుపులు. తీరా చూద్దును కదా అందులో వొకడు నా క్లాసులోవాడే! అదీ పరిస్థితి. పళ్ళీ విడిగా ప్రతి వొక్కడూ మహా బుద్ధిమంతుడు!"

"విడిగా బుద్ధిమంతులో గిద్దిమంతులో దానివల్ల మనకివొరిగేదేవిఁటి? ప్రిన్సిపాల్‌కి రిపోర్టు చేద్దామనుకుంటున్నాను."

"మీ యిష్టం. మేస్టరుగా, విద్యార్థులు నాకు మీకంటే సన్నిహితంగానూ, పరిస్థితి మరింత బాగానూ తెలుసు. ది రైట్ థింగ్ యీజ్ టు

యిగ్నోర్. మీరు మరీ యిదిగా ఫీలవుతున్నారు. అందరూ ఆ లాగ ఫీల
యితే యీపాటికి యెందరో ఆత్మహత్యలు చేసుకోవాల్సివొచ్చును. ఆ పిల్ల
లలో మన పిల్లలూ వున్నట్లే భావించుకోవాలి.—"

"యీ వయసుకి వీళ్ళిలా తయారైతే ముందు ముందు యేమ
య్యేట్లో— యీ చదువులూ యివీ—"

"యేమీకాదు యీ నాలుగు రోజులూ అల్లరి. అక్క వాక పది
శాతం. యీ పది శాతానికి యేమీ ప్రముఖ్యం కాదు. వాళ్ళవి వడ్డించిన
విస్తరి లాంటి జీవితాలు. ఐతే వీళ్ళలో కొందరు తమ స్థితి తాము తెలుసు
కోకుండా యిందువల్ల జీవితంలో చాలా నష్టపోయే వాళ్ళుంటారు. హర్టింగ్‌గా
హుమిలియేటింగ్‌గా, అసభ్యంగా కాకుండా, యెవరేమిటి అనే విచక్షణతో
మోతాదు మించని రీతిలో చిన్నగా యేదన్నా చెణుకు విసిరితే పర్లేదు,"
అన్నాడు సుబ్బారెడ్డి.

"అయితే మీ మేస్టర్లకి తప్పదన్నమాట!"

"శాస్త్రిగారూ, మీరు మరీ యిదిగా ఫీలవుతున్నారు. అంత యిదిగా
ఫీలవాల్సిన విషయం కాదు. యిటీజ్ వైజ్ టు యిగ్నోర్. అప్పుడు
అంతటి భరించలేనంతటి విషయంగా అనిపించదు. నేనేదో యీ విషయాన్ని
సమర్థిస్తున్నాననికాదు. జీవితంలో యెన్నో కూడని స్థితులు వున్నయ్.
దానికి యేవేవో కారణాలు వుండొచ్చు. ఆదిమ వ్యవస్థలోనూ, ఆదర్శ
స్థాయిలోనూ తప్ప రకరకాల సమస్యలు తప్పవు శాస్త్రిగారూ మరీ అంత
యిదవకండి. వాళ్ళెవరో కాస్త గమనించి చెప్పండి. మా కాలేజీ పిల్ల
లైతే నేను మాట్లాడి చూస్తాను. తమాషా యేమిటంటే వాళ్ళలో సాక్షాత్తూ
మీ చుట్టాల పిల్లలేవున్నా ఆశ్చర్యపడక్కర్లేదు.

"క్షమించాలి. వుదయం పూట వొచ్చి పట్టుకుని బోరు కొట్టిపెట్టి
న్నాను. నా బాధా నా స్థితీ అట్లాంటిది. అదీ కావాలని చెప్పలేను. యీపూట
మనసు మరీ యిదిగా వుంది. వేళకి మీరు—అందునా మేస్టర్లు దొరికినందున
మన్నించాలి."

"భలేవారు. అట్లా అనుకోకండి. యెవరో తెలుసుకుని చెప్పండి."

"వొస్తాను మరి. మీ సమయం అంతా వృధాచేశాను. మన్నించండి"
అని లేచి వెళ్ళాడు.

సుబ్బారెడ్డి అనుకున్న వ్యాసం రాసే మూడ్ పోయింది.

దీనికి పరిష్కారంగా కాబోలు పడమటి దేశాల వాళ్ళు విశృంఖల త్వాన్ని ఆచరించితే—అది వెర్రితలలువేసి మరొక ఘోరస్థితికి దారితీస్తోంది వీటన్నిటికీ పరిష్కారం ఆదర్శ సమ సమాజమే — అనుకున్నాడు సుబ్బా రెడ్డి.

సంగమం థియేటర్లో గంగి. దూరంగా తెరమీద బొమ్మలు. గంగి పక్కన వో యువకుడు.

గంగి చూపులు—తెరమీదా అతనిమీదా.

ఆమె పర్సు తీస్తున్నా, అతనే జేబులోంచి నోట్ల బొత్తి తీసి, బుకింగ్ కౌంటర్ దగ్గిర పది నోటు యిచ్చి రెండుటిక్కెట్లూ చిల్లరడబ్బులూ పిడికట్లో పట్టుకుని వొచ్చాడు. మ్యాట్నీ ఆట.

నిన్న నాలుగు జల్లులు పడినందున, బయట వేడిగానే వుందిగానీ— లోన చల్లగా వుంది— ముఖ్యంగా హాల్లో జనం మరీ పల్చగా వున్నం దున.

సినిమాకోసం యీ సినిమాకి రాలేదు. జనం రద్దీ వుండదనే వొచ్చారు.

"మై డియర్ లవ్లీ బ్లూ బర్డ్." అన్నాడు ఆ యువకుడు.

"యస్. స్వీటీ" అంది గంగి.

ఆమె చేతిని చేతులోకి తీసుకుని పెదాలకి అద్దుకున్నాడు.

అతనంటె గంగికి యిష్టం. కానీ రవి అంటె వున్నంత యిష్టంకాదు. గంగికి రవి అంటే వున్న యిష్టం మరెవరంటేనూ లేదు.

యీ యువకుడంటే వేరే యిష్టం. వో అవసరపు యిష్టం. అందుకే, యీ యువకుడనేకాదు ; యింకా నలుగురైదుగురు
ఆమె చుట్టూ తిరుగుతున్న వాళ్ళు. కాలేజీ కుర్రాళ్ళు. చక్కగా షోగ్గా బావుం టారు. అందుకనీ కాదు. రవికూడా బావుంటాడు.

వొద్దన్నా వినకుండా చిన్న చిన్న ప్రజంటేషన్స్ యిస్తుంటారు గంగికి. యింపోర్టెడ్ యింటిమేట్ సెంట్ యార్డ్లీ లావెండర్ ఫేస్

పౌడర్ కిచైన్ నెయిల్ పాలిష్‌లు లాంటివి. టాక్సీలకి హోటళ్ళకి సినిమాలకీ— అన్ని ఖర్చులు పెట్టుకుంటూ వుంటారు.తనేబయటికి వెడుతుంది.— సంకేత స్థలానికి. వెళ్ళకపోతే వాళ్ళే వొచ్చేస్తారు క్వార్టరుకి. వాళ్ళందరూ వొకరి కొకరు పరిచయం లేదుగానీ ; వాళ్ళందరికీ గంగికి పరిచయం తనతో మాత్రమే కాదని తెలుసు.

యేప్రిల్ నెలలో అంతగా గమనించలేదుగానీ, క్రితం నెలలో అనుమానించాడు రవి.

వొకసారి, "నిన్న టాక్సీలో యెటో వెళ్తున్నట్లున్నావు?" అన్నాడు.

"అవ్" అంది.

"పక్కనెవరో వున్నట్లుగా అనిపించారు" అన్నాడు.

"అవ్." అంది.

"వో యువకుడిలాగా వున్నాడు."

"అవ్." అంది.

"మీ చుట్టమా?" అన్నాడు.

గంగికి అబద్ధమాడటం యిష్టంలేదు— రవితో. రవి అంటే తనకు యిష్టం. కానీ—

"కాదు. దోస్తు!" అంది.

మరోసారి, "నిన్న ఆ దోస్త్‌తో నిన్ను ప్యారడైజ్ థియేటర్ దగ్గిర చూశాను". అన్నాడు.

"ఆ దోస్త్ కాదు యింకోక దోస్త్" అంది.

మరోసారి, "మొన్న మధ్యాహ్నం మన క్వార్టర్‌లో నుండి వెళ్తుండగా చూశాను—నీ దోస్తని—కాంటీన్ దగ్గరనుంచి." అన్నాడు.

"అవ్." అంది."

యింకోసారి, "యెట్లాంటి దోస్తులు?" అన్నాడు.

"బాయ్ ఫ్రండ్స్." అంది.

"అల్ట్రామోడర్న్ నెక్కింగ్, పెట్టింగ్, కిస్సింగేనా!" అన్నాడు వ్యంగ్యంగా.

"అన్నీ, మగనికి తీరికా ఆసక్తిలేని అన్నీ." అంది.

"షటప్ డర్టీ స్లట్," అని చెయ్యెత్తాడు.

లేచిన అతని చేతివొంకా ముఖం వొంకా విభ్రమంగా చూసింది గంగి,

రెప్పలు పైకెత్తి.

యేదో మహోద్భృతమైన బలమైన తరంగం వువ్వెత్తుగా లేచి తనవి ముంచెత్తివేస్తున్న అనుభూతి.

చెయ్యి కిందకి వాలింది.

"అవదలిస్తె నేను గూడ మస్తు అనగలను. నువ్వంటె నాకెంత యిష్టమో యీ దునియకే కాదు నీకు గూడ తెల్వదు. నేను నా జీవితంల నీ నుంచి యేమి కూడ కోరుకొనలె. నాకేమి అక్కరలే. అక్కెరున్న వొక్కటీ— "

"అవు నీ వెధవ వాగుడు." అన్నాడు.

యింకో రోజున, "అయినయ్యా నీ షికార్లు. యివ్వాల్టికి తిరుగుళ్ళ పూర్తి అయినయ్యా?" అన్నాడు — బాగా పొద్దుపోయి వొచ్చిన గంగిని.

"అయినయ్ యీ పొద్దు నీకంటె జరంత లేట్ అయిన" అంది.

మరింకొక రోజున, "యివాళ యింట్లోనే వున్నావు. నీ బాయ్‌ఫ్రెండ్స్ ఎవరూ లేరా వూళ్ళో?" అన్నాడు.

"పాత ఫ్రెండ్స్ తోటి బోర్ కొట్టినది. కొత్త ఫ్రెండ్స్ యింకా మంచిగ యెరిక కాలేదు." అంది.

వొకసారి వొరసగా నాలుగు రోజులపాటు యెటూ వెళ్ళకండా క్వార్టర్లోనే వుండిపోయాడు రవి. గంగి కూడా యెటూ వెళ్ళలేదు.

నాలుగో రోజు రాత్రి అతని మంచం దగ్గిరికి వెళ్ళి పక్కన పడు

చాలా కాలంగా వాళ్ళకి యెవరి మంచం వాళ్ళదే.

"రవీ." అని తనవైపుకి తిప్పుకుంది.

అతనిని తనమీదకి లాక్కుంటే, జరగకంతా బిర్రబిగుసుకుంటే — తనే అతని మీదకి జరిగింది.

ఆమె అలలా యెగసినట్లనిపించినప్పుడు అతనికి యేదో మహాప్రవాహం మధ్యలో కొట్టుకుపోతున్నట్లుగా అనిపిస్తుంది.

అలిసిపోయి, తృప్తిగా అతనివొంక చూస్తూ, అతని చాతీమీదచెయ్యి పరిచి పడుకుని వున్న గంగితో—

"మగాడు చెడాలంటే డబ్బు కావాలి. ఆడది చెడాలంటే వొళ్ళుంటే చాలు," అన్నాడు.

ఆమె కళ్ళలో నీళ్ళు.
ఆ కన్నీళ్ళు, బాధ కన్నీళ్ళు.
చూసి, "దేవికీ?" అన్నాడు.
"యేడ్వలేక. నవ్వలేక." అని, భారంగా రెప్పలు వాల్చింది, గంగి.

# 81

క్రితం నెలలో శ్రీపతి వో ఆంగ్ల దినపత్రిక రిపోర్టర్‌తో హోటల్లో కూచుని మాట్లాడుతుండగా, "నేను యు పి వెళ్ళాలనుకుంటున్నాను వొచ్చేవారం. రిపోర్టింగ్ అనుభవానికి యిప్పుడు అక్కడ చాలా బాగుంటుంది. అందుకని యివ్వాళ సినిమా చూద్దాం కలిసి" అన్నాడు హిందీలో. అతను జర్నలిజం డిపార్ట్‌మెంటులో ఆదివరకు చదివాడు. అలా పరిచయం.

హోటలు బయటి కొచ్చాక, "మీరూ రాకూడదూ?" అన్నాడు అతను.

"వొస్తున్నాగా" అన్నాడు శ్రీపతి.

"సినిమాకి కాదు. యు.పి కి" అన్నాడు అతను.

"యింకొస్త ముదిరాక వొస్తాలే మిమ్మల్ని చూడటానికైనా" అన్నాడు శ్రీపతి.

"ఆఫీసులో రెండు నిమిషాలు పనుంది. ఫిలింకి యింకా టైం వుంది గా. వెళ్ళేసి వొద్దాం—దారిలోనే." అన్నాడు.

"సరె" అన్నాడు శ్రీపతి.

"మీరూ రండి మా యెడిటర్‌ని చూద్దురు" అన్నాడు.

వెళ్ళాడు. పరిచయం చేశాడు.

శ్రీపతిని, "మీరేం చేస్తున్నారు?" అన్నాడు యెడిటర్.

"యేమి చెయ్యటం లేదు. జర్నలిజం చదువుకున్నాను." అన్నాడు శ్రీపతి.

"పూర్తి ఐపోయింది." అని అందించాడు శ్రీపతి మిత్రుడు.

"మంచి నేర్పుగల జర్నలిస్ట్ అవటానికి జర్నలిజం చదవక్కర్లేదు" అన్నాడు శ్రీపతి.

ఆ యెడిటర్‌కి వుత్త గ్రాడ్యుయేషన్ డిగ్రీకూడా లేదు. కానీ మంచి సమర్థత వున్న యెడిటర్.

"మా శ్రీపతిగారికి యిప్పటికి నాలుగైదు ఫస్ట్‌క్లాస్ యెం. యె. డిగ్రీలున్నాయ్" అన్నాడు, అతను హిందీలో.

"వెరీ యింటరెస్టింగ్" అని శ్రీపతితో కబుర్లు ప్రారంభించాడు యెడిటర్.

పావుగంట కబుర్లు.

"మిమ్మల్ని మళ్ళీ కలుసుకోవాలనిపిస్తోంది. యెప్పుడన్నా ఏం తోచనప్పుడు రండి" అన్నాడు యెడిటర్. అతనికి యాభయ్యేళ్ళుంటాయి.

సినిమాకి ఆలిస్యం ఐపోతుందేమోనని యిదవుతున్న శ్రీపతిమిత్రుడు కదలదీశాడు.

ఆ మిత్రుడు వుత్తర్‌ప్రదేశ్ వెడుతున్నప్పుడు ఆ యెడిటర్ శ్రీపతికి కబురుపెట్టాడు-ఆ పోస్ట్‌లో అతను చేస్తాడేమో చెప్పమని.

అడిగితే, "చూదాం నాలుగు రోజులు" అని ఆ మిత్రుడితో అని వెళ్ళి చేరాడు.

జర్నలిజం టెక్నికాలిటీస్ అన్నీ చదువులో నేర్చుకున్నవే. అందుకని శ్రీపతికి ప్రత్యేకం చెప్పాల్సినవి యేమీలేవు. అనుభవంలో తెలుసుకోవాల్సినవి తప్ప. అవి చెప్పేవికావు.

శ్రీపతి రాసే యింగ్లీషు, రిపోర్టింగు, అవగాహనా, నేర్పు, వివిధ విషయాల పరిజ్ఞానమూచూసి, "సబ్ యెడిటర్ పోస్టు వొచ్చినప్పుడుమీకిస్తాను" అన్నాడు యెడిటర్,

"సంతోషం. కృతజ్ఞతలు. కానీ నన్ను నమ్ముకుని యింకొకర్ని కాదనుకున్నావనే స్థితి వొద్దు." అన్నాడు శ్రీపతి.

వెంటనే అర్థంకాక, క్షణకాలం అలాచూసి అర్థమయ్యి, పకపకా నవ్వాడు యెడిటర్.

ఆ పని వుద్యోగంలా కాక, అదో వ్యాపకంలా చేస్తున్నాడు శ్రీపతి.

యీ జూన్ నెల మొదటి ఆదివారం సాయంత్రం— టివోలీలో ఏదోసినిమాచూద్దామని అబిడ్స్‌లో బస్సెక్కాడు.రద్దీగావుంది. నుంచున్నాడు.

కాస్త అవతలగా రద్దీలో నుంచుని స్వప్న రాగలీన.

ఆశ్చర్యంగా చూసి, జనాన్ని తప్పించుకుని దగ్గిరికి వెళ్ళి "స్వప్నా" అన్నాడు శ్రీపతి.

సంతోషంగా చూస్తూ, "మీరా!" అంది:

"మీరు యిలా బస్సు రద్దీలో...."

"నాకుమాత్రం కారెక్కడిది! బస్సులే" అంది.

"అతి వినయం."

"మీరు ఆమాట అనేట్లయితే వెంటనే బస్సుదిగిపోయి మా డాడాయికి ఫోన్ చెయ్యాల్సొస్తుంది. సొంత కారు గరాజ్‌లోవుంది ప్రభుత్వవాహనం పంపించడు. అంచేత, టాక్సీలో దిక్కుదిక్కుమంటూ వెళ్ళాలి" అంది.

"మీ పుణ్యం అంతపని చెయ్యకండి. యీ మహా తోపుడు రద్దీలో కులాసాగా ప్రయాణించండి." అని చిన్నగా నవ్వాడు.

"యెందాకా?" అంది.

"మాంటీన్. లేదూ, క్లాక్‌టవర్."

"మీరు?"

"క్లాక్‌టవర్." అంది.

సీట్లు ఖాళీ అవుతున్నా వీళ్ళకి దొరక్కుండానే బస్సు ప్యారడైజ్ థియేటర్ మలుపు తిరిగింది.

మాంటీన్ దాటింది. క్లాక్‌టవర్. యిద్దరూ దిగారు.

"యెటు" అంది.

"టివోలీలో సినిమా కని"

"యింకా కనలేదుగా!" అంది.

నవ్వి, "అవును. కనలేదు. కనటానికి" అని "మీరు?" అన్నాడు.

"మారెడ్‌పల్లిలో వో మిత్తురాలి బర్త్‌డేకి."

"నా సినిమాకి మీ మిత్రురాలి బర్త్‌డేకీ కలవదు" అని నవ్వాడు.

"అది పొద్దుట పూట పుట్టింది పుట్టటం ఐపోయింది. అంచేత దాని పుట్టిన రోజు రేపొద్దుటి దాకా వుంటుంది. కాగా ఆ పార్టీ గుంపు అంతా నాకు అంతగా నచ్చదు. కాస్త ఆలస్యంగా వెడతాను. పదండి. ప్రశాంతంగా వుండే చక్కటి ఈ రోడ్డు వెంట టివోలీ దాకా వొస్తాను" అంది.

"వో షరతు. మళ్ళీ నేను మిమ్మల్ని యిక్కడి దాకా తీసుకొచ్చి

దిగబెడతాను. యీ రోడ్డు మరీ నిర్జన ప్రదేశం." అన్నాడు.

"యిటుకరే! కాగా అంతలో మీ సినిమావేళ ఐపోతుంది." అంది.

"సినిమాకి వేళేం వుంది? యెక్కడి నుంచి యెక్కడి వరకు యెటు నుంచి యెటు చూసినా వొకటే" అన్నాడు.

"అర్థం అవుతుందా?" అంది.

"వుంటేగా!" అన్నాడు

నవ్వింది. అదే నవ్వది, స్వప్నరాగలీన నవ్వు నవ్వది; స్వప్నరాగలీన నవ్వు నవ్వది.

టివోలీ మలుపుకి యివతలగా వున్న పార్కులోకి దారితీసాడు, శ్రీపతి.

పచ్చికమీద కూర్చున్నారు.

గచ్చకాయరంగు చీర. చందనం పరిమళం.

"పత్రికలో పనిచేస్తున్నారటగా?" అంది.

"యెవరు చెప్పారు?"

"మీ వంటి ప్రసిద్ధుల గురించి యెవరొకరు చెబుతూనే వుంటారు." అంది.

"అర్థం చేసుకుంటే అన్యాయం మాట. అపార్థం చేసుకుంటే దేమేజింగ్ మాట" అన్నాడు.

"పత్రికలో యేం చేస్తారు?" అంది.

"పత్రిక పని"

"అబ్బ మీతో యిదే చావు. యేంపని అంటే— మీరేం పని చేస్తారని"

"నేనూ పత్రిక పనే!"

"మీరేమీ మారలేదు."

"యెక్కడో నూటికీ కోటికీ వొకరికి జెండర్ మారిపోతుంది" అని నవ్వాడు.

నవ్వి, "మీరు నూటికి కోటికీ వొకరికో వారేగాని జండర్ బ్లండర్ విషయానికి కాదు" అంది.

"మనం కలుసుకుని కొన్ని నెలలవు తోందనుకుంటాను?" అన్నాడు.

"మీరు గమనించటం విశేషం!"

"అంత మొద్దునా!"

"కాదు. అంత ప్రత్యేకంగా నన్ను గుర్తుంచుకున్నందుకు"

"మిమ్మల్నెవరైనా గుర్తుంచుకుంటారు. నిజానికి, మర్చిపోలేరు."

"అది వొకవేళ నిజమేఐనా, మీరు యెవరినైనా ప్రత్యేకం గుర్తుంచుకోవటం జరగాలిగా!" అంది.

"మిమ్మల్ని కూడా అంటారా?"

"మిమ్మల్ని మీరే గుర్తుంచుకోని వాళ్ళు" అని, శ్రీపతి ముఖంలోకి చూసి, "మీ ఆవిడగారు బావున్నారా?" అంది.

ఆశ్చర్యంగా చూస్తూ, "మీకెలా తెలుసు?" అన్నాడు.

"రమాదేవి చెప్పింది, మీ యింటి సంగతులు. అదొక్కటేగా దారం. చాలా ముఖ్యమైన దారం" అంది.

"ఆవిడకేంలోటు? అన్నీ వున్నాయి" అన్నాడు.

"యెవరికీయే లోటూ ఉండదు—లేదనుకోపోతే" అంది.

"మీ మిత్రురాలి బర్త్‌డే కేండిల్స్ చివరికొస్తూ వుండి వుంటాయి." అన్నాడు.

చిన్నగా నవ్వి లేచింది.

నడుస్తున్నారు మౌనంగా. నల్లని వెడల్పాటి తారురోడ్డు.

"అనంత్ ఈ మధ్య నాకూ వో వుత్తరం రాశాడు" అన్నాడు.

"ఒక్కడికి, నాకేదో వుత్తరాలు వొస్తున్నాయని చెబితే చెప్పినట్లు ఆదేం చెప్పటం!" అంది.

"ప్రత్యేకం చెప్పక్కర్లేదని!"

"వుత్తరం. యేమని?" అంది.

"అక్కడ బోర్ కొడుతోందిట అనంత్‌కి"

"స్టేట్స్‌లో బోర్ కొడుతోందనీ యెవరన్నా రాస్తే నమ్మొచ్చునా!"

"అనంత్ రాస్తే నమ్మొచ్చు."

"యేమో!"

తల పక్కకి తిప్పి ఆమె కళ్ళలోకి చూసి నవ్వాడు నిశ్శబ్దంగా.

తనూ నవ్వేసింది, నిశ్శబ్దంగా.

"మీ సినిమా!" అంది స్వప్న, రాగలీన, రిక్షాలో కూచుంటూ.

'చెప్పానుగా!" అన్నాడు శ్రీపతి.

# 82

పెళ్ళయి గడిచిన ఆరు నెలలుగా సుబ్రహ్మణ్యం, చిక్కి-శల్యమయ్యాడు. అంతకంటే మించి మనిషి కుంగిపోయాడు బ్యాంకుకి వెళ్ళిన దగ్గర్నుంచి యింట్లో యేం జరుగుతోందోననే ధ్యాస.

భార్య శాంతకి ప్రియుడు ఉత్తరం వ్రాస్తే చదువుకుంటున్నదో, లేదూ, అతనికి శాంత శృంగారం వొలికిస్తూ ఉత్తరం రాసి ఆ పోస్టు డబ్బాలో వేసిందో- ఆ యువకుడెవడో యింట్లోకి వొచ్చి చేరాడో— వాళ్ళని శృంగార కార్యకలాపాలలో రకరకాలుగా వూహించుకుంటూ కొట్టుకులాడి పోతూ— బ్యాంకు పనిలో తప్పులుచేసి నానా చివాట్లూ తింటున్నాడు. "యిది బ్యాంకు వుద్యోగం, ప్రభుత్వోద్యోగం కాదు. అంకెలతో పని. బ్యాంకు పరువు తీసేయకు. పీకలమీదికొస్తుంది—" అని చివాట్లేశాడు బ్యాంకు మేనేజరు.

యింటికొచ్చిన దగ్గిర్నుంచీ—తను లేని సమయంలో జరిగి వుంటుందనుకునేదంతా తలుచుకుని భార్యని దగ్గిరికి తీసుకోలేక పోవటం. మళ్ళీ వొక్కోసారి శాంత తప్పేమిటో బోధపడదు. అనవసరంగా హింసిస్తున్నానేమో పాపం అని అనుకుని ప్రేమగా దగ్గిరికి తీసుకోబోతాడు. అంతలోనే వాళ్ళూ, వాళ్ళ చేష్టల్లో అశరీరంనలిగిన తన తలంపులు గుర్తొచ్చి దూరంగా జరిగిపోతాడు.

శాంత అర్ధరాత్రుళ్ళు వొక్కతే యేడవటం గమనించాడు. ప్రియుడి కోసం కాబోలు. తన ఆట వాటంగా సాగడం లేదని కాబోలు—అని అనుకుని మంటగా కందిపోతాడు.

కానీ శాంత కూడా చిక్కి శల్యమైపోయింది. ముఖాన, వెనకటి కళా కాంతీ లేవు.

"తను అనుకునేది నిజమైతే మొహం మరీ అంతగా యెందుకు కళా విహీనమైపోతుంది? తనలో నాటకం ఆడుతున్న తనమూ కనిపించదు. అనుకూలంగా వుంటాది. ప్రతిదానికీ నేనే విపరీతార్థాలు తీస్తున్నానేమో—" అనీ బాధపడతాడు. మళ్ళీ అంతలోనే, "ఆడదానికి వొక్క మొగుడంటేనే యిష్టం వుండదు పెళ్ళికి ముందు పెళ్ళిచూపులకి వొచ్చిన వాళ్ళలో వొకతను నచ్చాడని యెంత ధైర్యంగా చెప్పింది. అంతటిది యెంతకేనీ తెగించగలదు.

గెన్ని గ్రంథాలైన చాటున సాగించగలడు—"అని మరికాసేపు గిజగిజలాడి పోతాడు, తామసపడతాడు.

యెన్నోసార్లు చెడామడా తిట్టాడు. నోరెత్తలేదు. కానీ యెప్పుడూ చెయ్యి చేసుకోలేదు. 'కొడితే—కొడితే, లేచిపోతుందేమో, నొప్పెట్టి — బోడి మొగుడు వీడితో యేంటి, చావగొడుతూంటే—అని అనుకుని చక్కా లేచిపోతుందేమో, వాళ్ళలో వొకడితో— ' అని కాసేపు వాపోతాడు లోలోన.

అలా రాత్రుళ్ళు వొంటరిగా కూర్చుని హింసపడుతూంటే, వొకోక్క సారి కళ్ళవెంట నీళ్ళొస్తాయి—అతనికి.

శాంత వొకసారి అది గమనించింది. అప్పటినుంచి అతనిని గూఢంగా నిశితంగా పరిశీలించసాగింది. యేదో తెలియని బలమైన కారణంతో బాధపడు తున్నాడని గ్రహించింది.

అతని మాటల సారాంశాన్ని బట్టి తనని అనుమానిస్తున్నాడని నిర్ధా రించుకుంది, శాంత. కానీ తన ప్రవర్తన యేనాడూ అనుమానానికి అవ కాశమిచ్చేలాగా వున్నట్లు తనకి అనిపించలేదు. దొడ్లో వున్న నూతులో పడి చచ్చిపోవాలని అనుకుంది చాలాసార్లు.

యివాళ సాయంత్రం వొచ్చిన దగ్గిర నుంచి భర్త అదోలాగా వుండ టం గమనించింది శాంత.

రాత్రి యెనిమిదికి భోజనాలు. యిద్దరిలో యెవరూ యేరోజూ సరిగా తినటం లేదు. కూర్చుని నాలుగు మెతుకులు కెలికి—లేస్తారు మౌనంగా— మాట్లాడుకోవటం కూడా తక్కువే—యెవరైనా బయటివాళ్ళుంటే తప్ప.

పడుకున్నారు. మంచం వొకటే. సుబ్రహ్మణ్యం నిద్రపోతేమాత్రం నిద్ర కొద్దిగా మెలకువొచ్చి, ఆ మగత నిద్రలో భార్యని దగ్గిరకి లాక్కుని తన దాహాన్ని రకరకాలుగా తీర్చేసుకుంటాడు. ఆ వెంటనే మంచం అంచు వైపు జరిగి పడుకుంటాడు. ఆపైన నిద్రపోతాడు—అలసటలోంచి. అలా గంటో గంటన్నరో—మెలకువొచ్చి లేచి ముందు గదిలోకి వెళ్ళి కుర్చీలో కూర్చుని మోకాళ్ళమీద తలపెట్టుకుంటాడు.

యివాళ అతనికి అసలు నిద్ర రాలేదు.

శాంత, పదిగంటల వేళప్పుడు నిద్రపోయినట్లుగా పడుకుంది. అతనిని గమనిస్తోంది కొన్ని రోజులు వో గంట నిద్రపోయి, మెలకువొచ్చి నిద్ర

మత్తులో తన బట్టలన్నీ పీకేసి మరీ గోడవచేసి—చివరికి తను నిద్రపోతూ నమకోగానే ముందు గదిలోకివెళ్ళిపోయి—

గమనిస్తోంది. అతను నిద్రపోయాడు. ఒక గంట గడిచింది. అంతలో చప్పుడవకండా మంచం మీంచి లేచాడు. అంతే— నిద్రపోలేదన్న మాట, నిద్ర పట్టలేదన్న మాట—అనుకుంది.

మంచం పక్కన నుంచుని శాంత ముఖంలోకి చూశాడు. నిద్రపోతోంది. ఆమె మొహం మీదకి కొద్దిగా వొంగాడు. అతని కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి. తల పక్కకి తిప్పుకుని—అవతలికి నడిచాడు.

శాంత గమనిస్తూ వుంది.

వొంటింట్లోకి వెళ్ళాడు. గమేక్సిన్ పొట్లం తీశాడు పాలలో కలుపుకున్నాడు. పొడవాటి గ్లాసు చేత్తో పట్టుకుని ముందు గదిలోకి నడిచాడు చప్పుడవకండా.

శాంతకి గమేక్సిన్ వాసన ఘుప్పున వొచ్చింది.

ముందు గదిలోకి వెళ్ళి, గ్లాసు బల్లమీద పెట్టాడు. కూర్చున్నాడు. కంపించాడు. వొణికిపోయాడు. కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి. మరి కాసేపటికి మనసుని దిటవు చేసుకుని నిశ్చలంగా చూశాడు యెటో—గ్లాసు చేత్తో పైకి యెత్తి—అంతలోనే బల్లమీదపెట్టి—లేచి టేబులు మించి కాగితమూ వో పుస్తకమూ పెన్నూ తీశాడు. కూర్చుని రాస్తున్నాడు.

'కొందరి జీవితాలు నిరర్థకమూ దుర్భరమూ. అకారణంగా నేకావొచ్చు యెందుకి సంసారమూ జీవితమూ? పుట్టిన వెంటనే మరణం అనుసరించాలి. నా చావుకి నా జాతకమే, నా నుదుటి రాతే కారణం—' అని రాసి సంతకం చేసి తేదీ వేశాడు.

ఆ కాగితంమీద పేపర్ వెయిట్ పెట్టాడు.

గ్లాసు అందుకున్నాడు.

దగ్గిరికి లాగివున్న తలుపుల్ని రవంత తెరిచి ఆ సందులోంచి గమనిస్తున్న శాంతకి—అదంతా యేమిటో అర్థమైంది.

తలుపులు తెరుచుకుని తటాలున లోనకి వొచ్చింది శాంత. అనుకోని సంఘటనకి తుళ్ళిపడి, గ్లాసు బల్లమీద పెట్టి, "యింకా నిద్రపోలేదా శాంతా?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"మెలుకువొచ్చి చూస్తే మీరుకనిపించలేదు. చూస్తే యిక్కడున్నారు.

వొక్కరే దేనికి నేను లేను తోడు?"అని అతని పక్కన కూచుని, "పాలు వొక్కరే తాగుతున్నారా? నేనేం పాపం చేశానండీ? సొంత భార్యని నాకూ కాసినిస్తే తాగుతాను కదండీ?" అని తటాలున గ్లాసు అందుకుని రెండు గుక్కలు వేసింది.

చేత్తో గ్లాసుకేసి విసిరికొట్టాడు. గాసు అవతల గచ్చుమీద పడి పగిలింది. పాలు నిస్తరించుకునీ కాలవగానూ కదులుతున్నాయి.

"పాలు తాగడానికి కూడా నాకు అర్హత లేదాండీ?" అంది.

"అపాలూ—అపాలూ—"

"ఆ పాలేమిటో నాకుతెలుసు. అందుకే అవి నేనే తాగదలిచాను. నోటి దగ్గిర కూడు లాంటి పాలు లాగేశారు. నేనంత పాపాత్మురాలినండీ? గమేక్సిన్ కలిసిన పాలు నాకు చాలా యిష్టమండీ. చాలా రోజులుగా తాగుదామనుకుంటున్నా" అంది.

"కాంతా నువ్వు నిద్రపోలేదా?"

"వుఁహూఁ."

"నిద్రపోతున్నట్లుగా పడుకున్నావెందుకని?"

"యేమో—యిందుకేనేమో"

సుబ్రహ్మణ్యం కళ్ళనిండా నీళ్ళు.

అతనిని తన వొళ్ళోకి లాక్కుని, "చెప్పండి, మీరెందుకో పెళ్ళయిన మొదటి నుండి ఘోరంగా బాధపడుతున్నారు. నన్ను అనుమానిస్తున్నారు—అని కొంత కాలానికి గ్రహించాను. యెందుకు అనుమానిస్తున్నారో అర్థమవలేదు: అనుమానం రాతగినట్లుగా నైనా నేనెన్నడూ ప్రవర్తించలేదు. నేనేమీ చెయ్యకుండా నన్నెందుకు అనుమానిస్తున్నారో అర్థంకాలేదు. పోనీ తార కారణంగానా అనుకుంటే—ఆ విషయం మీకు తెలియనప్పటి నుండీ తొలిరాత్రి నుండీ అనుమానిస్తూనే వున్నారు తార మా యింట్లో తప్పపుట్టింది. మిగతా పిల్లలం అందరం వొక తీరు. మా వంశమే నిప్పులాంటి వంశం. అసలు యెందుకు అనుమానిస్తున్నారో చెప్పండి" అంది.

"అనుమానించడమా?" అన్నాడు నిదానంగా.

"తప్పించకండి. దాచకండి. మీకు పుణ్యం వుంటుంది. యీ స్థితికి యెందుకొచ్చాం? యేనాడైనా నేను అనవసర్యమైన పని యేదైనా చేశానా? మా పుట్టింటివాళ్ళు మీకు లోపమేమన్నా చేశారా? అసలు తొలిరాత్రే నన్నెం

దుకు అనుమానించారు? నా గురించి మీకెవరో యేనేవో కల్పించి చెప్పి వుం టారు. యెవరో చెప్పండి. నిజానిజాలు తేల్చుకోవొచ్చు. అనవసరంగా నన్ను హింసిస్తూ మీరు హింస పడుతూ—చెప్పండి. మీకు పుణ్యం వుం టుంది. చెప్పకపోతే—నేను కొన్నాళ్ళుగా అనుకుంటున్న పని చేసి తీర తాను—దొడ్లో బావిలో దూకి చచ్చిపోతాను, చెప్పండి, నామీద మీకు యెవరు యేం చెప్పారో—" అంది ఆవేదనగా ఆవేశంగా.

"లేదు శాంతా, నీ మీద నాకెవ్వరూ యేమీ చెప్పలేదు. నిజమే. మీ అక్క తార విషయం—"

మధ్యలోనే అందుకుని, "దాన్ని మా అక్క అనకండి. మాయింట్లో యెవరూ దాని పేరెత్తరు. దానికి ఘటశ్రాద్ధం పెట్టేశాడు మా నాన్న, దాని సంగతి తెలిసిననాడే" అంది.

"ఆమె విషయం తెలియక మ౦దునుండీ తొలిరాత్రినుండీ అనుమా నిస్తూనేవున్నాను. నిజమే తొలిరాత్రి నుండీ అనుమానిస్తున్నాను" అన్నాడు.

బాధతో వొకలాంటి అవమాన భారంతో కిందకి జారింది శాంత, పడి పోయినట్లుగా.

చటుకు -న, సుబ్రహ్మణ్యం నేలమీదకి కూలబడి, "శాంతా" అన్నాడు ఆమె భుజంమీద చెయ్యి వేస్తూ.

వొక నిమిషం. శాంత లేచికూచుని, అతని తల వొళ్ళోకి తీసుకుని, అతని ముఖంలోకి చూస్తోంది. కళ్ళలో నిండిన నీళ్ళలోంచి రెండు బొట్లు రాలి అతని తలమీద వడ్డాయి.

అతని ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని, ప్రేమగ చూస్తూ "చెప్పండి, నా ప్రవర్తనలో యేదన్నా దోషం వుంటే—అజ్ఞానం వనేల్లగానీ తెలిసి కాదు. చెప్పండి యెందుకు అనుమానించారో చెప్పండి" అంది.

సుబ్రహ్మణ్యానికి యేడుపొచ్చింది.

ఆమె చేతుల్ని ముఖం మీదకి జరుపుకుని యేడ్చేశాడు.

"చెప్పండి, చెప్పరూ? చెప్తే, మీ సంతోషం కోసం నా ప్రాణాలైనా వొదులుకుంటాను చెప్పండి," అంది.

"శాంతా నువ్వు పవిత్రురాలివి. నేనే. నేను నాలో దాచిపెట్టుకున్న దేదో పెనుభూతంలాగా లేచి నన్ను ఆవహించి—నిన్ను అనుమానించానని స్తోంది. నేను పాపాత్ముణ్ణి. నేను రాక్షసుణ్ణి. నిన్ను చంపుకుతిన్నాను"

యేడ్చేస్తున్నాడు.

ఓదార్చుతోంది శాంత.

ఐదు నిమిషాలకి అతని యేడ్పు తగ్గింది.

ఆమె అతని చెంపలకి చేతులు ఆన్చి, నుదుటిమీద చిన్నగా పెదాలు అద్ది—కళ్ళలోకి ప్రేమగ చూస్తూ, "మీరు మంచివారు. యే కారణంవల్లనో యిట్లా జరిగింది చెప్పండి. అసలు నన్నెందుకు అనుమానించటం జరిగిందో. నా మీద యెవరో యేదో చెప్పి వుంటారు, నమ్మకం కలిగేట్లు. దొంగవుత్తరాలు చూపెట్టివుంటారు. లేకపోతే మీరు అట్లా వుండరు— మీరు అట్లాంటి వారు కాదు. చెప్పండి. అవును కదా?" అంది.

"కాదు" అని ఆమె వొళ్ళో పక్కకి జరిగి పడుకున్నాడు. అతని తల ఆమె పొట్టకి ఆనుతోంది.

ఆమె, అతని జుట్టూ నుదురూ చెంపలూ భుజాలూ నిమురుతోంది. రెండో చేత్తో అతని చేతిని తన చేతిలోకి తీసుకుంది.

వొక చెయ్యి ఆమె తొడమీద ఆనించి, గచ్చువంక చూస్తూ—వేదవతి గాథ అంతా చెప్పుకుపోతున్నాడు. చెప్పుకుపోతూంటే అతని కళ్ళవెంట నీళ్ళు కారుతూ వున్నాయి. ఆవేదనొస్తుంది. ఆవేశం వొస్తుంది. దుఃఖం వొస్తోంది.

అతను చెప్పటం ఐపోయింది.

విపరీతంగా అలిసిపోయినట్లుగా నిద్రపోయాడు, అలాగే మరు క్షణంలో.

ఆమె అలాగే వొక అరగంట కూచుని—జరిగి, కాలు తప్పించుకుని, అతని పక్కనే పడుకుని, అతని తలని తన జబ్బమీదకి జరుపుకుంది ఐదు నిమిషాలలో నిద్రపోయింది.

వుదయం యిద్దరికీ వొక్కసారే మెలుకువొచ్చింది. యిద్దరికీ "పునర్జన్మ"లా అనిపించింది. వొకరి కళ్ళలోకి వొకరు తృప్తిగా చూస్తూ—వొకరినొకరు దగ్గిరికి సున్నితంగా హత్తుకుంటూ—"శాంతా" అని గాఢంగా సుబ్రహ్మణ్యమూ, "యేమండీ" అని శాంతిగా శాంతా వొకేసారి పలికారు.

# 83

నిరంతరం అక్టోబరులో వుద్యోగంలో చేరినప్పటినుంచి

వక్రమం7 [illegible]గా పనిచేస్తూంది. [illegible]. నేనని. తెలుసులో

కూడా హెడ్‌మిస్ట్రెస్ చెప్పిన పనులు చేస్తుండేది వెళ్ళి.

తీరా, యీ జూన్‌లో బళ్ళు తెరవగానే వెళ్ళిన మొదటి రోజునే, పోస్టింగ్ ఆర్డర్ కాగితం యిచ్చింది, హెడ్‌మిస్ట్రెస్.

ముందుగా వూహించనందున చారుమతి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "నేనేం చెయ్యగలను పైనుంచి వొచ్చే ఆర్డర్స్." అని కసురుకున్నట్లుగా అంది హెడ్‌మిస్ట్రెస్.

దిగులుగా యింటికొచ్చి పడుకుంది. తల్లి అడిగితే, వొంట్లో బాగాలేదని చెప్పింది.

సాయంత్రం తండ్రి వొచ్చాక విషయం చెప్పింది. మరికాసేపటికి వరాహశాస్త్రి వొచ్చాడు, "ట్రోచేచారెవరురా" అని శృతించుకుంటూ.

ఆ తరవాత—తండ్రి భానుమూర్తి, అన్న వరాహశాస్త్రీ—స్వయంగానూ తమకి తెలిసినవాళ్ళ ద్వారా వాకబుచెయ్యగా తెలిసిన విషయాలు : ఆ హెడ్‌మిస్ట్రెస్‌కి బంధువు వొకామె యీ యేడు కొత్తగా బి. యెడ్. పాసయ్యింది. ఆ వుద్యోగం ఆమెకి యిప్పించాలని ప్రయత్నించారు. ఆ అమ్మాయి తండ్రి కొస్త వున్నవాడు. హెడ్‌మిస్ట్రెస్ అనుకూలతతో సహకారంతో, డి. యి. వో. ఆఫీసులో అవసరమైన ముడుపులు చెల్లించుకుని కొంత పలుకుబడి వుపయోగించి ఆ వుద్యోగం ఆమెకి యిప్పించారు—పర్మినెంటు అప్పాయింటుమెంటుగా, చారుమతి నియామకం కేవలం తాత్కాలికం అయినందున, హెడ్‌మిస్ట్రెస్ ప్రతికూలమైన వాక రిపోర్టు రాసిచ్చింది—చారుమతి యిన్‌సబార్డినేట్, బాధ్యతారహితంగా అశ్రద్ధగా పిల్లలతో క్రూరంగా ప్రవర్తిస్తుందని.

యివన్నీ తెలుసుకున్న మీదట—యింతగ్రంథం జరపగలిగిన వాళ్ళని మనమేం చెయ్యగలం! మనకేంత ప్రాప్తి వుంది—అనుకున్నారు నలుగురూ సమిష్టిగా.

ఆ రెండో రోజున చారుమతి తండ్రి భానుమూర్తి అన్నాడు కూతురితో—

"చారుతల్లీ వో పని చేసి చూడు. డి. పి. ఐ నాగిరెడ్డిగారని బహు యోగ్యుడని అన్నారు, అందరూ. డబ్బుకీ దేనికీ కక్కుర్తిపడని లొంగని మనిషి అనీ, రూల్స్ ననుసరించి పోతాడనీ, తన దృష్టికి యేదైనా అన్యాయం వొస్తే దాన్ని సరిచేస్తాడనీ, అవసరం ఐతే, దోషుల్ని విరాక్షిణ్యంగా

శిక్షిస్తారనీ చెప్పారు. పోనీ యీసారి వారిని చూడు. నీ అదృష్టం యెలా వుందో—" అని ఆర్డరు కాగితం యిచ్చాడు.

"యింటికెళ్తే మాట్లాడరేమో!" అంది చారుమతి.

"యిటువంటి సందర్భాల్లో ఆఫీసులో అనుకూలంగా వుండదు. వివరించడానికి కూడా. ఫరవాలేదు. యింటికే వెళ్ళిచూడు" అన్నాడు భాను మూర్తి.

మరునాటి రోజు మూడింటికి వెళ్ళింది.

ఆఫీసు కెళ్ళినట్లూ నాలుగింటికి వస్తారనీ చెప్పాడు పనిమనిషి.

నాగిరెడ్డి వచ్చేసరికి ఐదు ఐంది.

ఐదున్నరకి చారుమతి కూర్చున్న గదిలోకి వచ్చిన మనిషిని చూసి అతనే నాగిరెడ్డి అని భావించుకుని, అమాంతం లేచి నమస్కారం చేసింది.

యేమిటి? అన్నట్లుగా చూశాడు నాగిరెడ్డి.

"సార్. నా పేరు చారుమతి. పెన్స్ ట్రెయిన్డ్ గ్రాడ్యుయేట్ని. ఫస్ట్ క్లాస్ వచ్చింది. నాకు క్రితం అక్టోబరులో టీచర్ వుద్యోగం యిచ్చారు. మొన్న రీఓపెనింగ్ రోజున పోస్టింగ్ ఆర్డర్స్ యిచ్చారు" అంది.

"10—A. టెంపొరరీ పోస్టింగా?" అన్నాడు.

"అవును సార్. కానీ క్లియర్ వేకెన్సీ"

"యెక్కడ?"

చెప్పింది.

"మరెందుకు తీసేశారు?"

ఆ విషయాలన్నీ వివరించింది.

"మరి అది ఆధారంగా తీసేసి వుంటారు 10—A పోస్టింగ్కి కారణాలు చూపక్కర్లేదు" అన్నాడు.

"అవన్నీ పచ్చి అబద్ధాలు సార్" అంది.

"మరి యెందుకు తీసేసినట్లు?"

"అవన్నీ చెప్తే పితూరీ చెప్పాననుకుంటారేమో"

"నేను యెట్లా అనుకున్నా— నువ్వు చెప్పాల్సిన వివరాలు చెప్పాలిగా చెప్పు" అన్నాడు నాగిరెడ్డి.

"యీ వివరాలన్నీ మా నాన్నగారూ అన్నయ్యా తెలుసుకుంటే తెలిశాయి. మరొకామెకి యెందుకు యే విధంగా యిచ్చారో" అని ఆ వివరాలు

చెప్పింది.

"యివన్నీ నిజమేనా?"

"మీ గురించి విని నే రావడానికి సాహసించాను. మీ ముందు వొక్క-పిసరు అబద్ధం కూడా చెప్పలేదు. మీరు దేవుడిలాంటివారని అందరూ అంటారు."

"నిజానిజాలు వాకబుచేసినాక తెలుస్తయ్ ఆధారాలు వుండాలి. నువ్వు చెప్పేవన్నీ నిజమైనా నే చెయ్యగలిగిందేమీ వుండకనూ పోవచ్చు. చర్య తీసుకోటానికి ఆధారాలు అవసరం. అవన్నీ నిజమైతే, నీ స్థితి దృష్ట్యా మరొకచోట పోస్టింగ్ వొచ్చేటందుకు ప్రయత్నిస్తాను" అన్నాడు నాగిరెడ్డి.

మధ్యలో మరొకసారి, కూర్చోమని అన్నా, చారుమతి నిలుచునే వుంది.

"రేపు ఆఫీసుకి రమ్మంటారా సార్" అంది.

"అవసరం లేదు. నువ్వు చెప్పినవన్నీ వివరంగా రాసి యిక్క-డికే తెచ్చి యివ్వు, రేపు సాయంత్రం. నన్ను కలుసుకున్నట్లూ యిదంతా యెవరితోనూ అనొద్దు. మంచిది వెళ్ళు." అని లోనకి వెళ్ళిపోయాడు.

చారుమతి వెనక్కి- తిరిగి—పోర్టికోలోకి వొస్తుండగా—పోర్టికోలో స్వప్న రాగలీన—

ఆశ్చర్యంగా చూసి, "రండి" అంది స్వప్నరాగలీన.

"నా పేరు చారుమతి—"

"అనీ తెలుసు వరాహశాస్త్రిగారి చెల్లెలనీ తెలుసు. వీణాప్రావీణ్యురాలనీ తెలుసు. నా నవ్వుని వీణతో దొంగిలించటమూ గుర్తుంది. రండి లోనకి" అంది.

"మీరు యిక్క-డ—"

"నేనుండేది యిక్క-డే. యిది మా బాబాయిగారిల్లు."

"అలాగా! మా అన్నయ్య ఐనా యెన్నడూ అనలేదు. కనీసం నేనిక్క-డికి వొస్తున్నట్లు తెలిసి కూడా అనలేదు." అంది చారుమతి.

"మీ అన్నగారికి నేనుండేది. యిక్క-డని తెలియకపోవచ్చు ఐతే, మీరు నాకోసం రాలేదా" అంది.

"లేదు. టీచరుగా—"

"ఆ వుద్యోగంలో మండి పూస్ట్ చేసేస్తే సార్‌ని కలుసు కుందామని వచ్చాను" అంది చారుమతి.

తన గదిలోకి తీసుకెళ్ళింది.

"కలిశారా?"

"వూఁ. వోపికగా విన్నారు. చెప్పినదంతా" అని విషయం టూకీగా చెప్పింది.

"మా బాబాయికి నేనంటే చాలాయిష్టం. అక్రమమైందైతే నేనేకాదు యెవరు చెప్పినా వినరు అని జనవాక్యం" అని చిన్నగా నవ్వి, "మీకు అన్యాయం జరిగివుంటే అందుకు బాధ్యులైనవాళ్ళని శిక్షిస్తాడు, వీలయితే. కనీసం నీకు చెయ్యగలిగ సహాయం చేస్తాడు. అంచేత నిశ్చింతగా వుండండి" అంది స్వప్నరాగలీన.

"వుద్యోగం మాట యెలావున్నా— మీ గదిలో యిలా మీతో కూర్చుంటే యేదో అనిర్వచనీయమైన సంగీతం వినిపిస్తున్నట్లనిపిస్తోంది" అంది చారుమతి.

"వరాహశాస్త్రి చెల్లెలనిపించు కున్నారు! ఆ సంగీత భ్రమ వొదిలి మీ వుద్యోగం కబుర్లు చెప్పండి. మిమ్మల్ని వుద్యోగంలోంచి పీకించేసిన మీ ప్రియతమ హెడ్డు మిస్సమ్మని గురించి చెప్పండి" అంది స్వప్నరాగలీన ఉత్సాహంగా.

చారుమతి యింకా బిడియం బిడియం గానే కూచుంది.

స్వప్నరాగలీన గది సామాన్యంగా సాదాగా వుంది. [illegible]జ్‌వుడ్— మంచం, టేబిలు, కుర్చీ, మస్తాబుబల్ల, బీరువా, బుక్ షెల్ఫు, టేప్ కం ట్రాన్సిస్టరు. రెండు పేము కుర్చీలు, తెల్లగా గోడలు.

"నా గదిలో సంగీతం అని మొదలెట్టారు— అది యీ టేపులోది" అని వో కేసెట్ తీసి—పెట్టింది. "మనసున మల్లెలు" అని మొదలైంది.

ముప్పావుగంట మాట్లాడుతూ కూచున్నారు. టిఫినూ, టీ.

మరో టేపు పెట్టింది. బాలమురళీక్రిష్ణ "నను పాలింప" తో మొదలైంది.

# 84

యీ రోజున యీ పందొమ్మిది వందల డెబ్బయ్యైదు జూన్ పన్నెండో తేదీ వార్త—

తాటికాయలంత అక్షరాలతో దేశంలో అన్ని దినపత్రికలలోనూ వైర్‌లెస్‌లలోను విమానాల్లోనూ రైళ్ళలోనూ బస్సుల్లోనూ కార్లలోను సైకిళ్ళమీదా కాలినడకనా, పొలాలమీంచి చెట్లమీంచి గుట్టలమీంచి నదులలోంచి పర్వతాలమీంచి గాలిలోంచి ధూళిలోంచి నేలనా నింగినా కోటానుకోట్ల ప్రజల నోళ్ళలోంచి; హిమాలయాల నుంచి కన్యాకుమారి దాకా— కాంతి వేగంతో ప్రయాణించినట్లుగా వ్యాపించి, భూగోళం అంతటా కూడా పర్చిన ఛాయగా పడిన వార్త.

ఒక ప్రజా ప్రతినిధి, యెన్నికలలో నియమావళికి భిన్నంగా అనుచితంగా అపసవ్య మార్గాలు అవలంభించినందున ఆ ప్రతినిధి యెన్నిక చెల్లనేరదని దేశంలోని ఒక న్యాయస్థానం తీర్పు యిచ్చిన వార్త.

మన రాష్ట్రంలోనే ఒకప్పుడు పీ. బీ. రాజుకీ ఆ తరవాత చెన్నారెడ్డికి ఆ యోగం పట్టింది. ఐదేళ్ళో ఆరేళ్ళో మళ్ళీ యెన్నికల్లో పోటీ చెయ్యకూడదని తీర్పు. దేశంలో యింకెందరికో ఆ ఖ్యాతి లభ్యమై వుండొచ్చు. వాళ్ళంతా కూడా కీలకమైన ముఖ్యమైన రాజకీయ నాయకులే. కానీ ఆ వార్తలు యెన్నడూ యీ రకంగా వ్యాపించలేదు. దేశం పావుభాగం భూకంపమొచ్చి పూడుకుపోయిందన్న వార్తకూడా యింతగా యీ రీతిగా వ్యాపించదేమో

మహా భూకంపంలా విషంలా వుప్పెనలా కోటి పిడుగులలా కోటి సౌదామినులలా శతకోటి కంఠస్వరాలలా యీ వార్త చిచ్చుబుడ్డిలా యెగసి; యేడుపుల్లోంచి నవ్వుల్లోంచి తామసాల్లోంచి తపనల్లోంచి కంపిస్తున్న యీ వార్త—

యెవరా ప్రజా ప్రతినిధి? సాధారణ ప్రజా ప్రతినిధి ఐనా, ముఖ్యమంత్రి ఐనా, ప్రధానమంత్రి ఐనా— ఆవార్త యీ రకంగా కార్చిచ్చులా భగీరథ గంగలా పాకపోదు. అందుకే అది వార్తకాదు. దేశ జన జీవిత రాజకీయార్ణవంలో యెగిసిన బడబాగ్ని.

యెందుకంటే అది ఆ వ్యక్తి ఫలానా ప్రజా ప్రతినిధి అవటంవల్ల? సవాలక్ష ప్రజాప్రతినిధుల్లోని ఆ ప్రజాప్రతినిధి యెవరు?

దేశ రాజకీయ వయోవృద్ధ మహామహులందరినీ యెదుర్కొని తానుగా నిలబడినా—బెంగుళూరు సభలో రాష్ట్రపతి యెన్నిక గురించి తన అభిమతానికి అనుగుణంగా నిర్ణయం చేయించుకోలేక— తల పండిన పెద్ద పెద్ద సిండికేటులన్నీ కలిస్తే—చివరికి, యెవరి చిత్తమొచ్చినట్లు వాళ్ళు వోట్లేసెయ్యొచ్చని గూబ అదరగొట్టి కాళశక్తిలా చెలరేగి నిలదొక్కుకుని సామాన్య ప్రజానీకానికి ఆరాధ్యురాలిగా కాగలిగిన వో స్త్రీ—కీర్తిశేషి మాజీ ప్రధాని కూతురు, ఫెరోషియస్ ఆగ్గిబరాటా పార్లమెంటేరియన్ భార్య. యిందిరా ప్రియదర్శిని ; యీ భూగోళం బరువంతటి భూషణలూ దూషణలూ నెత్తిమీద పడిన స్త్రీ—ప్రజాప్రతినిధిగదా మరి ప్రజల సొత్తు —యెవరి చిత్తమొచ్చినట్లు వాళ్ళు అనొచ్చు.

కానీ స్వపరిపాలన భారతావనిలో యిప్పటిరవకు ఆమె సామర్థ్యం—అనితరసాధ్యమనీ అసాధారణమనీ నిర్ద్వంద్వంగా అందరూ వొప్పుకోక తప్పదు. ఆ సామర్థ్యపు సబబూ బేసబబుల సంగతి వేరు. అది రాజకీయ నైతికాంశం.

ఆమె మీద—భారత పార్లమెంటులో జాలాయి విదూషకుడిగా పేరొందిన వ్యక్తి పెట్టిన కేసులో—అలహాబాదు హైకోర్టులో న్యాయమూర్తి సిన్హా తీర్పు, అది.

మరి అంత నియమావళి ప్రకారం యెన్నికలలో యెవరూ వుండరు. అది ఆచరణ సాధ్యమూ కాదు. దొరికితే దొంగ. దొరకకపోతే దొర. అంచేత అందరూ దొంగలే. అందరూ దొరలే—అని ఆచితూచి కొందరంటారు.

కోర్టు కోర్టే. తీర్పు తీర్పే.

ఐతే సుప్రీం కోర్టుకి అప్పీలు చేసుకునే అవకాశం కల్పించాడు ఆ న్యాయమూర్తి సిన్హా.

—అని అనుకుంటూ శ్రీపతి పత్రికాఫీసులోంచి బయటికొచ్చి వీధిలో కాలి బాటన నడుస్తున్నాడు.

—పాపం యిందిరమ్మ స్థితి చాలా కాలంగా పెనం మీద వున్నట్లుగా వుంటే యిప్పుడు కుంపట్లో పడినట్లయింది. యేమో— నిండా మునిగితే చలి వుండదన్నట్లు— యిటో అటో వొక వూపు వూపొచ్చు—గల్లీ లీడర్ లాంటి ఆ చింబోతు రాజ్‌నారాయణ్‌కి యేం భోగం పట్టిందీ! యిలా అనుకుంటే

యిందిరమ్మ కూడా పుచ్చులు పన్నివుంటే అతగాడి పని యింతే ఐవుండు నేఁవోఁ....

'హలో శ్రీపతీ.'

'హలో కులశేఖరా!'

-యీ శ్రీపతి మొహం యెప్పటిలాగానే వుంది. వుద్యోగాలు చేస్తున్నవాళ్ళ మొహాలు వుద్యోగపు మొహాలని చూడగానే తెలుస్తుంటయ్- వీళ్ళ పత్రిక వాయించేసింది-యెవరు మాత్రం వాయించరు-

'హలో నీకోసమే యెదురుచూస్తున్నాం.'

ఖరీదైన హోటలు.

పయూనందభారతి వేదపారాయణ నిరంజనరావు. మరికొందరు. పది పన్నెండు మంది కూర్చుని వున్నారు.

రకరకాల స్వీట్లు, యితర తినుబండారాలు.

"మాతాజీ, మాతాజీనట!" అన్నాడు వేదపారాయణ.

"అప్పీలుకి వీలు కల్పించారుగా యీపాటికే సుప్రీం కోర్టుకి వెళ్ళుంటుంది." అన్నాడు కులశేఖరరావు.

"అప్పీలుకి అవకాశం లేకండా తీర్పు యివ్వాల్సింది." అన్నాడు గౌరీపతి శర్మ.

"హెబియస్ కార్పసో యేదో టరిన సుప్రీంకోర్టుకి పాక్కు-పోయేవి"- అన్నాడు కులశేఖరరావు,

నవ్వులతో అరుపులతో కేకలతో కేరింతలతో అలిసిపోయి, రకరకాల పదార్థాలతో బొర్రలు నిండీ-

రెండు గంటలసేపు గడిచింది.

బయటికొచ్చారు, కొందరటూ కొందరిటూ, వొకతను అటూ వొకతను యిటూ విడిపోయారు.

గౌరీపతిశర్మ స్కూటర్ స్టార్ట్ చేశాడు, వెనక సీటు మీద నిరంజనరావు కూర్చున్నాడు

ముకరంజాహీ రోడ్‌లో వెడుతున్నాడు. గాంధీభవన్ ముందు వో ఖద్దరు లాల్చి మనిషి ; ఆముదం తాగినట్టు, వారంరోజుల్నుంచి నీళ్ళ విరోచనాలవుతున్నట్టు వో లప్ప కట్నం రాబోతున్న కొడుకు అమాంతం చచ్చిపోయినట్టుగా-పిక్కు-పోయి వాడిలిపోయి కుంచించుకుపోయి-

గౌరీపతిశర్మ స్కూటర్ ఆపి, స్కూటర్ బ్యాగ్‌లోంచి కెమెరాతీసి ఆ ముఖానికి గురిపెట్టి క్లిక్ మనిపించాడు. కెమెరా బ్యాగ్‌లో భద్రపరిచాడు. స్కూటర్ స్టార్ట్ చేశాడు.

నిరంజనరావు దిగిపోయాడు— పక్క సందులోంచి సుధాకర్ రావటం చూసి—

"హలో సుధాకర్."

"హలో నిరంజన్ యాడికెల్లి?" అని త్రీ ఫైవ్స్ సిగరెట్ పెట్టెతెరిచి అందించాడు వో సిగరెట్.

సంతోషపడిపోతూ, సిగరెట్ అందుకుని జేబులోంచి అగ్గిపెట్టెతీసి— ముందు సుధాకర్ సిగరెట్ ముట్టించించి, తను సిగరెట్ వెలిగించుకుని వో దమ్ము బాగా లాగి తృప్తిగా వొదిలాడు పొగ—నిరంజనరావు.

"దయానంద భారతివాళ్ళ పార్టీకి రమ్మని బిలిసిచేస్తే వెళ్ళినా" అన్నాడు నిరంజనరావు

'నిన్నెవ్వాడు బిలిమిజెయ్యక్కల్లె. వెంటబడి పోతవు నీవె.' అని మనసులో అనుకుంటూ, "యేమ్ది ముచ్చట్లు? మజా వుడాయిస్తున్నల్లే! వొక్క దినమ్‌ల బిపోతే— యే సాలోంకో నంబర్ పె లేగీ యుండిరాజీ" అన్నాడు సుధాకర్.

"యిల్లు అలకగానే పండుగైతదా?" అన్నాడు నిరంజనరావు.

నడుస్తున్నారు. దారిలో మరొకతను కలిశాడు. కూగా నడుస్తున్నారు.

అంతలో వో బంగళాలోకి చొరబడ్డారు.

లోన గోవర్ధన్‌రెడ్డి, గంగారాం తదితరులు వున్నారు. కాలేజీ యెలిక్షన్లలో, మొన్నటి తన తొలి వోటమి తరవాత అంత వుత్సాహంగా వుండటం లేదు గోవర్ధన్ రెడ్డి. కానీ భవిష్యత్తు మీద పూర్తి నమ్మకంతో వున్నాడు. యిప్పుడిది యిలా జరగటం అతనిని నీళ్ళు కొత్తినట్లుగా బంది.

"క్యా దోస్తోం అట్లున్నరు? నథింగ్ విల్ హేపెన్. నేను యింతకు ముందె పీ. పీ సాబ్ తోటి మాట్లాడి వొస్తున్న. యిట్ యీజ్ వో స్లీ సమ్ డిస్టర్బన్స్. నథింగ్ టు వర్రీ అని యెక్స్‌ప్లేన్ చేసిండు." అన్నాడు సుధాకర్ వుత్సాహంగా.

"ఆ రాజ్‌నారాయణ్ యెలక్షన్లో మస్తు అక్రమాలు చేసి వోడి పోయిండు. వుటే అక్క

పెట్టి తృప్తి పొందుతూ పాప్యులర్ అవడం యింపిరమ్మ వీన్ని మన్నిగా నెక్కి పెట్టలేదెన్నాడు. తల్చుకుంటే వీని యాకలు పీకితే వీని యెలక్షన్‌వుల్టా అయ్యేది కోర్టులో. వాడు మంకీ ట్రిక్స్ ఫెలో." అన్నాడు వాకతను.

గంగారాం చెక్కుచెదరకండా వున్నాడు మునుపటిలాగానే గోవర్ధన్ రెడ్డి జేబులో డబ్బు వుంటుంది. అతని బులెట్ వెనక సీటుమీద తనకిచోటు వుంటుంది. మొన్నటి గోవర్ధన్‌రెడ్డి యెలక్షనప్పుడు అరిచీ అరిచీ గొంతు బాగా బొంగురు పోయింది— యెంత మంచి తిండి మెక్కినా. రెండు నెలలకి సరి ఐంది ఏ ఐదువేల రూపాయలు పికుల్చుకున్నాడు.

ఆఫీసు బోయ్ మంచినీళ్ళ గాసులు పెడుతున్నారు. సుధాకర్ టీఫిన్లకి, టీకి చెప్పాడు.

వొక గంటసేపు.

అందరూ బయటికి వొచ్చారు. గోవర్ధన్‌రెడ్డి బులెట్ స్టార్ట్ చేశాడు. గంగారం వెనక కూర్చున్నాడు. మిగతా వాళ్ళు సాగిపోయారు యెవరిదారిన వాళ్ళు.

సుధాకర్, ఖాళీ ఆటో వొస్తుంటే ఆపి కూర్చున్నాడు. ఆటో మోతగా వెళ్ళిపోయింది.

నిరంజనరావు నడుస్తున్నాడు. బసంత్‌టాకీస్ దగ్గర ఆగి సినిమా పోస్టర్లు చూస్తున్నాడు. అర్ధనగ్న వర్తకివైపు తీక్షగానూ, ఖరీదైన సూట్‌లో వున్న వ్యక్తి వంక చికిలించి.

సినిమాకి వెళ్ళాలనిపించింది. యింకా బుకింగ్ తెరవలేదు. జేబులో డబ్బులైతే వున్నాయిగానీ, సొంత డబ్బులతో సినిమా చూసే అలవాటు యింతవరకు అవలేదు.

బయటికొచ్చాడు. సుధీర్ అటుగా వెడుతూ కనిపించాడు. యెగురు కుంటూ పోయి కలుసుకున్నాడు. 'హలో సుధీర్' అంటూ.

బర్కత్ పురా రోడ్డు. అతనికూడా నడుస్తున్నాడు నిరంజనరావు.

విరసం కార్యాలయం.

లోన విరసం సభ్యుల తదభిమానులు కూచుని వున్నారు.

అందరూ వుత్సాహంగా వున్నారుకానీ సంతోషంతో పొంగిపోవటం లేదు.

విజయ్‌కుమార్.

"అది యెంతవరకు శుభ్‌వార్తో వెయిట్ చేసి చూస్తేగాని తెల్వదు." అన్నాడు వెంకటేష్.

వెంకటేష్ వొంక గుర్రుగా చూశాడు విజయ్‌కుమార్. తనెప్పుడు యేది మాట్లాడబోయినా అడ్డుపడుతుంటాడీ వెధవ—అని అనుకుంటూ.

"సంతోషించ తగిన వార్తేగానీ దానివల్ల వొరిగేదేమిటి!" అంది గాయత్రి.

"యేమో చెప్పలేం. ఆ మధ్య విరసం రచయితలందర్నీ విడుదల చేశారా— బెయిల్‌మీదే అనుకోండి—"

"యింకో ప్రక్కన నక్సలైట్ల మీద అన్యాయంగా నిరాటంకంగా సాగిస్తున్న మారణహోమం!" అంది గాయత్రి

"యేదేమైనా యీ రోజు మంచిరోజు. యీ సందర్భంలో నేను పర్సనల్‌గా మీవందరికీ అల్పాహార విందు చెయ్యదలిచాను. మీకు అభ్యంతరం లేకపోతే" అన్నాడు విజయ్‌కుమార్.

"మోస్ట్ వెల్‌కమ్. సంతోషమ్" అన్నాడు [illegible]గిరి.

"విత్ థాంక్స్" అంది వనజ.

గలగలా సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

నిరంజనరావుని యెవరూ సరిగా పట్టించుకోలేదు. వంటి కిందకి కూడా సరిగా దక్కలేదు. నిరుత్సాహంగా బయిటికొచ్చి బస్సెక్కబోతూండగా శ్రీపతి కనిపించాడు.

"హీఁహీఁ" అనుకుంటూ "యెట్లా వున్నది మీ పత్రిక వర్క్? యిప్పుడీ న్యూస్‌తో సర్క్యులేషన్ బాగా వుండాలి." అన్నాడు నిరంజనరావు.

"ఆ విషయంవెళ్ళి పత్రికబిజినెస్ మేనేజర్‌తో ముచ్చటిస్తే సంతృప్తికరమైన భోగట్టా దొరుకుతుంది, నిరంజనం. వూఁ, యెక్కడ? పొద్దుట జనసంఘ గుంపుతో పాటు హోటల్లోంచి బయటికి రావటం చూశాను. అప్పటినుంచి యెక్కడెక్కడ తిరుగుతున్నావ్?" అన్నాడు శ్రీపతి.

"హీఁహీఁ లేదు. మ్యాట్నీకి పోయిన."

"యేం సినిమా?"

"సినిమా—యింగ్లీష్ సినిమా"

"యింగ్లీషు సినిమాకి పేరుంటుంది"

"యేమో యింగ్లీష్ ఫిల్మ్. బయట సుస్తుబోర్డున్నవి స్కైలైన్‌లో. లోపలకి పోయి కూర్చున్న. రెండు మూడు సినిమాల లెక్కన అనిపించింది. నీకు తెలుసుకదా నాకు యింగ్లీష్ ఫిలిమ్స్ అర్థంకావని "

"చాలా మందికి అర్థం కావులే. రేగిచెట్టు కింద ముసలమ్మలు—స్టయిలిష్ ముసలమ్మలు ముసలబ్బిలు—" అని పక్కకి నడిచాడు శ్రీపతి.

శ్రీపతి నడుస్తూ—

రాత్రి, పగలు—రాత్రి. పగలు, రాత్రి— శ్రీపతి నడుస్తూ చూస్తూ చూస్తూ నడుస్తూ గమనిస్తూ—

యీ నగరంలో ఆ నగరంలో, యీ పట్టణంలో ఆ పట్టణంలో యీ పల్లెలో ఆ పల్లెలో, యీ వాడలో ఆ వాడలో, యీ వీధిలో ఆ వీధిలో, వాజ్‌పేయీ వాగ్ధాటి.

యీ రైలు కార్మిక వాడలో ఆ ఫ్యాక్టరీ కార్మిక పేటలో, యీ పగర ఉద్యోగ సమాఖ్యలో ఆ నగర శ్రామికుల సమావేశంలో, జార్జిఫెర్నాండెజ్ గర్జింపు.

యీ వీధిలో ఆ వీధిలో, రాజ్‌నారాయణ్ వెకిలికూతలు.

యీ వేదికమీదా ఆ నిలయంలోనూ, మొరార్జీ ములుకు పలుకులు.

యీ బోటు క్లబ్బులో, ఆ నీటుక్లబ్బులో పీలూమోడి తోక చరుపులు.

ఆ సమ్మ్రదతీరానా యీ నది వొడ్డునా లచ్చన్న దూషణ భాషణ.

యీ విశాలిలో ఆ శాలలో, తెన్నేటి అభిభాషణ బిగింపు.

ఆ మహల్లో యీ భవనంలో, చరణ్‌సింగ్ నకిలింపు. యీ గాళ్ళలో ఆ వదుల్లో, సంజీవరెడ్డి కారుకూతలు యిటూ అటూ అన్ని చోట్లా, నందరయ్య మాటల కత్తికోత. ఆ నగరంలో యీ నగరంలో, చాగ్లా పరిహాసపు వివరణ తీరు.

అజ్ఞాత సమర ప్రాంగణాం నుంచి, చారుమజుందార్ కానూసన్యాల్ పట్నాయక్ సీతారామయ్యల సైగల తుపాకీగుళ్ళ సైగలు.

అటు వాషింగ్టన్‌లో దరహాసం. యిటు పీకింగ్‌లో పరిహాసం. అటు లండన్‌లో చిరుహాసం. యిటు మాస్కోలో హీనహాసం.

హిమాలయాల లోతుల నుంచి వుత్తర భారతం అంతటా అంచివరి దక్షిణాదికీ వ్యాపిసున్న జయప్రకాశ్ వృద్ధ శుద్ధ శక్తి.

జన సమూహాలు :— Peoplescape-turbulent marching Peoplescape

యీ సువిశాల భారతావనిలో అడుగడుగుకీ వొక గొంతు—యేదో వొకటి పలుకుతున్న కోటానుకోట్ల గొంతులు.

యీ సముద్రాల్లో వీళ్ళింకిపోతాయా, యీ పర్వతాలు భూమిలోకి కుంగిపోతాయా, యీ మహా భవనాల పునాదులు కదులుతాయా, యీ రైళ్ళు యీ విమానాలు యీ బస్సులు యీ కార్లు, అన్ని వాహనాలూ కదలకండా నిలిచిపోతాయా, యీ కర్మాగారాలు మూతపడతాయా— అన్నట్లుగా దేశం అంతటా సంచలనమూ అలజడీ ఆందోళనా పెనుగాలీ మహాగ్ని—

వొక్క— పక్షం రోజులు

సుప్రీంకోర్టు వారిచ్చిన కండిషనల్ స్టే నెత్తిమీంచి ఇందిరేయులతో నిండివున్న పార్లమెంటు మద్దతులోంచి— మంత్రివర్గ సమావేశ మర్యాద కూడా లేకండా అర్ధరాత్రివేళ దేశ రాష్ట్రపతి కలంలోంచి వెలువడింది—అంతరంగిక అలజడులు కారణంగా దేశ భద్రతకి ముప్పు వాటిల్లనందున అత్యయిక పరిస్థితి—ప్రకటన. రోజో రెండు రోజులో నెలో రెండు నెలలో కాదు. యేకంగా యేడాది పాటు— యెందుకు యేమిటి అని నోరెత్తి అడిగేందుకు వీల్లేకండా పెదాలు కుట్టేసుకోమని మీసా కొస మెరుపులతో—రోషాలకీ, మీసాలకీ, హక్కు లేదంటూ.

వెనువెంటనే జెయిళ్ళపాలవుతున్న మహామహులేకాక యెందరెందరో ప్రజలు.

వానొచ్చి వెలిసినట్లుగా, అగ్ని కురిసి, చల్లారినట్లుగా— యెమర్జన్సీ ఇనప గంప కింద కోటానుకోట్ల కోళ్ళు. కోళ్ళా మనుషులా?

వుంటుందో వొరిగిపోతుందో నడుస్తున్న రథం, యిరవై సూత్రాల గుర్రాలతో కదులుతూంది.

యీ రథచక్రాల కింద యీ రథ గర్భం లోపల యీ రథం మట్టున యీ రథంపైన....యేమేం జరుగుతున్నదీ—

యీ గాంధీగిరి దేశంలో, గాంధారి కొడుకులు పరిపాలించినా, పై గాంధీపతి చెరసాలించినా —గాంధీగారి సూక్తి— మూడు కోతుల సూక్తి పాటించకపోతే, పాపమో పుణ్యమో తెలియదుగానీ ముప్పదైతే ముప్పు. చెడు కనొద్దు. చెడు వినొద్దు. చెడు అనొద్దు అంటే, చెడు వుందని తాత్ప

ర్యమే అయినా, ఆ మాటా కూడను యిప్పుడైతే సెప్పు. చూస్తూ చూస్తూ పీకలమీదకి తెచ్చుకోరు బతకాల్సిన వాళ్ళు.

అందుకే—

అరెస్సెస్‌తో పాటు యిరవై సంస్థల నిషేధం. జెయిళ్ళలోని వాళ్ళని కుళ్ళబొడుసున్నారో కర్పూర హారతులిస్తున్నారో తెలుసుకోవటానికీ, తెలిసినా అవటానికి లేనీ స్థితి. అరెస్టయ్యీ విడిదివిహారాలు చేస్తున్న స్మగ్లర్లు. నక్సలైట్ల వధం పోలీసు కథలు. నక్సలైట్ ఆయుధాల సాహిత్య కైవశం, ప్రభుత్వాధికారుల మహదపకాశపు ఆగడాలు. నడుస్తున్న రైళ్ళు బస్సులు విమానాలు. తెరుచుకున్న బళ్ళు, పెళ్ళిళ్ల శోభనాలు విందులు వినోదాలు క్లబ్బులు విందులు విలాసాలు విహారాలు మానభంగాలు ప్రాణభంగాలు—

ఖేల్ ఖేల్ మేలు, చీకటి వెలుగులు, సుత్యాల సుగ్గులు, అక్రమ బాబ జేబుదొంగలు, అమానుషాలు, లక్ష్మణరేఖలు—

యీ పంతొమ్మిది వందల డెబ్బయ్ ఐదు ఆగస్టు యేడున యిందిరా పార్లమెంటు, నభూతో న భవిష్యతి లాంటి యెన్నికల సవరణల నొకదాన్ని ప్రవేశపెట్టి సాధించిన పరమార్థం : ప్రధాని పదవీ యెన్నికా, దానికి కోర్టుల రాతరానంత పవిత్రమైందీ అతీతమైందీ అని. యీ పుణ్యమా అని రాష్ట్రపతి వుపరాష్ట్రపతి స్పీకర్‌లకి కూడా ఆ మహాభోగం లభించింది.

జాతీయ గీతం, జాతీయ జెండా, జాతీయ పక్షి, జాతీయ మృగం, జాతీయ చవట, జాతీయ మాత, జాతీయ వేశ్య—

యీ మహేందిర గీచిన లక్ష్మణరేఖ దాటిన మీసాల సీత గతి అధో గతేనని—

ప్రపంచంలోని యీ అతిపెద్ద ప్రజాస్వామ్య దేశంలోని, అతిపెద్ద న్యాయాలయం, యిందిరా ప్రియదర్శినీ నెహ్రూగాంధీగారి రాయ్‌బరేలీ నియోజకవర్గ యెన్నిక సక్రమమైనదేనన్న ప్రత్యేకపు పై తీర్పు వార్త మోసుకొచ్చిన యీ పంతొమ్మిది వందల డెబ్బయ్ ఐదు నవంబర్ యెనిమిదో తేదీ నంచి ;

ప్రశాంతంగా ప్రమోదంగా సాఫీగా సుభిక్షంగా సాగుతూంటే— "నీ మొహం నీకేం తెలుసోయ్ శ్రీపతీ-అని అనుకుంటూ పత్రికాఫీసులోకి దార బడ్డాడు శ్రీపతి.

# 85

డిసెంబరు ఆఖరి వారపు రాత్రి చలిలో రగ్గు కప్పుకుని పడుకునుంది. సీత. నిద్ర వొచ్చేలావుంది. నిద్ర పోనూవొచ్చు గానీ భర్త విజయకుమార్ వొచ్చేసరికి మెలుకువగా వుండకపోతే అతనికి కోపం వొస్తుంది. సీతకి విజయ్‌కుమార్‌తో గత అక్టోబర్‌లో పెళ్ళయింది.

పెళ్ళికి ముందు, విజయ్‌కుమార్ బంధువు కొడుకు శంకర రాజేంద్ర ప్రసాద్—అతని వయసువాడే— అన్నాడు విజయ్‌కుమార్‌తో — మీ నాన్నా మా వాళ్ళూ కలిసి నీకు పెళ్ళి సంబంధం చూస్తున్నారు యేమంటావు? పెళ్ళి చూపువేళకి వుత్తరం రాస్తాం—అనిఅంటే; "మనకి వొకళ్ళు యెట్లాగూ వాలదు. యేదొకటి వాళ్ళిష్టం. ఖాయపరచమను. పెళ్ళిచూపులూ గిళ్ళిచూపులూ యేం అక్కర్లా" అన్నాడు విజయ్‌కుమార్.

విజయ్‌కుమార్ తండ్రి కనకారావు వో సంబంధంపైపు మొగ్గు చూపాడు. వాళ్ళ వూరి దగ్గిర్లో వూరే. పది లక్షలదాకా కట్నం యిస్తారు. పెళ్ళిలో ఐదు లక్షలు రొఖ్ఖం యిచ్చేటట్లు, మిగతా ఐదు లక్షలు బొంబాయిలో వొక మిల్లులో వాళ్ళకున్న వాటాల్లోంచి పిల్ల పేర రాస్తారట. పెళ్ళి హైదరాబాద్‌లో వాళ్ళ అన్నవన్ రూఫ్ గార్డెన్‌లో జరపాలనుకున్నాడు కనకారావు. కానీ తమ్ముళ్ళతో సంప్రదించిన మీదట —"అక్కడైతే బోలెడు డబ్బు తగలేసి అట్టహాసంగా పెళ్ళి జరిపించాలి. అందువల్ల వొరిగేదేం లేదు. ఆ నా కొడుకులందరూ మనదగ్గిర బాగా మింగే కూర్చున్నారు. మింగుతానూ వుంటారు." అని వూళ్ళోనే ఘనంగా జరపదలిచాడు. వూళ్ళో అయితే యెంత ఘనంగా జరిపినా ఆ ఖర్చు యేమంత లెక్కలోకి రాదు.

సీత యేమంత బాగోదు. అలా అని వికృతంగానూ అనిపించదు. వో రకంగా బాగానే వుంటుంది. పరస్పరం మనసులు కలిస్తే ఆకోసమవ్వే అవదు: బాగానే అనిపిస్తుంది. యింటర్ దాకా చదువుకుంది వూళ్ళోనే.

అలా విజయ్‌కుమార్ పెళ్ళి జరిగింది. పెళ్ళి జరిగిన వెంటనే శోభనం. అదీ వూళ్ళోనే ఏర్పాటు చేశారు.

సీత శోభనం లాగా సీత శోభనమే వుంటుంది. అలా యింకొకరి శోభనం వుండదని కాదుగానీ చాలా అరుదుగా వుంటుంటాయి అలాంటి శోభనాలు.

వెళ్ళి గట్టిగా కౌగిలించుకున్నాడు—యెముకలు విరిగిపోతా యేమోనన్నంత గట్టిగా, ఆమె బాధ, "వూఁ" అన్న సవ్వడిలో కలిసింది.

పెదాలమీద గంటుపడేలా ముద్దుపెట్టుకున్నాడు. బుగ్గ కొరికాడు. గంటుపడి—గంటు, నెత్తుటిజీరతో మెరుస్తోంది. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

యివన్నీ తలుపుకివతల రెండు నిమిషాల్లో జరిగిపోయాయి.

అతను యే స్త్రీతో ఐనా యిలాగే ప్రవర్తిస్తాడు. యిప్పుడు సీత తోను అంతే. సీతేం పైనుంచి దిగిరాలేదు. ఆ మాటకొస్తే సీతకంటె అతనికి "పరిచయం" వున్న స్త్రీలలో కొందరు చాలా బావుంటారు.

ఆ వెంటనే మంచం దగ్గిరికి నడిపించుకొచ్చాడు. యెంతైనా సిగ్గుపడుతూ తడబడుతూన్న శోభనపు పెళ్ళికూతురుగా.... అనుకుని నడిపించుకొచ్చాడు.

మంచంమీద కూచోబెట్టి, పరుపుమీదకి వొంచి పడుకోబెట్టాడు.

ఆమె బట్టలు వొలుస్తున్నాడు. చేతులతో అడ్డగించినట్లుగా సిగ్గుగా చేతులు జరిపి రెప్పలు మూసుకుంది.

ఆమె చేతులను తోసేసి, బ్లౌజు హుక్కులు తెంచినట్లుగా లాగేశాడు. హుక్కుల దగ్గిర బట్ట చిగిలింది. ఆమెని అటూయిటూ తిప్పుతూ బట్టలన్నీ పీకి పారేశాడు. ఆమె పైకి జరిగాడు.

"అమ్మో...." అని గట్టిగా అరిచింది.

తను యెంత మొరటుగా ప్రవర్తించిందీ గమనించుకోకండా, "యేం పీక నులిమి చంపినట్లు అరుస్తావే" అని చీదరించుకున్నాడు.

పని ముగించుకుని తృప్తిగా ఫీలయ్యాడు.

"బాగుందా" అన్నాడు.

ఆమె మౌనంగా వుండిపోయింది.

"యేంమ్మాట్లాడవేం?"

"వూఁ" అంది.

సిగరెట్టు వెలిగించుకుని రెండుదమ్ములు లాగాడు. వొకసారి చను మొనకి అంటించాడు, యెర్రటి సిగరెట్ కొస. అదిరిపడింది— బాధతో భయంగా.

పకపకా నవ్వి, "తమాషాగా అనిపించలా" అన్నాడు.

దక్షిణాదికి వ్యాపిస్తున్న జయప్రకాశ్ వ్యాధి

మరో నిమిషానికి సిగరెట్ కొసతో తొడమీద అంటించాడు.

బాధని యెగశ్వాశలోంచి పీల్చింది.

మరో రెండు నిమిషాలకి, విజయ్‌కుమార్ గాఢంగా నిద్రపోతు న్నాడు.

ఐదు నిమిషాలకి—అతను నిద్రోతున్నాడని గమనించింది, సీత. లేచి నేలమీద పడివున్న తన బట్టలమీద కూలబడి, పైకి వినిపించకండా భారం దిగిపోయేలా యేడ్చి యేడ్చి అలిసిపోయి — తెలియకండా అక్కడే నిద్రపోయింది

తొలిరేయే కాదు మలి రేయే కాదు — అన్ని రాత్రులూ, వున్న అన్న రాత్రులు - కొంచెం అటూయిటూగా అలాగేవుంటాయి, సీతకి.

మూడు రాత్రుల తరవాత హైదరాబాదు పంపించారు.

ఐదోరోజుకి జ్వరంగానూ యెలాగో అనిపించింది. వొళ్ళంతా బాధగా. వొళ్ళు నొప్పులు బాధ ఐతే సరే— తెలుస్తూనే వుంది జ్వరంగా వుందనిపించింది.

విజయ్‌కుమార్ తండ్రి వాళ్ళవూళ్ళోనే వుంటూంటాడు. యెక్కువగా అతని తల్లి కూడా అక్కడే వుంటుంది. అక్కడా గుంటూర్లోనూ వ్యవహారాలు చూసుకుంటూ వుంటాడు. అప్పుడప్పుడూ హైదరాబాద్ వచ్చి వ్యవహారాలు గమనించుకు పోతూంటాడు. యిక్కడ పినతండ్రి వుంటాడు. పినతండ్రి యింట్లోనే విజయ్‌కుమార్ వుంటాడు. పినతండ్రికి పిల్లలు లేరు. ఆ విధంగా అన్నదమ్ములిద్దరికీ విజయ్‌కుమార్ వొక్కడే కొడుకు.

సీత వొంట్లో బావుండలేదన్నట్లు గమనించిన అతని పినతండ్రి భార్య పరామర్శించి, వాళ్ళ డాక్టరు దగ్గిరికి వెళ్ళమని కారులో పంపించింది. రెండు రోజుల క్రితం డాక్టరు యింటికి వొచ్చినప్పుడు మా కోడలు విజయ్ భార్య అని చూపెట్టి చెప్పింది.

డాక్టరు సీతని పరిశీలించి వో యింజక్షను చేసి మందులిచ్చి "రేపు వొచ్చి యింజక్షను చేయించుకోమ్మా. రావటానికి వీలుకాకపోతే ఫోనుచేసి చెప్తే నర్సుని పంపిస్తాను." అన్నాడు.

ఆ తరవాత రెండు గంటలకి, రాత్రి తొమ్మిదింటికి, ఫోనుచేసి విజయ్‌కుమార్ కోసం అడిగాడు డాక్టరు. విజయ్‌కుమార్ అప్పుడే బయట నుంచి వొచ్చాడు. యింకా బట్టలైనా మార్చుకోలేదు.

ఫోను అందుకుంటే "చూడు బాబూవిజయ్, నీ గురించి చూచాయగా యిదివరకు తెలుసు. యివాళ సీతని పరీక్షించాను. నీ విషయం నీకు తెలిసిన వాడివి సొంతభార్య విషయంలో జాగ్రత్తపడాల్సింది. నువ్వంటే-నీవొంట్లో యింకిపోయినయ్. అంత యిబ్బంది వుండను నీకు. వున్నా యేం చెయ్యాలో అనుభవం వున్నవాడివేగా—" అన్నాడు.

"సారీ డాక్టరుగారూ పొరపాటు జరిగిపోయింది యింక అట్లా జర గదు" అని చెప్పి తన గదిలోకి సీతను పిలుచుకువెళ్ళి తలుపువేసి, "డాక్టరు దగ్గరికెందుకెళ్ళావ్" అన్నాడు కోపంగా.

"నీ వొంట్లో బాగున్నట్లుగా లేదు సీతా, డాక్టరుగారి దగ్గిరికెళ్ళిరా. అని చిన్నత్తయ్య అంది." అని చిన్నగా అంది సీత.

"మొగుణ్ణి నేనున్నానని గుర్తుండక్కర్లా? నాకు చెప్పకుండా యెక్కడి కంటె అక్కడికి పోటమేనా? ఆ మాత్రానచచ్చిపోవు. నాకుచెప్తే నేనివ్వనూ మందులు? ఆ డాక్టరెవడికంటె నాకే బాగా తెలుసు మందులు" అన్నాడు కోపంగా. గుడ్లురిమి చూశాడు.

తలవూపింది సీత, భయం భయంగా.

అతని యింట్లాటి క్రూర ప్రవర్తనని అతని స్త్రీలందరూ సహిస్తారు, గింజుకునే దానికి మరికొత్త దబ్బు పారేస్తాడు. అలా ఐన అతని ప్రవ ర్తనని భరించలేని సహించలేనివాళ్ళు అతనిని యిష్టపడక తప్పించుకుంటారు దిలావర్ యెంత ప్రలోభపెట్టి ప్రయత్నించినా.

వొకసారి మాత్రం, వొకేవొక్కసారి—

నిజాం కాలేజీలో యేవో ఫంక్షన్స్ వుత్సాహంగా కోలాహలంగా జరుగుతున్నాయ్. మూడురోజుల కార్యక్రమం. మొదటిరోజున వందన భరతనాట్య కార్యక్రమం. అందరూ యెంతో మెచ్చారు. నాట్యం తెలిసిన వాళ్ళు కూడా. వొక నాట్యాచార్యుడు— "గొప్ప నాట్యకత్తెవి కాగలవమ్మా. గొప్ప నాట్యకత్తె సాధారణంగా కొన్ని అసాధారణ కఠోర నియమాలు పాటించాలి. కొన్నిత్యాగాలు చెయ్యాలి" అన్నాడు. ఆమెకితెలుసు అవేమిటో. తనకి యిష్టంకూడా. పెళ్ళి చేసుకోదలచలేదు. తల్లి కాదలచలేదు. ఆమెకి అసలు పురుష సంపర్కం అంటేనే యేవగింపు. అంతకంటె మించి-పురుష అంటే తనకే సరిగా తెలియని వొకలాంటి కక్ష. తన నాట్యాన్ని మెచ్చు కోవటం వరకే పురుషులతో ఆనందిస్తుంది. ఆఖరికి వ్యక్తులుగా కూడాఅం

రుచించరు — మాట్లాడుతూ రూచోవటం కూడా.

రెండోరోజు ఫంక్షన్‌లో రాత్రి తొమ్మిదిన్నరకి ఒంటరిగా వెళ్ళి వొస్తున్న వందనని చూసి చకచకా నడిచి వెళ్ళి, నిన్నటి ఆమె నాట్యాన్ని అమితంగా మెచ్చుకున్నాడు విజయ్‌కుమార్. అతని స్వభావం తెలిసినందున నిజాయితీ లోగట్టు కాదని తెలిసినా సంతోషించింది. "థాంక్యూ" అంది.

మసక చీకటి.

"వందనా, నిన్ను ప్రేమిస్తున్నాను." అని దర్పంగా అంటూ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

రెండో చేత్తో చాచి చెంపమీద కొట్టింది.

విజయ్‌కుమార్‌కి—యే స్త్రీ ఐనా తనంటే భయపడటమే తెలుసు గానీ, తన చెంప వాయించటం తెలియదు. అతని చెయ్యి చటుక్కున [?] విడివడిందిగానీ—

"చూడు నిన్నేం చేస్తానో పూచిక పుల్ల లంజా." అని వ్యంగ్యంగా చూశాడు.

"నీ అంత వల్గర్‌గా మాట్లాడటం నీలాంటి వాళ్ళకే చేతవవుతుంది. కానీ, నీకేదో డబ్బూ పలుకుబడీ, నీ చుట్టం ఆ చవట డి. ఐ. జీ. యస్. వి. గంగారావూ వున్నాడని విర్రవీగకు. మిమ్మల్ని మించిన వాళ్ళు కూడా వుంటారుసుమీ. ఐతే వాళ్ళు దర్పంతో [?]గా దుర్వినియోగపరచరు. నాలాగా కొందరు సద్వినియోగపరుస్తారు. పిచ్చి పిచ్చి ఆలోచనలు మానుకో" అంది యింగ్లీషులో. ఆమె గొంతులో యెంతో దర్పం, ధీమా, ధైర్యం.

ఆమె స్థితిగతులు తెలిసినా, యీ సంఘటన జరిగిన తరవాత మరికాస్త తెలుసుకున్నాక— గప్‌చిప్‌గా వందన అని వొక అమ్మాయి వుందనే గుర్తు లేనట్లుగా వుండిపోయాడు.

యీ వొక్క అపశృతీ తప్పించి, అతని జీవితంలో తన క్యూరశృతి యేనాడూ అపస్వరం పలకలేదు.

ఆ తరవాత సీత మళ్ళా డాక్టరు దగ్గిరికి వెళ్ళనేలేదు. వొకసారి డాక్టరు యింటికొచ్చినప్పుడు పరామర్శిస్తే —బాగానే ఆరోగ్యంగా వున్నట్టు చెప్పింది సీత.

భర్త విజయ్‌కుమార్ యిచ్చిన మందులు మింగుతుంది. అనారోగ్యం మందులు, అనారోగ్యం, మందులు. అనారోగ్యం.

అలా యీ మూడు నెలలుగా గడుపుతున్న సీత, యివాళ యీ డిశంబరు ఆఖరి వారపు రాత్రి చలికి రగ్గు కప్పుకుని పడుకుంది — నిద్ర మేలుకుని.

భర్త విజయ్‌కుమార్ పదకొండుకి వొచ్చాడు. మంచి వుత్సాహంగా వున్నాడు పూటుగా తాగి వున్నాడు. మందు పార్టీ. బ్రాందీతో నిండిన అతని వొళ్ళువెచ్చగా వుంది. వుక్కగా ఆరిపించి చకచకా బట్టలు తీసేసి లుంగీ చుట్టుకున్నాడు.

సీత కప్పుకున్న రగ్గు, తీసి పక్కకి పారేశాడు.

ఆమె బట్టలు వొలిచేశాడు నిమిషంలో.

ఆమె చలికి వొణికిపోతోంది—మేడమీది గదికిటికీలోంచి వొస్తున్న డిశంబరు నెలాఖరు హైదరాబాదు చలిగాలికి.

కాళ్ళ దగ్గిరగా వున్న రగ్గు తీసి కప్పుకోబోయింది.

"ముసిలిముండల్లే అట్లా వొణికి చస్తావేం?" అని చీదరించుకుని రగ్గు లాగి నేలమీదకి విసిరేశాడు.

ఆ తరవాత అతని కార్యక్రమం యథాప్రకారం చకచకా జరిగిపోయింది.

ఐదు నిమిషాలకి గాఢంగా నిద్రపోతున్నాడు, రగ్గు కప్పుకుని.

పది నిమిషాలు గడిచాయి.

ఆ చలికి ఆమె వొణికిపోవటం లేదు. బట్టలైనా వేసుకోలేదు. అట్లాగే కూచునిపోయింది. చలిలో చల్లని గచ్చుమీద.

అరగంట గడిచింది.

లేచి బల్ల దగ్గిరికి వెళ్ళి, పళ్ళుకోసే చాకు తీసింది. చేత్తో గట్టిగా పట్టుకుని గొంతు దగ్గిర కత్తి మొన ఆనించుకుంది సీత.

నాలుగు క్షణాలు.

వొణికిపోతుంది. చలికి కాదు, భయానికి. కళ్ళవెంట నీళ్ళు.

కత్తి బల్ల మీదకి. ఆమె మంచంమీదకి.

# 86

**అక్టోబరు** నెల. కాలేజీలకి సెలవులు. గాయత్రి రోజంతా యింట్లోనే వుంటోంది చదువుకుంటూ.

మోహన్‌రెడ్డి సాయంత్రం అలా వెళ్ళి వొస్తాడు వొక్కోరోజు. వొక్కోరోజు ఆలస్యంగానూ వొస్తాడు— యే చర్చలలోనో దిగి, వుపన్యాసం మొదలెట్టి.

గాయత్రి ఇంట్లోనే వుంటున్నందువ కూతురు అరుణని తన అమ్మా నాన్నల యింటికి తీసికెళ్ళనివ్వటం లేదు. మీ అమ్మా నాన్నా బెంగ పడి పోతున్నారు— అని వొక్కోరోజు అరుణని తీసికెళ్ళిపోయి నాలుగైదు గంటలు అక్కడ వుంచుతాడు మోహన్‌రెడ్డి. గాయత్రి తల్లిదండ్రులతో మోహన్‌రెడ్డికి మంచి సఖ్యత యేర్పడింది. అతనిని వాళ్ళు యెంతో ప్రేమగా చూస్తారు.

కోర్టు విచారణ సందర్భం అప్పుడు "యింటికి రా—మ్మా" అన్నాడు రామనాథం వొకసారి.

మోహన్‌రెడ్డి ఆ మాట వొకసారి గుర్తుచేసి "యెందుకొచ్చిన పట్టింపులు. వెళ్తే యేంపోయింది. వాళ్ళెంత యిదై పోతున్నారో తెలుసా?" అన్నాడు.

"మాటవరసకో, ఆ క్షణంలో ఆ యిదిలో యేవో అనేసినంత మాత్రాన వెళ్ళటానికి నాకు సిగ్గులేదూ? నేను గాయత్రిని. ఆ విధంగా ఆ గడప దాటి వొచ్చిన గాయత్రి మళ్ళీ ఆ గడప తొక్కదు. నేను తన కూతురినే కాదన్న మా నాన్న యిక్కడికొచ్చి రమ్మని పిలిస్తే యేమో చెప్పలేను" అంది. యీ మాట రామనాథంతో యెలా అనాలో చాతకాక అనలేదు మోహన్‌రెడ్డి. యిదే విషయం మరొకసారి గుర్తుచేస్తే, "నువ్వు మీ నాన్నగారింటికి వెళ్ళరా నీ అంతట నువ్వు. అప్పుడు చూస్తా నేను" అంది గాయత్రి.

"నేను వెళ్తే నువ్వు వెళ్తావా?" అన్నాడు మోహన్‌రెడ్డి.

"నీకు వొకవేళ సిగ్గులేకపోయినా నాకు వుంటుంది. నేను వెళ్ళను. నీకు సిగ్గుంటే మా వాళ్ళింటికి యెందుకెళ్తావు? నాకు తల్లిదండ్రులు కాని వాళ్ళు నీకు అత్తమామ అవుతారా? పైగా కన్నబిడ్డని వాళ్ళకప్పగిస్తున్నావు" అని నిందించింది.

"మా అమ్మ వొచ్చి పిలిస్తే మా యింటికి వెళ్తావా లేదా చెప్పు",
. అన్నాడు మోహన్‌రెడ్డి.

"హిందూసతి భర్త అనుమతి తీసుకోకుండా భర్త అభీష్టానికి వ్యతి రేకంగా బిడ్డలకోసమైనా యేమీ చెయ్యకూడదు. మీ అమ్మా హిందూసతే మా అమ్మా హిందూసతే. యేడుస్తూ యింట్లోకూచుంటారు మనసు చంపు కుని " అంది గాయత్రి. "మన తండ్రులూ మనసు చంపుకునే బాధపడు తున్నారు."

"అది వాళ్ళ మూర్ఖపు పట్టుదల వల్ల. దానికి వాళ్ళే బాధ్యులు"

ఐతే, మోహన్‌రెడ్డి తల్లి యేమైనా వొండి పంపిస్తే తిరస్కరిం చదు. తన తల్లి యేమైనా వొండి పంపినా తిరస్కరించదు.

కానీ తన కూతురు వాళ్ళెవరి దగ్గిరా పెరగకూడదని గట్టిగా అను కుంది. అది సరియైన వాతావరణం కాదు అనుకుంది.

అక్టోబరులో వున్నట్లుండి అరుణకి జ్వరం విపరీతంగా వొచ్చింది. వెంటనే డాక్టరుకి చూపెట్టారు. చికిత్స చేస్తున్నాడు. మూడు రోజులైనా తగ్గలేదు. మరో యిద్దరు పీడియాట్రిషియన్స్‌కి చూపెట్టారు. చికిత్స చేస్తు న్నారు.

రాత్రీ పగలూ నిద్ర లేకుండా వొళ్ళో పెట్టుకుని కూచుంటుంది, గాయత్రి. వాళ్ళవాళ్ళు అడిగితే, "గాయత్రి వూరెళ్ళింది. కూడా అరుణని తీసికెళ్ళింది—అని చెప్పు వాళ్ళతో" అంది మోహన్‌రెడ్డితో. ఆమెకి యిష్టం లేదు వాళ్ళ సేవలు.

పదోరోజు రాత్రి అరుణ చనిపోయింది.

గాయత్రి యేడ్చింది. యెన్నడూ యేడ్వని గాయత్రి రాత్రంతా, మర నటి పగలంతా.

యేం జరుగుతున్నా యెన్ని జరుగుతున్నా లెక్కచెయ్యకుండా తల యెగరేస్తూ అన్నిటినీ దూరంగా నెట్టేసుకోగలిగిన గాయత్రి యేడ్చియేడ్చి—

మూడు రోజులైనా వొక్క మెతుకుతినలేదు, మంచినీళ్ళు మోహన్ రెడ్డి మరీ బలవంతం చేసి బ్రతిమిలాడగా నాలుగు గుక్కలు టీ గానీ కాఫీ గానీ.

అప్పటినుంచి గాయత్రి స్తబ్దుగా వుంటూంది. యెప్పుడూ కూతురు ఫోటో వంక చూస్తూ కూచుని వుంటుంది.

మోహన్‌రెడ్డి కనిపించినప్పుడల్లా రామనాథం అడుగుతున్నాడు. "గాయత్రి యింకారాలేదా! చిట్టితల్లిని వొకసారి తీసుకురాబాబూ యెన్నాళ్ళైనట్లుంది చూసి" అని అంటే "యింకా రాలేదు. తన స్నేహితురాలు బలవంతం చేస్తే అక్కడే వుండిపోయింది." అనిచెప్పాడు.

కాలేజీలు తెరిచారు. గాయత్రి వెళ్ళటంలేదు. యింట్లోనే వుంటోంది.

రామనాథం మళ్ళీ అడిగితే—కాలేజీలు తెరిచినందువ గాయత్రి తిరిగి వొచ్చిందనీ పిల్లని తీసుకురావటం యిష్టం లేదని— అనుకుంటాడే మోవని, యెప్పుడైనా చెప్పాల్సిందిగా అని విషయం చెప్పాడు.

"చిట్టితల్లికి అంత జబ్బుచేసినప్పుడు వాకెందుకు చెప్పలేదు బాబూ?" అని అడిగాడు రామనాథం.

మోహన్‌రెడ్డి మౌనంగా వున్నాడు.

"ఆ తరవాతైనా చెప్పొచ్చుగ బాబూ మేమేం పాపం చేశాం?"

"గాయత్రి, చెప్పక్కర్లేదంది" అన్నాడు చిన్నగా.

పెదవులు బిగించి, భారంగా శ్వాస విడిచి స్వాభిమానంగా ముందుకి చూస్తూ, "వస్తా బాబూ" అని ముందుకు వెళ్ళిపోయాడు, రామనాథం.

కాలేజీలు తెరిచి పదిహేను రోజులైనా గాయత్రి యింట్లోంచి బయటికి కదలటం లేదు.

మోహన్‌రెడ్డి పోరు భరించలేక కాలేజీకి వెళ్ళటం మొదలెట్టింది. చదువుమీద వుత్సాహం లేదు.

సాంఘిక ఆర్థిక అన్యాయాలు, మార్క్సిజం లాంటి అంశాలు తెస్తే ఆ వ్యధ మరిచి మాట్లాడటం గమనించిన మోహన్‌రెడ్డి వీలైనంతవరకు యేదొకరకంగా ఆ విషయాల ప్రసక్తి తెస్తున్నాడు.

వొకసారి, "యేమిటి యీ మధ్య నీకు అస్తమానం అదే స్మరణ ఐపోయింది?" అంది గానీ గ్రహించలేకపోయింది— అతను యెందుకు ఆ విషయాల ప్రసక్తి యెక్కువగా తెస్తున్నదీ.

మరో నెల గడిచింది. డిసెంబరు ఆఖరి వారంలో వుదయం పూట వొకావిడ పసిబిడ్డతో యింటికి వొచ్చింది. మోహన్‌రెడ్డి బంధువునని చెప్పింది. తనకి గుండె జబ్బు అనీ యిక్కడ పెద్ద డాక్టరుకి చూపెట్టుకోమంటే వొచ్చిందట. భర్తకి తీరిక లేదట. "మన మోహన్ వున్నడు అన్నీ వాడే చూస్తడు పో" అని భర్త పంపితే వొచ్చిందట. రాత్రికి మోహన్‌రెడ్డి

వొచ్చాడు. ఆమె తన విషయం చెప్పింది. ముందు గదిలో ఆమెకి పడక యేర్పాటు చేశారు.

పొద్దుపోయాక పడకగదిలో, గాయత్రిని దగ్గిరికి తీసుకుంటూ, "ఆమె చాలా దూరపు చుట్టం. అవసరానికి వొచ్చినది. రేపు కార్డియాలజిస్ట్‌కి చూపెట్టి ప్రెస్‌క్రిప్షన్ యిప్పించి పంపేస్తా" అన్నాడు. "వుండనీ పాపం నాలుగు రోజులు. గుండె జబ్బు కదా" అంది గాయత్రి.

డాక్టరు దగ్గిరికి తీసుకెళ్ళాడు. పరీక్షలూ అవీ అవటానికి, నాలుగు రోజులు పట్టింది. ఆస్పత్రికి వెళ్ళేటప్పుడు బిడ్డని గాయత్రికి అప్పగించి వెడుతుంది. గాయత్రి చూస్తుంది. పిల్ల ముద్దొచ్చేలా వుంది. గాయత్రికి యేదో తృప్తిగా అనిపిస్తుంది ఆ పిల్లని వొళ్ళోకి తీసుకుని కూచుంటే.

ఐదో రోజున ముందు గదిలో కూచుని యేడుస్తున్న ఆ పిల్లని వొళ్ళో పడుకోబెట్టుకుని యేడ్పు మాన్పించటానికి ప్రయత్నిస్తున్న గాయత్రి, వంట గదిలో ప్రెజర్ కుక్కర్ మోత వొకటే యిదిగా వినిపించటంతో, పిల్లని చాపమీద పడుకోబెట్టి లోపలికి వెళ్ళి స్టవ్ ఆఫ్‌చేసి ముందుగదిలోకి వొస్తోంది.

అదే వేళకి బయటినుంచి వొచ్చిన ఆమె బిడ్డని అమాంతం చేతుల్తో యెత్తుకుని, గుండెలకి హత్తుకుని యెదురుగా కనిపించిన గాయత్రిని చూసి, "కమ్యూనిస్ట్ బోరికేమెరిక తల్లి మనసు!" అని అసహ్యించుకుంది.

గాయత్రికి దుఃఖం పొర్లుకొచ్చింది. గిరుక్కున తిరిగి లోపల గదిలోకి వొచ్చింది. కుర్చీలో కూలబడింది.

వొక క్షణం.

టేబిలుమీది పుస్తకాలూ, కాగితాలూ గదంతా చెల్లాచెదురుగా విసిరేసింది.

టేబిలు మీద ఫొటోలో తన అరుణ బోసి నవ్వులు.

ఆ ఫొటో చేతుల్తో పట్టుకుని లేచి మంచం మీదకి బొక్కబోర్లా వొరిగింది.

దిండు మీద ఫొటో. ఫొటో మీద గాయత్రి ముఖం.

గాయత్రి ముఖం నిండా ఫొటోనిండా అరుణ ముఖం. అరుణ ముఖం నిండాఫొటో. ఫొటో నిండా గాయత్రి ముఖం. గాయత్రి ముఖం నిండా అరుణ ముఖం.

ముఖం నిండా ఫొటో నిండా కన్నీళ్ళు.

వెక్కి వెక్కి పడుతోంది గాయత్రి.

"పోవే బోడీ—"అని అనలేకపోయిన గాయత్రి—వెక్కి వెక్కి పడు తూనేవుంది—గాయత్రి.

ఆ మరసటి రోజు సాయంత్రం మోహన్‌రెడ్డితో కలిసి బయల్దేరింది బయటికి—అతని చెయ్యి తన చేత్తో పట్టుకుని.

యెంతో బాగా పరిచయమైన వీధిలోకి మళ్ళింది. వాళ్ళమ్మానాన్నల యింటి గేటు తెరిచి "అమ్మా—" గుమ్మంలో కాలు పెట్టింది, గాయత్రి.

# 87

శ్రీపతి లేపాక్షి షాపులోంచి బయటికి రాగానే అటునుంచి కాలిబాటమీంచి నడిచి వొస్తున్న వొకామె కనిపించి—

—యీ బొడ్డుకింది చీరకట్టులో జనాన్ని చూడలేక చోకాపోంది. తిర గలి కంతలా బొడ్డు. మధ్యభాగం కాబట్టి నడుం అని అనుకోవాల్సొచ్చే నడుంకి అటుపక్క, యిటుపక్క కిందికి జారిన కండలు. చిరు బొజ్జ- పవిట కప్పకూడదూ—యీ బొజ్జరాణి—ఆహాఆహా వన్ను చూడు బొజ్జ చూడు నా కలుగుబొడ్డు చూడు అంటూ— యే ఘటోదరీబొడ్డు కిందికి చీర కట్టటం నిషిద్ధం అని శాసనం చేస్తే బావుండును.

— కానీ చక్కని ఆకృతి ఐతే అలా కట్టుకుంటే యెంత బావుం టుందో— కాని యెక్కడన్నా వో తలోదరి వో శాతోదరి కనిపిస్తే అది ఖాయంగా గోక్కోడ పెఫ్ఫంటుంది. యెక్కడ చూసినా రుబ్బురోళ్ళా దబ్బ నాలా— యీ తల్లి వస్త్రాదులా కండలు తిరిగిన జబ్బలు కనిపించేలాగా ఆ పొట్టిచేతుల బ్లోజు—అమ్మయ్య బతికించింది. రోడ్డు మీదకి మళ్ళింది. ఆ సందులోకి దొర్లిపోతుంది .... కుయ్ కుయ్ కుయ్ కుయ్ కుయ్ కుయ్ కు య్ కు య్ కు య్ క య్ కు య్ క య్ కుక్కల గుంపు — వొకటీ రెండూ మూడూ నాలుగూ ఆరూ యెనిమిదీ పదీ పన్నెండూ—కొట్లాట—వాటికిపక్కగా ఆడకుక్క వొకటి వాటిని పూరిస్తూ నక్కుతోంది. పది పన్నెండు ఆడ కుక్కలు వొక మగ కుక్క ఐతే యెలా

వుండునో— అదైనా మగ్గైనా మాత్రం వాకటే—వన్ యట్ యె టైం—పంచదార కూడా అదే యేర్పాటు చేశాడు వ్యాసమహర్షి — అందుకే కాబోలు పంచదార అంత శీప్! కానీ సాంఘికంగా కుక్కలకిసాంఘికవ్యవస్థ వుంటుందా ........

జాన్ కంపెనీ బార్ బేకరీ ముందు నుంచి నడిచి రోడ్డు దాటి అటు వైపునున్న పాత పుస్తకాల షాపులోకి వెళ్ళాడు శ్రీపతి.

యెమర్జన్సీలో పత్రికలేఁవిఁటి. రిపోర్టింగేఁవిఁటి నా మొహం. కలెక్టరో అర్డీవోవో కాదంటే తాసిల్దారో చూసి అచ్చువేస్తారు. మనం దేవికి—యమ అగ్జెన్సీ—యముడి అగ్జెన్సీ—యాముడికి స్త్రీ లింగమేఁవిఁటి—అంటూ పత్రిక పని మానేశాడు శ్రీపతి.

అప్పుడు వెదక గడికోనం చూస్తే హైదర్‌గూడా ప్రాంతంలో దొరికిన రెండు గదుల వాటాలోనే వుంటున్నాడు. వంటగది నిరుపయోగం.

శ్రీపతి అడిగిన మూడు పుస్తకాలూ లేవన్నాడు షాపు అతను.

చూస్తున్నాడు.

పది నిమిషాలు.

ట్రాట్‌స్కీ పుస్తకం "ది రెవల్యూషన్ బిట్రేడ్" తీసి చంకనపెట్టుకుని పుస్తకాలు వెతుకుతున్నాడు.

మరో పది నిమిషాలు.

మరో పుస్తకం—కెరొలిన్ బర్డ్ పుస్తకం, "బోర్న్ ఫిమేల్" తీశాడు.

—"ట్రాట్స్కీకి బర్డ్ ట్రాట్స్ బర్డ్ కి. సోగ్గాడు — సోగ్గాడెవరు శోభనా, రాష్ట్రీపు కొత్త సోగ్గాడు సుఖాడియా. యెమర్జన్సీలో గవర్నర్లతో వొక్కొసారి మహా అవసరం వుంటుంది. ఆ మొన్న యూ. పీ, నిన్న కంప్షన్ పేరిట డి. యం. కే కి పుట్వానవ—యవ్వనం కాటేసింది. ఆ కొత్త పిల్ల జయచిత్ర గొంతు అదోలా యిదిగా బాగా వుంటుంది — సోగ్గాడి సరసనా అదే—కాపీ యవ్వనం కాటేసింది. యవ్వనం అంతే. అది పాపిష్ఠిది. కాటేస్తుంది. పాపం ఆ నెల్లూరి కుర్రజాణల జంట చంద్రికా కళారాణులు—యస్సెకీ కంట్రాక్టరుకీ శిక్ష—వాళ్ళకేం శిక్ష. పై కోర్టులో కొట్టేస్తారు — చోటీసీ బాత్. యెమర్జన్సీలో యేఁవిఁటా చిన్న మాట—ముఝె జీనేదో—ఆలాగే గాంధీగారి మూడు కోతుల సూక్తి పాటిస్తే అలాగే బతకనిస్తాం.

వహీదా—అంతులేని గథ. ఆ కొత్త గంట సేపుగా పెరిగిన పెరుగు
తోటకూర కాడలా వుంచి కళగానూ, ఆ పళపాళం కుర్రాడు వృత్త పోరీ
వాడు—అంతులేని కథ అంతులేని కథే. పొడిగిస్తూ పోదనేమిటి. అడుతూ
పోతే పాడుతూ పోతే అంతులేని కథే యీ యెమర్జన్సీ — యిది యెమ
ర్జన్సీగా తిరుగుతున్నాయి....

శ్రీపతి రోడ్డు దాటాడు.

—సర్దుబాటైనట్లుంది ఆ మగకుక్క దేనికి ఆగినట్లు— రోడ్డుకి
అటుగా ఆ పోడే ఆడ గట్టుకుక్క—మగకుక్క దాటిరేసి—దాని చూపు
అదోలాగా యేదో పాత పరిచయం జ్ఞాపకం రావటంలాగా —ఆడకుక్క
రవంత తలతిప్పి మగకుక్కని చూసి అలిగినట్లుగా అటు తిరిగి—మగకుక్క
ముందుకు వెళ్ళింది. మిగతా కుక్కలన్నీ యేమైనట్లు—యిది వాట్లన్ని
టినీ జయించిందా—యేదో ట్రిక్కు చేసిందా—యింత అవస్థ దేనికి ఆ కుక్క
కోసం—యే కుక్క ఐతే యేం. ఆడకుక్క ఐతే చాలదూ— కుక్కలకి కూడా
మనసుపడటం వుంటుందా—యే ఆడదైనా పోకడే వనిపించే మనుషులకంటే
యీ కుక్క....అసలు వేళకాని వేళలో—దేశానికిలాగే అర్ధరాత్రో అపరాత్రో
కుక్కలకూ కా వృత్తికాత్తైలో యెమర్జన్సీవొచ్చి.......

నాలుగు గంటల ఎండ వేళ. యెండ మండుతోంది, సన్నగ
తీక్షంగా. శ్రీపతి సెయింట్ జార్జెస్ స్కూలు దగ్గిర చెట్టుకింద నిలుచు
న్నాడు—

మగకుక్క ఆడకుక్కని సమీపించింది. ఆడకుక్క చటుక్కునఅవత
లికినడిచింది. మగకుక్క నిలుచునిపోయింది.ఆడకుక్క పక్కచూపుతో మగ
కుక్కని చాటుగా గమనిస్తూ నుంచుంది. చటుక్కున ముందుకి అడుగులు
వేసి ఆడకుక్కని మెడ దగ్గిర కరిచింది. ఆడ కుక్క దగ్గిరిగా జరిగింది.
పక్క పక్కన రాసుకుంటూ నడుస్తున్నాయి.

కింగ్ కోఠీ రోడ్ ట్రాఫిక్లో కలిసే దగ్గిర ఐలాండ్ మీదకి చేరుకు
న్నాయి, కుక్కలు రెండూ.

వాటి వెనకగా నడుస్తున్న శ్రీపతి ముందుకు నడిచి తాజ్లోకి
వెళ్ళాడు. వెజిటబుల్ కట్లెట్ తిని కాఫీ తాగి బయటికి వొచ్చాడు. గేట్లోంచి
యెడమ పక్కకి తిరగబోతోంటె ఐలాండ్మీద కుక్కలు రెండూ కనిపించాయి

అవతలి ఫుట్పాత్మీద, యెర్రసిల్కు డ్రస్సులో నాలుగేళ్ళ పిల్లడు

మంచుని వాటిని చూడటం గమనించి ఆగిపోయాడు శ్రీపతి.

అంతలో మగకుక్క, ఆడకుక్క మీదకి లఘించి

ఆడకుక్క తృప్తిగా వెనక్కి జరుగుతోంది.

ముందుకి అడుగులు వేసి పోబోతున్న శ్రీపతికి— అవతలి ఫుట్‌పాత్‌మీద దూరంగా వో ముసలాయన, వాటివంక తదేకంగా చూస్తూండటం కనిపించి ఆగిపోయాడు.

ఆ ముసలాయిన ఐదేళ్ళ క్రితం ప్రభుత్వాధికారిగా రిటైరయ్యాడు. వొక డొక్కు కారు వుంది సాధారణంగా దాన్లో బయల్దేరతాడు. పదహారు పదిహేడేళ్ళ ఆడపిల్లలకి లిఫ్ట్ యిస్తుంటాడు అడిగి. అలా పరిచయం చేసుకుని యింటికి పిలుస్తాడు. ఆ వయసు ఆడపిల్ల —వొకే పిల్లకాదు—కొత్త కొత్త ఆడపిల్లల్తో— కావిలించుకు పడుకుంటాడు. అంతే, అంతకంటె యింకేం సాధ్యమూకాదు. ప్రయత్నమూ చెయ్యడు. ఐదారు నెలలకో పిల్ల అతని వలలో పడుతూంటుంది.

—వీటికి ఆ పిల్లాడికీ ఆ ముసలాయనకీ యేమిటి సంబంధం— ఆ మాటకొస్తే వాళ్ళ కళ్ళలో ముఖంలో తీవ్రత దాహం— యీయనకి శునక రతి నేత్రానందంగానూ తిమ్మిరిగానూ మహదానందంగానూ వున్నట్లుంది— వాటి కదలికల్ని మహాదీక్షగా తాదాత్మ్యంగా గమనిస్తున్నాడు. ఆ పసివాడు ఆ కుక్కలనీ ఐలాన్డ్ పక్క రాతిదిమ్మనీ సమదృష్టితో అనిర్వచనీయంగా చూస్తున్నాడు. మరి ఆ ముసలాయన —

అంతలో పెన్డ్‌జార్డెన్ లోంచి మగపిల్లల జట్టు పది పన్నెండేళ్ళ వాళ్ళు యేడెనిమిది మంది వొచ్చి ఆ కుక్కల్ని చూసి నానా రకాల కూతలతో అరుపులతో యికిలిస్తూ— వొంగి రాతి ముక్కలు తీసి విసిరారు. రెండు రాళ్ళు మగ కుక్కకీ వొక రాయి ఆడ కుక్కకీ బలంగా తగిలాయి. ఆడ కుక్క ముందుకీ మగకుక్క వెనక్కీ జారిపడినట్లుగా వొరిగి విడిపడినాయి. ఆ పసివాడు ఫకాలున నవ్వాడు. ఆ ముసలాయన అసహనంగా చూశాడు.

యిదంతా గమనిస్తున్న శ్రీపతి చిన్నగా నవ్వుకున్నాడు.

అటునుంచి అప్పుడే ఐలాన్డ్ దగ్గిరికి వొచ్చిన ట్రాఫిక్ కనిస్టేబు ఆడకుక్కని బూటు కాలితో అదిలించాడు. అది కుయ్ కుయ్‌మని అరుచుకుంటూ యెడమవైపుకి నడిచింది. మగకుక్క కూడా అవే నడిచింది.

కుక్కలు తోతారాం పాపాలాల్ నగల షాపు ముందు వొకదాని

చుట్టూ వొకటి తిరుగుతున్నాయి. శ్రీపతి నాలుగు అడుగులు ముందుకు నడిచి కాథ్యవాడ్ స్టోర్స్ లోకి వెళ్ళాడు.

పది నిముషాలకి శ్రీపతి బయటికివొచ్చేసరికి, కాలిబాటమీద కుక్కలు మూలంచి వరసలోకి వొచ్చి కనిపించాయి.

—పాపం, గొంతె కోణంగుల భష్టపరచకపోతే యీపాటికి పని ముగించుకునేవేవి.... రేడీమేడ్ బట్టల షాపులోంచి బయటికొచ్చి కారులో కూచుంటున్న ఆ వృద్ధపడుచు వాటి వంక ఆ చూపు—మధురస్మృతి లాంటి చూపు — యే వందరి మహాజిల ఘడియలోనో పెంపుడు కుక్క— డ్రైవరు కారుని ముందుకు కదల్చటంతో ఆమె చూపు విరిగిపోయింది. ఆ కర్కశపు కారు హారన్మోత ఆ కుక్కలకి వినిపించలేదు. అవి యీ లోకంలో లేవు.—వాటిచుట్టూ యే లోకమూ లేదు. వాటి లోకంలో అవి వున్నాయి. మరి వాటికి ఆ భామిని— ఆ కాలేజీ అమ్మాయి వాటివంక యిదిదిగా దొంగచూపులు చూస్తూపోతూ — జస్ట్ మిస్స్, కొంచమైతే ఆ యెదురుగా వొచ్చే రాండోలుకి కొట్టుకునేది— ఆ ఢోలు పేటి మీద గానీ పడితే యీపాటికి పిసరెళ్ళేవి. ఆ కుర్రజంట— వాటివంక చూసి అతనేదో కొంటెమాట విసిరినట్టున్నాడు, ఆమె ముఖం సిగ్గుపడిపోతోంది తృప్తిగా— అక్కడ మంచుని ఆ నడివయసు జంటిల్మన్ శ్రద్ధగా బుద్ధిగా వాటినేచూస్తూ వాటి కదలికలయతో చూపు కదుపుతూ — యేంటి నా వంక కొరంగా చూస్తున్నాడు— నేను వాడిని గమనించటం గమనించి వుంటాడు— బతుకే దొంగచాటు బతుకు. యేదీ బాజాప్తా చేసేడవలేరు. ఆ పాత వంపతుల జంట యెవరూ, బొర్ర పంతులింట్లో అద్దెకుంటారు. ఆహా యేం నవ్వులు పరస్పరం వీధిలో — యింట్లో పరస్పరం అసహ్యించుకుంటూ ద్వేషించుకుంటూ వాళ్ళింకా వయం పరస్పరం యింట్లో కూడా నవ్వులు నటిస్తూండటం కంటే.... తల్లి చెయ్యి పట్టుకుని నడుస్తున్న ఆ పసివాడు ముగకుక్క మీద చెయ్యి వేసేసరికి ఆ తల్లి, నిప్పుమీద చెయ్యి పడినట్టు గిజగిల్లాడి పోయి పిల్లాణ్ని అమాంతం పైకెత్తుకుని .... కాలితే పిల్లాడే చెయ్యి అమాంతం లాగేసుకుందును— ఆ పదేళ్ళ బూట్ పాలిష్ పిల్లడు వాటివంక లోకువగా చూస్తున్నాడు.... తంతాడా యేంటి పాపం— తన్నినే తన్నాడు. ఆమాత్రం తాపుకి అవి విడివడటానికి అవేం ఆషామాషీయిదిలో లేవు— ఆ తాకిడికి రవంత పక్కకి కదిలాయి జమిలిగా.... ఆ ముసలావిడ—అదేంటిటూచెయ్యి

వోహో ఆ ఘోరం కనపడకుండా కాబోలు కళ్ళ పక్కగా అరిచెయ్యి అడ్డ పెట్టుకుని ముందుకి నడుస్తోంది. అటునుంచి వొస్తున్న వో కనిస్టేబుతో యేదో అని అటే వెళ్ళిపోయింది— "యెంతటి రసికుడవో నీ వెంతటి రసికుడవో — గుత్తపు రవికా — వోయమ్మా — గుత్తపు రవికా — చమట చిత్తడిలో తడిసివుండగా.... యెంత పేపు" అంటూ పాడుకుంటూ కర్ర టిక్కు టిక్కులాడిస్తూ వొస్తున్న బిచ్చగాడు— "పల్లవిరాజా వో చందమామ" అనో "నీవుండే దాకొండపై"—అనో మరొకటో బిచ్చగాళ్ళ ఫేవరిట్ పాట కాకుండా యిలా పాడుకొస్తున్నాడు — కాలం మారిపోయింది. కాలంతో పాటు బిచ్చగాళ్ళ పాటలూ మారుతున్నాయి— యింతకీ వాడు నిజం బిచ్చగాడా— కాలం మారింది — వాడు నిజం గుడ్డిబిచ్చగాడు కాడు— యెంతటి రసికులో వీళ్ళెంతటి రసికులో— కుక్కల వొత్తిడిలో తడిసి— వీళ్ళెంతటి రసికులో యెంతటి దొంగచాటు రసికులో — యెంత పేపు .... యెంత పేపు — యీ దొంగచాటు వంకర టింకర కలవరపాటు వేషాలెంత పేపు.... యెంత పేపు.... బిచ్చగాడు గ్రాంఫోను ప్లేటు తిరగేశాడు- ముత్యమంతా పసుపు — యెంత పేపు ముత్యమంతా పసుపు యెంత పేపు రావోగ్గొరా వాచ్చేదాకా పొలిరావొచ్చేదాకా ... పోలీస్రావొచ్చేదాకా .... కుక్కలు అలిసిపట్లున్నాయి తీవ్రత తగ్గింది .... అటునుంచి వొచ్చిన ఆ కనిస్టేబు.... వోరి వెధవ, తన్ననే తన్నాడు .... మూడు నాలుగు తాపులికి విడిపడ్డాయి కానీ లంకెపడి .... వొకటి యిటు వొకటి అటు గింజుకుంటున్నాయి- అప్పటికే పని ముగిసినందువ అవీ విడివడాలనే చూస్తున్నాయి- కానీ కాక తగ్గనిదే ఆ కొవ మెలికి వూడదు· మరో తాపుతన్నాడు···· కుయ్కుయ్మంటూ రోడ్డుమీదకి జరిగిపోయాయి. కార్లూ స్కూటర్లూ సైకిళ్ళూ జనం - మధ్య లాక్కుంటూ పీక్కుంటూ గింజాకులాడుతున్నాయి. వాటిని తప్పించుకోవటానికి ట్రాఫిక్ అష్టవొంకర్లు తిరగాల్సి వొస్తోంది. యిదేదో పెళ్ళి లంకెలా వుంది. ప్రతి పెళ్ళి వో కుక్క లంకె. తిమ్మిరిలో లంకెపడి బతుకంతా లాక్కుంటూ పీక్కుంటూ పీక్కుంటూ లాక్కుంటూ....

ఆఖరి సంవత్సరం పరీక్షలు దగ్గిరపడుతున్నా గాయత్రి మనసులా పుస్తకాలలో లగ్నమవటం లేదు. పుస్తకం తెరిచి వో పేజీ చదివేసరికి

మనసు చెదిరి అరుణ మీదికి పోతుంది. ప్రస్తుతం తెరపరపోతే మనసు అరుణ మీదే వుంటుంది.

వొకొక్కసారి వాళ్ళమ్మ దగ్గిరికి వెళ్ళి చూచొని వొస్తుంది. ఆ రోజు వెళ్ళినప్పుడు తల్లి కళ్ళు సంతోషం పట్టలేక నీళ్ళతో నిండిపోయాయి. మరి తాపేపటికి వొచ్చి చూసిన తండ్రికి సంతృప్తిగా అనిపించింది. తమ్ముడూ—చెల్లెలూ సంబరపడిపోయారు. వాళ్ళిద్దరూ యింతకుముందు అప్పుడప్పుడు వొచ్చి గాయత్రిని చూసి వెడుతూండేవాళ్ళు.

ఆమె మనసుని అరుణమీంచి పూర్తిగా మళ్ళించటం యెలాగో తెలియటంలేదు మోహన్‌రెడ్డికి. అతనికి తెలిసిందల్లా విరసం గురించి, అందులో కొందరిని గురించి, మార్క్సిజం, కేపిటలిజం వివిధ జాతీయ అంతర్జాతీయ సమస్యల గురించి. రాష్ట్రంలోని సంగతుల గురించి మాట్లాడుతూ మర పించటం. ఆ కాసేపూ పూ మర్చిపోతుంది. యెంత సేపు! మేలుకున్నంత సేపూ. యివేమీ లేనప్పుడు అరుణ ధ్యాసే. నిద్దట్లోనూ అదే ధ్యాస.

అరుణ, అనేకాదు. పోయిన అరుణ, వొక అదృశ్యశక్తిలా తనని తనలోకి గుంజుతుంది. గర్భంలో హృదయంలో స్తనాలలో యేదో సంచలనం, నరాలలో ప్రవహించే నెత్తుట్లో జిలజిలమని జ్వాల్యారే మెత్తని సవ్వడి.... కళ్ళలో చెమ్మగా పెల్లుబుకుతుంది ఆవేదన. మాతృ వేదన. గాయత్రి వుడికిసన రాగి తమలపాకులా ఐపోతుంది.

ఆర్నెల్లేగా అని మోహన్‌రెడ్డి అంటే.... ఆర్నెల్లేనట, ప్రసవించి యేడాది —అంటుంది. డాక్టర్లకి చూపెట్టుకున్నారు. అండోత్పత్తి, అతని వీర్యంలో బీజకణాలు చాలాసార్లు వుండటం లేదని తేలింది. అంచేత తొందర పడితే కాదు— అసలుకి సాధ్యమే —యెప్పుడో జరుగుతుంది— అన్నారు.

గంటనుంచి లా పుస్తకంలో మునిగివున్న మోహన్‌రెడ్డి తలపక్కకి తిప్పి చూస్తే—కుర్చీలో కూచుని టేబిలుమీద అరుణ ఫొటోలోకి చూస్తూండటం, గమనించాడు.

ఆమెని చూస్తూ—

ఐదు నిమిషాలు అలాగే చూస్తుండిపోయింది.

వొకసారి ఆ ఫొటో తీసి దాచేశాడు.

గమనించి, "మోహన్. ఫోటో తీసి అక్కడ పెట్టు" అంది. గొంతు ఎంతో తీక్ష్ణంగానూ కఠినంగానూ వుంది.

"యే ఫొటో?" అన్నాడు చిన్నగా.

యీసారి తీక్ష్ణంగా కఠినంగా నిశ్చబ్దంగా చూసింది.

వంట గదిలోకి వెళ్ళి తెచ్చి బల్లమీద పెట్టాడు. ఆ హృదయం తీసి వంట గదిలో యెక్కడో దాచాడు.

"ఆ అరుణ మన దగ్గిరే మనలోనే వుంది." అని మోహన్‌రెడ్డి అంటే, "లేదు. అరుణ అరణ్యాలలోకి వెళ్ళిపోయింది. పుష్కర్ణమూసుకు కొంగ జపం చేసుకునే అరణ్యాలలోకి కాదు. నిప్పులు చెరిగే అరుణోదయప టడవుల్లోకి కబుర్లూ కాకరకాయల మనలనందర్నీ పరిహసిస్తూ వెళ్ళిపోయింది' అంది.

మరో ఐదు నిమిషాలు చూశాడు.

గాయత్రి అలా చూస్తూనే వుండిపోయింది.

మోహన్‌రెడ్డికి భయంగా అనిపించి, "గాయత్రీ వో పసిపాపని పెంచుకుందామా?" అన్నాడు.

"దేశంలోని పాపలందరూ నా పాపలే. అలా కాదు నాలోని నా నెత్తుట్లోని అరుణ అరుణోదయంలా అరుణమార్గంలా కాంతిరేఖలా నాకిదో చూపే నా అరుణ కావాలి." అంది.

"కొన్నాళ్ళు వోపికపట్టు. అదే జరుగుతుంది. నువ్వు మరీ యిదవుతున్నావు. నాకు లేదేం అంత యిది?" అన్నాడు.

"నువ్వు మనిషివి కాదేమో—" అంది.

"ఆ ఫీలింగ్ లేనివాళ్ళంతా మనుషులు కాదంటావా? శ్రీపతిని అడిగితే యేమంటాడో—"

"శ్రీపతి యేమనేదీ చెప్పటానికి శ్రీపతే సిద్ధంగా వున్నాడు." అంటూ చక్కా గుమ్మం లోపలికి వొచ్చాడు శ్రీపతి.

సంతోషంగా తనవైపు చూసిన యిద్దరివంకా చూస్తూ, "నేను గుమ్మంలోకి వొచ్చేసరికి మోహనుడు నా శుభనామం వుచ్చరించటం విన్నాను. అంతకు పూర్వ గ్రంథం మరి తెలియదు" అని చిన్నగా నవ్వాడు శ్రీపతి.

వెళ్ళి మంచం అంచుమీద కూచున్నాడు, మంచంమీద యిటుపక్కకి తిరిగి పడుకునివున్న మోహన్‌రెడ్డి భుజంమీద చెయ్యివేస్తూ.

"మామూలు గొడవే. అరుణ. గాయత్రిని యేం చెయ్యాల్నో తోచ టం లేదు శ్రీపతీ! యెంత సేపూ ఆ ఫోటోలోకి చూస్తూనో, కళ్ళు మూసు కుని తలుచుకుంటూనో—యిప్పుడే అన్నాను మరీ అంత యిదిగా ఫీలవ కూడదని: నేనున్నదో తెలుసా, నేను మనిషిని కానట. నాకు మాతృభావన లేకపో—"

"నీకు మాతృభావనేమిటోయ్—పితృభావన."

"వుండటం సహజం కాదంటారా చెప్పండి శ్రీపతిగారూ" అంది.

"సహజం. మహా సహజం—సంధి వుందని విడదీసి మహా సహ జం చెయ్యక్కర్లేదు. మన చక్కని తెలుగు భాషలో వున్న సంపదల తిక మక సౌలభ్యం యిది. ప్లేటో కమ్యూనిజంలో యూజెనిక్స్ అంటూ చాలా రాశాడు. పెళ్ళీపెటాకులూ, ఆ మాటకొస్తే స్త్రీపొందూ లేనివాడు అతగాడికేం తెలుసు బిడ్డల సంగతి!" అన్నాడు శ్రీపతి

"వుండాలనేమిటి? నాకు దేవుడి మీద నమ్మకం లేదు. ఆ భావనే లే దసలు నాలుగేళ్ళ క్రితం వొకసారి వూళ్ళో మా తమ్ముడు వొక సంద ర్భంగా—'దేవుణ్ణి నమ్మవు నువ్వు మనిషివికావా'? అని అడిగాడు" అన్నాడు మోహన్‌రెడ్డి.

"దేవుణ్ణంటే నేనూ నమ్మను. యిది నమ్మటం గురించి కాదు. నెత్తుట్లోని స్పందన" అంది గాయత్రి

చెప్పమన్నట్లు శ్రీపతివంక చూశాడు మోహన్‌రెడ్డి.

"ఆదిమ కమ్యూనిజం కూడా అంతగా ఆదిమం కాదు. ఆదిమ కమ్యూనిజంకూడా వొక వ్యవస్థే. అంతకంటే ముందు తొలి మానవులు, పూర్తిగా మానవుల్లా అవకముందు, ఆకలీ సెక్సూ దాహం లాంటి వాటిని ఆ క్షణంలో తీర్చేసుకుని ఆ తరవాత దాని తాలూకు యేమీ వుండకపోయిన స్థితి కానీ పశు పక్ష్యాదుల్లో కూడా దానికి ముందు వెనక వుంది. ప్రతి సహజాతానికి ముందు వెనక గొళ్ళెం లింకు. గాయత్రి యీ సహజాతాన్ని వొప్పుకుంటే ఆగే లెక్కని యెక్విజిషన్‌నీ పొసెసివ్‌నెస్‌నీ వొప్పుకోక తప్పదు. ఆ మాటకొస్తే ఫ్యామిలీ అనేది యెక్విజిషన్ లెక్కకే వొస్తుంది. వొకలాంటి ఆస్తి తనఅనే తనకు వొక ఆస్తిలాంటిది—అందుకే మార్క్సు యెంగెల్సు మార్క్సిజంలోకి ఫ్యామిలీకి చోటుపెట్టాల్సొచ్చింది ఆదర్శఅవ్య -క్తసంగతివూహాకేగాని రూఢిగా తెలియదు.

యగా తెలుస్తాయి. యితరరుచుల ఆధారంగా. కొన్ని రుచిచూస్తేనే తెలుస్తాయి యెవకటి గ్రీకు బానిసకి తన బానిసత్వం స్పృహ లేనేలేదు. ఆ స్పృహ కలిగి, చైతన్యవంతం అయ్యాకగదా తిరగబడింది. అలాగే మాతృ సహజాతం. కొందరికి ముందుగానే అనిపిస్తుంది—పెరిగిన వాతావరణమో యితరాంశాల కారణంగానో. కొందరికి పాతిత్తూ గర్భవతి అయ్యేవరకూ తెలియదు—"

"ఐ హ్యాడ్ లీస్ట్ ఐడియా అంటిల్ ఐ బికేమ్ ప్రెగ్నెంట్" అంది గాయత్రి.

"నాకు ఆ అవకాశం కూడా లేదు. మగవాణ్ని పుట్టిన శాపానికి!" అని నవ్వాడు శ్రీపతి.

"యీ సమాజంలో మగగా పుట్టటం శాపం కాదు." అంది.

"సమాజం మాట కాదు. మాతృ సహజాతం గురించి. మగకి అది లుప్తం కదా! ఐతే పితృసహజాతం పర్యాయంగా వుందనుకో" అని మోహన్‌రెడ్డివంక చూసి, "సెంటిమెంట్లనైతే వదిలేసెయ్యగలుగుతున్నారు—కొందరు. కానీ సహజాతాలను పెకిలించేసెయ్యలేకపోతున్నారు. ఫ్యామిలీ కూడా ఆస్తి లాంటిదే. ఆస్తి సవాలక్ష రూపాల్లో వుంటుంది. అఖరికి తాను అల్లుకున్న భావనో సిద్ధాంతమో కూడా ఆస్తిలాంటిదే. మార్క్స్ రుషి దర్శించిన మహా ఆదర్శ అవ్యవస్థ యిప్పటి వరకు జరగలేదు. జరిగే సూచనలూ కానరావటం లేదు. సాధ్యం అంటారా—శుభం" అన్నాడు శ్రీపతి.

"అది చారిత్రక అనివార్యత. గతితార్కిక ప్రగతి గమ్యం" అన్నాడు మోహన్‌రెడ్డి.

"బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలోని పుస్తకాల పురుగు మార్క్స్ వొక తీగపట్టుకుని పాక్కుంటూ వెళ్ళాడు కొసకంటా. శ్రమ, దోపిడీ, అన్యాయాలు, అక్రమాలు, అసమానతలు వంటి వాటిఆధారంగా అక్కడికే చేరక్కరలేదు. యింకా చాలా తీగలున్నాయి. వొక్కో తీగ పట్టుకుంటే వొక్కో చోటుకి వెడతాం. మళ్ళీ ఆ చోటులన్నీ యెక్కడికి వెడతాయి? చరిత్ర గతి తార్కికమూ కాదు మతి తార్కికమూకాదు వర్తులమూ కాదు పురోగమనమూ కాదు తిరోగమనమూకాదు. చూడగా, అడ్డదిడ్డంగా అన్ని పక్కలకీ గమిస్తోన్నట్లనిపిస్తుంది.

అలా అని పూర్తిగా అడ్డదిడ్డమూ అనిపించదు. ఆ అన్నివైపుల ఆ

అడ్డదిడ్డపు చిక్కురొక్కుడు గమింపులో యేదో లయబద్ధ రతింపు వున్న ట్లనిపిస్తుంది. ఆ సంకీర్ణ సంక్లిష్ట సూత్ర రహస్యంగానీ చిక్కితే యేదిగానీ చుట్టే మీట నొక్కి అనుకున్న క్రమంలో వడిపించవొచ్చు. కానీ అప్పుడు చారిత్రకత యెంత చులకనై పోయి వుండునో! అలా అని చారిత్రకతలోకి తాను లొంగిపోవాలనేమీ లేదు. తనకి తాను లొంగిపోతేగా, చారిత్రకతకో దేనికో లొంగిపోవటానికి! కానీ మన గాయత్రి మాత్ర సహజాతానికి లొంగి పోతోంది. వైష్ణవ్యం గాయత్రి దాన్ని అధిగమించాలి. యిలా ఐతే యెలా గాయత్రీ! మోహన్‌రెడ్డి నీ వేదనని చూసి నీ కంటే యెక్కువ వేదనచెందు తున్నాడు. అతనిది గాయత్రి వేదన. నీది అరుణ వేదన. అతని వేదన నీ వేదన మీద ఆధారపడి వుంది. నువ్వు నీ వేదనని అధిగమించితే యిద్దరి వేదనలూ యెగిరిపోతాయి. వస్తా భోజనాల వేళ." అని లేచాడు శ్రీపతి.

"భోజనాల వేళ కాబట్టే వస్తా అనకండి వుండండి." అంది గాయత్రి.

మోహన్‌రెడ్డి, శ్రీపతి చెయ్యి పట్టుకుని లేచి కూచుంటూ, "యీ పొద్దు చికెన్ ఫ్రై" అని కూచోబెట్టాడు.

"బాగోకపోతే నన్ను అనొద్దు యివాళ వంటంతా మీ మోహనుడే చేశాడు." అంది.

"భోజనం యిద్దరకే వుంటుందని తెలుసు. నే వెళ్ళకపోతే హోటలు వాడు పాపం—"

"ఆ భోజనం యింకొకడికి పెట్టి మరికాస్త సంపాదిస్తాడు— పోనీ, వాళ్ళ పని అదేగా—" అన్నాడు మోహన్‌రెడ్డి

"సరే. బ్రెడ్డు వుందా మరి? అది జతచేస్తే సరిపోతుంది." అన్నాడు శ్రీపతి.

"అన్నీ వున్నాయి. మీరు తప్పించుకోటానికి లేదు. చాలా రోజు లైంది మీరు మా యింట్లో భోంచేసి. ముగ్గురం కలిసి చేద్దాం."అంది గాయత్రి లోనకి వెడుతూ.

"నువ్వు యేం చేస్తున్నావు పత్రిక పని వొదిలేశావట కదా?"అన్నాడు మోహన్‌రెడ్డి.

"యెమర్జన్సీలో పత్రిక పనేమిటి! యెమర్జన్సీలో యే పనీ చెయ కూడదు. యే దేశంలోనైనా యే కాలంలోనైనా అంతే. అది యెమర్జనీ

లక్షణం. యమర్జన్సీ రాణి యేం చెబితే అదిచెయ్యాలి. నాకింకా యేమీ చెప్పనందున యేమీ చె య్యటంలేదు" అని. "గాయత్రీ భోజనం యేర్పాటుకి తోడుగా వొస్తున్నాను." అంటూ లేచాడు, శ్రీపతి.

"రండి. ఆ బద్దకం రెడ్డిగారు యీ గదంతా నానా చిక్కురొక్కురు చేశారు. మీరింతకు ముందు చెప్పిన చరిత్ర పాఠంకంటే కూడా చిక్కురొక్కురుగా వుందంటే నమ్మండి. కానీ వారి చికెన్ వకాయింపు ఘాటు బావుంది. నాకే నోరూరుతోంది." అంది గాయత్రి లోపల్నుంచి.

అప్పటికే— శ్రీపతీ, అతనికూడా మోహన్‌రెడ్డీ లోనకి వెళ్ళారు.

# 89

రవి అసెంబ్లీకి యెన్నిక ఐ యేడాది దాటింది. మొదట్లో అతనిని యెవరూ పట్టించుకోలేదు.

యెమ్మెల్యేలలో యెక్కువమంది శుంఠలుగా అనిపించారు. వాళ్ళకేం తెలియదనిపించింది. పిళ్ళు, చేతులెత్తటానికి తప్ప మరెందుకూ పనికి రారనిపించింది. మంత్రులలోనూ చాలామంది అలాగే అనిపించారు.

యీ శుంఠల మధ్య యీ మూర్ఖుల మధ్య తను అంత అనామకంగా వుండటం సహించలేనితనంగా అనిపించింది. యెన్నో నిర్దేశిస్తూ ప్రత్యేకంగా కనిపించే మినిస్టర్ల కుర్చీలు అతని కళ్ళలో విలిచిపోయాయి.

అతను యేదైనా అడగాలన్నా వీలుండదు. అడిగినా పట్టించుకోరు. మందుకొచ్చి యెడాపెడా అరవటం మొదలెట్టాడు. ముందు అరవటం అవసరం. ఆ తరవాత తెలివి అవసరం అని గమనించాడు.

తను అడిగే ప్రశ్నలకి మంత్రులు చెప్పే సమాధానాలతో తృప్తి పడక మారాలు అడిగితే, తమ దగ్గరున్న సమాధానం మేరకే చెప్పగలం అని మంత్రులు అంటే, "సెక్రటరీలు అందించింది తప్ప తమ సొంతగా యేమీ తెలియనప్పుడు మాట! అట్లాంటప్పుడు మంత్రులెందుకు సెక్రటరీలే కుర్చీలో కూర్చుంటే పోతుంది గా" అని గొడవలోకి దిగి, కొందరు మంత్రులతో తమ శాఖలకి సంబంధించిన విషయ పరిజ్ఞానం తమకి లేదనిచెప్పించి— యే శాఖ నిర్వహించే మంత్రికి ఆ విషయం గురించిన కనీసజ్ఞానం వుండాలి.

అట్లా లేకపోవటం [illegible] మంత్రిత్వం. అది మహా నేరం. అంటూనూ స్పీకర్ మందలింపుల్ని స్వీకరిస్తూ అరుస్తూ గొడవ గొడవ చేస్తూ అసెంబ్లీ లోపలా—

అసెంబ్లీ బయట—యెప్పుడూ యేవో గొడవలే— ధైరాయింపో వుపన్యాసమో యేదో ఆందోళన—రకరకాల వృత్తులలో వాళ్ళ రకరకాల సమస్యలు.

రెండో నెలలో అరెస్టు చేశారు. అతనితోపాటు నలుగురు కార్మికుల్ని ఆ తరవాత—అరెస్టు అవటం పరిపాటి ఐపోయింది.

అదే సమస్యల గురించో, యితర విషయాల గురించో ప్రభుత్వాధికారులతో గొడవలు. అధికారులకి—సువ్వెందుకు అడగటానికి రావటానికి—అని అనటం అంత సులువు కాదిప్పుడు—యెమ్మెల్యేని ప్రజాప్రతినిధిగా నా బాధ్యత హక్కు—అంటూదబాయిస్తారు.

వీటితోపాటు అటు మంత్రులు పారిశ్రామికవేత్తలు, ప్రభుత్వోన్నతోద్యోగులు కాంట్రాక్టర్లు వంటి వాళ్ళ బతుకు జాతకాలు తెలుసుకోవటం బాగా అలవాటైంది. కష్టపడి, దెబ్బలాడి పన్లు చేయించి పెడతాడనే పేరు వొచ్చింది. దాంతో, యెప్పుడూ యెవరొకరు, కార్మికుల దగ్గర్నుంచి కూలినాలి జనం దగ్గర్నుంచి వుద్యోగుల వరకు యెందరో తమకు జరిగిన అన్యాయాల గురించో జరగాల్సిన పనుల గురించో అతనికి చెప్పుకోవటం అధికం ఐంది.

యేడాదులుగా అసెంబ్లీలో అనామకులుగా వున్నవాళ్ళు అలాగే వుండగా, రవి, కొత్తగా అసెంబ్లీ సభ్యుడయ్యీ అందరికంటే ప్రసిద్ధుడయ్యాడు. మంత్రులను ప్రశ్నలతో తికమక పెట్టటం అతని నేర్పరితనాలలో వొకటి.

అంతలో యెమర్జన్సీ వొచ్చింది. యెమర్జన్సీలో మొదటి విడత అరెస్టయిన వాళ్ళలో అతనూ వున్నాడు. యెమర్జన్సీ అన్ని రాష్ట్రాలలోనూ పెట్టటం అన్యాయం అక్రమం అనవసరం. అంత అవసరంగా అనిపించితే వుత్తరాదిలోని కొన్ని రాష్ట్రాలలో చాలుఅనీ, యెమర్జన్సీ వున్నా, అత్యవసర ప్రజాసమస్యల్ని ప్రభుత్వం దృష్టికి తీసుకురావాల్సి వుంటుందనీ ప్రభుత్వం కళ్ళుమూసుకుని కూచునివుంటే యితర వర్గాలద్వారా ప్రభుత్వానికి తెలిసొచ్చేలా చెయ్యాల్సి వుంటుందనీ ప్రారంభించాడు.

రవి, నిజాయితీగా నిస్వార్థంగా ప్రజల అవసరాల గురించే శ్రమిస్తు

స్నాడనీ మంచి చురుకైన వాడనీ గ్రహించిన కొందరు కాంగ్రెస్ యెమ్మె ల్యేలు అతనిని గుర్తించారు. ఆమాటే అన్నారు. అందునా అతను జన సంఘ్. కమ్యూనిస్టు తదితర యే పార్టీలకీ చెందనివాడవటం వల్లనో యేమో, మొత్తానికి రెండు నెలలకే విడుదల చేశారు. మధ్యలో వొకటి రెండు సార్లు పోలీసు అధికారులు అతనిని ప్రత్యేకం పిలిపించి అది కూడని సమయం అని వివరించి, యేమైనా జరగాల్సిన పనులుంటే ప్రభుత్వాధికారు లతో పేచీ పెట్టుకు కూచోమని సలహా యిచ్చారు. ప్రభుత్వోద్యోగులలో యిప్పటికే అతని సంగతి బాగా తెలిసి, సాధ్యమైనంత వరకు పనులు చేసి పెడుతున్నారు, ఎందుకొచ్చిన గొడవ అని. అయితే యెమర్జన్సీ ప్రవేశ పెట్టే నాటికే అతనికి ప్రభుత్వాధికారులలో చాలా మందితో అవగాహన లాంటి పరిచయం ఏర్పడటం వల్ల అంత సమస్యగా అవకుండా గడిచి పోయింది.

అసెంబ్లీలో యిటు అధికార పక్షానికీ, అటు ప్రతిపక్షాలకీ వ్యతిరేకి. వీళ్ళా వాళ్ళా అని లేకుండా—అన్యాయం, అక్రమం, అసమంజసం, అని పించినప్పుడు బట్టబయలు చేయటంవల్ల అందరికీ యిబ్బందిగా వున్నా— ప్రతిపక్షాల పక్షం కాదనీ అధికార పక్షం కొంత సంతోషించింది. వీడెవడు మహా గట్టిపిండంలా వున్నాడే—అని గుర్తించారు. కొద్ది నెలలలో నేఅనుకో కుండా యిండిపెండెంటు సభ్యుల వర్గానికి అనధికార నాయకుడయ్యాడు.

తను అడగదలిచినప్పుడు చెప్పదలిచినప్పుడు వ్యవధి లభించటం. అతని మాట పలుగురూ ఆలకించటం స్థాయికి వొచ్చేశాడు అతి కొద్ది నెల లలో.

అందరి అన్నిపనులతోపాటు ప్రత్యేకించి తన నియోజకవర్గం ప్రజల సమస్యలను పట్టించుకుంటూ వుంటాడు. వీళ్ళా వాళ్ళా అని తేడా లేకుండా, వాళ్ళు ఆర్థికంగా యే వర్గానికి చెందినా, రాజకీయంగా యే పార్టీకి చెందినా న్యాయం జరగాల్సి వున్న చోట పట్టుదలగా శ్రమపడి పని జరిగేలా చూస్తూంటాడు. యెన్నిక అయిపోయాక చుక్కల్లోకి చూడకుండా యెప్పటిలాగా తరచూ కనిపిస్తూ మంచిచెడ్డలు చూడటం వల్లా—యింతకు ముందు అతను తెలియని వాళ్ళకి కూడా సహాయపడటం వల్లా—యెవరి ప్రాముఖ్యతా అంతగా వుండని రోజుల్లో కూడా పలుకుబడి పెరిగింది. రాజ కీయంగా గుర్తింపు వొచ్చింది. వ్యక్తికంగా విలువ వొచ్చింది.

# 90

రవి యెమ్మెల్యే ఐన రెండు మూడు నెలలకే గంగి రాంనగర్ రావటం తగ్గించింది. ఆమెకి వొచ్చేటంత వ్యవధి వుండటం లేదు. యెవరో వొకరు వొచ్చి ఆమెని కలుసుకుంటూనే వుంటారు. టెలిఫోను పెట్టించింది.

వొకసారి వొక వ్యక్తి వొచ్చి—వొక పని అవ్వాల్సి వుంది రవి గారు చెప్తే అవుతుంది. మీరు చేయించిపెడితే — అని ప్రారంభించాడు గంగితో. అప్పటికి, గంగికి పొగ త్తల వరకే తెలుసుగాని వ్యవహారాలు తెలియవు.

“మీరే అడగొచ్చుగా” అంది.

అతను చాలా సాఫీగా దాపరికం లేకండా వివరించాడు : “నేను అడిగితే వారు నన్ను తీసికెళ్ళి ఆ అధికారితో విషయం తెలుసుకుని అడుగు తారు. అది అధికారి చెయ్యదలిచినా రవిగారికి యిష్టంవుండదు. చెయ్యకూడని పనీ కాదు, చట్టవ్యతిరేకమైనదీ కాదు. కాగా చేసేది తాను కాదు. మీరు వారి ధర్మపత్ని. అర్ధాంగిగా మీరు కొన్ని కోరుకుంటూ వుండొచ్చు. మీకు తెలిసినవాళ్ళకో, స్నేహితులకో, బంధువులకో అని అడగవొచ్చు. ఆ అధి కారి రవిగారి మాట కాదనడు. సింపుల్ విషయం. ప్రయారిటీని లక్ష్యపెట్ట కండా మంజూరు చెయ్యటం అట్లాంటివి సర్వసాధారణమైన విషయాలండీ, ప్రభుత్వంలో. అది మంజూర్ ఐతే మాకు కొంత లాభం వొస్తుంది. అది యింకొకరికి మంజూర్ ఐతే ఆ లాభం వాళ్ళకి వొస్తుంది. మీరు రవి గారితో ఆ అధికారికి వొక్క ఫోన్‌కాల్ చేయించి చెప్పిస్తే చాలు. మీ మేలు మర్చిపోం.”

గంగి, రెండురోజులు వరసగా రవితో రాంనగర్ వెళ్ళి, ఆ మరనటి రోజున అడిగింది.

“నీ కెందుకీ విషయాలు?” అన్నాడు రవి.

“అవ్. అడ్గిన అందర్కి చేసిపెడ్తవ్. నాకు మాత్రం అడిగే అర్హత లేదన్నమాట! మా చుట్టాలి కోసమని అడిగిన. చెయ్యగూడని పనేమి కాదు. ఐరంత ఫోన్‌ల వొక్క మాట జెప్పె దాం.”

"అర్థక అర్థక వొక్కపాలి అడ్గితె కాదంటున్నవ్ లే; అవ్ నువ్ గోష్పొవివి—చేసు కానొస్తనా." అని ప్రారంభించి ఫోను చేయించింది.

ఆ పని అవగానే ఆ వ్యక్తి గంగికి పదివేల రూపాయలు యిచ్చాడు అంత మొత్తం చూడటం గంగి జీవితంలో అదే మొదటిసారి. ఆ తరవాత అలాగే ఆదే వ్యక్తికి యింకో రెండు మూడు పనులు చేయించిపెట్టింది. అలాగే మరికొందరు.

కారు కొంది.

యెక్కడిదని అడిగాడు. తనవల్ల సహాయంపొందిన వాళ్ళామెయిచ్చి నట్లు చెప్పింది. తిట్టాడు—మళ్ళీ అలా యెప్పుడూ చెయ్యొద్దని. ప్రజాప్రతి నిధిగా ప్రజల అవసరాలు చూడటం, న్యాయం జరిగేలా చూడటం తన బాధ్యత, విధి అనీ, దానికి ప్రతిఫలం వేరే యేమీ వుండదు. యెమ్మెల్యేగా జీతం యిస్తున్నారు. యితర వసతులు కల్పించారు—అని చెప్పాడు. బుద్ధిగా బుర్ర వూపింది గంగి. "అట్ల తీస్కోన" అంది. యెంతో సంతోషించాడు. ఆ సంతోషంలో ఆమె అడిగిన మరికొన్ని పనులు చేయించిపెట్టాడు. అలా అప్పుడప్పుడు ఆమె అడగటం, కొన్నిసార్లు అతను చేయించటం జరుగుతూ వుంటుంది.

యిటీవలే, సికిందరాబాద్ మిలిటరీ కంటోన్మెంటుప్రక్కన బోయిన పల్లి పరిసరాల్లో స్థలం కొంది.

రాములుతో సంప్రదించితే, "యిసుమంటి ముచ్చట్లు నాకు చెప్పకు" అన్నాడు. అప్పటికే చాలా కాలంగా అతను చెల్లెలితో సరిగా మాట్లాడటం లేదు. గంగి, యేమైనా పనులు—"అట్లని వాండ్లకు చెప్పు. అడ వుండమను వాండ్లను రావొద్దని చెప్పు. నేనేయిన్ఫాం చేస్తనన్ననని చెప్పు—"వంటివి చెబితే—"గవన్నీ నా తాన కాదు మేమ్సాబ్—నేను కార్ఖాన్ల పనిచేస్కొనెడి రాముల్ని" అన్నాడు.

అంతకు ముందే సూచించింది—ఆ పని మానేసి యేమైనా కాంట్రాక్టులో వ్యాపారమో ప్రారంభించమని.

"యిన్ని చేస్తున్నదానివి అవి చెయ్యలేవా?" అన్నాడు వెటకారంగా.

కోపమొచ్చి, "వొక్క తల్లిబిడ్డలం కదా అని అంటి. నువ్వు కూలి పని చేస్కొని బత్కు. నేను యెమ్మెల్యే భార్యను" అంది.

"యెమ్మెల్యే భార్యవి. అంత పెద్ద పొజిషన్ల వున్నామె ప్రవర్తన

గూడ అట్లనే వుండాలె. భర్తకు చెడ్డపేరు తెచ్చేటట్లు వుండరాదు.రవీసాబే మె యీడ వుండుకుంటను. నువ్వేమి యీడుంటవా,మెల్లెల్లె తిర్గుతుంటరు వో— ధూత్ మంది అనుకునేడి మాటలు వినేటందుకె—" అని రాములు అం టూంటె మధ్యలోనే అందుకుని.

"నీకేమిట్కి—?" అంది.

"చెల్లెలివని."

"పెండ్లి అయిన తర్వాత భర్తనె గద అన్నిట్కి— జిమ్మెదారి! నేనేమి భర్త వాటున చేస్తున్నదేమి లేదు. ఆఖుసుగల మధ్య ముచ్చట నీకేమిట్కి ?" అంది

అప్పటి నుంచి అసలే మాట్లాడదు రాములు. రవి వొచ్చినప్పుడు, గంగి గురించి గానీ వాళ్ళద్దరి స్థితిగతుల గురించి గానీ ప్రస్తావించడు రవి యేదైనా ప్రసక్తి తెచ్చినా వో చిన్న ముక్క— చెప్పి చెప్పకుండా తప్పుకుం టాడు. రవి రమ్మని యెన్నిసార్లు అన్నప్పటికీ రాములు యెమ్మెల్యే క్వార్ట ర్సుకి సాధారణంగా వెళ్ళడు. మొదట్లో ప్రతి ఆదివారం వెళ్ళేవాడు. చెల్లెల్ని అసహ్యించుకోవటం మొదలెట్టినప్పటి నుంచి వెళ్ళటం తగ్గించేశాడు. రవి రాంనగర్ వొచ్చినప్పుడు అతనికూడా వుంటాడు. ఆ ప్రాంతం మంచిచెడ్డలు వివరిస్తుంటాడు. ఐతే యింతవరకు తామగా యెవరికీ యిది చేసిపెట్టమని అడగలేదు రవిని. వాళ్ళనే వెళ్ళి రవితో మాట్లాడమని చెబుతాడు.

గంగికి సాయంగా వుంటున్నాడు సాయిలు. గంగి పురమాయించే పనులకి రాత్రులేకాక నెలకి పదిరోజులైనా పనిలోకి వెళ్ళటానికి వీలువడటం లేదు. చాలా కాలంగా అనారోగ్యంగా వుంటున్న అతని తండ్రి, ఆ తరవాత తల్లీచనిపోయారు. యిప్పుడు భార్యా పిల్లలు. అప్పుడప్పుడు వొచ్చి వుండే చెల్లెళ్ళు.

నెలకి రెండు మూడు వందలకి తగ్గకుండా యిస్తోంది గంగి సాయి లుకి.

ఆ కార్ఖానా నౌకిరి యేమి చేస్తవు? యీడ్నే వుండరాదు? మన పనులె మస్తున్నవి" అంది గంగి వొకసారి,మాటవరసకి అన్నట్టుగా.

"అంత అక్కెరొస్తే వుండక యాడికి పోత! నువ్వు జెప్తె కాదం టవా!" అన్నాడు సాయిలు.

"నువ్వే మేలన్నా సొంత అన్నకంటె" అంది వొకసారి.

"రాములన్న పిస్సోడు. కోపమ్ చెయ్యకు" అన్నాడు సాయిలు.

రాములు తన పనులకు సహకరించక పోయినా, పనికి అడ్డురానం దుకు సంతోషించింది గంగి. అడ్డొస్తే మనిషిని విసిరికొట్టగలదని రాములు గ్రహించే మిన్నకుండిపోయాడు.

గంగి, యింట్లో వంటమనిషిని పెట్టుకుంది. యిద్దరు పనిపిల్లలు. అప్పుడప్పుడు తలిదండ్రుల్ని తీసికెడుతుంది. వో వారం రోజులుండి వొస్తుంటారు. ఆమె తండ్రి కొమరయ్య రోజూ వో సీసా సారా పుచ్చుకుంటున్నాడు. అదివరకు పండగకో పబ్బానికో తప్ప తాగేవాడు కాదు.

# 91

మోహన్‌రెడ్డి గాయత్రీ, గుమ్మం బయటికొచ్చి, తాళం వేస్తుండగా ; సుధీర్, సుదతి వొచ్చారు.

"సారీ, యాడికో బయల్దేరినట్లున్నరు?" అంది సుదతి.

గడియ తీసి తలుపులు తెరుస్తూ, "ఫిలిమ్‌కి" అన్నాడు మోహన్ రెడ్డి.

"పూర్కైనె వొచ్చినమ్ పదండి. దారిలో మాట్లాడుకుంటపోదం అడిదంక." అన్నాడు సుధీర్.

"డోన్ట్ బి సిల్లి." అన్నాడు మోహన్‌రెడ్డి.

"యే ఫిల్మ్?" అంది సుదతి.

"తపస్య." అన్నాడు మోహన్‌రెడ్డి.

సుదతి, వెడ్డింగ్ కార్డ్ తీసి యిస్తుంటే—"నెక్స్ట్ వీక్ సుదతిపెండ్లి" అన్నాడు సుధీర్.

"శుభలేఖతో వొచ్చి వూరికే వొచ్చాం అంటారేవిటి" అని అంచుకుని తీసి చూసింది గాయత్రి.

సుదతిరవంత సిగ్గుపడినట్లుగా నవ్వింది. అసలే నాగలిదుంపలా వుండే ముఖం, పరీక్షల చదువు వల్ల పీక్కుపోయి మరింత సాగదీసిన త్రిభుజాకారంగా వుంది

ఇంజనీరుగారి భార్యవన్నమాట. శుభం." అంది గాయత్రి. సుదతి

తండ్రి సిరిసిల్ల భోజ్‌రెడ్డియిండియన్‌బ్యాంకు యేజంటు. ఆరవయ్‌వేల రూపాయల కట్నం. కోడలు లా ప్రాక్టీసు చెయ్యటం యిష్టం లేదం టున్న, యింజనీర్లకి యెప్పుడూ ట్రాన్స్‌ఫర్లుంటాయి. అందువల్ల లా ప్రాక్టీసు ఆలోచన సాగే పని కాదనీ యిల్లు చూసుకుంటే చాలునని సూచించారు వాళ్ళు. సుమతి తండ్రికి అది సంతోషంగానే అనిపించింది. వుద్యోగాలంటూ అటూ యిటూ తిరగటమే యిష్టంగా వుండేదికాదు ఆతనికి. పెళ్ళి సిటీలోనే, సొంత యింట్లో.

"గాయత్రీ నువ్వు పెగ్గామ్ రాస్తే మంచిగుండేది." అంది సుదతి.

"నీ లాగా నేనూ నా జూనియర్స్‌తో కలిసి రాద్దామని" అనిబిన్నగా నవ్వి, "బాగా రాశావుగా!" అంది గాయత్రి.

"యేదో రాసిన. మోహన్‌కి క్లాస్ వొస్తది. యింతకు ముందటంత యొబై సిక్స్ పెరెసెంట్ వున్నది" అంది సుదతి.

"రాస్తే మీకు రాంక్ వొచ్చేది" అన్నాడు సుధీర్ యింగ్లీషులో.

"యీ లా చదువుసంగతి మీకేం తెలుసు డర్టీయెస్ట్ లా. నాకు ఆ పుస్తకాలు అసహ్యం. వాదాలకు తీర్పులకూ తప్పితే లా ప్రాక్టీస్ దేనికి! మోహన్ కోర్టులో వాగి ఏం సాధిస్తాడో చూద్దాం. లా పూర్తి చెయ్యాలనే ఆలోచనకూడా లేదు. లా లో యెందుకు చేరానో యేమో" అని గాయత్రి మోహన్‌రెడ్డి వొంక చూసింది అదోలాగా.

అతనితో కలిసి చేరింది—లా ప్రాక్టీస్ అనే ఆలోచనతో కాదు కానీ కోర్టుల్లో వాదించి నెయింవాలని అనుకుంది. ఐతే అదంతా వృథాప్రయాస అని తరవాత తరవాత అనుకోసాగింది.

అరుణ చనిపోయినప్పటి నుంచి అదోలాగా వుంటోంది. యిన్నాళ్ళైనా మళ్ళీ గర్భవతి అవలేదు. మోహన్‌రెడ్డి పరీక్షలకి చదువుతూ గాయత్రిని చదవమంటే, "నేను లా వదిలేస్తున్నాను. నేనేమీ చదవను నేనేమీ కోర్టుల్లో వాదించను. నాకేదో కావాలి. నేనేదో చెయ్యాలి. యేదో అంతర్మథనంలా అనిపిస్తోంది." అని "మావో ఆన్ ఆర్ట్ అండ్ లిటరేచర్" పుస్తకంతో మొదలెట్టి డాస్టాయ్‌వస్కీ నుంచి సులోచనారాణి దాకా దొరికిన ప్రతి పుస్తకమూ చదివేసిందీ రెండు మూడు నెలలూ.

"మనవాళ్ళందరికీ వెడ్డింగ్ కార్డ్స్ యిచ్చినారా" అన్నాడు మోహన్‌రెడ్డి.

"యిస్తున్నాం. యింకా అందర్కీ యివ్వాలె. ఆదే పనిలో వున్నాం సుధీర్ పాపం సాయంగా వొస్తున్నాడు" అంది సుదతి.

"దారిలో విజయ్‌కుమార్ కనిపిస్తే కూడా వెడ్డింగ్ కార్డ్ యివ్వలేదీమె" అన్నాడు సుధీర్.

"మంచిపని చేసింది. డర్టీ రోగ్" అంది గాయత్రి.

"మీ అరెస్ట్ టైంలో ఆ యస్సై అసభ్యంగా ప్రవర్తించటానికి కారణం వీడేనట. ఆ యస్సై వీడికి బాగా తెలుసట రిలెటివ్ కూడానట" అన్నాడు సుధీర్ యింగ్లీషులో.

"వీడెలాగూ రోగ్. ఆ యస్సై, విధి నిర్వాహణలో వున్నవాడు వాడికి వుండక్కర్లా బుద్ధి? మొన్న వొకరోజున బజార్లో మోటర్‌బైక్ మీద పోతూ కనిపించాడు ఆ యస్సై. నా దగ్గరగా స్లో చేశాడు. పరిహాసంగా ఫక్కుమని నవ్వాను. ఆఫ్‌కోర్స్, అన్‌ఇంటెన్షనల్‌గా, అనుకోకుండానే. గుర్రుగా చూసి వేగం పెంచి పోయాడు. విజయ్‌కుమార్‌ని మన జనార్దన్ ప్లేస్‌లో కూడా పెట్టండి యెవరితోనూ దెబ్బలాడడు. కానీ దట్ విల్ బి యె డిస్‌గ్రేస్. ఆఫ్ కోర్స్, మెనీ మెంబర్స్ ఆఫ్ డిస్‌గ్రేస్ ఫుల్" అంది గాయత్రి.

"విడిపోయిన కవులు మరికొందర్ని లాగేసెయ్యాలని చూస్తున్నారు"

"వాళ్ళేపాటివాళ్ళు. వాళ్ళు పూర్వకవులు. విప్లవ కవిత్వం యేనాడైనా రాశారా? రాయలేదు. రాయగలవాళ్ళు, రాస్తున్నవాళ్ళు యింకా ప్రసిద్ధులవలేదు. వెనకటి వాళ్ళ వల్ల వొరిగేదేం లేదు. యెమర్జన్సీకి భయపడే వాళ్ళు విరసంలో వుండతగ్గ వాళ్ళుకాదు" అంది గాయత్రి.

"ఆ మధ్య కడప ఆకాశవాణిలో యెమర్జన్సీ స్తోత్రం చేసినారు కొందరు కవులు" అన్నాడు మోహన్‌రెడ్డి.

"యెవరెవరు?"

"ఆరుద్రాదులు. శ్రీశ్రీ లేడులెండి— వున్నా ఆశ్చర్యపడక్కరలేదు. కానీ ఆ గుంపులో చొరబడితే శ్రీశ్రీ ప్రత్యేకత వుండదు. విడిగా వీలావాలా చూసుకుని అధమత్వంగా ప్రవర్తిస్తాడు." అని నవ్వింది గాయత్రి.

"నీకు శ్రీశ్రీ అంటే స్పెషల్ డిజ్‌లైక్" అంది సుదతి.

"అవును. శ్రీశ్రీ అంటేనే కాదు. విరసం నియమావళిని వుల్లంఘించే

చను విరసం సభ్యులైనప్పుడు."

"యెమర్జన్సీని సమర్థిస్తూ వెంగళరావు ప్రభుత్వాన్ని సమర్థిస్తూ శ్రీశ్రీ స్టేట్‌మెంట్ యిచ్చినట్లు తెలుస్తున్నది" అన్నాడు సుధీర్.

"ఆశ్చర్యపడక్కర్లేదు. జెయిల్లో కూచోవలసి వస్తుందేమోనని. యీ పేరున జెయిల్లో కూచుని పేరు తెచ్చుకోవాలనుకునే చవటల కంటే అధమత్వం అంటాను. శ్రీశ్రీ శబ్దలోలుడే కాదు వ్యసనలోలుడు కూడా, సిగ్గు లేకుండా తరవాత లెంపలేసుకుంటాడు. అంతకంటే సిగ్గులేకుండా విరసం క్షమించేస్తుంది. అసలు, విరసం నియమావళిలోనే కొంత లోపం వుంది. మినహాయింపులు వుండకూడదు. మనమే కఠోర దీక్షలో వుండలేకపోతే యితరులకి చెప్పే నైతిక హక్కు మనకెక్కడిది? మనమే యీ స్థితిలో వుండిపోతే యిక సరైన గ్రహింపు చైతన్యం లేని ప్రజానీకం ప్రలోభాలకి లొంగిపోవటంలో ఆశ్చర్యం యేం వుంటుంది? విరసం వర్ధిల్లుతుంది. కానీ వీళ్ళ వల్లకాదు. నిజాయితీ వున్న నిజమైన యువతరం మార్క్సిస్టులతో విరసం వర్ధిల్లుతుంది. యెమర్జన్సీని నిరసించలేనివాళ్ళు విరసంలో వుండతగ్గ వాళ్ళు కారు," అంది గాయత్రి.

"యెమర్జన్సీ మహా జోరుగా సాగుతోంది. రామక్రిష్ణాలో "షోలే" సినిమా అంత జోరుగా సాగుతోంది. త్వరలో, గాయత్రి మిమ్మల్ని అరెస్ట్ చేస్తారని తెలిసింది." అన్నాడు సుధీర్ యింగ్లీషులో,

"నాకానొక మూడ్‌లో వుండిపోయినందునో యేమో యింట్లోనే వుండి పోతున్నాను. నేను బయటికొస్తే యెప్పుడో అరెస్టు చేసి వుండేవారు. చేసి, వాళ్ళు సాధించగలిగేదేమిటి? అణిచివేత ఎన్నటికీ నెగ్గదు. ఆఖరికి మన కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ యిందిర తోడ్పాటుతో కూడా!" అని పరిహాసంగా నవ్వి, "వీళ్ళంతా వెన్నెముక లేని వాళ్ళు. మాట్లాడే వాళ్ళంతా అంతే యింత మాట్లాడుతున్న నేను—" టక్కున ఆగిపోయింది గాయత్రి, వుద్వేగంగా.

"తపస్యా ఫిలిమ్‌కి పోయే మూడ్‌లో వున్న నిన్ను యీ మూడ్‌లోకి తెచ్చినం మేమొచ్చి" అంది సుదతి సంజాయిషీలాగా.

"నిన్నటినుండి నేను అనంగ అనంగ సరే అన్నది. గాయత్రియే ఫిలిం మూడ్‌లోనూ లేదు. ఆమెను కొంతకాలం యెక్కడికైనా రెక్లూజ్ ప్లేస్‌కి తీసుకుపోవాలనుకుంటున్న. యిదంతా ఆమె స్వభావం. ఆమె

వూహిది. ప్రస్తుత సమస్య వేరే వున్నది." అన్నాడు మోహన్‌రెడ్డి.

"మళ్ళీ ప్రెగ్నెన్సీనా?" అంది సుదతి గాయత్రితో చిన్నగా.

లేదన్నట్లు తల కదిపింది గాయత్రి.

పిల్లాపీచూతో ఏది చెయ్యటానికి ఆటంకం అ మళ్ళీ కడుపొచ్చి బాధపడుతున్నదని అనుకుంది సుదతి. కాదని తెలిసి అర్థం కానట్లుగా చూసి "దెన్ బీ ఛీర్ ఫుల్" అంది.

"ఐ యామ్ ఆల్వేస్ ఛీర్ ఫుల్" అని లోనకి వెళ్ళింది.

"యెమర్జెన్సీ టైమ్‌లో అరస్టయితె యేమి కూడ అడిగేటందుక్కూ లేదు. వాల యిన్ హ్యూమన్‌గ ట్రీట్ చేస్తున్నారట. టేక్ హెర్ టు సమ్ సెక్లూడెడ్ ప్లేస్" అంది సుదతి మోహన్‌రెడ్డితో.

మోహన్‌రెడ్డి యింతకుముందు అన్న అంశం ఆమెకి ఆ రకంగా అర్థం ఐంది.

"ఆమె అందుకు వొప్పుకుంటారని నేననుకోను" అన్నాడు సుధీర్ యింగ్లీషులో.

సుదతిని కాబోయే భర్త వివరాలు అడిగాడు మోహన్‌రెడ్డి—విషయం మార్చాలని సుదతి చెబుతోంది.

అంతలో నాలుగు టీ కప్పులు, బిస్కట్లు వున్న ట్రే రెండు చేతుల్తో పట్టుకుని వొచ్చింది గాయత్రి.

# 92

స్నానించి – నందివర్ధనం పువ్వులతో నిండిన ఆకుపచ్చ రంగుచీర కట్టుకుని వాకిట్లోకి వొచ్చింది, స్వప్నరాగలీన— చీకటి వెలుగుల కౌగిలిలోని అమర సంధ్యలోకి, వుషస్సంధ్యలా.

పచ్చికమీద కూచుని, చేతులో వున్న చిన్న టేప్‌రికార్డర్ పక్కన పెట్టి మీట నొక్కింది. హిందుస్తానీ జయజయవంతి రాగం—గాత్రం.

అప్పటిదాకా చారుమతీ వరహాశాస్త్రీ వుండివెళ్ళారు. ఆ మధ్య జేన్ తనపెళ్ళి శుభలేఖ యివ్వటానికి వొచ్చినప్పుడు ఆమెతో పాటు మేరీ మరో

యిద్దరు వున్నారు. షేరీని పాటలు పాడమన్నారు. యింగ్లీషువీ హిందీవీ సినిమా పాటలు. ఆఖరి పాట 'షోలే' లోని 'మెహబూబా' అది వింటున్నప్పుడు ఆ పాట వరాహశాస్త్రి పాడగా వినటమే కాక చూడాలనిపించి నవ్వుకుంది. యివ్వాళ సాయంత్రం నాలుగింటికి వొచ్చి ఆరింటిదాకా వున్నారు చారుమతీ, వరాహశాస్త్రీ. స్వప్నరాగలీన సినిమా పాటల ప్రసక్తి తెచ్చింది. "శాస్త్రిగారూ, మీ రాగ కౌశల్యం గురించి వినటమేగాని గానించగా వినే భాగ్యం కలగలేదు నాకు". అంది.

"అటు శాస్త్రీయం సాధ్యపడక, యిటు అశాస్త్రీయానికి సిద్ధపడలేక ఉభయభ్రష్టత్వ శాస్త్రినయ్యాను—నేను పాడి వినిపిస్తే సంగీతాన్ని అనుభవించగల వాళ్ళని హింసించినట్లే అవుతుంది. యేదో సరదా కూనిరాగాలూ అరుపులూ. నేను పుట్టకముందటి, యెవరు చేసినఖర్మ వారనుభవింపక తప్పదన్నా—అనో, నా చిన్నప్పటి సినిమాలో పాట—కాశీకి పోయాను రామాహరీ—అనో యేదో కుయ్యటం తప్ప పాడటం రాదంటే నమ్మండి" అన్నాడు.

"మా అన్నయ్య కొంచెం అతిశయోక్తి పోతున్నాడు లెండి. నాకు వీణ వొచ్చినంత తనకి గాత్రమూ వొచ్చు. అప్పుడప్పుడు కేదారగౌళ కూని రాగం తీస్తుంటాడు. అది వినే యోగం పట్టని అదృష్టవంతులు మీరు. త్యాగరాజస్వామి వారి కృతులతోపాటు ఘనం శీనయ్య ప్రసిద్ధ జావళీగానీ క్షేత్రయ్య పదాలుగానీ చక్కగా పాడతాడు. సినిమా పాటలూ వొచ్చు. బైజు బావరాలో హరిఓం. అనార్కలీలో పాటలూ—" అంది చారుమతి.

అనార్కలీలోని "యెజిందగీ వుసీకి హైజో కిసీ కా హోగయా—" యెక్కడ పాడతాడో అని భయపడిపోయింది స్వప్నరాగలీన. వొకసారి వో మంచి సంగీత విద్వాంసుడిచేత పాడించి భంగపడింది. 'ఆ పాట లత తప్ప మరెవరూ పాడకూడదు—' అనుకుంది.

ప్యాసాలోని వింటు సందర్భం పాటు, వేశ్యావాటిక పాట అడిగింది. పాడారు—"నాకు హిందీ బొత్తిగా రాదు. మాటలు కూస్తే మీరు క్షమించాలి. మీకు హిందీ బాగా వొచ్చని విన్నాను" అని,

అప్పుడు అడిగింది—"మెహబూబా పాడతారూ?" అంది.

"భలే! మీకెందుకు ఆ ఆలోచన వొచ్చింది? వీడు ఆపాటపాడుతూంటే వినటం కంటే చూడటం బావుంటుందంటి. ఆ పాటకి గమకాలుబాగా

తోడించి చచ్చే హైరానా పడుతూ పాడతాడు" అని నవ్వింది చారుమతి.

"ఇప్పుడు పాడే వాళ్ళ పాటని అసలు యీ ఫణితిలో పాడించివుంటే ఆ [illegible] యేం [illegible]గిసపడుదును" అని ప్రారంభించాడు పాడటం.

[illegible] పాడుతూండగా అతనిని చూస్తోంటే నవ్వొస్తుంది గానీ, [illegible] చెప్పినప్పుడు ఆ పాటకి వొకలాంటి లోతు తీసుకొచ్చినట్లనిపించింది.

"[illegible] నా సంగీతపు వంశంలో వాణ్ని. యీ జులాయి పాటతో ముగిస్తే మా పెద్దలకి అపచారం చేసినట్లవుతుంది," అని, "మరుగేలరా" పాడి ముగించాడు.

"మీలాంటివాళ్ళ తప్పించుకోకండా, యీసారెప్పుడో వొక వీణ చెప్పించి వుంచుతాను మమీ!" అని చారుమతితో అంది.

ఆవేళ సెలయేటి జాలులా ప్రారంభమైన జయజయవంతి వేగం పుంజుకుంటోంది.

[illegible] పింతండ్రి నాగిరెడ్డి టూర్ వెళ్ళినందున వొచ్చిపోయే [illegible] చప్పుడు లేకండా మరింత ప్రశాంతంగా వుంది ఆవరణ. [illegible] యిప్పుడు డి. పి. ఐ. కాదు. రెవెన్యూ బోర్డులో మెంబరుగా వేశారు. టూర్లు [illegible] వుంటున్నాయి. వారం రోజులైంది వెళ్ళి.

[illegible] జయజయవంతి ముగిసి—మాల్ కౌస్ రాగం; సితార్ మొదలైంది. [illegible] సాంద్రతనంతటినీ అతి సన్నదనం లోకి లాగితే సితార్ [illegible] తయారై వుంటుందేమోననిపిస్తుంది—ఆమెకి.

[illegible] దిద్దుకున్న కాటుకలా, చీకటి ఆమెశరీరాన్ని వెలిగిస్తోంది.

[illegible]గాలి తెర వొంటిని తాకితే, యేవో నైరూప్యభావనలునెత్తురై నరాల్లో ప్రవహిస్తున్నాయి.

[illegible] సంగీతంలో రంగులు. చూస్తున్న రంగుల్లో సంగీతం— [illegible] సంగీతంలో యేదో అనిర్వచనీయమైన స్పర్శ. ఆ స్పర్శ [illegible] అస్తిత్వం అంతటా ప్లావితమైన మాధుర్యం.

[illegible] కరిగిపోతున్న చీకటిలా, ఆ మాల్‌కౌస్ సితార్ నాదం ఆమెని ప్రకృతిలోకి కరిగిస్తోంది. ఆమె లేదు. ప్రకృతే వుంది. లేచి ఆమె [illegible] మీద నొక్కి— ఆపేసింది. ఆపైన ఆ సంగీతం వినలేదు. అక్కడినుంచి

కడుపు కండరంలో వేలిని నొప్పి లేకుండా గుచ్చి కుదట్లో పట్టి గుంజినట్లుగా అనిపిస్తుంది. ఆచూపుకీ హృదయానికీ సంబంధం వున్నట్లనిపించదు. ఆ చూపుకీ, నరాలకీ కూడా సంబంధం వున్నట్లనిపించదు. పెక్సైటింపు అవయవాలు కలిగించే ·లాజిక్· తిమ్మిరీ కాదు. విషంలా నరాలలో ప్రాకే యేదో సెగ—చుక్కేసి ప్రాణిని అపాంతం కంపించి వేసే సెగ. అలాంటి సెగ చూపులో పడి గిలగిలా తీపుగా కొట్టుకులాడుతున్నాడు రామ్మూర్తి.

రామ్మూర్తి పక్కగా అడుగులువేసి అతని చేతిని తనచేతిలోకి తీసుకుంది రమణి. అతని చెయ్యి కంపించింది. ముందుకు అడుగులు వేసింది. అతని కళ్ళలో ఆమె చూపు. అతని చుట్టూ ఆమె చూపు. ఆ మహాకామపు విద్యుత్ వలయం ముందుకు సాగిపోతుంటే విస్మయంగా తనూ సాగిపోతున్నాడు!

"మే ఐ నో యువర్ గుడ్ నేమ్?" అంది.

"రామ్మూర్తి" అన్నాడు రామ్మూర్తి, తడబడుతూ.

"యీ వూరేనా?" అంది యింగ్లీషులోనే.

"వూఁ" అన్నాడు.

"యెటుమంచెటు?" అంది వుర్దూలో!

"వుర్దూ రాదు" అన్నాడు యింగ్లీషులో.

"అసలేవూరు?" అంది యింగ్లీషులోనే.

"మచిలీపట్నం" అన్నాడు.

"బందరు బుల్లోడినన్నమాట" అంది తెలుగులోనే.

"రామ్మూర్తి ఆశ్చర్యంగా చూశాడు. అతనికెందుకో- ఉత్తర భారతం మనిషి అనుకున్నాడు.

"హాఁ— హాఁ—" అన్నాడు.

"యింటిపేరు" అంది.

"పురాణం."

"చతుర్వేదుల లింగమూర్తి తెలుసా?"

"వుఁహూఁ"

"కంగారు రంగారావు?"

"వుఁహూఁ"

"నిజంగా ఆ వూరేనా? కంగారు రంగారావు తెలియనివాళ్ళు నావాళ్ళ

లింగమూర్తి తెలియనివాళ్ళా బందర్లో వున్నారన్నమాట మీరు క్రితం శతాబ్దంలోనన్నా పుట్టివుండాలి. లేకపోతే ఐదేళ్ళ క్రితమన్నా పుట్టివుండాలి అని నవ్వింది.

చెయ్యి విడిపించుకున్నాడు. తప్పుకుని వెళ్ళే యత్నంలో వున్నాడు. కంటికొనలోంచి అతని కళ్ళలోకి చూసింది— అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ. భుజానికి భుజం ఆనుతూంది. ఆ చూపులోనల, ఆ రెండు భుజాలూ కలిసిపోతున్నాయి.

నడుస్తోంది. ఆమె చూపు అతణ్ని యీడ్చుకుపోతోంది.

యివాళ సాయంత్రం పూనా నుంచి వొచ్చిన రైల్లోంచి దిగింది రమణి. దిగాక కొచ్చిన్ వెళ్ళాలని తెలిపింది. పొద్దునే కాజీపేటకి చేరి ఢిల్లీ నుంచి వొచ్చే రైలు పట్టుకోవాలి. యెందుకంటే—

మూడు నెలలక్రితం బొంబాయిలో వొకతనితో వుంటూండగా తనకి కడుపులో బాగా నొప్పిగావుంటే వో డిస్పెన్సరీకి తీసికెళ్ళాడు అతను. చిన్న అల్సర్ వుంది తీసెయ్యాలట. ఆ సందర్భంలో ఆ సర్జను రమణి గురించి ఆసక్తి కలిగి ఆమెను పరీక్షించాడు. ఆ సర్జనుకి అరవై ఐదేళ్ళుంటాయి. మిలటరీలో చేసి రిటైరయ్యి ప్రాక్టీసు పెట్టుకున్నాడు. మంచి నిపుణుడు. రమణి అంత ఆరోగ్యంగా యెలావుందో అతనికి అంతుపట్టలేదు. ఆమె వొంట్లో లేని సుఖవ్యాధులంటూ లేవు. వొంట్లో యింకిపోయిన స్థితి దాటిపోయింది. అసలు లేనట్లుగా వాళ్ళే వాటితో తయారైనట్లుగా ఐన స్థితి. అంతుపట్టలేదు. పూర్తిగా యెలా సాధ్యమో. నెత్తురు, వుమ్మి, మూత్రం— పరీక్షలకి పంపించాడు— మైక్రోబయాలజీ. వైరాలజీ— తదితర నిపుణులకి. యే కాంప్లికేషన్‌లోకి రాని వొకలాంటి విషపుజీర ఆ మూడింటిలోనూ వున్నట్లు తేల్చారు. ఆ సర్జన్‌కి రమణిని తీసుకెళ్ళి అతను బాగా తెలును. విషయం చెప్పి "నాలగు మూడు రోజాలంతే' ఫరవాలేదు. కొంతకాలం పాటు వుంటే తెలియని యెలాంటి హాని మీ వొంట్లోకి యింకుతుందో చెప్పలేం." అని సలహా యిచ్చాడు.

రమణి ఆపరేషన్ అయ్యి కాస్త కోలుకున్న దగ్గిర్నుంచి తప్పించుకుని తిరుగుతున్నాడు. బయట బయటే వుండి వొస్తున్నాడు.

'పొమ్మనలేక మొహమాటపడి చస్తున్నాడు పచ్చినాగన్న' అని ఆషకుని క్షణంలో బిచాణా యెత్తేసింది, చెప్పకుండా. బిచాణా యెత్తేసెయ్య

టమంటే మరేమీ వుండదు. వున్నవాటిగా వుత్తచేతుల్తో రైలెక్కటమే.
యెన్నడూ మూడు చీరల కంటే మించి కొనుక్కోదు. యెవరన్నా కొంటే
యెన్ని కొన్నా కడుతుంది అన్నీ. యెన్ని కొనిచ్చినా యేమేమీ కొనిచ్చినా,
తాను విజాణా యెత్తేటప్పుడు — చెప్పనూ చెప్పదు యేమీ వెంట తెచ్చు
కోనూ తెచ్చుకోదు. వొక్కటే వొకది తీసుకుంటున్న సందర్భంలో — వో
కూజా, వో చాప, వొక దొంతి, దిండు. రైలు యెక్కేటప్పుడు అవీ
అక్కడ వొదిలేస్తుంది. తాగుడూ సిగరెట్లూ అలవాటు లేదు. తోడుకోసం
అరసీసా నీట్ ఖాళీ చేసి పది సిగరెట్లు యేకబికిన పూటెన్నోనూ గలదు.
కానీ వాటిమీద మనసెన్నడూ పోలే తానుగా వాటినెన్నడూ ముట్టుకోనూ
ముట్టుకోలేదు.

ఈసారి అక్కడినుంచి విజాణా యెత్తబోతూండగా, బజార్లో
గోవిందన్ నాయర్ అని బట్టల బిజినెస్ యెగ్జిక్యూటివ్ వో యేదో — అతను
పాత పరిచయం — కనిపించాడు. అతని భార్య పెళ్ళయిన యేడాదిన్నరకే
యెవరితోనో వెళ్ళిపోయింది. "లక్షణంగా వో పిల్ల నిన్ను పెళ్ళాడితే,
బుద్ధిగా ఆ పిల్లకి వొండిపెడుతూ, కడుపుచేస్తే — సిగ్గు లేకుండా కడుపుచేస్తావా
అని కసిరి చక్కా నిన్నొదిలేసి వెళ్ళిపోతే ఆ మాత్రానికి యిలా కయ్యూ
రయ్యూ వన్నమాట" అని హాస్యం పట్టిచ్చేది.

అతను వాళ్ళ బాస్‌తో హైదరాబాద్ వెడుతున్నట్లూ, అక్కడ
వాళ్ళ బాస్ దిగడిపోతాడనీ, అక్కడి నుంచి యిద్దరూ కలిసి కొచ్చిన్ వెళ్ళా
ల్సినీ చెప్పాడు. చెప్పిన ప్రకారం రమణి రైలు దిగేసరికి కలుసుకున్నాడు
గానీ వాళ్ళ బాస్ కొచ్చిన్‌దాకా ఆఘోరిస్తున్నాడనీ విడిగా అక్కడికి రమ్మని
చెప్పాడు. ప్రయాణం ఖర్చుకి డబ్బిచ్చాడు. కానీ రమణికి బుకింగ్ కౌంటర్లో
టిక్కెట్ కొన్న అనుభవం యింతవరకు లేదు. కదులుతున్న రైల్లో యేదో
వొక పెట్టెలో యెక్కేస్తుంది సాధారణంగా టిక్కెట్టు కొనాల్సిగానీ దొంగ
ప్రయాణం కాదు. రైల్వే టిక్కెట్ యిన్‌స్పెక్టర్ల అతిథిగా ఫ్రండుగా
ప్రయాణిస్తుంది. యెప్పుడన్నా అవసరం ఐతే కొంటుంది. కానీ ఆమె జీవి
తంలో వందలాది ప్రయాణాల్లో అలా టిక్కెట్టు కొన్న సందర్భాలు వేళ్ళ
మీద లెక్కించవొచ్చు.

ఆ రకంగా యీ రాత్రిపూట యీ నగరంలో రికామిగా వుండిపో
యింది. అలా రికామిగా వుంచుంటే — పక్కనించి పోతూ తన వొంక

చూసిన రామ్మూర్తి మీద కన్నుపడింది. కన్నుపడిన మరుక్షణంలో ఆ మనిషి చిక్కుతాడో లేదో కనిపెట్టెయ్యగలదు.

నాంపల్లి సెంటరు. రాయల్ హోటల్‌కి పక్కన వున్న పంజాబ్ హోటల్లోకి దారి తియ్యబోతున్న రమణి, అటు స్టేషన్లో రైలింజను కూత విని, బుర్రలో ఏదో ఆలోచన మెరిసినట్లుగా గిరుక్కున వెనక్కి తిరిగింది. "బ్లడీ ఫక్కిన్ హోటల్స్" అనుకుంటూ. రామ్మూర్తి కాలు మెలిక పడవలసింది. పిసరంతలో తప్పింది. ఆ కదలికకి అతని చేతిని కొంచెం గట్టిగా పట్టుకుంది.

రైల్వే స్టేషన్లోకి నడిచింది.

నలుగురైదుగురు గుంపుగా కూచుని మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ వంక చూసి "దేఖో" అంది — వింటూనే అందరూ తలలు యిటుతిప్పారు. పైకి మడిచిన చూపుడు వేలితో దర్పంగా సూచించింది. ఒక పోర్టర్ లేచి వొచ్చాడు. నడుస్తోంది నడుస్తూ, "కూడా రా" అన్నట్లుగా చెయ్యి వూపింది. తన కాలి పక్కగా.

సైడింగ్ ప్లాట్‌ఫాం మీదకి నడిచింది.

ఓ పదినోటు పోర్టర్ చేతికి అందించింది.

రామ్మూర్తి విస్తుపోయాడు — ఆ నోటు యెక్కడనుంచి తీసి యిచ్చిందీ తెలుసుకోలేక. పర్స్ లేదు. బ్లౌజ్‌లోంచో, బొడ్లోంచో కొంగు నుంచో కాదు. "మరి" అనుకున్నాడు.

రెండో చేతులో వున్న చేరుమాలలోంచి.

"ఆ ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంటు తెరువు" అంది. వుర్దూలో.

"అదెల్లా?" అన్నాడు అతను వుర్దూలో.

"నీకు సాధ్యమవుతుందిలే తెరువు"

పోర్టర్ గ్రహించి, "వెయిటింగ్‌రూంలు హోటళ్ళు వున్నయ్‌గా" అన్నాడు.

పెదవి విరిచి, "దీన్లో ఐతే మజా వొస్తుంది. పొద్దున్నే యీ రైల్లోనే ఆ పెట్టెలోనే ప్రయాణం చెయ్యాల్సికూడా" అంది

పది నిమిషాలు.

కంపార్ట్‌మెంట్ తలుపు తెరుచుకుంది.

అతని ముఖంలోకి చూస్తూ.

పైకి గెంతగానే ఆమె చెంపకి చెంప భుజానికి భుజం అనాయి. తలుపు మూసింది.

వరవాలో అడుగులు వేస్తోంది. ఆమె వెనక అతను. కటిక చీకటి. వో కూపే తలుపు తెరిచింది.

రోజూ రైళ్ళలో తిరిగే టిక్కెట్టు యిన్స్పెక్టర్లు కూడా ఆ చీకట్లో తడుముకోకండా అంతనేర్పుగా వెళ్ళలేరేమో — అనుకున్నాడు రామ్మూర్తి.

కిటికీ తెరిచింది.

చెరో బెర్తుమీదా కూచున్నారు. బయటి విద్యుద్దీపపు కాంతి, కిటికీ లోంచి వాళ్ళమీద పడుతోంది.

వొక పాదం, అతని రెండు కాళ్ళ మధ్యగా బెర్తుగుండ నిడుపుగా ఆనించింది. పాదం అతనికి తగులుతూంది.

రామ్మూర్తి వొణికిపోతున్నాడు.

"అప్పుడెక్కడి నుండి వొస్తున్నారు?"

"సినిమా చూసి"

"యేం సినిమా?"

"కె. యె. అబ్బాస్ కాల్ గర్ల్"

"చూడటానికి అంత పాతదే దొరికిందా? అదీ తెరమీదది. వుత్త బొమ్మ" అని నవ్వి బొటనవేలితో—

అతని ముఖం చుట్టూ ఆమె చూపు.

వొణికిపోతున్నాడు.

యేదో గమనించినట్లుగా రవంతకను బొమలు చిట్లించి, "పెళ్ళయిందా" అంది.

"వూఁ—"

"యెన్నాళ్ళయింది?" అంది.

"యేడాదిపైగా"

"వూళ్ళో వుందా?" అంది.

"వూ—"

"వొంట్లో బాగుందా?" అంది.

"వూ."

"బాగుంటుందా?" అంది

"వూ."

"యింట్లో వొక్కతే వుందా?" అంది.

"వూఁ"

"యింట్లో వొక్కతెనూ వొదిలి 'కాల్ గర్ల్' బొమ్మ చూడటానికి వొచ్చారూ" అని నవ్వు ఆపుకుంటూ, "బొమ్మెప్పుడూ చూడనేలేదా?" అని పకపకా నవ్వింది.

రామ్మూర్తి వొణికిపోతున్నాడు.

"ఆడవాళ్ళని—" అని చేత్తో మూడు నాలుగు చోట్ల చూపెట్టుకుంటూ "యిక్కడో, యిక్కడో, యిక్కడో, దొంగ చూపులు చూస్తూ అర్థమైన ఆలోచనలతో నానాటింగాలిగా వూహించేసుకుంటూ గడిపేస్తూ— చివరికో పిల్లని—వో చలిమిడి ముద్దని చేసేసుకుంటారు. బతుకు చప్పగా చొప్పదంటు లాగా వుంటుంది. మీ అర్ధాంగి మీ చూపులు వాలేలాగా వుండాలిగాని మరెవరి చూపూ వాలకూడదు. అందరూ మనలాంటివాళ్ళే— వొకరిద్దరు తప్పపుట్టిన వాళ్ళు తప్ప. తనకళ్ళకి బట్టలే లేనట్లుగా కనబడాలి. యితర్ల కళ్ళకి గొంగళి కప్పుకున్నట్లుగా కనపడాలి. కానీ కళ్ళు అందరివీ వొకటే, మనసు విష్పృతపాతమైన పాపిష్టిని. యే ఆడదాని రూపమూ మెల్లకొంచెం వొక్కలాగే వుండదు. యిరవై యేళ్ళ వయసులో మీ బందరు లడ్డులా వుంటారు. ముప్ఫయ్యేకి తిరుమల లడ్డులా వుంటారు. నలభయ్యేకి, కంటికీ, పంటికీ నచ్చని తిరపతవ్వాళ్ళ చప్పు లడ్డూలా వుంటారు. లడ్డూ లేదు....లేదు.... యిరవయ్యేళ్ళకే చలిమిడి ముద్దలు. చలిమిడి ముద్దని చక్కని లడ్డూలాగా చెయ్యొచ్చు గానీ— చేస్తే యేం కొంప మునిగిపోతుందో అని భయం. వుద్యోగం చేసే ఆఫీసులోనూ అంతే. యెదురు చెప్పడానికి భయం. చెప్పింది చెయ్యడానికీ భయం. చెయ్యకపోవడానికీ భయం. వూహల్లోకి పగటికలల్లోకి నిద్రకలల్లోకి — అంతలో వ్యర్ధాంగి రావటంతో వాటిమీద లంపు ధవళమైన మూతపడుతుంది కనీసం వూహలూ లేవు. కలలూ లేవు. యాంత్రికంగా కాల్ గర్ల్ గుడ్డ బొమ్మలు, వాల్ గర్ల్ కాగితం బొమ్మలు చూస్తూ కాపురం వెలిగబెడుతూ యేడాదికొకసారి కడుపు చేస్తూ మనలాంటి పరిపెంపర్ని భూమ్మీదకి వొదులూ—" అని ఆయాసంగా శ్వాస పీల్చుకుని, "బతుకులో మొదటి సారిగా నూటికి నూరుపాళ్ళు అంచనా తప్పింది. తొలి ఆవళ్ళ

కానుందో—" అని పకపకా నవ్వి భారంగా శ్వాస విడిచి చివాలున లేచి వడివడిగా నడిచి వెళ్ళిపోయింది, రమణి.

అంత వేణుకలోనూ, 'వేశ్య కాదూ! మరి?' అనుకున్నాడురామ్మూర్తి అయోమయంగా.

# 94

యివాళ్టి యీ పేపరుపై యేదో తేదీ వార్తాపత్రికలో పతాక శీర్షిక చూసి, అదే మొదటి పేజీ పెద్దగా బొమ్మ వేశాడు శ్రీపతి.

పాలిపోయిన గులాబీ రంగులో జయప్రకాశ్ నారాయణ్ బొమ్మ నిలువెత్తున వేశాడు. కుడిభుజం మీద మొరార్జీని వేశాడు, కాషాయం రంగులో యెడమ భుజం మీద చరణ్‌సింగ్‌ని వేశాడు, పచ్చరంగులో. కుడి చంకలో నల్లరంగులో వాజ్‌పేయీని, యెడమ చంకలో మరూన్ రంగులో ఫెర్నాండెజ్‌ని వేశాడు.

ఆ బరువు మొయ్యలేక కుప్పలాకూలేలా కనిపిస్తున్నా పళ్ళబిగువున భారం మోస్తూ, పైకి యికిలిస్తున్నట్లు కనిపిస్తున్నాడు. బొమ్మకింద, నుసు రంగులో "punity" అని రాశాడు.

పేటిరంగులలో ముంచిన ఆ ఆరు బ్రష్షుల్నీ నీళ్ళగ్లాసులో వేశాడు.

వో నిమిషం ఆ బొమ్మవంక చూసి ఫక్కున నవ్వి, రెండు చేతుల్తో వుంగచుట్టి మూలకి విసిరాడు.

పేము కుర్చీలో యేటవాలుగా కూచుని, కుడిచేతి చూపుడువేలి కణుపుతో పెదాలమీద చిన్నగా వొత్తుకుంటూ పైకప్పుకేసి చూస్తూ వుండిపోయాడు.

రెండు నెలలక్రితం వో మధ్యాహ్నం హోటల్లో భోంచేసి గూటికి వొస్తూ, దారిలో వున్న పెయింటింగ్ కాలేజీలోకి వెళ్ళాడు.

వొక హాల్లో కొందరు కాన్వాసుల మీద రంగులు పూస్తున్నారు. వొకతను అజమాయిషీగా చూస్తున్నాడు. అప్పుడప్పుడు యేదో చెబుతున్నాడు మేస్టరు. యింకో హాల్లో కొందరు కూచుని లైన్ డ్రాయింగ్ వేస్తున్నారు—పెన్సిళ్ళతోనూ బ్రష్షులతోనూ.

ఆ మేస్టరు బయటికొస్తే, "నేను పెయింటింగ్ ప్రారంభిద్దామనుకుంటున్నాను మీరేమంటారు" అన్నాడు శ్రీపతి.

వింతగా చూసి, "మీపేరు! డ్రాయింగ్ సర్టిఫికెట్లూ అవీ యేమైనా వున్నయ్యా? అడ్మిషన్లు యింకో నాలుగు నెలల్కి వొచ్చే జులైలో వుంటయ్" అన్నాడు అతను

"అడ్మిషను దక్కాల్లేను, చిన్నప్పుడు డ్రాయింగు మాస్టారు చెప్పిన బొమ్మలు తప్ప వెయ్యలేను. పెయింటింగ్ ప్రారంభిద్దామనుకుంటున్నాను. మీరేమంటారు?" అన్నాడు శ్రీపతి.

విస్మయంగా చూసి, చిన్నగా నవ్వి, "బేసిక్ ప్రిన్సిపుల్స్ నేర్చుకోండి ముందు. ఆ తరువాత పెయింటింగ్" అన్నాడు అతను.

"అలాంటి రూల్సుబద్ధంలొకి మొదలెడితే మీ లాగా పెయింటింగ్ మేస్టరుగా వుండి పోవాల్సొస్తుంది ఐ వాస్ట్ డు యిట్ స్ట్రెయిట్ యివే" అన్నాడు శ్రీపతి.

కొంచెం పరిహాసంగా చూసి, "రోడ్లమీద పసిబొగ్గుతో బొమ్మలేసి పక్కన కూచుని, పారేసిన పైసలు యేరుకుంటూ యెవరన్నా కనిపిస్తారు. అట్లాంటి వాళ్ళే చూసి సంప్రదించండి" అని అంటించాడు అతను.

"యీ స్కూల్లో లాగా కాకండా అలాంటి చోట్ల యెలైన్ ఆఫ్ ఆర్ట్, యె ప్యాచ్ ఆఫ్ ఆర్ట్ వుంటొచ్చేమో" అని, అతని ముఖంలోకి చూసి చిన్నగా నవ్వి బయటికి వొచ్చి చకచకా నడుస్తూ —

వంద గజాలు నడిచాక — వెనక్కి తిరిగి, నడుస్తూ, రిక్షా కనిపిస్తే కూచుని ఆబిడ్స్‌లోనూ కోఠిలోనూ దిగి, పెయింటింగ్ సామగ్రి కొనుక్కుని గూటికి చేరాడు. అప్పటి నుంచి బొమ్మలు వేస్తున్నాడు.

నెల రోజుల తరవాత తలుపులకి వేసే రంగుల డబ్బా తెచ్చాడు. ఆ రంగుల్లో వేళ్ళు ముంచి ముంచి పిసజేస్తూ, విదిల్చుతూ, అద్దుతూ, మీటుతూ గీస్తూ, మెలితిప్పుతూ, కాన్వాసుమీద పెయింటింగ్స్ తయారు చెయ్యసాగాడు. ఏ పెయింటింగ్స్ ప్రతిదాన్లోనూ వొక భావం ప్రస్ఫుటంగా స్ఫురిస్తుంది — వొకర్ని చూపులో కాక కాసేపు దీక్షగా చూస్తే, ప్రతి పెయింటింగ్‌కీ వెనక వైపున ఆ భావం పేరు రాశాడు: జాణతనం, భీతి, కరుణ, అతి వినయం, తృష్ణ, మోహం, ధైర్యం, మూర్ఖత, అశాంతి, సుషుప్తి, చైతన్యం — యిలాంటి పేర్లు.

లేచి యీజెల్ వైపు నడిచాడు. వారం రోజుల క్రితం ప్రారంభించిన కాన్వాసు. ముగింపు దశలో వుంది.

నల్లగా మెరుస్తూన్న విశాలమైన తారు రోడ్డు దాని మీద గులాబీ రంగు ఫోం పరుపు. దాని మీద విశ్రమించిన యువతి— యాంకీ తెలుపు శరీరం మొలమీద కప్పినట్లుగా, తెరిచి పరచిన ప్లేబోయ్ పత్రిక. చనుకట్టుకి బిగించిన నీలం రంగు బ్రాసియరు మీద యెనామెల్ తెలుపులో "బాండ్ స్ట్రీట్ ఫిట్టింగ్స్" అని యింగ్లీషులో అక్షరాలు. పైన యెడమవైపున వుదయిస్తున్న చంద్రుడు ఆ పక్కన మూడునాలుగు నక్షత్రాలు. పాలిపోయిన పసుపురంగు ఆకాశం. పైన కుడివైపున యెగిసిపడుతున్న యెర్ర రంగు సముద్రం. పైన మధ్యలో తెల్లగా వెగలు కక్కుతున్న అపరాహ్ణపు సూర్యుడు. పెయింటింగ్ దిగువన, "అట్లాంటిక్ జిలబాల" అని రాశాడు తెలుగులో.

దగ్గిరికి వెళ్ళి బ్రష్షు అందుకుని ఆమె గోళ్ళకి నేరేడు పండురంగు పూయసాగాడు.

వొక అరగంట తరవాత మంచం మీద పడుకున్నాడు. అదే గదిలో పెయింటింగ్ సరంజామా— మంచం, టేబిలు కుర్చీ, పుస్తకాలు. గజిబిజిగా చిక్కురొక్కురుగా కనిపిస్తుంది గది, చూడగానే కానీ మురికిగా అనిపించదు.

పది నిమిషాల్లో నిద్రపట్టేసింది. మెలకువ వొచ్చేసరికి సాయంత్రం అరు అయింది. లేచి స్నానించాడు. అలా బయటికి వెళ్ళి టీ తాగి రావాలని బట్టలు మార్చుకుంటూ వుండగా, ముందు తలుపుల మీద చప్పుడు, "శ్రీపతి గారూ" అని పిలుపు. ఆ గొంతు యెవరిదో గుర్తించగలడు. ధనలక్ష్మి అని, వో ప్రయివేటు కంపెనీలో స్టెనోటైపిస్టు. అదే బంగళాలో పైన వొక వాటాలో వుంటుంది తండ్రి, ముష్టి రంగనాథం యాడీసీగా చేసి రిటైరై కూతురితో వుంటున్నాడు యిద్దరు కొడుకులు. పెళ్ళిళ్ళయి భార్యా పిల్లలతో వుంటున్నారు. కోడళ్ళతో అతనికి పొసగదు. పొసిగినా కొడుకుల్తో సరి పడదు. అందుకని పెళ్ళికాని యీ కూతురితో వుంటున్నాడు. అనారోగ్యం. "నీ పెళ్ళి చూసి కళ్ళు మూస్తా తల్లీ" అంటూంటాడు. "నువ్వు కళ్ళు మూయ్యకుండా వుండటం కోసమైనా నేను పెళ్ళి చేసుకోకుండా వుంటాను నాన్నా." అని చమత్కరిస్తుంటుంది. కట్నం యివ్వటానికి దమ్మిడీ ఆస్తి లేదు. అతనికి వొచ్చే పెన్షన్ అతనికే చాలదు. ప్రావిడెంట్ ఫండ్ కార్గిగా

వొస్తే, ఆది కొడుకులు గుంజేసుకున్నారు దాంతో— పెద్ద కొడుకు పెళ్ళికి రాళ్ళ నెక్లెసు చేయించాడు, రెండో కొడుకు మూసారాంబాగులో జాగా స్థలం కొన్నాడు సరూర్‌నగర్ వైపు లే అవుట్స్‌లో.

"వొస్తున్నా, వక్క నిమిషం" అన్నాడు శ్రీపతి, ప్యాంటు నడుం కొక్కెం పెట్టుకుని నిలువు జిప్ పైకి లాగుతూ.

ఎవరొచ్చినా సాధారణంగా లోపలి గదిలోకి వొచ్చే అవకాశం యివ్వడు తన పెయింటింగ్ హంగామా చూడనివ్వటం యిష్టం వుండదు. ముందు గదిలోంచే పంపేస్తుంటాడు. పూర్తిచేసిన పెయింటింగ్స్ కనపడకండా దాచేస్తుంటాడు.

అతను వుండే బంగళా విచిత్రంగా వుంటుంది. చూడటానికి చిన్నది గానే అనిపిస్తుందిగానీ దాన్లో కింద పైనా వక్కలాకలిపి యెనిమిది తొమ్మిది కాపరాలున్నాయి కాపరం కాని కాపరం శ్రీపతి దొక్కటే. ధనలక్ష్మిది, రోగిష్టి తండ్రితో కాపరం. ఆ యిల్లువున్న వీధి చిన్నదే ఐనా వీధికి రెండు వైపులా కొత్తవీ పాతవీ, కొత్తగా తీర్చిన పాతవీ బంగళాలు క్రిక్కిరిసినట్లుగా చాలా వుంటాయి. రకరకాల వుద్యోగాల్లో వ్యాపకాల్లో వ్యాపారాల్లో వున్న వాళ్ళుంటున్న వీధి.

ముందు గదిలోకి అడుగువేస్తూ "నిలుచునేవున్నారుకూచోండి" అన్నాడు.

"యెటో బయల్దేరుతున్నట్టున్నారు· తొందర పనైతే వెళ్ళాను— మళ్ళీ కలుసుకుందాం" అంది.

"అదేం లేదు. కూచోండి అలా, వో కప్పు కాఫీకని—"

"కప్పు కాఫీ కోసం అంత దూరం దేనికండీ! నే పట్టుకొస్తా రెండు కప్పులు కలిపితే మా నాన్న వొద్దన్నాడు. రడీగా వుంది ఫ్లాస్కులో" అని లేవబోయింది.

"కూచోండి, కూచోండి. మీ ఫ్లాస్కులో కాఫీ అలా వుండనీండి. మీ యింటికొస్తాను. అప్పుడు యిద్దురు. చిరుతిండి అలవాటైన ప్రాణికి మూడ్పూటలాపీకదాకా తిండిపెట్టి—అది తిని వుండమంటే యెంత కష్టంవో అంత కష్టం—అలవాటైన హోటలు ముఠికి వేణ్ణీళ్ళు గొంతులో పడుతూండకపోతే!" అని తనూ కూచున్నాడు.

"నాకు మీ గురించి యేమీ చెప్పనేలేదు: అంది.

"— ఏముంది చెప్పటానికి:"

"మీ గురించి నాకు అంతా తెలిసిపోయిందిలెండి, మా కంపెనీలో వక క్లర్కుంది మీ వూరి ప్రక్కటౌను, కంకిపాడు అతను చెప్పాడు మీరు జమీందారులంటగా!" అంది

"యింకా మన దేశంలో జమీందారులంటూ వున్నారా!"

"యిన్ని నెలలనుండి తెలిసుండి కూడా యేమీ చెప్పలేదు ?" అంది.

"యెన్నో యేళ్ళుగా తెలిసిన వాళ్ళకయినా అంతే నా గురించి నేను చెప్పుకోవాల్సినవేలేవు. నాగురించి నేను చెప్పుకోకూడనివీలేవు. మనిషి మాట, స్వభావం, పరిచయంలో తెలుస్తాయి. వెనకా ముందూ తడుముకోకుండా సామాన్య జీవనం గడిపే స్తోమత వుందని గ్రహిస్తారు."

"లక్ష్మి !"

గుమ్మం బయట నిలబడ్డ నలభయ్ యేళ్ళ వయసు స్త్రీని చూసి, లేచి గుమ్మంలోకి వెళ్ళింది ధనలక్ష్మి.

"మీ గుమ్మం బయట గడియవేసి వుంటే—యిటు నీ గొంతు వినిపించి వొచ్చాను. మా వారింకా రాలేదు. నేను అలా మా లేడీస్ క్లబ్బుకి వెళ్ళాలి. కీస్ యిస్తావేమోనని. యెక్కడికీ వెళ్ళడం లేదుగా ?"

"లేదు ఆలాగే" అని తాళం చెవుల గుత్తి తీసుకుంది ధనలక్ష్మి.

వొచ్చి కూచుంటూ "ఆవిడ తెలుసా ?" అంది.

"యీ అగ్గిపెట్టెల మహల్లో వుంటున్న భర్తల్లో కొందరు తెలుసు. ఆకొందరిలో కొందరి భార్యలు తెలుసు యీవిడ వకరిభార్య అనుకుంటాను. తరచూ చూస్తుంటాను " అన్నాడు శ్రీపతి.

శ్రీపతి మాటలు యెంతో నచ్చినట్లుగా చూస్తూ, "ఆమె భర్త సిండికేట్ బ్యాంకులో క్యాషియర్. ఆవిడ రచయిత్రి. వంటలూ వార్పులూ అంటూ వ్యాసాలు రాస్తుంది, పత్రికలకి కొన్ని కథలు కూడా రాసింది— యింకా అచ్చు అవలేదు. తిరిగి వొస్తుంటయ్ నాకు చూపెట్టింది. యేవో వున్నయ్— మెంతికూర చింతామణి అని వారపత్రికల్లో చూశారా ?"

"పత్రికలు చూసే అలవాటు లేదు సరిగా."

"శ్రీపతిగారు యెక్కడుంటారండీ ?" బయటి నుంచి మగగొంతు.

"మీ కోసం యెవరో వొచ్చినట్లున్నాడు" అంది.

"అదిగాదుగా చెబుతారు వొస్తాడుగా యిందాకా వొచ్చిన మనిషి."

మరు నిమిషంలో, గుమ్మంలో వుండున్న, యెదురుగా శ్రీపతిని చూసి,

## అనుక్షణికం - 2

"హలో శ్రీపతిగారూ" అంటూ గుమ్మంలోకి అడుగులు వేశాడు విజయ్ కుమార్.

"హలో రండి" అన్నాడు శ్రీపతి కూచునే — చేత్తో పక్కన వున్న కుర్చీ చూపెడుతూ.

లోనికి వొచ్చి కూర్చుంటూ యెదురుగా కుర్చీలో వున్న స్త్రీని చూసి, చూపు శ్రీపతి వైపు మరల్చి, "సర్లింగం కనిపిస్తే అడిగితే చెప్పాడు మీ అడ్రసు." అన్నాడు విజయ్‌కుమార్.

"ఆహాఁ"

"క్రితంసారి మనం కలిసినప్పటికి మీరింకా హాస్టల్లోనే వున్నారనుకుంటాను" అన్నాడు విజయ్‌కుమార్.

"అనుకుంటాను" అన్నాడు శ్రీపతి.

"నేను క్రితంసారి హాస్టలుకొచ్చినపుడు...." అని యేదో మాట్లాడుతూ, మధ్య మధ్యలో కంటి కొసల్లోంచి ధనలక్ష్మిని గమనిస్తూ వున్నాడు విజయ్‌కుమార్ పరిచయం చేస్తాడేమోనని శ్రీపతి వంక చూశాడు.

"వూఁ యేఁవిఁటి. ఖులాసా? మీ లా చదువు యెంత వరకూ వొచ్చింది?" అన్నాడు శ్రీపతి

"ఆఁ యేదో పేరుకి చదువు" అని ధనలక్ష్మి చనుకట్టుమీద చూపు క్షణకాలం నిలిపాడు విజయ్‌కుమార్.

"మంచిది. నాన్నగారికి చెప్పండి. నేనొచ్చి కలుసుకుంటానని." అన్నాడు శ్రీపతి ధనలక్ష్మి వంక చూసి

తను వొచ్చి కూచుని వున్నప్పుడు యెవరన్నా రావటం జరిగితే వొచ్చిన వాళ్ళని పరిచయం చేసేవాడు శ్రీపతి. పరిచయం చెయ్యకపోగా, అలా అనేసరికి యేదో విశేషం వుండి వుంటుందనిపించింది ఆమెకి. అడగాలనుకుంటూ, "మంచిది" అంటూ లేచి వెళ్ళింది ధనలక్ష్మి.

వెడుతున్న ఆమె పిరుదుల వంక చూస్తూ, "ప్రస్తుతం యేం చేస్తున్నారు?" అన్నాడు విజయ్‌కుమార్.

"మిమ్మల్ని చూస్తున్నా." అన్నాడు శ్రీపతి.

"యిహీఁ" అని, "పేపర్లో వర్క్ చెయ్యటం లేదటగా?" అన్నాడు విజయ్‌కుమార్.

"అవును."

"యెవరీమె?" అని సిగరెట్ వెలిగించాడు విజయ్‌కుమార్.

యీ మహల్లో వున్న చాలా పోర్షన్లలో వొక దాన్లో వుంటారు " యం. యే. ప్రయివేటుగా కడుతుందట. వివరాలు కనుక్కోటానికి వాళ్ళ నాన్న పంపించారు."

"పేరు ?"

"తెలియదు. వాళ్ళ నాన్న పేరు తెలుసు. మేడమీద వుంటారు."

"ఆ మధ్య మా నిజాం కాలేజీ రంగారెడ్డి కనిపించాడు. మిమ్మల్ని చాలా పొగిడేస్తున్నాడు."

"యిప్పుడు మీది నైట్ లా కాలేజీ కదా— నిజాం కాలేజీ కాదుగా? నిరసించే లెక్కన అన్ని కాలేజీలూ మీవేననుకోండి అంకిరీడు పెళ్ళిలో పరిచయం అయ్యాడు అతను. నాకు నచ్చాడు." అన్నాడు శ్రీపతి.

"వొట్టి తిరుగుబోతు" అన్నాడు విజయ్‌కుమార్.

"నేనూ తిరుగుబోతునే"

"యెంతమాట! వాడికీ, మీకూ పోలికా!" అన్నాడు విజయ్‌కుమార్.

"అభిరుచిలో అవసరంలో స్థాయిలో తేడా వుంటే వుండొచ్చు. నాకు అతనంటే గౌరవం యేర్పడింది. నిజాయితీ బేరం అతనిది పైగా అతనికి కొన్ని నియమాలున్నాయి. మోసగించి యే స్త్రీనీ నాశనం చెయ్యడు కార్నర్ చెయ్యడు."

"యిహిఁ. ఐమీన్. అఫ్‌కోర్స్. అట్లాంటివాడే అనుకోండీ—"

"యెలా వున్నారు? కులాసా? హౌయీజ్ మిసెస్ విజయ్‌కుమార్? పిల్లలా ?" అన్నాడు శ్రీపతి.

"ఫైన్. యింకా పిల్లల్లేరు. మీతో చిన్న పనిబడి వొచ్చాను—"

"చెప్పండి" అన్నాడు శ్రీపతి.

"ఢిల్లీలో రియల్ యెస్టేట్ యేజంట్ వినయ్‌కౌల్ మీకు తెలుసునని విన్నాను—"

"అంతగా పరిచయం లేదు. క్రితం సారి ఢిల్లీ వెళ్ళినప్పుడు, అతనిని కలుసుకోలేక పోయాను ఫోన్లో మాట్లాడాను. వ్యాపార రీత్యా తెలియదు."

"ఢిల్లీలో షోరూం ఫ్లాట్ కోసం చూస్తున్నాం. అతని అడ్రసు.

దగ్గర అడ్రసు లేదు. డైరక్టరీలో ఫోను నంబరు చూసి దాన్తో

వున్న అడ్రసు ప్రకారం వెదుతూంటాను లేదూ, ఫోనుచేస్తే తనే వొస్తుంటాడు. డైరక్టరీలో చూస్తే తెలుస్తుంది."

"మీకు లెటర్ యివటానికి వీలయితే —"

"పరిచయానికి స్నేహానికే ఐతే యివ్వగలను. వ్యాపార వ్యవహారానికైతే అక్కర్లేదు. దేనికదే వెరీ యింజీనియస్. కానీ డీసీవర్ కాదు. మంచికి, మంచి. చెడుకి చెడు వంటి స్వభావం. వూరికే నా పేరు చెప్పొచ్చు రెఫరెన్స్‌కి. మీరే వెదుతున్నారా?"

"నాకా వ్యాపారాల గొడవలు సరిపడవు. నేను విరసానికీ ఫైన్ ఆర్ట్సుకీ పరిమితం. మా వాళ్ళెళ్తారు. అతని పూర్తి పేరు— డైరక్టరీలో చూడటానికి —"

"కాల్ సి. వినయ్ అని చూడండి. వొకే పేరు వుంటుంది."

"థ్యాంక్సండీ. వస్తాము. యేదో బిజీగా వున్నట్లున్నారు."

"బిజీ యేం లేదు. బయటికి వెళ్ళబోతుండగాఆవిడొచ్చింది. అంతలో మీరొచ్చారు. పదండి నేనూ బయటికే వొస్తున్నాను" అని లేచి మధ్య గది గుమ్మంలో అడుగు పెట్టి వొంగి, పక్కనుంచి తాళం అందుకున్నాడు శ్రీపతి.

వాకిట్లో కొచ్చాడు.

విజయ్‌కుమార్ స్కూటర్ పంచ గజాల అవతల వుంది.

"యిల్లు అదేమో అనుకొని అక్కడాగి అడిగాను. రండి బజార్లో డ్రాప్ చేస్తాను" అన్నాడు విజయ్‌కుమార్.

# 95

"అయ్యొ పిలుస్తున్నడు" అన్నాడు పూర్ణను వొచ్చి రామ్మూర్తితో.

కాగితాలలోంచి తల పైకెత్తకుండా, 'అయ్యట అయ్య, విద్యే ధర్డు క్లాసు వెధవ పీడికి అయ్యట....' అనుకుంటున్నాడు రామ్మూర్తి.

"యిన్నావా లేదా?"

"సర్వ్రాసీ వెధవ—యేక వచన ప్రయోగం—మర్యాదా మన్నా

లేవు వీళ్ళకి. శ్రీపతి కాదంటాడు. వీళ్ళకి సౌమ్యత పంచితనం అమాయకత్వం వుందట. రాయలసీమ ప్రాంతంలో వాళ్ళకీ యేక వచనమేనట. కాగా నాటుతనం అలక్ష్యం వున్నాయట. సర్కారు ప్రాంతీయులకు మర్యాద బాగా తెలుసట. అవసరం ఐతే వాయించడమూ తెలుసట.

తూర్పు సర్కారు ప్రాంతంలో అతి వినయం, అతి మర్యాద, మన్ననలున్నాయట. అవసరం ఐతే నిలుషనా ముంచేసేతనమూ వుందట. శ్రీపతికేం తెలుసు, వొడ్డున కూమున్న కబుర్లు. యీ ఆఫీసుల్లో సబార్డినేట్‌గా వుద్యోగం చేస్తే తెలుస్తుంది. కానీ అట్లా అంటే వొప్పుకోడేమో, ప్రతి ఆఫీసరూ యింకోడికి సబార్డినేటేనని మలుస్తాడేమో.... యీ అలగా జనానికి మర్యాదా పాడూ లేవు...."

"సాబ్ ఖున్నవా?"

—సాబ్ అంటే, గారు, అండీ అనికదూ! పాపం తురక పాలనలో వుండిపోయి తెలుగులో మన్నింపులు తెలియకనే కావొచ్చు. వుర్దూలో ఐతే అట్లా కాకపోవచ్చు. యీ మర్యాద మన్ననలు పొందటానికి నే నిప్పుడు వుర్దూ యెక్కడి నేర్చుకునేది....

"అయ్య బయటకు పోవాల్నట. జెల్దిపో. గా కాగజ్‌లు అప్పటికి చూసోక్కరదు? కోపమ్ చేస్తడు—"

—కోపం చేస్తాడా కుర్మా చేస్తాడా. యింట్లో కుర్మానే చేస్తాడు. కమ్మబుమ్మమంటూ యెగురుతాడీ థర్డ్ క్లాస్ బియ్యే వెధవ—యింట్లో పిల్లి. పిల్లి కూడా కాదు. పేను—వుట్టి పేను కూడా కాదు. కుక్కిన పేను—వాడి పెళ్ళాం. అమ్మబాబో, దానిమందు యెవడైనా కుక్కిన పేనే అవుతాడు. వీడి పెళ్ళాంకి బుర్ర గొరిగించి మీసాలెట్టి....

రామ్మూర్తి ఆలోచనలోంచి లేచాడు. లేచిన రామ్మూర్తిని వెసరంగా ఆలోచనలు ముసురుతూనే వున్నాయి.

అది అట్లా తగలెట్టావేం? అంటాడు కస్సుమని చూడగానే. యిట్లాగే తగలడుతుంది నీమొహంలాగా—అంటాను నేను కరుగ్గా. యేం వుద్యోగం చెయ్యాలని లేదా? అంటాడు, పికించితే మళ్ళీ నీ మూతిపళ్ళు రాలగొట్టించి వొచ్చాను మర్చిపోయావురా—అంటాను నేను పరిహాసంగా. వెధవ సిగ్గుతో కుంగిపోతాడు....

రామ్మూర్తి ఆఫీసరు గదిలోకి చొరబడ్డాడు.

"మిస్టర్ రామ్మూర్తీ, ఆ లెటర్ యేంచేశావు? యింకా నోట్ పుటప్ చెయ్యలేదేం?" అన్నాడు ఆఫీసరు ధాటీగా.

"యస్సార్. చేస్తున్నానుసార్,"

"యెన్నాళ్ళు చేస్తావు? యిదేం రిసెర్చనుకుంటున్నావా?"

"నెససరీ యిన్ఫర్మేషన్ కోసం కలెక్టరాఫీసుకి రాశాం సార్. అది రాగానే—"

"యిన్ఫర్మేషన్కి కాళ్ళు లేవు దానంతటది రావడానికి. అవసరం మనది. వెళ్ళి పట్టుకొచ్చి చెయ్యి."

"యస్సర్."

రామ్మూర్తి గది బయటపడ్డాడు.

"అవసరం మనదట. జాయింటుగా వ్యవహరిస్తున్నాడు. కతికేది ఆ వెధవేగా? అమ్మ్యామ్మ్యా వెధవ పైగా సిగ్గులేకుండా వన్నంటున్నాడు. యిన్ఫర్మేషన్కి కాళ్ళు లేవట దానంతటది రావడానికి— జోక్ కాబోలు అని— వెధవకి జోకడం కూడా రాదు. జోకడం అంటే యిక్కడ తూచడం అని అర్థం వుంది. వీడికి తూచడం బాగా వొచ్చు. పార్టీలని బాగా తూచగలడు. యెవడెంత బరువు పెట్టగలిగేది పెట్టలేనిదీ. యేమోవాకి బాధలెట్లాంటివో— నెలనెలా జీతం మాత్రమే యిస్తే వీడి పెళ్ళాం వీణ్ణి యింట్లోకి రానివ్వదేమో—అందుకోసం గడ్డికరుస్తాడు. గడ్డి కరిస్తే నాకేం గుడ్డు కరిస్తే నాకేం. మధ్యలో నన్ను కరవడం దేనికి? పట్టుకుని వాలుగు వాయించావంటే. పోరా టొంపే—అని దులిపేశావంటే రోగం కుదిరిపోతుంది.

రామ్మూర్తి తన సీటువైపు నడుస్తూంటే కార్నర్ సీట్లో కూర్చుని వున్న టైపిస్టు మేరీ సౌందర్య తిలకం. "రామ్మూర్తిగారూ మీ కాగితాలు రడీ" అంది యింగ్లీషులో.

పక్కకి తిరిగి, "థాంక్యూ" అని యికిలించి, అటు రెండడుగులువేసి ఆ కాగితాలు అందుకున్నాడు.

దీనికి పుట్టగానే ఆ పేరు పెట్టివుంటే దీనమ్మ బాబూ గుడ్డివాళ్ళైవుండాలి. తిలకం అవసరం లేనిదిగానీ—అసలు నుదురేదీ తిలకం పెట్టుకోడానికి! ఆ గుర్రపు ముఖంలో నుంచి కారే సౌందర్యం. ఆహా—తోలు కారు నలుపు కాకపోబట్టీ, పల్చటి జుట్టు కత్తిరించి మూనె లేకంగా జూలుగా వుంచబట్టీ, తొడలూ చంకలూ కనబడే లాగా పొట్టి గౌనేసుకుని అంటూ ఊంటూ

లేకండా తిరగబట్టిగానీ లేకపోతే....బయటికి చూడడానికి యెట్లా కనిపిస్తే వేం—అన్యాయం—రూపం, దేహంది దేవుడిచ్చాడు—మనసు మంచిది. బుద్ధీ మంచిదే....

మూడు నెలల క్రితం వోరోజున, బజార్లో నలుగురెవరినో వెంటబెట్టు కుని వెడుతున్న రవిని చూస్తే రామ్మూర్తికి బుర్రలో ఆలోచన మెరిసి — మూడురోజుల తరవాత రవి దగ్గిరికి వెళ్ళాడు. రవితో రామ్మూర్తికి అంతగా పరిచయంలేదు. వొకసారి తను నిజాం కాలేజీకి వెళ్ళిన సందర్భంలో పరిచ యం అవటం, మాటల సందర్భంలో తనని అతను సోషల్ కండిషనింగ్ ఆఫ్ యిండివిడ్యువల్ గురించి అడగటం తను వివరించటం—అంతవరకే. ఆ పరిచయాన్ని పురస్కరించుకుని వెళ్ళి, తనని వుద్యోగంలోంచి పీకేసిన సంగతి చెప్పి, "మీలాంటివాళ్ళు తలుచుకుంటే నన్ను తొలగించడం అన్యా యం అని నిరూపించి, న్యాయం జరిపించవొచ్చు"అన్నాడు.

"అన్యాయాన్ని నిరూపించటంకష్టం. నయానో భయానో సాధించాలి. వాడి జాతకం తెలుసుకుని నాలుగు నొక్కులు నొక్కి పని చేయించుకోవాలి. మీరు వివరాలన్నీ రాసివ్వండి ప్రయత్నిస్తాను, లెటరు రాస్తాను, తరవాత." అన్నాడు రవి.

"దేనికి నేనే వొస్తానులెండి ; మళ్ళీ ఆదివారం వొచ్చి కలుస్తాను." అన్నాడు రామ్మూర్తి.

"ఆ చిన్న టెంపొరరీ వుద్యోగం దేనికి అంత చవిచీ?" అన్నాడు రవి.

"అదైనా దొరకని రోజులు. కాగా కొన్నాళ్ళే. త్వరలో నాకు పోస్ట్ డాక్టొరల్ ఫెలోషిప్ వొస్తుంది" అన్నాడు రామ్మూర్తి.

నెలరోజులకి రామ్మూర్తికి ఆ వుద్యోగం యిప్పించాడు రవి.

"10—A- టెంపొరరీ వేకేన్సీల్లో తను నియామకం చేసిన వాళ్ళ దగ్గిర నాలుగో వొంతు జీతం మీ ఆఫీసరు పుచ్చుకుంటాడట. మీరివ్వలేదని తీసేసి వుంటాడు." అన్నాడు రవి.

"యివ్వడం యివ్వకపోవడం తరవాత మాట. ముందు నన్ను అడగ లేదే!" అన్నాడు రామ్మూర్తి.

"చప్రాసీ సూచించి వుంటాడు. మీరు గ్రహించివుండరు."

"ఐతే యిప్పుడు నెలనెలా నాలుగో వొంతు వాడికివ్వాలన్నమాట!"

"అక్కర్లేదు. వాడు పరమ కక్కుర్తి వెధవ. వాణ్ని యెక్కడ నొక్కాలో అక్కడ నొక్కి వుంచాను. మీ జోలికిరాడు నాకొండిడేల్ అవి. వొస్తే దబాయించండి" అన్నాడు రవి.

"మీకు కృతజ్ఞతలు యెట్లా చెప్పాలో—"

"యెట్లాగూ చెప్పొద్దు" అని చిన్నగా నవ్వాడు రవి.

ఆ కాగితాలు పూర్తిచేసి ప్యూనుకిచ్చి పంపిస్తూ ; "యీ ఆర్డరుకి యెంత గిడుతుందో గాడిదకొడుక్కి. ట్రైబల్ వెల్ఫేర్ సెల్‌లోని యీ ప్రాజెక్టుకి కూడా వీడే వైర్లెస్. వీడికేం తెలుసునని! వీడికింద నేను అసిస్టెంటుని!" అనుకున్నాడు రామ్మూర్తి.

ఐదున్నర అయింది.

పర్స్ తీసి పౌడర్ అద్దుకుని, లిప్‌స్టిక్ పూసుకుని, చేత్తో జుట్టు సరి చేసుకుని లేచి, "యివాల్టికి సెలవండి రామ్మూర్తిగారూ," అంది మేరీ సౌందర్య తిలకం యింగ్లీషులో.

"హిఁహిఁ" అని యికిలించి లేచి నంచుని ఫైలు ట్రేలో పడేశాడు రామ్మూర్తి. ఆమె బూట్ల టకటక గుమ్మం దాటింది.

మేరీ సౌందర్య తిలకం. మేరీ అంటే హిందీలో నా అని అర్థంట. మేరీ సౌందర్య తిలకం అంటే నా సౌందర్య తిలకమూ అని అర్థమన్నమాట హతోస్మి....

రామ్మూర్తి బయటపడ్డాడు. పడక.

బస్టాపు.

జ్యోతి, భక్తకన్నప్ప వాల్‌పోస్టర్ల కింది వో మంచూళం సినిమా. పడకగది రతికాండ కొండం బొమ్మని సరిగా చూడనివ్వకుండా-- బస్సులు ఆగేవీ ఆగకుండా పోయేవీ, స్టాపుకి అవతలగా ఆగి పారిపోయేవీ.

యెవరో పాట కూస్తున్నాడు-- "ముత్యాలూ వొస్తావా" అంటూ.

అరగంట.

యెలాగైతేనేం వో బస్సులో దూరబడ్డాడు.

కంపు-- చెమట కంపు. రకరకాల చెమటలు, మగ చెమట కంపు సాయంకాలపు ఆఫీసు బస్సుల చెమట కంపు

దిగాడు యెక్కడం యెంత కష్టమో దిగటమూ అంతేకష్టం.

తనుండే వీధిలో నడుస్తున్నాడు. రక్షీరోడ్డు.

నడుస్తున్నాడు.

"హలో" యెవరో వాడకట్టులో మనిషి.

"హలో—హీఁ(హీఁ("

అతనికి కాస్త సంతోషంగా సైకిలు చక్రాల బండి--బండినిండా ఆపిల్ పళ్ళు.

అంతలో వెనకనుంచి వొచ్చి ముందుకు దూసుకుపోయిన కారు. కారులో తార వొక్కతే కారు నడుపుతూ. గుర్తింౘాడు. భుజం చెంపజబ్బ కనిపింౘాయి.

కారు దూమకు వెళ్ళిపోగా రేగిన యెర్రదుమ్ములో రామ్మూర్తీ, పళ్ళ బండీ.

గాలి దుమ్ముగాలి దుమ్ముగాలిదుమ్ముగాలి గుమ్మగాలి గుమ్మగాలిబొమ్మ గాలిపిల్లగాలి పిల్లగాలిలో పిల్ల గాలి పిల్లగాలిలో దుమ్ముగాలిలో పిల్లగాలిలో పళ్ళబండి పాలవళ్ళు పాలపళ్ళు పాలపండ్లు పాలవళ్ళు పాలపండ్లు డాట్సన్ వుయ్యాల కార్లో ఒంత పాలపండ్ల చెట్టునుండి రాలినపండు నేలమీదో గుంటలోనో కాక మహల్‌మీద పడింది అదీ లక్కీ....

రామ్మూర్తి యిల్లుచేరాడు. తలుపు తట్టాడు. లోపల్నుంచి పసిబిడ్డ యేడుపు. రామ్మూర్తి భార్య క్రితం నెలలో మగ పిల్లణ్ని ప్రసవించింది. తొలికాన్పు అవటంవల్ల కష్టమే ఐంది. అతని అత్తవొచ్చి రెండు నెలలుండి క్రితం వారమే వెళ్ళింది. మధ్యలో అతని తల్లీ చెల్లెలూ వొచ్చివెళ్ళారు.

తలుపు తెరుచుకుంది. గుమ్మంపక్కన భార్య నిర్మల.

"వాడెందుకట్లా గొంతుచించుకుంటున్నాడు? నేను యింటికి వొచ్చాననా" అన్నాడు రామ్మూర్తి విసుగ్గా.

"పసికందుని అవేం మాటలండీ" అంది నిదానంగా. నిర్మల మాట, తాపీగా బెల్లంపాకంలాగినట్లుగా వుంటుంది.

మాట జావజారినట్లూ మనిషి నీరసపడినట్లూ తగలడుతుందేం తిండిలేనట్లుగా—అని మనసున చిరాకుపడి, "యెన్నాళ్ళ నుండి వుపవాసం" అని అనబోయి ఆగి, "వొంట్లో యెట్లావుంది?" అన్నాడు.

నిర్మలని చులకనగా పరిహసిస్తూన్నప్పుడు వొక్కోసారి ఆ రాత్రి రైలుపెట్టెలో రమణిగుర్తొస్తుంది. లోలోన వొణుకువొస్తుంది. రమణి పేరు అతనికి తెలియదు. తనలో తను నామోషీపడిపోతాడు. ఆ విషయం యెవరి

తోనూ అవలేదు.

"నాకు కొంచెం భయంగానే వుంది. బాబుకి జ్వరం తగ్గలేదు. డాక్టరు దగ్గిరికి తీసుకెళ్ళి చూపెట్టండి" అంది.

మూడు రోజులనుంచి ఆమెకి జ్వరం తరచూ యేదొకటి స్వల్ప అస్వస్థత వుంటూంటుంది, ఆమెకి".

"తల్లిని నువ్వే తీసికెళ్ళు. నీకు జ్వరం తగ్గిందన్నావుగా" అన్నాడు.

సరేనన్నట్లు తలవూపింది.

స్నానించి వొచ్చాడు.

టిఫినూ కాఫీ.

టిఫిన మెక్కి కాఫీ తాగేసరికి రామ్మూర్తికి కొంత వుత్సాహంగా అనిపించింది. నిర్మలమీద మరో జోక్ వెయ్యబోయి ఆగిపోయాడు.

తిట్టినా, దీవించినా, ప్రణయించినా, ప్రళయించినా, సరసించినా విరసించినా— ఆమె నీరసించినట్లుగానే అనిపిస్తుంది రామ్మూర్తికి. మొదట్లో మొదట్లో నిరసిస్తున్నట్లుగా అనుకున్నాడు. గానీ అది నీరసించటం అని తర వాత తరవాత అనుకున్నాడు.

రామ్మూర్తికి పావుగంట క్రితం పన పక్కనుంచి దూసుకుపోయిన యెర్ర పడవ కారు గుర్తొచ్చింది— నిర్మలవంక చూడగానే.

—అదేం వక్షం. అందునా బాలింత వక్షం! అందుకే పిల్లాడికి సీసా పాలు. సీసాపాలు పాలసీసా గాజుసీసా గాజుకారు సీసాకారు గాజుకారు గాజుపాల— కవల పిల్లలకి, సరదాకి అప్పుడప్పుడూ — మొగుడూ లేదు కడుపూలేదు పాలూలేవు— కాపీ పాలు పాలు పాలవండ్లు పాలబంతులు....

"రిక్షా పిలిస్తే తీసికెళ్తాను మరి—"

"యీ నీరసాన్ని పసిబిడ్డడే యెత్తుకోవాల్సొస్తుంది" అనుకుంటూ "నే తీసికెళ్తాలే—" అని లేచి పిల్లణ్ని భుజాన వేసుకున్నాడు.

పిల్లడు మరింత యేడవటం మొదలెట్టాడు కదలికకి.

"యింజక్షను సూది గుచ్చినట్టు యేడుస్తాదేం— నీ లక్షణమేఅబ్బింది" అని విసుక్కున్నాడు.

"నేను యింజక్షను చేయించుకుంటూ యేడవడం మీరెప్పుడు చూశా రండీ" అని చమత్కరించటం ఆమెకి చాతకాదు చాతకాకండానే పాకప్పా

అలా యేదో అంటే, రామ్మూర్తికి చమత్కారంలా కాక యెకసక్కెంలాగా అని పించింది. యేదో ములుకుమాట అన్నాడు. మాటకు గుచ్చుకున్నదీ లేనిదీ తెలియనీలాంటి, ఆమె మౌనం,

"ఆ డాక్టరు యక్షప్రశ్నలన్నీ అడుగుతాడు. పొద్దుటినుండీ వీడి గాథంతా నాకు తెలియదుగా— చెప్పేవా—" అన్నాడు రామ్మూర్తి.

తల వూపింది నిర్మల.

# 96

సాయంత్రం ఆరు గంటలవేళ.

రోడ్డువెంట నిదానంగా పోతున్న విజయ్‌కుమార్, పక్కన సినిమా హాలు ఆవరణలో కొందరిని చూసి; వెంటనే స్కూటర్ లోనకి తిప్పాడు. వెనక కూర్చుని వున్న యాదగిరి, "యిటు యాడికి?" అన్నాడు.

"బాపూ సీతా కల్యాణం గొప్ప సినిమా" అన్నాడు విజయ్‌కుమార్.

అక్కడ నిలుచుని వున్న వాళ్ళలో లలితకళల నిపుణులు కొందరు వున్నారు. తన ఆసక్తి వాళ్ళకి తెలయాలని విజయకుమార్ దిలావర్ దగ్గిరికి వెళ్ళవలిసినవాడల్లా యిటు తిరిగాడు.

మధ్యలో చాలాసార్లు యాదగిరికి చాలా విషయాలు వివరించాడు. విజయ్‌కుమార్. యింటర్‌వల్‌లో అవసరం లేకపోయిన, మూడు నాలుగు పార్లు వివరించాడు. బయటికీ లోనకీ, తిరిగాడు.

"యేమ్ పిక్చ బోర్‌గున్నది." అన్నాడు యాదగిరి. తనకీ కొంత విసుగ్గానే అనిపిస్తున్నా "సీతకెలవదు చాలాయింటరెస్టింగ్‌గావుంది" అన్నాడు విజయ్‌కుమార్.

తెర దగ్గిరిసీట్లో శ్రీపతిని చూసి ఆశ్చర్యపోయాడు విజయ్‌కుమార్.

యిలాంటి సినిమాలయితే — ఖాళీగా తెరిపిగా వుంటుందని శ్రీపతి, కింది తరగతి టిక్కెట్టు కొని ముందుగా కూర్చుని తెరముందు కూచుంటాడు.

సినిమా ముగిసిన వేళకి సన్నగా జల్లు పడుతోంది. జనం వరండాలో నిలుచున్నారు. కొందరు చినుకుల్లో పడిచి వెడుతున్నారు.

శ్రీపతి, విజయ్‌కుమార్‌లు దూరంనుంచి వొకరినొకరు చూసి

ఇద్దరూ పది అడుగులు ముందుకు వేశారు.

"లేబర్ క్లాసులో కూచున్నారు?" అన్నాడు విజయ్‌కుమార్.

"నేనూ లేబర్‌నే. కేపిటలూ కేపిటలు మీది సొంతం ఫలసాయం లేని పని. లేబరే." అని చిన్నగా నవ్వి, "మరేంలేదు. ఇలాంటి సినిమాలి కొస్తే పై తరగతిలో కూచుంటే, విజ్ఞానపు అజ్ఞానపు రన్నింగ్ కామెంటరీలు వినలేక చావాల్సొస్తుందని" అన్నాడు శ్రీపతి.

"అటెళ్ళి టీ తాగుదామా?" అన్నాడు విజయ్‌కుమార్.

"వో." అన్నాడు శ్రీపతి.

చిటికల్లో నాలుగడుగులు వేసి, పక్కనే ఇటు హాలు ఆవరణలోకి అటు రోడ్డువైపుకీ వున్న ఇరానీ హోటల్లో కూచున్నారు. కూడా యాదగిరి.

"హీరో హీరోయిన్‌లు చాలా బాగున్నారు" అన్నాడు విజయ్‌కుమార్.

"వోల్డ్ మాస్టర్ల ఫిమేల్ న్యూడ్‌లా వున్నాడు. కాకపోతే వాళ్ళకి మన సీలం తెలియదు" అన్నాడు శ్రీపతి.

"బాపూ గొప్ప ఆర్టిస్ట్. గొప్పగా తీశాడు." అన్నాడు విజయ్‌కుమార్ సిగరెట్ వెలిగిస్తూ.

"కెమెరామన్‌కి మరీ మరీ చక్కని యాంగిల్స్‌ని సెలక్ట్‌చేసి పెట్టటమూ రంగుల కలయిక కాంపోజిషన్‌లూ బాపూ ప్రత్యేకత. గంగావతరణం బావుంది. బాపూ పరిమితుల ననుసరించి, Bapu is too lyrical for the mighty sublimeness of the Gauga andthe Himalayas. రోరిక్ వేసిన The Birth of Ganges చూడతగింది—"

మధ్యలోనే అందుకుని, "అవును ఆ వోల్డ్ మాస్టర్ చాలాగొప్పగా వేశాడు" అన్నాడు విజయ్‌కుమార్.

'వోరి నీ అజ్ఞానం మండా. వాలెజ్క్వె ఫిమేల్ న్యూడ్‌ల అవయవాలు వీడి కళ్ళలో మెదిలి వుండాలి.' అనుకుని, "రోరిక్ వెనకటి శతాబ్దాల యూరోపియన్ వోల్డ్ మాస్టర్ కాదు. నికొలస్ రోరిక్ రష్యన్. చాలా కాలం హిమాలయ ప్రాంతాల్లో వున్నాడు. అతని రెండో కొడుకు తొలి భారతీయ సినీరాణి దేవికారాణిని పెళ్ళిచేసుకున్నాడు. ఆ చిత్రం సంజీవదేవ్‌గారి దగ్గిరుంది—"

మధ్యలోనే అందుకుని, "అవును ఆయనది మా జిల్లానే. వాళ్ళింట్లో చూపెట్టారు నాకు. హిమాలయాల్లో శివుని జటాజూటంలో నుండి జలపాతం లాగా దూకుతున్న గంగావతరణం." అన్నాడు విజయ్‌కుమార్

'హోరి సిగ్గుమాలినవెధవా! నీలాంటివాడ్ని యింటిచాయలకికూడా రానీయరాయన. నిన్ను పిలిచి తీసుకెళ్ళి నీకు ఆ చిత్రం చూపెట్టారన్నమాట! దాన్లో శివుడి మద్ది గొట్టుకుపోయిన జుట్టులోంచి జలపాతంలా దూకుతున్న గంగావతరణం చూశావన్నమాట! శివుశా, నీ మొగుడా? The Birth of Ganges. గంగ పుట్టుక ప్రగాఢంగా వుంటుంది గానీ జలపాతంలాగానో బృందావన్ గార్డెన్‌లో ఫౌంటెన్‌లాగానో వుండదురా చీంబోతు వెధవా' అనుకుని. "మీరు చూసిన చిత్రం మరొకటై వుంటుంది. కేలండర్ బొమ్మలాంటిది. రోరిక్ చిత్రంలో అవేమీ లేవు" అన్నాడు శ్రీపతి.

విజయ్‌కుమార్ గుర్రుగాచూశాడు, పెదాలూ మూతీబిగించాడు. పక్కన యాదగిరి వున్నందున మరీ యిబ్బంది పడ్డాడు. 'వీడేదో పెద్ద తెలిసినాడిలాగా పెద్ద పెయింటర్‌లాగా మాట్లాడతన్నాడు. జన్మలో యెప్పుడూ బ్రష్ పుచ్చుకునుండడు— ' అని కసిగా అనుకుంటూ, 'టూత్ బ్రష్ తప్ప' అని జోడించుకుని, తనలోనే పిసరంత నవ్వుకుని, "మీరు చెప్తున్నది ఆ చిత్రం గురించా. అవును — అది అట్లాంటిదే" అన్నాడు విజయ్‌కుమార్.

"...త్యాల ...గ్గోలే నేదిది." అన్నాడు యాదగిరి నీరసంగా.

"బాపూ పెయింటర్ కదా అందుకని యిట్లాకూడా తీస్తాడు" అన్నాడు విజయ్‌కుమార్ యాదగిరితో బోధపరుస్తున్నట్లుగా.

"బాపూ పెయింటర్ కాదు. మంచి లైన్ డ్రాయింగ్ యిల్లస్ట్రేషన్ ఆర్టిస్ట్." అన్నాడు శ్రీపతి.

వినిపించుకోకుండా "శ్రీపతిగారూ, ఢిల్లీలో మీ ఫ్రెండు ఆ వినయ్ కౌల్ చాలా సహకరించాడు. త్వరలోనవిజరగవొచ్చు. థ్యాంక్యూ వెరీమచ్" అన్నాడు విజయ్‌కుమార్.

"బాలిష్ నక్కూవా మె." అన్నాడు యాదగిరి.

శ్రీపతి బిల్లు చెల్లించబోతే, అడ్డుపడి విజయ్‌కుమార్ చెల్లించాడు.

"టీ నీళ్ళ బిల్లు చెల్లిస్తే యేం?" అని చిన్నగా నవ్వాడు శ్రీపతి.

'నీ చురకల తెలివికేంలే' అనుకుంటూ విజయ్‌కుమార్ బయటికి నడిచాడు "మీరెటు?" అని శ్రీపతితో అంటూ.

"గూటికి" అని అడుగులు వేశాడు శ్రీపతి.

స్కూటర్ స్టార్ట్ చేసాడు విజయ్‌కుమార్. వెనక రూపగిరి కూర్చున్నాడు. రూపగిరిని ఎక్కడో పేట మలుపులో వదిలేసి సుల్తాన్‌బజార్ కోఠీకి వెళ్ళాడు దిలావర్ కోసం.

దిలావర్ వున్నాడు.

"ఫిఫోరస్ రెండు గంటల్ చూస్తి. నయ్ ఆతే అన్‌కొని వంపేస్తి మిలిట్రీ ఆఫ్సర్ తోటి." అన్నాడు దిలావర్.

"కొత్త పిట్ట పిటపిటలాడుతుందని స్పెషల్‌గా వుంచమని చెప్తే యిట్లాగేనా చేసేది? రాత్రికి కొత్తది సిద్ధం చేస్తావా లేదా?" అని విసుక్కున్నట్లుగా అని గిలిగిల్లాడిపోయాడు.

ఖాళీగా వున్న యిద్దరి ముగ్గురి పేర్లు చెప్పాడు దిలావర్.

"ఆ రొచ్చు.............. నీమకోసం తెచ్చిన యీ కొత్తపిట్టని— పేరేంటన్నావు—పుతిలీ కదా—దాన్ని సిద్ధంగా వుంచు. అవసరమైతే దానికే మంచిదిగా—దాని డబ్బు దానికెట్లాగూ వుండనే వుందిగా!" అన్నాడు విజయ్ కుమార్.

"జీ సాబ్. గట్లనే మొఖరర్ వుంచుత." అన్నాడు దిలావర్.

చిరాగ్గా అసహనంగా స్కూటర్ ఎక్కాడు. వాన మొదలైంది. మరింత చిరాగ్గా అసహనంగా అనిపించి; దారిలో కనిపించిన బార్‌లోకి వెళ్ళాడు.

విస్కీ గుక్కలు వేస్తూ, పరాటాతో పాటు కోడి తొడా మేక కార్జం మెక్కాడు

అరగంట. బయటికొచ్చాడు. వాన తగ్గింది. స్కూటర్ ఎక్కి తిన్నగా యింటికి చేరుకున్నాడు.

పడక గది తలుపు నెట్టాడు. తెరుచుకుంది.

మంచంమీద ముసుగెట్టుకుని పడుకునుంది సీత.

'దీనెమ్మా యింత ముందుగా యిదేంటి'—అని అనుకుంటూ దుప్పటి లాగేశాడు.

మూలుగుతూంది సీత.

"యేం మూలిగి చస్తున్నావ్?" అన్నాడు.

"జ్వరంగా వుంది" అంది.

"ఆ మాత్రానికే మూలగాలా!" అని పక్కన చేరి బ్లౌజు హుక్కులు తప్పించాడు.

అవతలికి జరగబోయింది.

"యేం వొచ్చింది వేషాలేస్తున్నావివాళ!" అన్నాడు ఆశ్చర్యంగా.

"వొళ్ళు నొప్పులు కూడా" అంది.

"నేనో పట్టుపడితే నొప్పులు ఆమ్మెక్కి యెగిరిపోతయ్"అని సిగరెట్ వెలిగించుకుంటున్నాడు.

సీత కళ్ళవెంట నీళ్ళొచ్చాయి. అలాంటిది అలవాటు లేనందువల్ల మండుకొచ్చింది. అసలే కొత్తపిట్ట పోయిందన్న యిదిలో వున్నందున మరింత మండుకొచ్చి సిగరెట్‌తో వో చురక అంటించాడు చనుగుబ్బమీద.

యేడుపు ఆపుకుంటున్న మూతిమీద పెదవులు బిగించి పళ్ళతో నొక్కాడు.

స్తనాలమీద గోళ్ళతో దిగగుచ్చుతూ, పళ్ళతో కొరుకుతూ, పైకిజరిగి ఆమెని ఆక్రమించుకున్నాడు.

ఆమె మూలుగుతోంది.

"నీయమ్మా రోగిష్టిముండా జన్మంతా నీతో యిట్లా నానా చావూచావా లేమో నేను—యెక్కడ దాపురించావే" అని చీదరించుకున్నాడు.

ఆమె మూలుగు ఆగిపోయింది. శ్వాసకూడా ఆగిపోయినట్లుగాపక్కకి అంటుకుపోయింది.

పని ముగించుకుని, రగ్గు కప్పుకుని ఐదో నిమిషంలో గుర్రుపెడుతున్నాడు విజయ్‌కుమార్.

అతని గురక మొదలయ్యాక, సీత కళ్ళవెంట నీళ్ళు ప్రవహించటం మొదలయ్యాయి.

ఆ మంచం మీద పడుకోలేకపోయింది. లేచి వెళ్ళి కుర్చీలో కూచుంది.

యేడుపు పెల్లుబుకుకొస్తూంటే చప్పుడవకుండా బాత్‌రూం తలుపుతీసి లోపలికి వెళ్ళి తలుపు మూసుకుని బిగ్గరగా యేడ్చింది—గొంతు నొక్కి పట్టుకునే.

వొంట్లో యే బాధా తెలియనంతగా మనసంతటా యేహ్యపు దైన్యపు అవమానపు బాధ. అంతూ దరీ కానరాని బాధ.

— — —

పావుగంట

కన్నీళ్ళు ఆగిపోయాయి. ముఖం గంభీరంగా తీక్ష్ణంగా వుంది. కాఠిన్యంగా అనిపిస్తోంది.

రెప్పలు పైకెత్తి, యేదో ఆలోచిస్తున్నట్లుగా యెక్కడో చూస్తూ— మూడు నిమిషాలు.

బాత్‌రూంలోంచి గదిలోంచి బయటికి వొచ్చింది. చిన్న గావంటగదిలోకి వెళ్ళి, యెలక్ట్రిక్ స్టవ్వూ వొక సన్న ఇనుపతీగ ముక్క పట్టుకుని గదిలోకి తిరిగివొచ్చింది. గట్టిగా గడియపెట్టింది.

బాత్‌రూంలోకి నడిచింది. తలుపు దగ్గిరికి లాగింది.

ప్లగ్గు తగిలించి స్విచ్చి నొక్కింది. స్ప్రింగ్‌కాయిల్ యెర్రగా అవుతోంది

తీగకూడా వేడెక్కింది.

స్టవ్ ప్రక్కనే కూచుని చూస్తోంది.

"యేడుకొండలవాడా యే జన్మ పాపమో యిది. యింక వాడి నన్ను నీ దగ్గరికి చేర్చుకో" అనుకుంది మనసులో.

చేతికి రింగు అంటటం లేదు. వేడి తగులుతోంది.

అరంగుళం దూరంలో మృత్యువు. అరక్షణం వ్యవధి.

పెదాలు బిగించి, కళ్ళు మూసుకుని, చేతివేళ్ళు తిప్పింది సీత.

రోజూ ఆరింటికే లేచి, వంటింట్లో వంటమనిషికి తనకి తోడుగా వుండే సీత లేచి రాకపోతే ఆశ్చర్యపడింది వాళ్ళ పిన్నత్త.

యెనిమిదింటికి మెలుకువొచ్చింది విజయ్‌కుమార్‌కి. పావుగంట బద్ధకంగా పడుకుని లేచి, కాళ్ళు కింద పెట్టగానే జిల్‌మన్నాయి. వెంటనే పైకి తీసుకున్నా అర్థంకాక మళ్ళీ కిందపెట్టాడు. వెంటనే జిల్‌మనటంతో— క్షణకాలం ఆలోచించాడు— యెక్కడన్నా వైర్ యర్త్ అయి వుంటుందేమో అనుకుని, కొంత అవతలగా వున్న స్లిప్పర్లు పాదాలతో అందుకున్నాడు, మంచం అంచు మీదనుంచి జారి. వాటిలో కాళ్ళుపెట్టి చకచకా బయటికి నడిచాడు.

గది బయట, స్లిప్పర్లు విడవకుండానే బొటనవేలితో గచ్చు తాకి చూశాడు. యేమీ అనిపించలేదు. కాలు తీసి నేలమీద పెట్టాడు. కొద్దిగా జిల్ అనిపించింది. హాల్లోకివెళ్ళిచూశాడు. అక్కడేమీలేదు. పింతండ్రి

కూచుని వున్నాడు— చెప్పులపక్కనే నేలమీద కాళ్ళు పెట్టుకుని.

లేచి మిగతా గదుల్లోకి వెళ్ళాడు.

వంటింట్లో వంటమనిషి, పినతల్లి .

“సీత యింకా లేవలేదేంరా. వొంట్లో బాగాలేదా?” అంది.

వినపడనట్లుగా బయటికొచ్చి, చరచరా తనగదిలోకి వెళ్ళాడు. వొంగి మంచం కింద చూశాడు.

బాత్‌రూం తలుపు నెట్టాడు, నేలమీద పడివున్న సీత. ఎలక్ట్రిక్ స్టౌలో చెయ్యి!

వొణుకు పుట్టింది. గబగబా వొచ్చి మంచం మీద కూచున్నాడు. అంతలోనే లేచి హాల్లోకివెళ్ళి — పినతండ్రితో చిన్నగా విషయం చెప్పాడు.

విజయ్‌కుమార్ మెయిన్ ఆఫ్ చేస్తానని వెళ్ళబోతూంటే, “వొద్దు యిదేపు ప్లగ్ తియ్యి” అన్నాడు పినతండ్రి.

తీసేసి వొచ్చాడు.

యిద్దరూ గదిలోకి వొచ్చారు. తలుపు గడియ వేశారు. బాత్రూంలోకి వెళ్ళి — చెరోపక్కా పట్టుకుని సీత మృతదేహాన్ని లేవనెత్తి తెచ్చి మంచం మీద పడుకోబెట్టారు. దుప్పటి కప్పారు.

విజయ్‌కుమార్ “పిన్నికి చెపుతా” అన్నాడు.

“యిక్కడికి పిల్చుకురా ”

విజయ్‌కుమార్ పిలుచుకొచ్చాడు.

గడియ వేశారు.

“యీ ముండ మన పీకలమీదకి తెచ్చింది. యిష్టం లేదని చెప్తే దీన్ని దీని కొంపకి పంపేవాళ్ళంగా— యింతోటి సుందరాంగి దొరకదనా” అన్నాడు అతని పినతండ్రి.

“సీత మంచిదండీ.” అంది చిన్నగా.

“మంచిదైతే యిట్టా మన పీకలమీదకి తెస్తుందా? నువ్వు వంటింటో కెళ్ళు. సీతకి వొంట్లోబాగాలేదని చెప్పు. ఐతే యిటెవర్నీ రానివొద్దు” అన్నాడు. ఆమె వెళ్ళింది.

“వొరే నువ్వు వేరే యెవరన్నా యింకో డాక్టరుకి ఫోనుచేసి పిలువు మా బాబాయికి వొంటో బాగాలేదని. డాక్టరొచ్చి పరీక్ష చేసేటప్పుడు నువ్వు

వంటింటో కెళ్ళి చిన్న గిన్నెతో వేన్నీళ్ళట్టుకురా — డాక్టర్ వెళ్ళిపోయినాక, వంటింట్లోకి ఆ నీళ్ళగిన్నె పట్టికెళ్ళి— సీతకి డాక్టరు ఇంజెక్షను ఇచ్చెళ్ళాడు. గదిలో అలికిడి వినిపించకున్నాడని చెప్పు, పనాళ్ళకి వినబడేటట్లు" అన్నాడు.

గంటసేపట్లో యివంతా జరిగిపోయింది.

"దీన్ని గప్‌చిప్‌గా యెక్కడన్నా పాతేస్తే —" అన్నాడు విజయ్ కుమార్.

"పీకలమీదకొస్తుంది. సాయంత్రం చచ్చిపోయినట్లు, డాక్టరు అప్పుడే చెప్పి వెళ్ళినట్లు వెల్లడించి కొంపల్లో పెడదాం. వాళ్ళవాళ్ళకి సాయంత్రం టెలిగ్రాం లివ్వు"

"యింకేమన్నా వుందా? వాళ్ళ అన్న అసాధ్యుడు" అన్నాడు విజయ్‌కుమార్.

"అడికెందుకు ఖరగ్‌పూర్లో వాడికి. దాని బాబుకివ్వు. టెలిగ్రాం రేప్పొద్దుటికి గాని వూరు చేరదు"

"యెవరైనా ముఖంమీద గుడ్డ తొలగించితే వొంటిమరుగు అట్లా—"

"మేకప్పు రంగేదన్నా పట్టుకొచ్చి వ్రాయి వొళ్ళంతా. ముఖం దవడలూ అయ్యాక కొత్త సరిగ నాపరా, చెప్పు చీర చోపుకి పెట్టు. పాడె గిడె మోసేటం వొద్దు యిప్పుడప్పుడే మనవాళ్ళకి చెప్పొద్దు. యీ విషయం మన ముగ్గురికీ తప్ప యింకో ప్రాణికి తెలియకూడదు. పోలు వీన్నోవడు చావమన్నాడు పెంటలంజ. నీతో భస్మానని చెపిస్తాం గా?"

"వుంహూఁ. బాగానే చూస్తున్నాగా. యేం పుట్టుకొచ్చిందో రాత్రికి రాత్రికి—"

"యేం లేకుండా యెట్లా వుంటుందిలేరా"

"యేం లేదు బాబాయ్. వొంట్లో బాగాలేదు యీ పూట వొద్దంది. ఆ మాత్రానికే యేం వచ్చేదులే— అని నేనేదో కచ్చగ్గా వున్నానులే. అంత మాత్రానికే యింత అఘాయిత్యం చేసిందంటే— యిదేనాటికైనా మన పీకలమీదకి తెచ్చును."

సాయంత్రం వార్త వెల్లడించారు.

రేపటిరోజు కిడురోజు శవాన్ని వుంచకూడదు—అని అప్పటికప్పుడే తరలించారు వ్యానులో. యింకా రెండు కార్లలో మరి కొందరు వున్నారు. మునిసిపల్ ఆఫీసర్ వొకతను, పోలీస్ సర్కిల్ యిన్స్పెక్టర్ వొకతను

వాళ్ళకి సన్నిహితంగా తెలిసినవాళ్ళు కూడా వున్నారు.

సీత తండ్రీ వాళ్ళు మరనటిరోజు మధ్యాహ్నానికి వొచ్చారు. మిగతా వాళ్ళు ఆ సాయంత్రానికి వొచ్చారు.

"వైరల్ ఫీవర్. వొస్తే వొక్క రోజు కంటే మించి బతకరంట. చెప్పటమే ఆలశ్యంగా చెప్పింది" అన్నారు.

మూడోరోజుకి సీత తల్లిదండ్రులు, వొకరిద్దరు బంధువులు వున్నారు.

"పిల్లలన్నా లేరుగా వెంటనే మా ఐదు లక్షలూ యిచ్చేసెయ్యండి" అన్నాడు సీత తండ్రి.

"అవి అప్పుడే మీ అమ్మాయి కిచ్చేశాం అడిగితే." అన్నారు.

"యిస్తే మాకే యిచ్చేదిగా. అట్లాంటి అబద్ధం మాటలేందుకు?"

"ఐతే మేం అబద్ధాల కోరులమా?" అని పోట్లాటకి దిగారు. ఆమె పేర మిల్లులో వున్న షేర్స్ యిమ్మని యెదురు అడిగారు.

మూడోరోజు సాయంత్రానికి ఆమె అన్న వొచ్చాడు, ఖరగ్‌పూర్ నుంచి.

"అంత హడావుడిగా యెందుకు చెయ్యాల్సొచ్చింది దహనం?" అని అడిగాడు.

"యిప్పుడొచ్చి యక్షప్రశ్న లేస్తున్నావు. వుంచితే కీడు అని చెపితే చేశాం." అని బుకాయించటం మొదలెట్టారు.

ఆ మరనటి రోజున వొకరినొకరు బూతులు తిట్టుకోవటంతో ముగిసింది.

ఆ వెంటనే వీళ్ళు, "ఆ కంపెనీ షేర్లు మాకే రావాలి. అట్లా అ నుకుంది. తన అభిమతం నెరవేరటం ధర్మం—" అని కోర్టులో కేసు పెటారు.

సీత తరపువాళ్ళు, "స్త్రీ ధనంగా యిచ్చిన ఐదులక్షలూ యిప్పించమని" కోర్టులో కేసు వేశారు — కట్నం అనే అర్థం రాకుండా జాగ్రత్త పడుతూ.

కేసులు నడుస్తున్నాయి.

విజయ్‌కుమార్ ప్రవర్తనా, సీత స్వభావమూ తెలిసిన వాళ్ళు— సీత ఆత్మహత్య చేసుకుని వుంటుందనీ, అందుకే అంత గోప్యంగా వేగిరం జరి

పించేశారు — అని అనుకున్నారు— యింట్లో పనివాళ్ళతో సహా.

"వారే నువ్వు కొన్నాళ్ళెటన్నా పోయిరా. ఢిల్లీలో ఆ పనుందిగా అక్కడి కెళ్ళు" అన్నాడు పింతండ్రి.

"వో,యస్" అన్నాడు విజయ్‌కుమార్.

"వురే. యిందుకైతే వచ్చావ్‌గానీ. కట్టుకున్నదాన్ని హింసించకురా పాపిష్టాడా — మళ్ళీ పెళ్ళి తగలడితే" అన్నాడు.

"నాకు పెళ్ళివొద్దు పాడూ వొద్దు బాబాయ్."

"నీ బాబుకీ మాకూ నువ్వొక్కడివే. నువ్వు పెళ్ళి తగలడకపోతే యిదంతా యేమైపోను! కుక్క తిరుగుళ్ళు మానరా సన్నాసీ."

"ఛాఛా, లేదు బాబాయ్. అయ్యన్నీ కుర్రతనంగా. మానేసి చాల్రోజులైంది. యెందుకు చేసిందో ఆ పని. వుట్టి మూర్ఖపుది. దాని తల్లి తీరేదానిదీ" అని సమర్థించుకుని ఢిల్లీకి రైలెక్కాడు విజయ్‌కుమార్.

## 97

టాక్సీ దిగి డబ్బులిచ్చి లోనకి నడిచాడు రవి.

రవిని చూస్తూనే, "రండిసార్. మీకు ఫోను చేయించిన రెండు నిమిషాలకి అర్జంటు పనేదో వొచ్చి వెళ్ళారు. యిప్పుడే వొచ్చేస్తారు" అన్నాడు మంత్రిగారి పర్సనల్ సెక్రటరీ.

రవి కూర్చోబోతోంటే, "మిమ్మల్ని లోన కూచోబెట్టమన్నారు. యిక్కడ విజిటర్స్‌తో రద్దీగా వుంటుంది" అని లోన గదిలో కూర్చోబెట్టాడు.

ఐదు నిమిషాలకి కాఫీ పట్టించుకొచ్చాడు పర్సనల్ సెక్రటరీ.

"యెంత సేపు పడుతుందన్నారు?" అన్నాడు రవి.

"మహా ఐతే అరగంట. వొస్తే ఆలోగానూ రావొచ్చు" అని అంటూ, డగా బయట కారు హారన్ వినిపడి, "అది బాబుగారి కారే" అంటూ వేగిరం బయటికి పరిగెత్తాడు, పర్సనల్ సెక్రటరీ.

మరుక్షణం మంత్రి ఆతుకూరు తాతయ్య రవి కూర్చునివున్న గదిలోకి వొచ్చాడు.

రవి లేవకుండానే కూచుని, "నమస్కారమండీ" అన్నాడు.

ఆ వేళకి తన పర్సనల్ సెక్రటరీ అక్కడ లేనందుకు సంతోషిస్తూ, "నమస్కారం—కులాసా" అన్నాడు తాతయ్యచౌదరి.

"మీ దయవల్ల" అన్నాడు రవి. గొంతులో వొకలాంటి వ్యంగ్యం.

ఆ మినిస్టరుది కేబినేట్ హోదా

కండవా సోఫా అంచుమీదవేసి కూచుంటూ, "మాలాంటాళ్ళ దయ కావాల్సినాళ్ళా మీరు. బోలెడుమంది యిండిపెండెంటు మెంబర్లకి లీడరువి." అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"యిండిపెండెంట్స్ లీడర్ని నేను కాదనేది విదితమేగ!"

"వొచ్చే సెషనుకి ఖాయం. అంతా మీవైపునే వున్నారులే"

కేక్స్ బిస్కట్సు.

"చాలా బిజీగా వున్నట్లున్నారు. వొచ్చేబుధవారం కేబినేట్ మీటింగు వుందికదా, ఆ బోనస్ సంగతేమన్నా టేకప్ చేస్తారా?" అన్నాడు రవి.

"ప్రస్తుతం యేదీ టేకప్ చేసే స్థితి కాదు. అన్నట్లు ఆ బ్లోక్ ఆ ఆఫీసరు గొడవ చేస్తున్నాడు. బదిలీ చేయించి ప్రమోషను యిప్పించావంట వొకతనికి. దానిమీద గొడవొచ్చిపడింది. యేంటని అడిగితే రవిగారు చెపితే చేశాను మీకు సన్నిహిత వ్యక్తి అని అన్నాడు."

"మీ పేరు నేనేం చెప్పలేదు. దబాయించి అడిగాననుకోండి."

"అసలెందుకొచ్చిందా అవసరం? అదంతా యిప్పుడు కెలికితే తను తప్పుచేటావికి మీరు రాసిన లెటరూ మీ పేరూ బయటపెట్టి తప్పుకునే టట్లున్నాడు."

"ఆ గంగరాం కోరితే చేయించాల్సొచ్చింది."

"గంగారాం యెవడు?"

"ఆడే. నిజామాబాద్ జిల్లా మెంబరు. బచ్చు గంగారాం.

"ఆ చేయించుకున్న బొచ్చుగాడు నీ పక్షం నిలుస్తాడా అసలు? వాడు గోడమీద పిల్లి వాటంగాడు. ఐతే వాడికి ఆంధ్రా ద్వేషం. నీతో సరిగానే వుంటాడేమోలే."

"అసలు అదంతా గొడవెందుకైంది?" అన్నాడు రవి.

"మా జిల్లా వాడితోనే వొచ్చింది. వాడు కొమ్మినేని పుబ్రహ్మణ్యేశ్వ రావని లేడూ. వాడి చుట్టం వొకడున్నాడంట. మీరు ఆపని చేయించకపోతే

వాడికి వొచ్చేదంట. కొత్త ముఖ్యమైన యంమ్మెల్యే. కొట్టిపారెయ్యటానికి లేదు. నా మాట కాదనడనుకో. చెప్తాములే, ఐనా మీరు అది నొకసారి కలవండి మర్యాదకి." అన్నాడు తాతయ్య చౌదరి.

"అట్లాగే. ముందు ఆఫీసులో మాట్లాడి కనుక్కుంటా. అసలెందుకట్లా చెయ్యాల్సొచ్చిందో. నేనేం రూల్స్‌కి వ్యతిరేకంగా చెయ్యమనలేదే!"

"మనం చెప్పినాక—రూల్సు ప్రకారం చెయటానికి లేకపోతే పక్క దార్లు చూడటం ఆఫీసర్ల విధికదా!" అని నవ్వాడు మినిస్టరు.

కాఫీ.

అందుకుంటూ, "తీసుకోండి. అన్నట్లు బాజీ యిండస్ట్రియల్ కాంప్లెక్స్‌లో యేదో గొడవగా వుందంట." అన్నాడు మినిస్టరు తాతయ్య.

"గొడవేం లేదు. కోర్కెల విజ్ఞాపన పత్రం. యెమర్జన్సీలో అంతకంటే యేం చెయ్యగలరు చెప్పండి! మీరు చెప్పుకింద నొక్కి కాల రాచరుగా!" అన్నాడు రవి.

"మీరే జెయిల్లో సర్వ మర్యాదలతో జరిగిపోయిందిగా!"

"అది వేరే సంగతి. మీలాంటివాళ్ళు పర్సనల్‌గా కల్పించుకోవటం వల్ల—"

"ఆ కాంప్లెక్సు పరిస్థితి క్రిటికల్‌గా వుంది. అటాంటప్పుడు—"

"కార్మికులవన్నీ న్యాయమైన కోర్కెలే—"

మధ్యలోనే అందుకుని, "న్యాయమైనవి కాదనికాదు, నేననటం. యాజమాన్యం పరిస్థితి నిజానికి సరిగా లేదు. నమ్మెకి వీళ్లేదని, వేరే చాలా మార్గాలు అనుసరిస్తారు. ప్రొడక్షను దెబ్బతింటే పెస్తుతం వాళ్ళు డిఫెన్సుకి వేరే పెద్ద యిండస్ట్రీకి చెయ్యాల్సిన సప్లయ్‌లు సమయంగా వెళ్ళకపోతే—వాళ్ళ ఆర్డర్స్ క్యాన్సిల్ చేసే హక్కు వాళ్ళకుంది. మీరు వర్కర్స్‌కి నచ్చ జెప్పి పెస్తుతానికి ప్రొడక్షను తినకండా—

'అమ్మ నా కొడకా యిందుకోసమా—ఆ ప్రమోషను గొడవకీదీనికీ లంకె పెట్టావా!" అనుకుంటూ, "నేను అటంపెనీల లీడరుని కాదు. నా మాట యేం చెల్లుతుంది" అన్నాడు రవి.

"సిటీలో మీ మాట చెల్లని కార్మికవర్గాలున్నయ్యటండీ! మీరు తల్చుకుంటే సాధ్యంకానిదేలేదు. మిమ్మల్ని దేవుడుగా భావిస్తారంటగా వాళ్ళంతా!" అని 'అలగా జనాన్ని కూడగట్టటం బాగా నేర్చావు. లేకపోతే నీ మొకం

యెవడు చూసుమ! చిన్నగాక మొన్న అనామకంగా వొచ్చి పెద్దవాడివైకూచు
న్నావు కుర్రనాయాలివి!' అని అనుకున్నాడు మనసులో దుగ్ధగా.

'దీంట్లో వో అప్ప పట్టగలడీ బావురుకప్పగాడు.' అని అనుకుంటూ,
"మీకెందుకండీ మీ పోర్టుఫోలియో బనాకాదు!" అన్నాడు రవి.

"బాధ్యతలు సొంత పోర్టుఫోలియోలకి పరిమితమైతే ప్రాణం హాయి
గానే వుండును. యెన్ని ఆబ్లిగేషన్లు!"

"సరే మంచిదండీ. ప్రయత్నిస్తాను"

"ప్రయత్నిస్తానంటే కాదు. సాధించాలి. ఆ ఆఫీసర్ ప్రమోషన్
గొడవ నేను చెప్తాను. వీలైతే సెంటరుకి పంపుదాం. మీరొకసారిమా
వాణ్ని కలవండి. అన్నట్లు యెట్లా వొచ్చారు. కార్లోనా?"

"లేదండీ—టాక్సీలో."

"వొక్కటే కారు అయితేయెట్లా? హోం డిపార్టుమెంటు తరవాతేగా
మనం! యింకొకటి తీసుకోండి. మా మూడోవాడిపేర వొక ఫియట్ యెలా
టవుతాంది వొచ్చే నెలలో. అది తీసుకుని వాడుకోండి. మనం తర
చూసుకుందాం." అని సెక్రటరీని పిలిచి. "మన యెంబాసిడరులో పంపించు
రవిగారిని" అని చెప్పాడు.

కార్లో కూచుని, తిన్నగా హిమయత్‌నగర్ పాత యమ్మెల్యే
క్వార్టర్సు దగ్గిర దిగాడు రవి. నాలుగడుగులు నడిచి బచ్చు గంగారాం
క్వార్టర్సులోకి వెళ్ళాడు. వున్నాడు.

"రాంరాం. రవీ సాబ్." అని లేచి మర్యాద వొలకబోస్తూ పిలిచాడు
గంగారాం.

"నా పీకలమీదకి తెచ్చి హాయిగా కూర్చున్నావు నాయనా నువ్వు"
అన్నాడు రవి.

"యేమాయె? యేమి ముచ్చట."

"ముచ్చటా—నీ బంధువెవడో వాడిప్రమోషను ముచ్చట. ఆరెంటో
వాడు మబ్రహ్మేశ్వరరావు తాలూకూ మనిషట. వాడి సంగతి నీకు తెలీ
దుగా? నలుగురు ఆంధ్రా మినిస్టర్లకి తెరవెనక మనిషి."

"యెట్లనో చెయ్యి. వాండ్లుకూడ నీకు యెరికనేకదా?"

"నీ మూలంగా యిదంతా వొచ్చింది!"

"సమయమొస్తె తప్పుతాది! మీ సాయిబు గాని కోసం యెన్ని చేస్త

లేవు? అవన్నీ సదరాయించుకొస్తనే వున్నవు గద! యేదన్నా జులాస్ తియిలే అందరం నీ వెనక్క వుంటం. దాన్లపటి యినుపబీరువి చక్కగై పోతవి.

"యిది యెమర్జన్సీ వషయం నాయనా గంగారాం!

"గింతకే యిట్లవుతారు! అన్ని ఖానూన్ కెల్లి చేస్తె మనమాట యెవరింటరు? మందికి పన్లు చేసిపెట్టాల న్యాయం జరిగేటట్లు. కొందరి బస్తీ లీడర్లకి వుల్టా సీదా పన్లు కొన్ని చేసిపెట్టకుంటె మల్ల మన మొకం చూడరు. వాండ్లు లఫంగగాండ్లు!"

"యిప్పుడేదో చెయ్యాలి ఆలోచించి" అన్నాడు రవి తనలో తనుకున్నట్లుగా.

"ఆ రావు రిలెటివ్‌ని వేరే డిపార్ట్‌మెంటుకి పంపి ఆడ యిప్పించు"

"చెయిన్ రియాక్షన్. మళ్ళీ అక్కడింకో సమస్య రాదూ? ఆ శాస్త్రికే వచ్చెప్పి చూడాలి" అన్నాడు రవి

యింతకు ముందు, ఆ విషయం ఆ మినిస్టరు చూడదలిచినట్లు తనకి బాబీ యిండస్ట్రియల్ కాంప్లెక్స్ గురించి అడిగిన విషయం గుర్తొచ్చింది రవికి. కానీ అది అందరికీ చెప్పకూడదని రవికి తెలుసు.

ఓ గంట సేపు, రవి తరపున వుండే మరి కొందరు యమ్మెల్యేల గురించి మాట్లాడుకున్నారు.

రవి బయటికొచ్చి టాక్సీ యెక్కి తిన్నగా సుబ్రహ్మణ్యేశ్వరరావు యింటికి వెళ్ళాడు. సిటీలో అతనికి పెద్ద బంగళా వుంది. రవి వెళ్ళేసరికి తొమ్మిదిన్నర అయింది.

ఆ వేళకి పోర్టికోలో దీపాల కాంతిలో నిలుచుని వున్నారు ముగ్గురు నలుగురు వ్యక్తులు.

రవిని చూసి, "రండి, రండి. దారితప్పి వొచ్చినట్లున్నారు" అన్నాడు సుబ్రహ్మణ్యేశ్వరరావు.

అతనితోకూడా నిలుచుని వున్న కడపజిల్లా యెమ్మెల్యే నాగిరెడ్డి చిత్తూరుజిల్లా యెమ్మెల్యే మునిసుందరం, తూర్పుగోదావరి జిల్లా యెమ్మెల్యే అప్పలనర్సయ్య పశ్చిమగోదావరి జిల్లా యెమ్మెల్యే పిలకా క్రిష్ణమూర్తి వున్నారు. అందరూ మంచి మూడ్లో వున్నారు. డిన్నరు ముగిసినట్లుంది.

"అసెంబ్లీ హీరోగారికి స్వాగతం." అన్నారు నలుగురూ వొకేసారి.

అంతలో కారు వొచ్చి ఆగింది పోర్టికోలో.

"సరే మీరు పదండి. యిక్కడికే ఆలిస్యం ఐంది మీకు" అన్నాడు సుబ్రహ్మణ్యేశ్వరరావు.

నలుగురూ కూర్చున్నారు. కారు కదిలింది.

"రండి" అని లోపలికి పిలిచాడు సుబ్రహ్మణ్యేశ్వరరావు.

పక్కనె డైనింగు హాలు. బల్లమీద గ్లాసులు సీసాలు మిగిలివున్న పదార్థాల మసాలాఘాటు.

"మీరు మందు ముట్టని బుద్ధిమంతులు. మిమ్మల్ని యెట్లా మర్యాద చెయ్యాలో తెలవటం లేదు. ఐస్క్రీమూ కూల్‌డ్రింకూ త్రాగమనటానికి మీరు చిన్న పిల్లలుకాదయ్యె!" అన్నాడు సుబ్రహ్మణ్యేశ్వరరావు. "యీ నా కుర్ర నాకొడుకు అసెంబ్లీ కమిటీల్లో— యెన్నిట్లోనో మెంబరుగా అధ్యక్షుడుగా ఐకూచున్నాడు. పోన్లే మనాడేగా...." అని మనసులో అనుకున్నాడు.

"నో థాంక్స్ టి వీళ్ళు చాలు" అని చిన్నగా నవ్వి, "మీతో చిన్న పని వుండి వొచ్చాను" అన్నాడు రవి.

"చెప్పండి"

"ఆ మధ్య నేను చేయించిన నాక ప్రమోషనువల్ల మీ రిలెటివ్ వొకరు యెఫెక్ట్ అయ్యారట—"

"రిలెటివయితే పర్లేదు. వేలు విడిచిన మేనమామ. నా పీక మీద కూచున్నాడు."

"సెంట్రల్ సర్వీసెస్‌లోకి పై పోస్టులో పంపుదాం"

"పంపటానికి వాళ్ళు తీసుకోవద్దూ?"

" ఆ విషయం నాకొదలండి."

అంతలో ట్రే—బిస్కట్లు. కాఫీ.

"నాకిప్పుడు కాఫీ పనివ్వదు. మీరొక్కరే తీసుకోవాలి. మన్నించండి" అన్నాడు సుబ్రహ్మణ్యేశ్వరరావు.

"ఆయన పిల్లల చదువులు కూడా ఐపోయి ఫారిన్‌లో వున్నారుగా. ఢిల్లీ ఐనా పర్లేదుగా— కాగా మంచి పోస్టులోకి."

"మనకి మనకి అదేం పర్లేదు. యెట్లాగో అట్లా సర్దుకో వొచ్చు గానీ వొచ్చొచ్చి మీరు చేయించిన ప్రమోషను వేరే వెధవకి పోయిందే

అని—"

"పోసింది. యేదో అల్లిగేషనువల్ల చెయ్యాల్సొచ్చింది."

మరి కాసేపు అసెంబ్లీ రాజకీయాల మాట్లాడి—బయటికి వొచ్చాడు రవి. నడుస్తున్నాడు. బుర్రంతా చికాగ్గావుంది. పని ఐతే జరిగిందిగానీ, అతని ఆధిక్యతా భావానికి యిబ్బందిగా అనిపిస్తోంది. సుబ్రహ్మణ్యేశ్వరరావు సిటీ లీడర్లని లక్ష్యపెట్టడు.

చాలాసార్లు అసెంబ్లీలో రవితో తలపడ్డాడు. మినిష్టరు అయ్యే ఆలోచన కంటే మినిష్టర్లని చెయ్యటమూ, మినిస్ట్రీల నుంచి తప్పించటం వంటి పనులంటె ఆసక్తి యెక్కువ. అలాంటి తెరవెనక గ్రంధం నడుపుతూ కీలకమైన వ్యక్తిగా స్థిరపడ్డాడు. ఆ పైన బాగా ఆస్తిపరుడు, మొదటినుంచీ యిప్పుడు మరింత. అలాంటి వ్యక్తిని తానుగా వెళ్ళి అడగటం బాధగా అనిపిస్తోంది.

నడుస్తున్నాడు, ఆబిడ్స్‌లో.

తిలక్ రోడ్‌పై పుకి తిరిగిన కారు — నడుపుతూ గంగి. ప్రక్కన యెర్రగా బుర్రగ వో యువకుడు.

రవి గమనించాడు. అప్పుడప్పుడూ అలా సందర్భపడటం జరుగుతూంటుంది.

ముందుకి అడుగులు వేస్తున్నాడు.

దుకాణాలు మూసేశారు, జనం రద్దీలేదు. దారిలో పడుకుని వున్న కుక్కని కాలితో తన్నాడు. అది కుయ్‌కుయ్ మనుకుంటూ పక్కకిపోయింది. నడుస్తున్నాడు.

"హలో రవీ."

రవి తల పక్కకితిప్పి చూశాడు....వలియుద్దీన్.

"పెద్ద లీడర్‌వి ఐపోయావు. మేం కనిపిస్తామా నీ కంటికి" అన్నాడు వలియుద్దీన్.

"నా కంటికి సామాన్య ప్రజలు కనిపిస్తారు. నా కంటికి కనిపించటం లేదంటే నువ్వు చాలా పెద్దవాడి వన్నమాట. మంచి బూర్జువావి ఐపోయి వుండాలి" అన్నాడు రవి.

"నీ తెలివి అసామాన్యం అని తెలుసుగానీ—రా. టీ తాగుదాం—చాలా కాలం ఐంది కలిసి"

ఆ ప్రక్కన వున్న హోటల్లోకి వెళ్ళారు.

కబుర్లు. యిందిరాగాంధి గురించి. నాలుగు రోజులనాడు యిండియన్ యెయిర్‌లైన్స్ బోయింగ్‌ని లాహోర్‌కి హైజాకింగ్ చేసిన విషయం గురించి మాట్లాడుతున్నాడు వలియుద్దీన్.

రవి మనస్సు చికాగ్గావుంది. అన్యమనస్కంగా మాట్లాడుతున్నాడు.

అరగంట.

"యిక వెళ్దామా?" అన్నాడు రవి.

బయటికొచ్చారు.

రవి, టాక్సీ యెక్కి క్వార్టరుకి చేరుకున్నాడు.

తిన్నగా తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు బీరువా తెరిచి బ్రాందీ సీసా తీశాడు. గ్లాసు నింపుకుని సీసాలోన దాచేశాడు. రవికి తాగాలని యెప్పుడూ అనిపించదుగానీ— కొంత కాలంగా రకరకాలచికాకుల మూడ్‌లో, వొంటరిగా చాటుగా తాగుతాడు.

గట గటా తాగేసి పడుకున్నాడు రవి.

# 98

## చారుమతి పెళ్ళి.

చిక్కడపల్లి ప్రాంతంలో కాస్త ఖాళీ ఆవరణ వున్న మందిరంలో యేర్పాటు చేశారు.

"పెళ్ళి పందిరంటే, తాటాకుల పందిరి వెయ్యాల్సిందే అన్నాడు ఖామమూర్తి. అవి యిక్కడెక్కడ దొరుకుతాయి. షామియానా వేయించక తప్పదని వరహాశాస్త్రి వప్పుచెప్పాడు. నేలమీద చాపలు జంబుఖానాలు దుప్పట్లూ పరిచారు. పెళ్ళి మండపం అలంకరించారు. హోమగుండం యేర్పాటు చేశారు. పెళ్ళి బ్రాహ్మలకి చెప్పాడు. "నిప్పుల్లి గిస్తే కుదరదు. ఆరణి చెయ్యవలసిందే. మీరెలాగన్నా తిప్పలు పడండి" అని ఖరాఖండిగా చెప్పేశాడు.

బాజా భజంత్రీ

"మాటి మాటికి దెల్పవలెనా ముమానసార్చిత చరణ రామయ్య సీతా" అని గొంతులో శృతించుకుంటూ హడావుడిగా తిరుగుతున్న వరహా

వందిటో పెళ్ళవుతున్నాది కనువిందవు తున్నాది—అనే పాట హిందీ మాతృక ట్యూనులోంచి, ప్రేమనగర్‌లో "లేవమంటావా లేవనంటావా నన్నే లేవమంటావా—" పాట ట్యూనులోకి రావటం.... గమనించి వాళ్ళ దగ్గిరికి డొల్లుకుంటూ వెళ్ళి, "మీకు పుణ్యంవుంటుంది. అలాంటి జ్యోతిలక్ష్మి యల్లారీశ్వరీ ట్విస్టు అరుపు విరుపు లొద్దు. మీకు ఆసక్తి వుంటే అందు కోసం వేరే కచేరీ పెట్టిస్తాను. సందర్భోచితమైన రాగాలు వాయించండి. కాదంటే వాయిద్యాల మోత పెట్టండి కాదనను" అని వెనక్కి తిరిగి "సీతమ్మ పెళ్ళికూతురాయెనే మా సీతమ్మ పెళ్ళికూతు రాయెనె" అని గొంతులో పాడుకుంటూ నడిచాడు వరహాశాస్త్రి. పట్టువంచె, వుత్తరీయం. కొత్త జందెం మెరుస్తోంది, వాటితోపాటు.

యేడాదిన్నర క్రితమే ప్రారంభించాడు చారుమతి తండ్రి ఆమెకి పెళ్ళి సంబంధాలు చూడటం యేడాదిక్రితం వొక సంబంధం వొస్తే — "నాన్నగారూ పెళ్ళిళ్ళు పేరయ్యలని నమ్మకండి. ఆ ఆధారంగా మీరు స్వయంగా వాకబు చెయ్యండి లోకంలో అందరూ మీలాంటివాళ్ళు కారు. అతను బియ్యేస్సీ పాసయ్యాడనీ, చక్కగా వుంటాడనీ మెడికల్ రిప్రజెం టేటివ్ అనీ చెబుతున్నారు. ఆ విషయం కనుక్కోండి నాన్నగారూ నా గురించి నాకెలాంటి భ్రమలూ లేవు. అలాంటి వ్యక్తి యేం చూసి నన్ను చేసుకుంటాడు మెడికల్ రిప్రజెంటేటివ్ అంటే జీతం యెక్కువేవుంటుంది. నన్నెక్కడో చూశాడనీ చెబుతున్నారు. నాకు అతని వివరాల మీద నమ్మకం కలగడం లేదు. మీరు స్వయంగా కనుక్కోండి. ఆ విషయాలు—పెళ్ళంటే యేడు తరాలు అటూ యేడు తరాలు యిటూ చూడాలంటారుగా—అది వొది లేసినా"—అంది చారుమతి.

ఆ విషయం చివరికి వరాహశాస్త్రికి అప్పగించగా వాకబుచేసి తెలుసు కుంటే అతను బియస్సీ తప్పాడనీ, ఆస్తి పాస్తులేమీ లేవనీ యేదో చిన్న మెడికల్ కంపెనీలో కమీషను బేసునుమీద కొన్ని నెలలు రిప్రజెంటేటివ్‌గా పనిచేశాడనీ. కమిషన్ బేసిస్ వుద్యోగానికి కూడా పనికిరానివాడని తీసేశా రనీ, జులాయి తిరుగుతాడనీ తెలుసుకున్నాడు.

"చారూ, వాడెవడో అవారా హీరో, నీ మెళ్లో తాడు బిగించి నీ జీతం డబ్బులతో జల్సా చేద్దామని ఆలోచించినట్లున్నాడే! నాన్నకి మరీయింత అమాయకమేం! ఆయనెందుకు? పెళ్ళి పూచీ నాది. నేను చూస్తానుగా'

అన్నాడు వరాహశాస్త్రి.

విషయాలు తెలుసుకున్న భానుమూర్తి కూతురితో, "అమ్మా చిన్న దానివైనా నీ వివేకానికి— యెంతో సంతోషంగా అనిపిస్తున్నదమ్మా! నీ గొంతుకోసి వుందునుకదా నువ్వు హెచ్చరించకపోయివుంటే!" అని మెచ్చుకున్నాడు.

యెనిమిది నెలల్రితం తను పనిచేసే స్కూల్లో పని చేస్తున్న టీచరు కామేశ్వరరావుతో ఆమెకి పరిచయం పెరిగింది. అతనూ ఆమె లాగా బియ్యేస్సీ ట్రెయిన్డ్ టీచర్. బస్సులో కూచుని వెడుతుండగా—చెయ్యిబయటికి పెట్టుకుని వుంటే పక్కగా దూసుకొచ్చిన బస్సుకి తగిలి యెడమ చెయ్యి విరిగింది భుజం దగ్గిరికి తీసేశారు. రూపం, చారుమతి ప్రక్కన వుంటే అందంగా వుంటాడు. వరాహశాస్త్రి ప్రక్కన వుంటే యెలాగూ అనిపించడు. అవంత్ రెడ్డి ప్రక్కనో శ్రీపతి ప్రక్కనో నుంచుంటే అనాకారిగా అనిపిస్తాడు.

స్వభావాలు అభిరుచులు కలిశాయి. పెళ్ళి చేసుకోవాలనుకున్నారు.

వొకసారి వరాహశాస్త్రితో అంది. అతను తల్లికీ తండ్రికీ చెప్పి మాట్లాడితే, "అవిటి మనిషికెట్లా యివ్వడం?" అన్నాడు భానుమూర్తి.

"నాన్నగారూ కూతురిమీద మమకారం మంచిదేగాని దురాశ పనికిరాదు. యాక్సిడెంటులో యెడమ చెయ్యిపోయింది. అంతేగా" అంది

"అతనినే చేసుకోవాలని నువ్వు పట్టుబడితే అభ్యంతరపెట్టను" అని తండ్రి అంటే, "మనసులు కలిశాయి. అంతమాత్రాన అతనితో పెళ్ళిజరగకపోయినా నా బ్రతుకు నా బ్రతుకుగానే వుంటుంది. మీరు తగిన వరుణ్ని చూసి చెయ్యండి కాదనను" అంది.

వరాహశాస్త్రి ప్రోత్సహించిన మీదట భానుమూర్తి అతని వివరాలన్నీ తెలుసుకున్నాడు తండ్రి పేరు శ్రీరంగం విఘ్నేశ్వరశాస్త్రి. రాజమండ్రి ప్రాంతంలో పౌరోహిత్యం చేస్తుండేవాడు. మూడేళ్ళక్రితం చనిపోయాడు. ఆడపిల్లల పెళ్ళిళ్ళు అయ్యాయి, యెప్పుడో తల్లి వుంది. వాతుళ్ళ దగ్గిరా పెళ్ళయిన యింకో కొడుకు దగ్గిరా వుంటూ వుంటుంది. ఆస్తిపాస్తులేం లేవు.

జాతకచక్రాలు కలిశాయి. అతని తల్లి "లాంఛనాలు కాస్త ఘనంగా జరిపించండి చాలు" అని అడిగింది. వరాహశాస్త్రి తన ఫెలోషిప్పు డబ్బు

లోంచి నెలనెలా చెప్పకుండా దాచిన డబ్బు సంగతి చెప్పి పెళ్ళి ఖర్చులకి అప్పు చెయ్యక్కర్లేదని చెప్పాడు, తండ్రి ప్రావిడెంటు ఫండు యిచ్చే మేరకి తీసేసుకోదలిచినట్లు చెబితే, రిజిష్ట్రాఫీసులో జరిపించమని చారుమతి సూచించింది గానీ అందుకు యెవరూ వొప్పుకోలేదు.

పెళ్ళి పందిట్లో వరాహశాస్త్రి మిత్రులు, వో పక్కగా చాపమీద కూచుని వున్నారు శ్రీపతి, రామ్మూర్తి, నిరంజనరావు, ప్రసాద్, మోహన్ రెడ్డి మరి కొందరు.

రామ్మూర్తి వొచ్చినప్పుడు అతని భార్య నిర్మలని, ప్రసాద్ వొచ్చి నప్పుడు అతని భార్య విమలని అటు పక్కకి ఆడవాళ్ళ వైపుకి తీసుకెళ్ళి వాళ్ళమ్మకీ మరో యిద్దరికీ పరిచయంచేసి వొచ్చాడు వరాహశాస్త్రి.

నిర్మల కొడుకుని యెత్తుకొచ్చింది. విమల కూతుర్ని యింట్లోనే వొదిలి వొచ్చింది "గాయత్రిగారు రాలేదేం మోహన్?" అని వరాహశాస్త్రి అడిగితే, "నాట్ ఫీలింగ్ వెల్" అని చెప్పాడు మోహన్‌రెడ్డి.

పెళ్ళి తంతు మహా శాస్త్రోక్తంగా జరుగుతోంది.

"యీ లెక్కని క్రతువు మూడు గంటలైనా పడుతుంది. తొమ్మిది దాటుతుంది" అన్నాడు నిరంజనరావు.

"యేదొక పద్ధతిన జరగాలిగా. శాస్త్రోక్తంగా చేస్తున్నప్పుడు అంతా అట్లాగే జరగాలి-అందునా బ్రాహ్మలు" అన్నాడు ప్రసాద్.

"గౌరీపతిశర్మ రాలేదు?" అన్నాడు మోహన్‌రెడ్డి.

"యీ మధ్య యేవో పర్మిట్ల ఆలోచనల్లో తిరుగుతున్నాడు. ఫొటో గ్రఫీ ధ్యాస తగ్గించి" అన్నాడు శ్రీపతి.

"రావటానికి స్థాయి చాలి వుండదు గిరపతికి" అన్నాడు నిరంజన రావు.

"చాపే కుర్చీలు. చాపే సోఫాలు" అంటూ వొచ్చి, "నేల ఐనా చదునుగా వుందని తలుస్తాను" అన్నాడు వరాహశాస్త్రి.

"మేం కులాసాగా విశ్రమించాం. నీ పన్లు చూసుకోవయ్యా వరాహ మిత్రమా" అన్నాడు శ్రీపతి.

"విజయ్‌కుమార్ అంకినీడు యింకా మిత్రులు—"

"అంకినీడు మద్రాసులో వున్నాడు. అతని సినిమా పూర్తి కావొస్తోంది. విజయ్‌కుమార్ ఢిల్లీలో వున్నట్లు తెలిసింది" అన్నాడు వరాహశాస్త్రి.

అన్నాడు వరాహశాస్త్రి.

విషయాలు తెలుసుకున్న భానుమూర్తి కూతురితో, "అమ్మా చిన్న దానివైనా నీ వివేకానికి— యెంతో సంతోషంగా అనిపిస్తున్నదమ్మా! నీ గొంతుకోసి వుందునుకదా నువ్వు హెచ్చరించకపోయివుంటే!" అని మెచ్చుకున్నాడు.

యెనిమిది నెలల్క్రితం తను పనిచేసే స్కూల్లో పని చేస్తున్న టీచరు కామేశ్వరరావుతో ఆమెకి పరిచయం పెరిగింది. అతనూ ఆమె లాగా బియ్యేబీస్సీ ట్రెయిన్డ్ టీచర్. బస్సులో కూచుని వెడుతుండగా—చెయ్యిబయటికి పెట్టుకుని వుంటే పక్కగా దూసుకొచ్చిన బస్సుకి తగిలి యెడమ చెయ్యి విరిగింది భుజం దగ్గిరికి తీసేశారు. రూపం, చారుమతి ప్రక్కన వుంటే అందంగా వుంటాడు. వరాహశాస్త్రి ప్రక్కన వుంటే యెలాగూ అనిపించడు. అనంత్‌రెడ్డి ప్రక్కనో శ్రీపతి ప్రక్కనో నుంచుంటే అనాకారిగా అనిపిస్తాడు.

స్వభావాలు అభిరుచులు కలిశాయి. పెళ్ళి చేసుకోవాలనుకున్నారు.

వొకసారి వరాహశాస్త్రితో అంది. అతను తల్లికీ తండ్రికీ చెప్పి మాట్లాడితే, "అవిటి మనిషికెట్లా యివ్వడం?" అన్నాడు భానుమూర్తి.

"నాన్నగారూ కూతురిమీద మమకారం మంచిదేగాని దురాశ పనికి రాదు. యాక్సిడెంటులో యెడమ చెయ్యిపోయింది. అంతేగా" అంది

"అతనినే చేసుకోవాలని నువ్వు పట్టుబడితే అభ్యంతరపెట్టను" అని తండ్రి అంటే, "మనసులు కలిశాయి. అంతమాత్రాన అతనితో పెళ్ళిజరగకపోయినా నా బ్రతుకు నా బ్రతుకుగానే వుంటుంది. మీరు తగిన వరుణ్ని చూసి చెయ్యండి కాదనను" అంది.

వరాహశాస్త్రి ప్రోత్సహించిన మీదట భానుమూర్తి అతని వివరాలన్నీ తెలుసుకున్నాడు తండ్రి పేరు శ్రీరంగం విఘ్నేశ్వరశాస్త్రి. రాజమండ్రి ప్రాంతంలో పౌరోహిత్యం చేస్తుండేవాడు. మూడేళ్ళక్రితం చనిపోయాడు. ఆడపిల్లల పెళ్ళిళ్ళు అయ్యాయి, యెప్పుడో తల్లి వుంది. కూతుళ్ళ దగ్గిరా పెళ్ళయిన యింకో కొడుకు దగ్గిరా వుంటూ వుంటుంది. ఆస్తిపాస్తులేం లేవు.

జాతకచక్రాలు కలిశాయి. అతని తల్లి "లాంఛనాలు కాస్త ఘనంగా జరిపించండి చాలు" అని అడిగింది. వరాహశాస్త్రి తన ఫెలోషిప్పు డబ్బు

లోంచి నెలనెలా చెప్పకుండా దాచిన డబ్బు సంగతి చెప్పి పెళ్ళి ఖర్చులకి అప్పు చెయ్యక్కరలేదని చెప్పాడు, తండ్రి ప్రావిడెంటు ఫండు యిచ్చే మేరకి తీసేసుకోదలిచినట్లు చెబితే, రిజిష్టార్ఫీసులో జరిపించమని చారుమతి సూచించింది గానీ అందుకు యెవరూ వొప్పుకోలేదు.

పెళ్ళి పందిట్లో వరాహశాస్త్రి మిత్రులు, వో పక్కగా చాపమీద కూచుని వున్నారు శ్రీపతి, రామ్మూర్తి, నిరంజనరావు, ప్రసాద్, మోహన్ రెడ్డి మరి కొందరు.

రామ్మూర్తి వొచ్చినప్పుడు అతని భార్య నిర్మలని, ప్రసాద్ వొచ్చి నప్పుడు అతని భార్య విమలని అటు పక్కకి ఆడవాళ్ళ వైపుకి తీసుకెళ్ళి వాళ్ళమ్మకీ మరో యిద్దరికీ పరిచయంచేసి వొచ్చాడు వరాహశాస్త్రి.

నిర్మల కొడుకుని యెత్తుకొచ్చింది. విమల కూతుర్ని యింట్లోనే వొదిలి వొచ్చింది "గాయత్రిగారు రాలేదేం మోహన్?" అని వరాహశాస్త్రి అడిగితే, "నాట్ ఫీలింగ్ వెల్" అని చెప్పాడు మోహన్‌రెడ్డి.

పెళ్ళి తంతు మహా శాస్త్రోక్తంగా జరుగుతోంది.

"యీ లెక్కని క్రతువు మూడు గంటలైనా పడుతుంది, తొమ్మిది దాటుతుంది" అన్నాడు నిరంజనరావు.

"యేదొక పద్ధతిన జరగాలిగా. శాస్త్రోక్తంగా చేస్తున్నప్పుడు అంతా అట్లాగే జరగాలి-అందునా బ్రాహ్మలు" అన్నాడు ప్రసాద్.

"గౌరీపతిశర్మ రాలేదు?" అన్నాడు మోహన్‌రెడ్డి.

"యీ మధ్య యేవో పర్మిట్ల ఆలోచనల్లో తిరుగుతున్నాడు. ఫొటోగ్రఫీ ధ్యాస తగ్గించి" అన్నాడు శ్రీపతి.

"రావటానికి స్థాయి చాలి వుండదు గిరపతికి" అన్నాడు నిరంజన రావు.

"చాపే కుర్చీలు. చాపే సోఫాలు" అంటూ వొచ్చి, "నేల ఐనా చదునుగా వుందని తలుస్తాను" అన్నాడు వరాహశాస్త్రి.

"మేం కులాసాగా విశ్రమించాం. నీ పన్లు చూసుకోవయ్యా వరాహ మిత్రమా" అన్నాడు శ్రీపతి.

"విజయ్‌కుమార్ అంకినీడు యింకా మిత్రులు—"

"అంకినీడు మద్రాసులో వున్నాడు. అతని సినిమా పూర్తి కావొస్తోంది. విజయ్‌కుమార్ ఢిల్లీలో వున్నట్లు తెలిసింది" అన్నాడు వరాహశాస్త్రి.

"విజయకుమార్ కళత్ర వియోగ దుఃఖంలో వున్నట్లున్నాడు" అన్నాడు నిరంజనరావు.

"కళత్ర వియోగదుఃఖమూ లేదు వాడి కాష్టం దుఃఖమూలేదు. వ్యాపారం పనులు చూసుకుంటున్నాడు అక్కడ" అన్నాడు శ్రీపతి.

"ఆవిడ సడన్‌గా పోయిందట" అన్నాడు నిరంజనరావు. ఆమె మరణం గురించి నలుగురూ చర్చించాలన్న వుద్దేశంతో.

"పోయిందో పోగొట్టారో యెవరికి తెలుసు? సహజ మరణం ఐతే అంత అర్జంటుగా ఐనవాళ్ళెవరూ రాకండా దహనం చెయ్యటం దేనికి?" అన్నాడు ప్రసాద్.

"ఆమె తరపు బంధువులతో యిటీవల నాకు పరిచయం ఐంది. ఆమె త్రేతాయుగపు ప్రాణిట. మంగళసూత్రాలూ, పతిదేవుడి పాదాలూ భూదేవి వోర్పూ— కానీ భూదేవి ఛస్తే వోర్చుకోదు— భూకంపమయ్యో, అగ్ని పర్వతమయ్యో మరొకటయ్యో చెలరేగుతుంది. మనవాడు మనందరికీ తెలుసుగా. మీ అందరికీ తెలిసిన దానికంటే నాకు మరికొంత తెలుసు స్త్రీని యెంత క్రూర స్వభావంతో హింసించే తత్వమో! యేదో జరిగి వుంటుంది. సహజ మరణం కాకనూపోవొచ్చు. మాట వరసకి యిలా అన్నానని మనలో యెవరన్నా వాడికి పితూరీ చెప్పనూవొచ్చు" అని నిరంజనరావువైపు వొక క్షణం చూసి, "ప్రసాద్, యిదంతా నా అంచనా. నిజం కావాలనే లేదు" అన్నాడు శ్రీపతి.

అంతలో స్వప్నరాగలీన వొచ్చింది. వరాహశాస్త్రి వడివడిగా డొల్లుకుంటూ వెళ్ళి ఆమెని అటు తీసికెళ్ళాడు.

పెళ్ళి తంతు జరుగుతూంది.

"రాఘవులు రాలేదు. శాస్త్రి పిలవలేదేమో" అన్నాడు నిరంజనరావు.

"మన వరాహమిహిరుడు అలాంటి వాడు కాడు" అన్నాడు శ్రీపతి.

"పిలవటానికి సిటీలో వుంటేగా! అటు కర్నూలు ప్రాంతంలో వుద్యోగం వెలిగిస్తున్నాడు. ఆర్డీవో అధికారి కదా, పెళ్ళి కూడా ఐంది—"

"యెవరితో?" అన్నాడు నిరంజనరావు

"యెవరితో యేంటి, వో మాతంగ కన్యారత్నంతో. ఆ డీ. డీ. దానం తాలూకు పిల్ల. జనాన్ని కాల్చుకు తింటున్నాడంట నెల జీతం, పాకెట్ మనీలాగా వుందంట అతగాడి పరిస్థితి." అన్నాడు ప్రసాద్.

తలంబ్రాలు పంచుతున్నారు.

వరాహశాస్త్రి హడావుడిగా తిరుగుతున్నాడు పందిరంతా.

వొకాయన అటూ యిటూ తిరుగుతూ వరాహశాస్త్రిని కలుసుకుని, "వొక్క నిమిషం" అని ఆపి, "బాబూ నేను మీ నాన్నగారి సహోద్యోగిని. మాకు తెలిసిన కుర్రవాడు వున్నాడు. మొన్ననే అయ్యేయెస్‌కి సెలక్టయ్యేడు. అందగాడు. వాళ్ళ తండ్రి ఆర్టీసీలో పెద్ద వుద్యోగి. బాగా ఆస్తిపరులు. ఆ పిల్ల—అక్కడ కూచుని వుంది చూడు· యిందాక నువ్వు తీసికెళ్ళి కూచోబెట్టావు—గచ్చకాయరంగు చీరలో— యేమి సిరీ యేమి కళా యేమి అందం— యెవరో కాస్త చెబితివా అంటే మా వాళ్ళకి తెలియపరుస్తాను" అన్నాడు.

"వాళ్ళు మన బ్రాహ్మలు కాదు." అన్నాడు వరాహశాస్త్రి.

"అడ్రసు యేమిటి?"

"వర్ణ సంకరం అడ్రసు యేం చేసుకుంటారు? కాగా కొన్ని లక్షల కట్నం యిస్తారు. పుచ్చుకోగల స్తోమత కూడా వుండాలి. వుద్యోగం మాత్రమే ఐతే యేపాటి?" అని తప్పుకున్నాడు వరాహశాస్త్రి

మాంగల్యం తంతునాం

బాజాభజంత్రీల హోరు.

"అమ్మయ్య" అని శ్వాస విడిచాడు ప్రసాద్.

ఆ తరవాత చదివింపులు మొదలయ్యాయి. సిటీలోవున్న భామమూర్తి స్నేహితులు, వాళ్ళ బంధువులు వూళ్ళ నుంచి వొచ్చిన బంధువులు. పెళ్ళి బ్రాహ్మడు పేరుపేరునా చదివి వినిపిస్తున్నాడు, పౌంటెన్ పెన్ను మిల్క్ బాయిలర్ మొదలుకొని ప్రెజర్ కుక్కర్ వరకు.

"యివన్నీ లిస్టురాసి తీర్చవలసిన బాకీలు" అన్నాడు శ్రీపతి.

అందరూ లేచారు. జంబుఖానాలూ అవీ తీసేసి, భోజనాల చాపలు పరుస్తున్నారు. వొచ్చిన అందరూ వొకేసారి కూర్చునేందుకు సరిపడా స్థలం వుంది.

విస్తళ్ళు పరుస్తున్నారు.

శ్రీపతికి వొక ప్రక్కన నిరంజనరావు, రెండో ప్రక్కన ప్రసాద్. మగవాళ్ళతోపాటు ఆడవాళ్ళకి కూడా భోజనాల యేర్పాట్లు

వరాహశాస్త్రి అటుగా రావటం చూసి స్వప్నరాగలీన లేచినిలుచుంది. యెందరో ఆడవాళ్ళ చూపులు ఆమెమీదవాలాయి. ఆమెని గమనించి వరాహ శాస్త్రి వడివడిగా వెళ్ళాడు.

"నేను వెడతానండి శాస్త్రిగారూ. అమ్మగారిని పిలుస్తారూ?" అంది.

"అయ్యో భోజనం చెయ్యకండానే, అదేలా?" అంటూంటే, "నాకు నిన్నటి నుంచి కొద్దిగా జ్వరం. అభోజనం, పాలు, బ్రెడ్డు. అదీ మందులతో పాటు" అంది.

అటుగా వెడుతున్న వాళ్ళమ్మ దగ్గిరికి వెళ్ళి యేదో చెప్పి, తిరిగి వొచ్చి, "మీరు వొస్తారనుకోలేదు — మనస్ఫూర్తిగా రావాలనే పిలిచాం గానీ...." అన్నాడు.

"అదేవిటండీ నేనేం పాపం చేశాను రాకండా వుండటానికి!" అని చిన్నగా నవ్వింది.

"యీ ఆడవాళ్ళంతా చూపులతో గుచ్చుతున్నారు. దిష్టి తగులుతుం దేమో" అనుకుని, "యిలా రండి" అని పెళ్ళిమంటపం స్తంభం ప్రక్కకి తీసుకెళ్ళాడు.

అంతలో అతని తల్లి వొచ్చింది చారుమతిని వెంటబెట్టుకుని.

"అంతా వోల్డ్ ఫ్యాషన్డ్‌గా జరుగుతోంది మా వారిని పరిచయం చేసే వీలు లేదిప్పుడు" అని; వాళ్ళమ్మతో, "నేను చెప్పానే స్వప్నగారని" అంది చారుమతి.

"యిందాక చూస్తూనే అనుకున్నాను. నువ్వు చెప్పిన దాన్ని బట్టి యీమె ఆమే ఐ వుంటుందని." అని కూతురితో అని, "చాలా సంతోష మమ్మా శ్రమ అనుకోకండా యెంతో అభిమానంతో వొచ్చారు. జ్వర గదా— యేమీ తినకూడదటగదా— అది మా దురదృష్టం" అంది

వొక అడుగు అవతలకి వేసి వొంగి, నేలమీద వున్న పేకెట్ తీసి చారుమతికి అందిస్తూ, "సంగీతలక్ష్మి కదా— మీ వీణా, యితరుల సంగీతం రికార్డు చేసుకుంటూ వుంటారని—" అని వరాహశాస్త్రి వైపు చూసి, "మీ గానం కూడా." అంది స్వప్నరాగలీన.

"వాడి సంగీతమే చెయ్యాలి!" అని నవ్వి, నాకు మీరు యెన్నో చేస్తున్నారు. యెంతో అభిమానం చూపుతున్నారు. మేము మీకు యేమీ కాదు." అంది చారుమతి.

ఛేప్కమ్ ట్రాన్సిస్టరు. రెండు డజన్ల కేసెట్ల ప్యాకెట్ అది.

"యెవరైనా యివ్వగలిగేదీ పుచ్చుకోగలిగేదీ ప్రేమాభిమానాలేగా. మీరిరువురూ పరస్పర అవగాహనతో అన్యోన్యంగా జీవిస్తారని ఆకాంక్షిస్తూ తలుస్తూ— మరి వెళ్ళొస్తాను చారూ—" అంది స్వప్నరాగలీన.

చారుమతి కళ్ళలో సంతోషానికి పల్చటి నీటిపొర కమ్మింది.

వరాహశాస్త్రి కూడా నడిచాడు.

కారులో కూచుని, "శాస్త్రిగారూ యీసారి మీ పెళ్ళికి వొస్తాను" అంది స్వప్నరాగలీన. ఆ మాటలు యింజన్ రెయిజ్ చేసిన మోతలో కలిసి పోయాయి.

వరాహశాస్త్రి లోనకి వొచ్చి మిత్రుల వైపుకి వెళ్ళాడు వడ్డన చూడటానికి.

"యేదో వుస్నంతలో జరుపుతున్నాం. సర్దుకుపోవాలి అన్నీ అందుతున్నట్లేనా? యేం ప్రసాదుగారూ అప్పుడే ముగించేసినట్లున్నారు?" అన్నాడు వరాహశాస్త్రి.

"శాస్త్రీ కాస్త నేచ్చుకర్క పంపించుతావూ?" అన్నాడు నిరంజనరావు.

అప్పటి నుంచి శ్రీపతి ఆశ్చర్యంగా చూస్తున్నాడు నిరంజనరావు వంక తను తినటం మర్చిపోయి. మొదటి ముద్ద కలిపినప్పుడు వొక చేరెడు నెయ్యి వొంపించుకున్నాడు మళ్ళీ నేతి చెంబుతో మరొకరు కనిపిస్తే పిలిచి మరో చేరెడు వొంపించుకున్నాడు. బాగా యింత పప్పు అన్నంలో కలుపుకున్నాడు. సగం పప్పు ముద్దచేసి పక్కన పెట్టుకున్నాడు. కూరలు కలుపుకుని తింటూ నేతిలో వూరబెట్టిన ఆ పప్పు నంజుతున్నాడు.

భోజనాలు ముగించి లేచారు. చేతులు కడుక్కోటానికి వెడుతున్నారు.

"మోహన్, గాయత్రి రాలేదు" అన్నాడు శ్రీపతి.

"మామూలే. యింకా ఆ యిదిలో నుంచి బయటపడలే" అన్నాడు మోహన్‌రెడ్డి. అతని ముఖం దిగులుగా అనిపించింది.

తాంబూలాలు నములుతూ మాట్లాడుతూ నిలుచున్నారు.

"మన రామ్మూర్తి సంసార మౌనంలో పడినట్లున్నాడు" అనుకున్నాడు శ్రీపతి.

విమల నిర్మల వొస్తే— ప్రసాదూ రామ్మూర్తీ వెళ్ళిపోయారు

"పార్లమెంట్ కాలపరిమితి ఐపోతున్నది. అమ్మ పని ఐతదని

అనుకుంటున్నారంటే— మంత్రి గోఖలే ప్రకటించినాడుగా — పార్లమెంటును యేడాది పొడిగిస్తున్నట్లు. యేడాదేమి ఖర్మ ఒక దశాబ్దం పొడిగించినా పొడిగించగలడు!" అన్నాడు మోహన్‌రెడ్డి.

"రాజ్యాంగానికి ఆ నలభయ్ నాలుగో సవరణతో ప్రాథమిక హక్కులు యెగరగొట్టేసెయ్యగా లేనిది యిదో లెక్కా" అన్నాడు శ్రీపతి.

"కదిలితే మెదిలితే మీసాకింద అరెస్టులు" అన్నాడు వెంకటేశం.

"మోహన్ రూంటి దగ్గర పనుందనుకుంటాను వెళ్ళు" అన్నాడు శ్రీపతి.

శ్రీపతి వంక అభిమానంగా చూసి వెళ్ళిపోయాడు మోహన్‌రెడ్డి.

"మనం కూడా పోదాం హాస్టల్‌కి బస్సువొస్తే" అని, "సెకండ్ షో టైం కూడా ఐపోయింది దేనికన్నా వెళ్దామంటే" అన్నాడు వెంకటేశం.

"యెంటర్ ది డ్రాగన్ థర్డ్ షో వున్నది. పదకొండు ఐంది. రైట్ టైం" అన్నాడు విరంజనరావు— యెవరన్నా సిద్ధమైతే వెళ్ళాలని.

గత మూడు నెల్లో ఆ సినిమాకి వెడుతున్న యెవరో వొకరి వెంట పడి యిప్పటికి నాలుగుసార్లు చూశాడు షోలే ఐదుసార్లు చూశాడు అదే రకంగా

అంతలో సికిందరాబాద్ స్టేషన్ దాకా వెళ్ళే మూడో నంబరు బస్సు వచ్చింది. అందరూ యెక్కేశారు.

శ్రీపతి వొక్కడూ మిగిలిపోయాడు.

— గాయత్రిని అరెస్టు చేస్తారేవో— ఆ మొన్న గవర్నర్ భండారేనీ ఐజీ నారాయణరావునీ సీయం వెంగళ్రావునీ చెడామడా తిడుతూ వుంచిందిట— యెవడో యెస్సై అటకాయించితే. యిప్పుడు అరెస్టయితే యింక అంతే సంగతులు— మీసా మీసా— మీసా అంటే మర్డర్స్‌బై... సీక్రెట్ యెజన్సీ— పోయి నీ మొగుడు ఐజీకి చెప్పుకో పో— అని వాయించిందట ఆ యస్సైని. ఆ యస్సైయెవడో— గాయత్రిమీద ప్రత్యేకం కక్ష దేనికో— విజయ్‌కుమార్ మిత్రుడని అన్నారు. మీసా అరెస్టు అతి సులభం.

మీసం తనకెలాగూ లేదు. తన పార్టీలో మీసం వున్న మగాడు వొక్కడూలేడు— అందుకని ప్రతిపక్ష నాయకుల మీసం గొరగటం—

యెక్కడున్నాడు వెంకటేష్— జెయిల్లో జెయిళ్ళలో యెవర్ని యేం

చేస్తున్నారో— ఆఫీసుల్లో అధికారుల జులుం— పోలీసుల అఘాయిత్యాలు— బ్రెయిన్ వాష్, బాడీవాష్— వేడి నీళ్ళతో డెట్టాల్‌తో యాసిడ్‌తో —మను షులు మనసులు— అంతా స్టెరిలైజ్డ్— ఆపరేషన్ థియేటర్‌లాగా —యూనివర్సిటీల్లాగా —అంతా జాగ్రత్తగా స్టెరిలైజ్డ్ — స్టెరిలైజ్డ్‌బాడీస్, స్టెరిలైజ్డ్ మైన్డ్స్— స్టెరిలైజ్డ్ కంట్రీ — దేశంలో యెక్కడా యేమీ మొలవకూడదు— యీపవిత్ర భారావనిలో అబరికి పిసరంత ఆలోచనకూడా మొలవకూడదు. బాంభానుడు నాటింపించే చెట్లు తప్ప. దేశంలో యిన్ని ఘాతుకాలు జరుగుతూంటే వీటన్నిటినీ లోన యెలా దాచుకుంటుందో—

అదేవత్తి ఆ క్రీనీడన యెమర్జన్సీలో యిదీ కష్టమే. పోలీసులు మరీ అన్యాసుగా వాటంగా డబ్బు గుంజుతున్నారట. లేకపోతే మీసా అరెస్ట్. యిందుకూ మీసా అరెసే— సినిమాలని అరెస్ట్ చెయ్యరేం— యెన్ని సిని మాలు యెన్నిబోర్డులు —షోలే సాలే యెంటర్ ది డ్రాగన్ దట్ యెంటర్స్ ఫియర్ యిన్ ది స్కై, స్కై యిన్ ది ఫియర్, ఫర్ యెఫ్యూ డాలర్స్, డాలర్స్ ఫర్ యెఫ్యూ కభీ కభీ గౌరవనీయమైన వ్యభిచరింపు— అప్పు డప్పుడూ కాదు యెప్పుడూ యెల్లప్పుడూ గౌరవనీయమైన యీ పవిత్ర భారతావనిలో .... యిండియా బుక్ హౌస్ యిండియా కాఫీ హౌస్ బుక్ లవ్వర్స్ కార్నర్ లవ్వర్స్ బ్యాక్ కార్నర్ ప్రేమ బురద చింత ప్రేమ బింక అంటుకుని ప్రేమ వూబిలో దిగ బడి— ప్రేమ సాహిత్యంలో నీరస ప్రేమ సాహిత్యంలో పాక్కుంటూ పోతూ— సాహిత్యం సాల్‌బెల్లో నోబెల్ బుల్లోడయ్యాడు— జ్ఞానపీఠం విశ్వ నాథ హరీమన్నాడు— ఆయన మిత్రుడు శ్రీశ్రీ యింకా బతికే వున్నాడు. యీయనకి జ్ఞానపీఠం లక్ష వొచ్చేదాకా బతికుంటాడేమో— లక్ష పుచ్చుకుని ఆపైన విరసానికి క్షమాపణ చెప్పుకుని— రాకపోతే — తృణీకరిస్తాను. బూర్జువా సత్కారాల అని చెప్పుకుంటూ వుండగూడదు —జ్ఞానపీఠం నోబెల్ పీఠం. యెందరో చవటలకి యిచ్చారు— యెందరో మహానుభావులకియిచ్చారు నోబెల్ బహుమతి గతే అలా వుంటే యింక జిల్లా అవార్డులు— తాలూకా అవార్డులు వార్డు అవార్డులు — యిపుడు అందరికీ అవార్డులే. కళ్ళూ, చెవులూ, నోరూ మూసుకుని అందరికీ అవార్డులే జైలు అవార్డులూ మీసా అవార్డులూ........

# 99

పదహారేళ్ళ క్రితం పెళ్ళయిన దగ్గిర్నుంచి తనకి వాటాపంచి యిమ్మని గొడవపెడుతూనే వున్నాడు అంకినీడు. రెండేళ్ళకంటే యెక్కువ కాలం భరించలేకపోయారు యీతని గోల.

తన మామగారి వ్యాపారాల్లో వాటాకలుపుతానని కొన్నిసార్లు, వొక ప్రసిద్ధ సినీ నిర్మాత వొప్పుకున్నాడనీ అతనితో కలిసి సినిమా తీస్తాననీ కొన్నిసార్లు చెబుతూ వొచ్చాడు. "మీ మామనుకూడా పెట్టుబడి పెట్టమను" అని తండ్రి అంటే అత్తవారిమీద ఆధారపడటం తనకి అవమానంలా అని వస్తుందనీ వాళ్ళని అడగననీ చెప్పాడు.

వళినితో, సినిమాతియ్యటం ప్రసక్తి పెళ్ళయిన కొత్తలోనేతెచ్చాడు. అంకినీడు. "సినిమానో యెనిమానో నీ డబ్బుల్తో నువ్వేమన్నా చేసుకో. నన్నుమాత్రం యిరికించకు." అని నిర్మొహమాటంగా అంది.

వాళ్ళ వూళ్ళో సుభాష్ చంద్రబోస్ అని వో నడివయసతనువున్నాడు సినిమా తియ్యాలన్న వుబలాటంవున్నవాడు. అంకినీడు వాళ్ళకి దూరపు చుట్టం. అతనిని కదలదీసి బాగా నచ్చజెప్పి వొప్పించాడు. అతను మూడు లక్షలు పెట్టుబడి పెట్టేటట్లు, తను ఆరు లక్షలు పెట్టుబడి పెట్టేటట్లు, మిగతాది డిస్ట్రిబ్యూటర్ చేత సర్దుబాటు చేయించేటట్లు. నిర్మాతగా తనపేరు, కింద చిన్న అక్షరాలలో సహనిర్మాతగా అతని పేరు వుంటుందనీ, తనొక్కడే పనులన్నీ చూసుకోలేనట్లూ అతనినీ వుండమన్నాడు. "నేనూకూడా వుంటాగా"—అని ధైర్యం తెచ్చుకున్నాడు అతను.

వూళ్ళో ఫలానా అతను పెట్టుబడి పెడుతున్నాడని తెలిసి, "వీడిగోల భరించటం కష్టం. చావనీ. ఛాన్సు తగేల్తే తగుల్తుంది, పిక్చరు హిట్టయితే. సినిమాలు చూసిచూసి బాగా అనుభవం వుందిలే మన సన్నాసికి" అని తండ్రి వొప్పుకున్నాడు. ఆమీదట తల్లి ఆమోదముద్ర వేసింది.

వాటాల దగ్గిరి కొచ్చేసరికి తల్లి పేచీ పెట్టింది— తనుపుట్టింటి వారిచ్చిన ఆస్తి ఆడపిల్లలకే యిస్తానంటూ. దానిమీద పెరిగిన ఆస్తి విడిగావున్న ఆస్తిలోనే మగపిల్లలకి వాటాలంటూ. అంకినీడుకి రెండు లక్షల వాటా వొచ్చింది

క్యాషు కావాలి—పిక్చరుకి కదా అన్నాడు. వొక్కసారే దేనికి.

వర్క్ సాగుతూండటాన్ని బట్టి తీసుకో. కానీ నీ వాటాకి మించి దమ్మిడీ ఆదనంగా యిచ్చేదిలేదు—అన్నారు

పాతవారిని భరాయించటం కష్టం — అని వో బాకు లాంటి జేమ్స్‌బాండ్ హీరోని, బాగా గ్లామర్ వున్న టాప్ హీరోయిన్‌ని వొకామెని యెన్నుకున్నాడు.

వొక అందమైన అమాయక యువతి యెమర్జన్సీ అరెస్టుల్లో పొరపాటున అరెస్టయ్యి జ్యూడీషియల్ కస్టడీలో వుంటుంది. ఆమె ప్రియుడు ఆమెని తప్పించి అడవి పరిసరాల పల్లె ప్రాంతానికి చెక్కేస్తాడు, ఆమెతో. అక్కడ వాళ్ళు కొండజాతి దుస్తుల్లో డ్యూయెట్లు పాడుకుంటూ, పోలీసుల్నుంచి తప్పించుకునే యత్నంలో—హీరో ; స్మగ్లర్లు, బ్లాక్ మార్కెటీర్లు, దేశంలో అల్లర్లు కల్పించి దోపిడీలు సాగించే సంఘవిద్రోహ వ్యక్తుల వలయాల్లోంచి తప్పించుకుంటూ — చివరికి వాళ్ళందర్నీ పట్టించి, కథ మధ్యలో వో స్మగ్లరు ముఠాకి చిక్కిన తన ప్రేయసిని విడిపించుకుని —చివరికి పోలీసు మెప్పు పొందుతాడు. 'అంతరంగిక భద్రత కోసం ఆత్యాయిక చంద్రునికో నూలుపోగు'గా తన చిత్రాన్ని సమర్పించాడు. క్రైమ్, సెక్సు, ఫైటింగ్స్, నాయిగురకాల డాన్సులు—సస్పెన్స్ లాంటి వాటిని సమకూర్చాడు.

దీనిని వో ప్రసిద్ధ సినీ రచయితకి చెప్పి కథ మలిపించాడు.

తెలిసిన వాళ్ళతో చెప్పించుకుని వో ప్రసిద్ధ ఫిలిం పంపిణీ సంస్థ వాటాదారులైన జవర్‌బాబు, శివాజీలకి కథ వినిపించాడు. భారీ చిత్రంగా నిర్మించదలిచినట్లూ పెట్టుబడి సగం తనే పెడతానని చెప్పాడు. సగం వాళ్ళని సర్దమన్నాడు.

వాళ్ళు కథలో కొన్ని చిన్న చిన్న మార్పులు సూచించారు. హీరో విషయంలో మొదట్లో సందేహించినా చివరికి వొప్పుకున్నారు. అంకినీడు చెప్పిన హీరోయిన్‌ని కాక మరో గ్లామర్ హీరోయిన్‌పేరు చెప్పారు. అన్నిటికీ వొప్పుకున్నాడు అంకినీడు. కొన్ని రీళ్ళు తియ్యండి దాన్నిబట్టి చూస్తాం అని వాళ్ళు అంటే, "మీసూచనల ప్రకారమే తీస్తాగా. ముందుగానే వొప్పందం వుంటే నాకు మానసికంగా ధైర్యంగా వుంటుంది. కొత్తగా ఫీల్డ్‌లోకి దిగుతున్నాణ్ని." అని అగ్రిమెంటుకి వొప్పించుకున్నాడు. డైరక్టరుని కూడా డిస్ట్రిబ్యూటర్లయిష్టానుసారమే తీసుకున్నాడు. సినిమా పేరు 'చిక్కుల్లో

చిన్నది' అని చెబితే వాళ్ళు సందేహింవారు గానీ, చివరికి, డైరెక్టరు రచయిత అందరూ 'కథమీద కూర్చుని' చర్చించి ఆఖరికీ, అదే పేరు ఖాయపరిచారు.

"భీమ వరీ కండలు తిరిగి పోయింది. రేటు కూడా యెక్కువ. దాని చెల్లిలుంది. కొత్తగా ఫీల్డులోకొచ్చింది. మాంచి నేవళంగా వుంది. యమా సెక్సీగా వుంది. మాంచి ఫిగరు. దాని బొడ్డూ నడుమూ చూపులూ వూపులూ చాలు. పైగా అందంగానూ వుంది." అని డాన్సులకి కమలినిని ఖాయపరిచాడు.

షూటింగ్ చాలావరకు హైదరాబాద్‌లోనూ, ఆ పరిసర ప్రాంతాల్లోనూ. కొన్ని సీన్లు బొంబాయి కాశ్మీరు కొడైకెనాల్ మద్రాసుల్లోనూ, చిత్రీకరించారు.

దొంగ రసీదులు పుట్టించి తన పార్ట్నరు దగ్గిర్నుంచి, తను లక్ష రూపాయలు పెట్టుబడి పెట్టేసరికి అతని దగ్గిర మూడు లక్షలు గుంజేశాడు. ఆపైన, "పెట్టుబడి చాలటం లేదు. మన డిస్ట్రిబ్యూటర్ ప్రస్తుతం డబ్బు యిబ్బందిలో వున్నాడు" అని మరో లక్ష రూపాయలు పెట్టించాడు.

తను రెండు లక్షలు తన వాటాదారు నాలుగు లక్షలు పెట్టుబడి పెట్టారు. ఐతే లెక్కల్లో తనూ నాలుగు లక్షలు పెట్టుబడి పెట్టినట్లు చూపించాడు అంకినీడు. "యిద్దరం సమానంగా పెట్టుబడి పెట్టాంగదా నిర్మాతలుగా యిద్దరిపేర్లు వొక లాగానే వేయించమని పార్ట్నరు అడిగితే, "అన్నీ ప్రింటయిపోయినయ్. యిప్పుడు మధ్యలో వీలు కాదుగా— యీసారి పిక్చరుకి నీ పేరే పెడదాంలే." అన్నాడు.

ఆ డైరక్టరంటే ఆ డిస్ట్రిబ్యూటర్‌కి బాగా గురి డైరక్టరుకి రోజూ పూటుగా తాగబోయించి, విడిగా పదివేలు రూపాయలు యిచ్చాడు.

మిగతా ఐదు లక్షలూ డిస్ట్రిబ్యూటర్లు పేమెంట్లుగా యిచ్చారు. నేరుగా పిక్చరు హక్కులు వాళ్ళవే. వాళ్ళ డబ్బు పెట్టేంటేజీతో వసూలయ్యాక నిర్మాతకి హక్కులతో ఫిలిం అప్పగిస్తారు.

అంకినీడు కంటికి వచ్చిన యెక్స్ట్రాని పిలిపించుకునేవాడు. హీరోయిన్ కోసం ప్రయత్నించాడు గానీ సాధ్యపడలేదు. వెనకెప్పుడో తొలిరోజుల్లోని అబ్లిగేషన్ల వల్లనో, యేదన్నా సంకటంలో పడితేనో తప్ప అంధుకు చోటు పెట్టదు—ప్రఖ్యాత హీరోయిన్ నటించటానికి ఒప్పుకోవ

టమే మెహర్బానీ అన్నట్లుగా చెప్పుకుంది "యీ నటిని యెప్పుడో వో పట్టు పట్టకపోతే చూడు!" అని తన అసిస్టెంటు మిత్రుడితో అంటే, "అప్పటి కిది దోకొచ్చేటంత దొక్కుడై పోతంది గురో" అన్నాడతను.

కొన్ని పాటలకి 'మజా' చరణాలు తనే యిచ్చి కవిచేత పాటలు కూర్పించాడు. ట్యూన్స్ మాత్రం సంగీతదర్శకుడు కూర్చి వినిపిస్తే కొన్ని మార్పులు సూచించాడు అన్నీ దర్శకుడికి వినిపించి అతని ద్వారా డిస్ట్రిబ్యూటర్ల కేత ఫోకే చేయించుకోవటం.

పాటలకి అంకినీడు అందించిన కొన్ని చరణాలు.

టైటిల్‌సాంగ్— చిక్కుల్లో చిన్నది యిది చిక్కుల్లో చిన్నది/ చుక్కల్లో చిన్నది చిక్కుల్లో పడ్డది./ చిక్కుల్లో చిన్నది కిక్కుల్లో పడ్డది/ చుక్కా గుక్కా పక్కా ముక్కా / చిక్కుల్లో చిన్నది యిది చిక్కుల్లో చిన్నది/ఐనా వున్నది పసందుగున్నది/మనందరిని రమ్మన్నది రమ్మన్నది/ చిక్కుల్లో చిన్నది యిది చుక్కల్లో చిన్నది చిక్కుల్లో చిన్నది—

యింకో పాటకి — పెట్టు పెట్టు — గూటిలోన పెట్టు పెసలు ముక్క— అని వోక క్లబ్ డాన్స్‌కి

యట్టనో వున్నది / యెట్టెట్టనో వున్నది / యాడ / ఆడ / యాడ యాడున్న దెట్టెట్టా/ఆడనున్నదట్టట్టా/ఆతనె యేటి వొడ్డున అడివిలోన— అనీ వో జానపదం డాన్స్‌కి.

కిక్కులో వున్న చిన్నదాన్ని / ఆ కొండ దొర్లి పొర్లి - అని స్మగ్లర్ల ముందు తప్పించుకోటానికి యత్నిస్తూ హీరోయిన్ పాడే పాటకి.

మాలపల్లి పక్క కందిచేలో / కందిచేలో మాలపిల్ల కోక కట్టుకుంట చేతికందిన/ కందిచేనులో— అని వో పల్లెటూరిడాన్స్‌కి చరణాలిస్తే ప్రస్తుతం సెన్సారు వొప్పుకోదు. అని కవి నచ్చజెప్పాడు.

పాటలు నలుగురు కవులచేత రాయించాడు.

మరోపాట— యెమర్జెన్సీ టైం కదా— ఆ దృష్టితో సందేశాత్మకంగా వుండే పాట రాసిపెట్టమని వో కవిచేత రాయించాడు తను చరణాలివ్వకుండా. ఆ కవే కూర్చాడు— యిందిరమ్మ సందేశం/మన యిందిరమ్మ సందేశం / మరో ప్రపంచం మరో ప్రపంచం / యిందిరమ్మ మరో ప్రపంచం మహా ప్రపంచం / మరో ప్రపంచం మహా ప్రపంచం/అక్కయిక ఫాలనేత్రంతో స్మగ్లర్లను మాడ్చివేసి / జగన్మాత కాళికాదేవియయ్/ భారత

మాతను రక్షించగ/యిందిరయ్ ప్రశాంతి నెలకొల్పే / సుభిక్షం పూయించే సందేశం/ మన యిందిరమ్మ ఆదేశం / ప్రతి భారతీయునికీ శిరోధార్యం అని.

మన పాటలూ ట్యూన్లూ డ్యాన్సులూ సీన్లూ యాక్షన్లూ సస్పెన్సూ యెట్లా వున్నయ్—జనం వెర్రెత్తిపోయి చూస్తారు! అని అంకినీడు-అంటే శతదినోత్సవం అన్నారు కూడా వున్న నలుగురూ.

"సందేశం. అందునా యమర్జన్సీ ఆధారంగా గొప్ప సందేశం అందిస్తున్నాం. గొప్ప సందేశాత్మకచిత్రంఅని రాష్ట్రపతి బహుమతి వొచ్చినా రావొచ్చు" అని అంటే — సందేహం లేకండా, ఖాయంగా — అన్నారు కూడా వున్న నలుగురూ మందు గ్లాసులు పైకెత్తుతూ.

యీస్ట్మన్ కలర్. ఖర్చు పన్నెండు లక్షలదాకా దేకింది. లెక్కల్లో యిరవై చూపెట్టారు, సెన్సారువాళ్ళు "A" సర్టిఫికెట్ యిచ్చారు.

యెంత బతిమిలాడినా షూటింగ్ చూడటానికి వొక్కసారి కూడా వెళ్ళలేదు నళిని. "నీ సినిమాకి లక్షమైళ్ళదూరంలో వుండదలిచాను. ప్రివ్యూ మద్రాసులో వుంటుంది. దానికీ రాను. నా సొంత డబ్బుల్తో టిక్కెట్టు కొనుక్కొని యీ వూళ్ళో చూస్తాను." అంది. విసుక్కున్నాడు అంకినీడు. వాళ్ళ యింటినుంచి వాటా తీసుకుని సినిమా ప్రారంభించిన తరవాత నుంచి నళినిని వెనకటంత ఘనంగా చూడటంలేదు. రెండు లక్షల భాగ్యానికి మిడిసి పడక సినిమా చినవాడా— అని హాస్యమాడింది నళిని. కాగా, అంకినీడు నళిని దగ్గిరికొచ్చి గడిపేటంత తీరికేలేదు గత ఆరు నెలలనుంచి.

"రేపే ప్రివ్యూ. దీపావళికి, ప్రముఖ పంపిణీ సంస్థ ద్వారా ఆంధ్ర ప్రదేశ్ అంతటా అన్ని ముఖ్య కేంద్రాలలోనూ విడుదల. దీపావళి టపాకాయలాగా పేలి మతాబులాగా వెలుగుతుంది. కనకవర్షం అనుకో— అని అంకినీడు రాసిన వుత్తరం సరదాగా చదువుకుని, వో బాయ్ ఫ్రెండుతో సినిమాకని కారు స్టార్టు చేసింది, నళిని.

# 100

హృదయం అలస్యంగా లేచాడు శ్రీపతి. కాలకృత్యాలు ముగించుకుని— పేపరు తీసి చూస్తూ, "యిక అమెరికా బండిని యీ కార్టర్ లాగి

స్థాడు కాబోలు— సొంత బొలాల్లో బండే తోలి వుంటారు-అదీ పూర్వీకులు కిరాయిబండి — అందుకే కార్టర్ అని యింటిపేరు వొచ్చివుంటుంది. మనకి లాగా బళ్ళకి యెడ్లు కాదుగదా—గుర్రాలు. గుర్రాలైనాగాడిదలైనా హంసలైనా కుక్కలైనా, బండి బండే కదా......."

ఆఫీసుకు వెడుతూ వాకిట్లోంచి "బై" అని వెళ్ళింది, ధనలక్ష్మి.

"అరె యింత టైం అయిపోయిందా" అని వాచీవంక చూసుకుని, "చచ్చాం. గిటార్ గ్లామర్ బోయ్ వొచ్చే వేళైపోయింది—" అని అమాంతం లేచి—— ప్యాంటు షర్టూ తగిలించుకున్నాడు శ్రీపతి.

చకచకా నడిచి వీథి దాటి, మెయిన్ రోడ్డులో ఖాళీ ఆటో కనపడ గానే ఆపి కూచుని కాచీగూడా స్టేషనుముందు దిగాడు.

వెంకటాద్రి రైలు రావటానికి యింకా ఐదునిమిషాల వ్యవధి వుందని తెలుసుకుని— వొకసారి ప్లాట్ ఫాం వంక కలియజూసి 'స్వప్న యింకా రాలేదేం' అనుకుని బుక్ స్టాల్ దగ్గిరికి అడుగులు వేసి పుస్తకాల వంక చూస్తున్నాడు.

——శీరియో ఫీ:యో: వాత్స్యాయనా వేస్టాయనా, ఛేజ్ మేజ్, బూన్స్ మూన్స్, సులోచనారాణి కలోచనారాణి, యిల్లస్ట్రేటెడ్ వీక్లీ హెల్లస్ట్రేటెడ్ వాక్లీ, టైమ్స్ ఆఫ్ లండయూ టైమ్స్ ఆఫ్ యిండియన్ యెక్స్ ప్రెస్— యెక్స్‌ప్రెస్ వెంకటాద్రి యెక్స్‌ప్రెస్ బెంగుళూరు యెక్స్‌ప్రెస్ — గోయంకా యెక్స్‌ప్రెస్ పీకల్దాకా తెచ్చుకుంది ఇందిరమ్మతో....

రైలు వొచ్చేసి ప్లాట్ ఫాం పక్కన చక్కా ఆగింది.

ఫస్టక్లాస్ బోగీలవైపు నడుస్తున్నాడు శ్రీపతి. టూ టైర్ స్లీపర్ లోంచి దిగి, శ్రీపతిని గమనించి — అటు అడుగులు వేశాడు అనంతరెడ్డి. చేతులో బుల్లి సూట్ కేస్.

నాలుగు రోజులైంది అతను అమెరికానుండి వొచ్చి. బొంబాయి నుంచి మద్రాసు — బెంగుళూరు వాళ్ళ వూరు పురపకొండ వెళ్ళి యివాళ యిటు ప్రయాణం.

"హలో శ్రీపతి."

వెనక్కి తిరిగి "హలో మైడియర్ గ్లామర్ బోయ్" అని పరిశీలనగా చూసి, "చలి దేశానికి మరింత రంగువొచ్చావు. యేమిటి లగేజీ యేం లేదా?" అన్నాడు శ్రీపతి.

"యిదే" అని చేతులోని సూట్ కేస్ వూగించి "పద" అన్నాడు అనంత రెడ్డి.

శ్రీపతి అటూ యిటూ చూసి, "అనుకోని ఆలస్యం ఐ వుంటుంది. కాపేపు చూడొద్దూ? రిసీవ్ చేసుకోవటానికి వొక పురుషుణ్ని వొచ్చాను. వొక స్త్రీ కూడా రావొద్దూ!" అన్నాడు.

చిన్నగా నవ్వి, "దీన్లో వొస్తున్నట్లు తెలియదు. సాయంత్రం యింటికి వొచ్చి కలుస్తానని రాసినాను" అన్నాడు అనంత్ రెడ్డి

"పెర్‌హాప్స్ దట్ యీజ్ ది రైట్ వే ఆఫ్ ట్రీటింగ్ ది సబ్జెక్ట్"

అని బయటికి నడిచాడు.

ఆటోలో కొంపకి చేరుకున్నాడు.

"కొన్నాళ్ళుగా యీ గూట్లో నివాసం. రాశానుగా" అంటూ తలుపు తాళం తీశాడు శ్రీపతి.

"యింత చిన్న బంగళాకి చాలా యాంగిల్స్ వున్నట్లున్నవి?" అన్నాడు అనంత్ రెడ్డి బంగళావంక చూస్తూ.

"నేననుకోవటం — యీ యింటి అతను యీ స్థలం మధ్యలో వొక గది కట్టివుంటాడు అదిగో. ఆ తరవాత వొక్కొక్క గది చొప్పున వాటాలుగా మలుచుకుంటూ దఱకో దఱన్నరో సంసారాలకి నీడ కల్పించాడు వీడికి అధమం పద్మశ్రీ యివ్వొచ్చు. మంగలి పనికీ, మంత్రసాని పనికీ యివ్వగా లేనిది" అని నవ్వాడు శ్రీపతి.

అనంత్ రెడ్డి కుర్చీలో కూచోబోతోంటే, "పదపద ముందుస్నానించు" అని లోనకి కదలదీశాడు, సూట్ కేస్ తనే చేత్తో పట్టుకుని.

మధ్యగదిలో అడుగుపెట్టి "పెయింటింగ్ మొదలెట్టావా?" అన్నాడు అనంత్ రెడ్డి.

"లేదు అనంత్ యెమర్జన్సీలో ఏ పనీ చెయ్యకూడదు కాబట్టి అప్పుడప్పుడు నాలుగు రంగు మరకల్లో వారలో గీస్తున్నాను. చిత్తుకాగితాలు తప్ప కంటికి చూడతగింది యేమీ వుండదు"

తను పూర్తిచేసిన పెయింటింగ్స్ అన్నీ చుట్టచుట్టి బట్టల స్టాండు వెనక కనపడకండా పడేస్తాడు శ్రీపతి. యిలా యెవరినన్నా లోనకి తీసుకొచ్చినా, చూడతగినవేమీ కనిపించవు.

"మరి యిన్ని రగులా బ్రష్షులూ—"

"దాని కాక అడ్డదిడ్డంగా పులమటానికి" అని నవ్వి, "పద స్నాని ద్దువు" అని ఖాళీగా వున్న వంటగదిలోంచి బాత్‌రూంలోకి తీసికెళ్ళాడు. అన్నీ చూపెట్టి గదిలోకి వొచ్చి, దినపత్రిక తీసి చూస్తున్నాడు శ్రీపతి.

పావుగంట.

అనంత్‌రెడ్డి — సూట్‌కేస్ తెరిచి తెల్లని పైజామా లాల్చి తగిలించుకున్నాడు.

అక్కడ అందుబాటులో వుండే పనికుర్రాణ్ణి పిలిచి, థెర్మోస్‌యిచ్చి టిఫినూ కాఫీకి యేర్పాటు చేశాడు శ్రీపతి.

"వూఁ యేమిటి అమెరికా సంగతులు? యెలక్ట్రో మేగ్నెటిక్ ఫీల్డ్ థియరీలో నీ పరిశ్రమ, నువ్వు పబ్లిష్ చేసిన పేపర్లు చాలా బావున్నాయని, నీ రిసెర్చి వర్క్ చాలా విశిష్టంగా వుంటుందని యిక్కడ మీ ప్రొఫెసర్ అన్నాడు వొకసారి నేను అటు వెళ్ళి కలిస్తే." అన్నాడు శ్రీపతి.

"ఆ వర్క్‌తోటే తీరికలేకుండా వుండిపోయినాను యిన్ని సంవత్సరాలూ అక్కడ."

"యేమేం ప్రదేశాలు చూశావు?"

"యేం చూడలేదు. తీరికే లేదు. స్వప్న కోరిక ననుసరించి — మిసిసిపీ నదీ ప్రాంతం, నయాగరా, డిస్నీలాండ్, హాలీవుడ్, కొన్ని నైట్ క్లబ్బులు పసిఫిక్ సముద్రతీరం వంటివి కొన్ని — అంతే."

తరవాత యేమిటి?"

"వుద్యోగం యిస్తే వుస్మానియాలో చేరతాను. కానీ నా వర్క్ ముందుకి సాగాలంటే రెండు లక్షల రూపాయల యిన్వెస్ట్‌మెంట్ అవసరం. యు. జి. సి. వాళ్ళతో ప్రొఫెసర్ చేత చెప్పించితే మాట —

"నువ్వు అభిలషించితే అదేమంత సమస్యకాదు. యేమన్నా మెలిక వుంటే — మీ ఫాదర్‌కి చెప్పు. ఆయన చూసుకుంటారు" అన్నాడు శ్రీపతి

"వూఁ మన మిత్రులంతా యెట్లా వున్నారు? ప్రసాద్ కబుర్లేమిటి?"

"యేముంది. పేకాట — వ్యాపారం — సంసారం — సాలిడ్ అండ్ సౌండ్ యాజ్ రాక్. పెళ్ళి సంగతి తెలియదా?"

"శుభలేఖ పంపి ఉత్తరం రాసినాడులే —"

"సూట్‌కేస్‌లో నాలుగుజతల బట్టలతో వొచ్చావు. స్వప్నకేంతెచ్చావు" అన్నాడు శ్రీపతి.

"ఏం లేదు." అన్నట్లుగా తలవూగించాడు నిశ్శబ్దంగా నవ్వుతూ.

"నిన్ను నువ్వు తెచ్చి అప్పగించుకోవటం కంటే మించినదేముం టుంది? చాలా రోజులైంది నిన్ను కలిసి. క్రితం నెలలో, చారుమతి పెళ్ళిలో చూశానుగానీ మాట్లాడే వీలు చిక్కలేదు." అన్నాడు శ్రీపతి.

"చారుమతి యెవరు?"

"మన వరాహశాస్త్రి తెలుసుగా. అతని చెల్లెలు" అన్నాడు శ్రీపతి.

పని కుర్రాడు, ప్లాస్కు పొట్లాలు పట్టుకొచ్చాడు. టేబిల్ మీద పరిచాడు పొట్లాలు విప్పి.

కబుర్లు చెప్పుకుంటూ టిఫినూ కాఫీ సాగించారు.

"ఏదో చిన్న కునుకుతీస్తావా ప్రయాణం బడలిక తీరుతుంది" అన్నాడు శ్రీపతి.

"బడలికేం లేదు. కబుర్లు చెప్పు. గోవర్ధన్‌రెడ్డి అసెంబ్లీ యెలక్షన్లో పోటీచేసి వోడిపోయాడట కదా— ఆ గుంట నక్క— నిరంజనరావు రాశాడు. రిసెర్చి చేస్తున్నాడా?" అన్నాడు అనంత్‌రెడ్డి.

"చేస్తున్నాడు. ఫెలోషిప్ కంటింజెన్సీ డబ్బు కైంకర్యం చేస్తూ. యిటీవల వాడి గైడ్‌కీ వాడికీ మధ్య గొడవ వాటాల్లో పేచీ వొచ్చినట్లుంది. వాడిచే తిడుతున్నాడు వాడి గైడ్‌ని. ఆగైడ్— వాడో నీచపు వెధవ."

వోగంట … కబుర్లతో. హోటెల్‌కి బయల్దేరారు. కింగ్‌కోఠీ రోడ్‌లోకి మళ్ళి తాజ్‌కి వెళ్ళబోతూ, "త్రిలోకా హోటల్ అన్నపూర్ణ అవి విజయవాడ ప్రముఖులు వో హోటలు పెట్టారు. అటు వెడదామా?" అన్నాడు శ్రీపతి.

"యిక్కడికి చేరినాం కదా దీన్లోకే పద."

'యీ వూరి తాజ్‌మహాళ్ళ ముఖ్య అధిపతి కన్నడ ఆనంద హోటలు సప్లయరుగా జీవితం ప్రారంభించాడు. సికిందరాబాద్ కింగ్స్‌వేలో ఆనంద్ భవన తొలి హోటలు. యీ జంట నగరాల్లో యిన్ని తాజ్‌లు నెల కొల్పాడు. ఐతే వొకటి మెచ్చుకోతగ్గ విషయం. భోజనం అప్పటికి యిప్పటికీ వొకే స్థాయిలో రీతిలో మెయిన్‌టెయిన్ చేస్తారు. కొందరు హోటళ్ళవాళ్ళ కథలు కట్టుకథలుగా అనిపిస్తాయిగానీ నిజానికి మహా గట్టి కథలు. ప్రపంచం అంతటా హోటళ్ళు నెలకొల్పిన బొంబాయి వొబరాయ్ కూడా ఆదిలో హోటల్ సర్వరే....

శ్రీపతి సాధారణంగా అతి సామాన్యమైన హోటళ్ళలో బసచేస్తాడు, యెక్కడైనా వెళ్ళినప్పుడు. కాని వాల్డోర్ఫ్-ఆస్టోరియా, హొటెల్ డి క్రాక్ యింటర్ కాంటినెంటల్ షెరటాన్ ఒబెరాయ్ లాంటి హోటళ్ళలో వొకటి రెండురోజులు బసచేసి పరిశీలిస్తాడు— ఆ స్విమ్మింగ్ పూల్సు, గది అలంకరణలు, యేర్పాట్లు, గది వేగాళ్ళు, పడక భామినులు—

నాలుగు నెలల క్రితం వో రోజున, సాలార్‌జంగ్ మ్యూజియం పది హేనో సారో యిరవయ్యోసారో చూస్తున్న శ్రీపతికి వో అమెరికన్ యువతి పరిచయం అయింది. విహారయాత్రకి వొచ్చినట్లు చెప్పింది. 'విహార యాత్ర అన్నైతే అంటోంది గాని యేదో వ్యవహార యాత్రకే ఐ వుంటుంది— పూరకరారు అమెరికా సాహస భామినులు!' అనుకున్నాడు. ఆమెకి శ్రీపతి నచ్చి, ఆ సాయంత్రందాకా అతనిని వాకరించి అడుగుతూ కలిసి తిరిగింది. 'కంటికీ మనసుకీ బాగా నచ్చిస్తున్న యీ తెల్లబుల్లి చూడగా సబ్‌మోరల్ పెరా మోరల్ ఇమ్మోరల్ కాదంటే నాన్ మోరల్‌గాగా వుంది. యే సి. ఐ. యే. తాలూకునో యేమో— అదంతా మనకెందుకు—అందాకరాకండా సరుకుంటే సరి' అనుకున్నాడు. రిట్జ్ హోటెల్లో బస అట. మ్యూజియంలో అన్నీ చూపెట్టి వివరించినందుకు కృతజ్ఞతలు చెబుతూ, తన గదికి వొచ్చి టీ తీసుకోమంది. వెళ్ళాడు. రెండు రోజులుండిపోయాడు. ఆ పిల్లతో స్విమ్మింగ్‌పూల్లో తానాలాడాడు; పడకమీద సొహోలాడాడు. తనతో అమెరికా రమ్మంది పెళ్ళిచేసుకుంటుందిట. "వూరుగాని వూరు దేనికి? సొంత దేశంలో, తల్లీ కూతురూ యిద్దరూ ఒక్కడికొచ్చే యిల్లరికం దొరకకనా!" అనుకుని, తనకి రష్యాలో ఫెలోషిప్ వొస్తుంది వెళ్తానని చెప్పాడు. ఆమెకీ అక్కడికి వెళ్ళాల్సిన పని వుందనీ అక్కడ కల్సుకుందాం అని, ఆ మరనటి రోజు మద్రాసు వెళ్ళి అటునుంచి సింగపూరు వెళ్ళాలని చెప్పింది.

భోజనాలు ముగించి బయటికొస్తూ, "శ్రీపతీ నీలాంటివాడు వోసారి అమెరికా క్లబ్బుల్నీ ఆ ఆడవాళ్ళనీ చూడాలయ్యా" అన్నాడు అనంత్‌రెడ్డి.

"ఆ ఖాళీకోసం అక్కడిదాకా యేల? యిక్కడ మాత్రం తటస్థ పడరనుకుంటున్నావా? నీది కుర్ర స్వప్నలోకం. నీకేం తెలుసు? శ్లేషించాను సుమీ!" అని నవ్వాడు శ్రీపతి.

గూటికి చేరుకున్నారు రిక్షాలో.

గోడవారగా వున్న రెండో యినప మడత మంచం తీసి కుంచెతో

బూజు దులిపాడు. ప్లాస్టిక్ నవ్వారు పట్టీలను బట్టతో తుడిచాడు. దానిమీద దుప్పటి పరిచి పడుకుని, పక్కన వున్న మంచం వంక చూపెడుతూ, "దాని మీద పడుకుంటావా కాసేపు" అన్నాడు శ్రీపతి.

నిద్రోయారు.

అనంత్‌రెడ్డికి గంటసేపటికే మెలుకువ వొచ్చింది. స్వప్నరాగలీనను తలుచుకుంటూ పడుకున్నాడు వెల్లకిలా.

శ్రీపతి ఆరింటికి లేచాడు. అతను లేచేసరికి అనంత్‌రెడ్డి స్నానించి బట్టలేసుకున్నాడు. కింద అంచులకి జిప్పు కుట్టిన వూదారంగు బెల్‌బాటం. అదే రంగు పొడవు చేతుల చొక్కా. బెల్టు. స్టెప్ కట్ జుట్టు. సన్నగా మీసం. యెలెవేటెడ్ షూజ్.

శ్రీపతి, కళ్ళు తెరిచి అనంత్‌రెడ్డిని చూసి, "మైడియర్ ఛా—మిన్గ్ ప్రిన్స్ యింక వెళ్ళు. వొచ్చినప్పుడు తిరిగిరా. నేనెటూ వెళ్ళను. గూట్లోనే వుంటాను" అన్నాడు.

అనంత్‌రెడ్డి ఆబిడ్స్ వైపుకి వొచ్చి, క్వాలిటీలో నాలుగు బ్రెడ్ స్లయిసెస్ తిని కాఫీ తాగాడు. మోజంజాహీ మార్కెట్ వైపు నడిచివెళ్ళి — రకరకాల పువ్వులు బుట్టెడు కొన్నాడు. పక్కన తెలిసిన బట్టల షాపులో నాన్ ట్రాన్స్‌పరెంట్ పొలిథీన్ సంచి అడిగి తెచ్చాడు. పసుపు రంగుది. దానినిండా ఆ పూలు నింపి పట్టుకుని ఆటో యెక్కాడు.

మసక చీకటి.

పావుగంట.

స్వప్నరాగలీన వుండే వీధి మొగదలలో ఆటో ఆపి దిగి, ఆటో అతనిని వుండమని చెప్పి, నడిచి వెళ్ళాడు. గేటు దగ్గిరికి వెళ్ళేసరికి— అతని కోసం యెదురుచూస్తూ పచ్చిక మీద కూచునివున్న ఆమె చివాలున లేచి నిలుచుంది. నీలం రంగు పువ్వులతీగల తెల్లచీర.

గేటు దగ్గిరికి వొచ్చి. వీధి దీపపు వెలుతుర్లో మెరుస్తున్న అనంత్‌రెడ్డిని కళ్ళనిండా నింపుకుని చూస్తూ, "యింకా లోపకి రాని నిముషమేనా?" అంది.

అవునన్నట్లు తల వూపాడు.

గేటు తీసుకుని బయటికి వొచ్చింది.

నడుస్తున్నారు.

వీధి దాటి యింకా పెడగా వెళ్ళి — రాళ్ళ గుట్టలు దాటి, పచ్చిక వాలులోకి వెళ్ళారు.

దూరంగావున్న దీపాల మసకకాంతిలో—

స్వప్న రాగలీనని కన్నార్పకండా చూస్తూ, "స్వప్నా" అన్నాడు.

"వూఁ" అంది—సహస్రతంత్రుల వీణ 'కుహూ' అన్నట్లుగా.

సంచి ముందు కొస వొక చేత్తోనూ రెండో కొస యింకో చేత్తోనూ పట్టుకుని వొంచాడు, పూలు—రంగురంగుల రకరకాల పూలు — ఆమె పాదాలమీద రాలుతున్నాయి.

అతని చేతులు పైకి లేచాయి. పూలు ఆమె తల మీద భుజాలమీద వక్షం మీద రాలుతున్నాయి.

ఖాళీ సంచి అవతల పడేశాడు.

కన్నార్పకండా ఆమెని చూస్తున్నాడు.

ఆమె రెండడుగులు ముందుకు వేసి—అతని వక్షం మీద చెక్కిలి ఆనించింది. ఆమె తల అతని చెంపకి ఆనుతోంది.

ఆమె వీపు చుట్టూ చెయ్యి వొయ్యిగా తిప్పి—

"స్వప్నా" అన్నాడు. అదే 7 ధత్వంలో.

"వూఁ" అదే స్వర్గం.

తాపీగా కిందకి కుదించుకుంటూ — పచ్చికమీద కూర్చున్నారు.

"యిన్ని రోజులు నిన్ను చూడకుండా యెట్లా వుండగలిగానో నాకే అర్థమవటం లేదు" అన్నాడు.

"నేను అనాల్సిన మాట అది. మీకు అంత యిదేం లేదు. మీ రిసెర్చిలో మీరు మునిగిపోయారు"

"నువ్వు మాత్రం రిసెర్చి చెయ్యటంలేదా!"

"నా రిసెర్చి చెప్పాలా! యేదో కాలక్షేపానికి" అంది.

"ప్రభుత్వ ధనం! ప్రజల సొమ్ము!"

"నేనేం యెవరి సొమ్మూ తినలేదు. నాకోసం యూనివర్సిటీ వాళ్ళతో వొక్క పైసా ఖర్చు పెట్టించుకోలేదు. నా రిసెర్చి మీ కోసం యెదురు చూస్తుండే రిసెర్చి. మధ్యమధ్యలో వొకో నెల వూరెళ్ళి నా వాళ్ళ దగ్గిర వుండి వొచ్చేదాన్ని. యింతకీ యెన్ని గంటలకి వొచ్చారు యివాళ?"

"మార్నింగ్ వెంకటాద్రిలో. స్టేషన్‌కి శ్రీపతి వొచ్చినాడు. అత

దగ్గిరే వుండినాను."

"శ్రీపతిగారు కలిసి మాట్లాడి చాలా రోజులైంది. ఆ మొన్న వొక పెళ్ళిలో చూశాను. అవునె. అమెరికా కబుర్లు చెప్పు. నీవు పిల్లలతో యేం చేశారో—"

"నువ్వు చూడమన్నవన్నీ చూసినాను. వేరే యింకేమీ చూసే టైం లేకపోయింది. మిసిసిపీ......"

ఆతను కబుర్లు చెబుతూంటే వింటోంది.

ఆతని చేతివేళ్ళను తన చేతుల్లోకి తీసుకుని తన పెదాలకి తాకించుకో బోతే, ఆమె చేతిని తన వైపుకి లాక్కుని, ఆమె చేతివేళ్ళను తన పెదాలకు తాకించుకున్నాడు. కనురెప్పలు వాల్చాడు.

చూపుడు వేలితో పెదాలమీద నొక్కింది.

రెప్పలు విప్పి, కాళ్ళు జాపుకుంటూ కూర్చున్నాడు.

ఆమె పాదాలమీద చేతులు వేసి స్పృశిస్తూ, వొంగి ఆమె పాదాలమీద చెంప ఆనించుకున్నాడు.

రెండు చేతుల్తో ఆతని భుజాలు పట్టుకుని వొళ్ళోకి జరుపుకుంది. వెల్లకిలా పడుకుని ఆమె గెడ్డం కొనపంక చూస్తున్నాడు.

ఆతని వక్షంమీద ఆతని చేతివేళ్ళలో ఆమె చేతివేళ్ళు.

"మనం పెళ్ళెప్పుడు చేసుకుందాం?" యిద్దరూ వొకేసారి అన్నారు.

అంతట-- యిద్దరూ వొకేసారి నవ్వారు. సెలయేటి వాలులో యిసకలో కదిలిన గులకరాళ్ళ సవ్వడిలో గవ్వల చప్పుడు కలిసినట్లు కలగలిసిన గలగలస్వనం

"నువ్వే చెప్పు" అన్నాడు.

"మీరే చెప్పండి" అంది.

"నువ్వే యెప్పుడంటే అప్పుడు. రిజిస్ట్రాఫీసులో అంటే రేపే నోటీసు యిస్తాను. గుళ్ళో అంటే మంచి రోజు చూసి నాలుగు రోజుల్లో ఆ పని శ్రీపతి మీద వేద్దాం" అన్నాడు.

"నేనెప్పుడనటం కాదు. మీరెప్పుడనేదీ చెప్పండి."

"నేనైతే యిప్పుడే అంటాను. యీ క్షణంలో నీ మెడలో తాళికట్టి"

"రిజిస్ట్రాఫీసులూ, గుళ్ళో పెళ్ళి, గాంధర్వాలు దేనికి? రేపు నేను మా వూరు వెడతాను. మా నాన్నకి చెబుతాను. నా మాట కాదనడు. కాగా

అనాల్సిన అవసరమూ లేదు. అన్నీ సాంప్రదాయికంగా పెద్దల ద్వారానే జరగనిద్దాం యెంతైనా పెళ్ళి కూతురు వాళ్ళమేనదా మేం — మా వాళ్ళొచ్చి మీ వాళ్ళని అడుగుతారు, పోలీసు ఆఫీసరుగారు కాదు పొమ్మంటే — పాపం మీరు దిక్కు మొహం వేస్తారు కాబోలు!" అని నవ్వింది పత్తికాయ చిట్లిన చప్పుడు.

"దిక్కుమొహం కాదు స్వప్నసుఖమేస్తాను" అని నవ్వి, "యీ రిసెర్చికి అమెరికా పంపించకపోతే యినెళ్ళ —" అని ఆగిపోయాడు.

"అనంత్ యీ వాడి, యీ వాడి మీకు అప్పగించాను."

సంతోషపు వొత్తిడికి అతని కళ్ళలో తడి వుబికింది.

# 101

రాత్రి తొమ్మిది. శ్రీపతి అప్పుడే హొటేల్లో భోంచేసి వొచ్చాడు. తాళం తీసి — బట్టలు మార్చుకోవటానికి లోపల గదిలోకి వెళ్ళబోతూంటే గుమ్మంలో అడుగుల చప్పుడు

తల పక్కకి తిప్పి చూశాడు. గాయత్రి.

మోహన్‌రెడ్డీ గాయత్రీ కలిసి వొకటి రెండుసార్లు వొచ్చారుగానీ గాయత్రి వొక్కతే రాలేదెన్నడూ. యేదో సమస్య వొచ్చివుండాలి — అనుకున్నాన్నాడు శ్రీపతి.

"లోపలికి రా గాయత్రి. యిప్పుడే భోంచేసి వొచ్చా. కూర్చో అలా" అన్నాడు శ్రీపతి.

మౌనంగా కూర్చుంది కుర్చీలో.

"యెటునుంచి? వొంట్లో యెలా వుంటోంది" అన్నాడు.

ఆమె మౌనంగా వుండిపోయింది

ఆమె ముఖంలోకి చూసి, "గాయత్రీ. యెవరితోనన్నా గొడవపడ్డావా?" అన్నాడు

"లేదు" అన్నట్లు తల వూపింది.

"మోహన్ యెక్కడ?" అన్నాడు.

"కోర్టులో. పేద ప్రజలకి సేవ చేస్తాడట. యీ చెవిటి గాడిదల

కొట్టటంలో అరుస్తూ" అంది.

"అతను ప్రాక్టీసు చెయ్యటం నీ కిష్టం లేకపోతే మానేస్తాడు చెప్పు. నిన్ను కష్టపెట్టటం అతని అభిమతం కాదు నువ్వు బాధపడితే సహించలేడు"

"మోహన్ గురించి కాదు" అంది.

"మరి"

"నాకు ఈ ప్రపంచాన్ని వొదిలిపోవాలనిపిస్తోంది. యీ విరసాన్ని గిరసాన్ని యీ చవటల్ని యీ అల్పుల్ని — సిగ్గు లేకుండా యింకా నాతో వాదనకి దిగుతారు. విప్లవ రచయితలు జెయిళ్ళలో చిత్రహింసలు అనుభవిస్తూంటే, విప్లవ వీరులు అడవుల్లో అహోరాత్రులు వ్యూహం పన్నుతూంటే — యిక్కడెందుకుండాలి? యేం చెయ్యాలి? నాకేం చేతకాదిక్కడ, నేను పసివాణ్ని. చిన్నారి అరుణని—" అని చటుక్కున లేచి లోన గదిలోకి వెళ్ళి, మంచం మీద బొక్కబోర్లా ఒరిగింది.

గది గుమ్మంలోకి అడుగు వేసి— ఆమెను గమనించి— వొచ్చి కుర్చీలో కూచున్నాడు శ్రీపతి.

ఆమె వెక్కి వెక్కి పడటం వినిపిస్తోంది యివతలికి.

లోనకివెళ్ళి, ఆమె వీపు మీద చెయ్యి ఆన్చి, "అసలేం జరిగిందో చెప్పు గాయత్రీ" అన్నాడు శ్రీపతి ఆప్యాయంగా.

అతని చేతిని దిండుమీదకి తీసుకుని, అతని అరచేతిలో ముఖం ఆన్చి వెక్కి వెక్కిపడుతూ—

"యీ వెధవలు యేమన్నారో తెలుసా శ్రీపతీ. నేను పొగరు బోతు ముండనట. చవట వెధవలు. నంగి వెధవలు. దొంగవెధవ దొంగవెధవలు. పోచుకోలు కబుర్ల వెధవలు. విరసం వాళ్ళంటేమె రంగుతో గోడలు ఖరాబు చేసే వాళ్ళనిపించుకునే వాళ్ళు— రచయితలా దేనికి—రాయటం దేనికి—యెవరు రాసేది—రాస్తే తవనంగతేమిటసలు? వొకరో యిద్దరో ముగ్గురో అట్లా కొందర్ని తప్పించి వీళ్ళంతా బూర్జువాల కంటే నీచులు—" అని ఆయాసపడుతోంది.

"మోహన్ వున్నాడా ఆ సమయంలో?"

"లేదు. వుంటే యేం చేస్తాడు? అటూ యిటూ శాంతింపజేయటానికి యత్నిస్తాడు. వొక్కోసారి అతనిని చూస్తే నాకేమనిపిస్తుందో తెలుసా —

గాంధీకి స్టాలిన్ వేషం వేసినట్లుగా. మోహన్ మోహన్ — నా మోహన్
నా కెంత యిష్టమో — నా మనసు రవంత నొచ్చితే గిలగిల్లాడిపోయే
మోహన్—కాని యీ గాయత్రిని మోహన్ యేం చేసుకుంటాడు— యీ
గాయత్రి పసిది పసి అరుణ. అరుణ కిరణాలలో, అరుణా రణా రణ్యంలో
తొలి వేకువ రేకుల యెర్రగులాబీ పసి అరుణ—"

చటుక్కున మౌనంగా వుండిపోయింది.

ఐదు నిమిషాలు,

ఆమె శ్వాస దీర్ఘంగా వినిపిస్తోంది.

చెయ్యి నిమ్మదిగా జరుపుకుని, చెంపకిందినుంచి తప్పించి — ఆమె
తల నిమిరి — ముందు గదిలోకి వొచ్చి కుర్చీలో కూచున్నాడు. 'మూర్ఖిస్టులు
ఆమె మనసును బాగా గాయపరిచి వుంటారు' అనుకున్నాడు.

గంట సేపు.

ముందుగదిలో శ్రీపతి అలాగే కూర్చునివున్నాడు.

లోన గదిలో గాయత్రి గాఢంగా నిద్రపోతోంది.

అంతలో మోహన్‌రెడ్డి వొచ్చాడు.

మౌనంగా—కూర్చోమని చేత్తో సూచించాడు శ్రీపతి.

"యింతవరకు గాయత్రి యింటికి రాలేదు. సుధీర్ కలిసి చెప్పాడు.
యివాళ విరసం మీటింగులో అందరి జాతకాలూ చదివి బయటపెట్టి అంద
రితో దెబ్బలాడి వొచ్చిందట. యిటు వెళ్ళిందో — వాళ్ళింటికి వెళ్ళలేదు.
ఐనా అనుమంటి మూడ్‌లో వాళ్ళింటికి పోదు" అన్నాడు దిగులుగా.

"గాఢంగా నిద్రిస్తున్న ఆ శ్వాస విను" అన్నాడు శ్రీపతి.

"యెవరూ?" అన్నాడు మోహన్‌రెడ్డి.

"యెవరో ఐతే యిప్పుడు నీకు చెప్పటం దేనికి!"

మోహన్‌రెడ్డి అమాంతం లేచాడు.

గుమ్మంలోకి అడుగులు వేస్తున్న అతనితో, "డిస్టర్బ్ చెయ్యకు"
అన్నాడు శ్రీపతి.

మోహన్‌రెడ్డి, మంచం దగ్గిరికి వెళ్ళి గాయత్రివంక చూస్తూ నిలుచుని
పోయాడు.

పది నిమిషాలు.

శ్రీపతి, లోనకి వెళ్ళి మోహన్‌రెడ్డి భుజంమీద చెయ్యివేసి ముందు

గదిలోకి నడిపించుకొచ్చాడు.

# 102

సాయంత్రం ఆరున్నర వేళ.

శ్రీపతి, తను వుంటున్న మేడ మెట్లెక్కి ధనలక్ష్మి వాటావైపుకి నడిచాడు మొదటిసారిగా.

నిన్న సాయంత్రం వొచ్చి కాసేపు అవీయివీ కబుర్లు చెప్పి, "రేపు నా పుట్టినరోజు. మీరు తప్పకుండా మా యింటికి రావాలి"అంది ధనలక్ష్మి.

"యెన్నో పుట్టినరోజు?" అన్నాడు.

"మగవాళ్ళ సంపాదన ఆడవాళ్ళ వయసు అడగకూడదంటారు?" అంది ధనలక్ష్మి.

"సంపాదన లేని మగాణ్ణి కదా అందుకని అడిగాను కాబోలు. ఐనా మీరు సంపాదిస్తూ పురుషస్థానంలోనూ రాణిస్తున్నారుగా!"అన్నాడు.

"ఆఁ, నా సంపాదన దేముందిలెండి. మీకు చెప్పకూడనిది నాకేముంటుందండీ! యిరవై మూడో సంవత్సరం" అంది.

"యేం ఖర్మొంది ధనంచిట్టీ, ఐదారేళ్ళే తగ్గించి చెప్పుకున్నావు — పదహారేళ్ళ బాలనురా, పసికోలనురా — అని చెప్పుకుంటే మాత్రం కాదంటానా?" అని అనుకుంటూ, "చూస్తే అలా అనిపించరు. పందొమ్మిదేళ్ళని పిస్తారు!" అన్నాడు.

"సంతోషంతో పుబ్బి తబ్బిబ్బవుతూ, "మీరు యిన్నాళ్ళుగా యిక్కడ వుంటున్నా వొక్కసారైనా మా యింటికి రానేలేదు. రేపు తప్పకుండారావాలి. సాయంత్రం ఐదు తరవాత మీ వీలునుబట్టి. యింకా మా ఫ్రెండ్స్‌కి చెప్పాలి మళ్ళీ వొస్తాను" అని చెప్పి వెళ్ళింది.

శ్రీపతి వెళ్ళేసరికి, ఆమె ఆఫీసువాళ్ళూ యితరులూ వొచ్చివెళ్ళారు. సద్దుమణిగాక వెళ్ళి వో ఐదు నిమిషాలు కూచుని వొద్దాం అని అనుకున్నందున ఆరున్నర దాకా ఆగాడు.

"రండి, రండి" అని సంతోషంగా ఆహ్వానించింది.

లోన ముగ్గురు కూచుని వున్నారింకా.

"వాకే బంగళాలో వుంటూ నా బర్త్ డే సందర్భంగా రాక తప్పక యిన్నాళ్ళకి వొచ్చారు!" అంది ధనలక్ష్మి.

వో కుర్చీలో కూచున్నాడు.

"వీరు శ్రీపతిగారని పోస్ట్ డాక్టొరల్ రిసెర్చి చేస్తున్నారు!" అని, వొకామెవంక చూపెట్టి, "యీ అమ్మాయి నాకు పినతల్లి కూతురు. బియస్సీ చదువుతోంది వుమెన్స్ కాలేజీలో. యితను మా ఆఫీసులో స్టెనో. యీవిడ మృదుల సుప్రసిద్ధ నవలా రచయిత్రి. మీకు తెలిసే వుండాలి సాహిత్యం బాగా తెలిసినవారు." అని పరిచయాలు చేసింది ధనలక్ష్మి.

అందరికీ నమస్కారాలు చేస్తూ 'ముదొక్కడలా వుంది. వైరుధ్యాలంకారం అంటూ లేకపోతే ; యీవిడనీ యీవిడ పేరునీ జోడించి కొత్తగా సృష్టించవొచ్చు' అనుకున్నాడు.

"మృదులగారు రాసిన 'శ్రీమంతులు—గుణవంతులు' నవల చాలా ప్రసిద్ధమైంది. నాకెంతో నచ్చింది." అంది ఆ బియ్యేస్సీ విద్యార్థిని.

—తామర తంపరగా వొస్తున్న వీళ్ళందరూ యెక్కడ గుర్తుంటారు కనీసం పేరు చూసిన గుర్తు కూడా లేదు! ఐనా నేను వారపత్రికలూ యీ పుట్టగొడుగు నవలలూ చూస్తున్నదెక్కడ? యీవిడ—

అందరూ అతనివైపే చూస్తూంటే—

"నేను యింగ్లీషు, తెలుగు కవిత్వం యెక్కువగా చదువుతుంటానండీ. నవలలూ కథలూ అంతగా చదివే అలవాటు లేదండి" అని నసిగాడు శ్రీపతి.

—అందరూ పోయివుంటారని యిప్పుడు వొస్తే చివరికి యీనవలా కరటంలో పడ్డానే వొచ్చొచ్చి....

"సులోచనరాణి కంటే గొప్పగా రాస్తారండీ—"అని యింకేదో చెబుతోంది ఆ బియస్సీ విద్యార్థిని.

"మీకు ఆవిడ తెలియదాండీ? యీ వూళ్ళోనే వుంటారు." అంది ఆ విద్యార్థిని.

"లేదమ్మా, తెలియదు. నాకు రాసేవాళ్ళెవరూ తెలియదు. యిదో యిప్పుడే మృదులగారు పరిచయం అయ్యారు."

"మృదులగారు కొత్తగా వొక నవల రాయబోతున్నారండీ. చాలా ప్రత్యేకమైన నవల.

"అవునండీ విప్లవాత్మకంగా కొత్త ధోరణిలో రాయబోతున్నాను. టెక్నిక్కూ శైలీ అన్నీ కొత్త పద్ధతిలో—" అని చెప్పుకుపోతుంది మృదుల
—కొత్త కొత్త శైలిల్ని అవలంబించగలిగే యీవిడికి శైలి అంటే ....

"పేరుకూడా నవలకీ, థీమ్‌కి తగినట్లుగా విప్లవాత్మకంగాపెట్టానండీ—వియ్యపు గింజలో వడ్లగింజ అని. తెలుగు నవలావిధానాన్నే తారుమారుచేసే యీ పేరులో వున్న భావంతో కోకొల్లలుగా వొస్తున్న రచనలు ఆగిపోతాయనుకోండి. అక్షరాలు నేర్చుకున్న ప్రతివాళ్ళూ మొదలెట్టారు రాయటం యేమీ తెలియకపోయినా—"

లోపల్నుంచి ధనలక్ష్మి తండ్రి ముష్టి రంగనాథం దగ్గు వినిపిస్తోంది. మృదుల చెప్పేది వినకుండా ఆ దగ్గు వింటున్నాడు శ్రీపతి.

యీ దగ్గులో వొక లయా శైలీ వున్నట్లుగా వుంది. దగ్గేవాడి బాధ సంగతి వొదిలేస్తే —ఆ దగ్గులో వొక వొడుపు వుంది. తెరల తెరలుగానూ మధ్యలో ఆటకాయింపులతోనూ వొస్తోంది. లయ లయ—కుక్క మొరగటంలో కూడా లయ వుంటుంది. సందర్భాన్ని బట్టి, కుక్కనిబట్టి లయ వుంటుంది. యే లయా లేకుండా యీ రాతీ వాగుడు....

శ్రీపతి, తన నవలలు కూడా తెలియనంత అల్పజ్ఞాని అని జ్ఞానోదయమైన మృదుల తను పేల్చబోతున్న నవలాబాంబు సంగతి ఆపింది.

ధనలక్ష్మి, ఫలహారాలు పుచ్చుకోమని మర్యాద చేస్తోంది శ్రీపతిని.

అంతలో ముసలాయన లోపల్నుంచి వొచ్చాడు.

మృదుల, ఆ విద్యార్థిని, ధనలక్ష్మి సహోద్యోగి లేచారు వెళతామని ముసలాయన దగ్గు వాలకం చూసి అయిష్టంగా అనిపించి.

ధనలక్ష్మి, తండ్రిని పరిచయం చేసింది శ్రీపతికి

రంగనాథానికి నమస్కారం చేసి, లేచినవాళ్ళ వంక వీడ్కోలుగా చిర్నవ్వాడు శ్రీపతి.

"మా ధనం తరచూ చెప్తూంటుంది మీగురించి" అన్నాడు, శ్రీపతి వంక ఆసక్తిగా చూస్తూ.

"హీఁహీఁ" అని యికిలించాడు శ్రీపతి మర్యాదకి.

"వొకసారి వొచ్చి కలుసుకుందామనుకున్నానుగానీ యీ అనారోగ్యం వల్ల మెట్లు దిగాలన్నా, యెక్కాలన్నా బహుకష్టం. అమ్మాయి

మూడేళ్ళుగా వుద్యోగం చేస్తోంది. ఫారెను ప్రయివేటు కంపెనీలో కదా బాగానే యిస్తారు. పెద్దవాడేమో—" అని తన బిడ్డల వివరాలు ప్రారంభించాడు రంగనాథం—మధ్య మధ్యలో దగ్గుతూ ఆయాసపడుతూ.

ధనలక్ష్మి కాఫీ కలుపుకొచ్చి శ్రీపతి చేతికి అందిస్తూ ముఖంలోకి చూసింది.

"ధనం వొక్కతే మిగిలింది పెళ్ళికావల్సిన—"

ధనలక్ష్మి చటుక్కునలేచి లోనకి వెళ్ళింది.

"మీ యెరికలో యెవరైనా యోగ్యులైన కుర్రవాడుంటే చూడు నాయనా! నేనా సంబంధాలు చూడటానికి యెటూ తిరగలేని స్థితిలో వున్నాను— నీలాగ యోగ్యుడు, బుద్ధిమంతుడు అయితే కులం పట్టింపు అంతగా వుండక్కరలేదు. కాలం మారిపోతున్నది కదా! మా ధనానికి ఆ పట్టింపులు అసలే లేవు—" అని ప్రారంభించాడు—కాసేపు మీదు కాసేపు నువ్వు అని దగ్గిరతనం యేర్పరుచుకుంటూ.

అతను చెప్పుకుపోవటం అతని దగ్గులాగా కొనసాగుతూనేవుంది.

"యీయనీ టాపిక్ వొదిలేలా లేడు" అనుకుంటూ, "అలాగేనండీ. ధనలక్ష్మిగారికి యేం లోపముని— మీ గోత్రీకులలోనే నాకు తెలిసినవాళ్ళు వకరిద్దరున్నారు చెబుతాను" అన్నాడు శ్రీపతి.

తలుపు అవతలవుండి ఆలకిస్తున్న ధనలక్ష్మి వొస్తూ, "యీ పూట మీ భోజనం మా యింట్లోనే" అంది.

"ముందుగా తెలిస్తే మహాభాగ్యంగా చేద్దును. కానీ యెనిమిదింటికి వో మిత్రుణ్ని కలుసుకుంటానని చెప్పాను. విధిగా వెళ్ళాల్సిన జరూరు పని" అన్నాడు శ్రీపతి.

"అయ్యో అట్లాగా— యిప్పుడు టైమెంతైందీ." అని గోడ మూలకి చూశాడు రంగనాథం— అక్కడేదో గోడకి గడియారం తగిలించి వున్నట్లు.

వాచీవంక చూచుకుని, "యేడున్నర" అని ధనలక్ష్మి వంకచూసి చిన్నగా నవ్వి, "మళ్ళీ కలుసుకుందాం. వొస్తా" అని లేచి బయటపడ్డాడు శ్రీపతి.

తాళంతీసి పులెన్ స్వెట్టర్ తగిలించుకున్నాడు.

వీధిలో నడుస్తున్నాడు.

—ధనం, ముప్పై రంగనాధంగారి కడవటిధనం— ధనలక్ష్మి భోజన దావలక్ష్మి, వివాహదీనలక్ష్మి—ఆ కో స్టైనోకి పెళ్ళి అయినట్లుంది. కాక పోయినా చేసుకోడు. తనతో సమానంగా సంపాదిస్తున్న ధనలక్ష్మి ఐనా పైన అసలు ధనం కొ_స్తపడనిదే యీధనం కంటికి ఆనదు- అందుకే మధ్య తరగతివాళ్ళు ఆడపిల్లల చదువులకి డబ్బు ఖర్చుచేస్తే అదనంగా మరిన్ని యిబ్బందులు.... ఆ రచయిత్రి మృదులకి పెళ్ళయిందా— మనిషిమాస్తే చాలా చ_దురుగా వుంది. మెళ్ళో సూత్రాలు కనిపించలేదు. బ్లౌజు లోపలి కేసిందేమో— ఆ చప్టాలాంటి వాక్షంమీద చిన్నకాకంతటి సూత్రం బిళ్ళ యినా కనపడక తప్పదు. ఆ వుల్లిపొర చీర, వొంటిపొర పవిట తియ్యక పోతే— కొ_స్త మందపాటి చీర కట్టుకోకూడదూ- పెళ్ళికాక, అయ్యే అవకాశం కనపడక ప్రత్యామ్నాయంగా రాతలోకి దిగివుంటుంది. తెలుగు పాఠకుల రాతబాగుంది సరిపడా మేత లభిస్తోంది వీళ్ళ పుణ్యమాఅని. వార, మాస, మాస, మాస పత్రికలు నడుస్తున్నాయి. వీళ్ళంతా రాయటం మానేస్తే ఆ పత్రికలేంగాను— యీ చదివే లక్షలాది టకానీ సాహిత్య పాఠకుల గతేంకాను. యీమేత లేకపోతే యేం తోచక మొగుళ్ళతో మరింతగా దెబ్బలాడతారు' యే మొగుడితో అయినా యే పెళ్ళాం అయినా దెబ్బలాడటం సహజం సకారణం. మొగుడన్నవాడు పెళ్ళాం అంచనాకి యెప్పుడూ బె_త్తెడుకిందకే వుంటాడు. ఆ పయ్యారెవరో, పొడవుచేతులూ, పీవంతా మూసేస్తూ బ్లౌజూ— కొ_త్తఫేషను— పెద్దమెడా పొట్టిచేతుల బ్లౌజులేం చేస్తారో— చిట్టిమెడా పొడవుచేతులూ అయితే సులభంగా పెద్ద మెడా పొట్టిచేతుల్లోకి మార్పించుకోవచ్చు- యిలాంటి ఫ్యాషన్లు వొచ్చే సందర్భంలో యింటి ఆర్థికస్థితి బడ్జెటు దెబ్బతింటుంది— క్రితం బడ్జెటులో రిఫ్రిజిరేటర్లకి, ఫ్యానులకి, టీవీ సెట్లకి రాయితీలిచ్చాడు. పావం అంతంత డబ్బుపోసి కొనేవాళ్ళకి కొంత వుసులుబాటు కల్పించాలిగా! మన సర్కారు వారికి ఆ మాత్రం యింగితం లేకపోలేదు. యీ సిటీలో టీవీ స్టేషను పెడతామని పూరిస్తూ బెదిరిసున్నారు. చాలాకాలంగా— యిప్పుడే వొకటి, కొని వుంచుకోవని ధ్వనికాభోలు— అలా బడ్జెటు పకడ్బందీగా యేర్పాటు చేసి బయటినుంచి అప్పుమీద అప్పు పుచ్చుకుంటూ అప్పు భారతి యెమర్జన్సీ యమదండంతో— యెంత నజావుగా సాగిపోతోందో దేశం— యింతీ నీవి యెంత చక్కని పెదవులేతిట్టినా అంత తియ్యగానూ వుంటాయని

వాడెవడో అరభ్బీ ప్రేమ ద్రావకంలో మునిగిన కవి అన్నట్లుగా, యెంత చల్లని పాలనే యిందిరా నీది, అంతకాలిన అట్లకాడతో వాతలెడుతున్నా యెంత సమ్మగావున్నదే భామరో— గప్‌చిప్‌గా గిప్‌చుప్‌గా— గప్‌చిప్ సంబారుబుడ్డి— యిళ్ళల్లోవాళ్ళు యిళ్ళలో వీధుల్లో వాళ్ళు వీధుల్లో ఆఫీసుల్లో వాళ్ళు ఆఫీసుల్లో జెయిళ్ళలో వాళ్ళు జెయిళ్ళలో దొంగనోట్లలో యెందులోవాళ్ళు అందులో క్రమబద్ధంగా శ్రమించి పనిచేస్తూ— ఇంట్లోనూ వీధిలోనూ, ఆఫీసులోనూ జెయిల్లోనూ కనిపించనివాళ్ళు పోసేను స్వర్గ సారంగంలోంచి ఆకాశయాన పిల్లతెమ్మెర విహారయాత్రలా వొడుదుడుకులు లేకుండా నదురూబెదురూ లేకుండా తొణక్కుండా బెణక్కుండా సాదాగా, సాఫీగా, నిండుగా మురుక్కాలవలో దేశం ప్రశాంతంగా సాగిపోతూంటే జోజో ముకుందా.... జో అచ్యుతానందా.... జోలి పరమానందా— జాలి భారతానందా....

యిరానీ హోటేల్లోకి చొరబడ్డాడు.

తందూరీ రోటీ, మటన్ కుర్మా.

—వీళ్ళకి భారతదేశ పౌరసత్వంవుందా? వీళ్ళ పెళ్ళాలెక్కడ? యిరాన్‌లోనా? మరి వీళ్ళ అవసరం యెలా తీరుతున్నట్టు? యే.... దగ్గిరానూ కనపడరు. తమలోతాము హోమో సర్దుబాటేమో................

టీ తాగి బయటికొచ్చి నడుస్తున్నాడు.

మలుపులో సినిమా బోర్డులు. షోలే, కార్పెట్ బెగ్గర్స్, యెంటర్ ది డ్రాగన్, మౌసమ్, రంగీల్లారాత్, కాగజ్‌కి నావ్, వొకదీపం వెలిగించి, ప్రేమలీలలు, సంసారంలో సరిగమలు.

—నేకెడ్ బెగ్గర్ల వింటర్ డ్రాగింగ్ రంగుల రాత్రుల మౌనం లోంచి యెర్రగా కాలిన శూలం కొసన వొకదీపం వెలిగి ప్రేమలీలలుసాగి సంసారంలో సరిగమలు, గరిగమలే గరగర గరంగరిగమలే కాదంటే బతుకు కాగితప్పడవే........ ........

యిషారా సినిమా కాగజ్‌కినావ్ ఆడుతున్న థియేటర్ దాటిపోయి— గమనించి ఆగకుండా వెళ్ళబోతూ— ఆగి—వెనక్కి తిరిగి—

—యీ సారికీ సారిక సరిక గిరిక గరిక గిరిక . రాజరాజభూషణుడి రోమరాగ భోషాణుడి భట్టుమూర్తి బెట్టుమూర్తి గుట్టుమూర్తి- చెలికినవాళ్ళు సాహిత్య డాక్టర్లు, పలికినవాళ్ళు సాహిత్య యాక్టర్లు, అంకినవాళ్ళు—

సాహిత్య ప్రోక్తర్లు, అలిగినవాళ్ళు............

టిక్కెట్టు తీసుకుని లోపకి వెళ్ళబోతూంటె— వరండాలో నుంచుని వున్న రంగారెడ్డి. "హలో శ్రీపతిగారూ వాటె ప్లజంట్ సర్‌ప్రైజ్" అంటూకూడా వడిచాడు.

# 103

అంకినీడు తీసిన సినిమా మూడువారాలకే డబ్బాలు తిరిగి వొచ్చాయి అన్ని థియేటర్లనుంచీ.

కవ్వించే సెక్సీ స్టిల్స్, సందేశాత్మకమైన క్యాప్షన్స్ యిచ్చిన పబ్లిసిటీలవల్ల మొదటిరోజు అన్నిచోట్లా హౌస్‌ఫుల్ ఐంది. రెండో రోజున కాస్త మూడోరోజుకి మరికాస్త అలా రోజురోజుకీ ప్రేక్షకులు తగ్గిపోయారు. కరంటుబిల్లు ఖర్చులకికూడా చాలనంతగా.

కథలో సెక్సూ సస్పెన్సూ సందేశమూ లాంటివన్నీ నింపినా— సందేశం కదిలించేదిగానూ, సస్పెన్సు వూపిరి బిగబట్టించేదిగానూ, సెక్సు కిక్కిచ్చేదిగానూ, క్రైమ్ కంపింపజేసేదిగానూ తయారవక అతుకుల బొంతలా అనిపించింది ప్రేక్షకులకి. సస్పెన్సు కంటికి కనిపించటంతప్ప ఫీలింగులో పట్టెయ్యలేకపోయింది.

డిస్ట్రిబ్యూటర్ల ఐదారు లక్షలూ బొటాబొటీగా వసూలయ్యాయి. అంకినీడు పార్ట్నరుని నాలుగు లక్షలు, అంకినీడుని రెండులక్షలు తిరుక్షవరమయ్యాయి. అంకినీడు పార్ట్నరు పదోరోజున అంకినీడుని అర్ధమయిన తిట్లూ తిట్టి వూరికెళ్ళిపోయాడు.

యింట్లోంచి బయటికి కదలకుండా ముసుగెట్టుకుని పడుకుని వుం[డి]పోయాడు అంకినీడు.

వో రోజున విజయ్‌కుమార్ వొచ్చి నళినితో, "అమ్మాయ్ నళినీ మీ ఆయన నాకు పదివేల రూపాయలివ్వాలి" అన్నాడు.

"భర్త అప్పులు భార్య తీర్చే పద్ధతి లేదు కదా! ఐనా ఆ సినిమాకి నాకూ కొన్ని వేల మైళ్ళ దూరం అని అందరికీ తెలుసు." అంది.

"సినిమాకి కాదు. సినిమా రిలీజు ఐన రోజున నా దగ్గిర పదివేలు చేబదులు తీసుకున్నాడు."

"దానికేం విజయ్ అడిగి తీసుకో." అంది నళిని.

"తన దగ్గరేముందని యిస్తాడు?"

"వాళ్ళ అమ్మానాన్నలకి ఆస్తి లేకపోలేదు" అంది.

"వాళ్ళ దగ్గరికెళ్ళాను నిన్న. వాటా పంచి యిచ్చాం. మాకేం సంబంధం లేదు అన్నారు. కాగా వాళ్ళమ్మ తనని బతిమిలాడి బెల్లించి విడిగా యాభయ్ వేలు పట్టుకుపోయాడని వొకటే గోల" అన్నాడు విజయ్‌కుమార్.

"ఐతే యింకేం చేస్తావ్ విజయ్ ; ఆశ వొదులుకోవాల్సిందేగా— ఆయన దగ్గర నాలుగు జతల బట్టలకి మించి నేమీ లేవనుకుంటాను!" అంది హాస్యంగా

"పదివేలేగా నువ్విచ్చేస్తే—"

"పదివేలేగా వొదులుకునేస్తే—"

"అదేంమాట? మీ ఆయన కదా?"

"అదేంమాట? నేనేం ఆయన మెళ్ళో తాళికట్టలేదు. కాగా నన్నడిగి యిచ్చావా?" అంది.

"నిన్ను సంప్రదించేటంత వ్యవధి లేకపోయింది. అర్జంటుగా కావాలని బార్‌లో అడిగితే—"

"భార్యగా ఆయనకి పూచీ పడలేను. యేదో చుట్టానివికదా, పర్సనల్‌గా యిస్తాను తీసుకో అంత డబ్బు యిబ్బందిలో వుంటే —" అంది వ్యంగ్యంగా.

"అట్లా అని కాదు. అది వొక ఫ్రెండ్ దగ్గర తీసుకుని యిచ్చాను."

"నువ్వంత యిబ్బంది పడతానంటే పర్సనల్‌గా యిస్తాను మరి. తీసుకో."

విజయ్‌కుమార్ మౌనంగా వూరుకున్నాడు—యిస్తే తీసుకోవటానికి సిద్ధపడినట్లు చూస్తూ

'వొరి అప్పారా—అంత ఆస్తి యేం చేసుకు చస్తావురా —' అని అనుకుని లేచి గది బయటికి వెళ్ళింది నళిని.

అంతా వింటూ యిసుమంత వ్యక్తంకానీ పడుకునే వున్నాడు అంకినీడు.

అంకినీడుని లేపాలనుకుంటుంటగా నళిని వొచ్చి పదివేల రూపాయల నోట్లకట్లు విజయ్‌కుమార్ వొళ్ళోకి అలా పడేసింది.

"నాకు పనుంది—" అంది—'యింక నువ్వు వెళ్ళే —అన్నట్లుగా.

"థాంక్స్ నళినీ. వొకసారి మా యింటికి రండి. చాలా కాలం ఐంది వొచ్చి" అని లేచి వెళ్ళిపోయాడు విజయ్‌కుమార్.

అతను వెళ్ళాక — నళిని, "యిట్లాంటి అప్పులు యింకెన్ని వున్నయ్?" అంది.

"— —"

"పతిదేవా విన్నే —" అంది.

ముసుగు తీసి "యేంటి?" అన్నాడు కళ్ళు నులుముకుంటూ.

"యింట్లో నిద్ర పట్టిస్తే యేం లాభం? పోయి యెవరి సినిమాలో నన్నా యెగస్ట్రా వేషాలు నటించు —" అంది.

చూపులు పక్కకి తిప్పాడు.

"యింకా యిట్లాంటి బాపతు అప్పులేమన్నా వున్నయ్యా అని అడుగు తున్నా" అంది.

"లేవు" అన్నాడు పొడిగా.

"అక్కడికి కొంత మేలే" అంది.

దుప్పటి ముసుగెట్టబోతున్నాడు.

"ఆ వెధవ ముండ ముసుగింకా యెన్నాళ్ళు? మొగుడు చచ్చి నెల దాటింది. తెల్ల దుప్పటి బాగా మ్యాచ్ ఐందనుకో." అని నవ్వింది.

ముసుగు పట్టటం విరమించాడు.

"చిప్ప చేతికి రాగా పాత వ్యసనాలకి తోడు కొత్త వ్యసనం — తాగుడు అబ్బింది యీ సినిమా పుణ్యమా అని. యిది నీ సినిమా సంపాదన" అని నవ్వింది.

"నేనేం డబ్బు పాడుచెయ్యాలని సినిమా తీశానా?"

"దురదకొద్దీనూ వివేకం లేకానూ."

"ఛాన్సు తగిలుంటే —"

"రేసుల్లో ఐతే మాంచి ఛాన్సులు తగులుతుంటవి" అని నవ్వింది.

బిక్క మొహం వేశాడు అంకినీడు.

"యెంతైనా మొగుడివి కదా — నేనొక మాట చెప్తాను వింటావూ?"

"నువ్వేంచెప్తే అదల్లావింటాను నళినీ. బుద్దొచ్చింది. నువ్వువొద్దన్నా వినకండా దీన్లో దిగాను."

రొచ్చు తిరుగుడు, చొంగ తిరుగుడు నాటుతనం

కక్కుర్తితనం మానుకుంటే అవసరం నా దగ్గిర తీరకపోదు.... యెంతైనా మొగుడివి కదా...."

"నాకసలు చచ్చిపోవాలనిపిస్తోంది."

"చస్తే—యిక్కడ యెవరి కొంపలూ మునిగిపోవు. మీవాళ్ళు సంతోషంగా వుంటారు. నాకంటావా—మరింత మంచి సంబంధాలొస్తయ్. యీ వళిని నీకు భార్యగా వుండటం నీకు కావాల్సినంత ఖర్చురానుకే—కాశ్మీర్ హో ట్రిప్పు వెళ్దాము" అంది.

అంకినీడు కళ్ళలో నీళ్ళు తిరిగాయి—అవమానంగా అనిపించి.

మంచం దగ్గిరికెళ్ళి, "ఛఛ కళ్ళనీళ్ళెందుకు! తమాషా చెయ్యటంలేను మొగుడివి అంతిదిగా వుంటే పాపం కదూ! నో పథకం ఆలోచించాన్లే. త్వరలో మనిద్దరం కలిసి కాశ్మీరెళ్ళి కొన్నాళ్ళు వుండి వొద్దాం. నువ్వో సినిమా టైఫాయిడ్ నుంచి కోలుకుంటావు. ఐతే నువ్వు బుద్ధిగా వుండాలి మరి—" అంది.

"నాకు బుద్ధొచ్చింది నళినీ. జన్మలో చస్తే దేనివంకా కన్నెత్తిచూడను నీకు చెప్పకండా యేదీ చెయ్యను. నాకు—డబ్బూ హొద్దు యేదీ వొద్దు. నన్ను నీ వాడ్నిగా భావించుకుంటే చాలు."

"యింకోటి వొదిలేశావు. సినిమా షణ్ముఖ అని అలవాటైన కొత్త వ్యసనం—"

"చస్తే తాగను. సరదాకి కంపెనీ కోసం కూడా తాగను. వొట్టు నీ మీద వొట్టు—"

"పతిదేవా వొట్టు నామీద వెయ్యకు—నాలుగుకాలాల పాటు యీ ఆస్తీ అవీ అనుభవించాల్సినదాన్ని. తాగుడు గురించి వొట్టుఅని మర్చిపోకు" అంది మంచం అంచుమీద కూచుంటూ.

"నీమీద కాదు మా అమ్మానాన్నలమీద వొట్టు"

"వాళ్ళేం పాపం చేశారు బాబూ!"

"నామీద వొట్టు"

"అట్లా అన్నావు బాగుంది. నీ వొట్టు నీకు పరిమితం అవటం భావ్యం. ఐతే భూమ్మీద యిదీ అదీ ఏమీ పుట్టవన్నమాటేగా. నన్ను తప్ప!

"దైవసాక్షిగా నువ్వు తప్ప నాకింకేం వొద్దు."

"చిన్న ఇబ్బంది వుంది. నేను కొంచెం సరదాగా తిరుగుతాను

యెప్పటిలాగా— యింటికీ వొంటికీ దేనికీ హాని లేని రీతిలో. యిట్లా యెన్నాళ్ళు సుముగెట్టుకుని వశపుంటావు? సామ్రాజ్యాలు అట్లావెళ్ళొస్తుండు కొరుంది మనకి" అంది.

"యిక్కడికే నీ తిండి తింటున్నాను—"

"భర్త తిండి భార్యో, భార్య తిండి భర్తో తినాలిగా. తనవ్యాపారాల్లో పిప్రియర్‌గా కొత్త తోడ్పడితే మా డాడీ నన్ను సొంత కొడుకులాగా చూసు కుంటాడమకో" అంది, నవ్వి

# 104

క్రితం వారం వో రోజున టాంక్‌బండ్ మీద రమాదేవి రత్నాకరరావు శ్రీపతికి కనిపించి — యెన్నాళ్ళైంది యింటికొచ్చి అని దెబ్బలాడితే, "వొచ్చే వారంలో వొస్తాను—" అని చెప్పాడు శ్రీపతి.

డిశంబరు ఆఖరి వారంలో—ఆదివారం అనుకుని వెడితే, ఆదివారం కాదని తెలిసింది శ్రీపతికి— రత్నాకరరావు కాలేజీకి వెళ్ళాడు. రమాదేవి వనిలో వుంది. వంట గదిలోకే వొక కుర్చీ లాగి అక్కడే కూర్చోబెట్టి వకచకా వంట ముగించింది.

రత్నాకరరావుకి యింకా యూనివర్సిటీ క్వార్టర్సు యివ్వలేదు. వాటి వక్కనే తార్నాకాలో యిల్లు తీసుకుని వుంటున్నాడు.

"వారమూ తేదీ కూడా గుర్తులేనంత దీక్షగా నిమగ్నమై పోయినట్లున్నారు. యింతకీ దేన్లో?" అంది రమాదేవి.

"యెమర్జన్సీలో."

"యేం యెమర్జన్సీ?"

"యిందిరాగాంధి యెమర్జన్సీ."

"అనా—" అని నవ్వి, "యెన్నాళ్ళైంది వూరెళ్ళి?" అంది.

"యే వూరు?"

"యేవూరేంటి!"

"దేశంలో యెన్ని వూళ్ళు లేవు!"

"దేశంలో వూళ్ళమాట కాదు. సొంత వూరు. మీ అమ్మగారు

యెంతగా యిద్దై పోతన్నారో తెలుసా! ఆ మధ్య మా అక్క వొచ్చింది. చెప్పింది అక్క డి కబుర్లు" అంది.

యీ టాపిక్ యెలా తప్పించాలా అనుకుంటుండే యెత్తుగా పొట్ట కనిపించి, వుత్సాహంగా—"యెన్నో నెల?" అన్నాడు ఆమె ముఖంలోకి చూస్తూ.

అర్థం కానట్లుగా చూస్తోంది; చూపు ముఖం మీంచి కిందికి వాల్చాడు పొట్టమీదకి.

రవంత సిగ్గుపడి, "ఐదు" అంది ముసిముసిగా.

"మొన్నొకసారి హాస్టల్ వార్డెన్ యూన్సీరాణి కనిపించి మమ్మల్ని అడిగింది" అం..

"యింకా ఆమేనా వార్డెను? నేను గుర్తున్నానన్న మాట!" అని చిన్నగా నవ్వాడు.

వొక గంటసేపు కబుర్లు అవీ యివీ.

"స్నానం చేసి వొస్తాను" అని వెళ్ళింది.

పత్రిక తీసి చూస్తున్నాడు—పావుగంటకి వొచ్చింది. జరీ అంచు వెంకటగిరి చీర.

అంతలో వాకిట్లో స్కూటర్ చప్పుడు—

రత్నాకరరావు లోనకొచ్చి, శ్రీపతిని చూసి ఆశ్చర్యపోతూ "ఆది వారం వొస్తామన్నారు?" అన్నాడు.

"అన్నంత మాత్రాన వేరే వారం రాకూడదా? మీరు లేనివేళ వొచ్చి అమ్మాయిని మేం యేవేవి యిబ్బందులు పెడుతున్నారో తెలుసుకోవద్దూ?" అన్నాడు శ్రీపతి

అహాహా అని పెద్దగా నవ్వుతూ, "యీవిడగారు నా మీద యెన్ని చాడీలైనా చెప్పగలదు మీరు వినాలేగానీ!" అన్నాడు, రత్నాకరరావు.

"ఇవాళ ఆదివారం అనుకుని వొచ్చారట మన ఫిలాసఫరుగారు!" అంది.

"యింకా నయం, మనిల్లు అనుకుని యింకెవరింట్లోకో వెళ్ళలేదు!" అన్నాడు రత్నాకరరావు.

కబుర్లు—భోజనాలు—కబుర్లు.

"మీకు టైం ఐనట్లుంది. పదండి వెళదాం." అన్నాడు శ్రీపతి.

"యీ అవర్ క్లాసు లేదు లాస్టవర్ వుంది—"అని జర్నలిజంలో వొక లెక్చరర్ గురించి అడిగితే అతని జాతకం చెబుతున్నాడు శ్రీపతి.

"మీ పంతుళ్ళ గొడవేంటండీ కబుర్లూ పాడూ లేకండా." అని శ్రీపతితో, "మీ తాతగారు పెద్దపులితో హోరాహోరీ పోరాడి పిసికిచంపేస్తారటగా!" అంది.

"అదేమో నాకు తెలియదుగానీ నేనుమాత్రం పిల్లిపిల్లనుకూడా చంపలేను." అన్నాడు శ్రీపతి.

"పిల్లిని చంపితే పాపం చుట్టుకుంటుందంటారు" అన్నాడు రత్నాకరరావు.

"యెందుకు అనివుంటారంటే—పిల్లి ని చంపటం కష్టం. మీదపడి పీకుతుంది" అని నవ్వాడు శ్రీపతి.

సంభాషణ వేట మీదకి మళ్ళింది.

"యిప్పుడు వేటంతా యువకుల మీదకి మళ్ళింది. ఆడపిల్లలతండ్రులు వేటగాళ్ళు— " అనా డు శ్రీపతి, వేట మీదినుంచి సంభాషణ తప్పించుతూ. అతనికి వేట అంటే చిరాకు.

"మా నాన్నగారెవర్నీ వేటాడలేదు." అంది రమాదేవి.

"కొందరమ్మాయిలు కన్నతండ్రులకి శ్రమకలిగించరు!" అన్నాడు శ్రీపతి హాస్యంగా.

"కలిగించక, శ్రీపతిగారిలా అన్నలుంటే వాళ్ళకి కలిగిస్తారు" అని నవ్వాడు రత్నాకరరావు.

"ఒక్కడికి మీరు శుద్ధమైనట్లు. అందులో సగభాగం మీకూ వుందిగా స్వామీ" అంది శర్వాణి

రత్నాకరరావుకి క్లాసు టైం ఐంది.

"మీరుండండి— కాసేపు నిద్రదియ్యండి. లేదూ రమతో పేకాట వెయ్యండి. గంటన్నరకి నేనొచ్చేస్తాను—" అన్నాడు రత్నాకరరావు.

"నాకూ పనుంది యూనివర్శిటీలో. పదండి" అని శ్రీపతి లేచాడు.

"యేం పని? ఫ్రెండ్స్‌తో కబుర్లేగా?"అంది.

"లేదమ్మా ఆఫీసులో పనుంది—యెట్లాగూ ఆదివారం కాదని తెలిసిందిగా?" అని నవ్వి, "ఆ పని చూసుకుని వెడతాను" అన్నాడు శ్రీపతి.

స్కూటర్ మీద వెడుతూంటే పి—హాస్టల్ దగ్గిర "హలో శ్రీపతి

అని యెవరో పిలవటం వినిపిస్తే రత్నాకరరావు వేగం తగ్గించాడు.

'నువ్వా వరాహం' అనుకుని ఆపించి దిగిపోయాడు శ్రీపతి.

"నమస్కారమండీ" అని రత్నాకరరావుని పలకరించాడు వరాహశాస్త్రి. రత్నాకరరావు రమాదేవి పెళ్ళిలో వరాహశాస్త్రి చాలా శ్రమపడ్డాడు.

"నమస్కారం—బాగున్నారా? యీమధ్య కనిపించటంలేదు?" అన్నాడు రత్నాకరరావు.

"థీసిస్ సబ్‌మిట్ చేశాను రెండు నెలల క్రితం."

"యింకా డిగ్రీ రాలేదా?"

"ఆ ఫారిన్ యెగ్జామినర్ పుస్తకాలు రాస్తూ బిజీగా వున్నారట. యింతవరకు రిప్లయ్ ఐనా రాయలేదట. చివరికి పంపుతారేమో!" అనివన్నాడు వరాహశాస్త్రి.

"అందాకా తీరికేనేమో—"అన్నాడు రత్నాకరరావు.

"లేదు సాయంత్రాలు వో ట్యుటోరియల్ కాలేజీలో పాఠాలు చెప్తున్నాను—కిళ్ళీలకి సినిమాలకి సరిపోతుందని. అన్నపానాదులంటే— కన్నవారి మీద వేసేస్తాం అనుకోండి మెన్నెళ్ళొచ్చినా!" అని నవ్వాడు వరాహశాస్త్రి.

"మీకు క్లాసుకి లేటవుతుంది" అన్నాడు శ్రీపతి.

రత్నాకరరావు స్కూటర్ ముందుకు పరుగు తీసింది.

"యేం శ్రీపతీ—అన్నట్లు, ఆ నక్క వెధవకి వుద్యోగం యిప్పించావుట కదా! అన్నాడు వరాహశాస్త్రి.

"యెవరికి?"

"ఆ యింగువగాడికి."

"అ— వోరోజు వొచ్చి నా ప్రాణం తీశాడు పట్టుకుని యెలా తెలుసుకున్నాడో ఆ కంపెనీ డైరెక్టరు నాకు తెలుసునని! కెమికల్స్ ఫ్యాక్టరీ యేవేవో యాసిడ్స్ అవీ తయారుచేస్తారు. అతనూ నేనూ యింటరు కలిసి చదువుకున్నాం. బాగా స్నేహం, ఆస్తి డబ్బూ బోలెడంత వుంది. ప్రభుత్వం నుంచి లోనూ కూడా పట్టి ఫ్యాక్టరీ ప్రారంభించాడు, మూడేళ్ళ క్రితం బాగా స్థిరపడ్డాడు. ఫ్యాక్టరీని బాగా అభివృ వో టెక్నికల్ అసిస్టెంటు వుద్యోగం ఖాళీ వుంటే మన గుంటనక్క వొచ్చి యేడిస్తేపోన్లే అని యిప్పించాను.

"వాడు థీసిస్ సబ్‌మిట్ చెయ్యలేదు."

"పేశాపనీ త్వరలో డిగ్రీ వొస్తుందనీ చెప్పాడు నాతో. అతనితో ఆ మాటే చెప్పాను నేను."

"పీక్కికి గైడ్‌కి గొడవైంది. స్టేషనరీ యెక్విప్‌మెంటుల కంటింజెన్సీ డబ్బులో పిడి. గైడుకి వాటా. మరి వీడూ ఖర్చుపెట్టకండా దొంగబిల్లులు ప్రొడ్యూస్ చేస్తాడుగా ; ఆ వాటాలో యేదో పేచీ వొచ్చింది. తెలుసుగా! అది మరికాస్త పాకం ముదిరి—తను చేసిన వర్క్ అంతా గైడ్ కొట్టేసుకుని కూచున్నాడని వీడూ, యెంత తోమినా వర్క్ చెయ్యలేకపోతున్నాడని గైడూ—నానా గొడవై చివరికి అట్లా అయిపోయింది." అన్నాడు వరాహశాస్త్రి.

మాట్లాడుతూ కేంటీన్ దగ్గిరికి వొచ్చారు.

"యేమండి వొచ్చావా?" అన్నాడు శ్రీపతి.

"అదే, ఆ ఫారిన్ యెగ్జామినర్ రిపోర్టు వొచ్చిందేమో తెలుసుకుపోదామనీ వొచ్చాను. యింకా తగలడలేదట"

"నమస్కారం శాస్త్రిగారూ"

"హలో భద్రం, బావున్నావా?" అని శ్రీపతి వంక తిరిగి, "యితన్ని దర్భా వీరభద్రరావని మా వూరే. తెలుగు యెం. యే. లో చేరాడు యీ యేడు" అన్నాడు వరాహశాస్త్రి.

"అలాగా, తెలుగులో యెం. యేలో యిప్పుడేంపేం చెబుతున్నారు?" అన్నాడు శ్రీపతి.

అతను వివరించటం మొదలెట్టాడు.

"కొమ్మరో వానికెంత బిగువే—పిలచిన పలుకకున్నా దేమి సేయుదునే" అని శ్రీనివాసయ్యంగార్ ఖమాస్ జావళీ గొంతులో శృతించుకుంటూ వింటున్నాడు వరాహశాస్త్రి.

శ్రీపతి కుడిచేతి చూపుడువేలి కణుపుతో పెదవి నొక్కుంటూ వింటూ "ప్రబంధాలన్నీ వుంటాయా?" అన్నాడు.

"వుంటాయండీ. మనుచరిత్రా, భారతమూ, శృంగార నైషధమూ ........" అని ప్రారంభించాడు అతను.

'పంచమ వేదానికెంత క్షుద్ర వైభోగం పట్టిందీ దర్భకుర్రాడి చేతుల్లో అనుకుంటూ నవ్వుకున్నాడు శ్రీపతి.

అంతలో కులశేఖరరావు వొచ్చాడు.

"హలో శ్రీపతీ, హలో శాస్త్రీ—మన అంకినీడు సినిమా చతికిల పడిందట కదా—యెమర్జన్సీని సమర్థిస్తూ సినిమా తీస్తే అంతకాక మరేమవుతుంది! ఆవిడని సమర్థిస్తే మరేమవుతుంది!" అన్నాడు కులశేఖరరావు.

"అందుకు పోయివుండదు. మదిటిరాత బాగోక పోయివుంటుంది" అన్నాడు వరాహశాస్త్రి—

"యీ రెంటి వల్లాకాదు. పరమ అతుకుల బొంతగా తయారైంది అది! వొక్క ట్యూనూ యేరకంగానూ వెంటాడేలా లేదు ఆడవాళ్ళకి బట్టలూడదీసి నానా ఖంగాళీ చేస్తే సినిమా హిట్ అవుతుందా? వారపత్రికలాగే సినిమాలను పోషించేదికూడా స్త్రీలే. రోజూ స్నానించేటప్పుడన్నా బట్టల్లేకండా వాళ్ళ వొళ్ళు వాళ్ళు చూసుకుంటూనే వుంటారు. మగాళ్ళు నూటికి తొంభయ్ మంది స్త్రీ వొంటు తెలిసినవాళ్ళే. పూర్తిగానో, అవసరం మేరకో బట్టలూడదీస్తూనే వున్నారు. చిత్తకార్తి వెధవ వూరికే వీడి చిత్తకార్తితనాన్ని తెరమీద వెళ్ళగక్కితే హిట్ ఐపోతుందనుకున్నాడు. దానికితోడు అశకవి క్రైమూ గట్రా జోడించాడు. అంత తేలికా సినిమా హిట్ అవటం? సినీమహామహులే వొక్కోసారి దిక్కు మొహాలేస్తున్నారు. ముందు హైందవ సెంటిమెంటుతో ప్రేక్షకుల్ని కట్టిపడెయ్యాలి ఆ తరవాత మూడు నాలుగు వయసుల అభిరుచుల పాత్రల్ని కుటుంబ చట్రంలోకి అల్లాలి. ఆర్థాలూ, అపార్థాలూ, గృహచ్ఛిద్రాలు కలబోసి, అప్పుడు కొత్త సెక్సు లోషనూ, క్రైమూ పూసి, తిరిగి చెడి బుద్ధొచ్చే మగాడూ, యెంత తిరిగీ చెడకండా ఆ మీరా రక్షించుకుంటున్న ఆడదీ—నిఖార్సయిన నూటశాతం విలనీ మనుషులూ సర్వలక్షణమైన నూరు శాతం పరమ మంచితనం పాత్రలూ గట్రా వుండి—నానా రసాల మసాలా మహామాయగా తెలివిగా కూరి అందించాలి. లేదంటే భారీ చిత్రాలజోలికి పోకండా లోబడ్జెట్ చిత్రం యెంచుకుని సర్కారు వారి లోను కొంత పుచ్చుకుని సింపుల్‌గా స్ట్రైకింగ్ లాంటి సినిమా వారం రోజుల్లో లాగిపారేసెయ్యాలి. పాపం చిక్కుల్లో పడిన చిన్నదాన్ని చూపెట్టబోయి మన అంకినీడు చిక్కుల్లో పడిన చిన్నవాడయ్యాడు" అన్నాడు శ్రీపతి.

# 105

మోహన్‌రెడ్డి సాయంత్రం బజారుకి వెళ్ళి రాత్రి యెనిమిదింటికి తిరిగి వొచ్చాడు. తాళం వేసి వుంది. తీసి, కావేపు కుర్చీలో కూచున్నాడు. గాయత్రి యింట్లోంచి బయటికే కదలటంలేదు. అతను బలవంతంగా కదలదీస్తే తప్ప.

యెక్కడి కెళ్ళిందబ్బా—అనుకుంటూ వంటగదిలోకి వెళ్ళి చూస్తే, వంట చేసిన ఛాయలేమీ లేవు. వంట ప్రారంభించాడు. అరగంటలో ముగించాడు. యెనిమిదీ ముప్పావు. ఆకలిగా వుంది. వొక్కడికే తినబుద్ధవటంలేదు. మరో పావుగంట, యెదురు చూశాడు, వో పత్రిక తిరగేస్తూ.

'వాళ్ళింటికెళ్ళి—వాళ్ళు కబుర్లు చెప్తావుంటే వుండిపోయినదేమో,—అనుకుంటూ లేచి, తాళం వేసి వెళ్ళాడు. తలుపులు వేసి వున్నాయి. యింట్లో దీపాలు కూడా వేసిలేవు. రెండు మూడు నిమిషాలు గమనింపుగా చూసి—గేటు తీసుకుని, తలుపు తట్టాడు.

"యెవరూ?" అని గాయత్రి తండ్రి రామనాథం గొంతు,

"నేను మోహన్‌ని"

తలుపు తెరుచుకుంది.

"రా బాబూ."

"గాయత్రి వున్న ఛాయలేం కనిపించలేదు అతనికి. రామనాథం నిద్రలోంచి లేచివొచ్చాడు. సాధారణంగా గాయత్రి వాళ్ళింట్లో వుండిపోదు. అందునా ప్రస్తుతపు మూడ్‌లో.

"గాయత్రి ఏ ఫ్రెండ్ యింటికెళ్ళింది. యింకారాలే. వొస్తూవొస్తూ యిక్కడికొచ్చి మాట్లాడతా వుండిపోవదేమోనని వొచ్చా"అన్నాడు మోహన్‌రెడ్డి.

'అబ్బే. నాలుగు రోజుల నాడు మీరిద్దరూ కలిసి రావడమే—"

మధ్యలోనే అందుకుని, "ఆ ఫ్రెండ్ యింట్లోనే వుండివుంటది. అక్కడికి వెళ్ళి తీసుకొస్తాన్లే." అని బయటికి వొచ్చాడు మోహన్‌రెడ్డి.

నడిచి యింటికొచ్చి తలుపువంక చూశాడు. తాళం వేసేవుంది. నీరసంగా తాళంతీసి కుర్చీలో కూలబడ్డాడు.

పది నిమిషాలు.

వాకిట్లో చప్పుడైంది. అమాంతంలేచి గుమ్మంలోకివెళ్ళాడు. యెవరూ లేరు.

వొచ్చి కూర్చున్నాడు.

అడుగుల చప్పుడు.

మళ్ళీ లేచి వెళ్ళాడు యెవరో వీధిలో నడిచి వెళుతున్నారు వాకిలి ప్రక్కగా.

మళ్ళీ లోనకి వొచ్చాడు.

ఐదు నిమిషాలు.

గుమ్మంలో అలికిడి.

గబుక్కున లేచి వెళ్ళాడు.

యెండుటాకు గాలికి కదిలిపోయిన చప్పుడు.

మళ్ళీ వొచ్చి కూచున్నాడు.

నలభయ్ సెకండ్లు.

గుమ్మంలో శ్వాన గట్టిగా పీల్చిన నవ్వడి.

గిరుక్కున తిరిగి చూశాడు. యెవరూ లేరు.

కుర్చీ వాకిట్లో వేసుకు కూచున్నాడు.

పది నిమిషాలు.

తాళంవేసి, వీధిలో నడిచాడు కొనవరకు....వుహూఁ.

అటువైపునుంచి వొచ్చిందేమో— అనిపించి చకచకా అడుగులు వేస్తూ యింటిదగ్గిరి కొచ్చాడు. తాళం.

తాళం తియ్యకుండా వాకిట్లోకూచునిపోయాడు.

అరగంట.

ప్రస్తుతపు మూడ్‌లో తను యెక్కడికి కదలటం లేదు. ఆఖరికి విరసం కార్యాలయానికి కూడా వెళ్ళటం లేదు. "శ్రీపతి దగ్గరకు వెళ్ళివుంటది" అనుకుని బయల్దేరాడు. వీధి చివరందాకా వెళ్ళాక, 'యింతలో తను వొస్తే—' అనుకుని, తిరిగి వొచ్చి తాళం తీసి, "నీకోసం శ్రీపతి దగ్గరకు వెళ్తున్నా— అక్కడికి వెళ్ళినావేమోనని. వెంటనే తిరిగి వొచ్చేస్తాను." అని చీటీ రాసి గుమ్మంకి లోపలి పక్క నేలమీద లావుపాటి పుస్తకం పెట్టి దానిమీద చీటీపెట్టి పేపర్ వెయిట్ పెట్టాడు.

తాళంవేసి రిక్షా యెక్కి శ్రీపతి యింటికి వెళ్ళాడు.

తలుపులు తెరిచి వున్నాయి. లైటు వెలుగుతుంది.

మోహన్‌రెడ్డిని చూసి, చదువుతున్న సిడ్నీ జొరార్డ్ పుస్తకం "ది ట్రాన్స్‌పరెంట్ సెల్ఫ్" మూసి, "యేమయ్యా మోహనం యెలా వుంది నీ న్యాయ వాదనం?" అని. "గాయత్రి యేం చేస్తోంది? యింకా యింట్లోంచి బయటికి రాకుండా అలాగే వుండిపోతుందా? యేదో చెయ్యాలి మోహన్. ఆ స్థితిలో యెక్కువ కాలం వుండటం మంచిదికాదు." అన్నాడు శ్రీపతి.

విషయం చెప్పాలనిపించినా, 'దీన్కి నాతోపాటు తనుకూడా వర్రీ అవటం—అనవసరంగా—' అనుకుని, "అవును యేదో చెయ్యాలి. లెట్ అజ్ థింక్ యెబౌట్ యిట్. వస్తా. వూకినే వొచ్చినా." అని లేచాడు మోహన్‌రెడ్డి.

"కూర్చో—"అన్నాడు శ్రీపతి.

"యింట్లో వొక్కతే వుంటది."

"అవునవును యీమూడ్‌లో వొక్కతెనే వొంటరిగా యెక్కువసేపు వుండనివ్వక" అన్నాడు శ్రీపతి.

మోహన్‌రెడ్డి లేచాడు.

"యీ జనవరి రాత్రి చలిలో ఆ సన్నటి స్లాక్‌తో తిరుగుతున్నావా!" అని లేచి స్వెటర్ తీసి యిచ్చాడు శ్రీపతి.

తొడుక్కుని బయటికి వొచ్చాడు మోహన్‌రెడ్డి.

నడుస్తున్నాడు, చలిగాలి.

వుస్మానియా ఆస్పత్రి. యెమర్జన్సీవార్డులో అడిగాడు. అక్కడినుంచే గాంధీ ఆస్పత్రికి ఫోన్ చేయించి అడిగాడు. వుహూఁ.

నడుస్తున్నాడు.

వుక్కగా అనిపించి స్వెట్టర్ తీసి భుజాన వేసుకున్నాడు. రిక్షా పిలచగానే యెక్కి యింటికి చేరుకున్నాడు. తాళం వేసేవుంది. తాళం తీశాడు. అక్కడ పెట్టిన పుస్తకం అలాగే వుంది. వెంటనే తాళంవేసి, వీధిలోకి వొచ్చి నడుస్తున్నాడు.

చటుక్కున బుర్రలో వో ఆలోచన వొచ్చి, పోతున్న రిక్షా అతనిని పిలిచాడు కట్టిగా అరిచి.

రిక్షా ఆగింది. వెనక్కి తిరిగి రాకముందే గబగబా అడుగులువేసి రిక్షాలో కూచున్నాడు.

## అనుషంగికం - 2

ఆ యేరియా పోలీస్‌స్టేషన్ దగ్గర రిక్షా దిగి డబ్బులిచ్చి—స్టేషను వాకిట్లోకి వెళ్ళాడు. బయట—నుంచున్న వున్న వోవర్ కోట్ తొడుక్కొని తుపాకీ పట్టుకుని కూచునివున్న పోలీసుని, "యీ పొద్దు పయనులో వున్నా మెను యెవరినైనా అరెస్టు చేసిన్రా?" అని అడిగాడు, మోహన్‌రెడ్డి.

"యెవ్వర్ని అరెస్ట్ చెయ్యాలె. అరెస్టులు చేసెడిదె మా పనా యేమి?" అని విసుక్కున్నాడు పోలీసు.

"యస్సై వున్నారా?"

"యింట్ల పెండ్లాం పక్కలో వున్నడు" అని నవ్వాడు పోలీసు.

నడుస్తున్నాడు.

మరో పోలీస్టేషను మరో పోలీస్టేషను మరో పోలీస్టేషను మరో పోలీస్టేషను.

కొన్ని పోలీస్‌స్టేషన్ల దగ్గర జవాబు చెప్పించుకోవటానికి అరగంటా గంటా సమయం పట్టింది.

వుదయం యెనిమిదిన్నర.

యింకో పోలీస్టేషను. సిటీలో మిగిలివున్న స్టేషను అదొక్కటే.

లోనకి వెళ్ళాడు. యస్సైని అడిగాడు. ఆ యస్సై అనివరకు గాయత్రిని అరెస్టు చేసిన యస్సై.

"యెవడితో లేచిపోయిందో వాణ్ని వెతికి పట్టుకో— యెక్కడికి చెక్కేసిందో—వాళ్ళ బందరుకియెగిరిపోయిందేమో చిలక—పోయివెతుకు" అన్నాడు ఆ యస్సై పరిహాసంగా.

"మాటలు జాగ్రత్తగా రానియ్"

"జాగ్రత్తగానే మాట్లాడాను. జాగ్రత్తగావొచ్చిన మాటలే. బూతులు వినాలని వుంటే చెప్పు నాయనా వినిపిస్తాను. నీపెళ్ళాంకి భలే సరదాలే నా బూతులంటే!"

మోహన్‌రెడ్డికి, లాగి లెంపమీద కొట్టాలనిపించిందిగానీ తమాయించుకున్నాడు—ఆ పని చేస్తే తనని లాకప్‌లోపెడితే గాయత్రి విషయం తెలియకుండా దాన్లో పడి వుండాల్సొస్తుందనిపించి.

ముషీరాబాద్ జైలుకి వెళ్ళాడు. అక్కడ జెయిల్లో వున్న రచయితలు, రాజకీయ నాయకులు తదితరులు కొందరు తెలుసు. కొందర్ని యెల్లాగో కలుసుకుని ఆచూకీ తీశాడు. ఆ రోజు యే స్త్రీని తీసుకురాలేదన్న

తెలుసుకున్నాడు.

చంచల్‌గూడా జైలుకి వెళ్ళాడు. అక్కడ తెలిసినవాళ్ళు తక్కువ రెండు గంటలసేపు అవస్థపడి, యే స్త్రీని ఆ రోజు తీసుకురాలేదని తెలుసుకున్నాడు.

యింపట్సెవ్‌గా యే సినిమాకో వెళ్ళి పొద్దుపోయి యింటికి వొచ్చిందేమో—అన్న ఆలోచన వొచ్చి గబగబా నడుస్తూ, ఖాళీ ఆటో కనిపించగానే కూచుని యింటికి చేరుకున్నాడు. తాళం వేసేవుంది. తలుపు తెరిచాడు. పుస్తకం అలాగే వుంది. తాళం వేసి అదే ఆటోలో కూచుని తిన్నగా శ్రీపతి దగ్గిరికి వెళ్ళాడు.

తలుపు తట్టిన చప్పుడుకి మెలుకువ వొచ్చిన శ్రీపతి, కళ్ళు నులుముకుని లేచి—తలుపు తెరిచాడు

మోహన్‌రెడ్డి వాలకం చూసి, "యేఁవిఁటి అలా వున్నావ్?" అన్నాడు శ్రీపతి.

విషయం చెప్పాడు క్లుప్తంగా.

చూపుడు వేలు కణుపుతో పెదవి నొక్కుకుంటూ యెటో చూస్తూ వుండిపోయాడు శ్రీపతి.

మోహన్‌రెడ్డి కుర్చీలో కాళ్ళుపెట్టుకుని మోకాళ్ళమీద ముఖంఆనించుకున్నాడు.

పది నిమిషాలు.

"మోహన్ లేచి ముందు స్నానం చెయ్యి." అని బలవంతంగా బాత్రూంలోకి పంపించాడు.

యిద్దరూ కాలకృత్యాలు ముగించారు.

తలుపు తాళం వేసి. నడుస్తూ. రిక్షా కనిపించగానే కూచున్నారు. తాజ్ దగ్గిర ఆపించాడు శ్రీపతి.

లోపలికి వెళ్ళారు.

యిడ్లీ దోశ చెప్పాడు శ్రీపతి.

మోహన్‌రెడ్డి, ఆకలిగా లేదు, తిననన్నాడు.

"రాత్రి ఆ భోజనం ఐవుంటుంది. తెల్లవార్లూ తిరుగుతున్నావు, టీ పిక్లైనా తాగి వుండవు. ఆకలిగా అనిపించదులే. గాయత్రికేం అవదు. షి కెన్ మేనేజ్, యేం చెయ్యాలో ఆలోచిద్దాం." అని బలవంతంగా అవి

తినిపించాడు— లేకపోతే తనూ తినను—అని.

కాఫీ తాగి బయటికి వొచ్చారు. వదుస్తున్నారు.

"అరెస్ట్ చేసి గప్‌చిప్‌గా యెటో తీసికెళ్ళివుంటాడు" అన్నాడు శ్రీపతి.

"యెటు తీసుకుపోతారు యిక్కడ కాకుంటే —రాజమండ్రి, విశాఖ వరంగల్" అన్నాడు మోహన్‌రెడ్డి.

"యిట్ యీజ్ క్వొయిట్ పోసిబిల్." అన్నాడు శ్రీపతి.

"వరంగల్‌లో దోస్తులున్నారు. పోయి తెల్సుకొనివస్తా." అన్నాడు మోహన్‌రెడ్డి.

"యీ మూడ్‌లో వొక్కడివీ వొద్దు తోడు అవసరం. కూడా వొస్తాను" అని ఆటో పిలిచి, మోహన్‌రెడ్డి యింటి వీధి చెప్పాడు శ్రీపతి.

"వూళ్ళో పోలీస్టేషన్లూ జైళ్ళూ చూశాం నీ ఆచూకి లేదు. యెవ రింట్లోనూ నీ ఆచూకీ లేదు. వరంగల్ రాజమండ్రి జైళ్ళలో కనుక్కోవ టానికి వెడుతున్నాం. వొకవేళ వొస్తే యింట్లో విశ్రాంతంగా వుండు. బెటర్, మీ అమ్మగారింట్లో." అని స్లిప్పు శ్రీపతే రాశాడు.

తాళం వేసి బయిటికొచ్చారు.

దారిలో సుల్తాన్‌బజార్ కోఠీలో ఆపించి, తనొక్కడే ఆంధ్రాబ్యాంకు లోకి వెళ్ళి, రెండు వేల రూపాయలు డ్రా చేసుకుని వొచ్చాడు శ్రీపతి. వొచ్చి ఆటోలో కూచుని, "బస్‌డిపోకి" అన్నాడు.

వరంగల్ చేరేసరికి నాలుగైంది.

మోహన్‌రెడ్డికి అక్కడ తెలిసిన విరసం మిత్రులు యెక్కువగా వున్నారు. కొందరు అక్కడే జెయిల్లో వున్నారు.

సాయంత్రం అరింటికల్లా తెలుసుకోగలిగారు — గాయత్రి అక్కడ లేదని.

యేడింటికి హొటేల్లో భోజనంచేసి రాత్రి రయిల్లోబయల్దేరి మరనటి రోజు వుదయం రాజమండ్రి చేరుకున్నారు. అక్కడ వూళ్ళో శ్రీపతికి తెలి సిన వాళ్ళున్నారు. వొకరిద్దరు డాక్టర్లు, లాయర్లు.

బాగా వలుకుబడి వున్న లాయరు దగ్గిరకి బయల్దేరారు, శ్రీపతి. యేదో చుట్టరికం. మోహన్‌రెడ్డిని పరిచయంచేసి విషయం చెప్పాడు. జైలు సూపర్నెంటు ఆ లాయరుకి మంచి మిత్రుడుట— ఫోనుచేసి కనుక్కున్నాడు

అలాంటిదేం లేదని చెబితే, "వెళ్ళి కనుక్కుంటే—" అన్నాడు శ్రీపతి.

"డోన్ట్ బి సిల్లీ మైబోయ్. నా క్లోజ్ ఫ్రెండ్. గొంతు కూడా వీర పడను. సరే— అనుమానం పెనుభూతం కదా— యింకో గంటకి కోర్టుకి వెళ్ళాలి నేను. మీరు జైలుదగ్గిర వుండండి. నేను వొచ్చి స్వయంగా కను క్కుంటాను." అన్నాడు.

గాయత్రి అక్కడ లేదని రూఢి ఐంది. విశాఖ ప్రసక్తి తెస్తే "వో లాయర్ ఫ్రండ్‌కి లెటరిస్తాను వెళ్ళు" అన్నాడు.

సాయంత్రానికి విశాఖపట్నం చేరుకున్నాడు. లాయరు క్లబ్బుకి వెళ్ళ బోతున్నాడు. లెటర్ చూసుకుని, కారు వీళ్ళని నేరుగా జైలు సూపరింటెం డెంట్ దగ్గిరికి తీసికెళ్ళి విషయం చెప్పి, "కేవలం యిన్‌ఫర్మేషన్‌స్వామీ. మరే యితర సహాయం అక్కర్లేదు" అని నవ్వాడు లాయరు.

అక్కడా లేదని తెలిసింది.

మరసటిరోజు సాయంత్రానికి వూరు తిరిగివొచ్చారు. రైలు స్టేషన్ నుంచి తిన్నగా మోహన్‌రెడ్డి యింటికి వెళ్ళారు. తాళం తీశారు. పుస్తకం అలాగేవుంది. తాళం వేసేసి, మోహన్‌రెడ్డిని యింటికి తీసుకొచ్చాడు శ్రీపతి.

"మోహన్ నువ్వు నాతోపాటు యిక్కడే వుండు గాయత్రి ఆచూకి తెలిసేదాకా" అన్నాడు శ్రీపతి.

మోహన్‌రెడ్డి కళ్ళల్లో తడి వుబికింది.

లేచి అతని దగ్గిరికి వెళ్ళి అతని భుజంతట్టి, "రివల్యూషనరీవి అలా నీరు కారిపోతే యెలా? గాయత్రి అంటే నీకెంతిదో, నువ్వంటే గాయత్రి కెంతిదో నాకుతెలుసు. మీపరస్పరానురాగం, నీధైర్యాన్ని సడలించకూడదు" అన్నాడు శ్రీపతి.

ఆ సాయంత్రం మోహన్‌రెడ్డి బజారుకి వెళ్ళిన పావుగంటకి వొక కుర్రాడు యింటికి వొచ్చి గాయత్రితో. "మదతి మా చిన్నాయన కూతురు. మా అక్క యేదో పర్సనల్ ప్రోబ్లెమ్‌ల చిక్కుకున్నదట. పబ్లిక్ గార్డెన్ పక్కనున్న స్విమ్మింగ్ పూల్ పక్కన వున్నది. మిమ్మల్ని వెంటనెవొచ్చి తనను కల్వమన్నది. మర్లా గంట పేపైతె అడగూడ వుండెదానిక్కి వీలు కాదట" అని చెప్పాడు.

ఆ కుర్రాడికి పదిహేనేళ్ళుంటాయి.

విని, "నేనెవరో తెలుసా?" అంది గాయత్రి.

"తెల్సు మీరు గాయత్రిగారు. మా అక్క యెప్పుడూ మీ గురించి చెప్తుంటది" అన్నాడు.

గాయత్రి వెంటనే బయల్దేరింది

గాయత్రి రిక్షా యెక్కింది. అతను అలాగే నిలుచుంటే, "నువ్వు రావటం లేదా" అంటే, "యేమిటిక్కాము? వెంటరమ్మన్నది." అని రిక్షా కూచున్నాడు.

రిక్షా స్విమ్మింగ్‌పూల్ దగ్గిరికి చేరేసరికి యెనిమిదిన్నర దాటింది.

స్విమ్మింగ్‌పూల్‌కి కుడి పక్కగా నడిచి, "యీడ్నే వుంటనన్నది" అన్నాడు సుపతి లేదు.

రెండు నిమిషాలు అటూ యిటూ చూసి, "ఆ పక్కనున్నదేమో" అని అటు వైపుకి నడిచాడు. గాయత్రి కూడా అడుగులు వేసింది.

మసక చీకటి.

అమాంతం గాయత్రి తలమీద నల్లని కంబళి పడింది. భుజాల చుట్టూ చేతులు. నోటిమీద బలంగా అరిచెయ్యి. మరో రెండు చేతులు మోకాళ్ళ చుట్టూ.

మరు నిమిషంలో గాయత్రి, ఆ పక్కనే వున్న పోలీస్ కంట్రోలు రూంలో, వెనక భాగం చీకటి గదిలోవుంది

నలుగురు పోలీసులు.

నోట్లో గుడ్డ కూరి మూతికి బట్ట బిగించారు. చేతులు వెనక్కి విరగ దీసి, కాళ్ళు రెండూ కలిపి, తాళ్ళతో కట్టారు కళ్ళకి నల్లటి బట్ట గంత కట్టారు.

అరగంటకి పోలీసు దుస్తుల్లో వున్న వొక వ్యక్తి, వో యింజక్షన్ చేశాడు, గాయత్రికి.

మోహన్‌రెడ్డి తండ్రి అభిమానంతో పినతండ్రి పూనుకుని వాళ్ళ బంధువు మినిస్టరుతో చెప్పించి మీసా కింద అరెస్టు చేయించి, రికార్డు లేకుండా వుంచి—మోహన్‌రెడ్డికి ఆమె ఆచూకీ తెలియకూడదనీ, చచ్చిపోయి నట్లు అతను అనుకోవాలని విశదపరిచాడు. పైనుంచి వొచ్చిన ఆదేశాల ననుసరించి పోలీసు వున్నతాధికారి ఆర్డర్స్ ప్రకారం వొక యస్సైకి యీ పని అప్పగించాడు.

ఆ

ఆ తరవాత ఆమెని అక్కడి నుంచి యెక్కడికి తరలించింది

కంట్రోల్ రూంలో వాళ్ళకే తెలియకుండా ఆమెని బయటికి తీసికెళ్ళి జీపులో

వెళ్ళాక ఎస్పై వొక్కడే ఆమెని నిజామాబాద్ జైలుకి తీసికెళ్ళాడు.

ఆమెని జీపులో తాళ్ళతో కట్టేశాడు — అంతకు ముందు కాళ్ళూ

చక్కం, ... కట్టేసి కళ్ళకి గంతలు కట్టటం కాక.

గాయత్రికి స్పృహ వొచ్చేసరికి — యేదో వాహనంలో వున్నట్లు

లారీ ...ప్పుడు కదలిక గ్రహించింది.

వాసన, చప్పుడు తప్ప మరేమీ సాధ్యం కావటం లేదు

తెల్లవారుఝామునకి గాయత్రి నిజామాబాద్ జెయిల్లో వుంది. ఆ యస్పై జీపు మరల్చుకుని మధ్యాహ్నానికి సిటీకి వొచ్చేశాడు

గాయత్రి నిజామాబాద్ జైల్లో వున్నట్లు వొక పోలీసు వున్నతాధికారికీ ఆ యస్పైకీ మాత్రమే తెలుసు. నిజామాబాద్ జైల్లో ఆ యిస్పై ఆమె పేరు గాయత్రి అని కాక భారతి — అని చెప్పాడు. పదిరోజుల క్రితం ఆ భారతిని చేర్పినట్లు రికార్డులో రాయమన్నాడు పై అధికారుల ఆదేశాలు చెప్పి. ఆ జైలు అధికారి, అసలేనీ రాయకుండా అనామతుగా వుంచాడు, యెందుకైనా మంచిదని.

తరవాత జైలు అధికారిని అడిగింది గాయత్రి — తనని యే కారణాలవల్ల జైల్లో వుంచిందీ. "అవన్నీ మాకెట్లా తెలుస్తయ్యమ్మా. హోం డిపార్ట్‌మెంటుకి పోలీసు అధికారులకి తెలుసును" అన్నాడు ఆజైలు అధికారి యింగ్లీషులో,

ఐతే ఆమెకి జైల్లో వొక నంబరిచ్చాడు. అంటే సామాన్య ఖైదీ లెక్కన కాబోలు — అనుకుంది.

వాళ్ళందర్నీ స్టెన్‌గన్‌తో టపటపా పేల్చేసి బయటికి రావాలని గాయత్రిలో రక్తం మరుగుతోంది.

రెండు రోజులు లోపలి పరిసరాలన్నీ గమనించింది.

దీన్లోపల నేను నిస్సహాయంగా వుండిపోతే పిచ్చెక్కి చచ్చిపోవటం ఖాయం .. అనుకుంది.

ఆవరణలో వొకచోట వొక రాడ నేలలోకి దింపివుంది. వూపిచూస్తే కదిలినట్లుగా అనిపించింది.

పదో రోజున సన్నటి తీగముక్క వొకటి దొరికింది ఆవరణలో.

దాన్ని చాటుగా తీసి చంకలో నొక్కిపెట్టి వుంచి తనని మూసివుంచే కూపం లోకి తెచ్చింది.

రాత్రుళ్ళు కాపలాదారు కూమని కునుకు తీస్తున్న వేళ చూసి, కట కటాలలోంచి చేతులు బయటికి పెట్టి, ఆ తీగతో తాళం తియ్యటానికి ప్రయత్నించింది. వూడిరాలేదు.

మూడు రాత్రులు వీలున్నప్పుడల్లా ప్రయత్నించగా మూడోనాడు తీగతో తిప్పుతూంటే చటుక్కున తాళం వూడింది.

చప్పుడవకుండా గడియతీసి బయటికొచ్చి మళ్ళీ గడియవేసి తాళం తగిలించింది.

వొక మూలగా నక్కి చుట్టూ గమనించుకుంది.

యెలాగైతేనేం పావుగంటకి జైలు ఆవరణలో వుంది.

తెల్లవారుజాము మూడున్నర వేళ. రాటి కదిల్చింది. ఐదు నిమిషాలు ప్రయత్నించి పెకిలించింది. అంతగా బరువు లేదు. మోసుకుని జైలు వెనకవైపు గోడదగ్గిరికి చేరింది.

స్కూల్లో కాలేజీలో స్పోర్ట్సు బాగా ఆడేది. లాంగ్‌జంప్, హైజంప్ పోల్‌జంప్‌లలో నేర్పరి.

గోడకి ప్రక్కగా వొకచోట యెత్తుగా వున్న స్థలంలోకి వెళ్ళి— 'జంప్ చెయ్యగలిగితే — అవతలేముందో కందకమో అగాధమో చావో బతుకో యేదో వుంటుంది. యేదైనా సరే—' అనుకుని రాటి పట్టుకుని పైకి గాలిలోకి లేచింది. ఆ వూపుకి గోడ అంచు దగ్గిర కాక ఇంకా అవతలికి వెళ్ళింది—కిందకి దూకింది.

బురద, పొదలు. కందకంలాంటి మురగడం. దాన్లోంచి బయటపడి నడవటం మొదలెట్టింది.

పరిగెత్తాలనిపించిందిగానీ—యెవరన్నా చూస్తే యే దొంగో పారిపో తున్నట్లు అనుకుంటే కష్టం—అనుకుని వడివడిగా నడుస్తోంది.

జైలుకి అటువైపున వూరు లేదు. నిర్జన ప్రదేశంలాంటిది.

వొంటినిండా—బురద, చిన్న చిన్న పుల్లలు, ముళ్ళు, ఆకులు.

పరిసరాలు దాటింది. నిర్జన ప్రదేశం. పరుగు ప్రారంభించింది. ఆ పరుగు, జైలు శిక్ష నుంచి తప్పించుకోవటానికి పారిపోయే పరుగు కాదు. పిరికితనం పరుగుకాదు. వొంట్లో రక్తం మరుగుతోంది. అంతఃకరణలోనూ

యింకా వుదయించని సూర్యుడులమె బుర్రలో వెలుగుతున్నాడు యెర్రగా.

అతీత వ్యవస్థా ఆదర్శ మహా అవ్యవస్థా దిఙ్మండలం వైపు కత్తి వదును దొంతర్లు పేర్చికా ప్రవాహాన్ని వెంబడిస్తూ—తనలో వుదయించి వస్తే వుప్పెనించి యెక్కడితో వుదయిస్తున్నట్లుగా తన అణువణువులో స్పందిస్తున్న అరుణారుణోదయానికి నమతారుణోదయానికి తరుణారుణోదయానికి మహత్ శక్తిలా మహోద్వేగంగా యెగిసిపోతోంది.

వర్గ వైషమ్యానికి కసికి కసికి యెంతో యెత్తుగా యెగిసిపడుతున్న ఆమె, మహాజ్ఞాత వాస సాయుధ ఆరణిలా రగులుతోంది. జ్వలిస్తోంది—యీ సమస్త వ్యవస్థనీ మసిగా తగలబెట్టేసే కార్చిచ్చులా.

చలిలో, చర్మం చీరుకుపోయిన నెత్తుటి చారికల్తో, బెణికిన మోచేతితో బురదతో, ముళ్ళతో, ఆకుల్తో, చిరిగిన బట్టల్తో ; పరిగెత్తుతోంది— మండుతున్న నెత్తురు జ్వాల యెగిసినట్లు, తగలబడుతున్న అడవి పరుగిడుతున్నట్లు గాయత్రి పరుగిడుతోంది ; రోడ్లకీ వాహనాలకీ వూళ్ళకీవాడలకీ దూరంగా పరుగిడుతోంది.

సూర్యోదయం వేళకి యీ వ్యవస్థ రక్షకులకి అందని తీరానికి చేరి.. అడవి గిరుల వెనక వుదయిస్తున్న సూర్యబింబంలోకి గెంతింది— కోటిరెట్ల శక్తితో, వుత్తేజంతో, జ్వలనంతో.

# 106

**అనంత్‌రెడ్డి,** స్వప్నరాగలీనల పెళ్ళికి బయల్దేరాడు శ్రీపతి.

మార్చి నెల. పగటి వేళలు బాగా వేడిగా వున్నా, రాత్రులు వేడిగానూ చ గానూ కాకంతా హాయిగా వుంది. బస్సు ప్రయాణం—రాత్రి యెనిమిదింటికి బస్సు బయల్దేరింది.

అప్పుడు అనంత్‌రెడ్డి అమెరికా నుంచి తిరిగొచ్చి సిటీకొచ్చిన మరనటి రోజునే స్వప్నరాగలీన, వాళ్ళ వూరు — యేలూరు దగ్గిర శ్రీపురం వెళ్ళింది.

ఆ రెండో రోజున అనంత్‌రెడ్డి వాళ్ళ వూరు నగరకొండ వెడుతూ, పెళ్ళిలోగా యిద్దరేమూ యిక్కడకి రాకపోవొచ్చు. నువ్వు తప్పకంతా

పెండ్లికి వొస్తావు కదూ! స్వప్న యెవరినీ పిలవటం లేదు. నీకు మాత్రం చెప్పమంది" అని అన్నాడు రైలు కదలబోతుండగా.

అనంత్‌రెడ్డి తిరిగి వొచ్చారు స్వప్నరాగలీనని కలుసుకున్న రెండు సార్లలో రెండోసారి "పెండ్లికి మీవాళ్ళు వొప్పుకోకపోతే" అన్నాడు.

"నేనూ మిమ్మల్ని అదే అడిగితే" అంది.

"ముందు నేను అడిగాగా ముందు నువ్వే చెప్పు" అన్నాడు.

"వో పని చేద్దాం. యెవరం యేం చెయ్యదలచిందీ రాసిపెట్టుకు చూద్దాం" అంది స్వప్న రాగలీన.

అనంత్‌రెడ్డి జేబులో — పెన్నువుంది. యేవో బిల్సు కాగితాలు వున్నాయి. వో బిల్లు కాగితం రెండుగా చించాడు.

ఆమె రాసిన కాగితం అతను తీసుకుని చూశాడు: కాదనటం జరగదు పొరపాట్న జరిగితే. మౌనంగావుంటే రిసెర్చిపేరున మా బాబాయి యింటికి వొచ్చేస్తాను. ఆ తరవాత మనింట్లో మనం వుంటాం.

అతను రాసిన కాగితం ఆమె తీసుకుని చూసింది: వాళ్ళవేళ అంత మూర్ఖంగా కాదని అంటే, తనని తను మరి కొరరివి చేసుకోవటం అసంభవం. పొద్దుపడక పోతే బ్రహ్మచారిగా వుండిపోతాను— అని చెప్పి వెంటనే బయల్దేరివచ్చేస్తాను. ఆ పైన జరగాల్సింది మనమే జరుపుకుందాం.

చదివి, "అన్నీ వుట్టి మాటలు" అంది అతని ముఖంలోకి తృప్తిగా చూస్తూ.

"అవును నీ మాటలంత వుట్టిమాటలు" అన్నాడు.

"కాదనాల్సిన అవసరం పరిస్థితీ వుండదు. కాగా మా నాన్న నేను గట్టిగా పట్టుబడితే యేకీ కాదనడు. నా కసలు పెళ్ళికంతు — ఆఖరికి రిజిస్ట్రారాఫీసులో కూడా— యెక్కడా యిష్టం వుండదు. కలిసి వుంటే అదే పెళ్ళి. పెళ్ళి మనసుల్లో జరుగుతుంది. అది జరిగిపోయిందిగా. కానీ అనవసరంగా పెద్దలకి సంతృప్తి లేకుండా చెయ్యటం దేనికి! వాళ్ళ ముచ్చటా తీర్చుదాం. వాళ్ళకి మనం ప్రాణ సమానం కదా" అంది.

స్వప్నరాగలీన వాళ్ళ పూడువెళ్ళి యింకో పింజేంద్రి హరనాథరెడ్డికి రెండు ముక్కల్లో చెప్పింది. రెండేళ్ళక్రితం పెండ్లిసంబంధాల ప్రసక్తి తెస్తే "మీకు ఆ శ్రమ కలిగించదేమో. మీ అమ్మాయి తొందరపడి అవివేకంగా ప్రవర్తిస్తుందను కోకండి. రెండేళ్ళు ఆగి చూడండి. యింకా రిసెర్చి పూర్తి

కాలేదుగా—" అంగి. ఆ పింతండ్రి హరనాథరెడ్డి దగ్గిర చనువెక్కువ అతనికి వ్యవసాయం లలితకళలు సాహిత్యం అంటే ఆసక్తి.

హరనాథరెడ్డి తన అన్న శంకరరెడ్డితో ముచ్చటించాడు విషయం కూతురితోకూడా అనకుండా వొక్కడే బయల్దేరి పురపకొండ వెళ్ళి అనంత్ తండ్రి రిటైర్డ్ పోలీస్ ఆఫీసర్ వీరారెడ్డిని కలుసుకున్నాడు. తన వూరూ పేరూ వొచ్చినపనీ చెప్పి, "యింతో అంతో వున్నవాళ్ళమే. వొక్కతే కూతురు. మగ సంతానం లేదు. కాలేజీలో మీ అబ్బాయి తెలుసట. మధ్య వర్తులు నా కిష్టంలేదు. నిన్న యిక్కడికి వచ్చాను. మీ స్థితిగతులు తెలుసుకున్నాను. యింకొక అబ్బాయిని చూశాను, మీరూ మా వూరొచ్చి అన్నీ కనుక్కున్న మీదటే నిర్ణయించుకోవటం బాగుంటుంది" అన్నాడు శంకర రెడ్డి.

ఆ వేళకి అనంత్‌రెడ్డి యింట్లోనే వున్నాడు. పిలిచి, వీరు ఫలానా అని చెప్పి, "నీకు వాళ్ళమ్మాయిని యివ్వాలని కోంటున్నారట. మరి నన్ను పోయి విచారించి రమ్మంటవా?' అన్నాడు వీరారెడ్డి.

వినటంనే "వాళ్ళమ్మాయి మీ యిద్దరి ఆస్తికంటే విలువైంది" అని చిన్నగా అనేసి చటుక్కున లోనకి వెళ్ళిపోయాడు అనంత్‌రెడ్డి.

యిద్దరూ కొంతకాలం విస్తుపోయి చూశారు. శంకరరెడ్డి సంతోషంతో పొంగిపోయాడు.

"ఆయన అట్లంటుంటే యింక నేను రావటం దేనికి? పెండ్లి మా వాని యిష్టానికి వ్యతిరేకంగా చెయ్యను" అన్నాడు వీరారెడ్డి.

"వయసులో వున్నవాళ్ళు వాళ్ళ సంగతి తప్ప యితర విషయాలు సరిగా గ్రహించలేకపోవచ్చు. వొక పర్యాయం మా వూరు వొచ్చి స్థితిగతులను తెలుసుకుని మీరు స్వయంగా అమ్మాయిని చూసి నిశ్చయించుకోవటం బాగుంటుందేమో—" అన్నాడు శంకరరెడ్డి.

"అవసరమైతే లేదు. ఐనా మీరు సూచించినారు. రెండు రోజుల పైన వొస్తానులెండి" అన్నాడు వీరారెడ్డి. వీరారెడ్డి భార్య చనిపోయి పది సంవత్సరాలు దాటింది. రిటైరయ్యాక, వూళ్ళో వున్న భూములు స్వయంగా చూసుకుంటున్నాడు.

నాలుగు రోజుల తరవాత వీరారెడ్డి ... వెళ్ళాడు. పద్ధతి ప్రకారం వాళ్ళ స్థితిగతుల గురించి వూళ్ళో తెలుసుకున్నాడు. శంకరరెడ్డి

యిల్లు— అలాంటి బంగళా పల్లెటూళ్ళో వుండటం ఆశ్చర్యం వేసింది వీరారెడ్డికి.

కబుర్లు అయ్యాక, "మీరింకా అమ్మాయిని చూడనేలేదు" అని కూతుర్ని పిలిచాడు శంకరరెడ్డి. హరనాధరెడ్డి లోనకి వెళ్ళి స్వప్నరాగలీనని తీసుకొచ్చాడు.

చిర్నవ్వు ముఖంతో మౌనంగా చేతులు జోడించి కూచుంది

రెప్ప వెయ్యకుండా ఆమెవంక చూస్తూ వుండిపోయాడు వీరారెడ్డి.

"యేమిటీ వీరారెడ్డిగారూ మా వూరు యెలావుంది? మీ ప్రాంతం వాళ్ళలా వుండవు యిటువైపు వూళ్ళు" అన్నాడు హరనాధరెడ్డి.

"మీ డెల్టా భూముల ఐశ్వర్యం తెలిసిందేగా — నేను యిటు ప్రాంతంలో చాలా కాలం జాబ్ చేసినాము లెండి" అని శంకరరెడ్డి వైపు తిరిగి, మా వాడు మీ అమ్మాయి గురించి అన్నమాట గుర్తున్నది బావగారూ, నాకూ అదేమాట అనాలనిపిస్తున్నది" అనితృప్తిగా సంతోషంగా చెప్పాడు వీరారెడ్డి!

శంకరరెడ్డి సంతోషంతో పొంగిపోతూ, "అమ్మా నీ గురించి వీళ్ళబ్బాయి యేమన్నాడో తెలుసా?" అన్నాడు, సంతోషం పట్టలేక.

"వాళ్ళబ్బాయిగారు సీమదేశాలన్నీ చూసి రాగలిగారు గానీ ఆ మనిషిని వుత్త గుడ్డికళ్ళు నాన్నా!" అని చిర్నవ్వి—లేచివెళ్ళింది లోనకి.

ఆ నవ్వు, ఆ రూపం, ఆ నడక— వీరారెడ్డి చెవుల్లో కళ్ళలో నిలిచిపోయాయి.

వ్యవసాయం, పోలీసు వుద్యోగం కబుర్లలోకి దిగారు.

పది నిమిషాలు.

"కతికితే అతకదంటారు. మీరు అభోజనంగానే వెళ్ళిపోవాలి. లేదూ మా తమ్ముడి యింట్లో భోంచేసి వెళ్దురు" అన్నాడు శంకరరెడ్డి.

"చిట్టితల్లి నాకూ కూతురే. మన చిన్నత్త యింట్లో యేర్పాటు చేస్తాను" అన్నాడు హరనాధరెడ్డి. అతనికి ముగ్గురుకొడుకులు ఆడ సంతానం కలగలేదు.

ప్రస్తుతం అక్కడ పనిచేస్తున్న డియస్పీ ఆదివరకు నా దగ్గర సి.ఐ గా చేస్తుండేవాడు" అని లేస్తూ "ఆడపెళ్ళివారు శ్రమ మీకేయెక్కువ వుంటుంది. మీ వీలునుబట్టి ముహూర్తం నిశ్చయించి రెండువారాలు ముందుగా తెలియ పరచండి" అని బయటికి నడిచాడు వీరారెడ్డి. అన్నదమ్ములిద్దరు కూడా నడిచారు.

హరనాధరెడ్డి వీరారెడ్డితో పాటు బస్సెక్కి, "నాకు టౌన్లో కాస్త పనివుందిలెండి" అని కూడా వెళ్ళి, ఆతనిని డియస్పీ యింటివరకూ పంపించాడు.

స్వప్న రాగలిన ఆ రెండో రోజునే అంది అనంత్‌రెడ్డితో— "పెళ్ళి అంటే టాంటాం వ్యవహారం కాదు. నేనెవర్నీ పిలవను. పెద్దల ముచ్చట తీర్చటం— అంతే. వాళ్ళెవర్ని పిలుచుకుంటే ఆ మేరకే. మీరు మీ మిత్ర సైన్యాన్ని పిలుస్తున్నారా? యెందరుంటారు? ఆడపెళ్ళివాళ్ళం కదా—వొచ్చే జనాభా యెంతో తెలియాలి. మీ నాన్నగారిచ్చే లిస్టులో చేర్చండి లేకపోతే అనక, మమ్మల్ని వొకపూట తిండైనా సరిగా పెట్టలేకపోయారు అని మీ వాళ్ళు మెచ్చుకోగలరు" అని నవ్వింది. ఆమె అభిప్రాయం అలాఅని తెలిసి అంతవరకు ప్రత్యేకం యేమీ అనుకోని అనంత్‌రెడ్డి తనూ యెవరినీ ఆహ్వానించ దలచలేదు.

శ్రీపతి యెక్కిన యెక్స్‌ప్రెస్ బస్సు వుదయం ఆరింటికి యేలూరు చేరింది. శ్రీపురం వెళ్ళటానికి యే రూటుబస్సు యెక్కాలో వాకబు చేశాడు బస్సు మరో పావుగంటకే వున్నట్లు చెప్పారు

అరగంట ప్రయాణం. శ్రీపురం రోడ్డుకి పక్కనే వుంది. పరిసర ప్రాంతాలంతా పంటభూములు.

శ్రీపతి తను ఫలానా అని చెప్పగానే, ఆ పక్కనేవున్న హరనాధ రెడ్డి "రండి రండి. యెవర్నీ పిలవలేదని చెప్పింది చిట్టితల్లి." అన్నాడు.

"అవునండీ, స్వప్న యెవర్నీపిలవదు. నేను పిలవకండానే వొచ్చాను పిళ్ళ పెళ్ళి చూడాలనిపించి" అన్నాడు శ్రీపతి.

పకపకా నవ్వి "మా చిట్టితల్లి మీ గురించి చెప్పిందిలెండి" అన్నాడు.

రెండో పినతండ్రి నాగిరెడ్డి ఢిల్లీలో మీటింగుకివెళ్ళి వుండిపోయాడు -నని టెలిగ్రాం పంపించాడు. ఆతని

భార్య హైదరాబాద్ నుంచి మూడు రోజుల క్రితమే వొచ్చింది.

"యిక్కడ మీకు వసతిగా వుండదు. మాయింట్లో బస చేద్దురు—"

అతను ముగించకుండానే అందుకుని, "యింత చక్కటి పెద్ద మహల్‌లో బావుండదంటారా—" అని నవ్వి, హరనాధరెడ్డిని అనుసరించాడు శ్రీపతి.

మూడు నిమిషాల నడక,

చిన్న దాబా, పెద్ద దొడ్డి. చెట్లు పూల మొక్కలు. వొకపక్కగా కుటీరం లాంటి యెత్తయిన గోడల రెల్లుపాక.

ఆ పాకలోకి తీసికెళ్ళాడు.

దాన్లో అడుగు పెట్టగానే, విస్తుపోయి చూసి, "యింక నా సంగతి మీరు పట్టించుకోనక్కరలేదు. భోజనం కూడా అక్కర్లేదు" అన్నాడు శ్రీపతి.

"మీ పుణ్యం. అతిధి సత్కారం సక్రమంగా జరగకపోతే దేవతలు శపిస్తారని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. మీరు పట్టించుకోకపోయినా —" అని, "అది బాత్రూం. ముందు స్నానం కానివ్వండి. రాత్రంతా బస్సులో ప్రయాణమాయె." అన్నాడు.

తన ఆసక్తిని వాయిదా వేసి బాత్రూంలోకి వెళ్ళాడు.

కాలకృత్యాలు ముగించాడు. గోర్వెచ్చని నీళ్ళ స్నానం. మైసూర్ శాండల్ సబ్బు, యింగ్లండులో తయారైన క్యామీ సబ్బు వుంటే—యేది వాడాలా అని సందిగ్ధంలో పడి—స్వప్న రాగలీన వొంటినుంచి చందనం తప్ప మరే పరిమళమూ యెన్నడూ రాకపోవటం గుర్తొచ్చి— శాండల్ సబ్బు వొంటికి పట్టించాడు. తన తువ్వాలు తియ్యాల్సిన పని రాకుండా— కొత్త మాయని యిస్త్రీ మడత—బొచ్చుతువ్వాలుంది సిద్ధంగా.

కూడా తెచ్చుకున్న బ్రీఫ్‌కేస్ తెరిచి పొట్టిచేతుల బుష్షర్టు పైన ప్యాంటు వేసి బెల్టు బిగించాడు.

అంతలో—యిడ్లీలు, వుప్మా, పెసరట్లు—పనిమనిషి తెచ్చి బల్ల మీద పెట్టి వెళ్ళాడు.

'యివన్నీ నా వొక్కడికా!' అనుకుంటూండగా. లేత నీలం రంగు గాజు కూజా అదే రంగు గాజుగ్లాసులు తెచ్చి బల్లమీద పెట్టి వెళ్ళాడు.

వో యిడ్లీ కారప్పొడీ నేతి చుక్కతో తిని, పెసరట్టు తుంచుతు

న్నాడు--

కాఫీ—రాతి పలకలా అవిపించి పింగాణి కాఫీ సెట్టు.

వొంపుతున్నాడు. 'కేరళారవ నాయడు కాఫీలాగా దీనికి సురగ యెలా వొచ్చింది?' అనుకుని వొక గుక్క వేసి, "రుచి అలా లేదు మరి." అను కుని, మరో గుక్క వేసి, 'యెస్ప్రెస్సో పరికరంవో పెర్కొలేటర్లోనో మిక్సీలోనో దేనిలోనో తయారించి వుంటారు—?' అనుకున్నాడు శ్రీపతి.

కాఫీ ము గించి అప్పటిదాకా బలరంతంగా వాయిదా వేసిన పనిప్రారం భించాడు.

గోడంకి చిత్ర లేఖనాలు—పునరుత్పన్నాలున్నాయి. కొన్ని యిటీ వలి భారతీయ చిత్రలేఖనాలు—మాతృకలు.

టిటియన్—ది త్రీ యేజెస్ ఆఫ్ మ్యాన్ డెలక్రా—ది డెత్ ఆఫ్ వోఫీలియా, వాన్‌గో—ది సన్ ఫ్లవర్స్, సెజాన్నె—పోప్లర్స్, ద విన్సీ—శ్వాన్ అండ్ ది లీడా, మోనాలీస్లా, ది లాస్ట్ సప్పర్, మోనే—సన్ సెట్, వంటి చిత్ర లేఖనలు. జపాన్ చైనా రాజస్థానీ అజంటా రేఖా చిత్రాలు జామినీరాయ్, చగాల్, యస్వీ రామారావు, పి. టి. రెడ్డి వంటి యిటీవలి వారి చిత్రలేఖనలు. యీ చిత్రాల మధ్యలో వొకచోట డాడా ఫొటోగ్రాపు తిరగేసి బిగించి వుంది.

పుస్తకాల అలమరాలు—సాహిత్యం, చిత్రలేఖనాలు, పుస్తకాలు.

చిత్రలేఖనం పుస్తకాలు తీసి చూస్తున్నాడు. కొన్ని శ్రీపతి చూడనివి వున్నాయి.

మధ్యాహ్నం భోజనం—వొక స్టీలు పళ్ళెంలో అన్నీ సర్ది పైన అదే సైజు పళ్ళెంలో మూతపెట్టి తెచ్చారు.

భోంచేశాక వో కునుకు తీశాడు.

లేచి మళ్ళీ స్నానించి—వో పుస్తకం తీసి చూస్తున్నాడు.

సమ్మంలో అడుగుల సవ్వడి. తల పైకెత్తాడు.

స్వప్న రాగలీన.

"పెళ్ళివారిల్లు వచ్చలేదనుకుంటాను. యీ పూరి పాకలో చేరారు!"

"మీకు అంతచక్కని పెద్దమహల్ వుందని చెప్పలేదేం యెన్నడూ" అన్నాడు.

"చెబుదామనుగానీ మీ రాజప్రాసాదాల ముందు అదేపాటి

"ఆఖరికి యిక్కడ గుడిశలో పడేశారు అతిథిని!"

"పిలవని పేరంటానికొస్తే అలాగే జరుగుతుందిమరి! మీకు యిక్కడ బాగా మేత దొరకలేదా!"

చుట్టూ గోడలు లేరువానివైపు చూసి, "మేతకేం కరువు యిక్కడ! ఆపైన మీరు అక్కడినుంచి పంపించే మేత!"

"ఆ మేత సంగతి నాకు తెలియదు. మావాళ్ళు పంపించిన మేత."

"మీ బాబాయి నాకు చాలా నచ్చారు"

"మా హరనాథ బాబాయి మీకు నచ్చుతాడని నాకు తెలుసు."

"తెల్లవారుజామున మీరంతా పురవకొండకి తరలి వెడతారుకదా! మూడు రోజులా?"

"అనుకుంటాను. ఆ వివరాలూ అవీ నాకు పొత్తిగా తెలియవు."

"నేను రేపు సాయంత్రందాకా యిక్కడే వుండి, సాయంత్రం మా వూరెడతాను" అన్నాడు శ్రీపతి.

"మహా సంతోషం. సగం సంతోషం రేపు సాయంత్రదాకా యిక్కడ యీ పాకలో వుండదలిచినందుకు. సగం సంతోషం మీ అమ్మగారి దగ్గిరికి వెడుతున్నందుకు"

"అనంత్ చెప్పారా మిమ్మల్ని పిలవమన్నానని? మీకు ఫోను లేదు. కలుసుకునే వ్యవధి లేకపోయింది."

"అనంత్ యేమీ చెప్పలేదు. నేనే వొచ్చాను" అని సరదాగానవ్వాడు శ్రీ:

"చెప్పేవుంటారులెండి"

"మిత్రులనెవర్నీ పిలవలేదేం?" అన్నాడు.

"మిమ్మల్ని పిలిచాంగా?"

"వొక్కణ్ణేగా —"

"మీరు వొంటాదంది మిత్రులతో సమానం. ప్రస్తుతం యీ మినీ సర్కిల్లో నేను ది మోస్ట్ కాన్స్టన్ట్లీ రిక్వైర్డ్ పర్సన్ని. నేవెడతా. మిమ్మల్నెవరూ పట్టించుకోరు. మీ అవసరాలు మీరే చెప్పి చేయించుకోవాలి." అని చిన్నగా నవ్వింది.

"మీ నవ్వు యీ కుటీరానికి చెందినట్లుగా అనిపిస్తోంది — వింతకదూ!" అన్నాడు.

"తమాషా యేమిటంటే—నేను ఆ భవంతిలో కాక యీ పాకలోనే పుట్టానట. ఆ రోజు మా అమ్మా నాన్నా పిన్నీ అందరూ దీనిలోనే వున్నారట—మా బాబాయికి వొళ్లు బాగుండక పోతే—అమ్మకి ఏండు నెలలు. అంతలో అనుకోకుండా నొప్పులు రావటం....యెటూ తీసికెళ్ళే వ్యవధికూడా లేకుండా మంత్రసానైనా లేకుండా మాపిన్ని సాయంతో చిటికెలో ప్రసవించిందట మా అమ్మ—"

"నీ జన్మ గాథా వివరిస్తున్నావు చిట్టితల్లీ. నీ జన్మగాథంటే నా కడుపునొప్పి గాథ. అప్పుడు మొదలైన కడుపునొప్పి యిప్పటికీ నన్ను అంటిపెట్టుకునే వుంది." అని పకపకా నవ్వాడు, అప్పుడే లోనకి వొచ్చిన హరినాథరెడ్డి.

"నొప్పులు తల్లికి కదండీ రావాలి!" అని నవ్వాడు శ్రీపతి.

"అదే చిత్రం. ఆవిడగారు నొప్పులు పడకుండా సునాయాసంగా కనేసింది. ఆ బదులు మరిదినై నాకొచ్చింది కడుపునొప్పి నొప్పులు," అని పకపకా నవ్వాడు హరినాథరెడ్డి,

"నే వెడతా" అంది.

"వెళ్లొస్తాను అను" మళ్ళీ నవ్వాడు హరనాథ్‌రెడ్డి.

స్వప్నరాగలీన బయటికి నడిచింది.

శ్రీపతీ, హరనాథరెడ్డి, లలితకళల కబుర్లలోకి దిగారు.

ముప్పావుగంట.

కాఫీ తెచ్చిన మనిషి, "శివబాబు గారూ అద తమర్ని పిలుస్తున్నారండీ పెదబావుగారు" అన్నాడు

"నాలుగు గుక్కలు కాఫీ తాగనివ్వరా వొస్తాన్లే"

"అదా పుచ్చుకోవొచ్చునండీ. వున్నపళాన తీసుకురమ్మన్నారండీ."

కాఫీ నాలుగు గుక్కలు వేసి, "మళ్ళీ వొస్తాను కాస్తాగి" అని వెళ్ళిపోయాడు హరనాథరెడ్డి

శ్రీపతి చిత్రలేఖనం పుస్తకాలు చూస్తూ వుండిపోయాడు.

చీకటి పడింది. లైటు వేసి మళ్ళీ కూచున్నాడు.

తొమ్మిదింటికి భోజనానికి పిలుపు—వెళ్ళాడు.

'యింతమందికి యింత యిదిగా విందు భోజనమా! దండగ ఖర్చు' అనుకున్నాడు శ్రీపతి. మళ్ళీ వొచ్చి చిత్రలేఖనం పుస్తకాలు తెరిచాడు.

పదకొండింటికి యెవరో వొచ్చి పిలిచారు. వెళ్ళాడు.

చాలా పెద్ద పెళ్ళి పందిరి. చాలా ఘనంగా చేశారు యేర్పాట్లు. జనం కూడా అలాగే చాలామంది వున్నారు.

వివాహం—చాలాశాస్త్రోక్తంగా కప్పదాట్లు వెయ్యకుండా స్థిమితంగా జరుపుతున్నారు పురోహితులు.

పెళ్ళి పీటమీద అనంత్‌రెడ్డి, జరీ అంచు కోరారంగు ధోవతి చొక్కా తలపాగా.

చాకలివాళ్ళు, షోలాపూర్ పట్టుదుప్పటితెచ్చి అడ్డుగా పట్టుకుని నిలుచున్నారు.

మరికొన్ని నిమిషాలకి స్వప్నరాగలీనని—యిద్దరు ఆడవాళ్ళు చెరొక ప్రక్కన వుండి తీసుకొచ్చారు జబ్బ పట్టుకున్నట్లుగా చెయ్యి యెత్తి.

"యేం ఖర్మొచ్చింది స్వప్నకి — హుందా సొగసు నడక పిల్లని కుంటిదాన్ని తెచ్చినట్లు తెస్తున్నారు! లేదూ రాష్ట్రపతి బాడీగార్డుల్లా. రాష్ట్రపతి స్త్రీ ఐతే—రాష్ట్రపత్ని —"అనుకున్నాడు శ్రీపతి.

స్వప్నరాగలీన—కోరారంగు నూరో నంబరు నూలు చీర! బాగా వెడల్పాటి జరీ అంచు. బుట్టెడు పూలు, నగలు.

'పూలజడ కట్టలేదు. అదృష్టవంతురాలు బతికిపోయింది—' అనుకున్నాడు శ్రీపతి.

పెళ్ళి తంతు జరుగుతూంది.

అద్దంలో పెళ్ళికూతుర్ని చూపించే ఘోషా స్థితికిగానీ, ఐదారేళ్ళ నుంచి పరస్పరం తెలిసిన ముఖాలమధ్య ఆ తెర దేనికి! అనుకున్నాడు శ్రీపతి.

హరనాధరెడ్డి వొచ్చి శ్రీపతి ప్రక్కన వో మూడు నిమిషాలు కూచుని—అవీ యివీ సంగతులు చెబుతూ వుండి వెళ్ళాడు.

తెర తొలిగింది.

పెళ్ళి తంతు జరుగుతూంది. శ్రీపతి అదంతా గమనించకుండా వధూవరుల్ని జనాన్నీ గమనిస్తున్నాడు.

పాదాలకి పూసిన పచ్చని ఆమె పాదాలమీద చేతులు ఆన్చాడు అనంత్‌రెడ్డి. సందర్భం గుర్తొచ్చి వెంటనే తీసేశాడు. యెవరూ గమనించలేదు. గమనించిన ముసలి పురోహితుడు, 'ఆ సరసం కళ్యాణ వేదికమీద కాదు

నాయనా శోభనం పడకమీద' అనుకుని నవ్వుకున్నాడు.

వొకరి దోసిలిలో యింకొకరి దోసిలి. కలిసిన దోసిట్లో కొబ్బరి బొండాం. మాఘమూ పావాలూ చూస్తుండిపోయిన అనంత్‌రెడ్డి కొబ్బరి బొండాం సంగతి మర్చిపోయాడు. బరువంతా ఆమె చేతుల్లో పడింది. వొక నిమిషం చూసి, సొడను చేతి చిటికెన వేలి గోరుతో నొక్కింది. దాంతో మళ్ళీ యీ లోకంలోకి వొచ్చాడు అనంత్‌రెడ్డి.

గ్రహించిన ముసలి పౌరోహితుడు, 'పిల్లవాడు పారవశ్యంలో వున్నాడు రవంత తాళుము నాయనా— యీ దివ్వె నీ సొంతమే మరి!' అని తనలో తాను పరిహాసమాడాడు.

శంకరరెడ్డి, అల్లుడి కాళ్ళు పళ్ళెరంలో కడుగుతున్నాడు.

' ది కన్యాదానం. వరదానం పద్ధతి యేర్పాటులేదెందుకో! మాతృస్వామికంలో వుందేమో. వో మళయాళనాయర్ని అడిగి తెలుసుకోవాలి—' అనుకున్నాడు శ్రీపతి.

పెళ్ళి క్రతువు ముగిసేసరికి రెండున్నర ఐంది. యింకో గంటకో రెండు గంటలకో వెళ్ళిపోతారు. ప్రయాణానికిగాను, వొక బస్సు, కార్లు సిద్ధంగా వున్నాయి.

యీలోగా మళ్ళీ ఆ కాటేజీకి దేనికి—అనుకుని అక్కడే పెళ్ళిపందిరి బయట టచ్చాడ తున్నాడు శ్రీపతి. వొక అరగంట అలా వీధుల్లో తిరిగి వొచ్చాడు.

హరనాథరెడ్డి లోనకి పిలిచాడు.

వాళ్ళకి మరీదగ్గిరి వాళ్ళంతా నిలుచుని వున్నారు. 'అంపకాల ముందు ఘట్టం కాబోలు యిది' అనుకున్నాడు శ్రీపతి.

దంపతులు — ఆ పెద్దలకు వొక్కొక్కరికి పాదాలకు నమస్కరిస్తున్నారు కానుకలిస్తున్నారు.

శ్రీపతి యిది యింతకు ముందెప్పుడూ చూడలేదు. ముచ్చటగాచూస్తూ గమనిస్తున్నాడు.

అంతలో— తన కాళ్ళకి నమస్కరించారు. అనుకోని వూహించని సంఘటనకి తడబడ్డాడు. 'అందరూకానుకలిస్తున్నారు. తనేమివ్వాలి? జేబులో పది పదిహేను వంద నోటు వున్నాయి. వెయ్యనూట పదహార్లు యివ్వొచ్చు కానీ వెధవ కరెన్సీ నోట్లు— అనుకుంటూంటే బుర్రలో చటుక్కున అలో

చన వొచ్చింది—

అటోచెయ్యి యిటోచెయ్యి వేసి లేవనెత్తాడు. పాపం, అందాకా యేం చెయ్యాలో తోచక వాళ్ళు అలా వొంగే వుండిపోయారు.

తన యెడమచేతి — మధ్యవేలికి వున్న మరకతం వుంగరం తీసి అవంత్ రెడ్డి వేలికీ, ఆ పక్కవేలికివున్న నీలం వుంగరం స్వప్నరాగలీన వేలికి తగిలించాడు

ముగ్గురి కళ్ళలో ఆత్మీయపు గాఢత్వం.

చివరి ఘట్టం, అంపకాల ఘట్టం. శ్రీపతి బయటికొచ్చి కార్ల దగ్గిర నించుని వున్నాడు.

అంతలో హరనాధరెడ్డి శ్రీపతితో, "వీరు మీ మిత్రుడి తండ్రిగారు వీరారెడ్డిగారు" అని పరిచయం చేశాడు. శ్రీపతి గురించి చెప్పక ముందే, "వొచ్చేముందే మీ గురించి మీ మిత్రుడు చెప్పినాడు" అన్నాడు వీరారెడ్డి.

యింక బయల్దేరాల్సిన ఘడియలు.

దంపతులు కారులో కూర్చున్నారు.

ఆమె తల్లిదండ్రుల కళ్ళలో కన్నీళ్ళు. గమనించి 'ఆనందాన్ని విషాదమూ —విషాదాన్ని ఆనందమూ జయించలేని సమతూకపు సంయోగ విషాదానందం, ఆనందవిషాదం' అనుకున్నాడు శ్రీపతి.

కార్లు కదిలాయి.

"యింకో అరగంటకి ఫస్టుబస్సు వుంటుందేమో వెళ్తాను" అన్నాడు శ్రీపతి హరనాధరెడ్డితో.

"అట్లా యేం కుదరదు" అన్నాడు హరనాధరెడ్డి

"యీ పనుల సమయం— మరోసారి వొస్తాగా" అన్నాడు శ్రీపతి.

"పెళ్ళి తరువాత పనులకేం తొందరుండదు. కాగా మా అన్నయ్యా వాళ్ళూ చూసుకుంటారు" అని శ్రీపతిని వుంచేశాడు

మధ్యాహ్నపు భోజనం స్వప్నరాగలీన యింట్లోనే ఆమె తల్లి దండ్రుల్నీ, యింకో పినతండ్రి నాగిరెడ్డి దంపతుల్నీ తన భార్యని పరిచయం చేశాడు. ఆపీయిపీ కబురు,

ఆ తరవాత నాగిరెడ్డి తన కారులో వెళ్ళిపోయాడు.

ఆ తరవాత శ్రీపతిని తన కాటేజీకి తీసుకొచ్చాడు. కొంచెం పేపు

వాళ్ళతోపాటు అతని భార్య వుండి— ఆ యింటికి వెళ్ళింది సనులున్నా
యని.

సాయంత్రం నాలుగున్నరకి బయల్దేరాడు శ్రీపతి. విజయవాడ చేరు
కుని, మళ్ళీ బస్సెక్కి వాళ్ళ వూరు వుట్టిపల్లి చేరుకున్నాడు. అతను వొస్తు
న్నట్టు యింట్లో తెలియదు. చూడగానే పనివాళ్ళు లోనకి పరుగుతీశారు,
వాళ్ళమ్మకి చెప్పటానికి. వొకతను వొచ్చి బ్రీఫ్ కేస్ అందుకున్నాడు.

తన గదిలోకి వెళ్ళాడు. స్నానించాడు. పడుకున్నాడు. చిన్నగా
కునుకు పట్టింది

లేచేసరికి తొమ్మిదిన్నర.

వాళ్ళమ్మగారు యెదురు చూస్తున్నట్లు పనిమనిషి చెప్పి వెళ్లాడు.

లేచి చన్నీళ్ళతో ముఖం తడుపుకుని తువ్వాలుతో తడి అద్దుకుని
వెళ్ళాడు.

"కూర్చో బాబూ. దారితప్పి వొచ్చినట్లున్నావు!" అంది తల్లి.

"వో దారి అంటూ వుంటేగా అమ్మగారూ, దారి తప్పటానికి !"
అన్నాడు

"వూఁ" అని భారంగా గంభీరంగా నిట్టూర్చింది

"మీ వొంట్లో కులాసాగా వుంటోందా?" అన్నాడు

"దేనికి ?" అంది.

మౌనంగా వుండిపోయాడు.

లేచి వెళ్ళి తాళాలగుత్తి తెచ్చి అతని ప్రక్కన కుర్చీ అంచుమీదపెట్టి
అవతలికి అడుగులు వేసి సోఫాలో కూచుని, "అవి నీకు అప్పగిస్తున్నాను.
యేమన్నా చేసుకో. నేను కాశీకో వూటీకో వెళ్ళిపోదామనుకుంటున్నాను"
అంది.

'కాశీకో వూటీకోయేఁవిఁటి? వొకటి అసహ్యమైన మురికి చిరాకుచోటు.
రెండోది ఆహ్లాదకరమైన అందమైన కులాసాచోటు. వొకటి భక్తికి రెండోది
రక్తికిసంకేతంగాభావిస్తే—మరి యిది భక్తా రక్తా! ఐనామధ్యన యీతాళాల
గుత్తి నేనెక్కడ మోసేది?' అనుకుని, "అవన్నీ నాకేం తెలుస్తాయి ?"
అన్నాడు.

"దివాన్ జీ వున్నారు చూడటానికి" అంది.

"యింకా మనకి దివాన్ జీలు వున్నారా !" అన్నాడు.

"చూడు బాబూ మన వంశం పెను శౌర్యపు వంశం. యితరుల యిళ్ళలో అలాంటి పనులు చూసే వాళ్ళని పిగామాషులంటారు. అసలు లెక్కా డొక్కా ఆసామీయే చూసుకుంటాడు మనం లెక్కలు చూసుకోము. లెక్కలు చూపెడితే తనిఖీ చూస్తాము. అందుకని దివాన్‌జీ అనే అంటారు. చట్టం మారిపోయిందని వొంట్లో నెత్తురు మారిపోదు" అంది.

"నేను యేలూరుదగ్గిర మిత్రుల పెళ్ళికి వెళ్ళి వొస్తున్నాను. యివన్నీ నాకు—"

"మిత్రుల కోసమో రికామీగానో కాక, ప్రత్యేకించి యిక్కడికి వొచ్చావని భ్రమపడనులే. యివన్నీ నాకు మాత్రం దేనికి" అంది.

"నాకెలా తెలుస్తుంది?" అన్నాడు

"అసలు నీకు యేదైనా తెలుసా?" అంది

"యేమీ తెలియదు. యేదైనా తెలుసుకుందామనే విశ్వసించుదామనే అన్వేషణలోనే వున్నానింకా."

"మన విశ్వం మరద —ఆ అమ్మాయి పేరేమిటి—ఆ అమ్మాయి పెళ్ళి వో ముత్రాసి అతనితో యెందుకు జరిపించావు? నీకేం అవసరం వొచ్చింది? పెళ్ళిళ్ళకు హాజరవటమూ పరువు తక్కువ పెళ్ళిళ్ళు జరిపించటమూ తప్ప నీ పెళ్ళి ప్రసక్తి లేదన్నమాట."

"రమాదేవి. యిద్దరూ సమ్మతించి చేసుకున్నారు. మధ్యలో నేను కాదంటే ఆగిపోతారా! ఐనా అందులో తప్పేం వుంది?"

"నువ్వెవరివో గ్రహిస్తే అందులో తప్పేమిటో గ్రహించగలవు!"

"వేదకాలం నుంచి యిప్పటివరకు— "తానెవరు?" అనే యత్నంలో తెలుసుకోకుండానే గడిచిపోయిందని మహా మహులన్నారు. నేనేపాటివాణ్ని" అన్నాడు.

"చూడు బాబూ. వితండవాదం అని ఛలవాదం అని కొన్ని వున్నాయి. వాటిని వక్రత్వానికి వాడుకోవటం ఉన్నత లక్షణం కాదు" అంది.

"యీవిడకి భారతీయ తర్కశాస్త్రం యెలా తెలుసన్నా! వెనకటి కాలంలో న్యాయతర్కం కూడా వుండేదేమో దర్బారు వేడుకల్లో"— అనుకున్నాడు శ్రీపతి.

"ప్రస్తుతం నువ్వు ఆ వూళ్లో యేం చేస్తున్నావు బాబూ?" అంది. గొంతులో బాధ కలిసిన వ్యంగ్యం.

"యేఁవీఁ చెయ్యటం లేదు.

"యెందుకని ?"

"యేం చెయ్యాలో తెలియక — పోనీ మీరు చెప్పండి యేఁ చెయ్యాలో" అన్నాడు.

"పెళ్ళి చేసుకో."

"యెందుకు ?"

"అందరూ ఎందుకు చేసుకుంటారో అందుకే."

"అందరూ యెందుకు చేసుకుంటారో నాకు తెలియదు" అన్నాడు.

"యిన్ని పెళ్ళిళ్ళు చూడటమేకాక గోత్రీకులలో ఘనత వహించగల వివాహాలు జరిపిస్తున్నావు—ఆ మాత్రం తెలియదూ!"

"చేసుకోవాలనిపించి చేసుకుంటున్నారనుకుంటాను."

"నువ్వూ అలాగే చేసుకో."

"చేసుకోవాలని నాకూ అనిపించాలిగా !"

"చేసుకోవాలని యెందుకు అనిపించడం లేదు?" అంది.

"చేసుకోవాలని అనిపించక చేసుకోవాలనిపించటంలేదు."

"యిటీవల మంచి సంబంధం వకటి వొచ్చింది. అమ్మాయి యింగ్లండులో కేంబ్రిడ్జిలో చదువుతోంది. మన పూర్వీకులకీ వాళ్ళ పూర్వీకులకి సంబంధాలున్నాయి. నువ్వుసరే అంటే అమ్మాయిని యిక్కడికి పిలిపిస్తారు" అంది.

"కయ్యానికైనా వియ్యానికైనా సాటివారు కావాలన్నారుగా ? సీమ దేశంలో గొప్ప యూనివర్సిటీలో పెద్ద చదువు చదివే ఆమెకి అతి సామాన్యమైన చదువూ వాలకమూ మనిషిని నేను తగినవాణ్నెలా అవుతాను!"

"కావాలని తనని తాను కించపరుచుకోవటం వొక రకం ఆత్మవంచనే అవుతుంది."

"ముందుగా ఆత్మ చిక్కాలిగా ఆత్మని వంచించుకోవటానికి! ఆత్మ కోసమే మానవకోటి యింకా వెదుకులాడుతోందిట!"

"వూఁ" అని భారంగా శ్వాస విడిచింది.

ఆ తరవాత మౌనంగా భోజనాలు ముగించారు,

రాత్రుళ్ళు, భోజనం చేసిన వెంటనే విశ్రమించటం అలవాటు ఆమెకి.

హృదయం యెనిమిదింటికి తయారు శ్రీపతి.

తల్లి హాల్లో కూచుని వుంది. అక్కడే పనివాళ్ళున్నారు.

వెళ్ళి, వొక క్షణం మౌనంగా నిలుచుని పనివాళ్ళ వంక చూసి, "అమ్మగారి ఆరోగ్యం జాగ్రత్త" అన్నాడు.

ఆమె భారంగానూ వుదాసీనంగానూ చూసింది కొడుకు వంక.

"వెళ్ళొస్తా" అన్నాడు తల్లి వైపు చూసి.

"వూఁ" అని భారంగా హుందాగా శ్వాస వొదిలింది.

# 107

గంగి, తను యేడాది క్రితం కొన్న స్థలంలో మొక్కలు నాటించింది. లాన్ కోసం పచ్చి బెరళ్ళు తెప్పించి పరిపించింది. ఆ స్థలంలో మూడు నాలుగు పెద్ద చెట్లు ముందే వున్నాయి బంగళా లేచేసరికి చక్కని తోటా తయారై వుంది

మిలిటరీ కంటోన్‌మెంట్ రూల్స్‌తో పేచీ వొస్తుందేమోనని బాగా వెనకటి స్టాంపు వొకటి సంపాదించి సేల్ డీడ్ రాయించుకుంది. రిజిస్ట్రేషను జోలికి పోలేదు.

ఆ స్థలానికి దగ్గిరగా బోయినపల్లి పెంకుటిళ్ళు. దూరంగా— వొక వైపు మిలిటరీ కంటోన్‌మెంట్, యింకో వైపు బేగంపేట విమానాశ్రయం, యింకో వైపు మారెడ్ పల్లి, మరో వైపు పెరేడ్ గ్రౌండ్.

లారీలతో మట్టి తోలించి బరంతు చేయించింది. అప్పుడెప్పుడో సిటీలో వో ఆర్కిటెక్ట్‌తో బంగళా ప్లాను తయారు చేయించింది. ఐదు లక్షలు అవుతుంది ఖర్చు. ప్రస్తుతానికి రెండో అంతస్థు తలపెట్టలేదు. ఐదారు నెలలనుంచి పని జోరుగా సాగింపించింది యీ మార్చి నాటికిపూర్తి చేసి వుగాదికి గృహ ప్రవేశం చెయ్యాలనే తలంపుతో. పని మధ్యలో బోయ్ ఫ్రెండ్స్ వొస్తే మాత్రం అమాంతం వెళ్ళిపోయేది. అన్నీ చూసుకోవటానికి సాయిలు వున్నాడు. యిప్పుడు అతనికో మోటార్ బైక్.

రంగులతో సహా బిల్డింగు ప్లాను ఆర్కిటెక్టులకి అప్పగించటంవల్ల చాలా చక్కగా తయారైంది.

బంగళాకి వొక ప్రక్క మల్లెలు జాజులు లాంటివి. ముందు ప్రక్క

అశోకచెట్లు నాలుగు. ముందు ప్రక్కనే రకరకాల రంగుల గులాబీతోట. వాటితో పాటు నల్ల గులాబీలు. నల్ల గులాబీలు రవికి యిష్టం అని బాగా యెరువూ అని వేసి ప్రత్యేకంగా పెంచాడు సాయిలు. మొక్కలు కలవెత్తున గంగి అంత యెత్తు పెరిగాయి. కాని వొక్క పువ్వూ పూయటం లేదు.

న్యూ యమ్మెల్యే క్వార్టర్సు మంచి నివాసం యిక్కడికి మార్పించింది. టెలిఫోన్లు. రెండు కార్లు. ఆమె తల్లిదండ్రులు యిక్కడే వుండి, వంట మనిషీ పనిమనుషుల అజమాయిషీ చూస్తుంటారు.

పై అంతస్థు కూడా వేస్తే సగభాగం తనకీ, రెండో సగభాగం రవికీ అని ప్లాను వేయించింది. ప్రస్తుతానికి, కిందే కుడివైపున తనగదీ, తూర్పువైపున రవి గదీ ఏర్పాటు చేయించింది.

బంగళాకి సరిపడా మరికొంత ఫర్నిచరు కొంది.

గృహ ప్రవేశం చాలా ఆట్టహాసంగా ఘనంగా జరపాలని అంటే—
"నీ యిష్టమొచ్చినట్లుగా జరిపించు కానీ నా పేరు మాత్రం పిల్లేదు—" అన్నాడు రవి. అందరిని ఆహ్వానాలు అచ్చొత్తించకండా వెళ్ళి కలసుకునీ ఫోనులోనూ చెప్పింది.

యీ బంగళా తయారవుతున్న రోజుల్లోనే వొక రోజున, రాంనగర్ తన పాకలో వొ సాయంత్రం వేళ, "రాములూ నా దగ్గిర గత ఐదారు నెలల జీతంలో మంచి కొద్దిగా డబ్బు మిగిలింది. యీ పాకకి చుట్టూ వున్న కొద్ది ఖాళీ స్థలం చుట్టూ యీ యేడు మళ్ళ కంచె తీసేసి, పాక మూసుకుపోకండా మూడు అడుగుల యెత్తు ప్రహారీ గోడ వొంటి రాతి మందంతో కట్టించు. చిన్న గేటు పెట్టించు" అన్నాడు రవి. రాములు అలాగే కట్టించాడు. రాములు వాళ్ళ పెంకుటింట్లోవొక్కడూ వుంటున్నాడు. వొండుక్క తింటున్నాడు. రోజూ సాయంత్రాలు వొచ్చి యీ పాక ముందు పచ్చిక మీద పడుకుంటాడు. మొక్కలకి నీళ్ళు పోస్తాడు బయటినుంచి బక్కెట్లతో తెచ్చి. ఆ పల్లగులాబీలు అప్పటికీ యెప్పటికీ అంతే వున్నాయి యెదగకండా పూలు మాత్రం అప్పటిలాగే గుంటపూలు పూస్తూనే వున్నాయి.

వారం పదిరోజులకి వొకసారి రవి వొచ్చి పాకలోనో, వాకిట్లోనో కాసేపు గడుపుతాడు. రాములుతో కలిసి, ఆ ప్రాంతపు ప్రజలను ముఖ్యంగా పేద ప్రజలను కలుసుకుంటూవుంటాడు. వాళ్ళలో అతని పలుకుబడి మరింత పెరిగింది.

వొకసారి, "రాములా యిక్కడ వొంటరిగా వొండుకుని తింటూ యెందుకు? నీ చెల్లెలేగా అక్కడకి రారాదూ?" అన్నాడు రవి

"చెల్లెలితోటి అన్న పోడు, మగని తోటి పెండ్లం, పెండ్లం తోటి మగడు పోతరేమొగాని. యాడ మా నాయ్న అవ్వ సొంతంకట్టిన యిల్లు వున్నది. నీకు యిచ్చినైన యీ గాటేజ్ వున్నది. యీమొక్కలున్నవి. యివన్ని యెవరు చూసెరు నేను యీడ లేకుంటె, రవీ సాబ్! గంగి తోటి ఆమె నాయ్న, అవ్వ అడ్నె వున్నరు గద!" అన్నాడు రాములు.

గంగి తండ్రి కొమరయ్య కొత్త అలవాటు ప్రకారం కల్లుపాకలోకి వెళ్ళి పూటుగా తాగి వొస్తాడు. అలా వెళ్ళకుండా కట్టడి చేసింది, యెమ్మెల్యే క్వార్టర్సులో వుండగానే. సాయిలు చేత సారా సీసాలు తెప్పించి వాళ్ళమ్మ పోశవ్వ దగ్గిర పెట్టించుతుంది రోజూ వో కాయ సారా బోస్తారు అతనికి.

గృహ ప్రవేశం తరవాత వొక రోజున యిన్‌కంటాక్సు వాళ్ళొచ్చి రవిని పట్టుకుని లెక్కలు అడిగారు. "అవిడని అడగండి" అన్నాడు రవి. గంగిని అడిగితే "యిల్లు అంతా సోదా చేసుకుని మీకు కావాల్సినవి సీల్ చేయండి. తీసికెళ్ళండి. రేపు మా ఆడిటర్ వొచ్చి లెక్కలు చెబుతాడు" అని యింగ్లీషులో అంది.

స్థలం చాలా చవకగా కొన్నట్లు రాయించగలిగింది — వెనకటి దస్తావేజు అవటం వల్ల మిగతా ఆదాయానికి — తన రెండు మూడు వ్యాపారాలు — కాంట్రాక్టులు, షేర్స్, రియల్ యెస్టేట్ సేల్స్ వంటివి కొన్ని పకడ్బందీగా తయారుచేయించి వుంచాడు ఆమె ఆడిటర్. ఆ పైన యిల్లు కట్టటానికి రెండు లక్షలు అప్పుచేసినట్లు — అవీ చేబదులు. చేబదులు యిచ్చినట్లు చెప్పించింది, వొకతని చేత. వొక కారు తనది కాదని మరొకరిది వాడుకుంటున్నట్లు చెప్పింది ఆ కారు యెలాట్ ఐన అతను అప్పుడే అమ్మే హక్కులేనందున అది తనదే అని చెప్పాడు అంతా గ్లాయిక్కాక, అదే అధికారులకి ఘనంగా మందు పార్టీ యిచ్చి, "తెలివి మీ వొక్కరి సొంతమే కాదు. కాగా యెప్పుడన్నా మీలో యెవరికన్నా మాతో అవసరం కలగొచ్చు సుమా!" అంది యింగ్లీషులో.

యిల్లు జనసమ్మర్దం లేనిచోట వుండటంవల్ల చాలాసార్లు బాయ్ ఫ్రెండ్స్‌ని యింటికే తెచ్చుకుంటూ వుంటుంది సాధారణంగా రవి యింట్లో వుండగా వొచ్చినతను తన గదిలోవున్నా, అతను బయటికీ లోనకీ వెళ్ళటం

జరగదు. రవి లేనప్పుడే జరిగేలా చూస్తుంది. అసలు రవి యింట్లో వుండేదే తక్కువ. పొద్దున్నే వెళ్ళిపోతాడు. మధ్యాహ్నం పన్నెండు నుంచి రెండు లోపల వొచ్చి భోంచేసి వో కునుకు తీసి వెడితే, రాత్రి యెప్పుడో పొద్దుపోయి వొస్తాడు. తన నియోజకవర్గం ప్రజలతోనో, కార్మికులతోనో, యెమ్మెల్యేలతోనో, మినిస్టర్లతోనో, ప్రభుత్వాధికారులతోనో, రాజకీయ దళారీలతోనో వుంటాడు. అప్పుడప్పుడు వెనకటి మిత్రులతో— తటస్థపడి, తీరిక వుంటే.

తనకిష్టమైన అర్థశాస్త్రం పుస్తకాల పఠనం ఆగిపోయి చాలా నెల లైంది. అసెంబ్లీ రాజకీయాల పఠనంలోనూ, అసెంబ్లీలో తన పలుకుబడి పెంచుకోవటానికి కొందరికి చేయించి పెట్టే పనులవల్ల వొచ్చే గొడవల తోనూ, గంగి చేయింపించే పనుల మెలికలతోనూ సరిపోతుంది— సమయ మంతా.

# 108

మార్చి పదిహేనో తేదీ మధ్యాహ్నం సుధీర్ వొచ్చి మోహన్ రెడ్డిని అరెస్టు చేసినట్లు చెప్పాడు శ్రీపతికి. చదువుతున్న రీజ్మన్ని పుస్తకం, "ది లోన్లీ క్రౌడ్" మూశాడు శ్రీపతి.

లిబర్టీ థియేటరు దగ్గిరిలో యెవరితోనో రాజకీయ స్థితి చర్చిస్తూ యెలక్షన్ల గురించి వుపన్యాస ధోరణిలోకి దిగాడట. జనం జమఅయ్యారు— వింటున్నారు.

"అటు యిందిరా యిటు జనతా రెండూ పేదప్రజలను మోసగించే దోపిడీదారులే. యెలక్షన్ల బూటకం. అడ్డమైన అక్రమాలు సాగిస్తారు. డబ్బు విరజిమ్మి పేద ప్రజల ఆర్థిక దుస్థితిని వాడుకుంటారు. యెన్నికలంటే ఫార్స్, మోసం, దగా. పేద ప్రజలు తమని తాము రక్షించుకోవాలంటే యెన్నికలను బహిష్కరించటమే మార్గం." అని వుర్దూలో ప్రారంభించాడు మోహన్ రెడ్డి.

సుధీర్, మరో యిద్దరిని తీసుకుని వెళ్ళి విడుదల చెయ్యమని అడి గితే, "నక్సలైట్ గూండగాండ్లు మిమ్ములగూడ నాకల వెట్టమంటరా?"

అని కసిరాడట సి. ఐ.

శ్రీపతి వెళ్ళి అడిగాడు. "యెలక్షన్ల పదహారూ పదిహేడూ పద్దెని మిది తేదీల తరవాత విడుదల చెయ్యటానికి సాధ్యపడుతుంది అదీ బెయిల్ మీద— బాధ్యతాయుతమైన ఉద్యోగిగానీ, వ్యక్తిగానీ పూచీపడితే—" అని యింగ్లీషులో వివరించాడు సి ఐ.

సుధీర్‌ని పంపేసి నడక సాగించాడు శ్రీపతి.

—యెలక్షన్ల మాయలో పడే ప్రజలు సాయుధ పోరాటం చేస్తారటయ్యా మోహనం! యెప్పటికీ యెలక్షన్లు వుండవని నిర్ధారణ ఐన స్థితిలో అది సాధ్యమైతే కావొచ్చునేమోగానీ —యిందిరమ్మ వో సామాన్య స్త్రీ కాదు నాయనా—అరవై తొమ్మిదిలో ఆత్మ ప్రబోధపు విష్ణుచక్రం ప్రయోగించి దిగ్గజాలవంటి రాజకీయ మహామహులను చిత్తుచేసి యువరాణిగా పార్లమెంటు సింహాసనాన్ని అధిష్టించింది. అనుకోని పరిస్థితి యేర్పడి— అంతకంటే గ్రహపాటు బాగోక అని అనుకోవాలేమో—ప్రతిపక్షాలు నానా గొడవా చేస్తే కొందరు ప్రజలు వాళ్ళతో సహకరించగా పడవ మునుగుతుందేమోననిపించి యమర్జన్సీ దండం చేతబట్టి— యమర్జన్సీ పోట్లు పొడిచి— యమర్జన్సీ స్మగ్లర్ల, బ్లాక్ మార్కెటీర్ల అరెస్టుల నాటకం ఆడింది. అప్రాముఖ్యమైన అంశాలలో పేదప్రజలు, సుఖ్యం.. ప్రజలని కాసేపు వేడుకకి చంకనెత్తుకుంది. యితర చపటప్రజానీకానికి యమరన్సీమార్ఫియా యింజక్షనిచ్చింది. నోరు మూసేసినందున ప్రెస్సు, పనీ పడింది. అదేదో ఆత్యయికస్థితి అని స్ఫురణకి రానంతగా మామూలుగా సాగిపోతున్న తరుణం చూసి మొన్న జనవరి యెలక్షన్లు ప్రకటించింది— యెలక్షన్లు పెట్టమని అడిగే లేని స్థితిలో— ఆహా, యిందిరమ్మ యెంత న్యాయమైంది. యెలక్షన్లు పెట్టక పోతే మాత్రం యిప్పుడా మెను యెవరడగ గలరు! అని అనిపించుకుంది. రాజకీయ నాయకులందర్నీ జెయిళ్ళ పడేసింది— కాపేపు కుప్పిగంతులెయ్యండిరా— అని. అవునూ, యీ జగ్‌జీవన్ యెందుకు విభేదించి పోచ్చినట్లు— యిందిర బతికుండగా కనీసం వుపప్రధానిగా మరొకరు వుండే ప్రసక్తి లేదు— తన వెనక ఆరవయ్ డెబ్బయ్ యస్సీబీసీ సీట్లు వుంటాయనా— అంతదాకా వొస్తే, ఆ యస్సీబీసీలంతా నాకు ఆత్మబంధువులు— అతనికి స్వార్థానికి మాత్రమే బంధువులు అని తనవైపు తిప్పుకోగలదు, నాలుగు

రూకలు కొనరుకూడా వేసి— కొన్నిలక్షల రూపాయల రాబడివున్నకట్టం మర్చిపోయేటంత మతిమరుపువున్న బాబూ జగ్‌జీవన్‌రామ్ ఖుంకేదో మహా మతిమరుపు స్ఫురించి అడ్డం తిరిగి వుంటాడు —నునుగుతాడు— యిందిరా కాంగ్రెస్ సీట్లకోసం యేంపిఁ అగచాట్లు పడ్డారు! అవును మరి అమ్మబొమ్మ చూపెట్టి గెలిచెయ్యొచ్చు, వూహూ పేరూలేని యే అనామకులైనా....

కొంపకి చేరాడు శ్రీపతి.

పందొమ్మిదో తేది వురయం రత్నాకరరావుని తీసికెళ్ళి బెయిల్‌మీద మోహన్‌రెడ్డిని విడుదల చేయించాడు శ్రీపతి. రత్నాకరరావు తార్‌నాక వెళ్ళిపోయాడుస్కూటర్‌మీద. శ్రీపతీ మోహన్‌రెడ్డీ వడక సాగింవారు.

"అతిథి మర్యాదలెలా జరిగాయి య్యో మోహన్" అన్నాడు శ్రీపతి.

"పోలిస్ బద్మాష్‌ల మర్యాదలు యెప్పటి లెక్కనె వున్నవి. యీడ పిటీల యేమ్ చేద్దమనుకుంటున్నవ్ పక్సలైట్ హరామ్ కా బచ్చా....అని అడ్డమైన కూతలు కూసినాడు" అని వొకక్షణం ఆగి, "నన్నెందుకు విడిపించి నావు శ్రీపతి, జైల్లో వేస్తే యెప్పుడో యెక్కడో గాయత్రి కనిపించును" అన్నాడు మోహన్‌రెడ్డి.

మోహన్‌రెడ్డి సుఖంవింతా విచారం అలుము కుంది.

"గాయత్రిని యిలాంటి జైళ్ళలో వుంచరు, నీకు కనిపించటానికి. నార్త్‌లోని యే జైలుకో పంపివుంటారు" అన్నాడు శ్రీపతి.

యింటికి చేరుకున్నారు.

మోహన్‌రెడ్డికి ఆ యింటికి వెళ్ళాలని పించడం లేదు. గాయత్రి జ్ఞాపకాలతో పిచ్చెక్కినట్లవుతుంది అతనికి. యింట్లో అడుగుపెట్టగానే "ఆ యిల్లు మార్చివేద్దువు. అందాక నువ్వు యిక్కడే నాతోవుండు" అని మోహన్‌రెడ్డిని తన గూట్లోనే వుంచాడు శ్రీపతి.

సాయంత్రం సుధీర్ మరో యిద్దరు వొచ్చారు. పొద్దుపోయేదాకా కబుర్లు. వాళ్ళు వెళ్ళాక బజారువెళ్ళి యిరాని హోటల్లో బన్నుతిని టీ తాగి వొచ్చారు

మార్చి యిరవై వొకటో తేదీ రాత్రి. ట్రాన్సిస్టరు పక్కనే పెట్టు కుని వింటున్నారు— యెన్నికల ఫలితాలు— యెన్నికల కమీషన్ యిందిరా కాంగ్రేసుకి పాత చిహ్నం కాక ఆవూ—దూడ యిచ్చారు.

జనతాపార్టీ ముందు పీటీలో కనిపిస్తోంది. నమ్మలేకండా వున్నారు.
ప్రతి, ఐదు నిమిషాలకి పది నిమిషాలకి ప్రకటనలు.

అర్ధరాత్రి దాటింది —యిరవై రెండో తేదీ.

"సూర్యుడు తూర్పునుండి పడమరకు పోతున్నట్లూ, పడమరనుండి తూర్పుకి పోతున్నట్లూ!" అన్నాడు మోహన్‌రెడ్డి.

"నడినెత్తిన హెక్కాపారిగా మండితే తూర్పు పడమరలు కలిసిపోతాయేమో చూదాం" అన్నాడు శ్రీపతి.

యింగ్లీషు క్యాలెండరు ప్రకారం యిరవై రెండో తేదీ వుదయం మూడుగంటలు.

యిందిరాగాంధీ కూడా వోడిపోయింది—చిత్తుచిత్తుగా.

"హే" అని సంపలనంగా బిగ్గరగా అరిచాడు మోహన్‌రెడ్డి.

రేడియోలో మరికాసేపటికి — రూప్ తేరా మస్తానా రికార్డు విని పిస్తోంది. ఆ వెంటనే—అదేపాట సంగీతం రికార్డు.

మళ్ళీ ఫలితాల ప్రకటనలు.

నాలుగు గంటలకి నీలం సంజీవరెడ్డి గెలిచినట్లు ప్రకటన.

మరికాసేపటికి వేంకటేశ్వర సుప్రభాతం.

ఐదు గంటలకి "స్టేట్ ఆఫ్ యెమర్జన్సీ యీజ్ లిఫ్టెడ్" అని అత్యయిక పరిస్థితి తొలగింపు వార్త.

ఆరుగంటలకి సంజయ్‌గాంధి వోటమి వార్త.

"బాలభానుడు కూడా అస్తమింనాడు. ముప్ఫయ్యేండ్ల మోతీలాల్ వంశపు హయాం అంతరించింది. షి దెజర్వ్స్ యిట్. బట్ దీజ్ రాటెన్ వోల్డ్ హ్యాగ్స్ డోన్ట్ డెజర్వ్ దిస్ వన్ యీవిల్ యీజ్ రిప్లేస్ట్ బై అనదర్ యీవిల్." అని మోహన్‌రెడ్డి, ట్రాన్సిస్టరు పీకనొక్కి పక్కమీద పడుకుని వొళ్ళు విరుచుకున్నాడు.

"డైనమైట్ కేసంటూ జైలో పెట్టి—ఆఖరికి యెలక్షన్లకి కూడా విడుదల చెయ్యకపోయినా భారత రైల్వే కార్మిక సింహం జార్జ్ ఫెర్నాండెజ్ జెయిలులోంచే నామినేషను వేసి జెయిల్లో వుండే గెలిచాడు. విశేషమే! జైలు నుంచి విడుదల కాని అభ్యర్థి అతనొక్కడే అనుకుంటాను."అన్నాడు శ్రీపతి.

"ఆ సింహాన్ని రైల్వే మంత్రి చేస్తే వాచిలిపోతుంది, గర్జింపు.

యీ చక్రంలో విజాయితీపరుడెవడు చేరటమూ అర్థరహితం" అన్నాడు మోహన్‌రెడ్డి.

"నక్కని తొక్కి వొచ్చిన సామెతగా యీ జగ్‌జీవన్‌రాంబాబు అదృష్ట వంతుడు—వేళకి రైలు దిగేశాడు. వాడి జాతకం యెప్పుడూ అలా అదృష్ట పుదే. వొక్కడు—వొక్కడన్నా గెలవలేదే! పొరపాట్న బెవాన్ బువాన్ లాంటి నలుగురు గెలిచారు. కానీ సౌత్ చెక్కు చెదరలేదు. కర్నాటకలోనూ ఆంధ్రాలోనూ జనతాకి వొక్క సీటు కూడా రాలేదు ఆ సందర్భంలో యేం జరిగిందో జనతా అభ్యర్థిగా నీలంవారు గెలిచారు. అస్త్ర సన్యాసం చేసి వూళ్ళో వ్యవసాయం చేసుకుంటూ చేసుకుంటూ చటుక్కున నామినేషన్ దాఖలుచేస్తే గెలిచికూచున్నాడు. మునుగువీరుడిలా యేకైక కర్నాటకాంధ్ర జనతా వీరుడు!" అన్నాడు శ్రీపతి.

మరో పది నిమిషాలకి మోహన్‌రెడ్డి నిద్రపోయాడు.

యిద్దరూ తెల్లవార్లూ మేలుకుని వింటూ కూచున్నారు.

శ్రీపతికి కళ్ళు మంటలుగా అనిపిస్తున్నాయిగానీ నిద్ర రావటంలేదు.

—యీ జాతి వోటు వేసే అర్హతే లేని అనుకుంటే యెలా జరిగిందిలా! వెన్నెముక లేని దనుకున్న యీ జాతి, యీ గొర్రెదాటు జనం, చవటలు ముంతెడు కల్లుకి అమ్ముడుపోయే జనం— యీ దేశం, యీ ప్రజలు, యీ నత్త నడక, అనంతంగా యిలా గొర్రెదాటుగా సాగిపోతుం దేమో ననిపించిన యీ దేశం యీ గొర్రెలు — యేమైంది యిందిరా ప్రభుత్వ యంత్రాంగం—యేమయ్యాయి ఆ న సుత్తుమందు వినోదాలు— యేమిటీ వింత, యేమిటీ మహాశ్చర్యం— యేమైంది ఆ మాయ ఆ గారడీ, ఆ యిందిరాజాలికత—యిందిర జాలికత బిందే చటుక్కున! సామాన్య ప్రజానీకాన్ని తక్కువ అంచనా వేసే మేధావుల నిప్పుడెలా అంచనా వెయ్యాలి! ముప్ఫయ్యేళ్ళ రాజకీయ రథచక్రాల కింద సామాన్య ప్రజానీకం తమ యిష్టాయిష్టాలతో ప్రసక్తి లేకండా పడివున్నారేమో ననుకున్న మేధావి తనం యెంత అల్పమైంది స్వల్పమైంది! చరిత్ర గతి జీవితాల గతి మేధా వుల బుర్రల్లోని ఆలోచనల అల్లికల ననుసరించి వుండదు. మనుషుల అను భూతుల్లోంచి ఆవేశాల్లోంచి, ఆగ్రహాల్లోంచి, ఆనందాల్లోంచి చరిత్రగతి కొనసాగుతుంది—చల్లని పచ్చిక మైదానం వున్నట్లుండి వొక్క క్షణంలో యెర్రగా కాలిన యినప పొరలా ఐపోయినట్లు—ప్రపంచంలో అతిపెద్ద ప్రజా

స్వామిక దేశమని చెప్పుకోవటమే కాక అతి పెద్ద ప్రజాస్వామిక బూటక మనీ, అతి పెద్ద ప్రజాస్వామిక అపహాస్యమనీ అనుకుంటాంపే— యేమిటీ వింత, యేమిటి మహాశ్చర్యం! ఆ కళ్ళలోంచే మంట కురుస్తుంది అగ్ని కురుస్తుంది. మనుషులు పుడిపోతాయి. తెరుచుకోనూ తెరుచుకుంటాయి. కన్ను తెరుచుకోవటం ఐతే [illegible] చివరికి—మూడోకన్ను చూస్తే యెంత తెరిస్తే [illegible] —యీ పంచభూతాళ్ళ వ్యవసాయం సంగతి చేపు (సిస్టిం) మొదలైనప్పుడు తెలుస్తుంది— జయప్రకాశ్‌జీ. యిల్లుతగానే [illegible] —గట్టి సంగతి తేల్చిపెట్టు [illegible]........

సుధీర్ ఉత్సాహంగా లోనికి వొచ్చి, "గాయ్ భీ గయా, బఛ్డా భీ గయా" అన్నాడు.

"గాయ్ ఔర్ బఛ్డే కే సాథ్, సారా గోకుల్ భీ గయా, దేవతా" అని నవ్వాడు శ్రీపతి.

సుధీర్, "యేమి మోహన్ నిద్రపోతున్నావా, సారా దునియా జాగ్ వుఠేతో!" అని మోహన్‌రెడ్డిని కదిపి లేపాడు.

"అగర్ దునియా జాగ్ వుఠేతో వ జనతా న యిందిరా. యిన్‌కి లాబ్ జిందాబాద్, ఆజ్ నహీ తో కల్" అంటూ లేచి కూర్చున్నాడు మోహన్‌రెడ్డి

"యిన్‌కిలాబూ లేదు నక్సలిజమూ లేదు. యెప్పుడూ ధన్నిలాబే. ప్రస్తుతానికి జనతా జిందాబాద్. రేపటినుంచి కాంగ్రెసు వాళ్ళంతా కొత్త జండా చేతపట్టుకుంటారు పాపం, విషాదంచిక దేశాంతరమై దక్షిణాపథాన కాలం వెళ్ళబుచ్చాలి" అన్నాడు శ్రీపతి.

"సిటీ నుంచి పోటీచేసిన అందరితోపాటు ఆ దయానందభారతిగాడు కూడా యెగిరిపోయినాడు" అన్నాడు మోహన్‌రెడ్డి.

"సీతారామ్ గుప్త గెలిచిండు కదా!" అన్నాడు సుధీర్.

"వాడేమి? యిందిరా కాంగ్రెస్ వాండ్లు అందరూ గెలిచినారుగా" అన్నాడు మోహన్‌రెడ్డి.

"రవి యిందిరా కాంగ్రెస్‌ని సపోర్టు చేసిండట కదా?" అన్నాడు సుధీర్.

"లే. యే పార్టీని సపోర్ట్ చెయ్యలే. వాని నియోజకవర్గంలోని యిండిపెండెంట్ అభ్యర్థి [illegible]మ రోగ్ అందుకని సపోర్ట్ చెయ్యలే రవి.

సపోర్టు చేసి వుంటె గెలుచునేమో. రవికిఅతని నియోజక వర్గంలో బ్రహ్మాండమైన సపోర్ట్ వుంది. తన నియోజక వర్గంలో మాత్రం యిందిరా కాంగ్రెస్ అభ్యర్థిని సపోర్ట్ చేసినాడట. దానికీ యేదో కారణం వుంటుంది. అసెంబ్లీకి పోయినంత పొలిటికల్ పవర్ కాన్షస్ నెస్ అబ్బింది."

రాజకీయాల చర్చ, కబుర్లు.

మరసటిరోజున యిందిరాగాంధీ రాజీనామా.

ఆ రెండోరోజున జనతా పార్టీ మంత్రివర్గం—జగ్‌జీవన్‌రామ్ తను వేరేగ్ సి. డి. ఎ. ఫ్. వర్గంగానే జనతాలో భాగస్వామిగా చేరాడు.

ప్రధానమంత్రి యెవరు అవ్వాలి? ఆ కుర్చీకోసం మొరార్జీ జగజీవన్ రామ్ చరణ్‌సింగ్ గింజుకులాడుతూంటే — జయప్రకాష్ నారాయణుడూ కృపలానీ చొరబడి మధ్య వర్తిత్వం నెరిపి—మొరార్జీని కూచోబెట్టారు. తను సపోర్టు చెయ్యకపోతే మొరార్జీ ప్రధాని అయ్యేవాడు కాదనీ, అది తన దయాధర్మ మన్నట్లుగా చరణ్‌సింగ్ భీష్మింపు. యెన్నికజరిగితే తానేప్రధాని ఐవుండేవాడిననీ జగ్‌జీవన్‌రామ్ బింకం.

"మొరార్జీ జగజీవన్‌రామ్‌లు అభ్యర్థులుగా తయారయ్యారుగా — యిద్దరూ అర్హులే. యిద్దరూ సమర్థులే యిద్దరూ యోగ్యులే—ఐనా వొక రిని యెన్నుకోవాల్సి వుంది. మొరార్జీని కూచోనిద్దాం అని, జేపీ కృపలా నీలు నిర్ణయిస్తే అది సమష్టి అవగాహనా? కానీ యిలాంటి విషయం యిందిరా కాంగ్రెసుకి సంబంధించినదైతే నామినేటెడ్ అనో నియంతఅనో అని వుందురు. యిందిర హయాంలో రాష్ట్రాలలో ముఖ్యమంత్రులే లేరట. పెద్ద పాలేళ్ళున్నారట కావచ్చునేమో గానీ సాధ్యమైతే వీళ్ళు రోజు కూలీ నౌకర్లని వుంచుతారు" అని శ్రీపతి అంటే, "అందుకేగా వన్ యూని యూజ్ రిప్లేస్‌డ్‌బై అనదర్ యూనిల్ అన్నాను!" అన్నాడు మోహన్‌రెడ్డి.

## 109

శ్రీపతి, డిస్పెన్సరీలో కూర్చునే అటో పిలిపించుకుని నిమ్మదిగా అడుగులు వేస్తూ బయటికొచ్చి ఆటో యెక్కబోతూండగా అటునుంచి ఆ

వేళకి ఆ పక్కనుంచి వెడుతున్న రిక్షాలోవున్న కస్తూరి చూసి రిక్షా ఆపించి చటుక్కున దిగి గబగబా ఆటో దగ్గిరకి వొచ్చింది

శ్రీపతికి వారం రోజాలనుండి జ్వరం. నూటరెండు డిగ్రీలకి తగ్గటమూలేదు పెరగటమూ లేదు. అన్నం సయించటం లేదు. బ్రెడ్డు కాఫీ తీసుకుంటున్నాడు. ముఖం పీక్కుపోయింది.

"యేంటి, అట్లా వున్నారు?" అంది కస్తూరి.

పక్కన డిస్పెన్సరీ వైపు కళ్ళతో చూపెట్టాడు.

"మీకు అనారోగ్యమా?" అంది.

"యేం, నాదీ వొళ్ళేగా?"

"చాలా హెల్దీగా వుంటారెప్పుడూ. జ్వరమా?" అంది.

అవునన్నట్లు తలవూపి, "యెక్కడ నుంచి?" అన్నాడు.

"రాత్రి వొకతను యింటికి తీసికెళ్ళాడు. అతనితో మరొకతను వున్నాడు. ఆ యిద్దరితో తెల్లవార్లూ జాగారం ఐంది. ఐదింటికి కునుకు పట్టేసి యెనిమిదిదాకా మెలకువ రాలేదు." సాధారణంగా తెల్లవార్లూ మేలుకునే వున్నా, ఆరు లోపున యింటికి చేరుతుంది.

"నీ కోసం రిక్షా యెదురు చూస్తోంది" అన్నాడు.

"మీరు కనిపించి రెండు నెలలో యేమో అవుతోంది. అప్పుడెప్పుడో మీరా టాకీస్ దగ్గిర్లో కనిపించారు. ఐదు నిమిషాలకంటే మాట్లాడటానికి వీల్లేక పోయింది. వూళ్ళోనే యిల్లుతీసుకుని వుంటున్నామన్నారు. జ్వరంతో వొక్కరూ యెట్లా?" అంది.

"యేంవుంది, కదలగలుగుతున్నాను. వీలుకానప్పుడు హాస్పిటల్లో చేరతాను."

నాలుగు అడుగులు వేసి రిక్షా అతనికి డబ్బులిచ్చి వొచ్చి "నేనొచ్చి కాసేపు మీతో మాట్లాడుతూ కూర్చుంటే అక్కడేమన్నా అభ్యంతరం వుంటుందా?" అంది.

'వుహూ" అన్నట్లుగా తలవూపాడు. ఆటోలో కూచుంది. ఆటో కదిలింది.

ఐదు నిమిషాల్లో శ్రీపతి వుంటున్న యింటి ముందు ఆగింది ఆటో.

తను ముందు దిగి, శ్రీపతి దిగటానికిసాయంగా చెయ్యిపట్టుకుంది.

"దిగగలను" అన్నాడు.

ఆటోకి డబ్బులిచ్చాడు.

తాళాలు అతని చేతులోంచి అందుకుని తలుపు తెరిచింది.

కుర్చీల్లో కూచున్నారు.

"నా కెందుకు కబురెట్టలేదు. యిట్లావుంటే" అంది కస్తూరి.

"దేనికి?"

"అవును దేనికి?" అంది తనలో తను అనుకున్నట్లుగా దిగులుగా.

"యెప్పటినుండి జ్వరం?" అంది.

"వారం రోజులయ్యింది"

"డాక్టరేమన్నాడు?"

"యేవీ అవలేదు. మందులిస్తున్నాడు యేవన్నా అనే జ్వరం గానీ, అనేంతటి జ్వరంగానీ కాదు" అని చిన్నగా నవ్వాడు.

"అన్నం తినొచ్చా?"

"తినొచ్చుగాని సయించటంలేదు. బ్రెడ్డు కాఫీ తీసుకుంటున్నాను" అని, యేటవాలుగా జారి, తల, వీపు కుర్చీపై అంచు మీద ఆనించి కను రెప్పలు వాల్చాడు.

కస్తూరి లేచి లోపలిగదులోకి వెళ్ళింది. పెయింటింగ్ సామాగ్రి చూసి ఆశ్చర్యపోయింది. వొకక్షణం గది అంతా కలియజూసి, లోనకి వెళ్ళింది. ఖాళీగావున్న వంటగది. ఆ తరవాత బాత్రూం. వెనక స్థలంలేదు. ప్రక్కలకి కిటికీలులేవు.

కస్తూరి ముందుగదికి వొచ్చేసరికి అతను యింటికప్పువైపుచూస్తూ చూపుడు వేలికణుపుతో పెదవిమీద నొక్కుంటున్నాడు.

"గాలి సరిగా రాదు. ఫ్యాను లేకపోతే వుండటం కష్టం" అంది

"ఫ్యానువుంది గానీ, వేసవిలో కరెంటు సరిగా వుండదుగా" అని చిన్నగా నవ్వాడు.

"కూర్చోవడం కష్టం. వొచ్చి పడుకోండి" అని అతని జబ్బ పట్టుకుంది. లేచాడు. లోపలి గదిలోకి నడిచారు.

మంచం అంచుమీద కూచున్నారు.

"యిప్పుడేమన్నా మందు తీసుకోవాలా?" అంది.

"వూఁ" అని లేవబోయాడు— "నే తెస్తాగా!" అని గబగబా

ముందు గదిలోకి వెళ్ళి మందు పట్టుకొచ్చి, వాటి సంగతి అడిగింది. చెప్పాడు.

తగరం చించి గోళీ చేతికి యిచ్చి, కూజాలోంచి గ్లాసులోకి నీళ్ళు వొంపి తెచ్చి అందించింది.

దిండుమీదకి వొరిగాడు.

మంచం అంచుమీద కూచుని, "నేనిట్లా యిక్కడ కనిపిస్తే యీ బిల్డింగులో వాళ్ళేమన్నా అనుకుంటారా?" అంది.

"వాళ్ళ వోపిక—" అన్నాడు.

"అందువల్ల మీకు యిబ్బంది కలగదూ?"

"నాకేం యిబ్బంది? వాళ్ళేమనుకుంటే నాకేంటి? కాకపోతే యెప్పుడూ యే స్త్రీ కనిపించనందున యెవరూ యేమిటీ అని అడుగుతారు. అరా తీస్తారు" అన్నాడు.

"కాలేజీ వొదిలేసి పెయింటింగ్ చేస్తున్నారా?" అంది. ఆ సామాగ్రి వొంక చూస్తూ.

"అదీ చెయ్యటంలేదు."

లేచి రెండడుగులు వేసి చేతిలుకుని థెర్మోస్ తెరచి చూసింది— కాఫీ వుంది. మూత పెట్టేసి బ్రెడ్డు వున్న ప్లాస్టిక్ పళ్ళెం చేత పుచ్చుకుని వొచ్చి మంచం అంచుమీద కూచుంది.

"వుట్టినే తింటారా?" అంది.

"యిప్పుడేం వొద్దు"

"రెండు స్లైసెస్ తీసుకోండి. లేకపోతే మరీ నీరసంగా అనిపిస్తుంది" అని లేచి ఫ్లాస్కు మూత తీసి కప్పులోకి వొంపింది. యింకా రెండుకప్పుల కాఫీ వుంది.

"నువ్వూ తిను." అన్నాడు

"నాకు దేనికి బ్రెడ్డు?" అంది.

"బ్రెడ్డు తినటానికి జ్వరం రానక్కర్లా. నేను చాలారోజులు బ్రెడ్డు తోటే గడిపేస్తుంటాను. యింకో కప్పూ ట్రే వట్రా" అన్నాడు.

తెచ్చింది.

శ్రీపతి లేచి కూచున్నాడు. ట్రేలో చెరో కప్పులో బ్రెడ్డు ముంచు

కుని తింటున్నారు. కప్పుల్లో మిగిలిన కాఫీ తాగేశారు.

"అవిల్ బావున్నాడా? యీమధ్య చూడటం పడలేదు" అన్నాడు.

"వో మీరు చాలా గుర్తు. యిష్టంకూడా. అడుగుతుంటాడు" అంది.

శ్రీపతి నీరసంగా కళ్ళు మూసుకుని పడుకున్నాడు. కస్తూరి చూస్తూ కూచుంది పది నిమిషాలు.

గుమ్మంలో అలికిడిగా అనిపించి లేచి వెళ్ళింది. పన్నెండేళ్ళ కుర్రాడు.

"శ్రీపతిసాబ్ లేడా?" అన్నాడు.

"వున్నారు. నిద్రపోతున్నారు. వొంట్లో బాగాలేదు" అంది

"అందుకోసమే యేమన్న తేవాల్నేమో అని వస్తి"

"నువ్వెవరివి?" అంది.

"యీడ్నె వుంట. యెవరికన్న యేమన్న పన్లుంటె చేసిపెడుతుంట"

"మీ అమ్మా నాన్నా యెక్కడుంటారు?" అంది.

"యెరికలే"

"లేరా?"

"యెరికలే."

పర్సులోంచి పదినోటు తీసి అతనికి యిచ్చి "నాలుగు యాపిల్సు, నాలుగు మోసంబీలు పట్టుకురా. ద్రాక్షపళ్ళు వొకపావుకిలో" అంది.

అతను వెళ్ళాడు. ముందుగదిలో కుర్చీలో కూచుంది. కనురెప్పలు వాలుతున్నాయి. లేచి మంచుని అటూయిటూ అడుగులు వేస్తూ, గుమ్మంలోకి అడుగులు వేసి పరిసరాలు చూసింది. ఆ వీధిలో యెప్పుడో వొకసారి యే యింటికో వొచ్చి వట్లుగా అనిపించింది. కానీ సరిగా గుర్తురావటంలేదు.

కుర్చీలో కూచుంది.

ఐదు నిమిషాలు.

ఆ కుర్రాడు పళ్ళూ అవీ కాగితం పొట్లాలు తెచ్చి బల్లమీద పెట్టి, చిల్లర కూడా బల్లమీద పోశాడు.

రూపాయిన్నర వుండొచ్చు.

ఆ పైసలవంక చూపెడుతూ, "తీసుకో" అంది.

"సాబ్ యిస్తడు" అన్నాడు.

"పర్లేదు తీసుకో." అంది. తీసుకున్నాడు.

"మళ్ళ పొద్దుటికి వొస్తా" అని వెళ్ళిపోయాడు.

తలుపు గడియ వేసింది. ఆ పొట్లాలు పట్టుకుని లోపలికి వొచ్చి టేబిలుమీద పెట్టింది. చాకు వుందేమోనని వెతికింది చాలా చిన్నది వుంది.

పళ్ళు అన్నీ నీళ్ళతో కడిగి ట్రేలో పెట్టింది.

శ్రీపతి నిద్రోతున్నాడు.

పదకొండున్నర.

కుర్చీలో కూచుంది నిద్ర మగతగా కన్నుకోంది అతని వంక చూస్తూ కూచుంది. యెప్పుడో తెలియకుండా రెప్పలు వాలాయి. మెలుకువొచ్చేసరికి, శ్రీపతి, దిండుమీదకి యేటవాలుగాపడుకుని ఆమె వొంక చూస్తున్నట్లుగా కనిపించాడు.

"మొద్దు నిద్రోయినట్లున్నాను టైమెంతైంది?" అని టేబిలువంక చూసింది. టేబిలుమీది అలారం టైంపీసు కనిపించటంలేదు సరిగా వస్తువుల వెనక వుంది. అది తిరగటం లేదసలు, కీ యివ్వకందున.

తన చేతికి వున్న వాచీవంక చూసి, "రెండున్నర" అన్నాడు.

"అమ్మో రెండున్నరే!" అని దిగ్గున లేచి, బాత్రూంలోకి వెళ్ళి వొచ్చింది.

ట్రే పట్టుకుని కుర్చీలో కూచుని, చాకుతో యాపిల్ ముక్కలు కోస్తోంది.

చూసి, "అవన్నీ యెక్కడివి?" అన్నాడు.

"వొచ్చాయి."

"నిద్రపోతున్నావుగా?"

"మీ పని కుర్రాడు తెచ్చాడు."

"నువ్వు చెబితే డబ్బులూ—"

"పర్సులోంచి యిచ్చాను." అంది.

"నాకు పర్సు లేదే—"

"నాకు వుందిలెండి." అని చిన్నగా నవ్వి, "తక్కువ డబ్బులుండే వాళ్ళు పర్సు వాడతారు." అంది.

"అదేంవోంగానీ, ఆడవాళ్ళు జేబుల్లేక వాడతారు." అన్నాడు.

నవ్వింది.

"యెలా వుందిప్పుడు?" అంది.

"అలాగే వుంది."

"నా కంటికి యింకా నీరసంగా కనిపిస్తున్నారు."

"థెర్మోమీటరు కంటికి యెలా కనిపిస్తున్నదీ అడిగితే సరి."

టేబిలుమీదకి చూస్తే కనిపించింది. తీసి అందించింది.

వొక నిమిషం తరవాత అందుకుని చూసింది. నూటమూడు

"పెరిగింది సాయంత్రం మళ్ళీ డాక్టరుకి చూపిస్తే?" అంది.

"అవసరం లేదు. పొద్దుటిదాకా అవే మందులు." అన్నాడు.

కళ్ళు మూసుకున్నాడు. మగతగా నిద్ర.

మసక చీకటిగా అనిపించింది గదిలో. లేచి దీపంవేసి మంచం దగ్గిరికి వెళ్ళి వాచీలో టైం చూసింది. ఆరున్నర. అతని నుదుటిమీద అరిచెయ్యి ఆనించింది.

అతను రెప్పలు విప్పాడు. మరింత నీరసంగా వున్నాడు.

కాఫీ యివ్వబోతే వొద్దన్నట్లుగా తల కదిపాడు. 'నువ్వు తాగు.' అన్నట్లు కళ్ళతో సూచించాడు.

"నీకు టైం ఐంది." అన్నాడు.

"కాలేజీకా ఆఫీసుకా?" అంది.

"యింక వెళ్ళు కస్తూరీ."

"మీరు పొద్దుటికంటే నీరసంగా వున్నారు. జ్వరం పెరిగింది." అని గోడ వైపు చూస్తూ, "నేనిక్కడ రెండు రోజులుంటే అభ్యంతరమా?" అంది.

"అభ్యంతరం దేనికి? కానీ అవసరం లేదు."

"వొక్కరే—"

"అవసరం ఐతే హాస్పిటల్లో చేరతాను. ఫ్రెండ్స్ వొస్తూనే వుంటా. యివాళెందుకో రాలేదు" అన్నాడు.

"హాస్పిటల్ దేనికి? అక్కడేం బాగుంటుంది? రెండు రోజులు నే నిక్కడుంటాను."

"నీకెలా వీలవుతుంది?"

"నాకేమన్నా వుద్యోగమా, లీవు శాంక్షన్ అవడానికి అవకపోడానికి! మీరేమీ రుణపడొద్దులే. పోనీ లెక్క కట్టిద్దురు." అని తల పక్కకి తిప్పుకుంది. ఆమె కళ్ళలో తడి వులికింది.

గమనించాడు.

"వుండులే" అన్నాడు.

"యెవరన్నా అడిగితే మీ చుట్టాన్నని చెప్పండి లేకపోతే మిమ్మల్ని యెట్లాగో అనుకుంటారు."

"అలాంటివి నాకు చాతకావు. కొన్ని దాచకూడదు. దాగవు. మీ సంగతి తెలుసులే— అన్నట్లుగా లోకువ చెయ్యబోతారు నువ్వు ఫలానా అని చెబుతాను"

"నేనట్లా బజారెళ్ళి వస్తాను వొక గంటలో." అంది.

"యెవరికన్నా చెప్పి రావాలా?" అన్నాడు.

"వుఁహూఁ" అని బయటికి నడిచింది.

తన యింటికి వెళ్ళి పనలి భటుడు కనిపిస్తే, నాలుగురోజులు తను యెటో వెడుతున్నట్లూ యిల్లు కనిపెట్టుకుని వుండమనీ చెప్పింది.

గంటన్నరకి తిరిగి వొచ్చింది.

రిక్షా అతను, రెండు మూడు అట్టపెట్టెలు ముందు గదిలోనూ మధ్య గదిలోనూ పెట్టాడు

అర్థంకాక ఆశ్చర్యంగా చూస్తున్నాడు శ్రీపతి.

"యేమిటా పెట్టెలు?" అన్నాడు, మధ్యగదిలో పెట్టిన రెండు పెట్టెలవొంక చూస్తూ.

"ఫ్రూట్స్." అని నవ్వి, టేబిలుమీద ట్రే పట్టుకుని మంచం దగ్గిరికి వెళ్ళి యాపిల్ ముక్కలు అందించింది రెండు చిన్న ముక్కలు తిని యింక వొద్దన్నాడు. కాఫీ పోసిచ్చింది. గటగటా తాగేశాడు.

"వేడిలేదు కదూ?" అంది.

రెప్పలు వాల్చి పడుకున్నాడు. కాళ్ళూ చేతులూ వొకలాగా వొంచాడు.

"వొళ్ళు నొప్పులా." అంది.

"వుఁహూఁ" అన్నట్లుగా తల కదిపాడు

అతనికి మగత కమ్మి నిద్ర పట్టింది.

రెండు అట్టపెట్టెలు వంటగదిలోకి చేర్చి మితంగా తెచ్చిన వంట సామాగ్రి సర్దింది. దిమ్మమీద కిరోసిన్ స్టౌ అమర్చింది. దినుసులు సర్దింది.

వొక అట్టపెట్టె మధ్య గదిలో తెరిచి, బట్టలు తీసుకుని గ్రా...లోకి

వెళ్ళింది. కొళాయిలో నీళ్ళు వొస్తున్నాయి. 'నయమే ఖాళీ వోవర్‌హెడ్ ట్యాంకూ వున్నట్లున్నయ్!' అనుకుంది.

అన్నమూ రసమూ తయారు చేసింది.

శ్రీపతికి యెనిమిదిన్నరకి మెలకువొచ్చింది. జ్వరం చూసింది. నూట మూడు.

"యీ పూట అన్నం తినండి యాంటీ బయాటిక్స్ వాడుతూంటే వర్లేదు, అన్నీ తినొచ్చుగా!" అంది.

"కుర్రాడు వొస్తాడు క్యారియరు లేదుగానీ హోటల్లో అడిగి తెమ్మను. నీకు భోజనం కావాలిగా—" అన్నాడు.

"అట్లాగే" అని లోనకెళ్ళి వళ్లెంలో కొద్దిగా చారు అన్నం కలుపు కొచ్చింది.

"యిదెక్కడిది?" అన్నాడు.

"ఆ పెట్టెల్లో వుంచి" అంది.

"యింటికెళ్ళి సామాను తెచ్చావా?"

"వూఁ"

"నాకెందుకు చెప్పలేదు?"

"చెప్పకపోయినా యిప్పుడు తెలుస్తుంది కదా అని. నేను హోటలు తిండి తినలేను బాబూ" అంది.

"నువ్వు అన్నిరకాల తిండికీ అలవాటుపడి వుంటావని నాకు తెలుసులే."

"తినండి ముందు."

"అన్నం తినాలనిపించటం లేదు."

"అన్నం తింటే కాస్త సత్తువగా వుంటుంది, నే తినిపించనా?"అం

"అవసర్లేదు." అని పళ్ళెం వొళ్ళో పెట్టుకుని తింటున్నాడు.

మంచినీళ్ళ గ్లాసు తెచ్చి చేతో పట్టుకుని కూచుంది.

"అక్కడ పెట్టు. అవసరమైనప్పుడు యిద్దువు. చెయ్యి నొప్పెడు తుంది." అన్నాడు.

గ్లాసు అరిచేతులో పెట్టుకుని చెయ్యి వొళ్ళో పెట్టుకుంది.

"యెవరితోనూ చేయించుకోని నేను నీతో యెందుకు చేయించు కోవాలి?" అన్నాడు.

"నేను మీకు రుణపడి వున్నందున"

"నువ్వు నాకు రుణపడి వుండటమా ఓసే! ఎప్పుడు?" అన్నాడు.

"అవును యీ రెండు వారాలేనండి. క్రితం జన్మలో కూడా నేమో." అంది.

మరో పావుగంటకి సుగతగా ఆపి పించి రెప్పలు వాల్చాడు

రాత్రి రెండుసార్లు వేళకి లేపి మందు యిచ్చింది వుదయం యెనిమిదైనా లేవకపోతే, చెయ్యి ముట్టుకుని ఆనించింది. అతను అలాగే నిద్ర పోతున్నాడు వొళ్ళు కాలిపోతోంది.

తలుపు తాళం పెట్టి రిక్షాలో, పిన్ని చూపిన ఆ ఆస్పత్రికి వెళ్ళింది. డాక్టరుకి చెబితే, విజిటింగ్ అవర్స్ అయ్యాక వొస్తానన్నాడు.

"టాక్సీలో యెంత సేపు పావుగంట. స్పృహ లేకుండా వున్నారు. జ్వరం యెక్కువైంది." అని బ్రతిమిలాడినట్లుగా అడిగింది.

సరే అని ఐదు నిమిషాల తరువాత బయల్దేరాడు టాక్సీలో.

తాళం తీసింది.

చూసి పరీక్షచేసి, "టైఫాయిడ్‌లోకి దింపే అవకాశాలున్నాయ్. చాలా జాగ్రత్తగా వుండాలి" అని యింజక్షను చేసి మందులు రాసిచ్చాడు రేపు వుదయం యెలా వుందో వొచ్చి చెప్పమని వెళ్ళిపోయాడు.

పని కుర్రాడికోసం చూస్తే పది నిమిషాలకి కనిపించాడు డబ్బులు చీటీ యిచ్చి, మందులు కొనుక్కురమ్మని చెప్పింది.

శ్రీపతి రెప్పలు విప్పనేలేదు. మగతగా పడుకునే వున్నాడు.

కస్తూరికి వంట చేసుకోవాలనిపించలేదు. బ్రెడ్డు తింది కాఫీ కలుపుకొని తాగింది.

ఐస్ బ్యాగ్‌గానీ తడి బట్టతోగానీ నుదుటిమీద అద్దుతూ వుండమని చెప్పాడు డాక్టరు.

పగలు కాసేపు వో కునుకుతప్ప మెలుకునే వుండి తడిబట్టతో నుదుటిమీద అద్దుతూ మందులు వేస్తూంది.

రెండో రోజుకి జ్వరం తగ్గింది. "టైఫాయిడ్ ప్రమాదం తప్పింది. యిక పర్లేదు" అన్నాడు డాక్టరు.

మొన్నటి రోజున ధనలక్ష్మి లోపలికి వొచ్చింది శ్రీపతికి జ్వరం అని తెలిసి. కస్తూరిని అదోలా చూసి వెళ్ళింది. యివాళ వొచ్చింది. యివాళ,

శ్రీపతి మంచంమీదే పడుకునివున్నా కళ్ళుతెరిచిచూస్తూ నిదానంగా మాట్లాడ గలుగుతున్నాడు.

ధనలక్ష్మి, పెయింటింగ్ సామాగ్రి చూసి, "మీకు పెయింటింగ్ కూడా వొచ్చునని చెప్పనేలేదు!" అంది.

"వొచ్చుననేం లేదు. సామాగ్రి వుంది, అంతే" అన్నాడు.

కస్తూరి వంటగదిలోకి వెళ్ళగానే, "ఆవిడెవరు? మీ చుట్టాలా? మీకే మౌతుంది?" అంది ధనలక్ష్మి.

"చుట్టంవూం కాదు. యేంవీంకాదు. వేశ్య"

"మీకు వాళ్ళు కూడా తెలుసా!" అంది ధనలక్ష్మి.

"నాకు అందరూ తెలుసు"

"వేశ్య యీ సమయంలో దేనికి?" అంది ధనలక్ష్మి.

"వేశ్య అంటే వెలయాలు—అని. డబ్బుకి అవసరాలు తీర్చేమనిషి అని. యిదీ అవసరమేగా?"

"మేమంతా లేవట్లు అట్లాంటి మనిషిని—" అని ఆగిపోయింది.

"కానీ నాకు యీమెతో యెలాంటి అవసరంవూ కలగలేదు. తన ఆదాయం వొదులుకుని చేస్తోంది!"

"యేదో స్వార్థం వుండకపోదు" అంది ధనలక్ష్మి.

"వేశ్యలకి స్వార్థం వుండదు" అన్నాడు. చిన్నగా నవ్వబోయాడు గాని శక్తి చాలలేదు.

అంతలో కస్తూరి కాఫీ కప్పుల ట్రే పట్టుకుని వొచ్చింది.

"యీమె మన్షి ధనలక్ష్మిగారని ఫ్రెండో" అని ధనలక్ష్మి వంకచూస్తూ "ఆమె వెలయాలు" అన్నాడు.

"కానీ శ్రీపతిగారికి నేనేమీ కాను"

"చెప్తే మేమూ చూసేవాళ్ళం" అంది ధనలక్ష్మి.

"నాకూ చెప్పలేదు" అంది కస్తూరి.

"మరి?" అంది ధనలక్ష్మి.

"కొందరిపట్ల మన బాధ్యతలు, చెప్పించుకోనక్కరలేదు చెయ్యడానికి. కొన్ని అనిర్వచనీయమైన రుణానుబంధాలుంటయ్" అంది కస్తూరి.

"మీరు చదువుకున్నట్లుగా అనిపిస్తున్నారు—"

చిన్నగా నవ్వి, "మేము శ్రీగంధంవారిమి. జాతకం జాగోక జీవితం

మరోదారి తొక్కింది. యెం. యే. చదువుతూ మానేశాను" అంది కస్తూరి

"అంత చదివి ఆ పని దేనికి ?" అంది ధనలక్ష్మి.

"అదైనా పనేగా!" అంది కస్తూరి.

"వస్తా" అని యిద్దరి వంకా చూసి వెళ్ళింది ధనలక్ష్మి.

"యెమ్మే చదువుతూ మానేసినట్లుగా యెందుకు చెప్పావ్?"అన్నాడు శ్రీపతి సంతోషంగా

"ఆమెని చూస్తే అట్లా చెప్పాలనిపించింది ఆమె సంగతి పక్క-ముక్కలో చెప్పేసెయ్యనా? మిమ్మల్ని పెళ్ళిచేసుకోవాలని కోర్కె. ద్రాక్ష పళ్ళు పుల్లన అని అనుకునే దశలో నేనిక్కడ కనిపించాను. ద్రాక్షపళ్ళు కాదు వాక్కాయలు అని అనుకుని తృప్తిపడుతుందిక" అని చిన్నగా నవ్వింది.

ఆ మరునటి రోజున అప్పటివరకూ శ్రీపతితో పరిచయం లేని వ్యక్తి — మేడ మీద వుంటాడు. వొచ్చి, "మీకు వొంట్లో బాగా లేదని తెలిసింది" అని కస్తూరి వంక చూసి, "మీ శ్రీపతిగారా" అన్నాడు వ్యంగ్యంగా.

"నాకు వూరినిండా చాలామంది శ్రీమతులున్నారండీ. నమష్టి శ్రీమతులు. వాళ్ళలో యీవిడొకరు. నాకు సుశ్రూష చెయ్యటానికి వొచ్చింది. తీరికగాలేదు నాకు కాస్త స్వస్థత చిక్కాక ఆమెకి వీలంటుంది. మీకు ఆసక్తి వుంటే చెప్పి వుంచుకోవొచ్చు" అన్నాడు శ్రీపతి.

"నేనట్లాంటివాణ్ని కానండీ" అన్నాడు గర్వంగా.

"అయ్యో అలాగా!" అని జాలిపడుతున్నట్లుగా అని, "నేనలాంటి వాడినేనండి" అన్నాడు శ్రీపతి సంతృప్తిగా.

ఆ సాయంత్రం మరో యిద్దరితో వొచ్చి, "సంసారులుండే యింట్లో యిదేం బాగులేదండీ" అన్నాడు.

"యిదివరకంతా సన్యాసిగానే వున్నానుగానీ మొన్న జ్వరం వచ్చి నప్పటినుంచి నేనూ సంసారినేనండీ" అన్నాడు శ్రీపతి.

"పోలీసుకేసు అవుతుంది"

"పోలీసులకి కాకపోతే పీబాబుకి చెప్పుకో పో" అన్నాడు శ్రీపతి గొంతు పెంచకుండానే.

"చూద్దురుగాని తెలుస్తుందిగా !" అని వెళ్ళిపోయారు.

"ఇట్లాంటి గొడవలో నన్నునే వెనకాడాను" అంది కస్తూరి.

"నేను, యిలాంటి గొడవలని కాదు గానీ నీకు కష్టమూ నష్టమూ అని వెనకాడాను"

"మీకు పుణ్యం వుంటుంది ఆ మాట మాత్రం అనకండి" అంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"కస్తూరీ యెందుకు నీకంతిది నేనంటే!"

"నన్ను మీరెప్పుడూ తా: లేదెందుకని ? నన్ను చూస్తే మీకేమని పిస్తుంది? అందరికీ అనిపించినట్లు అనిపించదు. చెల్లెలుగాగానీ అనిపిస్తుందా" అంది.

"నాకు తోడబుట్టినవాళ్ళు లేరు. ఆ సంగతి తెలియటానికి."

"యీ గొడవంతా ఆ ధన ...మ్మ తెచ్చింది" అంది.

"యిన్నిరోజులనుంచి యి... డుంటూంటే చాలా డల్‌గావుంటోంది. యిదీ సరదాగానే వుంది. రేపో మొ...దో ఋంటివాణ్ని పంపిస్తారు. వాడికి పావలా కరవాతేయేదైనా! ... పెంచుతానని చెపితే—ఆమె ఆయన చెల్లెలు—అని వాళ్ళతో ఋ...యించి వెళ్ళగలడు!"

మరసటిరోజుకి శ్రీపతి ...స్త ...కున్నాడు.

"నేను కోలుకుంటున్నానుగాని నువ్వు నీరసించిపోతున్నావు రాత్రు ళ్ళంటే మేలుకుని వుండగ...వు. పగళ్ళు మేలుకుని వుండటం అలవాటు లేదేమో బాగా వాడిపోయావు. ...లా ఐతే నేను నీకు చాలా నష్టపరి హారం చెల్లించాలి" అని, "తమాషాకి అన్నాను బాధపడకూ" అన్నాడు ఆప్యాయంగా.

ఆ ఆప్యాయతకి చలించిపోయింది.

రాత్రి అతను నిద్రపోతూ వున్నాడు. ఆమె కుర్చీలో కూచుని చూస్తూ వుంది. కాసేపటికి లేచి, మంచం దగ్గిరికి వెళ్ళి—

అతని పాదాలమీద చేతుల ఆనించింది. గాఢ నిద్రలోవున్న అతనికి తెలియదు

ఆ మరసటి రోజు, వాకిట్లోంచి యెవరో "శ్రీపతిగారూ" అనిపిలిస్తే కస్తూరి వెళ్ళి చూస్తూ, మూర్ఛాండ ...నే ఆమె కాళ్ళు వాణికాయి. వాళ్లో వెత్తురు మరిగినట్లు ఐంది ...వ తిరిగి లోనకి వచ్చి శ్రీపతి చెవి దగ్గిరికి వొంగి, "వాను ఆ ...హ ...వొచ్చాడు" అన్నదన్నుడు

వొస్తుంటాడా? మీకు బాగా పరిచయమా?" అంది చిన్నగా.

నెమ్మదిగా లేచి ముందుగదిలోకి వెళ్ళి, "హలో విజయ్‌కుమార్, మీరా రండి" అని కుర్చీలో కూచున్నాడు శ్రీపతి.

విజయ్‌కుమార్ లోపలికి అడుగులువేసి కుర్చీలో కూచున్నాడు.

కస్తూరి గుమ్మం పక్కగా చప్పుడుకాకుండా కుర్చీ వేసుకుని కూచుని, వింటోంది.

"యేంటి వొంట్లో బాగాలేదా? కొంత డల్‌గా అనిపిస్తున్నారు?" అన్నాడు విజయకుమార్.

"అవును యీమధ్య పదిహేను రోజులనుంచి జ్వరం"

"అయ్యో అట్లాగా. నాకు తెలవనే తెలవదు. తగ్గిందా?"

"తగ్గినట్లే" అన్నాడు శ్రీపతి.

"యింట్లో యెవరో—"

"నాకు జ్వరంగా వుందని వొచ్చి—"

"ఆవిడా—"

"నా కాబోయే భార్య" అన్నాడు శ్రీపతి.

"యేంటీ!"

"యింకా తుది నిర్ణయం కాలేదు. ఆ ఆలోచనలో వున్నాం"

"నాకు కావాల్సిన మిత్రులు అందుకని వొక విషయం చెప్పదలిచాను మీ శ్రేయస్సు కోరి."

"సెలవియ్యండి" అన్నాడు శ్రీపతి,

అదోలా చూసి, "ఆమె మీకు బాగా తెలుసా?" అన్నాడు విజయ్‌కుమార్.

"బాగా తెలుసా అంటే యిటీవలి పరిచయం. పరిచయం అవక్పటి నుంచి తెలుసు."

"ఆమెది గుంటూరు"

"మీకు బంధువా యేవిటి!"

"ఛఛా! కాదు. పెద్ద హిస్టరీలే. వొక స్థితివరుడ్ని వొలలో వేసుకోవాలని ప్రయత్నించి. అంతకంటే స్థితిపరుడిమీద కన్నుపడి— అట్లా అట్లా చివరికి బజారుపాలైంది. నేనూ గుంటూరు వాణ్నే కాబట్టి నా పేరు విని నేనూ

చెడిపోయిన మనిషి."

"వొక స్త్రీ చెడాలంటే చాలామంది మగాళ్ళు చెడాలనుకుంటాను."

"మగకి ఆడకి పోలికేంటి? వాళ్ళమ్ముకుని బతికేవాళ్ళని—"

"యెవడో నీచుడు మోసగించితే వొక్కో స్త్రీ వొళ్ళమ్ముకుని బత కాల్సి రావొచ్చు కానీ చాలామంది మగాళ్ళు మనసుని కూడా అమ్ముకుని బతుకుతుంటారు."

"ఆదర్శాలు వేరు జీవితం వేరు శ్రీపతిగారూ"

"మార్క్సిజం అలా అనదనుకుంటాను!" అన్నాడు శ్రీపతి.

"మార్క్సిజాన్ని యిట్లాంటి సందర్భాల్లో తేవటం సరికాదు. మన హిందూ స్థితి గతులు వేరు. పతనమైన స్త్రీని చేసుకుంటే—"

"కానీ అదే పతనం అనుకుంటే, నాకంటే పతనమైందా అని నా సందేహం!"

"మీరు పతనమవటమేమిటి, నాన్సెన్స్!" అన్నాడు విజయ్‌కుమార్.

"నేను పతనం అవని వాణ్నయితే ఆమె పతనమైనట్లు యెలా అను కోవటం?"

"పెళ్ళి అవకుండా కడుపుచేయించుకుని—"

"యింకా నయం రజస్వలవకుండానే కడుపొచ్చిందనలేదు. కడుపు యెవడో వొకడు చేస్తేనేగా వొచ్చేది! మగాడికి కడుపొచ్చే వీలుంటే, ఆడది మగాడికి కడుపు చేసే వీలుంటే, చరిత్ర యెలా వుండునంటారు?" అన్నాడు శ్రీపతి.

శ్రీపతికి కస్తూరిచేత కాఫీ తెప్పించి విజయ్‌కుమార్‌కి యిప్పించాలని పించింది. కానీ ఆమె అవమానంతో కుంగిపోతుంది. లేదూ, కాఫీ వాడి మొహంమీద దిమ్మరించి లోపలికి వెళ్ళిపోతుంది. మొదటిది, నేను సహించను. రెండోది సరదాగానే అనిపిస్తుందిగానీ భావ్యంకాదు—యింటికి వొచ్చినవాడు కదా'—అనుకున్నాడు శ్రీపతి.

"ఆమె పేరు యేమని చెప్పింది?" అన్నాడు విజయ్‌కుమార్.

"మిసెస్ యస్. వి. కె. అంది. అంటే యేమిటంటే దానికి చాలా అర్థాలుంటాయి—అంది. కొత్త పరిచయంగా—యింకా తన వెనుకటి విష యాలు అంతగా తెలియవు."

"మీరు ఆ గుంటూరు గుడిశేటిదాన్ని యెంత తొందరగా వొదిలిం

కుంటే అంత మంచిది. వాళ్ళ అసలు పేర్లు చెప్తారా! యెన్నో అవతారాలెత్తుతారు!

"ఐతే అలాంటి సత్సంకల్పం మాకుకోసుంటారు!"

"లక్షణంగా. ఊపొడి పోరంబోకు అంతా. సంబార్లో యెవర్నడిగినా దాని సంగతి చెప్తారు యీ స్వాతంత్ర్యాన్ని వాడిరించుకోండి. మీ యెడ్డెటుకే కుప్ప తెచ్చినా తేగలను. నా ఫ్రెండు వొకడు సీవి వల్లో పడి నానా పాపా చచ్చి చివరికి బయటపడ్డాడు. వెళ్తాస్తా—" అని లేవబోతుంటే, "వొచ్చిన పని చెప్పనేలేదు" అన్నాడు శ్రీపతి.

"పని— పని— యేం లేదు. పూరకే మిమ్మల్నోసారి చూసెళ్దామని వొచ్చా" అని లేచి హడావుడిగా వెళ్ళిపోయాడు విజయ్‌కుమార్.

స్కూటర్ చప్పుడు.

తలుపు వేసి లోనకి వొచ్చాడు. మంచంమీద కూచున్నాడు.

కస్తూరి కళ్ళవెంట నీళ్ళు.

కన్నీటివంక చూస్తూ, "యెందుకు?" అన్నాడు.

"నా బతుకు తలుచుకుంటే బాధ. మిమ్మల్ని తలుచుకుంటే ఆనందం. వాడి ప్రాణాలు విలువైనా తీసేసి, మీకోసం నా ప్రాణాలర్పించాలనిపిస్తోంది." అంది.

"రెండూ అనవసరమే" అన్నాడు.

"నేను వాణ్ని యెప్పుడో చంపివుండును కానీ ఆక్కామణ్ని నీచుణ్ని తుచ్ఛుణ్ని చంపను. నా కన్నబిడ్డ వాణ్ని తన కన్నతండ్రిగా అసహ్యించుకుని, ఛీ—అని ముఖాన వుమ్మేయ్యడం—నేను కోరుకొనేది. అందుకే బతికివున్నాను. లేకపోతే యేనాడో వాణ్ని చంపి, నా ప్రాణాలు నేను తీసేసుకుని వుండును" అంది ఆవేశంగా.

ఆ మూడోరోజున "యెన్నాళ్ళిలా సంపాదన లేకుండా? అనిల్‌కి డబ్బు యెలా కడతావు!" అన్నాడు శ్రీపతి.

"నేను హాస్పిటల్లో పడివున్నప్పుడు యెవరు కట్టారో వాళ్ళే!" అని తృప్తిగా అతనివంక చూసింది.

యీ రోజు వరంగల్ వెళ్ళిన మోహన్‌రెడ్డి తిరిగివొచ్చాడు. జ్వరం సంగతి చెప్పి, "యీమె నా నేస్తం. జ్వరపడితే ఆస్పత్రికి వెళ్ళనివ్వకుండా శుశ్రూష చేసింది" అని, "మా మోహన్ వొచ్చాడు. తను చూసుకుంటాడు

"నువ్వు వెళ్ళొచ్చునమ్మా కస్తూరీ" అన్నాడు శ్రీపతి.

ఆ మరసటి రోజు అట్టపెట్టెయి సర్దుకుని వెళ్ళిపోయింది కస్తూరి. రిక్షా యెక్కుతూ శ్రీపతివంక చూసిన కస్తూరి కళ్ళలో నీళ్ళు— ఆత్మీయ భావపు వొత్తిడికి వచ్చిన కన్నీళ్ళు.

# 110

యీరోజు విజయ్‌కుమార్‌కి రెండో తొలిరేయి. మూడు నెలల క్రితం విజయ్‌కుమార్‌కి రెండో పెళ్ళి జరిగింది, కనకదుర్గతో. ఆమె తండ్రి చిరుమామిళ్ళ భావనారాయణకి లాన్డ్ సీలింగ్‌లో పోగా మిగిలిన ఆస్తే బోలెడుంది—కొంత భూమి పాత దస్తావేజులతో డబ్బులోకి మార్చటంవల్ల. తిరువూరు ప్రాంతం. కనకదుర్గ యేకైక సంతానం.

రేపు పెళ్ళి అనగా వై. వి. యల్. యన్. వి. ప్రసాద్‌కి శుభలేఖ అందింది. వాళ్ళకీ వీళ్ళకీ దూరపు చుట్టరికం వుంది. ప్రసాద్ బద్ధకించి వెళ్ళక పోయినా వెళ్ళకపోనేమోగానీ, పెళ్ళి విజయ్‌కుమార్‌తో అని చూసేసరికి వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు. రాత్రి రెండున్నరకి పెళ్ళి.

అతను చేరేసరికి రాత్రి పదిన్నర అయింది. కనకదుర్గ తండ్రితో అతనికి ముఖపరిచయం కూడా లేదు. తన తండ్రికి బాగా తెలుసు. వెళ్ళగానే అతనిని కలుసుకుని, తను ఫలానా అని చెప్పాడు "నువ్వా బాబు చాలా సంతోషం. నాన్నగారు వొస్తారనుకున్నాం. రాలేదేం బాబూ?" అన్నాడు భావనారాయణ.

"ఆయనకి యీ మధ్య ఒంట్లో బాగుండటంలేదు. నేను నేరు హైదరాబాదు నుంచివొచ్చాను. శుభలేఖ యీ పొద్దుటే అందింది" అన్నాడు ప్రసాద్.

"అయ్యో అట్లాగా? మేమెప్పుడో పోస్ట్ చేయించాం"

"తొందర పనుల్లో వుండివుంటారు. నేను అర్జంటుగా వొకవిషయం మీతో చెప్పాలని—"

"పనుల్దేముంది—పర్లేదు. చెప్పు బాబూ"

"మీరు కాబోయే అల్లుడు విజయ్‌కుమార్ నాకూ, నా ఫ్రెండ్స్‌కి

చాలాకాలంగా తెలుసు. మీకు అన్నిసంగతులూ తెలిసేవుండాలి—" అన్నాడు ప్రసాద్.

వొక్కతే కూతురు, ఐనా రెండో పెళ్ళివాడైనా, ఆస్తిని దృష్టిలో పెట్టుకునీ అతని వయసు తక్కువేకదా అనీ యీ సంబంధానికి నిర్ణయించుకున్నాడు కనకదుర్గ తండ్రి భావనారాయణ.

"తెలుసుననే అనుకుంటున్నాం. అటు గుంటూరువైపు. కొద్దినెలల క్రితం భార్య వైరల్ ఫీవర్‌తో చనిపోయింది, పాపం. యెవరో యీ సంబంధం గురించి చెప్తే అన్నీ బాగానే అనిపించి పెళ్ళినూప్రు యేర్పాటు చేశాం. అమ్మాయీ అబ్బాయీ యిష్టపడ్డారు—"

మధ్యలో అందుకుని, "ఆ విషయాల గురించి కాదు. వొక ముఖ్యమైన విషయం. చిన్నవాణ్ని చెప్పకూడదేమో గాని — యీ సంవత్సరంలో మా నాన్నగారు వుండివుంటే చెప్పి వుండేవారని చెప్పవచ్చాను. అన్నట్లు కార్యం పెళ్ళవగానే నిర్ణయించారా?"

"యింకా అనుకోలేదు. తొందరలో జరిపించాలని అటునుంచి సూచన కనిపించింది. మూడు నిద్రలకి వెళ్తాస్తారు — ఆ తర్వాత మంచిచి చూసి—"

"అది రెండు మూడు నెలలు వాయిదావెయ్యండి వీలైతే. వెంటనే కాపరానికిపంపండి. కాపరానికంటే మరేంలేదు. పెళ్ళి అత్తవారింట్లో వుంటూ వుంటుంది. అతను హైదరాబాదులో వాళ్ళ బాబాయి వాళ్ళింట్లో వుంటాడు. మీకు సంగతులన్నీ తెలిసేవుండాలి. ఆ అన్నదమ్ములు కలిసేవుంటారు. వీళ్ళ అనుకూల దాంపత్యం కోసం నేనీ సూచన చేస్తున్నాను" అన్నాడు ప్రసాద్.

"బాబూ యేదైనా విషయం వుంటే చెప్పుబాబూ. పిల్లతండ్రిని. వొక్కగానొక్క బిడ్డ గొంతు కోయదలచముగా— యిప్పటికీ మించిపోలేదు అంత విషమమైనదేదైనా వుంటే—" అన్నాడు సంచలనంగా.

"అట్లాంటిదేంలేదండి. విజయ్‌కుమార్ వ్యాపారం తదితరవిషయాల్లో మంచి దిట్ట. కాకపోతే కాస్త తిరుగుబోతు"

మధ్యలోనే అందుకుని "చూచాయగా అదీ తెలిసింది గానీ యేదో కుర్రతనం దానిదేముంది అమ్మాయి వెళ్ళినాక అంతా సర్దైపోతుందని నలుగురూ అంటేను—"

"అదే నేను చెప్పబోయేదీ. అక్కడ అతని పిన్నిని తప్ప యెవరినీ విశ్వసించకూడదు. మళ్ళీ అందరితోనూ మంచిగానే వుండాలి. అతని పిన్ని చాలా యోగ్యురాలు వుత్తమురాలు. కానీ ఆమె మాట యెందులోనూ సాగదు. మేము వుండేది అక్కడేగా. నేనూ మా ఆవిడా వుంటాం. కలుసుకుని సహకరిస్తాం. అమ్మాయిని వొకసారి చూడదలిచాను. పరిచయంవొద్దు. లోపకివెళ్ళి చెప్పి అమ్మాయితో మంచినీళ్ళు తెప్పించి యివ్వండి" అన్నాడు ప్రసాద్.

భావనారాయణ వెళ్ళాడు, తెల్లని దుబ్బుజుట్టు సవరించుకుంటూ.

పెళ్ళిచూపుల్లో వొకరి నొకరు చూసుకున్నారు. విజయ్‌కుమార్ పక్కన అంతవల్లిగా అనిపించదుగానీ, నలుపే. పోలికలు-యేదోవుంటాయి. అనాకారి కాదు. విజయ్‌కుమార్ కంటికి కనకదుర్గ అవయవాలూ అవీ నచ్చి రూపం కోర్కె పుట్టించేదిగా వుండి — సంతోషించాడు. లేకపోయినా కాదనకపోను. కనకదుర్గకి విజయ్‌కుమార్ బాగానే అనిపించాడు. సంబంధం చూశారు. పెద్దలు నిర్ణయిస్తే కాదనాల్సినంత యిదిగా యేమీ అనిపించలేదు ఆమెకి. చిన్నప్పుడు హైదరాబాద్ కాన్వెంటులో ఐదారేళ్ళు చదువుకుంది, వాళ్ళ మేనమామ యింట్లోవుండి. అతనికి ఢిల్లీ బదిలీ ఐ వెళ్ళినపుడు వూరు వొచ్చింది. ఆమెకి చదువంటే ఆసక్తిలేదు. లలితకళలంటే చాలా యిష్టం. ఐతే యేవీ అభ్యసించలేదు.

భావనారాయణ వొచ్చి, "బాబూ సందేహించకు. యేదైనా ముఖ్యమైన అంశం వుంటే — తర్వాత బాధపడాల్సి వొచ్చేదైతే — కావాల్సినవాడివి. నేనే అడుగుతున్నాను. చెప్పనాయినా" అన్నాడు.

"అట్లాంటిదేం లేదండీ. మీరు నిశ్చింతగా వుండండి. అమ్మాయి భర్తని కొత్త అదుపులో పెట్టుకోవాల్సిన అవసరం యెంతైనావుంది. అందుకని కార్యం వెంటనే జరగనివ్వకండి. ఆలోగా హైదరాబాద్‌లో మేము పరిచయం చేసుకుంటాం" అని తన విజిటింగ్ కార్డు భావనారాయణకి యిచ్చాడు ప్రసాద్.

అంతలో కనకదుర్గ మంచినీళ్ళ గ్లాసుతో వొచ్చింది.

"మన రామక్రిష్ణ ప్రసాద్ గారబ్బాయి" అని కూతురితో అన్నాడు భావనారాయణ.

గ్లాసు అందుకుంటూ పరిశీలనగా చూశాడు ప్రసాద్. 'మనిషిని

చూస్తే బాగా పలుకున్నదాన్లాగా వుంది' అనుకున్నాడు.

ఆమె కళ్ళలో చురుకుదనమూ పదునూ వున్నాయి.

పెళ్ళి తరవాత. దంపతుల్ని విజయ్‌కుమార్ వాళ్ళ సొంతవూరు తీసికెళ్ళారు. కనకదుర్గతోపాటు వాళ్ళ చిన్న త్తకూతురు మరొకరు వెళ్ళారు. ఆచారం ప్రకారము దంపతులు కలుసుకునే అవకాశం లేకుండా. ఆడవాళ్ళ లోనే వుంటుంది పెళ్ళికూతురు.

ఆ తరవాత నెల రోజులకి కనకదుర్గని హైదరాబాద్ తీసుకువొచ్చాడు తండ్రి. వుదయం వొచ్చారు. సాయంత్రం తొలుగింటికే భావనారాయణ ప్రసాద్ యింటికి వెళ్ళాడు. "మామయ్యగారూ—" అంటూ మర్యాద చేసింది విమల.

వ్యాపారం తదితరమైన కబుర్లు.

"యింక వెళ్తానమ్మా—" అని లేస్తుంటే, "మేము బజారు వెళ్తున్నాం దారిలో మిమ్మల్ని డ్రాప్ చేస్తాం" అన్నాడు ప్రసాద్.

కారు విజయ్‌కుమార్ వాళ్ళ యిల్లు చేరాక, భావనారాయణ దిగి, "రెండు నిమిషాలు రాకూడదూ?" అని, విమలవైపు చూసి, "అమ్మాయిని చూడలేదుగా. పెళ్ళికి మీ ఆయనతో కలిసి రాకపోతి..." అన్నాడు.

లోపకి వెళ్ళారు

విజయ్ పిన్తల్లి వొచ్చి, "ఆయన రాత్రిగ్గానీ రారు. అబ్బాయి యిప్పటిదాకా వున్నాడు. యిప్పుడే బయటికెళ్ళాడు" అని కనకదుర్గని పిలి చింది.

అవీ యివీ కబుర్లు. కాఫీ

ప్రసాదు, విమల బయల్దేరారు. పంపించటానికి భావనారాయణ వాళ్ళ కూడా మేడమెట్లు దిగాడు, కూతుర్ని కూడా రమ్మని సౌంజ్ఞచేస్తూ.

మెట్లు దిగుతూ విమలతో, "ఆ అమ్మాయిని అట్లా మొక్కల్లోకి తీసికెళ్ళు" అన్నాడు ప్రసాద్ చిన్నగా.

పోర్టికోలోకి వెళ్ళాక, "కొన్నాళ్ళు వుంటారా?" అన్నాడు ప్రసాద్ భావనారాయణతో.

రెండు రోజుల్లో వెళ్ళాలనీ వూళ్ళో జరూరు పనులు యేకరువు పెడుతున్నాడు భావనారాయణ.

"గార్డెన్ బాగుందికదా?" అంది విమల కనకదుర్గతో.

"అవును. నేనింకా చూడనేలేదు. పొద్దుటేగా వొచ్చాను" అంది.

విమల, "అది సన్ ఫ్లవర్ మొక్కా?" అని రెండడుగులు అటు వేస్తూ కనకదుర్గ వొంక చూసింది. ఆమె కూడా వొచ్చేందుకు.

యిద్దరూ అటు వెళ్ళారు.

"నే విన్నదాన్నిబట్టి మీ వారితో చాలా కష్టం జాగ్రత్తగా వుండాలి, కావలసిన వాళ్ళు కాబట్టి చెప్తున్నాను ఆవిడ మీ చిన్నత్త చాలా వుత్తము రాలు—"

మధ్యలోనే అందుకొని "మొదటి భార్య యెట్లా చచ్చిపోయింది. అంత సడన్‌గా? వైరల్ ఫీవరంటకదా, అవునా?" అంది కనకదుర్గ.

"ఆ మనిషిప్పుడు లేదుగా యెట్లా పోతే యేంగానీ—"

భయంగా చూసి, "ఐతే—" అని ఆగిపోయింది కనకదుర్గ.

"ఐతేలేదు గియితేలేదు. భయపడాల్సిందేమీ లేదు. మీ చిన మామయ్యా మీ వారూ లేనప్పుడు ఫోను చెయ్యండి" అని ఫోను నెంబరు చెప్పింది విమల.

అంతలో ప్రసాద్ పిలిచాడు. తిరిగి వెళ్ళారు.

"వీలైతే మీరిద్దరూ రేపు సాయంత్రం వొకసారి రాకూడదూ?" అన్నాడు ప్రసాద్.

"అట్లాగే వొస్తాం" అన్నాడు భావనారాయణ.

మరనటి రోజు సాయంత్రం, "చెల్లెమ్మా వూళ్ళో తెలిసిన వాళ్ళింటికి అట్లా వెళ్ళొస్తాము, అమ్మాయిని తీసుకుని" అన్నాడు భావనారాయణ.

"అయ్యో ముందుగా తెలిస్తే కారు అట్టేపెట్టి వెళ్ళేవారుగా! విజయ్ కూడా లేడు వేళకి" అంది నొచ్చుకుంటూ

'యెప్పుడో వొచ్చాను సిటీకి. వూరు చూస్తూ వెళ్ళొస్తాం" అన్నాడు భావనారాయణ.

ఆరింటికి వెళ్ళారు

వీళ్ళు వెళ్ళేసరికి, విమల ప్రసాద్‌లు వాకిట్లో పూలమొక్కల్లో టచ్చాడుతున్నారు. చూసి, గేటు దగ్గిరికి వొచ్చి లోనకి తీసుకువెళ్ళారు.

భావనారాయణ ప్రసాద్ తండ్రి వాళ్ళ బంధువుల కబుర్లు చెబుతున్నాడు.

అంతలో ఫోను మోగింది. విమల అందుకుని విని, "ఏఐసాను

వుండండి" అని రిసీవర్ మీద చెయ్యి అల్చి మూసి, "ఫ్యాక్టరీనుంచి మీకు" అంది.

ప్రసాద్ లేచి వెళ్ళి అంగుకుని వాళ్ళ ... "అట్లా అంటున్నారా, అదెట్లా వీలవుతుంది? నే వొస్తున్నాను ఇదే—"అని భావనారాయణ వంక చూసి, "అర్జంటుపని వొచ్చింది. వెళ్ళాలి మన్నించండి. ఆలస్యం అవదు. మీరూ రాకూడదూ. మాఫ్యాక్టరీ చూసినట్లు అవుతుంది" అన్నాడు.

"నేను కబుర్లు చెప్పుకుంటూ వుంటాను వెళ్ళిరండి" అంది విమల.

ఆ యిద్దరూ వెళ్ళారు. వాళ్ళు అటు వెళ్ళగానే, "మావారి సంగతి— విజయ్‌కుమార్ గారి ఘనత కొద్దిగా విన్నాను కాని — అసలు విషయం యేంటో చెప్పకూడదూ?" అంది కనకదుర్గ.

"మీ శుభలేఖ చూడగానే ఆయన చాలా నవ్వేశారు. మీరు మావారికి బంధువులట. మీరు వొక వరసన చెల్లెలు యింకో వరసన మరదలు అవుతారట. కొన్ని కొన్ని దూరపు వరసలు తమాషాగా వుంటయ్ కదా!" అని చిన్నగా నవ్వి, "మీ పెళ్ళి విజయ్‌కుమార్ గారితో అని తెలిసి వెంటనే పెళ్ళికి వొచ్చేవాడు. లేకపోతే రాకపోనేమో. ఆ టైంలో ఫ్యాక్టరీలో గొడవేదో వుందికూడా—"

మధ్యలో ఆపి, "మొదటి భార్య పేరు సీత—అని విన్నా. ఆమె యెట్లా చచ్చిపోయిందో చెప్పండి ముందు" అంది కనకదుర్గ.

"మనిషి యెట్లా చచ్చిపోతారు? ప్రాణం పోయి!" అని చిన్నగా నవ్వింది విమల

సహజ మరణంకాదుకదా?"

"యేమో. ఆత్మహత్య అని వినికిడి హత్య కాకపోవచ్చు. వైరల్ ఫీవరేనేమో—

మధ్యలోనేఆపి, "విజయ్‌కుమార్‌గారి స్వభావం యెట్లాంటిది?"అంది కనకదుర్గ.

అంతలో వాకిట్లో కారు ఆగిన చప్పుడు. కారులోంచి వందన దిగింది.

లోపలికొస్తూ, "హలో విమ్మీ యింట్లకెళ్లి స్టార్ట్ ఐనప్పుడు నాకి

కలే యిటొస్తనని సడన్‌గ నువ్వు గుర్తొచ్చి వొచ్చేస్తి" అంది వందన కూచుంటూ.

"యీమె వందన" అని కనకదుర్గవైపు తిరిగి "కనకదుర్గ అనీ—" అంటూ చెప్పబోతోంది విమల.

మధ్యలోనే అందుకొని, "బై యెనీ ఛాన్స్— సెన్ట్‌యేన్స్‌లో చదివిన—' అని వందన అంటూండగానే, "హలో వందనా నేనూ—"అని కనకదుర్గ అంటూంటే, అందుకుని, "హాయ్ దుర్గీ ది బ్లాక్ గాడెస్ వాట్ సర్‌ప్రైజ్. యెక్కడా? యేమ్టీ? వీళ్ళు మీకు రిలెటివ్సా?" అంది వందన.

"మా వారికి చుట్టాలు. యిప్పుడు నాకూ" అని నవ్వింది విమల.

అమాంతం వందనా కనకదుర్గా లేచారు. వొకరినొకరు కావిలించు కున్నారు. కనకదుర్గ, వందన బుగ్గ పట్టుకుని లాగింది.

"యింకా అప్పటి మిస్చిఫ్ పోలే పోరీ! అని, కనకదుర్గ జబ్బమీద గిచ్చింది వందన.

"మా జాయ్‌ఫుల్ మీటింగ్‌లో నిన్ను మర్చిపోయినం కదా విమ్లా" అని వందన కనకదుర్గ చెయ్యి పట్టుకుని—యిద్దరూ వొకే సోఫాలో పక్క పక్కనే కూచున్నారు.

"యింతకూ మీరిద్దరూ—" అంటోంది విమల.

"యీ పోరి—"అని వందన చెప్పబోతూంటే—"యీ కర్రి పోరి" అని అందించింది కనకదుర్గ.

"అలోస్ యీ బ్లాక్ గాడెస్—చిన్నప్పుడు ఐదారేండ్లు మేమిద్దరం క్లాస్‌మేట్స్‌మి. అద్సరే యింత కాలానిక్కి" అని విమలవైపు తల తిప్పి, "వీండ్లని చూసేదానికి వొస్తివా?" అంది వందన.

"అత్తవారింటికి వొచ్చింది. విజయ్‌కుమార్ గారి భార్య. నవవధువు అంది విమల.

"యే విజయ్‌కుమార్?"

"మన నిజాం కాలేజీ విజయ్‌కుమారే"అంది విమల.

"డోన్ట్ కట్ సచ్ టెరిబిల్ జోక్స్" అంది వందన.

"టెరిబిల్ ఐనా గిరిబిల్ ఐనా అది జోక్ కాదు" అంది విమల.

"అదెట్లా జరిగింది విమ్లా. నువ్వేమిటిక్క చెప్పనలే అంది

అంతలో ఫోను మోగింది. విమల అందుకొని ... [illegible]

వందన.

కనకదుర్గ ముఖం దిగులుగా వుంది. లోన యేదో తెలియని భయం గానూ అనిపించింది ఆమెకి.

పక్కకి తిరిగి కనకదుర్గ వంక చూస్తూ, "ఐతే నీకు విజయ్‌కుమార్ గురించి యేమీ తెల్వదన్నమాట! పోష్—" అని వందన మొదలెడితె విమల అందుకుని. "వందనా ఆమె నీ ఫ్రెండూ మా బంధువూ. విజయ్ కుమార్‌గారి భార్య. యిప్పుడు అనవసరమైన విషయాలు దేనికి? అంతా సవ్యంగానే వుండొచ్చు?" అంది.

"నో ఐ కాన్ట్ స్పేర్— యెప్మీ స్పేర్ చెయ్యలేనిది? ఆనవి యీవిల్‌నెస్‌ని, నా దుర్గ లైఫ్‌ని—దుర్గా విను, చెప్తా"

"వందనా ఫూలిష్‌గా ప్రవర్తించకు. నువ్వు చెప్పాల్సిందేమీ వుండదు భార్యాభర్తలు వాళ్ళ సంగతి వాళ్ళు చూసుకోగలుగుతారు" అంది విమల.

"యూ ఆర్ యె టిపికల్ హౌజీఫ్. డోన్ట్ సాఫ్టెన్ థింగ్స్" అని కనకదుర్గ వైపు తిరిగి, "నువ్వు పెళ్ళాడిన మనిషి భయంకరమైన మనిషి. నీ జీవితాన్ని యెంత నీచంగా ఘోరంగా అయినా చెయ్యగలడు" అంది వందన యింగ్లీషులో.

కనకదుర్గ వొణుకుతోంది. ఆమె కళ్ళలో నీళ్ళు.

చూసి, ఆమె చుట్టూ చెయ్యివేసి దగ్గిరికి తీసుకుని, "డియర్ దుర్గీ బట్ నథింగ్ టు వర్రీ. ఆ మొదటి భార్య యెవరో నాకు తెల్వదు. సతీ సావిత్రినో, సతీఅనసూయనో ఫూలిష్‌గా ఆహూతైపోయినది. యు కెన్ మేనేజ్ హిమ్" అని విమలవైపు తిరిగి, "పెండ్లి గిండ్లి లేక వున్నదాన్కి జెలసీతోటి అంటున్ననుకోవద్దు. దుర్గ జీవితం పాడు కాకుండా వుండటాన్కి చెప్తున్న. జరిగిపోయినది జరిగిపోయినది. యేంచేస్తం! యు హ్యావ్ టు సెట్ హిమ్ రైట్. అందితే జుట్టు పట్టుకోనుడు విజయ్‌కుమార్ నేచర్" అంది వందన.

"అందకపోతే కాళ్ళు పట్టుకుంటారా?" అంది కనకదుర్గ

"అదేమో తెలియదుగాని, చేతులు ముడ్చుకుని కూచుంటడు."

"విన్నేమన్నా—"

"అవన్నీ దేన్కి? పోనీ"

"మావారి ఘనత గురించి వినాలని సరదాగా వుంది చెప్పవే, నేనేమీ

అనుకోను" అంది కనకదుర్గ.

వందన, విజయ్‌కుమార్ తను చెయ్యి పట్టుకున్న సంఘటన వివరంగా చెప్పింది—తను చెంప దెబ్బ కొట్టాం వొదిలేసి ; యెంతైనా భర్తగ్గా బాధ పడుతుందేమోనని.

పని మనిషి కాఫీ పట్టుకొచ్చింది రెండో సారి.

"నేను నీకు తెల్సునని యిప్పుడప్పుడె చెప్పను" అంది వందన.

అంతలో ప్రసాదూ భావనారాయణా వొచ్చారు.

విమల లేచి లోనకి వెళ్ళి రెండు నిమిషాల్లో రెండు కప్పులు కాఫీ తనే తెచ్చి వాళ్ళిద్దరికీ యిచ్చింది.

భర్త సంగతి ముందే తెలిసినందున కనకదుర్గ విజయ్‌కుమార్‌ని తప్పుకు తిరిగింది. యెక్కువగా చిన్న త్త దగ్గరే వుండేది శోభనం జరగ వందున పకర కూడా అక్కడే. పదిహేను రోజులుండి వూ వెళ్ళిపోయింది.

వున్న పదిహేను రోజుల్లో విజయ్‌కుమార్ లేనప్పుడు వందనకీ విమలకీ ఫోను చేస్తుండేది. అప్పుడప్పుడు, రెండు సార్లు వాళ్ళు కారు పంపితే వెళ్ళొచ్చింది.

యీ రోజు శోభనం వూళ్ళో కనకదుర్గ వాళ్ళింట్లో.

మంచం మీదికి చే తూనే, బ్లౌజు హుక్కులు తీసే యత్నంలో నిమగ్నమయ్యాడు విజయ్‌కుమార్, రెండో చేత్తో వొత్తుతూ.

"యేంటా తొందర? నగంరాత్రికో వొక రాత్రికో రేటుకి మాట్లాడు కున్నట్లు ఆగండి. రాత్రంతా వుంటాను రాత్రి పగలు జన్మంతా వుంటాను" అంది కనకదుర్గ.

"పెద్ద అనుభవం వున్నదాన్లాగా నాకే సరసం నేర్పుతున్నావా?" అన్నాడు విజయ్‌కుమార్.

"మొగుడూ పెళ్ళాలన్నాక వొకరికొకరు నేర్పకుండా తప్పుతుందా? మీరంటే వొకసారి పెళ్ళిచేసుకునవాళ్ళు. నాకు పూర్వానుభవంలేదు. దీన్లో కూడా ప్రీవియస్ యెక్స్పీరియన్స్‌కి ప్రిఫరెన్స్ వుంటుందని తెలిపా." అని చిన్నగా నవ్వింది కనకదుర్గ.

విజయ్‌కుమార్‌కి మండుకొచ్చింది.

"ఫ్లాస్కులు చదువేనా యూనివర్సిటీ చదువు కూడానా?" అన్నాడు వెటకారంగా.

"హైస్కూలు కూడా లేదు చిన్నప్పుడు కాన్వెంటు చదువు" అంది.

"అట్లా చెప్పు. నాతో యెవరూ అన్లేదే ఆ సంగతి"

అతని చేతిని తన చేతులోకి తీసుకుంది. వేళ్ళతో స్పృశిస్తోంది.

చెయ్యి తప్పించుకుని, పొట్టమీదనుంచి చీరకట్టు లోపలికి జొనుపు తున్నాడు.

అతని చెయ్యి బయటికి లాగేసింది.

"నీ యిదేం సానదగ్గిర ధోబ్బుడు" అని బుగ్గ కొరికాడు.

ఆమెకి కళ్ళనీళ్ళు తిరిగాయి, అంత కఠినంగా కొరికేటే. ఆపుకుని, కిల కిలా నవ్వి. అతని బుగ్గ బలంగా కొరికింది.

"అబ్బా! నీ సిస్సా" అని అరిచాడు.

"అట్లా తిట్టకండి — నాకు కోపం వొస్తే అంతేనండీ. యెంత మజాగా వుంటుందనుకున్నారూ— మీకూ తెలుసుగా— అట్లా అంటారేం? పైకి నాటకం - మధ్యలో మా అమ్మ దేనికి — చాలా పెద్దది మునప్పి. నే నున్నానుగా" అంది.

గుర్రుగా చూశాడు పెదాలూ మూతీ బిగించి.

"చుట్టూ చెయ్యి వేసి దగ్గిరికి తీసుకుని అతని చెంపమీద పెదాలు అద్దింది—

అసహనంగా వొక గంట గడిపి — గదిలో పడుకోలేక గది బయటికి వెళ్ళాడు, విజయ్‌కుమార్. ఆమె తండ్రి పరామర్శించాడు. 'మధ్యలో వీడి కాపలా యేంటిక్కడ' అనుకుని లోపలికి వొచ్చేశాడు.

యేదో పుస్తకం చదువు కుంటోంది కనకదుర్గ.

"యేం పడుకోలేదు?" అన్నాడు.

"మీకోసం యెదురు చూస్తున్నా. కలిసి పడుకుందాం" అని దగ్గిరికి తీసుకుని చెయ్యి వేసుకుని పడుకుంది.

విజయ్‌కుమార్కి, లేచి కాల్తో లాగి తన్ని చెడామడా బూతులు తిట్టాలనిపించింది గానీ తమాయించుకున్నాడు.

మిగతా రెండురాత్రులూ శాంతంగా వుండిపోయాడు. 'యిక్కడ కాదులే నీ సంగతి తేల్చుకుంటాను అక్కడికి వొచ్చినాక' అనుకున్నాడు.

నాలుగోరోజు వుదయమే బయల్దేరి హైదరాబాద్ వొచ్చేశాడు.

ఆ తరవాత కొద్దివారాలకే కాపరానికి పంపించారు.

వొచ్చాక మొదటి రోజున రాత్రి గదిలో అతను మొరటుగా ప్రవర్తించబోతే "నాకూ అట్లా చెయ్యటం యిష్టం" అంది వుత్సాహంగా.

ఆమె కళ్ళలోని చురుకుదనమూ కరుకుదనమూ చూసి కొంత జంకుతున్నాడు.

ఆమె వొంటిభాగాలు — తొడలు, చనుకట్టూ— అతనికి బాగా కోర్కెగా అనిపిస్తున్నాయి.

సిగరెట్ పీకతో, చనుగుబ్బ వుబ్బుమీద చిన్నగా కాల్చాడు. "హీఁహీ" అని నవ్వింది. తుళ్ళిపాటుని కప్పిపుచ్చుకుని.

అతను రెండో సిగరెట్ ముట్టించుకున్నప్పుడు— కబుర్లు చెబుతూ వేళ్ళతో ఆ సిగరెట్ అందుకుని అతని బుగ్గకి అనించబోయింది.

అదిరిపడి, "పోసి బ్రెమ్మరాకసి లంజా" అని అరిచాడు.

"ఒబ్బా ఆగండీ. భలే మజాగా అనిపిస్తదండీ మీకూతెలుసుగా"అంది.

ఐదో రోజున వొంట్లో బాగోకపోతే — విన్నదాన్నిబట్టి అనుమానమొచ్చి, వందన దగ్గిరికి వెళ్ళి చెబితే; ఆమెకి తెలిసిన డాక్టరు దగ్గిరికి తీసికెళ్ళి విజయ్‌కుమార్ విషయం చెప్పి, వీడీనేమొ టెస్ట్ చెయ్యమంది. డాక్టరమ్మ టెస్ట్‌చేసి ఆదేనని నిర్ధారించి మందులు యిచ్చింది.

ఆ రాత్రి— యెప్పటిలాగే పొద్దుపోయి వొచ్చాడు— అదీ మందు పార్టీ నుంచి.

"నాకు వొంట్లో బాగాలేదు తాకకండి" అంది.

బలవంతం చెయ్యబోతే, "నువ్వు అంటించిన రోగాలే. కీవ్‌యెవే" అంది.

"నాకు రోగాలుంటే నాకు అనారోగ్యంగా వుండేదిగా" అన్నాడు.

"ఆదేమో నాకు తెలవదు. డాక్టరు చెప్పిన సంగతి అది" అంది.

"యెవడా నా కొడుకు?"

"మీ కింతకుముందే కొడుకులున్న సంగతి నాకు తెలవదు" అని నవ్వి, "డాక్టరమ్మ చెప్పింది. డాక్టరయ్య దగ్గిరికెళ్ళమంటే అట్లాగేవెళ్తాను" అంది.

ఆమెకి కాస్త ఆరోగ్యంబాగయ్యాక దగ్గిరికిచేరితే, "నిరోధ్ వాడండి" అంది.

"ఛఛా. అయ్యన్నీ నేనుకుని అనుభవించేదేంటి" అన్నాడు.

"మరి లేకపోతే మీ రోగాలు నేను అనుభవించాలి" అంది.

ముసుగెట్టుకుని ముసుగదీసుకుని పడుకున్నాడు.

"నాకు అవసరంగా అనిపిస్తాంది" అంది,

"మరి బెట్టుసరి పోయావుగా?" అన్నాడు వుత్సాహంగా,

"నేనూ బయట తిరుగుతాను రోగాల్లేని వొకరిద్దరితో" అంది.

"తాట వొలుస్తాను"

"నాకూ చాతనవును. కాగా నువ్వొలిచిన తాట వాళ్ళకి చూపిస్తాను" అంది.

"నీ పరువే పోతంది" అన్నాడు,

"యింతకంటే పరువుపోయినా పర్లేదు. ఫలానా విజయ్‌కుమార్ పెళ్ళాం యిట్లా తిరుగుతాంది అని నలుగురూ చెప్పుకుంటారు. అది మీకు ఘనతగా అనిపించేటట్లయితే సరే"

"నీకు విడాకులిస్తాను. పో"

"యివ్వు. యిస్తే మనోవర్తి డబ్బులివ్వాలి నీ ఆస్తిస్థాయిని బట్టి. దాంతో దర్జాగా బతుకుతాను. లేకపోతే నీలాగే రోగాలింకిపోని మంచివాణ్ణి పెళ్ళి చేసుకుంటాను. కాదంటే వో చవటని వుంచుకుంటాను" అంది.

"యెంతకి తెగించావే! నిన్ను గోళ్ళూడగొట్టి మూలబెట్టి వుంచే చచ్చినట్లు పడుందువు"

కనకదుర్గ తండ్రికి డబ్బుకి లంకె. వొకపట్టాన యెవరికీ యివ్వలేడు. "వున్నదంతా అమ్మాయికేగా — అబ్బాయికి అవసరం అయినప్పుడు తీసుకుంటాడులెండి. ప్రస్తుతం నగదులేదు, అంతా భూమే. వేళచూసి అమ్మాలి. లేకపోతే సగానికి సగం నష్టం అవుతుంది" అని, యేమీ జారొదలలేదు.

"రొచ్చు తిరుగుళ్ళు మానెయ్యండి. మీ ప్రతాపానికి నేను చాల్లెండి. అడ్డమైన చోటా పొర్లి రావటం దేనికి?" అంది

"మక్కెలిరగదంతాను"

"అప్పుడు నా ప్రియులు వూరుకోరు. మీ మక్కెలిరగదంతారు. మీరు తిరిగే రొచ్చుగుండలు మీరు చస్తే ఆ కిరాతకుడు చచ్చాడు పీడా విరగడైందని అనుకుంటారు."

"నీ పీక నులిమి—"

"అది నేనూ చెయ్యగలను. వొక్క బొట్టు చాలు. పిచ్చి వేషాలెయ్యకండి. సీతకరంటు సంగతి బయటపెట్టి కటకటాల వెనక పెట్టించగలను" అంది.

ఆశ్చర్యంగా చూసి, అంతలోనే తేరుకుని "చాలాకూపీ లాగినట్టున్నావే? బ్లాక్ మెయిల్ చేస్తున్నావా? నీతో యేనాటికైనా ప్రమాదమే నిన్ను హతమార్చి —"

"అట్లాగే. మీతో నాకూ యేనాటికైనా ప్రమాదమే. సీత కరంటు వంటి సంగతులు వందనకి తెలుసు. వందన జోలికెళ్ళారంటే — ఆ తరవాత మీరు ప్రాణాలతో బతికుండ గలరనుకుంటే సరే—మీ యిష్టం"

నిలువుగుడ్లేసుకుని రెండు నిమిషాలుండిపోయి "నీకు వందనెట్లా తెలుసు?" అన్నాడు.

"కాన్వెంటులో క్లాస్ మేట్స్మి. క్లోజ్ ఫ్రండ్స్మి

"గుడ్లు మిటకరించాడు. మూతి బిగించాడు.

"చూడండి నేను సీతనికాదు. ప్రాణాలు తీసుకుని చచ్చిపోవటానికి. కనకదుర్గని. ప్రాణాలు తియ్యగలదాన్ని. వొకవేళ మీరు నా ప్రాణాలు తియ్యటం జరిగితే — ఆ తరవాత మీరు ప్రాణాలతో బతికివుండరు. కనీసం జీవితాంతం కటకటాల వెనక వుండిపోతారు. మీ సంగతి తెలివకే చేసుకున్నాను. నా తడాఖా తెలవక మీరు చేసుకున్నారు. మీరు దారికొస్తే యే గొడవా వుండదు. లేకపోతే యీ కనకదుర్గ తడాఖా చూస్తారు. మీరు సీతాపతిగారు కాదు, దుర్గాకుమార్ గారు. మనస్ఫూర్తిగా అనుకూల దాంపత్యం కోసం ప్రాకులాడతన్నాను. సాధ్యం కాకపోతే మిమ్మల్ని నాశనం చెయ్యకండా నేను నాశనమవ్వను. ఆపైన మీ యిష్టం" అంది తాపీగా.

విజయ్‌కుమార్ మంచంమీంచి లేచి వెళ్ళి, కుర్చీలో కూచుని, కాళ్ళు కుర్చీలో పెట్టుకుని, నుదురు మోకాళ్ళమీద ఆనించాడు. యితరుల కళ్ళలోకి నీళ్ళు తెప్పించటం తప్ప తన కళ్ళలోకి నీళ్ళు రావటం తెలియని విజయ్ కుమార్ కళ్ళలోంచి తడి పుబికింది.

## 111

గత మూడు నెలలో, అంకినీడు తనకు తానుగా మళ్ళీ బయటి ముఖం చూడలేదు. వీలునే అప్పుడప్పుడు సాయంత్రాలు కారులో ఆలాయెపైనా

మూడు రోజులనాడు బహిష్టు అయిన రోజా వశిని డాక్టరు దగ్గిరికి వెళ్ళి తను ప్రెగ్నెంటేమో టెస్ట్ చెయ్యమంది లక్షణంగా అవుతూనే వున్నావుగా. అవకపోతే సరే యింజక్షనిస్తాగా అంటే— "అట్లా కాదు డాక్టర్ వొక్కోసారి ప్రెగ్నెన్సీ వొచ్చినా వొకటి రెండు నెలలు అవుతానే వుంటాయిగా! నేను ప్రెగ్నెంట్ కాదని రూఢిగా తెలవాలి" అంది.

"యీ స్టేజిలో యింకా రూఢిగా చెప్పాలంటే చాలా టెస్టులుచెయ్యాలి. దేనికి వశీ యిన్ని అడుగుతున్నావు?" అంది డాక్టరు.

"అది సీక్రెట్ ప్లజంట్ సీక్రెట్. తరవాత అనౌన్స్‌చేస్తాను. టెస్టులు చెయ్యండి" అంది.

టెస్టులన్నీ చేయించుకుని ప్రెగ్నెంట్ కాదని నిర్ధారణ ఐన మరసటి రోజున అంకినీడుతో కలిసి కాశ్మీర్‌కి బయల్దేరింది.

మూడు నెలలు అనుక్షణం కలిసి గడపాలని నిర్ణయించుకుంది. యే జాగ్రత్తలూ తీసుకోదలచలేదు.

అంకినీడుకి చాలా సంతోషంగా వుంది. తన ఆస్తి అంతాపోయినా ఆ బాధ మర్చిపోగలుగుతున్నాడు.

"వశినీ నేవంటే నీకింత యిదని తెలవదు సుమా యింతవరకు!" అన్నాడు వొకరోజున.

"బుద్ధి సరిగా వుంటే తెలిసేది. నిజానికి మరీ అంతిదేంలేదు. భార్యాభర్తలం. అంతకంటే యేముంది!" అంది.

కాశ్మీర్ వెళ్ళి నలభయ్ రోజులు గడిచాయి. నెల తప్పింది. మూడో నెలవరకూ అక్కడే అలా గడపాలని నిశ్చయించుకుంది వశిని, యింటినుంచి యేప్రిల్‌లో బయల్దేరినప్పుడే.

# 112

యీ మే నెల వెన్నెల రాత్రి. అనంత్‌రెడ్డి స్వప్నరాగలీవల తొలిరేయి.

రాత్రి యెనిమిది. మేలురకం కోరారంగు నూరో నంబరు ధోవతి మీగడరంగు సిల్కు జుబ్బా—అనంత్‌రెడ్డి, హరనాధరెడ్డి కాటేజ్‌లో వా

నిమిషంలో యెన్నో నిమిషాలను లెక్కిస్తూ వాలు కుర్చీలో పడుకున్నాడు.

ఆటుగా మంచం. మల్లెలతో నిండిన దుప్పటి. గోడలకి చిత్రలేఖనాలు అతనికి చిత్రలేఖనం అంతగా తెలియదు. అభిరుచి లాంటిది వుంది. వాటిని చూస్తున్నాడు గానీ అతడి కళ్ళలో స్వప్నరాగలీన కనిపిస్తోంది. ప్రతి సవ్వడీ ఆమె అడుగుల సవ్వడిగా భ్రమ.

అంతలో—

నావలా కదులాడే సరోవరంలా సవ్వడి లేకుండా ఆ పాదాలు లోప లికి—

వూదారంగు ఆకులూ పూలూ తీగలూ వున్న తెల్ల చీర. తెల్ల బ్లౌజు పొట్టి చేతులు, పెద్ద మెడ. తలంటి ఆరవిడిచిన జుట్టు. నుదుటా పాపిట మొదట్లోనూ కుంకుమ. కళ్ళకి కాటుక. వొంటిన నగలే లేవు. రెండు చేతు లకీ రెండు సన్నటి వూదారంగు గాజులు. నల్లపూసల సూత్రం. చందనం పరిమళం.

చూడగానే అనంత్‌రెడ్డి గుండె జల తరంగిణిలా చలించింది.

అతను లేవబోతే — వచ్చిన విశ్శబ్దపు నవ్వుతో తడిసిన కళ్ళతో పెదాలతో వొద్దన్నట్లు సూచించి ; కుర్చీ వెనక ప్రక్కకి వెళ్ళి వొంగి అతని నుదిటిమీద పెదవులు అద్దింది—తమలపాకుమీద మందారప్పువ్వు రాలినట్లు.

అతని చెయ్యి అందుకుని పైకి కదిపింది. లేచాడు. అతని చేతికి తన చేతి వేళ్ళు కలిపి అవతలి గుమ్మంలోంచి నడిచింది, గుమ్మం అవతలవచ్చిక. వచ్చికకి యిరువైపులా మొక్కలు చెట్లు—మదుగుగా.

"అన్నీ మనింట్లోనే ఐతే హరనాథ బాబాయికి కోపంరాదూ, తన కాటేజీ మర్చిపోయామని" అంది, క్రితం రోజు మాటల సందర్భంలో. గ్రహించి యిక్కడ యేర్పాటు చేశారు. అటు ప్రక్కన బంగళాలో, వాళ్ళమ్మా, పిన్ని బాబాయి తదితరులు. వాళ్ళ పిన్ని, నగలతో ముస్తాబు చెయ్యబోతే, "లోహపు వస్తువులు గుచ్చుకోవా పిన్నీ!" అంది స్వప్నరాగ లీన. "మీ బాబాయి లక్షణాలు అబ్బినట్లున్నయ్!" అని పక పకా నవ్వింది ఆమె.

వచ్చికలో కూచున్నారు.

అనంత్‌రెడ్డిని కన్నార్పకుండా చూస్తూ. "మిమ్మల్నీ బట్టల్లో చూడలే దెప్పుడూ. అచ్చు శోభనం పెళ్ళికొడుకులా వున్నారు! మనసారా చూస్తూ

వుండిపోయానంటే మనసు కొంచెం తనాటికి పోతుందేమోననిపిస్తోంది" అంది.

"కానీ నువ్వు శోభనపు పెళ్ళికూతురిలాగా లేవు. నిత్య శోభనపు పెళ్ళికూతురిలాగా వున్నావు, చెప్పటిలాగా—ఆజన్మాంతం యిట్లాగే వుండేలాగ" అన్నాడు అనంత్‌రెడ్డి.

చిన్నగా నవ్వింది. అదే నవ్వది. సెలయేటి జాలులో యిసకలో కొట్టుకున్న గులకరాళ్ళ నవ్వది—పచ్చికమీదికి, వెన్నెల్లోకి, చెట్లలోకి, అతని గుండెలోకి.

"స్వప్నా"

ముందుకి జరిగాడు ఆమె ప్రక్కకి.

ఆమె చేతిని అందుకుని ఆ చేతిలోనూ వేళ్ళమీనా పెదాలు అద్దాడు. రెండో చెయ్యి, వెన్నెల్లో మెరుస్తున్న ఆమె పాదాలమీద వేశాడు. కాళ్ళు పైకి లాక్కుంది. కదలికకి చీర జరిగి—తెల్లని సాటిన్ లోపావడా పైకి జారి—పిక్కలు. పసిమిరంగు. నూగారులాంటి వెంట్రుకలు.

"యీరోజు వెనక యెన్ని రోజుల నిరీక్షణో కదా!" అంది.

"యెన్నో రోజులు మాత్రమే కాదు. యెన్నో సముద్రాల అవతలి నిరీక్షణ నాకొక్కసారి అనిపించేది. రిసెర్చి వొదిలేసి అమాంతం రావాలని" అన్నాడు.

"మీ స్థితి నయం. నాకు రిసెర్చిలో మునిగిపోవటమూ లేదు. అనుభవం కోసం పరితపించే అనుభూతితో—"

"రిసెర్చి పూర్తిచెయ్యవా?" అన్నాడు.

"చెయ్యాలనిపిస్తే యీపాటికి ఐపోయేదే. ఆసక్తి లేదు" అంది.

ఆమె కళ్ళు — మధ్యలో మంచురాలిన కొటుకపువ్వుల్లా, చల్లగా తేటగా స్వచ్ఛంగా మత్తుగా.

యిద్దరూ పచ్చిక మీదకి వొరిగి పడుకున్నారు ప్రక్కప్రక్కన.

అతని చేతిమీద చేతివేళ్ళతో స్పర్శిస్తోంది ; రెండో చేతివేళ్ళు పచ్చని పచ్చికని నిమురుతున్నాయి

కనురెప్పలు వాల్చింది. రెప్పల క్రింద: నీలం కొండలు, లోయలు మంచు పర్వత శిఖరాలు, సముద్ర కెరటాలు, నీలం జ్వాలలు, అనంత్‌రెడ్డి

"అనంత్" అంది.

"స్వప్నా"

"నా యీ జీవితం యిలా అనంతంగా సాగిపోతూ వుండిపోవాలని— అనంత్— అనంతంగా అనంతంలో లీనమై—"

"నాకింత అదృష్టం! నువ్వు కారుణ్య దేవతవి" అన్నాడు.

"కారుణ్యమేం వుంది దీన్లో! అనురాగ పరవ్శాధీనత" అని పక్కకి తిరిగి, అతని చెంపలకి చేతులు అద్దింది. పువ్వొచ్చి అద్దినట్లుగా అనిపించింది అతనికి.

"గిటార్ తెచ్చారు కదూ?" అంది.

"వింటావా? యెప్పుడూ వినలేదు—" అన్నాడు.

"వినకపోవటమేమిటి!"

"ఫంక్షన్స్‌లోనా! ప్రత్యేకం నీ కోసం నీ వొక్కదానికే వినిపించాలని యెంతగా ఆశపడేదో తెలుసా!"

"అన్నాళ్ళు సిటీలో— వొక్కసారైనా గిటార్ చేతపుచ్చుకు రాలేదేం మరి!" అంది.

"యేదో తెలియని బిడియం. పెళ్ళికి ముందుగా చొరవగా ప్రవర్తించవాల్నంటే—"

"గిటార్ వినిపించటానికి కూడానా!"

లేచి లోపకి వెళ్ళి గిటార్ తెచ్చాడు. యెలక్ట్రిక్ గిటార్. లోన ట్రాన్సిస్టరైజ్డ్ బ్యాటరీ వుంది.

మొదటి మీటు— చివాలున కొమ్మ వొంచి వొదిలినట్లుగా, అన్ని తంత్రులనూ అన్ని వేళ్ళతో వొకేసారి మీటినట్లుగా.

నిద్రిస్తున్న సరోవరం కలలో కలవరించినట్లు — స్వప్న రాగలీన హృదయం జలజలించింది.

అతను రకరకాల బాణీలు పలికిస్తున్నాడు. జాజ్, మెక్సికన్ ట్రైబల్ బీట్, అరబిక్, హిందుస్థానీ....

పచ్చికని నిమురుతున్న ఆమె అరిచెయ్యి. వెన్నెలను తాగుతున్న ఆమె కళ్ళు. అనంతాన్ని వింపుకుంటున్న ఆమె మనసు, గాలిని పీల్చుతున్న ఆమె చర్మం. సంగీతాన్ని శృతిస్తున్న ఆమె హృదయం— ఆ గిటార్ వింటూ ఆమె —యింకా వొత్తిడిగా యింకా గాఢంగా యింకా లోతుగా వీణానాదంలా సితార్ విశ్వనంలా తాదాత్మ్యపు లోలోతుల — ఆమె తల

అటూయిటూ అడ్డంగా వూపింది.

గిటార్ అనంతాన్ని చేరలేదు. అది గిటార్ వాద్యపు పరిమితి. దేని పరిమితి దానికుంటుంది. వీణ తప్పులా మోగలేదు.

"అనంత్" అంది. ఆ గొంతులో తీవ్రపుటార్తి.

ఆపి, "స్వప్నా" అంటూ గిటార్ కిందపెట్టి, ఆమె పక్క-నకూర్చుని ఆమె పొట్టమీద అరిచెయ్యి ఆన్చాడు. ఆ చేతిమీద తన చెయ్యి వేసి తన పొట్టమీద అతని చేతిని జరుపుతూంది. పైకి జరుపుకుని వక్షంమీద ఆచేతిని అదిమి— కనురెప్పలు వాల్చింది.

అతను లేచినట్లుగా కదిలి, వొక చెయ్యి ఆమె వీపు కిందినుంచీ రెండో చెయ్యి మోకాళ్ళకి తొడలకీ మధ్య కిందనుంచి దూర్చి ఆమెని పైకి లేవనెత్తి — లోపలికి వస్తున్నాడు. నవ్వుతో తడిసిన పెదాలలోంచి కళ్ళ లోంచీ అనురాగపు చల్లని ఆసరి అతని ముఖాన్ని ఆవరించింది— చందనం పరిమళంతోపాటు.

మంచం మీద పడుకోబెట్టాడు.

దిండుమీద తల. వొక చెయ్యి పక్కమీద, వొకచెయ్యి పొట్టమీద. కాళ్ళూ పాదాలు పక్కదానిమీద వొకటి.

మంచంమీది మల్లెలన్నీ సోగునేసి ఆమె ముఖంమీదా వక్షంమీదా పొట్టమీదా వొళ్ళోనూ పాదాలమీదా పోస్తూ— వొంగి ఆమె పాదాలు ముద్దు పెట్టుకున్నాడు.

చేత్తో అతని జబ్బ పట్టుకుని పైకి లాగింది. పక్కగావొచ్చి మంచం అంచు మీద కూచుని ఆమె కళ్ళలోకి చూస్తూ, "స్వప్నా" అన్నాడు తన్మయంగా.

"వూఁ—" అంది.

"యెక్కడ నేర్చుకున్నావు, "వూ" అని అట్లా అనటం?" అన్నాడు.

"యెక్కడా నేర్చుకోలేదు. గొంతే అంత. యిప్పుడు మార్చుకోవా లన్నా మారదు సుమీ" అంది.

కలవరపడిపోయి, "నా వుద్దేశం అదికాదు. నువ్వు— వూఁ—అని అట్లా అనటం యెంత బాగుంటుందో మాటల్లో చెప్పలేను. యేదో అపూర్వ మయిన వాయిద్యం— యేదో వింత సంగీతం పలికినట్టుగా వుంటుంది" అన్నాడు.

"వూఁ!"

"అబ్బ. నువ్వు అట్లావూఁ — అని అంటూంటే వోపలేను" అన్నాడు.

"వోపలేకపోతే వోపకండి" అని చిన్నగా నవ్వింది

"ఆ నవ్వు కూడా—"

"అదీ వోపలేనంటారు!"

"అట్లా నువ్వు—"

"నన్నూ వోపలేనంటారు! యేదీ వోపలేని నా అనంత్— అని అతని భుజాలచుట్టూ చేతులు అల్చి కిందికి వాల్చుకుంది. వొరిగి—

ఆమె పెదాలమీద అతని పెదాలు తొలిముద్దు.

అతని పెదాలను నాలిక కొనతో తడిమి, పెదాలకి బిగించి— యేదో ధార పెదాలలోంచి నోట్లోంచి గొంతులోంచి నరాల్లోంచి నెత్తుట్లోంచి—

అతని వీపు చుట్టూ చేతులు తిప్పింది,

వొకరినొకరు పెనవేసుకుని అటూయిటూ దొర్లి.

ఆమె స్తనాలుపొంగి వొక హుక్కు తెగింది.

అతని ముఖం, ఆమె కంఠం దిగువగా వక్షంమీదా జబ్బలమీదా—

ఆమె పెదాలు అతని పెదాలను వెతుక్కుని — యీ మాంస కండరాలలోంచి, నరాలలోంచి యేదో సంగీతపు ధారలాంటి మాధుర్యపు ధార ప్రవహించి నెత్తుట్లో కలిస్తే, నెత్తురు పొంగులెత్తి— ఆమె కాళ్ళు అతని నడుం చుట్టూ మెలితిరిగాయి.

కొద్ది నిమిషాలకి—

పాలు విరిగినట్లు బట్ట వెలిసినట్లు; అతనిముఖం భీతిచెందినట్లుగా కంపించింది.

పొంగిన పాలమీద నీళ్ళుచల్లినట్లు జాబిలి మట్టిపెళ్ళలా రాలిపడినట్లు, ఆమె ముఖం కుచించుకుపోయింది.

పావుగంట.

బలహీనంగా కొట్టుకుంటున్న యిద్దరి గుండెల చప్పుడు స్పష్టంగా వినిపించేటంత నిశ్శబ్దంగా మనసులు.

మరో పావుగంట.

తలవిదిల్చి తీక్ష్ణంగా చూసి, అతనివొళ్ళో—చెయ్యివేసింది.

రెండు నిమిషాలు.

అ సు ఉ ణీ క ం -

పంచంమధ్యన ప్రక్కగా ముసగదీసుకుని పడుకుంది. ఆమె కళ్ళలో నీళ్ళు,

అతను మంచంకొరెండో అంచుకి తిరిగి పడుకున్నాడు. ముఖం నూనెతో వాడిలింది.

అలా రెండు గంటలు గడిచాయి.

నిదుపుగా జరిగి అతనివైపుకి తిరిగి అతని వీపుచుట్టూ చెయ్యివేసి తనవైపుకి తిప్పుకుని చెంపకి చెంప ఆనించి "అనంత్" అంది.

దుఃఖం అతని గొంతు ంచి పెల్లుబికింది. అతని పెదాలమీద అరిచెయ్యి వేసి అదిమి. "మీరు అలా యిదైపోతే నేను భరించలేను" అంది.

"స్వప్నా నాకు బతకాలనిలేదు. చచ్చిపోతాను. ఆత్మహత్య చేసుకుంటాను. బతికే అర్హత లేదునాకు" అతనిగొంతు జీరపోయింది. కళ్ళలో తడి వుబికింది.

చూపుడు వేలితో కళ్ళతడి తుడిచి, పైకి జరిగి నుదుటిమీద పెదాలు అద్దింది. అతను కిందికి జరిగి ఆమె వక్షంలో ముఖందూర్చి వెక్కి వెక్కి పడుతున్నాడు. అతని వీపుమీద చెయ్యివేసి అనునయిస్తున్నట్లుగా చిన్నగా తట్టింది.

"యే డాక్టర్నీ కనుక్కోలేదా?" అంది.

"యిట్లా అని నాకు తెలియదనలు"

"మరి?"

"పదిపన్నెండేళ్ళ నుండి ముఖ్యంగా పదిహేను పదహారేళ్ళ నుండి రకరకాల ఆలోచనలు వూహలు — కొన్ని కొన్ని బొమ్మలు సినిమాలు చూస్తున్నప్పుడు యిట్లాకాదు, సడన్‌గా లేచి వెళ్ళాల్సివొస్తే జేబులో చెయ్యి పెట్టుకుని నొక్కిపట్టి వెళ్ళాల్సి వొచ్చేది. యిట్లా యెందుకైనదో —"

"మరి" అని, అతనిని దగ్గరికి తీసుకుని పెదాలకి పెదాలు కలిపి....

ఆదే మాధుర్యపు ధార, సంగీతంలాంటి మాధుర్యపు ధార. సంగీతం నెత్తురుగా, నెత్తురు సంగీతంగా, సంగీతపు నెత్తురు, నెత్తురు సంగీతం, తేనెలా మారి నరాలలోకి ప్రవహిస్తున్నట్లు—

చేతుల్తో కాళ్ళతో పెదాలతో కళ్ళతో స్తనాలతో నాలికతో వేళ్ళతో కదలికలతో అతనిని రెచ్చగొట్టింది. అతను వుద్వేగంగా చలించాడు. కానీ —

ఆ చలింపు ఆ వుద్రేకం మనసులో ఛాతీలో ఆగిపోయింది.

వొకచేత్తో వొదిలిన నుదుటిమీదా. రెండోచేత్తో — టపటపా బాదుకున్నాడు. తటాలున తన రెండు చేతులతో అతని చేతుల్ని పట్టుకుని "ప్లీజ్ మీరు బాధపడకండి. మీరు బాధపడటం నేను సహించలేను" అంది.

ఐదు నిమిషాలు

"యింతకు ముందుకూడా యింతేనా?" అంది.

"నువ్వుతప్ప నాకెవరూ తెలియదు స్వప్నా" అని బావురుమన్నాడు.

వోదార్చుతూ, "వెనక వుద్రేకంపడినప్పుడు యిలా కాదన్నారు?" అంది.

"అది వూహల్లో. మనుషులతో కాదు. నాకెప్పుడూ యెవరూ తెలియదు. నిన్ను చూసినప్పటి నుండి నా మనసంతా నీతో నిండిపోయింది...." అని వొక క్షణం ఆగి, "నేను వ్యర్థుణ్ణి, నీ జీవితాన్ని నాశనం చెయ్యను. విడాకులు తీసుకుందువు...."

అతని నోటిమీద చెయ్యి అదిమి, "యేదో కారణం వుంటుంది. రేపూ యెల్లుండీ ప్రయత్నిద్దాం. యిలాగే జరిగితే — సిటీలో నిపుణుల్ని సంప్రదించుదురు"

"యింకా నీ హృదయంలో నాకు చోటుందా స్వప్నా!"

"నా హృదయంలో మీకు చోటేమిటి — అర్థంలేని మాట! యీ హృదయం మీది ఎప్పుడైందో అప్పటినుంచీ యెప్పటికీమీదే. యిది అనంత హృదయం" అంది.

ఆమె వక్షంలో తలదూర్చి వెక్కివెక్కి వడుస్తున్నాడు ఆమెకళ్ళలో నీళ్ళు. అతనికి తెలియకుండా తుడుచుకుని అతని నుదుటి మీద పెదవులు అద్ది వీపుమీద చెయ్యివేసి "యిక నిద్రపోదాం యిహాల్టికి" అంది.

గోడమీద దాడా ఫొటోగ్రాఫులాగా, మంచంమీద వాళ్ళిద్దరూ.

ఆ తరవాత రెండు రాత్రులుకూడా అంతే. అతను వూటి ప్రయాణం అవుతూంటే, ఆ మానసిక స్థితిలో వొంటరిగా వెళ్ళటం భయం అనిపించి "యిద్దరం తిన్నగా సిటీకి వెడదాం రేపు. మా వాళ్ళతో హనీమూన్‌కి వెళ్ళాలనిపిస్తోంది— అని చెబుతాను" అంది.

అంతకుముందు వాళ్ళ హరనాథబాబాయి హనీమూన్ మాటెత్తితే "సంప్రదాయికంగా అన్నీ యిక్కడే జరిపించండి పాలు తేనె జాబిలి అన్నీ యిక్కడే వున్నాయిగా" అంది

మరునటిరోజూ బయల్దేరి సిటీకి చేరుకున్నారు.

యీ సమస్య గురించి శ్రీపతిని అడుగుతానని అనంత్‌రెడ్డి అంటే, "దయచేసి తెలిసిన వాళ్ళని యెవరితోనూ అనకండి. యీ వూళ్ళో డాక్టర్లని కూడా అడగొద్దు. యే బొంబాయో వెడదాం" అంది. రెండు రోజుల తరవాత బొంబాయి ప్రయాణం. కూడా వెళ్ళింది. అతనిని వొంటరిగా వొదలాలంటే ఆమెకు భయంగా వుంటోంది.

యెవరిని సంప్రదించాలో తెలుసుకోవటానికి నాలుగు రోజులు పట్టింది.

"పుట్టుకమందీ చిన్నప్పటినుండీ ఐతే వేరే సంగతి. కాగా ఫిజియోలాజికల్‌గా మాకేమీ లోపం కనిపించడంలేదు. మానసిక వైద్యులకి చూపెట్టండి—" అన్నారు ముగ్గురు నిపుణులు పరస్పరం సంప్రదించుకుని.

వొకతనికి చూపెడితే, "మీరు మానసికంగా చాలా నార్మల్‌గా వున్నారు. అట్లా జరగటానికి తగిన అంశం కనపడటంలేదు" అన్నాడు — మూడు వారాలపాటు ప్రశ్నలతో పరిశీలనలతో హింసించి.

మరో అతనికి చూపెడితే, "ఫలానా వ్యక్తిని సంప్రదించండి" అని చెప్పాడు.

వారం రోజులు వరసగా ప్రశ్నించి, వివరాలుఅడిగి, చివరికి, "మీరు మీ భార్యలో మీ తల్లిని చూస్తున్నారు. దీన్ని యీడిపస్ కాంప్లెక్స్— అంటారు. మీ అమ్మ అంటే మీకు యిష్టమేనా?" అన్నాడు.

"అమ్మ అంటే అందరికీ యిష్టం వుంటుంది, కొందరికి బాగా యెటాచ్‌మెంటు కూడా వుండొచ్చు అంత మాత్రంచేత అది ఆ సమర్థతని పోగొడుతుందా?" అని అడిగింది స్వప్నరాగలీన.

"అతని తల్లి రూపమూ మనసూ మీలాగా వుండివుంటుంది. అట్లా వున్నప్పుడు...."

"యిద్దరికీ యెందులోనూ పోలికేలేదు" అన్నాడు అనంత్‌రెడ్డి.

"సర్వసామాన్యంగా జనం యీడిపస్ కాంప్లెక్సు గురించి అనుకునేలాగా యెటాచ్‌మెంట్‌నీ కాంప్లెక్స్‌నీ వొకటిచేసి అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించాడు. ఆ వైద్యుడు.

యింకో నాలుగురోజులకి మరో వైద్యుడికి చూపెడితే .... వారం రోజులు, చిన్నప్పటినుంచీ జీవితంలోని అన్ని అంశాలూ నోట్ చేసు!

విశ్లేషించాడు.

స్వప్నరాగలీనకి తల్లికంటే తండ్రి, బాబాయి యెక్కువ యిష్టం, అనంత్‌రెడ్డికి తల్లితండ్రులిరువురూ సమానంగా యిష్టం. విపరీతమైన యెటాచ్‌మెంటు లేదు. అతనికున్న అటువంటి అనుబంధం వొకేవొకటి. అది స్వప్నరాగలీనతో, అదీ అమితంగా.

యీ వైద్యుడు అతనిని అడిగీ అడిగీ అన్నీ తెలుసుకుని, సైకో యెనలిటిక్ ప్రోసెస్‌లో కొన్ని అంశాలు రాబట్టి తదితర విధాలద్వారా మరి కొన్ని విషయాలు రాబట్టి చివరికి అనంత్‌రెడ్డిని అడగటం మాని— స్వప్న రాగలీనని వొంటరిగా కూర్చోబెట్టి వాళ్ళిద్దరి పరిచయాల దగ్గిర్నుంచి అన్ని విషయాలూ అతి సూక్ష్మ వివరాలతో సహా చెప్పించుకున్నాడు. అవన్నీ నోట్ చేసుకున్నాడు.

"యిదంతా ప్రోసెస్‌చేసి వొదారికి తెచ్చిచూడాలి. మీరు వొకవారం అట్లా సైట్‌సీయింగ్‌కి యిటే వెస్టర్న్ నార్త్‌కి వెళ్ళిరండి" అన్నాడు.

వారం తరవాత తిరిగి వెడితే, అనంత్‌రెడ్డిని వొంటరిగా కూర్చోబెట్టి "మీకు డివినిటీమీద నమ్మకం వుందా?" అన్నాడు. "నమ్ముతాను ప్రత్యేకం తెలియదు. నాస్తికుణ్ని కాదనుకుంటాను" అన్నాడు. ఆ తరవాత ఆమెకి వంటరిగా చెప్పాడు ఆ డాక్టరు—"మీరు అతనితో కాస్త చీప్‌గా వల్గర్‌గా, అతను అసహ్యించుకునేటట్లు ప్రయత్నించండి అప్పుడప్పుడు" అని. "మీ వుద్దేశం యేమిటి? నేను తనని వొదులుకోవాలను కోవటంలేదు. యేదెలా వున్నా మేమిద్దరిం విడిపోవటం అసంభవం" అంది "నా వుద్దేశం అది కాదమ్మా. మీరు సమస్యతో యిట్లాగే జీవితం వెళ్ళబుచ్చకండా వుండటానికి సమస్యనుంచి బయట పడటానికే చెప్తున్నాను. అట్లా ప్రయత్నించి చూడండి" అన్నాడు.

హైదరాబాద్ తిరిగి వొచ్చిన కొద్ది రోజులకి వొకనాడు స్వప్నరాగలీనకి వో ఆలోచన తట్టి, "మీరు వో వేశ్యతో ప్రయత్నించి చూడండి" అంది.

"షటప్" అన్నాడు అనంత్‌రెడ్డి చటుక్కున.

"నా మాట వినండి. అందులో పోయేదేం లేదు. యీ సమస్య పరిష్కారం అవటమేగా కావాలి. యెందుకో నాకు యీ ఆలోచన వొచ్చింది. నా మాట విని ప్రయత్నించి చూడండి" అని నచ్చచెబితే—

"పెట్టింగ్ వరకే. ఐ వోన్ట్ డు యిట్ విత్ యెనీ వన్ యెల్స్" అన్నాడు.

"సరే. పెట్టింగ్ వరకే చూడండి" అంది.

వో రోజు వో ఖరీదైన హోటల్లో బసచేసి వో వేశ్యని యెన్ను కున్నాడు. మాటల్లో పెట్టి "నన్ను చలింపజేసి రెచ్చగొట్టగలవా?" అన్నాడు.

"నిన్నేంటి నీ బాబుని కూడా రెచ్చగొట్టగలను" అంది ధీమాగా.

వయసు మళ్ళిన ధనవంతుల్ని రెచ్చగొట్టి మెప్పించి బోలెడు డబ్బు గుంజే మహా నేర్పరి వేశ్య, ఆమె.

అనంత్‌రెడ్డిని కవ్వించి రెచ్చగొట్టటానికి ప్రయత్నించింది. మొదట్లో అతనికి అసహ్యం వేసింది. కాసేపటికి ఆ స్పర్శలో ఆ కదలికల్లో వొంటి విరుపుల్లో చేష్టల్లో పరిసరాలు మర్చిపోయాడు. తన నేర్పునంతా వుపయో గించి అతనిని రెచ్చగొట్టింది.

"నువ్వు చాతకాని అసమర్ధుడవని యెవరా అనేది! సీ యిట్ యీజ్ లూజ్ రెడీ యూజ్ యెనీథింగ్ యిట్స్ వండర ఫుల్ ............" అంది.

"థ్యాంక్యూ. యిట్ యీజ్ వోన్లీ ఫర్ పెట్టింగ్.............. ............యు విల్ బి హ్యాండ్ సమ్లీ పెయిడ్" అని బట్టలు వేసుకుని బయటకు వొచ్చాడు.

యింటికొచ్చి జరిగిన విషయం చెప్పాడు. కానీ ఆ రాత్రికి మార్పేమీ లేదు.

దిగులుగా కూర్చుంటే, "రేపు వెళ్ళి ఆ కాస్తాకూడా కానిచ్చి చూడండి" అంది.

"అందువల్ల వొరిగేదేమిటి? ఫిజియొలాజికల్ కాదనీ యీడిపస్ కాంప్లెక్స్ కాదనీ తెలుస్తూనే వుంది యింకా మంచి నిపుణుల్ని యెవరినన్నా కలుసుకుని సంప్రదించటం మంచిది" అన్నాడు అనంతరెడ్డి.

అతని నుదుటి మీద ఆప్యాయంగా పెదాలు అద్దింది అతని కళ్ళల్లో తడి మిలికింది.

# 113

క్రితం నెల జూలైలో వో రోజున వున్నట్లుండి పెయింటింగ్ సామగ్రి అంతా కట్టిపెట్టేశాడు శ్రీపతి. యల్.యల్.బి.కి అప్లయిచేశాడు— సీటు వొచ్చింది చేరిపోయాడు యిల్లు ఖాళీచేసి వొచ్చి హాస్టల్లో చేరాడు. యినప మడత మంచాలూ కుర్చీలూ అవీ రమాదేవి యింట్లో వదేశాడు వాడమని. పెయింటింగ్స్ అన్నీ చుట్టచుట్టి ఆ కట్టా, పుస్తకాలు, పరుపు చుట్టా గుడ్డా తీసుకుని హాస్టలు గదికి వొచ్చేశాడు.

"మిత్ర జనరంజక శ్రీపతే,వుత్తిష్ఠ, వుత్తిష్ఠ, వుస్మానియా జ్ఞాన శార్దూలే తవ శుభావరాహ్ణం" అంటూ వరాహశాస్త్రి వొచ్చి లేపితే లేచాడు శ్రీపతి.

వరాహశాస్త్రికి పోస్ట్ డాక్టొరల్ ఫెలోషిప్ వొచ్చింది — ఆ మధ్య.

"పన్నెండున్నరవేళ యేమిటీ నిద్ర? యిటు భోజనా త్పూర్వమూ కాదు అటు భోజనానంతరమూకాదు. లెమ్మ. మన రామ్మూర్తి వెంచేశాడు." అన్నాడు వరాహశాస్త్రి.

"యెక్కడ ?" అన్నట్లు చూశాడు శ్రీపతి.

"ముందు హాల్లో పేపర్లుచూస్తున్నాడు— సినిమా బొమ్మేదో నిలేస్తే—" అని నవ్వి, "భోజనానికి వెళ్ళిరా" అన్నాడు.

"ఆకలిగా అనిపించటంలేదు" అని బాత్రూంలోకి వెళ్ళి వొచ్చాడు శ్రీపతి. చారల పైజమా కమీజూ.

యిద్దరూ హాల్లోకి వొచ్చారు.

"హలో రామ్మూర్తీ చాలా నెలల తరవాతకదా! కులాసా? లేదూ యివాళ?" అన్నాడు శ్రీపతి.

"వుంది, ఆఫీసూ ఆవకాయా లేకండా ఆంధ్రప్రదేశ రథం నడవదు. వీళ్ళేదో వుద్యోగాలున్నాయని ప్రకటిస్తే అప్లయి చేదామని వొచ్చాను. సోష్యాలజీలో వొక పోస్టుంది." అన్నాడు రామ్మూర్తి.

"నీకు రాకండా యెలా వుంటుంది! డాక్టరేట్ కూడా వొచ్చేసిందిగా?" అన్నాడు శ్రీపతి.

"డాకరేట్ వుంటే ఐపోయిందీ. యింకా యెన్ని వుండాలీ!"

అన్నాడు రామ్మూర్తి.

"మీ వృద్ధజంబుకం పీకేవ్వొద్దనడు కదా—"

"కొత్త పరిపాలక రాంరెడ్డి యేం చేస్తాడో!" అని సిగరెట్ వెలిగించాడు రామ్మూర్తి.

"సీతమ్మతల్లి నను బ్రోవా మనీ చెప్పవే" అని రాగయుక్తంగా అని "హోండిపార్ట్మెంటుకి యాక్సెస్ చూడు అన్నట్లు అనంతరెడ్డి కూడా అప్లయి చేస్తున్నాడు. ఫిజిక్స్‌లో వొక పోస్టు వుంది." అన్నాడు వరాహశాస్త్రి.

దర్బా వీరభద్రరావు, మరో యిద్దరు వొచ్చారు. వీరభద్రరావు యెం. యె. పూర్తిచేసి రిసెర్చిలో చేరాడు.

రామ్మూర్తి సినిమా బొమ్మలు చూస్తూ, "చెంగావి రంగుచీర కట్టుకున్న చిన్నదీ, దాని అందమంత చీరలోనె వున్నదీ." అంటున్నాడు.

"చాలా డేమేజింగ్ స్టేట్‌మెంటోయ్ రామ్మూర్తీ. చీరలోనేనా?" అని కొంటెగా చూసి, "చీర లోపల కాదన్నమాట!" అన్నాడు శ్రీపతి.

"హాహా" అని వరాహశాస్త్రి "హీఁహీఁ" అని రామ్మూర్తీ నవ్వారు.

"చెంగావి రంగుచీర నే హైస్కూల్లో వున్నప్పుడే చిరిగిపోయింది" అని వో పేపరు అందుకుని బొమ్మలుచూస్తూ, "ఆరేసుకోబోయి పారేసుకున్నాను— కోకెత్తికెళ్ళింది కొండగాలి—" అని మొదలెట్టాడు, వీరభద్రరావు.

"ఆ రాజమండ్రీ జయబాల పారేసుకోటానికే ఆరేసుకుందిట" అన్నాడు శ్రీపతి.

"మ్యాట్నీ ఆలోచనలో వున్నాను." అన్నాడు వీరభద్రరావు సిగరెట్ దమ్ము లాగుతూ.

"యే సినిమాకి?" అన్నాడు వొకతను.

"అదే చూస్తున్నాను" అని, సినిమా ప్రకటనల పేజీలు తిరగేస్తున్నాడు వీరభద్రరావు.

యెదురీత, చిలకమ్మ చెప్పింది, దీదార్. ఆలాప్, పేరిస్ ఐ లవ్ యూ ..

"స్వామికిగానీ. వూరుమ్మడి బతుకులకి గానీ వెళ్ళండి— నేను క్రితం వారం చూశాను" అన్నాడు శ్రీపతి.

"ఆ గిరీష్ కార్నాడ్ ఫిలాసఫర్లాగా వుండి బోరుకొడతాడు. కాగా నాకు హిందీ సరిగా అర్థమై చావదు" అన్నాడు వీరభద్రరావు.

"బొమ్మలు చూడడానికి భాష అక్కర్లేదు అందరూ అర్థమయ్యే యింగ్లీషు సినిమాలు చూస్తున్నారా?" అన్నాడు రామ్మూర్తి.

"వూర్మిళమ్మగారి బతుకులెట్లా వుంటుంది?" అన్నాడు వీరభద్రరావు.

"మనుచరిత్రలా వుండదు దర్భారావుగారూ!" అన్నాడు శ్రీపతి.

"ప్రాంచద్భూషణ బాహామూల రుచితో— వరూధిని బాహామూల రుచితో." అన్నాడు వరాహశాస్త్రి.

"నాకు తెలుగుసరిగారాదు— బాహామూల రుచి అంటే యేమిటి మిస్టర్ వీరభద్రరావు" అన్నాడు రామ్మూర్తి.

"బాహామూల అంటే చంక. చంక రుచండీ" అన్నాడు వీరభద్ర రావు.

"చంక రుచా? యెట్లా వుంటుందిట ?" అన్నా వరాహశాస్త్రి.

"మ నలి పెద్దనార్యుడు అంత లోతుకి దిగలేక పోయాడు. చంకల రుచీ అరవై తొమ్మిదంకె భంగిమలిదాకా పోలేదు. రుచి అంటే కాంతిట." అన్నాడు శ్రీపతి.

"వొస్తానండీ." అని జారుకున్నాడు వీరభద్రరావు

"తెలుగులో రిపెర్చి స్కాలర్లమంటారు తెలుగు కూడా రాదేం వీళ్ళకి! యీ కుర్రాడు మావూరి అబ్బాయి. వీళ్ళ నాన్న చిన్నప్పటినుండీ వేదం బట్టీయం వేయించాడు యితనిచేత. అమరం వల్లిపించి వుంటాడు." అన్నాడు వరాహశాస్త్రి.

"తెలుగు కూడా రాదేం, అంటే— మరొక భాషయేదైనా వొచ్చ వనా! బట్టీపట్టేసినా వల్లెవేసినా భాష రాదు. అనుభూతిస్తూ చదివితే వొస్తుంది. డిగ్రీలకోసం చదువులు. యేదీరాదు, డిగ్రీ తప్ప." అన్నాడు శ్రీపతి.

కులశేఖరరావు వొచ్చాడు. "హలో శ్రీపతి!" అన్నాడు వుత్సాహంగా.

"రా, రా. కులశేఖరా. కొన్నాళ్ళు గంగి గోవుపాలు గంటెడైనా చాలు. కొన్నాళ్ళు గాడిదపాలు వుద్ధరిణెడైనాచాలు. వుచ్చ ఐతే రెండు బొట్లు

మొరార్జీ భాయ్ అని పిలూ మోడీ వాయించేస్తున్నాడు. యూరిన్ థెరపీ పని కొస్తుందంటావా?" అన్నాడు శ్రీపతి.

"పిబరే రామరసం పిబరే మూత్రరసం." అన్నాడు వరాహశాస్త్రి రాగయుక్తంగా.

"మీ వాజ్ పేయీ యీ వుచ్చ పోటీలో లేడనుకుంటాను?" అన్నాడు శ్రీపతి.

"వాజ్ పేయీ మూర్ఖుడుకాదు." అన్నాడు కులశేఖరరావు.

"బాబూ జగజీవనుడింకా చేరలేదు మీ జనతాలో. ఐనా మంత్రిగా చేర్చుకున్నారు?" అన్నాడు రామ్మూర్తి.

కులశేఖరరావు అందుకున్నాడు. "పేదల పాలిట పెన్నిధి, కారణ జన్మరాలు—అని పాదపూజచేసినవాడు, యెమర్జన్సీ బిల్లుని పార్లమెంటులో ప్రవేశపెట్టిన ప్రముఖుడు లక్షల రూపాయలపన్ను యెగవేసిన ప్రబుద్ధుడు—యిప్పుడు, సంపన్నురాలు ఆమెకేం తెలుసు ప్రజల సమస్యలు— అంటున్నాడు జనతా ప్రభుత్వం యింకా స్థిరీకరణ చెందలేదట! అంటే వీణ్ని ప్రధానిని చెయ్యాలని ధ్వని. యెప్పుడు యేం చెయ్యాలో నాకు తెలుసు— అంటున్నాడు ఆ మాట నిజం! పూచికపుల్ల కూడా జారిపోనివేళ యిందిర నుండి విడి పడి రొట్టె విరిగి నేతిలో పడ్డట్టయ్యాడు. వుచ్చ నీచాలు తెలియకుండా గద్దెక్కిస్తే యెట్లా? అసలు జనతా యెవరిది? వాజ్ పేయీది. ఆ తరవాత చరణసింగ్ ది. ఆ పరిసరాల్లో మురార్జీ. యీ లెక్కన చూస్తే వాజ్ పేయీ ప్రధాని అవడం సమంజసం—"

"ఫెర్నాండెజ్ ని మర్చిపోయావు!" అన్నాడు శ్రీపతి.

"ఫెర్నాండెజ్ లెఫ్టిస్టు. టెర్రరిస్టు. కార్మికుల్ని వెచ్చగొట్టి గొప్పవాడవటానికి చూస్తుంటాడు. నంకరం. యేదో మినిస్ట్రీలో చోటు వుంది. దాంతో సంతోషించి మౌనంగా వుండిపోవాల్సినవాడు"

"యిందిరది స్లోగన్ డిప్లొమసీ ఐతే జనతాది కమీషన్ల డిప్లొమసీ అని జనవాక్యం—" అన్నాడు శ్రీపతి.

జనతాది కమీషన్ల డిప్లొమసీనా! జెలసీతో అనే మాట అది. ఆ చేసిన యెమర్జన్సీ ఘాతుకాలకి మరొక ప్రభుత్వం ఐతే మరనటి రోజున అరెస్టుచేసి జెయిల్లో పడేసి వుండును—" అని చెప్పుకు పోతున్నాడు కులశేఖరరావు.

"హేమలతారెడ్డి యెవరోయ్ తెలుగావిడా?" అన్నాడు రామ్మూర్తి.

"బెంగుళూరు, ..........." అన్నాడు కులశేఖరరావు.

"సంస్కార సినిమాలో సామాన్య నటన కాదు. అతి సహజంగా చేసింది" అన్నాడు శ్రీపతి.

"అన్యాయమోయ్ అట్లా అనడం!" అన్నాడు కులశేఖరరావు.

"అన్యాయం మనసులోది. ఆ సీన్లో భలేగా చేసిందిలే— అంటాం. అలా బాగా చేసిందంటే— బాగా చేసిందనే కాగా సినిమా డైరెక్టరయినా విజయ్ర్త పక్కనే షండి చేయిస్తున్నాడు. వంకర అర్థాలు తీస్తే ఆ పాపం వాది కాదు మమా!" అని నవ్వాడు శ్రీపతి.

"ఆ పోయే జండా కారెవరిదీ?" అన్నాడు రామ్మూర్తి. ఉస్టాపు పక్కగా వెడుతున్న పడవకారు చూసి.

"ఆ పడవకారు గవర్నర్ శరదా ముఖర్జీది. అందుకే వెనక కొన్ని కారుల బారు. ముందు ఆ మోటార్ బైక్" అన్నాడు కులశేఖరరావు.

"యీ యెండవేళ యిటెందుకొచ్చింది? జనతా గవర్నర్ కదా!" అన్నాడు రామ్మూర్తి.

"వస్తా—పనుంది" అంటూ లేచి బయటికి వెళ్ళిపోయాడు కుల శేఖరరావు

"దేశమంతటా జనతాలోకి పోకటే దూకుతున్నారు జనం." అన్నాడు రామ్మూర్తి.

"సహజం. యిందిరా కాంగ్రెస్ సుస్థిరంగా వున్న మన రాష్ట్రంలోనే మూకుమ్మడిగా చేరిపోతున్నారు. కాంగ్రెస్ కుళ్ళి పోయింది. అది దేశానికి సేవచెయ్యలేదు; జనతావే సేవ చెయ్యగలదు అని ప్రకటనిచ్చి వెంకన్న దగ్గరికెళ్ళి గుండు కొట్టించుకుని లెంపలేసుకునో, కుంకుడురసంతో తలంటో సుకునో, ముఖాన కుంకుంబొట్టెట్టుకునో వెళ్ళి తలుపు తడితే సరి. దీన్ని పార్టీ ఫిరాయింపని అన్యాయంగా అనకండి! దేశక్షేమం దృష్ట్యా ప్రతి రాజకీయ నాయకుడి వ్యక్తిగత బాధ్యత. యేది చేసినా ప్రజాసేవ కోసమేగా— రైసుమిల్లు పెట్టినా, కరెన్సీనోట్లు అచ్చుగుద్దినా, పరదేశం సొమ్ము మనదేశం చేరవేసినా, పెళ్ళానికి కడుపు చేసినా, కొడుక్కి ఫారెన్ ఫెలోషిప్ యిప్పించినా— యేది చేసినా ప్రజా సేవకోసం. లేకపోతే వాళ్ళకేంపట్టిందియినన్నీ

బాలభానుడుగానీ జనతాలో చేరదలిస్తే

నూకపైకలా నాన్ ఫిరాయింపు అనార్స్టింకి యిందిరే యిండియా, యిండియాయే యిందిరన్న నినాదాన్ని గర్జించి, బాలభానుడు కొత్తగూడెం వొస్తే— మోసిన రాష్ట్రరాజకీయ నాయకులవాళ్లా అందరూ యిందిరని దుమ్మెత్తిపోస్తున్నారు షా కమిషన్ ముందు—మాకే పాపం తెలియదు— అని చేతులు కడిగేసుకుంటున్నారు అంతా. మన రామాయణ సంప్రదాయంలో వొక ధర్మ సూక్ష్మం వుంది— వాలి చచ్చాక జనంలో అంజకి వొస్తే— రాజు యెవ్వరైనా రాణిని నేనే— అంది తార. అదే వొరవడిలో— యే పార్టీ అధికారంలో వుంటే ఆ పార్టీలోనే నా సభ్యత్వం—" అన్నాడు

"అన్నట్లు మా తార మళ్లీ మిలియనియరై పడవకారు జామ్మని డ్రైవ్ చేస్తూ—" అని రామ్మూర్తి మధ్యలోనే అందుకుంటే రామ్మూర్తిని పూర్తి చెయ్యనివ్వకుండా, "మీ తారెవరోయ్!" అన్నాడు వరాహశాస్త్రి.

"మా తార అంటే మా సోషియాలజీ చదివిన తారని శాస్త్రీ. మరేం కాదు. తార మనలాంటి సామాన్యులకి అందుబాటులో వుండదు. మళ్లీ మిలియన్సు. గొప్ప పేలస్, ఫైబర్‌గ్లాస్ స్విమ్మింగ్‌పూల్— అంత పెక్స యింగ్ డెల్యూజ్ ముందు మనలాంటి చెత్తాచెదారం కొట్టుకుపోక తప్పదు." అన్నాడు రామ్మూర్తి.

"కానీ తమాషా యేమిటంటే, ఆమె కళ్ళలో పెక్సీతనం బొత్తిగా లేదు." అన్నాడు శ్రీపతి.

యెండలో నల్లగా మెరుస్తూ బయటి నుంచిలోపలికి వొచ్చిన సుధీర్, "ఆ రాణ్జీ, చరణ్‌ల లేఖలు ప్రతిపక్షంవాళ్ళు చూశారు కదా, వాటిని పార్లమెంటులో పెట్టమంటే సిలుగుతున్నాడు" అన్నాడు యింగ్లీషులో.

"సీకు స్త్రీకి వున్న అవయవాలన్నీ వున్నాయిగా, నేను చూశాగా, ఆ చీర విప్పేసి వీధిలోకి రమ్మని స్త్రీని అడగటం భావ్యం కాదుకదా! అదేదో వాళ్ళిద్దరి ప్రేమలేఖలు నీ చేతిలో పడి చూశావే అనుకో, చూశాగా, అందరికీ చూపిస్తాను, పత్రికల్లో అచ్చేసాను అనటం భావ్యమా చెప్పు సుధీర్! రాజకీయ ప్రముఖులకి పుత్ర సంతానం వుంటే బతికుండగానే షన్నామ వకరం కొంతిభాయీ, బాలభానుడు—చిన్న సవరణ చరణ్‌లాంటి వాళ్ళకి గద్దరర్ధాంగోసర్జనల్లుడో. కాలం యెప్పుడూ వొక్కలాగా వుండదు. యెప్పుడు వరికే కష్టాలొస్తాయో చెప్పలేం.

అని మన పెద్దలేదో చెబుతూంటారు. పాపం, యిప్పుడు యిందిరమ్మ పడ
రాని కష్టాలు పడుతోంది. గతంలో తుమ్మినదానికీ నవ్వినదానికీ యేడ్చిన
దానికీ వో కమిషన్ వేసి నిలదీస్తున్నారు. కుల్దీపనయ్యరు తీర్పులతో రెండు
ముఖాలిందిరనే మిస్సమతో. డెబ్బయ్ వోకటిలో గెలవటానికి కారణం
బ్యాలెట్ పేపర్లు రష్యాలో చాటుగా అచ్చువేయించి తెప్పించిందట. వోట్లు
లెక్కింపు వేళకి వాటి మీదకి ఆటోమేటిగ్గా ఆవుదూడ గుర్తు పడిపోతుందట.
రుద్రాక్షమాలతో తంత్రమంత్రాలూ చింతకాయలూ నేర్చిందట వంటి
వాటితో వూదరపెడుతున్నారు. అక్కడికీ ముక్కుమూసుకుని మూలగదిలో
మౌనంగానే వుంటోంది. నందు చూసుకుని, యేనుగు బతికున్నా వెయ్యే
చచ్చినా వెయ్యే అన్నట్లుగా, వోడినా కాంగ్రెస్ కాంగ్రెసే అని అధ్యక్ష
పదవినలంకరించి కాసు ముసిముసిగా నవ్వుకుంటున్నాడు. అందరికంటే
అదృష్టవంతుడు సుఖభోగి నీలం సంజీవుడు— అదృష్టం అంటే అలా
వుండాలి— రాజకీయ పలువలొలిచేసి సేద్యం చేసుకుంటున్నవాడు
రాష్ట్రాన్ని కంతటికీ వొంటూపిరివాడైనా నక్కని తొక్కివొచ్చినట్లుగా చీకూ
చింతా వుండని రాజభోగి అయ్యాడు"

"జనతా యేమి చెయ్యగల్గుతది— కమీషన్లు వేసి కూర్చొనుడుతప్ప
అన్ని రాష్ట్రాల్లో కాంగ్రెసే. లేక నాన్ జనతా. మన దగ్గరమూడు— వెంగ
ళ్రావు నిరంకుశ పాలన సాగుతున్నది గదా! వీనికి నక్సలిజం ఫోబియా
వున్నది. వీన్ని యెర్రగడ్డలా అడ్మిట్ చెయ్యాల. యెమర్జన్సీల వాపిసీయన్స
చెప్పిన అందర్ని దేశద్రోహులని యిందిరమ్మ అరెస్ట్ చేసినలెక్క వీడు
వాని పనులను సమర్ధించని వాండ్లను నక్సలైట్స్ క్రిమినల్స్ అని అరెస్టు
చేస్తున్నాడు" అన్నాడు సుధీర్.

"యెవడి వెర్రి వాడికి ఆనందం" అన్నాడు రామ్మూర్తి.

"అంతవరకూ ఐతే ఆనందమే. నా వెర్రి నువ్వూ ఆనందించు
అంటేనే?" అని లేచాడు వరాహశాస్త్రి.

యీ లెక్చరర్ వుద్యోగం రావటానికి మార్గాలు తెలిస్తే చెప్పమని
శ్రీపతిని అడగాలని, రామ్మూర్తి లేచి, "శ్రీపతీ అట్లా వెళ్దాం రావయ్యా"
అన్నాడు.

# 114

తార ముస్తాబు పూర్తి చేసుకుని లేచి పవిట భుజం మీదకి వేసుకుని మరొకసారి అద్దంలో తనని తను చూసుకుంటే పెదాలమీది లిప్‌స్టిక్‌మీద వొకచోట వల్లని వలుమ కనిపించింది.

లిప్‌స్టిక్ వొకసారి తుడిచేసి మళ్ళీ పుయ్యటం పూర్తిచేసి, సెంట్ స్ప్రే చేసుకుంటూండగా తలుపు తెరుచుకుని సూర్యప్రకాశ్ వొచ్చాడు.

సాయంత్రం నాలుగూపది.

ఆమె దగ్గిరికి వొచ్చి కావలించుకున్నాడు. ముద్దెట్టుకున్నాడు పెదాలతో నుతారంగా అతని బుగ్గ కొరికి అతని వీపు చుట్టూ తన చేతులు చుట్టి స్తనాలను అతని ఛాతీలోకి గుచ్చింది.

మంచంవైపు నడిపించబోతే, "యెప్పుడంటే అప్పుడేనా? వేళాపాళా లేకండా రాత్రికి. సరేనా?" అని చేరుమాలతో అతని వల్లని బుగ్గమీది యెర్రని లిప్‌స్టిక్ మరక తుడిచింది, అతని పెదాలూ తుడిచింది.

"అన్నట్లు కాశ్మీర్ వెళ్ళాలన్నావు. యీ ఆగస్టులో దేనికి? మొన్న మార్చిలో వెళ్ళొచ్చాంగా" అన్నాడు.

"మీకిష్టం లేకపోతే వెళ్ళన్లెండి" అంది.

"యిష్టం లేక కాదు తారా. యిద్దరం కలిసి వెళ్దామని. నెల తరవాత వొకవారం నాకు తీరికవుంటుంది అప్పుడు" అన్నాడు.

"అంతకంటేనా? యెక్కడికి రమ్మన్నా తప్పించుకుంటూ వుంటారు" అంది.

తార వొంటరిగా యెటు తిరిగినా అతనికి అయిష్టంగా అనిపించదు. తార యే పురుషుణ్ని కాంక్షించదనీ, ఆ సంపర్కమే యిష్టం లేదనీ, తనతో ఆమె ప్రవర్తనంతా సంతోషపెట్టటం కోసం నటించటం అని అతను యేనాడో గ్రహించాడు.

ఆ రూపం, ఆ అవయవాలు, ఆ కదలికలు, పెచ్చెటించే, వెర్రెత్తించే, కవ్వించే వరదలా ముంచెత్తివేసే ఆ అసాధారణ శక్తిలో పడి కొట్టుకుపోతున్నప్పుడు, అది నటన అనే అనిపించదు అతనికి.

"మొన్న బాంబేమండి పాపాలాల్ అని వొచ్చాడు చూడు— అతను నీ గురించి యేమన్నాడో తెలుసా? యు ఆర్ ది పెర్ఫెక్టెస్ట్ బ్యూటీ యిన్ ది యెంటైర్ వరల్డ్—అట. నువ్వెంత అదృష్టవంతుడివోయ్ అని వొకటే

టోరు కొట్టాడనుకో"

"ఆ ముసలాయనకి అంతిదిగా అనిపించానా?"

"అంత ముసలివాడేంకాదు. యాభయ్యయి వుంటాయ్. ఆయనకనేమిటి సమస్త మానవులకే కాదు సమస్త ప్రాణకోటికీ నువ్వు అట్లాగే అనిపిస్తావు తారా!"

"ఐతే నేను సెక్స్పీరనన్నమాట" అని వొళ్ళు విరుచుకుంది.

తార వొళ్ళు విరుచుకుంటే— వికారంగానో బద్ధకంగానో వుండదు. వొకలాంటి వయ్యారంగా వగలుపోయినట్లుగా కవ్వించినట్లుగా అనిపిస్తుంది.

"యీ సాయంత్రం అతను నీకు పార్టీ యిస్తానన్నాడు. పాపాలాల్ అంటే బొంబేలో వేళ్ళమీద లెక్కపెట్ట తగిన ధనవంతులలో, సమర్థులలో వొకడు. మనకి చాలా ముఖ్యమైన కావాల్సిన వ్యక్తి" అన్నాడు సూర్య ప్రకాశ్.

అంతలో తలుపుమీద చప్పుడైంది సూర్యప్రకాశ్. వడివడిగా వెళ్ళి తలుపు తెరిచాడు. పాపాలాల్. సిల్కుజుబ్బా గ్లాస్కో ధోవతి బొర్రా. సూర్యప్రకాశ్ ప్రక్కన అతనే బావున్నాడు — యీ వికృత రూపం పక్కన.

"రండి రండి. యెంత సుదినం. మీ అంతట మీరే రావడం!" అని హిందీలో అని సోఫాలో కూర్చోబెట్టాడు సూర్యప్రకాశ్.

"వుదయమే వెళ్ళిపోవాలి. యీ లోగా మీ పనులు ముగిస్తే బాగుంటుంది కదా" అని సోఫాలో యేటవాలుగా జారాడు.

"యేం తీసుకుంటారు?" అన్నాడు సూర్యప్రకాశ్.

"వాకిష్టమైందే"

సూర్యప్రకాశ్ వో బీరువా తెరిచి, ఫ్రెంచి షాంపేన్ సీసా తీసి తారకి అందించాడు.

అందమైన తెల్లని నాజూగ్గానులు బల్లమీద పెట్టాడు సూర్యప్రకాశ్.

"తార ఆకాశంలోనేకాదు. కాస్సేపు మాముందు సోఫాలో కూర్చుంటే మాకు మహాదృాగ్యంగా వుంటుంది" అన్నాడు పాపాలాల్ హిందీలో.

తారకి అర్థమైంది. ఐనా సూర్యప్రకాశ్ తెలుగులో చెప్పాడు.

పుచ్చుకుంటున్నారు. తార, నలుగురితో పాటు నాలుగు గుక్కలు

వెయ్యటంతప్ప తాగాలని ఆత్రంగా వుండదు. తప్పతాగాలని అసలే వుండదు. మనసు వికలమైనప్పుడు బాగా తాగి వొంటరిగా పడుకుంటుంది కానీ అది సాధారణంగా జరగదు. ఆమె మనసు బాగోకపోవటానికి కారణాలు సాధారణంగా వుండవు. ఆ కారణాలు అయ్యేటట్లయితే ఆమె మనసు వొక్క క్షణంకూడా బావుండే అవకాశం వుండదు.

"వొక నిమిషంలో వొస్తాను" అని పాపాలాల్‌తో హిందీలో అని, "తారా ఆయన సంగతి చూడు. నేనిప్పుడే వొస్తాను" అని గది బయటకు వెళ్ళాడు.

మరో రెండు రౌండ్లు పుచ్చుకున్నాడు పాపాలాల్. అతని కళ్ళు ఆమె స్తనాల మీంచీ జబ్బల మీంచీ బొడ్డుమీంచీ పొత్తి కడుపు మీంచీ చెదరటం లేదు. ఆ సెక్సైటింగ్ వలయంలో పడి కొట్టుకులాడుతున్నాడు.

లేచి, తార కూర్చున్న సోఫాలో ఆమె ప్రక్కన కూచుని భుజాల మీద చెయ్యివేశాడు. జరగబోయింది. కావిలించుకున్నాడు.

బలంగా వొక తోపు తోసింది. బల్లమీద పడి తివాసీ మీదకి వొరిగాడు. గ్లాసులు సీసా తివాసీమీద పడ్డాయి.

"తారా మంచిగా వొప్పుకో" అన్నాడు హిందీలో.

"షటప్" అంది

"నా సంగతి నీకు తెలియదు."

"ఆయన్ని రానీ నీ పని చెప్తా" అంది యింగ్లీషులో.

"యెవరు? ప్రకాషా? నాకోర్కె తీర్చకుండా వుండజాలడు."

"గెటవుట్."

"నువ్వు నన్ను ఆ మాట అంటే నీకే ఆ గతి పడుతుంది. కానీ నే నిక్కడినుండి వెళ్ళక్కరలేదు. నేను వుదయం విమానంలో వెళ్తున్నాను. రాత్రి పన్నెండు వరకు నీకు టైం యిస్తున్నాను" అని లేచి బయటకు వెళ్ళిపోయాడు.

మరు నిమిషంలో సూర్యప్రకాశ్ వొచ్చాడు.

"వాడేంటి పిచ్చి వేషాలేస్తున్నాడు?" అంది మండిపడుతూ.

"యేదో మోజుపడి వుంటాడు. చెప్పాగా అతనికి నువ్వంటే యెంతి దిగా అనిపించిందో!"

"నీది భార్యని తార్చే పనేనా?"

యేక వచనానికి కోరచూపు చూసి, "అతను కోపగిస్తే కొంపలంటు కుంటయ్!" అన్నాడు కఠినంగా.

"యెవరివి?"

"మనది"

"మనదంటే—నేను నీకేమవుతాను?"

"భార్యవి"

"భార్యవిట్లా తార్చుతారా? వెనకటి యిద్దర్నీ కూడా యిట్లాగే! —"

"తారా, యింతకు ముందు యిద్దరూ — యేదో మోజు పడ్డాను వాళ్ళనీ బాగానే చూశాను. నీ విషయం వేరు. యీ విషయంలో కాదు. మరొక విషయంలో గొరవాచ్చి—

"యే విషయంలో?"

"యెదొక విషయంలో"

"యేం చెప్తే నీ తార్పుడుతనం బయట పడుతుందా?"

"వాళ్ళు యితరులతో సంబంధం పెట్టుకున్నారు. అందుకని—"

"నీ మాట వినకపోతే నా గతీ అంతేనా?"

"తారా వాళ్ళకీ నీకూ పోలికే లేదు. నీలో గొప్ప శక్తి వుంది. అది యెట్లాంటి శక్తి ఐనా కానీ ఆ శక్తిని నేను జయించలేను"

"ఆ శక్తే, నీ యీ పనికి అభ్యంతర పెడుతోంది."

"తారా అతను మోజు పడ్డాడు. సాధారణంగా జరగదు. జరిగితే తీర్చకుండా వుండే అవకాశం లేదు. అతను అడ్డం తిరిగితే మన వ్యాపారా లన్నీ స్తంభించిపోతయ్"

"నీ వ్యాపారాలా? మన వ్యాపారాలా?"

"మనవి"

"అట్లాంటి స్థితిలో యీ వున్నది చాలు. యిక ముగించండి."

"అది సాధ్యం కాదు తారా, వ్యాపారం తర్వాతే నువ్వైనా, కొత్తగా చెప్తున్న విషయం కాదు. నేను యెంత సమర్థుడినో అంత అసమర్థుడిని. అతనితో తలపడలేను."

"యెందుకు అబద్ధాలాడతారు? నేను తార్పుడుగాణ్ని పావలా కోసం నాకెంతో కావాల్సిన భార్యనో, భార్యగా భావించే స్త్రీనో తార్చుతాను— అని చెప్పండి."

"ఆ మాట చెప్తే యేం చేస్తావు?
"యేం చెయ్యను. జాలిపడతాను. లేదూ ముఖావ పుమ్మేస్తాను."
"పోనీ అప్పుడు పాపాలాల్ ముచ్చట తీర్చుతావా?"
"ఛీ! సిగ్గులేదూ? ముఖావ పుమ్మేయించుకోడానికైనా సిద్ధపడుతున్నావా? యేం చేసుకుంటావు యింత ధనరాసులున్నయ్? యింతటితో యిదంతా చాలించరాదూ!" అంది.
"నేను అశక్తుణ్ని. అది చెప్పడానికి వీలుకావిది."
"యెందుకు వూరికే అట్లా అబద్ధాలాడతావు? నువ్వు నిజంగా అశక్తుడివైతే నేను సహాయపడతాను.
"పాపాలాల్ విషయం—"
"ముందు నీ అశక్తతేంటో చెప్పు. పాపాలాల్‌కి దీనికి సంబంధం యేంటో తెలుసుకోనీ. చెప్పు. చెప్పండి"
"అంటే తెలుసా?"
"వాకే వొక్కసారి ఆ రోజా చూశాను. ఆమె కళ్ళు —చూస్తేనే యెట్లాగో అనిపించింది.
"యీ సమస్తం ఆమెది. యింద్రారెడ్డి నాకేమవుతాడో నేను ఆమెకు అదే అవుతాను. యీ మహా సంస్థని నడిపించే మహా శక్తిమంతురాలు ఆమె."
"ఛీఛీ. మీరంతా కట్టగట్టుకు చావండి. దాని పాదాలు నాకండి పోయి నేను నా దారిన పోతాను."
"నిన్ను ప్రాణాలతో విడిచిపెడితే మాట. పాపాలాల్ ముచ్చట తీర్చకపోతే కథ అడ్డం తిరిగితే అంటేకి నేను వివరించలేక—చివరికి నీ విషయం చెప్పాలి. ఆ మరుక్షణం నన్ను కాల్చేస్తుంది. నన్ను నేను రక్షించుకోవటం కోసం నీ ప్రాణాలు తియ్యాల్సొస్తుంది. కానీ నిన్ను నేను చంపలేను. నువ్వొక మహా శక్తివి. నన్ను అశక్తుణ్ని చేసే మహా శక్తివి. నేను జయించలేక పోయిన స్త్రీవి నువ్వొక్కదానివే. నా ప్రాణాలు కాపాడుకోటం కోసం, నీ ప్రాణాలు తియ్యక తప్పదు. చిన్న సౌంజ్ఞతో నిన్ను చంపించగలను. నా కళ్ళముందు కాదు."
"అందుకే అది జరగకముందుగానే వెళ్ళిపోతాను."
"యెక్కడికి?"

"నా యిష్టం వొచ్చిన చోటుకి"

"యీ స్థితిలోంచి వెళ్ళి నువ్వెట్లా బతకగలవు? వొళ్ళు అమ్ముకుని. అప్పుడు మార్కెట్లో నీ రేటు యెంతకి దిగజారుతుందో తెలుసా!"

"నాకేం కర్మ ఆ పని. నాకు అసహ్యం. నా జీవితంలో యిప్పటికి తాకిన యిద్దరు భర్తలు— ఆ యిద్దరన్నా నాకు అసహ్యం. నాకు అసహ్యంగా అనిపించకుండా వొక్కసారైనా జరగలేదు. నా దారిన నే వెళ్ళిపోతాను. నాకున్న ఆస్తి నాకు చాలు."

"నీకేముంది?"

"యేముందా!" అని పరిహాసంగా నవ్వి, "కోర్టు వారంట్‌తో మిమ్మల్నందర్నీ యీ మహల్‌లోంచి బయటికి గెంటించగలను. నా బ్యాంక్ బ్యాలన్స్‌తో ప్రపంచం చుట్టిరాగలను." అంది.

"నీ బ్యాంకు ఖాతా మన జాయింటు ఖాతా అని తెలుసుగా! నేనీ క్షణంలో వొక ఫోన్‌కాల్ బ్యాంకు యేజంటు యింటికి చేస్తే—నీ చెక్కు చేరినా అది అట్లాగే వుండి వుదయం నా చెక్కు క్యాషు ఐనాకే బ్యాంకు తలుపులు తెరుచుకుంటయ్. యీ మహల్ నీది కాదు. సమస్తం ఆ మహా రాక్షసిది."

"యీ మహలు నా పేర వుంది" అంది.

"నీ పేర యేమీ లేదు. ఆదస్తావేజులూ అవీ—ఆ రిజిస్ట్రారాఫీసులో. అతనికి లంచమిచ్చి ఆ సంతకాల తతంగం చేశాం నీ కళ్ళముందు. నిన్ను కారులో పంపించి నేను అక్కడే వుండిపోయాను గుర్తుందా? ఆ రిజిస్ట్రారు ముద్రవేసి సంతకం చేసినవి—రికార్డులో యెక్కకపోతే అతని భయం అతనిది అందుకని నా పేస్టీకోసం కూడా— అతని ముందే అప్పుడే వాటిని తగల బెట్టేశాను. యిప్పుడు నీకు వాటి బూడిదకూడా దొరకదు.

"వాటి కాపీలు నా దగ్గరున్నయ్"

"అవి నకిలీవి. అ ముద్రలు నకిలీవి. ఆ సంతకాలు చేసిన వాళ్ళెవరో యీ భూమ్మీద యెవరూ పట్టుకోలేరు"

"ధూ." అని అతని ముఖం మీదకి వుమ్మింది. యెదురుగా సోఫాలో కూచుని వున్న అతని ముఖంమీద వుమ్మి చిందులు పడ్డాయి.

"అహాహా" అని వికటాట్టహాసం చేశాడు. తొలిరోజున విన్న ఆ వికటాట్టహాసం.

దుఃఖం పొర్లుకొచ్చి సోఫాలో కాళ్ళు పెట్టుకుని వెక్కి వెక్కి పడు తోంది.

మూడు నిమిషాలు.

వొంగి సీసా అందుకోబోయింది. అందులో యింకా సగం వుంది.

బూటుకాలితో సీసాని అవతలికి తన్నాడు.

అవమానంతో తార ముఖం కందింది.

లేచి నిలబడింది. అతనూ లేచి నిలబడ్డాడు.

"ఛీ. యింద్రిగాడి కంటే నీచమైన కుక్కా" అంది.

కొట్టటానికి చెయ్యెత్తాడు.

తారకూడా చెయ్యెత్తింది.

అతను ఆగిపోయాడు. ఆమె చెయ్యి యెత్తితే భయపడికాదు.

ఆ విషాదమూ అసహ్యమూ చీదరింపూ రౌద్రమూ మిళితమైన ఆమె ముఖం చూసి కాదు.

ఆ రూపం—వరదలాంటి, ఉప్పెనలాంటి, భూకంపంలాంటి పెళ్ళు బికించే శక్తికి—కాస్మిక్ ఎక్స్ప్లోజన్‌లాంటి శక్తికి.

తార చరచరా బయటికి నడిచింది. అతనూ నడిచాడు.

ఆమె ముందుకు అడుగులు వేసి ఎర్ర వడవ కారులో కూచుంది.

అతను పోర్టికోలో నుంచుని చూస్తున్నాడు.

కారు కదిలింది.

అతను లోపలికి వెళ్ళాడు.

తార, కారు నడుపుతోంది. తిరిగిన వీధులే తిరుగుతూ తిరిగినట్లుగా తిరిగి—పది నిమిషాల్లో సిటీ పరిధికి బయట వుంది కారు. సికిందరాబాద్ కాంటోన్‌మెంటు రోడ్లు, గోల్కొండ కాంటోన్‌మెంట్ రోడ్లవెంట యెన భయి మైళ్ళ వేగంతో తిరిగి—

యెటు యెందుకు తిరుగుతున్నదీ తెలియకుండా తిరిగి, తిరిగింది. అంతా కలిపి అరగంట.

వో రోడ్డున వేగంగా వెడుతోంది.

కారు సిటీ దాటి యిరవై మైళ్ళు వెళ్ళింది. రియర్ వ్యూ అద్దంలో చూస్తే కొద్ది దూరంలో తన కారు వెనక కారు. గుర్తించింది— ఆ కారు సూర్యమహల్ కారు కారులో వొక్కడే. ముఖం సరిగా కనిపించకుండా

మదుటిమీదకి వాల్చి పెట్టుకున్న మంకీ క్యాప్.

మరో ఐదు నిమిషాలు. వొంద మైళ్ళ వేగంతో కారు

ప్రక్కన యేదో వూరు. బస్టాండు

గిరుక్కున బస్టాండులోకి కారు తిప్పి ఆపింది. బంగారం పూత పూసిన చిత్రం వున్న పర్స్ అందుకుని భుజానికి వేళ్ళాడేసుకుంటూ దిగింది.

కదులుతున్న వో బస్సులో కూచుంది.

పది నిమిషాలు.

బస్సు వేగంగా వెడుతోంది.

రోడ్డు ప్రక్కన రెండు ఫర్లాంగుల దూరంలో రైల్వేలైను.

బస్సు వేగంగా వెడుతోంది.

బస్సు ఆగింది. ఆగినప్పుడు వెనక్కి తిరిగి చూసింది, కూచునే బస్సుకి వెనక వైపున వున్న వెడల్పాటి గాజు పలకలోంచి ఆకారు—

బస్సు మళ్ళీ కదిలింది. వేగంగా వెడుతోంది.

యెక్కడో రైలు కూత.

ఆ రైలు కూత ఆమె బుర్రలోకి యెక్కి వినిపిస్తూ వుంది. బుర్రలో కత్తిమొనలాంటి స్ఫురింపు. వొణికిపోయింది. కళ్ళలో నీళ్ళు.

బస్సు వొకచోట ఆగింది, వొంతెన ప్రక్కగా.

రోడ్డుకి యెడమవైపున నాలుగు ఫర్లాంగుల దూరంలో యేదో పల్లెటూరు— పెంకుటిళ్ళు. రోడ్డుకి కుడివైపున ఫర్లాంగు దూరంలో రైల్వే లైను.

కదిలబోతున్న బస్సులోంచి సడన్‌గా దిగేసింది. బస్సు వెళ్ళిపోయింది.

దీర్ఘంగా శ్వాస పీల్చింది. చూపులో తీక్ష్ణత.

కాలవగట్టు మీదకి అడుగులు వేస్తూ కంటి కొసలోంచి చూసింది. ఫర్లాంగు వెనకగా ఆ కారు.

కాలవగట్టున చకచకా నడుస్తోంది. దూరాన రైలు కూత.

వేగంగా నడుస్తోంది. అంతలో అటునుంచి వొస్తున్న రైలు.

పరుగెత్తుతోంది. ముఖం తీక్ష్ణంగా దీక్షగా కఠినంగా.

నిన్నటి వర్షంతో నిండుగా నిదానంగా ప్రవహిస్తోంది వాగు.

కారులోంచి ఆ మనిషి— పొట్టిగా— లావుగా— సగం తలుపు తెరిచి

దిగి గమనిస్తున్నాడు. అర్థం కానట్లుగా చూస్తున్నాడు.

రైలు రానే వొచ్చేస్తోంది. పరుగుతీస్తోంది. భుజానికి వేళ్ళాడుతున్న హ్యాండ్ బ్యాంగ్ జారిపడింది, కిందకి పరుగుతీస్తోంది.

రైలు రానే వొచ్చేసింది. ఆమె రైలు పట్టాల మీదకి వొరిగింది— కానీ యింకా నేలమీదకి పడకముందే యింజను వొచ్చేసి కొట్టుకుని —

నెత్తుటి మరక. చీరా పావడాల పీలికలు, తొంటి భాగంతో యింజను ముందుభాగం ముందుకు వెళ్ళింది — రైలు పెట్టెలను యీడ్చుకుంటూ.

తునాతునకలై ; బొమికలు పేగులు నెత్తురు కండరాలు చెల్లాచెదురుగా పడ్డాయి— రైలు కట్టమీనా, కాలవ గట్టునా, బ్రిడ్జి కిందకీ; నీళ్ళలోకీ.

నీళ్ళమీద వీపు భాగం— స్తనాలు : తేలుతూ మునుగుతూ, నీటి ప్రవాహంలో తార స్తనాల అంతిమయాత్ర.

# 115

రవి సాయంత్రం వొచ్చి రాంనగర్ పాకలో నిద్రపోయాడు. మెలుకువొచ్చేసరికి అవతలగా రాములు చూస్తూ కూర్చుని వున్నాడు

యెనిమిదైంది

పాకకి యెలక్ట్రిసిటీ పెట్టించాడు.

రాములు చిన్న నీలం బల్బు మీట నొక్కాడు రాగానే.

వొళ్ళు విరుచుకుంటూ, "టైమెంతైంది రాములూ?" అన్నాడు.

"యెనిమిదైనది సాబ్" అన్నాడు రాములు.

లేచి నీళ్ళతో ముఖంకడుక్కుని, తల దువ్వుకుని—తెల్లని పైజామా లాల్చీ సవరించుకుని బయల్దేరాడు.

యేవేవో చికాకులతో సమస్యలతో మనసు బాగోని వొకలాంటి మూడ్‌లో రవి నేరుగా యిక్కడికి వొచ్చి పడుకుని మొద్దునిద్ర పోతాడని రాములుకి తెలుసు.

యీ ప్రాంతానికి వొచ్చేటప్పుడు టాక్సీ మెయిన్‌రోడ్డుమీదే ఆపించుతాడు. కారులో వొస్తే రాహత్‌మహల్ టాకీసు ప్రాంతంలో పార్కుచేసి వొస్తాడు.

రవి యీ పాక దగ్గిరికి వొక్కసారి కూడా కారులో రాలేదు. సాధారణంగా— వొస్తూ, బాధపడిన వాళ్ళ యోగ క్షేమాలు అడిగి తెలుసుకుంటూ యేమైనా చెబితే నోట్ చేసుకోవాల్సినవివుంటే నోట్ చేసుకుంటాడు తరవాత ఆ పనులు చూడటానికి ప్రయత్నిస్తుంటాడు. వీలైనంత వరకూ వీళ్ళెవరినీ అక్కడి బంగళా చుట్టూ తిరిగే పరిస్థితి కలిగించడు.

రోడ్డుదాకా రవితోపాటు నడిచివెళ్ళి పంపించి రావటం రాములుకి అలవాటు. రిక్షానో ఆటోనో దొరకగానే వెళ్ళిపోతాడు రవి. యీ రోజు యేవో సరుకులు, మందులు కొనాల్సి అలా నాలుగు ఫర్లాంగులు పైకివెళ్ళాడు రాములు. అవి తీసుకుని సాయిలు యింటికి వొచ్చాడు రాములు.

సాయిలు భార్య వాళ్ళ గుడిశ ముందు నిలుచుని వుంది. యెర్రని మాంసంతో మలిచిన శిల్పం, యెండకి వానకి వొడలిపోయి చలికి బిగదీసుకుపోయినట్లు; ముడతల తోలు తిత్తి —పాతికేళ్ళ ప్రౌఢ బాలమ్మ.

యిద్దరు పిల్లలు మగపిల్లోడికి ఆరేళ్ళు. ఆడపిల్లకి నాలుగేళ్ళు. యిద్దరికీ ఐదురోజుల్నించి జ్వరం. మందులు లేవు. యింట్లో సరుకులూ లేవు. వట్టుకొస్తానని; నాలుగు రోజులకిందట వొచ్చి పదినిమిషాలుండి వెళ్ళినపుడు సాయిలు చెప్పాడు.

సాయిలు సాధారణంగా గంగి యింటి దగ్గిరే వుంటాడు. సికిందరాబాద్ రెజిమెంటల్ బజారుప్రాంతంలో వొకామెని వుంచుకున్నాడు. యేడాదిన్నర క్రితం. తీరిక చిక్కితే అక్కడే వుంటాడు.

రాములు తెచ్చిన సరుకులూ మందులూ చూసి, "నీ రుణం యెట్ల తీర్చుకుంటనో రాములన్నా." అంది బాలమ్మ. ఆమె కళ్ళలో తడి వుబికింది.

"దోస్త్ భార్యవి. గింత గూడ చెయ్యకుంటే యెట్ల!" అన్నాడు రాములు.

"మీ దోస్తు, దోస్తు తీరున వున్నడా యేమి! యెన్నడన్న వొచ్చి చూసి పోతడు చచ్చినమో బత్కివున్నమోనని!" అంది.

సాయిలు ఆమెని తాకి యేడాదిన్నర అవుతుంది.

అంతలో మోటార్‌బైక్ వొస్తున్న చప్పుడు.

గుడిశ ముందు ఆగింది వొచ్చి. గట్టిగా హారన్ మోగించి దిగాడు సాయిలు.

లోపకి వొచ్చాడు సాయిలు.

"కిరాయ దుక్నంల పైసలు కట్టినా? యింక వుద్దరియ్య వన్నాడు" అంది.

"యాది మరిస్తి. పైసలు గూడ లేవు చేతుల" అన్నాడు సాయిలు.

"తినేటందుకు లేకుంటే వుపాసముంటను. పిండ్లకి మందులుతెస్తివా? మూడు దినాల సంది పెయి మీద సొయి లేదు" అంది.

"గా మందులు దుకాన్ల యిస్తాలేవు. రేపటి దినమ్ వస్తవట. రాంగనే తెస్త." అన్నాడు సాయిలు.

"రాములన్న గిప్పుడె వొచ్చిండు" అంది.

గుడిసెలో సుబ్బం లోపల వొక ప్రక్కగా కూసునివున్న రాములు వొంక గుర్రుగా చూశాడు సాయిలు.

"మరింకేమ్? రాములంటె రవిసాబ్ కంటె గొప్పోడు. వాన్కి, యాడ దొర్కనిది గూడ దొర్కుతది" అన్నాడు వెటకారంగ.

"గిట్ల చుట్టమోలె వొచ్చి పోవుటేనా? పెళ్లం పిల్లలున్నరని యాదికి గూడ రాకున్నది నీకు" అంది.

"నీ ఉవ్వ. గత్తరొచ్చి చావనన్న చచ్చిరను కాదు, నువ్వు నీ పిల్లలు" అని చీదరించుకున్నాడు సాయిలు.

"నువ్వాడ, గా రండముండతోటి కులుక్కుంటె....."అంటోంది.

మధ్యలోనే అందుకుని, "నోర్ముయ్ మూతిపండ్లురాలగొడ్త. దాన్నే మస్తు అంటివంటె. అది నీ అసుమంటిది కాదు. అది—"

"అది ముగ్గురను ముంచి విన్నే పట్టుకున్న రండ.... నా అసుమంటి దెట్లవుతది?" అంది.

"నీకుమాత్రమేమి తక్కువ? సన్నలి దొర్కనవు గోస్తుల పెండ్లా లుండంగ పెండ్లి చేసుక్కునేది అక్కరుండదు" వ్యంగ్యంగా అని రాములు వొంక చూశాడు సాయిలు.

"ధూ. నీ నోట్ల నా........వోతు" అని అరిచింది.

"యేమ్ నీ మిండెగాన్ని అనంగనె గంత కోపమొచ్చె?" అని "హాహాహా" అని ధ్వని చేశాడు సాయిలు.

"సాయిలూ దోస్తువని అప్పటి సంది వూకున్న. సంబళ్ కె బాత్ కరో" అన్నాడు రాములు తీక్షంగా.

"యేమ్ నాకె ధర్మీయిస్తున్నవా? సాయిలంటెయేమనుకుంటున్నవ్"
అన్నాడు సాయిలు.

"యేమనుకుంట లేను. నువ్వు చేసెడిపన్లు అన్నినాకెరికనె" అన్నాడు
రాములు తాపీగా.

"నే చేసెడి పనులన్ని నీ చెల్లెలు చేపించెడివె తెల్సునా?"

"నాకు చెల్లెలు లేదు. యెవ్వరు లేరు" అన్నాడు రాములు.

"అవ్. చెల్లెల్నేమి చేస్కొంటవ్. దోస్తు పెండ్లమయితె అక్కెర
కొస్తది నువ్వు చేసెడి పన్లు గూడ నాకెరికనె. నీకు నా యింట్ల యేమివని"
అన్నాడు సాయిలు.

"దోస్తుకు బుద్దిలేకుంటె కష్టమ్ చూడలేక సాయం చేస్తున్న!"

"వూకె చేసెటందుకు నువ్వేమన్న లక్పతివా?"

"లక్పతి అయితె సాయమేమిటికి చేస్తడు! వాండ్లయెంట తిర్గి
కుక్కవన్లు చేసిపెట్టి మోటార్ బైక్లమీద తిర్గెటోళ్ళకు పెండ్లాం పిల్లలను
మర్చి నడక్ చాప్రండకుగులాంగిరి చేసెటోళ్ళకు గూడ—"

మధ్యలోనే అందుకుని, "యీదొంగ బుద్ధిదేనికి? గీ రండను లగ్గం
చేసొకరాదు! నా పిల్లల పీక పిస్కి" అన్నాడు సాయిలు.

రాములు చటుక్కున లేచాడు. అతను వుద్రేకంతో కంపించిపోవటం
లేదు. కోపంతో వూగిపోవటంలేదు. లోన నరాలలో నెత్తురు నిప్పులా
వెచ్చగా వరుగులిడుతోంది.

రాములు అమాంతం సాయిలు చొక్కా పట్టుకున్నాడు. సాయిలు
రాముల్ని వొక తోపుతోశాడు. నిలదొక్కుకోలేక రాములు గుమ్మం
బయటికి వడ్డాడు. సాయిలు అతని మీదకి దూకి, "కార్కాన్ల పని జేసొ
నెడి కూలిముండ కొడ్క వన్నే అంటున్నావుర" అన్నాడు.

యిద్దరూ కలియబడ్డారు.

ఐదు నిమిషాలు. చొక్కాలు చిరిగాయి. మోకాళ్ళు మోచేతులు
కొట్టుకుపోయి నెత్తురు చెమర్చింది

రాములు, సాయిలు మీదకి తిరగబడి, చాతీమీద కూచుని, వొక
చేత్తో వొక కాలు రెండోచేత్తో వొక చెయ్యి పట్టుకుని విరగదీశాడు

"నీ కాల్మొక్కుత యిడ్శి పెట్టు—" అని అన్నాడు
సాయిలు.

"సిగ్గులేదురా! నీకు బుద్ధిలేక నన్నంటావురా" అని లేచాడు రాములు.

సాయిలు నిమ్మదిగా లేచి గుర్రుగా చూసి, గుమ్మంలో నిలుచుని వున్న భార్య బాలచిన్న వైంక చూసి "అది నా పెండ్లామైతే గట్ల చూస్తు వూకుంటదా! నేమే నాక్కు పాలి లెక్కనా, రాత్రి లెక్కనా రాములుతోటి యిసాబు!" అన్నాడు సాయిలు.

రాములు కోపం పట్టలేక సాయిలు మీదకి దూకబోతే, సాయిలు పరుగు లంకించుకున్నాడు—మోటర్‌బైక్ అక్కడే వొదిలేసి.

గుమ్మంలో నిలుచుని— ధారగా కన్నీళ్ళు పెల్లుబికి పొర్లుతూంటే రెప్పలు వాల్చింది బాలచిన్న. కన్నీళ్ళంత మూగగా—

# 116

**శ్రీపతి,** ఆర్ట్స్ బిల్డింగ్‌లో రామ్మూర్తి గదిలోకివెళ్ళి, "యికనమిక్స్ లెక్చరర్ గోకరాజు గజపతిరాజుని [illegible] తన్నారటన్నా." అన్నాడు.

రామ్మూర్తికి నెలరోజులక్రితం సోషియాలజీలో లెక్చరర్ వుద్యోగం వొచ్చింది.

"గోడలకి చెవులుంటయ్. కేంటీన్‌కి వెళ్దాంపద" అన్నాడురామ్మూర్తి

"కేంటీన్‌కి చెవులుంటాయి" అని చిన్నగా నవ్వాడు శ్రీపతి.

"గోడలన్నీ నాకేరకంకాదు యివి మరీ పాపిష్టిగోడలు" అని బయటికి దారితీశాడు రామ్మూర్తి.

శ్రీపతిని సంప్రదించినప్పుడు, "ఇంతకు ముందు ఆ రవిని అడిగితే సాయంచేశాడుగా మళ్ళీవెళ్ళిఅడుగు. విపరీతం పరిస్థితి—డిపార్ట్‌మెంట్‌లో డాక్టరేట్ వున్న వ్యక్తివినువ్వొక్కడివేనని" అన్నాడు శ్రీపతి.

"కానీ ఆ గోవర్ధన్‌రెడ్డి తోకగాడు వొకడున్నాడు. వాడికి యిప్పించడానికి ప్రయత్నిస్తున్నాడు. గోవర్ధన్‌రెడ్డికి సిండికేట్ మెంబరు వొకడుబాగా సన్నిహితంగా తెలుసు" అన్నాడు రామ్మూర్తి సిగరెట్ దమ్ములాగుతూ.

రామ్మూర్తి, సిటీలో ఆదివరకు వుంటున్న యింట్లోనే వుంటున్నాడు. భార్యకి రెండోకాన్పు యీసారి ఆడపిల్ల.

“యీ ప్రస్తుత వైస్ఛాన్సలర్ రాంరెడ్డి పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ డిపార్ట్‌మెంటులో ప్రొఫెసర్ హెడ్డుగా వున్నప్పుడు గోవర్ధన్‌రెడ్డి దాన్లో యెం. యే చదువుతూండేవాడు తెలుసుగా. అప్పట్లో వాడి కేంపస్సూ సిటీ రాజకీయాలకీ డిపార్ట్‌మెంట్ స్టూడెంట్లని వాడుకోవటంతో ప్రొఫెసర్ సహకార సహాయాలు ఆశించాడు. రాంరెడ్డి చోటు పెట్టలేదు. అప్పుడు ఆయన మీద చాలా పుకార్లు పుట్టించాడు. అంచేత గోవర్ధనుడు పర్వతం యెత్తటం సాధ్యంకాదు. మరో సంగతి. అసెంబ్లీ సీటు యెన్నికల్లో గోవర్ధన్‌రెడ్డీ రవీ ప్రత్యర్థులు. యిప్పటికీ వాళ్ళిద్దరికీ అసెంబ్లీలో యుద్ధమే. గోవర్ధన్‌రెడ్డి వాక అవర్లు డికి యిప్పించాలని చూస్తున్నాడని చెప్పు. దాంతో రవికి పర్సనల్ యింటరెస్ట్ కూడా కలుగుతుంది. గాలి వాటాన్ని బట్టి పోతాడుగా మీ వృద్ధ జంబుకం. నీ కొమ్ము హెచ్చుగా వుంటే నిన్నే సపోర్టు చేస్తాడు” అని చెప్పాడు శ్రీపతి.

రవి ప్రయత్నాల వల్ల రామ్మూర్తికి వుద్యోగం వొచ్చింది. ఆదే యింటర్వ్యూలో అనంతరెడ్డికి, ఫిజిక్స్‌లో వుద్యోగం అతి సులభంగా వొచ్చింది. కావాలని అడిగిన స్పెషలైజేషన్ అతనిది అందులో అతనికి అమితమైన ఆసక్తివుండి విశేషంగా కృషి చేశాడు. డాక్టరేట్‌తో పాటు అంతర్జాతీయ స్థాయి జర్నల్స్‌లో అతనివి కొన్ని పేపర్లు అచ్చుఅయ్యాయి. నిపుణులు ప్రత్యేకించి మెచ్చుకున్నారు. అంచేత అతని పెద్దల పలుకుబడి అవసరం లేకపోయింది. బేగంపేట వైపున యిల్లు అద్దెకు తీసుకుని కాపరం పెట్టాడు. స్వప్నరాగలీన తండ్రి వూరినుంచి పనిమనిషిని పంపించాడు, యింట్లో పనికి. ఆమె పింతండ్రి నాగిరెడ్డి వాళ్ళింట్లోనే వుండమన్నాడు. గానీ అలా వుండటం అనంత్‌రెడ్డికి నచ్చలేదు. స్వప్నరాగలీనకూడా అతని అభిప్రాయాన్నే సమర్థించింది.

కేంటీన్‌లోకి వెళ్ళకండా అలా బస్టాపురోడ్డు మీది వో చెట్టునీడకి నడిచాడు రామ్మూర్తి.

“యింత భయవేఁవిఁటోయ్” అన్నాడు శ్రీపతి.

“చూడు నాయనా. మాలాంటివాళ్ళ కష్టాలు నీకేం తెలుస్తాయ్? యేమంటే యెటునుండి యేమొస్తుందో చెప్పలేం” అన్నాడు రామ్మూర్తి సిగరెట్ ముట్టిస్తూ.

“అసలు యెలా యెందుకు జరిగింది? యితను మంచివాడే అను

కుంటాను. తన దారిన తను వుంటాడనుకుంటాను?" అన్నాడు శ్రీపతి.

"ఆ ప్రొఫెసరు పూసపాటి విజయరామరాజుకి వో చుట్టం వున్నాడు వాడు యికనమిక్స్ చదువుతున్నాడు. వాడికి అత్తెసరు మార్కులొస్తయ్. గజపతిరాజుకి వొక పేపరుంది వాల్యుయేషన్‌కి. అరవయ్యైదు శాతం మార్కులిమ్మన్నాడట. యితనేమో— ఆ పని చేస్తే యితరులకి అన్యాయం చేసినట్లే అవుతుంది కదా అన్నాడట. గుడ్డొచ్చి పిల్లనెక్కిరించిందని, నాకు నీతులు చెప్తున్నావా— అని కసిరి బెదిరించాడట. నేనేమీ బలవంతుణ్ని కాదుగాని నా చేతుల్తో అన్యాయం చెయ్యలేను కావాలంటే ఆ పేపరు కూడా మీరే వేల్యూ చెయ్యండి —అన్నాడట. యిప్పుడు మార్చడానికి వీలు కాదు. చెప్పిన పని చూడు లేకపోతే ఆ తరవాత అనుభవిస్తావ్. అని వార్నింగిచ్చాడట. యితను విద్యార్థులకి అన్యాయం చెయ్యదలచక, చివరికి విద్యార్థుల్తోనే తన్నులు తిన్నాడు పాపం" అన్నాడు రామ్మూర్తి.

"అదెలా జరిగింది?" అన్నాడు శ్రీపతి.

"మన పూసపాటి ముసలాయనకి యీ మురికి కూపంలో రకరకాల పలుకుబడుంది. వీడి ద్వారా మార్కులో, ఏందు మందు ఫెలోషిప్పో మరేవో లాభాలు పొందదలచిన బ్రాక్ స్టూడెంట్స్ కొందరు అవీ యివీ కల్పించి వేరే డిపార్ట్‌మెంట్ గాడుదుల్ని కలుపుకుని గజపతిరాజుని తన్నారు. పాపం, కంప్లెయింటయినా యివ్వలేదు." అన్నాడు రామ్మూర్తి

"అదే మంచి పని" అన్నాడు శ్రీపతి.

"ఆ కారులో జాతమ్మని వెళుతున్న వాడిని చూశావా, ఆ వియోగి నిక్కు అదీ?" అన్నాడు రామ్మూర్తి.

"వుఁహూఁ"

"గౌరీపతి శర్మగాడు. మనని గమనించి ఆగకుండా పోతున్నాడు. దయతలచి నిరంజనంగాడికి వుద్యోగం యిప్పించావా? వాడేమో యిప్పుడు నీ మీద నవాలక్ష కల్పించి చెప్తూ— నువ్వేదో వాడికి అన్యాయం చేయించావని ప్రచారం చేస్తున్నాడు."

"అలాగా? దేనికి? పోనీ, ఆ కుక్క యేం మొరిగితే యేం!" అన్నాడు శ్రీపతి.

'గౌరీపతిగాడి బాబు రిటైరయ్యాడు గదా— జనతా ప్రభుత్వం వొచ్చేసరికి జనసంఘ్ బలంతో యేదో కమిటీలో సభ్యుడయ్యాడు గౌరీపతిగాడిక్క

స్టేటుమెంట్ యిప్పించాడు. గౌరీపతిగాణ్ని ఆశ్రయించాడు నిరంజనంగాడు— వీడు చేసిన తప్పుడు పనికి."

"అసలేం అఘోరించాడు?" అన్నాడు శ్రీపతి.

"మిస్ప్రాప్రియేషన్. డబ్బు మింగి కూచున్నాడు కెమికల్స్ కొను గోలులో. అది దొరికి, ఆ కంపెనీ జనరల్ మేనేజరు వీడికి వుద్వాసన చెప్పాడు. అతను నీకు తెలిసినతను. వీడికి వుద్యోగంయిచ్చినతను. నిరంజనంగాడు గౌరీపతి గాడి కాళ్ళు— సాక్షాత్తూ పట్టుకుని—"

"కాళ్ళేగా?" అని నవ్వాడు శ్రీపతి

"అవసరం ఐతే యేదైనా పట్టుకుంటాడు యీ నక్కగాడు. ఆ కంపెనీకి కేంద్ర ప్రభుత్వంతో చాలా పనులున్నాయట. గౌరీపతిగాడు, వాడి బాబు ద్వారా జనసంఘ పలుకుబడితో వీణ్ని రక్షించాడు. యీ నక్క గాణ్ని మింగనివ్వలేదని మీ మిత్రుడో, బంధువో ఆయన మీద అక్కసుని నీ మీదకి మళ్ళించాడు. యీసారి కనిపిస్తే వాయించు" అన్నాడు రామ్మూర్తి.

"ఆ మధ్య అతను కనిపించాడు గానీ వీడి సంగతి యిలా అని చెప్ప లేదే!" అన్నాడు శ్రీపతి.

"నీకు చెప్పడానికి మొహమాటపడి వుంటాడు" అన్నాడు రామ్మూర్తి.

"అప్పట్లు నీ దగ్గిర "యెక్లిప్స్ అఫ్ కమ్యూనిటీ" వుందా?" అని అడిగాడు శ్రీపతి.

"ఆ పుస్తకం పేరే వినలేదోయ్" అన్నారు రామ్మూర్తి.

"సోషియాలజీ వాడివి ఆ మాట అంటే యెలానోయ్! యిటీవలి హ్యూమనిస్టిక్ సోషియాలజీ."

"అదేమిటో నాకు తెలియనే తెలియదు. నా రిసెర్చి గుంటల్లో పడి కొట్టుకుంటూ వుండిపోయాను. అదవగానే ఆ సోషల్ వెల్ఫేర్‌శా[illegible] దలో పడ్డాను. యిప్పుడిప్పుడే కళ్ళు తెరచి నలుదిక్కులా చూస్తున్నాను. అదేమిటో చెప్పు యింతకీ" అన్నాడు రామ్మూర్తి.

"సైకాలజీలో బిహేవియరిజమూ ఫ్రాయిడియనిజమూ తరవాత, వొచ్చిన మాస్లో, రోజర్స్‌లాంటి వాళ్ళు యెగ్జిస్టెన్షియలిస్టిక్ పార్టిసిపేష నల్ ఫెనోమెనలిస్టిక్ థెరాప్టిక్ పెర్సనలిజమ్స్ ధోరణిలో మార్టిన్ స్టెయిన్ వంటి వాళ్ళ దర్శం, పార్సన్ వంటి వాళ్ళని దాటి నాన్-ప్రెస్క్రిప్టివ్, నాన్ డెటర్మినిస్టిక్, నాన్— అనార్కిక్ పార్టిసిపేషనల్ థెరాప్టిక్ ధోరణిని

హ్యూమనిస్టిక్ సోషియాలజీ అనే పేరున పట్టుకొచ్చారు. అల్విన్ గౌల్డ్‌నర్ రాసిన "ది కమింగ్ క్రైసిస్ యిన్ సోషియాలజీ"—చూడు" అని అటు నుంచి వొస్తున్న త్రిపురసుందరి వంక చూసి చిన్నవ్వాడు శ్రీపతి, పలకరింపుగా.

నాలుగు అడుగులు యిటు వేసి, "నమస్కారమండీ. చాలా కాలానికి చూశాను మిమ్మల్ని లాలో చేరారటగా" అంది త్రిపురసుందరి.

"మీ రిసెర్చి యెలా వుంది?" అన్నాడు శ్రీపతి.

"చాలా వరకు పూర్తి ఐంది. క్లైహనోవ్ కోవలాన్స్ క్రోయెబర్ లను కలగలిపి చదివితే కొంత గందరగోళంగా అనిపిస్తోంది. కొన్ని పోయింట్స్ నోట్ చేసుకున్నాను. మీకు వీలున్నప్పుడు అడిగి తెలుసుకోవా లనుకుంటున్నాను" అంది.

"మీ గైడ్‌ని అడగకపోయారా?" అన్నాడు శ్రీపతి.

"అన్నీ తెలిసి ఆ మాట అంటే యేం చెప్పేది! మా గైడూ మా డిపార్టుమెంటూ మీకు బాగా తెలుసుగ!" అంది.

"అలాగే నే వివరించగలిగితే సంతోషం" అన్నాడు శ్రీపతి.

వెడుతోంది, సూటిగా నిశ్శబ్దంగా—మెరుపు తీగకి నడవటం వొచ్చినట్లుగా.

బస్సులవైపు వెడుతోంది.

అవతలి చెట్టు కింద నిలుచున్న నలుగురు—వొకతను, నిలవవే వాలుకనులదానా—అంటే; మరొకతను వొయారి హంస నడకదానా నీ నడకలో హొయలున్నవె—అంటే; యింకొకతను, మువ్వ కులుకుతు ఘల్లు ఘల్లు నడుస్తు వుంటే నిలువదె నా మనసు—అని అన్నాడు.

అందరూ కలిసి పిల్లి వక్కా కుక్కా కోడీ కూతలు—

"ఆ మొదటివి అతకలేదుగానీ ఆ చివరి కూతలు మాత్రం వాళ్ళకి సార్ధకంగా వున్నాయి" అన్నాడు శ్రీపతి

"యెవరు వాళ్ళు?"

"అంకినీడులు!" అని చిన్నగా నవ్వాడు శ్రీపతి.

"అంకినీడు మహాబుద్ధిమంతుడై పోయాడట. ఆ సినిమా ఫ్లాప్‌తో సర్వరోగాలూ వొదిలిపోయాయట. యిప్పుడు అతని పరిధి; మామగారి వ్యాపారం, పెళ్ళాం కరుణామృతమ్మ—నూరు పైసలా సలక్షణమైన యింటి

ల్లిదట—" అన్నాడు రామ్మూర్తి సిగరెట్ వెలిగిస్తూ.

"యీ మిడిసిపాటు జంతువులూ కొన్నాళ్ళకి ఆంతకంటే మంచి యింటల్లుళ్ళవుతాయి—లేకీసూ జాకీసూ కాకపోతే!" అని నవ్వాడు శ్రీపతి.

"మర్చిపోయాను ఆనటం—తార రైలు కిందపడి చచ్చిపోయిందట తెలుసా?"అన్నాడు రామ్మూర్తి.

"తెలియదే—"

"పేపర్లో కూడా వొచ్చింది."

"యెలా? దేనికి?"

"తెలియదు, సరిగా. జనం అనుకోవడం—తను చేరిన ఆ చోటు, జాతీయ అంతర్జాతీయ స్థాయిలో చట్ట వ్యతిరేక కార్యకలాపాలు సాగిస్తున్న మహా సంస్థ అని—మరి తార యేగొడవల్లో చిక్కుకుని పోయిందో—పాపం, చివరికి అట్లా తన జీవితాన్ని తనే సమాప్తం చేసుకుందను కుంటాను."

"అలాంటి యిదైతే, హత్యా కావొచ్చుగా!" అన్నాడు శ్రీపతి.

"అవును. నాకు ఆ ఆలోచనే రాలేదు. పోలీసులకి యీ ఐడియా వొస్తే—"

"పోలీసులకి రాని ఐడియా అంటూవుండదు. బట్ దె కెనాట్. యిన్ కేస్ దె కెన్, దె వోన్ట్!" అని చిన్నగా నవ్వాడు శ్రీపతి

"నీ లా చదువు మొదలెట్టావా?" అన్నాడు రామ్మూర్తి

"అదేంటోనోయ్ రామ్మూర్తీ! నేను యే సబ్జక్టులో చేరతానో ఆ సబ్జక్టు చదవ బుద్ధవదు, దాన్లో వున్నన్నాళ్ళూ. కానీ యీ లా చదవకండా లాగించటానికి వీలయ్యేలాలేదు. చదివి పరీక్ష రాయటం అలవాటు ప్పుడూ! పరీక్షలు ఐపోయాక చదవాలనిపిస్తుంది—"

మధ్యలోనే అందుకుని, "ఐనా నీకెప్పుడూ ఫస్టు క్లాసులే వొచ్చి నయ్‌గా!" అన్నాడు రామ్మూర్తి.

"సబ్జక్టు తెలియకపోబట్టి. తెలిస్తే ఫస్టు క్లాసు రాదు" అని నవ్వాడు శ్రీపతి.

"మన రామానుజం ఢిల్లీ లో సెంట్రల్ స్టాటిస్టిక్స్ బ్యూరోలోనో దేన్లోనో వున్నాడట. నిన్ను యెప్పుడూ తలుస్తుంటాడట" అన్నాడు రామ్మూర్తి.

"ఆతనికి యే కామన్‌వెల్త్ ఫెలోషిప్పో యిచ్చి పంపతగినవాడు" అన్నాడు శ్రీపతి.

"అటు నుండి వొస్తున్నడు ప్రొఫెసర్ పీచుపాటి—వాడి "సోడితో యిప్పుడు మన ప్రాణం తినగలడు పట్టుకుని వద పోదాం లోనకి" అన్నాడు రామ్మూర్తి.

# 117

రంగారెడ్డి, భుజాన వున్న స్వెట్టర్ వేసుకుని రాయల్ టాకీసు పక్కనుంచి యిటు వొస్తుంటే జయంతి కనిపించింది

సుల్తాన్‌బజార్లో కూరలు కొనుక్కుని, వొక చేతిలో కూరల సంచి, యింకో చేతిలో ఫోం లెదర్ హ్యాండ్‌బెగ్. దాన్లో ఖాళీ టిఫిన్ బాక్సు పెన్నూ గట్రా. జయంతి చాలా కాలంగా బ్యాంకులో క్లర్కుగా చేస్తోంది

"యేమ్ జయంతీ బ్యాంక్ నుండా" అని పలకరించాడు రంగారెడ్డి.

"అవును కూరలు కొనుక్కుని"

"యేమి అట్ల డల్‌గ వున్నవ్?"

"లేదే బాగానే వున్నానే."

"యెట్లనో కండ్లపడ్తున్నావు. సంగతేమి చెప్పరాదు?"

"యేముంది మామూలు కథే. అవసరం తీరినాక తమ్ముడికీ, చెల్లెలికీ అందరికీ పనికి రాని దాన్నయ్యాను. నన్ను వాళ్ళ అక్కనని చెప్పుకోవడం కూడా యిష్టంలేదు వాళ్ళకి. మీకు తెలిసిన పాత విషయమేగా—యిప్పుడు యింట్లో—" అని ఆగిపోయింది.

"అది నేచురల్. అంత మంచితనం పనికిరాదు. తనకు మాలిన ధర్మము తగదని ఆయనెవరో అన్నడు. యేమిజరిగింది? అవధాని యేమన్న అన్నడా?"

నడుస్తున్నారు.

"యేదో విన్నట్లున్నారు. బాధపడుతున్నట్లుగా అనిపిస్తోంది."

"అనుమానిస్తున్నడా?"

"అట్లాగా అనుకోను."

"నేనొచ్చి మాట్లాడత" అన్నాడు రంగారెడ్డి

"అమ్మో!"

"భయం దేనిక్కి?"

"నా పాత జీవితం గురించి చెప్తారా ?"

"చెప్పనైతే చెప్పనుగాని, మంది అట్ల అనుకుంటె నీకేమి? ఐతే మాత్రమేమి? యిప్పటి ముచ్చటకాదు గదా అని అడ్గుత."

"అమ్మో, యింకేమన్నా వుందా!"

"యేమో? ఆయన ముచ్చటేమి? కాల గూడ పోగొట్టుకున్నడు."

"నాతో రాకండి. నేను చెప్పి తీసుకొచ్చాననుకుంటారు" అంది

వెంకటావధానికి స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో ఉద్యోగం వొచ్చి యేడాది కావొస్తోంది. సుబ్రహ్మణ్యం సిటీకి ట్రాన్స్ఫర్ చేయించుకున్నాడు. యిద్దరూ వొకే బ్యాంకు యీ డిశంబరు నుంచి వొకే బ్రాంచిలో. జయంతి వేరే బ్యాంకులో. సుబ్రహ్మణ్యం వాళ్ళ అమ్మా నాన్నా అన్నా, వదినా అందరితో ఆదే యింట్లో శాంకతో ప్రశాంతంగా గడుపుతున్నాడు. వొక మగ సంతానం. మళ్ళీ కడుపుతోంది.

"యీ పూట మీకు తీరికేనా ?" అంది జయంతి.

"నాకు యెప్పుడు గూడ పనీ లేదు తీరికా లేదు. వచ్చి వారం దినాలాయె. వూకెనే వొస్తి. మర్ల వూరికి పోవాల "

"పొలం పనులా?"

"అది గూడ లేదు. నాయ్ననే చూస్కుంటడు. వూకెనన్న వుండాల."

"యీ రోజు—మా పక్కవాటాలో ఆవిడ—వాళ్ళాయన వూరెళ్ళాడు పొద్దుట రేపు వొస్తాడు. నేను వెళ్ళి వంట చేసి ఆవిడతో కాలక్షేపం చేస్తుంటాను. మీరు యింకో గంటకో గంటన్నరకో రండి" అని అంతలోనే "యెందుకో భయంగా వుంది. మీరు నా పాత జీవితం చెప్పకండి దయచేసి" అంది.

"మేలు జరుగుత దనుకుంటె చెప్త. అదంత నాకు యిడ్సిపెట్టు జయంతీ. అవధాని నాకు బాగ తెలుసు కదా. ఐ కెన్ పెట్ హిమ్ రైట్" అన్నాడు.

జయంతి ముందుకు నడిచి వెళ్ళింది.

రంగారెడి వెనక్కి తిరిగి సుల్తాన్‌బజార్ వైపు అడుగులువేసి —

సెంటర్లో బాటా షాపు ముందు నిలుచుని జనాన్ని చూస్తున్నాడు.

ఐదు నిమిషాలు.

"యే గోరీ మేరీ ప్యారీ" అన్నాడు వొకామెని. పక్కకి తిరిగి చూసి ఆగింది.

"యీ రోజు తీరికేనా?" అన్నాడు వుర్దూలో.

"లేదు. వకరికి వొస్తానని చెప్పాను" అంది ఉర్దూలో.

"నేను రేపు వూరికి వెళుతున్నాను. వీలైతే చెప్పు మరి?"అన్నాడు

"వంద రూపాయలు" అంది.

"వందా! యాభయ్యేగా?"

"రేపు ఐతే. యివ్వాళ మాటిచ్చిన బేరం వొదులుకోవాలి."

"మరీ అంత అన్యాయానికి పోతే రోగాలతో వస్తావు" అన్నాడు.

"యిప్పుడు సరిపడా లేకనా?" అంది.

"ఐతే పాతిక చాలు!" అని నవ్వాడు.

"మందుల కోసం యింకో పాతిక" అని నవ్వింది.

"నాకూడా తీరక లేదు యీపూట. రేపు వూరెళుతున్నాను. యీసారి వొచ్చినప్పుడు" అన్నాడు.

"మీలాంటివాళ్ళ పుణ్యం!" అని ముందుకు వెళ్ళిపోయింది. జనాన్ని చూస్తూ నుంచున్నాడు

వొక గుడ్డి అతను కర్ర టిక్కు-టిక్కు- లాడిస్తూ కాలిబాట మీద ఆగాడు, రోడ్డు దాటటానికి. ట్రాఫిక్ రద్దీవల్ల నిలుచుని పోయాడు.

రంగారెడ్డి అతని చెయ్యి పట్టుకుని, "అ పక్కకు పోవాల్నా?" అని రోడ్డు దాటించి— అటు కాలిబాట మీద నుంచుని జనాన్ని చూస్తు

"హలో రంగారెడ్డీ"

"హలో విలియం"

"రా. తాజ్‌లో కూర్చుందాం ఐనంతసేపు. చాలా దినాలకు కంటబడ్డివి"

అన్నాడు విలియం.

నడిచి—తాజ్‌లోకి కాక యిండియా కాఫీ హౌస్‌లోకి వెళ్ళారు.

అవీ యివీ కబుర్లు.

"సుచిత్ర డెత్ వేసరల్ కాదట. సుసైడ్ చేసుకున్నదట" అన్నాడు

విలియం.

"నీకెట్లా తెలిసె? యిన్ని దినాల తర్వాత బయటికెట్లొచ్చె?"

"పోలీస్ జాబ్ కదా!" అన్నాడు విలియం.

విలియం సబ్‌యిన్స్పెక్టర్‌గా చేస్తున్నాడు. యేదో కేసు గురించి కూపీ తీస్తుంటే, తీగలాగితే డొంకంతా కదిలినట్లు, సుచిత్ర మరణం వివరాలు దొరికాయి.

"మరి మన హాకీ ఛాంపియన్‌ని అరెస్టు చెయ్యకపోయూరా?" అన్నాడు రంగారెడ్డి యింగ్లీషులో.

"అంత ఆధారాల్లేవు. కాగా అతనికి అన్ని రకాల బలమూ వుంది. చాలా కాలంగా అటువాళ్ళ ప్రాంతంలోనే వుంటున్నాడు. పెళ్ళి ఐంది. యిద్దరు పిల్లలు కూడా" అన్నాడు విలియం యింగ్లీషులో.

"నీకు తెల్సిన డీటెయిల్స్ చెప్పు."

"వీడు ఆమెను కశ్మీర్ తీస్కపోయిండు అక్కెల్లి ఆగ్రా — ఫ్రమ్ దేర్ నాగ్‌పూర్. అక్కడ వీళ్ళిద్దర్కి యేదో జగ్డమైంది. అప్పట్కి ఆమెకు ఫోర్త్‌మన్త్. వీడు ఆమెను అక్కడ్నె వాదిలిపెట్టి గప్‌చిప్ వొచ్చేసిండు. సిటీకి గూడ రాకనే వాళ్ళ వూరికి పోయిండు ఆ పోరి అక్క సుసైడ్ చేసుకున్నది. ఐతే సర్కమ్‌స్టాన్షియల్ ఫ్యాక్టర్స్ వల్ల అట్లని తెలియలేదు. వూహిస్తే అర్థమైకది కేస్ పుటప్ చేసెదానికి ఆధారాలులేవు" అన్నాడు విలియం.

"ఆమె అన్న ప్రమోద్ యెక్కడున్నడు?"

"నైజీరియా పోయిండు."

యిద్దరూ లేచి బయటికొచ్చారు.

"దోస్తువి నీమీద యేదన్న కేస్ పెట్టాలనిపిస్తున్నది!"

"నేను అడవాన్నయితె బ్రోతల్ కేస్ బనాయించె స్కోప్ వుండేది. అప్పుడు కస్టమర్‌వి నువ్వె!" అని నవ్వాడు రంగారెడ్డి.

"సీయూ"

రంగారెడ్డి నడుస్తున్నాడు, స్కూటర్ తోసుకుని. యిరవై నిమిషాలకి వెంకటావధానింటికి చేరాడు. తలుపు తీసేవుంది.

"అవధానీ." అని పిలిచాడు

"శివహూ!" అని గోసన్నంది. వెంకటావధాని గొంతు.

"నేను రంగారెడ్డిని."

"హలో మెస్నాళ్ళకి! రా లోపలికి!" అని కుర్రకాలుతో లేచి ముందు గదిలోకి రాబోతూండే, గబగబా అడుగులు వేసి రంగారెడ్డి మధ్య గదిలోకి వొచ్చాడు.

"యెప్పుడొచ్చావు?" అన్నాడు వెంకటావధాని.

"వారం దినాలాయె."

"వుంటావా కొన్నాళ్ళు?"

"లే రేపే పోవాల. యేమ్టి ముచ్చట్లు? అట్లున్నవేమి? జయంతి వున్నదా లోన? యు ఆర్ యె లక్కీ ఫెలో టు గెట్ సచ్ యె నైస్ వైఫ్" అన్నాడు రంగారెడ్డి.

నిట్టూర్చాడు వెంకటావధాని.

"యేమ్టి అట్లయిపోతివి జయంతి ముచ్చట తేంగనే? మీ యిద్దర్కి జగ్డమయ్యెనా? ప్రణయకలహం!"

"నా బతుకు చెప్పుకునేలాగాలేదు, రంగారెడ్డి — జీవితంలో అన్నీ అపశ్రుతులే, అశాంతులే."

"ఛఛా. యేంటట్లా యిదై పోతావు —పరిస్థితులను చక్కజరుచు కోవాలి గానీ —" అన్నాడు రంగారెడ్డి యింగ్లీషులో.

"నా మనసులో బాధ యెవరికీ చెప్పుకోలేనిది!"

"యెవర్కి సంబంధించిన ముచ్చట? మీ పేరెంట్స్ వాండ్ల విషయ మేమైనన?"

"వాళ్ళెప్పుడో నన్నొదిలేశారు గాలికి. జయంతి విషయం."

"ఆర్ యూ సస్పెక్టింగ్ హెర్? ఐ విల్ కిల్ యు" అన్నాడు రంగారెడ్డి.

"లేదు యెంత మాత్రమూ అనుమానించడం లేదు. నేనంటేయెంతో యిదిగా వుంటుంది. కుంటివాడినైనా, జీవితంలో చితికిపోయినా నాకెంతో అండగా తృప్తి కలిగిస్తూ వుంటుంది. కానీ—"

"కానీఐ దిమ్మిడీలు మీ ఆంధ్రాలోగూడ లేవిప్పుడు! యేమన్న విష యముంటె చెప్పు. ఆమె నాకు మన నిజాం కాలేజీ టైం నుంచి మంచిగ తెల్సు."

"కొందరు జయంతి గురించి రకరకాలుగా వ్యంగ్యంగా అదోలా

అంటూండగా వింటున్నప్పుడు నా మనసులో యేదో వొక భావం కలిగింది. యీామె గత జీవితాన్ని అసహ్యించుకునే, వీళ్ళ వాళ్ళెవరూ యీామెతో సరిగా మాట్లాడరట."

"వాండ్లకు యీామె పెండ్లి చేస్కోటం యిష్టంలేదు. యీామె జాబ్ చేసి తెచ్చే పైసలన్నీ వాండ్లు తీస్కొనెటోళ్ళు. అందుకోసం వాండ్ల ముచ్చటంత నాకెరికనే జయంతివి యేమని అన్నరనలు?"

"వాళ్ళకోసం చదువుకునే రోజుల్లో లాడ్జిల కెళ్ళేదని—"

పకపకా నవ్వి, "యిదేమొ కొత్త ముచ్చటోలె చెప్పవడ్తివి! ఆ దినాలల్లోనె కాలేజ్‌ల అనుకునెటోళ్ళు. తండ్రిచచ్చిపోయె. యీామెకోసం ట్రై చేసి ఫెయిలయి పోరగాళ్ళు పుకార్లు పుట్టించెటోళ్ళు" అన్నాడు రంగారెడ్డి.

"అంతేనంటావా ?"

"అనుటేమి! నా కంత యెరికనే గద! నేను తిర్గనిలాడ్జి గాని తావు గాని వున్నదా! యాడవన్న కండ్లవడి వుండాల గద!"

"అంతేనంటావా ?"

"అది సింపుల్ ఫాక్ట్—అది సరే అవధానీ, నేనొక ముచ్చట అడుగుత చెప్తవా?"

"అడుగు రంగారెడ్డీ. నీకు చెప్పగూడని దేముంటుంది! నా శ్రేయస్సు కాంక్షించే మిత్రుడివి."

"నీ కాలెంగు కిర్గిపోయినది ? మీ వాండ్లు నిన్నేమిటిక్కె వొదిలేసిన్రు ?"

"నీకు తెలియని సంగతులు కావు. దేనికి అడుగుతావు? స్వయం కృతాపరాధం."

"అట్లజేసి, తుంటోవివయ్యి నీ వాండ్లందరు తరిమేస్తే, విజయ్ కుమార్ వాండ్ల దగ్గర బత్కాల్సి వచ్చెగద. అసుమంటి నిన్ను మరి ఆమె యేమనుకోవాలి?"

"లేదు రంగారెడ్డీ! యీా విషయంలో జయంతి దేవతనుకో?"

"అట్లనే వొకవేళ జయంతి, వక ఐడియల్ నెసిసిటీకోసం యేమైనా అట్లిట్ల వుండిన గూడ తప్పేమున్నది? నీకంటె మేలెగద!"

"అవుననుకో—"

"అస్సలిక్కె యేమి లేనిదాన్కి యిట్ల సోంచాయించుడేం మంచిగ

లేదు. యేమన్న వున్న గూడ యిట్ యీజ్ రీజనబుల్ టు యిగ్నోర్. అవధానీ నీదసల బేసిక్‌గ డర్టీ మైన్డ్. అన్ని డర్టీగనె ఆలోచిస్తుంటవు. యింతకు జయంతి యాడికి పోయింది? కూరగాలు గిట్ల దినాం నువ్వే తెస్తు న్నవా? ఆమె తెస్తదా?"

"తనే తెస్తుందయ్యా! అవివాటిణ్ని నాకు యే పనీ అప్పగించదు. పక్క పోర్షనులో ఆవిడతో మాట్లాడుతూ వుందేమో పిలుస్తానుండు" అని లేచి కర్రకాలుతో నడుస్తూ, ముందు గుమ్మంలోకి వెళ్ళి, "జయంతీ" అని పిలిచాడు వెంకటావధాని.

"ఆఁ, వొచ్చే" అని చెంగున వొచ్చి, "పిలిచారా?" అంది జయంతి

"వూఁ మన రంగారెడ్డి వొచ్చాడు."

"అట్లాగా. మీ క్లోజ్ ఫ్రండ్" అంది.

"భోజనం వేళయింది. మనతోపాటు భోజనానికి కూచోమందాం. సరదాగా కలిసి తిందాం మ గ్గురం యేమన్నా స్పెషల్ తయారుచెయ్యి అతనికి" అన్నాడు వెంకటావధాని.

అంతలో అక్కడికి వొచ్చిన రంగారెడ్డి, "స్పెషల్ గిషల్ అంటె భోజనం చెయ్య" అన్నాడు.

ముందే ప్రత్యేకం వంట చేసి వుంచిన జయంతి, "సన్నిహితులకి మనతోపాటు యేదుంటే అదే" అంది.

"చూస్తివా అవధానీ నీకు బుద్ధిలేదు. జయంతి యెంత మంచి మాట అన్నదో చూడు" అన్నాడు రంగారెడ్డి.

జయంతి వంక తృప్తిగా సంతోషంగా చూశాడు వెంకటావధాని.

## 118

పంది కడుపున కుక్కపిల్ల పుట్టి బతికి వుంటేనో, రెండు తలలు యెనిమిది కాళ్ళతో జంతువేదో పుట్టి బతికి వుంటేనో, అలాంటిదేదో జరిగినప్పుడు—జనం తండోపతండాలుగా వొచ్చి చూసి పోతుంటారు. ఆ తరవాత రోజూ కొందరు - యాత్ర ప్రజలా వొచ్చి చూసి పోతుంటారు.

అట్లా, యిందిరా కాంగ్రెసు వాళ్ళు యిండిపెండెంట్లు జనతా పార్టీలోకి చేరిపోయారు. చేరిపోతూనే వున్నారు. డిశంబరు మూడో వారంలో కాంగ్రెసు మరోసారి చీలి, ఆ ప్రభావం రాష్ట్రంమీదా పడింది. యెంతో ఐశ్వర్యమూ సంపదావున్న మనిషి సర్వం కోల్పోయి కట్టుబట్టల్తో నిలుచున్న స్థితిలో ఆమె వుంటే, చవాన్ తదితరలు కాంగ్రెసుని చేజిక్కించుకోవాలన్నట్లుగా ప్రవర్తించి— కాసు బ్రహ్మానందరెడ్డి కాంగ్రెసుగా యిందిరాగాంధీకి ప్రత్యర్థి కాంగ్రెసు యేర్పడింది. రాష్ట్రంలో ముఖ్యమంత్రి వెంగళ్రావు అటూయిటూ వూగిసలాడి, ఆ స్థితిలోవున్న యిందిరా గాంధీని వొదిలి, బ్రహ్మానంద రెడ్డితోవున్న విభేదాలను సరిచేసుకుని, "కాసు కాంగ్రెసు"లో చేరటంతో యే.పి.సి.సి. యిందిరాగాంధీ నాయకత్వాన్ని తిరస్కరించింది. దాంతో, రాష్ట్రంలో యిందిరా కాంగ్రెసు పాలన కాక కాసు చవాన్‌ల కాంగ్రెసు పాలన వొచ్చినట్లయింది.

యీ పరిస్థితిలో రాజకీయులు అటు జనతాలోనో యిటు కాసు కాంగ్రెస్‌లోనో చేరటం సహజం. కాంగ్రెసు ప్రముఖులంతా వెంగళ్రావు నాయకత్వంలోవున్న కాసు కాంగ్రెసులో వుండిపోయారు. యిందిరా కాంగ్రెసులో యెవరూ మిగిలిలేరు— పి. వి. లాంటి వయోవృద్ధుల తప్పించి. యీ తరుణంలో గోవర్ధన్‌రెడ్డి కాసు కాంగ్రెసులోనే వుండిపోయాడు. యింకా జనతాలో చేరని కొందరు జనతాలో చేరిపోయారు. రవికి తన నియోజకవర్గములో పలుకుబడి వుండటమేకాక తనని సమర్ధించే యిండిపెండెంటు శాసన సభ్యులున్నారు వాళ్ళలో కొందరిని కలుపుకుని యిందిరా కాంగ్రెసులో చేరాడు యింత తెలివైనవాడు అటు జనతాలో ఐనా యిటు కాసు కాంగ్రెసులో ఐనా చేరితే సముచిత స్థానం పొందగల స్థితిలో— మునుగుతున్న వోటిపడవలో చేరాడు. తెలివి తక్కువగా అన్నారు. అసలు అలా యిండిపెండెంటుగా వుండిపోతే తన విలువ ప్రత్యేకత యినుమడింపును— అనీ అన్నారు.

ఫిబ్రవరిలో దక్షిణాది రాష్ట్రాలలో యెన్నికలు ప్రకటించినందున సీట్ల వేటలో— అటు జనతాలోనూ, యిటు కాసు–వెంగళ్రావుల అధికార కాంగ్రెస్‌లోనూ సీట్లు సంపాదించలేని అనామకులు యిందిరా కాంగ్రెసులో చేరారు— గెలుస్తామని లేకపోయినా, రాజకీయపు దురదకొద్దీ.

కాంగ్రెస్ చిహ్నం అప్పుడూడ అధికార కాంగ్రెసుకి వెళ్ళింది.

యిందిరా కాంగ్రెసుకి హస్తం గుర్తు యిచ్చారు. యేనాటినుంచో కాంగ్రెసుకి రాట్నం, యెద్దులు కాడీ, ఆవూదూడ లాంటి చిహ్నాలు వుంటూ గాంధీ ధోరణికి సూచ్యంగా వుంటున్నాయి. హస్తంగుర్తు సాముద్రికానికో, బెదిరింపుకో సూచ్యంగా అనిపించవొచ్చు. కాదంటే, అభిమానానికి సూచ్యం కావొచ్చు— తనే, దిక్కూ దరీ లేక బెంబేలుపడుతున్నట్టుగా దైన్యస్థితిలో వున్నట్టుగా వున్న మనిషి అభయహస్తం చూపెడితే నవ్వొస్తుందేమోగానీ మరెలాగూ అనిపించకపోవటం సహజం.

వుత్తర భారతం అంతటా జనతా గాలి వుధృతంగా వీస్తోంది. కేంద్రంలో జనతా పాలన ఆంధ్రప్రదేశ్, కర్నాటకలలో జనతాకి ఆ తరవాత అధికార కాంగ్రెసుకీ వొస్తాయనీ యిందిరా కాంగ్రెసు వగైరా పేరు కున్నట్టుగా చిల్లరమల్లర పోగు చేసుకుంటుందనీ— రాజకీయ కోవిదులే కాక, విద్యార్థులూ, తదితరులూ అనుకున్నారు.

యెలక్షన్లు ముగిశాయి. రవి తన నియోజకవర్గం నుంచి యిండిపెండెంటుగా పోటీ చేసినా, యే పార్టీ అభ్యర్థిగా పోటీ చేసినా గెలవటం తథ్యం జనతానీ అధికార కాంగ్రెసునీ రకరకాల కోణాలనుంచి విమర్శిస్తూ వుపన్యాసాలిచ్చాడు, వివిధ వర్గాలలో వివిధ రీతుల్లో. తన వోటర్లలో సంపన్నులు చాలా తక్కువ.

ఆ పార్టీల వాళ్ళు, యెమర్జన్సీలో యిందిరా గాంధీ చేసినదంటూ వర్ణించే ఘాతుకాలను, రవి, సందర్భ అనివార్యతలుగా వివరించాడు. వొంటరిదాన్ని చేసి యీ పెద్దలంతా యెలా హింసిస్తున్నారో వివరించాడు. యిదంతా తన తరఫున వుండే అభ్యర్థుల నియోజకవర్గాలలో. తన నియోజకవర్గంలో యే పార్టీ ప్రసక్తి తీసుకురానక్కరలేదు. తను వ్యక్తిగా, వొక అభ్యర్థిగా యే వాడకట్టున యెలా మాట్లాడాలో అలా మాట్లాడితే చాలు

ఫిబ్రవరి యిరవై యెనిమిది. యెన్నికల ఫలితాలు.

ఫలితాలు అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాయి. కర్నాటకలోనూ అంతే జనతా పరిగేరుకున్నట్లుగా కొన్ని సీట్లు గెలుచుకుంది. అధికార కాంగ్రెసు నామరూపాల్లేకుండా పోయింది యిందిరా కాంగ్రెసుకి యెబ్సొల్యూట్ మెజారిటీ వొచ్చింది. అనామకులంతా శాసనసభ్యులయ్యారు వాళ్ళకై వాళ్ళు యేమీ కాలేనివాళ్ళు. అంటే యిందిరాగాంధీకి ప్రజలు వోటు వేశారని నిర్ధారించక తప్పదు. చెంబు గుర్తో, చెప్పు గుర్తో యివ్వాల్సింది. అని కొందర

న్నారు అక్కసుగ. ఆ గుర్తు యిచ్చినా అప్పి వోట్లూ వొచ్చివుండును. యిప్పుడు హస్తం యిందిరమ్మ అభయహస్తం. మూలపుటమ్మ అభయ హస్తం ఐంది. అప్పుడు చెప్పుగుర్తు రామపాదుకలుగానూ భగవత్పాదుకలుగానూ ఐవుండును.

రాజకీయ అభ్యర్థిత్వపు అర్హత కోల్పోయిన చెన్నారెడ్డి, ఉత్తర్ ప్రదేశ్ గవర్నర్‌గా వనవాసం పొందిన చెన్నారెడ్డి, యెలక్షన్ల ముందు వేళకి కోర్టువారు విధించిన అనర్హత గడువు తీరినందున యే పార్టీలో చేరాలా అని ఆలోచించి— కాసేపు జనతా, కాసేపు అధికార కాంగ్రెసు, మినహకు మినహకు మంటున్న యిందిరా కాంగ్రెసులో— దేన్లో చేరటమా అని ఆలోచిస్తూ, బేరీజులు వేస్తూ జనతాలో చేరినా అధికార కాంగ్రెసులో చేరినా తనకి ప్రత్యేకమైన ప్రాముఖ్యత వుండదని అనిపించినందున చివరికియిందిరా కాంగ్రెసులో చేరాడు— యెక్కడో దివాన్‌గిరీ కంటే వూళ్ళో మునసబు గిరీ మేలన్న భావంతో.

అన్నీ ఆముదపు మొక్కలవటంతో, అసలే రాజకీయ తంత్రపు బుర్రేమో మహా వటవృక్షంగా నిలబడి ముఖ్యమంత్రి అయ్యాడు— చెన్నారెడ్డి. యీ మంత్రి వర్గంలో, రవి, తనకి శాసనసభలోని యిందిరా కాంగ్రెసులో వున్న బలం దృష్ట్యా మంత్రి అయ్యాడు. కార్మిక శాఖ.

మాజీ అధికార కాంగ్రెసు ఐన కాసు వెంగళరావుల కాంగ్రెసు వొకటున్నదనేందుకు అన్నట్లుగా వెంగళ్రావు వంటి వొకరిద్దరు అభ్యర్థులు గెలిచారు. వోడిపోయిన యెందరో కాసు కాంగ్రెసు అభ్యర్థుల్లో గోవర్ధన్‌రెడ్డి కూడా వున్నాడు. అసెంబ్లీలో జనతా అభ్యర్థి ప్రతిపక్ష నాయకుడు.

రవిని సమర్థించే శాసనసభ్యులు తదితరులు గంగిని సంప్రదిం రవికి సన్మాన సభ యేర్పాటు చేశారు. మాట వరసకి వొద్దన్నాడుగానీ, లోన యిష్టంగానే వుంది. ఆనాడు అసెంబ్లీలో అనామకంగా నిలుచున్న రోజున మినిస్ట్రీ కుర్చీమీద పడిన అతని కన్ను, అధికారం మీదకి మళ్ళిన అతని మనసు— యీ రోజున సంతృప్తిగా దానికి ప్రతిరూపాలైన సన్మానసత్కారాలను ఆనందిస్తున్నాడు. అదే వేదికమీద, రవితోపాటు అతని ధర్మపత్ని గంగినీ కూర్చోబెట్టారు ఆదర్శ దంపతులుగా అభివర్ణించి యిందుకుగాను మరికొన్ని పూలమాలలు వేశారు.

# 119

అనంత్ రెడ్డి, స్వప్న నాగలీనలు చీకట్లో రోడ్డుమీద నడుస్తున్నారు. వొకరి ప్రక్కన వొకరు విమానాశ్రయానికి వెళ్ళే రోడ్డువెంట. యెనిమిదీ పావు. చుట్టూ నిశ్శబ్దం. అలా అని మరీ అంత నిశ్శబ్దమూ కాదు.

యెప్పుడన్నా అలా పైకి లేచి దిగివొచ్చే విమానం, మెత్తగా దూసుకెళ్ళే వో కారు, వొకరో యిద్దరో నడిచివెళ్ళిన బూట్లచప్పుడు.

అనంత్ రెడ్డి, బేగం పేటకి యీ కొసన సికిందరాబాద్ వైపుకి చిన్న బంగళా అద్దెకి తీసుకున్నాడు. టెలిఫోను పెట్టించాడు. యింటి నుంచి డబ్బు తెచ్చి కారు కొన్నాడు. దాన్లోనే రోజూ కాలేజీకి వెడతాడు. స్వప్న నాగలీన రిసెర్చి వొదిలేసింది. రోజంతా యింట్లోనే వుంటుంది. వూరినుంచి పంపిన పనిమనిషే అన్ని పనులూ చేస్తుంది. వంట కూడా చేస్తుంది. కానీ చాలా వరకు వంట తనే చేస్తుంటుంది. సంగీతం వింటూ వుండిపోతుంది. అప్పుడప్పుడు వో సాహిత్యం పుస్తకం.

అప్పుడప్పుడు సాయంత్రాలు తెలిసిన వాళ్ళింటికి వెడుతుంటారు. యెక్కువగా ఆమె పినతండ్రి నాగిరెడ్డి యింటికి వెడుతుంటారు. అక్కడికి వెళ్ళిన సాయంత్రం, రాత్రి భోజనం అక్కడే. అనంత్ రెడ్డి నాగిరెడ్డితోనో మరొకరితోనో మాట్లాడుతూ వుంటాడు. తనూ కాసేపు మాట్లాడి, వొక్కతీ బయటికి వొచ్చి పచ్చికమీద పడుకుంటుంది. ఆ పచ్చిక ఆమెకి యెంతో ఆత్మీయంగా అనిపిస్తుంది. అది ఆమె జీవితపు కలల వూహల అనుభూతుల పచ్చిక.

సాధారణంగా డాబామీద వెల్లకిలా పడుకుని వుండిపోతుంది. చాలా సార్లు. తన చేతివేళ్ళతో నక్షత్రాలని తడుముతుంది. కొనలు గుచ్చుకోగా— పాపం, అంత యిదిగా గుచ్చుకోవాలంటే యెంత కష్టం — అన్నట్లుగా జాలిగా వాటి అంచుల్ని తడుముతుంది. వొంటరిగా దిగులుగా కదిలే మబ్బు తునకకి ఆప్యాయంగా చెంప ఆనిస్తుంది. నిరాధారంగా పోతూన్న గాలిని తన చర్మంతో స్పర్శించి ఆసరా యిస్తుంది. క్రీనీడనే వుండిపోయిన ఆకాశాన్ని దగ్గిరికి లాక్కుని తన పచ్చని పక్షపు మెత్తనివెలుతురుమీద పడుండబెట్టుకుంటుంది. అవతలెటో వీధుల్లో తిరిగి తిరిగి దుమ్ము కొట్టుకుని జాబిలి వొస్తే కన్నీటితో స్నానం చేయించి వొళ్ళోకి తీసుకుంటుంది.

గదిలో వర్క్ చూసుకుంటూ, పైకి వొచ్చి ఆమె పక్కన పడు కుని, "స్వప్నా" అంటాడు అనంత్‌రెడ్డి. "ఊఁ" అంటుంది ఆమె ఐదో పదో నిమిషాలు. లేచి ఆమె చెయ్యి అందుకుంటాడు. మెట్లు దిగి లోన గదిలోకి వొస్తారు. మంచంమీద పడుకుంటారు. ఆమె వొంటి చందనం పరిమళం అతన్ని ఆవరిస్తుంది. పక్కకి తిరిగి తలనుంచి పాదాల దాకా ఆమెని చూస్తాడు. విద్యుదయస్కాంత వలయంలా అనిపిస్తుంది. యిటీవలే అతనికి సడన్‌గా తెలిసింది— యెలెక్ట్రో మేగ్నెటిక్ ఫీల్డ్ అంశం మీదకి తనకు ఆసక్తి కలగటం, ఆమెని చూశాకనే అని. ఆమెవైపు తిరిగి దగ్గిరిగా జరిగి ఆమె పెదాలమీద పెదాలు అద్దుతాడు అతనిలో ఆమెలో చల్లని మాధుర్యపుధార ప్రవహించి నెత్తుట్లో కలిసి సెగరగిల్చి— వొకరి నొకరు వొళ్ళంతా స్పర్శిస్తూ, పెనవేసుకుని— ప్రవాహంకట్టలు తెంచుకో యత్నించే క్షణాన— అద్వైత యుగళ సర్వశక్తి పరిధిలో వొక వొడిలిన కాంతిరేఖ —చిట్లిన గాలిబూరలా చటుక్కున విడివడి మంచానికి చెరో అంచుమీదకి తిరిగిపోతారు. యిద్దరి కళ్ళనిండా నీళ్ళు— ఆ కన్నీళ్ళు రాకుండా వుండటం కోసం, వొకే మంచం మీద పరున్న యిద్దరి శరీరాల మధ్యా కొన్ని యోజనాల దూరం విస్తరింపించు కుంటారు

పోలీసు లైన్సు వైపు నుంచి తిరిగి బేగంపేట రోడ్డు వెంట పడుతున్న వాళ్ళిద్దరూ కుడివైపున మైదానంలోకి అడుగులువేశారు. గడ్డి యెండి పోయి కొంతా, గడ్డి బాగా పెరిగిపోయి కొంతా — మైదానం.

యెత్తుగా అస్తవ్యస్తంగా పెరిగివున్న గడ్డిలో కూచునిపోయింది. అతనూ కూచుంటూ, "పాములుంటవేమో—" అన్నాడు.

"మనమూ వుంటాంగా. అలాగే అవీ" అంది.

"కాటువేస్తే!"

"మనదారిని మనం కూచునివుంటే వాటికేంఅవసరం కాటువెయ్యటా" అంది.

"వెళ్తూ దారిలో మనం అడ్డొచ్చి భయపడి"

"వేస్తే యేంవుంటుంది! బ్రతికి వుండటం యెంతసహజమో మరణమూ అంతే సహజం. మరణంఅంటే భయపడటంకూడా అంతేసహజం. నాకెందుకో భయం వెయ్యటం లేదు. యిది అసహజం. అసహజత్వాన్ని అనాది సహజత్వమో అనంత సహజత్వమో అని అనాలేమో —" అంది.

"నువ్విట్లా మాట్లాడుతుంటే శ్రీపతి మాట్లాడుతున్నట్లుగా వుంది" అన్నాడు.

"ఎప్పుడో అతని దగ్గిరే వినివుంటానేమో"

"శ్రీపతి ఆలోచనా అవగాహనా అనీ అపారం" అన్నాడు.

"శ్రీపతిగారు దిగులంటానే లోతుగ్రహించి ఫీలయ్యి అనుభూతిస్తారు. దిగులోతు అనుభవించి ఐక్యమయ్యే స్వభావం కాదు. అనుభూతిలోంచి అనుభవం రాదు. అనుభవం, అనుభవంలోంచే వొస్తుంది. యిదికూడా అతని మాటలలోంచే గ్రహించానేమో—"

"స్వప్నా"

"వూఁ"

"స్వప్నా"

"వూఁ"

"నా కారణంగా నువ్వు అన్యాయంగా—"

మధ్యలోనే అందుకుని, "ఆ పాత విషయం దేనికి? లోకం కారణంగానో, యెవరి కారణంగానో, ఆఖరికి మీ కారణంగానో కాదు. నా కారణంగా అనంత విశ్వపరిధిలోని నా వునికి నాకు వొకానొక అనంత పరిధిలోంచి ఆకళింపుకి వొచ్చింది. ఆ అనుభూతిని, ఆ అనుభవాన్ని అధిగమించలేను. అధిగమించితే అనంత విశ్వపరిధి నా జీవన వలయం అవుతుంది" అంది.

"నువ్వు చెప్తున్నది యెంతగా అర్థమవటం లేదంటే యెంతో బాగా అర్థమైపోయినట్లుగా అనిపిస్తున్నది. తమాషాగా" అన్నాడు.

"అంతకంటే తమాషా యేమిటంటే, నేను చెబుతున్నది నాకు అసలుకే అర్థమవటం లేదు. యెలా చెబుతున్నానో యెందుకు చెబుతున్నానో నాకే తెలియదు. అదేదో బయటికి వెలువడిన లోలోపలి నవ్వేదేమో" అంది.

అతను లేచి ఆమె చెయ్యి అందుకున్నాడు.

నడుస్తున్నారు— అనంత్ రెడ్డి స్వప్న నాగసేనలు.

యిళ్లు. భోజనం. పడక.

నిద్రపట్టటంలేదు యిద్దరికీ. నిద్రపట్టించుకోవాలంటే —

నిద్రలేకుండా నడుస్తున్నారు మంచంమీద అటొకరు యిటొకరు.

రెండు గంటలు.

అతనికి కునుకు పట్టింది.

—అతనిలోంచి నిద్రపోగల తన లోలోతుల నిద్రలేమితో భాషలేని భావాల కలవరింతల తను లేని నేను లేని నేను లేని తను లేని తను లేని నేను చిటికెడు సహారా మంచుమైళ్ళ వుగ్గిన్నెడు నగరాల నగిబిద్వేషుల ప్రాంతరితనపు పాతిక పచ్చని గుండెల జానెడు పులుపు చేతుల చెమ రెక్కల శూన్యపు గుప్పెడు మెరుపు తీగెల చేదు మణుగుల కళ్ళ శిరోజాల విశ్శబ్దపు సోలెడు మనసుల కౌగిలింతల కడివెడు మట్టి చెవుల దాహపు చిరిగిన ఆకాశాల వుప్పు నీళ్ళ బిగిసిన లాలిత్యాల నల్లని పరిమళపు కోసెడు కండరాల రాగాల పగిలిన చల్లని తీపి సౌందర్యపు తెల్లని ఐశ్వర్యపు వెత్తుటి లోతుల పెదాల బండెడు రసరాగపు కుంచెడు శరీరాల నవ్వుల చంకల కలల వంధ్య గర్భస్రావాల వూదా అనురాగపు గరుకునిద్ర నిరీహ మైనంపుల్లల కత్తుల దారాల శోభనాల పాషాణవీధుల ఆవేదనల సముద్రాల తొడల బుట్టెడు యినక ప్రవాహాల చీలిక దాహాల నాలుకల అనంత నిష్క్రమణాల..............

దొంతర రాత్రుల కలత నిద్రలోకి నిష్క్రమిస్తుంది. ప్రతి నిత్యమూ మేల్కొలిపే వుషస్సంధ్యని స్నిగ్ధనగ్న మానసంతో ఆహ్వానిస్తూ.

అలా ఆహ్వానించి, లేచి: తన నన్ను పొడవాటి వేళ్ళతో అనంత్ రెడ్డి చెంపలను స్పర్శించి నిద్ర మేల్కొలుపుతుంది స్వప్నరాగలీన.

# 120

మాక్స్‌ముల్లర్ భవన్‌లో శ్రీపతి వేసిన చిత్రలేఖనాల ప్రదర్శన.

వొకరోజు శ్రీపతి గదిలో, చేతులోంచి జారి గచ్చుమీద దొర్లి వో మూలకి పోయిన యాభయ్ పైసల బిళ్ళకోసం రామ్మూర్తి, బట్టలస్టాండు వెనక్కి దూరినప్పుడు పెద్ద కాగితాల చుట్ట కనిపిస్తే—

"యీ కాగితాల సిలిండరేమిటి శ్రీపతీ" అని అంటే; "అది నా ఆత్మయిక స్థితికాలంలోని వ్యాపకం. రంగుల గీతలమరకలు. చూస్తే జడుసుకుంటావు. మీ ఆవిడ బాబాల విభూతికోసం వెళ్ళొస్తుంది" అన్నాడు

శ్రీపతి.

"చెప్పావుకాదేం!" అని ఆ కట్ట యువతలకి లాగి, బూట్లు తుడిచే బనియను బట్టతో దుమ్మూ బూజూ దులిపి కట్టవిప్పాడు. చూసి విస్తుపోయి "యింత గొప్పగా పెయింటింగ్ చేసి —" అని అంటూంటే మధ్యలోనే ఆవి "కొయ్యకు రామ్మూర్తీ, నీకు పెయింటింగ్ గురించి యెంత తెలుసో నాకు తెలుసుగా!" అన్నాడు శ్రీపతి.

"అవి నీకు తెలుసునని తెలిసిన నేను— అందునా నీ దగ్గిర కొయ్య డనూ? యెంతమాట! కానీ యేమీతెలియకపోయినా యివేవో గొప్పగా వున్న వని మాత్రం తెలుస్తోంది." అని వాటిని భద్రంగా చుట్టపెట్టి వొచ్చి కుర్చీలో కూచుని, "వీటిని ప్రదర్శిద్దాం, వన్ మ్యాన్ షో" అన్నాడు రామ్మూర్తి.

"వన్‌మ్యాన్ షో రాణించదోయ్. టూ మెన్ షో ఐతే హోమోగానూ టూ విమెన్ షో ఐతే లెస్బియన్ గానూ, వన్ మ్యాన్ వన్ వుమన్ షో ఐతే ప్రోజాయిక్ పొయిట్రీగా పొయిటిక్ ప్రోజ్‌గా వుంటుంది" అని నవ్వాడు శ్రీపతి.

రామ్మూర్తికి మాక్స్‌ముల్లర్ భవన్‌లో వొక వ్యక్తి తెలుసు తన వెనకటి వుద్యోగమప్పుడు. ఆ పరిచయాన్ని పురస్కరించుకుని వెళ్ళి తను యిప్పుడు యేంచేస్తున్నదీ చెప్పి శ్రీపతి చిత్రలేఖనాలగురించి మహా యిదిగా చెప్పి రెండు చిన్నవి చూపెట్టి — అక్కడ యేర్పాటు చేయించాడు.

"వో మంత్రితో, యెవరో యెందుకు మనరవితో వోపెన్‌చేయిద్దాం. ప్రదర్శన" అని రామ్మూర్తి అంటే, "ఆయన నతీమణి ది యిజిప్షియన్ బ్లాక్ స్నేక్ గాడెస్‌తోనో, మన బస్టాప్‌దగ్గిర అడుక్కునేపేరున తిరుగుతూ కక్కుర్తినీడుల అవసరాలు తీరుస్తూండే భారత పౌరురాలితో ఐనా చేయించ వొచ్చు," అని నవ్వి, "యేంవొద్దు యింతదాకా గుంజావు చాలు. పత్రికల్లో వో ప్రకటనివ్వు. వారం రోజుల ప్రదర్శన ఆసక్తి వున్న వాళ్ళు వొస్తే వొస్తారు. నేను అక్కడే వుంటాను. కానీ ఆ బొమ్మల నేరం చేసినవాడిని నేనేనని తెలియకుండా ఆ బొమ్మల్ని చూపేవాళ్ళని చూడాలని" అన్నాడు శ్రీ:

అన్ని రకాలూ కలిసి అరవయ్యిదాకా వున్నాయి.

అతని చిత్రలేఖనాలు చిత్రంగా వున్నాయి. ప్రతి చిత్రలేఖనంలో

యే రకం చిత్రలేఖనమో చెప్పటమూ కష్టమే. వోల్డ్ మాస్టర్స్ రీతులు, యెక్స్‌ప్రెషనిజం యింప్రెషనిజం కేవ్ యెన్‌గ్రేవింగ్స్ క్యూబిజం వివిధ ఆధునిక నైరూప్య రీతు. అజంటా రాజస్థానీ జాపనీ రేఖాచిత్ర రీతులు— వీటిలో యే రీతీ కాదు. ఆ రేఖలూ వున్నాయి. అలా అని కేవలం, అన్ని రీతుల మిశ్రమమూకాదు. చూడగానే యిదేదో శ్రీపతి గందరగోళం అని పిస్తుంది. యీచిత్రలేఖనం శ్రీపతీ పైత్యలేఖనం అనిపించవొచ్చు. వాటిలో అర్థం కానితనం కంటే అర్థమయ్యేతనం యెక్కువ. అస్పష్టత లోంచి మరింత స్ఫుటంగా అనిపించే స్పష్టత.

చిత్రలేఖనం దృష్ట్యా వాటిస్థాయి నిర్ధారించటానికి చిత్రలేఖనం నిపుణులు వొచ్చినట్లులేరు. తెలియనివాళ్ళు వొస్తున్నారు. వాళ్ళెవరెవరో తెలియదు.

ప్రదర్శించిన ఆతని చిత్రలేఖనాలలో కొన్ని—

యినకలోంచి చివ్వున పైకెగిసి వొస్తున్న పెట్రోలు నూనె. నలుపూ తెలుపూ మరకలతో ఆరు అడుగుల కొలత వుంటుందనిపించే గరాటా ఆకారంలో యినపరేకు—కాడకింది వైపుకి. దానిపైన పది అడుగుల పరిధి వుంటుందనిపించే భూగోళం పచ్చని రంగులో— పరిభ్రమిస్తున్నట్లుగా. గరాటా మీద అరబ్బు షేకు ముసుగు డ్రస్సు. శీర్షికగా కింద— ది కంటెంపొరరీ సెంటర్ ఆఫ్ గ్రావిటీ ఆఫ్ ది వరల్డ్ అనిరాసి బ్రాకెట్లో మైడియర్ టోయన్‌బీ యువర్ రైట్ అని రాశాడు.

అసహాయంగా పడివున్న మనిషి. వొకడు చాకుతో మాంసం కోసి తింటున్నాడు. యింకొకడు గొట్టం గుచ్చి రక్తం పీలుస్తున్నాడు. యింకొకడు వొక చేతిలో కరెన్సీ నోటుతో రెండో చెయ్యి ఆ మనిషి పీకవైపుకి. ఆ మనిషి నుంచి ధారకట్టి ప్రవహిస్తున్న చెమట ఆ పక్కన వొక యెర్ర బంగళాల పేరుకుని వుంది. ఆ మనిషి భుజాలకి తలకీ అటు ప్రక్కగా రాబందు నిరీక్షిస్తున్నట్లుగా కూచుని వుంది. శీర్షికగా కింద—మెన్ ఆర్ సో లక్కీ. అయామ్ ఓన్లీ యె వల్చర్. హీ యీజ్ నాట్ యెట్ డెడ్ అని రాశాడు.

నది. గోదావరి అని చూడగానే అనిపించేలాగా యిటు భద్రాచలం రామాలయం. అటుకొత్తగూడెం బొగ్గు ఫ్యాక్టరీ. నదిలో— నీళ్ళమీద నడుస్తూ మగకుక్క—మగకుక్క అని తెలియటానికి అంగం రవంత బయ్య

టికి వొచ్చి వుంటుంది. నీళ్ళలో పీకదాకా మునిగి, వంకాయరంగు నెయిల్ పాలిష్ పూసిన గోళ్ళ వేళ్ళతో ఆ కుక్క తోక పట్టుకున్న స్త్రీ. నీళ్ళ పారదర్శకతలోంచి గోచీపోసి కట్టుకున్న పెద్ద సరిగంచు కంచిపట్టు చీర. వడ్డాణం, కాళ్ళకి ఐదంగుళాల యెత్తు మడమల బూట్లు. శీర్షికగా కింద "అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో" అని రాశాడు.

మధ్యలో పక్కటెముకలు కనిపిస్తున్న బక్కపలచని గోచిపాత వీరుడు— యిటు వొకతని చెయ్యి, వైట్ హౌస్ అని రాసివున్న పెద్ద బుట్టనిండా వున్న ఆయుధాల మీద. రెండో అతని చెయ్యి, అటు క్రెమ్లిన్ అని రాసివున్న పెద్ద బుట్టనిండా వున్న ఆయుధాల మీద. కొత్త పెనగా గుర్రుగా చూస్తున్న చైనా ముఖాల సమూహం. ఆ తలల మీద మూడు నాలుగు ఆయుధాల సన్నని కట్ట. శీర్షికగా కింద—"వర్ల్డ్స్ మేన్—పవర్ అని రాశాడు.

పెద్ద లారీ. లారీ నిండా కనిపిస్తున్న ధాన్యం బస్తాలు. లారీముందు పక్కటెముకలు కనిపిస్తున్న యెద్దుల జత. వాటి మెడలమీద కాడి. ఆ కాడి నుంచి లారీకి కట్టిన గొలుసు. శీర్షికగా కింద—"యిండియాస్ యిండస్ట్రియలైజేషన్" అని రాశాడు.

చవిటి పర్ర మీద కూరగాయలు. పెద్ద వంకాయ— దానినిండా కనిపిస్తూ యూరియా. సొరకాయ—దానినిండా కనిపిస్తూ నీలంరంగు ద్రవం. టొమేటో—మధ్యలో గడ్డకట్టిన గమేక్సిన్ లాంటి పొడి. యెర్రటి పీనెలు కనిపిస్తూ పెద్ద క్యాబేజీ గుండు. పొట్లమీదున్న పచ్చని పరిపైరుమీదకి నల్లని యెర్రని ద్రవం—చిమ్ముతున్న స్ప్రేయరు. దీనికి పక్కగా క్యాన్వాసుకి ఎడమ ప్రక్కన పెద్ద బొర్ర పిలకగుండు జందెంతో, బ్రాహ్మడు పైనుంచి కుడిచేత్తో వొదులుతున్న నీళ్ళు—నీళ్ళలో నల్లగా మెరుస్తున్న పవ్వాలు. శీర్షిక కింద—"మన్నం పూర్ణ" అని తెలుగులో రాశాడు.

నల్లని పరక. పరకమీద స్త్రీ ముఖం. కనుబొమలు గొరిగిన గుర్తుగా కనిపిస్తున్న పచ్చదనం మీద పెన్నుతో గీచినంత సన్నగా అటొకటి యిటొకటి ఐబ్రో పెన్సిల్ గీతలు—అర్ధచంద్రాకారంలో. పెదవిమీద సహజంగా మొలిచి యేపుగా పెరిగినట్లు కనిపిస్తున్న గుబురు మీసం—కొసలు పైకి మెలితిప్పి వున్నాయి. శీర్షికగా కింద— "ది లిబరీ వుమన్" అని రాశాడు.

కింద రాంఢోలు లాంటి స్త్రీ పడుండి వుంటుంది. మెళ్ళో మంగళ సూత్రాలు. పక్కన అరడజను పిల్లలు. వొక కాలు పిల్లల్లో యిరుక్కు పోయి రెండో కాలు ఆమె బొజ్జలోకి దిగబడిపోయీ వో పురుషుడు. వూబిలో కూరుకుపోయినట్లుగా నిలబడి, యేడవలేక నవ్వబోయి, నవ్వలేక అహం భావంగా చూస్తున్నట్లుగా వున్నాడు. శీర్షికగా కింద—"మగమహారాజు"అని రాశాడు తెలుగులో.

బాధగా కళ్ళు మూసుకుని నిలుచున్న స్త్రీ— నిలువెత్తున. వెనకా ప్రక్కలా పురుషులు వో చెయ్యి ఆమె భుజంమీద. వో చెయ్యి ఆమె వక్షం మీదకి. వో చెయ్యి ఆమె పొట్టమీదకి. ఆమె వెనకనుంచి నడుం దగ్గర చుట్టూ బిగిసిన రెండు చేతులు, చేతి వేళ్ళలో చూపుడు వేలు బొడ్డులోకి. ఆమె పాదాల దగ్గర మూడేళ్ళ పిల్లడు— బట్టల్లేకుండా, చీమిడి ముక్కుతో. యెగిరొచ్చి మగవాళ్ళ మెడలలో పడుతున్నట్లుగా పూలదండలు. యెగిరొచ్చి ఆమెకి కొట్టుకుంటున్నట్లుగా గులకరాళ్ళు. శీర్షికగా కింద— డబుల్ స్టాండర్డ్— అని రాశాడు.

అప్రాముఖ్యమైన చోట, సాధారణంగా యెవరికన్నా అటుపడే అవకాశం అంతగా లేనిచోట, కేవలం పిన్స్‌తో గుచ్చిపెట్టి వుంది వొక చిత్రలేఖనం. అడుగునుంచి యెగిసిపడుతున్న సముద్రం. పైనుంచి కిందకి దూకుతున్న హిమపాతం. పశ్చిమాన, పచ్చని పర్వతాల పచ్చిక లోయలు సానువులు. తూర్పున ప్రజ్వరిల్లుతున్న అగ్నిపర్వతం. యీశాన్యాన సూర్యోదయం. ఆగ్నేయాన చంద్రోదయం. నైరుతి నుంచి వేగంగా వీస్తున్నగాలి. వాయువ్యాన పెద్ద నక్షత్రం. అటూ యిటూ గ్రహగోళాలు, నక్షత్రాలు. యివేవీ విడివిడిగా లేవు. వాటన్నిటి స్వభావాలలో మెరుపులతో నునుపుల గరుకులతో రకరకాల రంగుల కలబోతలో వొక సమ్మిశ్రిత పారదర్శక చిత్రం. పరిశీలనగా చూస్తే ఆ చిత్రంలోనే ఆ రూపాలలోంచే కేమొఫ్లేజ్ లాగా నిగూఢంగా కాక, కొట్టొచ్చినట్లుగా అతి విస్పష్టంగానూ కాక, తాదాత్మ్యంగా వున్నట్లుగా వో మానవాకృతి. చిన్నవ్వే పెదాలు, చిరు పాదాలు. నన్నటి పొడవాటి వేళ్ళు. కానీ అవి పెదాలూ పాదాలూ వేళ్ళూ కావు. ప్రకృతిలోని భాగాలు. అలాగే స్తనాలు. స్తనాలు కావు. యిదంతా క్షణ కాలం స్ఫురించినట్లే స్ఫురించి అంతరించిపోతుంది, ఆ యిది. యెంత వెది

స్తనాలు కనిపించవు. జబ్బలు. పొట్ట. తొడలు— కాదు అవి

ప్రకృతే. జుట్టు—నల్లని మేఘంలా. కాదు మేఘమే. ఆ కనిపించిన వాటి ఛాయ యేదో కనిపించినట్లుగా వుంటుంది. అంతలోనే యేదీ కనిపించనట్లుగా అనిపిస్తుంది. చివరికి, మనసులో చెరగని ముద్రలా పడుతుంది. ప్రకృతి స్త్రీ ఐ, స్త్రీ ప్రకృతి ఐ—మళ్ళీ ఆకాశంలోనే ఆ అవయవాలేవీ కనిపించనట్లుగా దళసరి పారదర్శకపు పసుపు పచ్చ చీర వున్నట్టు భ్రమ. శీర్షికగా క్యాన్వాసుకి వొక మూలన "విశ్వ లీన" అని ఇంగ్లీషు లిపిలో రాశాడు.

మొదటి రోజున తెలిసిన వాళ్ళలో అనంత్ రెడ్డి, స్వప్నరాగలీన, వరాహశాస్త్రి, చారుమతి, మరికొందరు వొచ్చారు.

వొకచోట నిలబడి వున్న శ్రీపతిని అనంత్ రెడ్డి స్వప్నరాగలీనలు పలకరించి, చిత్రలేఖనాలు చూస్తూ వెళుతూంటే చారుమతి వరాహశాస్త్రి మరికొందరు యెదురైతే, స్వప్నరాగలీన చారుమతితో కలిసి యింకొక వైపుకి వెళ్ళింది.

శ్రీపతి కొంచెం మరుగుగా వున్నచోట నిలబడటానికి వెళ్ళి, తను అంతగా కనిపించకుండా అందర్నీ తను గమనించే వీలున్నచోట ఆ దగ్గిర్లోనే "విశ్వ లీన" చిత్రలేఖనం వుంది.

వొక్కొక్కటే చిత్రలేఖనాలు చూస్తూ, అప్పుడే అటు వొచ్చి, ఆ "విశ్వ లీన" చిత్రలేఖనం చూసి—కలవరపడింది స్వప్నరాగలీన. చారుమతి స్వప్నరాగలీన దగ్గిరకొచ్చి—"ఆ చిత్రం తీసేస్తే, మీరక్కడ నుంచుంటే, మీ పాదాల దగ్గిర చిత్రలేఖనం సామగ్రి అలా పోస్తే, మేకో తెలియని వింత రంగుల పొగ మీదకి విరజిమ్మితే చాలు. ఆ చిత్రం దేనికి?" అంది.

"నన్ను చూస్తే మీకు సంగీతభ్రమే కాక చిత్రలేఖనం భ్రమకూడానా తల్లీ!" అని చారుమతి చెయ్యి పట్టుకుని అవతలికి నడిచింది.

చారుమతి అటువైపున వొక చిత్రం చూస్తూంటే, స్వప్నరాగలీన యిటు అడుగులు వేసి శ్రీపతి దగ్గిరికి వెళ్ళి "నా కొకటి కావాలి యిస్తారూ!" అంది.

"సంతోషంగా. నేను యివ్వగలిగిందైతే. అతి తేలికగా యివ్వగలిగేది నా ప్రాణం. గుప్పెడు నిద్రమాత్రలు. వొకబొట్టు పొటాసియం సైనైడ్. చాకుముక్క. పిస్టల్ గోళీ. నాలుగ్గజాల తాడు. వీటిలో యేదైనా చిటికెలో సంపాదించగలను. చవకకూడా. వాటికంటే నా ప్రాణం మరీ చవక. మరింకే

దన్నా ఐతే—చెప్పండి, సాధ్యమైతే తప్పకండా యిస్తాను" అని చిన్నగా నవ్వాడు.

"మీ ప్రాణం చాలా విలువైంది. అవి వేరే సంగతి లెండి — వొక్కటి వల్సింది, వో చిత్రలేఖనం" అంది స్వప్నరాగలీన

"అన్నీ కావాలన్నా సంతోషంగా యిస్తాను" అన్నాడు శ్రీపతి.

"వొక్కటి చాలు. వొక్కటే కావాలి" అంది

"యిన్నిటిలో వొక్కటే అంటే—యేదో చెప్పండి" అన్నాడు.

"కర్తలు. యేదో మీరు గ్రహించగలరు లెండి" అని విషయం మార్చుతూ, "యింత యెప్పుడు నేర్చుకున్నారు?" అంది పెయింటింగ్స్ అన్నిటి పైపునా చేత్తో సూచిస్తూ కళ్ళతో ఆశ్చర్యానందాలను తెలియజేస్తూ

"నేర్చలేదు. వొచ్చింది."

అంతలో అటునుంచి చారుమతి వొచ్చింది.

"మా చారు వొచ్చింది" అని సన్నగా నవ్వింది స్వప్నరాగలీన. ఆదే నవ్వది.

"చారు అంటే కాంతి అందం మంచి అని" అన్నాడు శ్రీపతి.

"చారు అంటే అంత కాంతివంతమైన మంచి మనసున్న మనిషి— అని" అంది స్వప్నరాగలీన.

చారుమతి సిగ్గుపడిపోయింది ఆ మాటకి.

"మీవారు రాలేదా?" అన్నాడు చారుమతితో

"వొచ్చారు. అటెటో యెవరితోటో మాట్లాడుతూ చూస్తున్నారు" అంది చారుమతి.

"మా వరాహ మిహిరు డెక్కడ?" అన్నాడు

"తనూ వొచ్చాడు!" అంది.

అటునుంచి దొల్లుకుంటూ వొస్తున్న వరాహశాస్త్రి, "కనుగొంటిని నేడు శ్రీరాముని కనులార—అన్నట్లుగా—కనుగొంటిని నేడు విశ్వలీనను కనులార" అని రాగయుక్తంగా పలికి, స్వప్నరాగలీన వంక క్షణకాలం చూసి శ్రీపతితో, "అది వేసిన నీ కుంచె లెంత పుణ్యం చేసుకున్నవో! కనులార కన్న నా కన్నులెంత పుణ్యం చేసుకున్నవో!" అన్నాడు.

"నాకు తొందరగా వెళ్ళాల్సిన పని వుంది చారూ" అని, 'వస్తా' అని అన్నట్లుగా శ్రీపతి వంకా వరాహశాస్త్రి వంకా చూసి వెళ్ళిపోయింది, వడి

వడిగా. వడివడిగా నడుస్తున్నా ఆ నడకలో యెంతో హుందాతనం.

"నిశ్చలిన" చిత్రలేఖనాన్ని ఆరోజే రాత్రికి శేవేసి, స్వప్నరాగ లీనకి పంపించాడు శ్రీపతి.

ఆ మూడోనాడు స్వప్నరాగలీన పింతండ్రి హరనాధరెడ్డి వొచ్చాడు. వూరినుంచి చిత్రలేఖనాలు చూడటానికి. స్వప్నరాగలీన టెలిగ్రాం యిచ్చి పిలిపించింది.

"నమస్కారం హరనాధరెడ్డిగారూ. స్వప్న రాలేదా?" అన్నాడు శ్రీపతి, అతనిని చూస్తూనే.

"యెందుకో బిడియపడుతున్నట్లుగా అనిపించింది యిక్కడికి రావటానికి. అన్నట్లు ప్రదర్శన తరవాత వీటిని యేం చేస్తారు?"అన్నాడు హరనాధరెడ్డి.

"యేఁవీఁ చెయ్యము" అన్నాడు శ్రీపతి.

"మూలపారేస్తే ప్రదర్శన పెట్టించాను. వొప్పించి"అన్నాడు పక్కనే వున్న రామ్మూర్తి.

శ్రీపతి రామ్మూర్తిని పరిచయం చేశాడు.

"భద్రపరచండి. అక్షన్‌గానీ వేస్తేట్లయితే నే కొనగలిగితే కొంటాను అన్నీ నాకెంతో నచ్చాయి."అన్నాడు హరనాధరెడ్డి.

"మీ కాటేజ్‌లో యివి మహదానందం, యీ చిత్తు కాగితాలకేం ఖర్మతు! వాటి విలువ, మీ అభిరుచి ఆదరణా" అని రామ్మూర్తి వంక చూసి, "రామ్మూర్తీ, యింత శ్రద్ధగా ప్రదర్శన పెట్టించావు—ప్రదర్శన ఐపోగానే అంత శ్రద్ధగానూ వీటిని జాగ్రత్తగా ప్యాక్ చేయించి వీరికి పార్సెల్ పంపించు" అన్నాడు శ్రీపతి.

"అంత శ్రమ అక్కర్లేదు. మా చిట్టి తల్లి స్వప్నకి అందజేయండి. యెప్పుడో యెవరొకరు కారులో తీసుకొచ్చి అప్పగిస్తారు." అన్నాడు హరనాధరెడ్డి.

"వుంటారా వొక వారం?" అన్నాడు

"లేదు. రేపు బయాలుగా వెళ్ళాలి. స్వప్న, యికీ సంగతి అని టెలిగ్రాం యిస్తే వొచ్చాను. యీరోజు తప్పించితే మళ్ళీ రావటానికి యిప్పట్లో వీలుపడదు"అన్నాడు హరనాధరెడ్డి.

ఐదో రోజున—

అంకినీడు, నళిని వొచ్చారు. నళినికి క్రితం నెలలో తొలికాన్పు. గమ బిడ్డ.

"హలో శ్రీపతీ, యింత గొప్ప పెయింటర్‌వని తెలిస్తే నా పిక్చర్‌కి ఆర్ట్ డైరక్టరుగా వుండమనేవాణ్ని" అన్నాడు అంకినీడు.

"అప్పుడు డిస్ట్రిబ్యూటర్ కూడా నెత్తిన గుడ్డవేసుకునేవాడు!" అని నవ్వాడు శ్రీపతి.

"ఆ దర్టీ సినిమా మాట యెత్తవొద్దని యెన్నిసార్లు చెప్పాను?"అని కసిరింది నళిని.

ఆమె మెడలోని రవ్వలహారం కాంతికి చిత్రలేఖనాల కొన్నిరంగులు జిగేలుమంటున్నాయి.

"నాక్కూడా పెయింటింగ్స్ నేర్చుకోవాలనిపిస్తోంది. అజంతా శిల్పాల వంటి చక్కని బొమ్మలు వెయ్యాలని—" అంకినీడు అంటూంటే—

"స్వామీ మీ పెయింటింగ్ ఆసక్తి అపుతారూ? అన్యాయంగా చిత్ర లేఖనం కళని యెందుకు నాశనం చేస్తారు! ఆ వ్యాపారమేదో వుంది. అది చూసుకోండి, చాలు" అని శ్రీపతితో, "మీ అంకినీడుగారికి సరదాలెక్కువ" అంది నళిని.

"పూర్వ వాసనలన్నీ పోగొట్టారనుకుంటాను!"అన్నాడు శ్రీపతి.

"సొంతగా కొంత జ్ఞానోదయం అయినాకనే సాధ్యపడింది. పూర్తిగా నా ప్రతిభకాదు"అని నవ్వింది నళిని.

ఆరో రోజున—

విజయ్‌కుమార్, అతని భార్య కనకదుర్గ, వాళ్ళతో పాటు వందన, వొచ్చారు. కనక దుర్గకి తొలి నెలల్ని సమయం. విజయ్‌కుమార్ విరసంతో సహా అన్నీ వొదిలేశాడు. యిప్పుడు అతని లోకం వ్యాపారం, డబ్బు, కనకదుర్గ. ఆ దుర్గం దాటలేని మానసిక స్థితి. వో పెయింటింగ్‌లో ముఖం పెట్టి చూస్తున్నాడు.

కనకదుర్గ కొన్ని పెయింటింగ్స్ గురించి వివరాలు అడుగుతోంది. ఆమెకి లలితకళలన్నా సాహిత్యమన్నా చాలా ఆసక్తి. ముఖ్యంగా లలిత కళలు.

యేదో చెప్పాడు శ్రీపతి.

"ఆ కాంపోజిషన్‌లో నల్లని మరక యెందుకు వేశారు? పక్కన గీత

దేనికుంది?" అని అడిగింది కనకదుర్గ.

"యిదంతా షీ పెర్ స్ప్రాన్ టేనియస్ ప్లో. నాకేం తెలియదు. మీలాంటివారు వివరించాలి" అన్నాడు శ్రీపతి.

"నాకు చూసి ఆనందించటం తప్ప పెయింటింగ్ గురించి బొత్తిగా తెలవదు. పల్లెటూరిదాన్ని," అంది కనకదుర్గ.

"చాలా మందిమి పల్లెటూరి వాళ్ళమే. ఐనా పల్లెటూళ్ళు తెలియని పట్నవాసపు వాళ్ళం" అన్నాడు శ్రీపతి.

అప్పటిదాకా శ్రీపతిని కన్నార్పకుండా మౌనంగా చూస్తున్న వందన, "నా పేరు వందన. మా దుర్గ సిటీ కాన్వెంట్ నుండి నగర సన్యాసంపుచ్చుకుని పల్లెవాసాని కెళ్ళింది" అంది యింగ్లీషులో.

"మీ పేరూ తెలుసు. మీ నాట్యమూ తెలుసు" అని చిన్నగా నవ్వి, "అందుకే మా విజయుడంతవాణ్ని గారికి తేగలిగారు" అన్నాడు శ్రీపతి. కనకదుర్గతో.

"అందులో మా వందన నేత్రం పాత్ర చాలావుంది" అంది

కన్నార్పకుండా శ్రీపతిని చూస్తూనే వున్న వందన, "ఆ పెయింటింగ్ కదలనట్లుగా వున్నదిగాని దాన్లో నాకు డాన్స్ కన్పిస్తున్నది" అంది వందన.

"మెచ్చుకోలుగా చూసి, "దాని మూలశక్తి నాట్యమే. మూలశక్తి అజ్ఞానంగా వుంటుంది కదా, అందుకని కనపడదు. మీరు మహా నర్తకి కదా అందుకని గ్రహించగలిగారు!" అన్నాడు శ్రీపతి.

సంతోషంతో పొంగిపోతూ, "మీరు సాయంత్రంకాక పొద్దుటపూట వుండరా?" అంది వందన యింగ్లీషులో.

"ఐపోయింది. యిది ఆఖరి రోజు. ఆఖరి పూట" అన్నాడు.

"మిమ్మల్ని పెయింటింగ్ గురించి అడిగి తెలుసుకోవాలనుంది మీరు హోస్టల్లో వుంటారు కదా—మీకు అభ్యంతరం లేకపోతే నా ఆహ్వానాన్ని మన్నించి వొకరోజు మీకు వీలున్నప్పుడు మా యింటికి వో సాయంత్రం రాగలరా?" అంది వందన యింగ్లీషులో.

"అదెంత భాగ్యం? రికామీగా తిరుగుతుంటాను. మీకెప్పుడు వీలో చెప్పండి" అన్నాడు శ్రీపతి.

"మీరు చెప్తే యే సాయంత్రమైనా సరే. రేపు రాకూడదూ?" అని

ఇంగ్లీషులో మాట్లాడుతున్నాను."అంది ఇంగ్లీషులోనే.

"మీ తెలుగు స్వచ్ఛమైన తెలుగు"అన్నాడు శ్రీపతి.

"మరీ అంత దిల్లగి చెయ్యరాదు!"అంది వందన.

"దాన్లో దిల్లగి లేకపోతే స్వచ్ఛమే మరి!" అని చిన్నగా నవ్వాడు శ్రీపతి.

వాళ్ళతోపాటు శ్రీపతి యెదట వుండదలచక అటు వెళ్ళిన విజయ్ కుమార్ తిరిగి వొచ్చాడు. మళ్ళీ అవతలకి వెళ్ళి కనకదుర్గని పట్టుకొచ్చాడు పెయింటింగ్స్‌లోంచి. ముగ్గురూ బయల్దేరారు.

వెళ్ళబోతూ, శ్రీపతిని కంటినిండాచూసి నడుస్తూ—మళ్ళీ వొకసారి వెనక్కి తిరిగిచూసి, గెంతినట్లుగా అడుగులు వేసి వాళ్ళద్దరినీ కలుసుకుంది వందన.

# 121

శ్రీపతి పోర్టికో మెట్లమీద కనిపించేసరికి, సోఫాలో కూచుని వున్న వందన చెంగున గెంతినట్లుగా లేచి యెదురువెళ్ళి, "మీకోసం అప్పటి నుంచి యెదురుచూస్తున్నా"అంది.

"నేను లేటా? ఫోన్లో ఆరింటికి వొస్తానని చెప్పాననుకుంటాను"అని వాచ్ వంక చూసుకున్నాడు. సరిగ్గా ఆరు గంటలు.

"అప్పుడ్డా! మీరు లేట్ కాదు. నాకు అట్లనిపించి వుండాల" అని సోఫావంక చెయ్యి చూపెట్టింది కూచోమన్నట్లుగా.

నాట్యాభినయనానికి అనుకూలమైన సన్నటి పొడ టి చేతులు.

కూచుని, "మీ యిల్లుబావుంది. యీ వూళ్ళో చాలాబావున్న యిళ్ళలో వొకటి" అన్నాడు శ్రీపతి.

"యెవరో వొకయిటాలియన్ ఆర్కిటెక్ట్‌తోటి ప్లానురాయింపించిర్రు మా ఫాదర్" అంది.

"ఐతే నాట్యపు చురుకుతనం లేదు బంగళాలో. స్తబ్దుగావుంది." అన్నాడు.

"మా ఫాదర్‌కి [illegible] తెలియదుగా" అని నవ్వి, "ఆ ఆర్కిటెక్ట్‌కి

కూడా తెలిసివుండదు" అంది. చిన్నగా నవ్వాడు శ్రీపతి.

"మీరిప్పుడు లా చేస్తున్నారటకదా?" అంది.

"లేదు. లా లో అడ్మిషన్. యింకా పుస్తకాలు తెరిచి చూడలేదు. క్రితం రెండువారాలూ కాలేజీ లేదుగా — ఆదెవరితో రమీజాబీ అట. ఫైరింగ్ మరణాలు స్టూడెంట్లకేంపుమా? అవన్నీ పోలీసుల దినచర్యపనులు"

"యిప్పుడె వస్తా వన్‌మినిట్" అని లేచి లోపలికి నడిచింది.

ఆ లేవటంలోనూ నడవటంలోనూ నాట్యభంగిమ లున్నాయి. 'మామూలుగా అని అంతగా వుంటాయా కదలికల్లో' అనుకున్నాడు

టీపాయ్‌మీది ఫెమినా తీసి చూస్తున్నాడు.

మూడు నిమిషాలు.

వెండిట్రేలో అందమైన లేత ఆకుపచ్చరంగు ప్లేట్లు నాలుగైదు— వాటిల్లో యాపిల్‌ముక్కలు, ద్రాక్షపళ్ళు, వేంచిన జీడిపప్పు.

కూచుని, "తీసుకోండి" అన్నట్లుగా కళ్ళతో సూచించింది. అభినయానికి అలవాటుపడిన కళ్ళకి యేదైనా చూపుతో సూచించటం సులువు.

వొక యాపిల్‌ముక్క తీసుకుని "మీరుకూడా" అన్నాడు.

"మీకు కంపెనీ కోసం" అని తీసుకుంది.

"వీటిలో వేటికీ శరీర నాట్యాకృతి చెడదు" అని నవ్వాడు.

"చెడెటందుకు వుంటెగద"

పరిశీలనగా ఆమె వొంక చూశాడు. యెరుపు కలిసిన జరీ అంచు కోరా రంగు గద్వాల్ చీర. ఆదేబట్ట అదే అంచుతో బ్లౌజు. కొత్తగా మళ్ళీ యిప్పుడిప్పుడే వొస్తున్న పొడవు చేతులకి అనుగుణంగా — బ్లౌజు చేతుల మంచే ఆరు అంగుళాల జరీ అంచు.

మన శిల్పాల నాట్యభంగిమల ఆకృతి కాదుగానీ యీ కాలపునాజూకు ఆకారం. నడుం మరీ సన్నగా వుండటంవల్ల నడుంకి పైనా కిందా లావుగా నిండుగా వున్నట్లుగా భ్రమ కలిగిస్తోంది— అనుకుని,

"వుందో లేదో నాట్యం చేసినప్పుడైనా తెలుస్తుందిగా" అన్నాడు.

"మీకు నా నాట్యం యేమితెల్సు?"

"రెండు మూడుసార్లు చూశాను. మీ నాట్యంలో లాలిత్యం పాలు యెక్కువ" అన్నీ, తనమాట తనకే స్థలిలో పాలపాళ్ళ

తక్కువ అవొచ్చు' అనుకున్నాడు.

"అట్లా కాదు. మీ వొక్కరికి కోసం మీ యెదట నాట్యం చెయ్యా లనిపించింది." అంది యింగ్లీషులో.

"యెప్పుడనిపించింది?" అన్నాడు.

"నిన్న మిమ్మల్ని అక్కడ పెయింటింగ్ యెగ్జిబిషన్‌లో ఫస్ట్‌టైం చూడంగనె" అంది.

పని మనిషి టీ పట్టుకొస్తే బల్లమీద పెట్టకముందే తను చేతో అందుకుంది.

అందమైన ఖరీదైన టీ సెట్టు.

కప్పులో డికాక్షన్ వొంపుతోంది.

ఆమె ముఖం వొంక చూశాడు. సన్నిటి దంతం పొరతో చేసిన పువ్వులా అనిపించింది. 'దంతంతో మలచటం విశేషం. మలచటమూ బావుంది. కానీ యింకా సోయగాల్ని నింపాల్సింది—' అనుకున్నాడు.

కప్పులోకి పాలు వొంపుతోంది.

శ్రీపతి చెంచాతో చక్కెర తీసి వెయ్యబోయాడు. ఆ చెంచా కింద అరిచెయ్యి పెట్టి చేతులో వొంపమన్నట్లు చూసింది.

వొంపేసి, మళ్ళీ తీసి కప్పుల్లో వేస్తున్నాడు.

అరిచేతిలోని చక్కెరను నాలికకొనతో అద్దుకుని తింటూ "యిది మీ మహా ప్రసాదం—"అని అతని ముఖంలోకి చూసింది.

ఆ మాట, ఆ మాటకంటే ఆ చూపు— శ్రీపతికి యిబ్బందిగానూ బాగానూ అనిపించింది.

"మీ ఫాదర్ వున్నారా?" అన్నాడు.

"ఫాదర్ వూరెళ్ళిన్రు. మమ్మీ క్లబ్ కెళ్ళినది, మీరు వచ్చేదాని హా‌ఫెనవర్ ముందు"

"యే క్లబ్బు?"

"లేడీ హైదరీ"

"యేం చేస్తారక్కడ?"

"యే పనీ లేని పన్లు" అంది.

"మీరు వెళ్ళరా?"

"లే. యిక్కడ [illegible] సిజ్ రాలే"

"అందునా అసలు వయసుకంటే చిన్నగా కనిపిస్తారు డాన్సర్లు"

'మీ గురించి వై. వి. యల్. యన్. వి. ప్రసాద్ గారు చెప్తే తెల్సు" అంది.

"అతను తెలుసా?"

"విష్ణు తెలుసు. మ్యారేజ్ తరవాత ఆయన—"

టెలిఫోను మోగింది అందుకుని చెప్పింది యేదో.

"మా ఫాదర్ కోసం" అని కూర్చుని "మీరు రారేమోనని భయపడిన" అంది.

"రాకపోతే భయందేనికి?"

"భయమంటె భయమని కాదు—" అని ఆగి, "సమ్ ఫీలింగ్. యెక్స్‌ప్రెస్ చెయ్యటం రాకున్నది" అంది.

మళ్ళీ ఫోను మోగింది. అందుకుని యేదో చెప్పింది.

"మమ్మీకోసం. యిక్కడ కూర్చుని వుంటె యీ ఫోన్ న్యూసెన్స్. అట్ల పక్క గదిలో కూర్చుందం." అని లేచింది. అతనూ లేచాడు.

"మిద్దె మీద కూర్చుందం. కామ్‌గ వుంటది." అంది.

మెట్లెక్కుతున్నారు. ఆమె వెనక అతను. మెట్లెక్కుతూంటే కనిపిస్తున్న పాదాలు. కండతో చర్మంతో యేర్పడిన పాదాలిలా కాక దంతంతో మలిచిన పాదాలలాగా అనిపించింది.

"యీ పిల్ల శరీరం— జన్మంతా — కపీసం యూభయ్యేళ్ళ దాకా నాట్యానికి అనువుగా వుండిపోయినా ఆశ్చర్య పడక్కరలేదు—" అనుకున్నాడు.

వొక గదిలోకి దారితీసింది. అది ఆమె పడకగది.

"మీరు అట్ల కూర్చోండి" అని మంచం మీద కూచోబెట్టింది. అంచున కూచున్నాడు.

అవతలగా వున్న సోఫాలో కూచుంది. అతని కళ్ళలోకి ఆర్తిగా చూసింది.

'యీ పిల్లకి మగపొడ అసలుకే గిట్టదని విన్నాను!' అనుకున్నాడు.

"మీరింతకాలం పెండ్లేమిటికి చేసుకోలేదు? అంది.

"చేసుకోలే."

"యేమిటికి చేసుకోలే"

"పూకెనే" అన్నాడు.

గలగలాన వ్వి, "మా లెక్క అన్నారు" అంది. ఆమె గలగల్లా నవ్వితే, — సన్నటి రాగితీగల చుట్టమీద పసిపిల్లడు సైకిలు చువ్వతో కొట్టినట్లుగా అనిపించింది.

"మీరు మర్లా యెప్పుడు కనిపిస్తరు?" అంది.

"మళ్ళీనా? యెప్పుడో సందర్భపడినప్పుడు"

"నాకు మిమ్మల్ని మర్లా రేపే చూడాల్ననిపిస్తున్నది" అంది.

అతను మౌనంగా వుండిపోయాడు.

"ఆల్‌వేస్. ఆల్ ది టైం" అని అతని కళ్ళలో తన చూపు కలి పింది.

"నాకూ్కడ పెండ్లి చేసోక్కవాల్ననిపించినది నిన్న. నాకే సర్‌ప్రై జింగ్‌గా వున్నది," అంది.

'అహా' అన్నట్లుగా నిశ్చలంగా నవ్వాడు.

"నేనెట్లా వున్నాననిపించింది మీకు" అంది యింగ్లీషులో.

"యు లుక్ ఫైన్. యె ఫైన్ బాడీ. యె ఫైన్ సోల్— యిఫ్ దేర్ అర్ సోల్స్"

సంతోషంతో పొంగిపోతూలేచి, పేముకుర్చీ మంచం పైపుకి జరిపి దాన్లో కూచుని "శ్రీపతిగారూ" అని అతని ముఖంలోకి చూసింది.

అతను, చూపు ఆమె తలమీదుగా గోడమీద అన్నాడు.

—చూడగా యీ పిల్ల ప్రేమ మడిగుండంలో పడినట్లుంది. నాకే యిదీ శేకపోయినా— రక్షించటానికి చెయ్యి అందుకున్నా, విచక్షణలేని మడిగుండం, ఆమెతోపాటు నన్నూ లోనకి లాగిపారేస్తుంది. నేను త్త తిరుగుబోతునని చెబుతాను. వృత్త....

"మీకు నన్ను అర్పించుకోవాలనుకుంటున్నాను" అంది యింగ్లీషులో.

"నాకా అర్హత లేదు" అన్నాడు.

"మీ అర్హత సంగతి నేనుకదా చెప్పాల్సింది" అంది యింగ్లీషులో.

అతని చేతిని అందుకుని వేళ్ళమీద పెదాలు అద్దింది.

శ్రీపతి మనసులో—ఆమె నాట్యం చూసినప్పటి కొన్ని నాట్యభంగి మలు మెదిలి, అతని కళ్ళలో ఆమె రూపం పూరిస్తున్నట్లుగా కనిపిస్తోంది.

మరుక్షణంలో, "సారీ" అని చెయ్యి వొదిలేసింది.

శ్రీపతి మౌనంగా వుండిపోయాడు.

"మీరు కాదంటే ఆజన్మాంతం బ్రహ్మచారిణిగా వుండిపోతాను." అంది.

"అలా వుండిపోవటం డాన్స్‌కి మంచిదే" అన్నాడు.

"నన్ను టీజ్ చెయ్యకండి. ప్లీజ్ మై హార్ట్ యీజ్ సో హెవీ విత్ లవ్ ఫర్ యూ.—"

రెండు నిమిషాల మౌనం.

"యిఫ్ ఐ కాన్ట్ మ్యారీ యూ—" అంటోంది.

"పెళ్ళి అనేది అనూహ్యం. అలా అని వివాహ వ్యవస్థకి వ్యతిరేకిని కాదు. నాకు పెళ్ళి అన్న ఆలోచనొస్తే పొట్ట చెక్కలయ్యేటంత నవ్వొస్తుంది" అన్నాడు.

రెండు నిమిషాల నిశ్శబ్దాన్ని ఫ్యాను మోత జోరీగలా చుట్టేసింది.

"ఒకరంటే అభావం కలిగింది కాబట్టి యెప్పుడో అప్పుడు యింకొకరంటే కలగవొచ్చు. అప్పుడు భరతనాట్యం మానేసి సంసార నాట్యంప్రారంభించండి" అన్నాడు.

ఆమె కళ్ళలో నీటి పొర.

"అది అసంభవం. నువ్వెవరితోనూ నన్ను వూహించుకోలేను. కనీసం ఒక్కసారి నన్ను మీలో కలిపేసుకోండి. ఆ అనుభవంతో జీవితం అంతా ఒంటరిగా గడిపేస్తాను" అని ముందుకి వొంగి అతని వొళ్ళో ముఖం అన్చింది.

"వందనా—" అని భుజాలు పట్టుకుని పైకి లేవనెత్తి, "ప్లీజ్ కంట్రోల్ యువర్ ఫీలింగ్స్" అన్నాడు.

"నేను మీకు మంచిగ అనిపిస్తలేదా?" అంది.

"నాట్ యటాల్. యు లుక్ సో ఫైన్. కానీ నేను ఒకలాంటి తిరుగుబోతుని. ఐ కెన్ గు యిట్ విత్ సమ్ పర్సన్స్ ఐ కెన్ యూజ్ వెల్ డు యిట్ విత్ యు. కానీ ఆ తరవాత మీరు జీవితాంతం అనుకు బాధపడతారు. వందనా మైడియర్ ప్యూర్ వందనా, రిమెయిన్ ప్యూర్. చెప్పానుగా ఒకరంటే ఆ భావం కదిలింది కాబట్టి యెప్పుడో అప్పుడు యింకొకరంటే కలగొచ్చు. నా లాంటి వాడు కాక, జీవితాన్ని అర్పించుకుని పంచుకోతగిన వ్యక్తితో సార్థకమవండి" అని ఒక క్షణం ఆగి, "వందనా, యు సెడ్ లోన్

లీనెస్. నే వెడతాను" అన్నాడు.

అతని ముఖంలోకి చూడబోయే చూపు కిందకి వాల్చింది.

లేచాడు.

ఆమె లేవబోతూంటే, "మీరు యిక్కడే కూర్చోండి. నే వెడతాను" అని గది బయటికి అడుగులు వేశాడు శ్రీపతి.

ఆ మూడో రోజున అతనికి వొచ్చిన నాలుగైదు వుత్తరాలలో వొక వుత్తరం వందన రాసిన వుత్తరం.

ప్రియాతి ప్రియమైన శ్రీపతిగారూ, అంత స్వల్పమైన క్షణికమైన కోర్కె కూడా తీర్చకండా కాఠిన్యంగా వెళ్ళిపోయారు. బహుశా అందుకే నేమో మీరంటే మరింతగా యినుమడించిన ప్రేమ, ఆరాధన. యేమో యిదీ వొకందుకు మంచిదేనేమో—మిమ్మల్నే నా హృదయంలో నిలుపుకుని మీ వందనగా యీ జీవితమంతా వొంటరిగా బ్రహ్మచారిణిగా నాట్యంతో గడిపే ప్లాను—వందన. అని క్లుప్తంగా యింగ్లీషులో—తెల్లని ఆర్ట్ పేపర్ మీద స్కెచ్ పెన్‌తో రాసిన అందమైన పచ్చని అక్షరాలు.

'వందనం వందనా నువ్వెంత తియ్యని వందనవి! యింత చక్కని వుత్తరం, వుంచతగ్గదేగానీ, యే కళ్ళకళ్ళలోనో పడితే ఆ నేరం నాదవుతుంది—' అని మనసున అనుకుని—చిన్న చిన్న ముక్కలుగా చించినీళ్ళ గ్లాసులో వేశాడు. నీటిలో వుంచిన చిన్ని చిన్ని మైనం శిల్పాల్లా, నీలం గ్లాసులోని నీళ్ళలో కదులుతున్న అందమైన పచ్చని అక్షరాలు.

# 122

సాయంత్రం నాలుగూ పావు.

సుల్తాన్‌బజార్ కోఠీ దగ్గర్లో వున్న సిటీసివిల్ కోర్టులో కూర్చుని వున్నాడు, మోహన్‌రెడ్డి.

"మోహన్ సాబ్ మీరేమిట్కి సీరియస్‌గ ప్రాక్టీస్ చెయ్యరు?" అన్నాడు వొక పాటి లాయరు తీరికగా కూచుని.

"యీ న్యాయవ్యవస్థ మీద నమ్మకం లేకే."

"మరేమిట్కి ప్రాక్టీస్ చేస్తున్నరు?"

"కొందరి పేదలనైనా కొన్ని చిన్న చిన్న కష్టాల నుండి తప్పించుద
మని" అని లేచి బయటికి వొస్తున్నాడు మోహన్‌రెడ్డి.

యెదురుగా వొచ్చిన వ్యక్తి వొక చిన్న కవరు అందించాడు.

కవరుమీద యేమీ రాసిలేదు. 'యేమిటన్నట్లుగా' అతనివంక చూశాడు
మోహన్‌రెడ్డి. కవరు చూడమన్నట్టుగా చూపుతో సూచించాడు అతను.

కవరు చించాడు.

గాయత్రి దస్తూరి.

మోహన్‌రెడ్డి గుండె సంతోషంతో వుద్వేగంగా కొట్టుకుంటోంది
వేగంగా.

నేనిక్కడున్నాను —చిన్నారి ఆకుణకో— అని పదమూడు అక్ష
రాలు తప్ప మరేమీ లేదు ఆ పెద్ద కాగితంమీద.

"మీరెవరు?" అని అతనిని అడిగాడు మోహన్‌రెడ్డి.

"తరవాత తెలుసుకుంటారులెండి" అన్నాడు అతను.

"యెక్కడ వుంది?" అన్నాడు మోహన్‌రెడ్డి.

యెక్కడో, రెండు పొడి ముక్కల్లో చెప్పాడు అతను. చెప్పిన
వెంటనే చకచకా నడిచి వెళ్ళిపోయాడు.

మోహన్‌రెడ్డి నవ్వుతున్నాడు.

సుధీర్ యెదురుపడ్డాడు దగ్గిరున్న యిరానీ హోటల్లోకిదారితీశాడు.

"యెమర్జన్సీ ధమ్కీ తోటి మనవాండ్లు విరసంవి సాయుధపోరాట
తత్వం నుండి సాంస్కృతిక ధోరణికి బదలాయిస్తున్నరు" అని ప్రారంభించి
విమర్శిస్తున్నాడు సుధీర్.

మౌనంగా వింటున్నాడు మోహన్‌రెడ్డి.

పది నిమిషాలు మాట్లాడి, "యేమిటట్లుంటున్నవు బువాల్రేవు? యు
మస్ట్ వొవర్ కమ్ ఆల్ దట్. ఖతమ్ చేసి వుంటరు" అన్నాడు సుధీర్
దిగులుగా.

బయటికొచ్చారు. "మర్ల కలుస్త యింటికొచ్చి" అని సుధీర్ అటు
నడిచాడు.

మోహన్‌రెడ్డి గాయత్రి వాళ్ళింటికి వెళ్ళాడు. ఆమె తండ్రి రామ
నాథం అప్పుడే వొచ్చాడు ఆఫీసు నుంచి. అతనికి యింకో ఐదేళ్ళ సర్వీ
సుంది.

ఆమె తల్లి కాఫీ తీసుకొచ్చింది యిద్దరికీ. చాలా రోజుల తరవాత వాళ్ళింటికి వెళ్ళాడు మోహన్‌రెడ్డి పవిట కొంగుతో కళ్ళనీళ్ళొత్తుకుంటూ, లోపలికి వెళ్ళింది

రెండు నిమిషాలు మౌనంగా

"మా బాధకంటే నీ బాధ చూస్తోంటే మరీ బాధగా అనిపిస్తోంది బాబూ" అన్నాడు రామనాథం.

మౌనంగా లేచి బయటికి వొచ్చాడు మోహన్‌రెడ్డి నడుస్తున్నాడు.

బస్ డిపో. పవనర్తి బస్సు. యెక్కి కూచున్నాడు

బస్సు వెడుతోంది వేగంగా. బయటికి చుట్టూ చూస్తున్నాడు. అతని కళ్ళలో కాంతి.

దిగి నడుస్తున్నాడు. వాళ్ళవూరు. అప్పటికీ యిప్పటికీ, యిదే రాస్తం నాలుగేళ్ళు దాటిపోయింది.

చూసి అతని తల్లి సంతోషం పట్టలేక —గొంతు పెగలక — కళ్ళలో నీళ్ళు నిండి—కావిలించుకుంది కొడుకుని. అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

తమ్ముడు కరుణాకర్ రెడ్డి—గ్రాడ్యుయేషన్ పరీక్షలు. వొచ్చే యేడు సిటీలో పీ. జీ. కోర్సులో చేరదలిచాడు.

అతను వెళ్ళిన గంటన్నరకి తండ్రి వొచ్చి చూసి—సంతోషాన్ని అణిచిపెట్టి, "యెంత పేహాసొ మీ అన్న వొచ్చి?" అన్నాడు చిన్న కొడుకు వంక చూసి.

"యెప్పుడో వొచ్చింది"

"వొచ్చినట్టు కబర్ చెయ్యకపోతివి?" అన్నాడు చిన్న కొడుకుతోనే.

రాత్రి భోజనాలవేళ.

"మన వెంకట్‌రెడ్డి బిడ్డెను అట్లనే వుంచిన్రు నీకిచ్చి లగ్గంచేసెటం. దుకు" అన్నాడు తండ్రి గోడవైపు చూస్తూ.

"చాలా మంచిగుంటది. గుణవంతురాలు. మ్యాట్రిక్‌నో యేమో చదివింది." అంది తల్లి.

"పోలీసోళ్ళు అరెస్టు చేసిన్రట గదా?" అన్నాడు తండ్రి.

"అసలు అరెస్టు చేసినట్లే రికార్డ్ లేదట. మిస్టరీ లెక్కన్నది." అన్నాడు తమ్ముడు కరుణాకర్‌రెడ్డి.

మోహన్‌రెడ్డికి పెండ్లి సంబంధం గురించి యేవేవో మాట్లాడుతున్నారు.

ఐదు నిమిషాలు.

భోజనం ముగించి ఆరుబయట మంచం వేసుకుని పడుకున్నాడు మోహన్‌రెడ్డి.

పుదయం యేడుగంటలకి బయల్దేరాడు.

"యెవరింటికో వొచ్చినట్లు — యిన్నేండ్ల కొచ్చి అప్పుడె పోతున్నవా? రెండు దినాలుంటె పిల్లను చూస్కొని పక్కా అనొస్కొంటె" అంటున్నాడు తండ్రి.

"మల్ల నాలుగు దినాలకు వొస్తగా?" అని తమ్ముడు,

"రాత్రి వొస్తివి లేస్తనే పోతున్నవు" అని తల్లి కళ్ళలో నీళ్ళు నింపుకుంది.

మోహన్‌రెడ్డి లేచాడు.

"రెండు దినాలల్ల మల్లరా. అద్నె వుండకు" అన్నాడు తండ్రి.

ముగ్గురివొంకా చూశాడు మోహన్‌రెడ్డి. కళ్ళలో చెమ్మ వుబికింది.

చూపు పక్కకి తిప్పుకుని— తల, వూపినట్లుగా కదిపి — అడుగులు వేశాడు.

బస్సు.

సిటీలో నడుస్తున్నాడు.

హోటల్లో భోజనం.

బస్సెక్కి- యూనివర్సిటీ కేంపస్‌లో దిగాడు.

కెంటీన్‌కి వెళ్ళాడు.

వొక టేబిల్ దగ్గిర శ్రీపతి రామ్మూర్తి మరొకతను కూర్చుని వున్నారు.

"మోహన్ రాత్రి వొస్తే లేవు. యేవైంది- పోయావు?" అన్నాడు శ్రీపతి.

"మావూరెళ్ళిన."

"నమ్మమంటావా?" అన్నాడు శ్రీపతి.

"నమ్మకతప్పదు" అన్నాడు మోహన్‌రెడ్డి.

"వాళ్ళ వాళ్ళు పెళ్ళి సంబంధం చూసి పిలిపించి వుంటారు"

అన్నాడు రామ్మూర్తి.

"ఐతే వెళ్ళి వుండడు" అన్నాడు శ్రీపతి.

"నువ్వు రావటానికి ముందు, మొన్న నవంబరులో దివితాలూకాలో తుఫాన్ విశేషాలు చెప్తున్నాడు శ్రీపతి. అక్కడి పరిస్థితులూ, ఆ శవాలని మనుషులెట్లా పీక్కుతింటున్నదీ వగైరా" అన్నాడు రామ్మూర్తి.

శ్రీపతి, చూసి రావటానికి ప్రత్యేకం వెళ్ళొచ్చాడు.

"తుఫానులొచ్చినప్పుడు రెవెన్యూ డిపార్టుమెంట్ వాళ్ళ రొట్టె విరిగి నేతిలో పడ్తది" అన్నాడు మోహన్‌రెడ్డి.

"హిమాలయాల్లో సి. ఐ. యె. వాళ్ళు పెట్టివుంచిన అణుపరికరం అంతరార్థం యింకా అంతుపట్టలేదు మన జనతా ప్రభుత్వానికి" అన్నాడు రామ్మూర్తి.

పక్క టేబిలు దగ్గిర దర్బా వీరభద్రరావు మరో యిద్దరు కూర్చుని వున్నారు. మిగతా వాళ్ళు యేదో మాట్లాడుతుంటే వీరభద్రరావు, "గుడివాడ యెల్లాను గుంటూరు పొయ్యాను" అని పాటపాడుతూ బల్లమీద దరువు వేస్తూ వాళ్ళు మాట్లాడుతున్నది వింటున్నాడు. వాళ్ళు మాట్లాడుతూ యితని పాటా వింటున్నారు.

"శివ దీక్ష పరురాలనురా నే శిలమెంతైనా విడువజాలనురా" అని గొంతులో శ్రుతించుకుంటూ వొస్తూ, మోహన్‌రెడ్డిని చూసి. "నేడెంత సుదినం. న్యాయస్థానమే యిక్కడికి తరలివొచ్చింది." అన్నాడు వరాహ శాస్త్రి.

"మన మోహనుడు న్యాయం కోసం పోరాడతాడు. డబ్బు కోసం కాదు" అన్నాడు రామ్మూర్తి.

"న్యాయం కావాల్నంటే డబ్బుకావాలి న్యాయం చాలా ఖరీదై డబ్బుంటే న్యాయం అక్కర్లేదు" అన్నాడు మోహన్‌రెడ్డి.

"అతి ఖరీదైంది న్యాయం. చాలా పెట్టుబడి పెట్టాలి. అతి చవకైంది కార్ల్‌మార్క్సు కేపిటల్. ఆయన కేపిటల్‌కి పెట్టుబడి అతిస్వల్పం. మూడు వేల మేలిరకం ముద్రణ పేజీలు మూడైదులు పదిహేను రూపాయలు. భారతం తరువాత భారకం అంతటి పెద్దకావ్యం." అన్నాడు శ్రీపతి.

"మనలో మాట. మార్క్సు కేపిటల్ నేను చదవలేదు గానీ అది కవిత్వమా?" అన్నాడు రామ్మూర్తి.

"వొకానొక కొత్త పొలిటికల్ యికానమీని అంచక్కా రాసినప్పుడు కవిత్వంలాగే అనిపిస్తుంది. యూరోపియన్ పెట్టుబడిదారులు ఆ కవిత్వాన్ని ఆస్వాదించి, ఆ చిరు మేనిఫెస్టోని అరగించి, కార్మికులు పోయేది శృంఖలాలేగా అని తెంచేసుకుంటారేమోనని బంగారం గొలుసులు వేశారు." అన్నాడు శ్రీపతి.

అవతలి బల్లదగ్గిర వీరభద్రరావు "చిలక కొట్టుడు కొడితే" అని పాట లంకించుకున్నాడు, చేత్తో బల్లమీద కొడుతూ.

"మన జనతావాళ్ళు యిందిరమ్మకి గొలుసులు తగిలించబోతే తెలివిగా తప్పించుకుంది" అన్నాడు రామ్మూర్తి

"అంత తెలివి హీనంగా అరెస్టు చెయ్యటం దేనికి? ఆ సీనియర్ అధికారులకి ఆ మాత్రం రూల్స్ తెలియదా? యిదేదో గృహమంత్రి చరణ్ చౌధురి అంతర్నాటకం యేదో ఐవుంటుంది" అన్నాడు శ్రీపతి.

అవతలి బల్లదగ్గిర సినిమాప్రోగ్రాం గురించి చర్చిస్తున్నారు.

"జయమాలినుంటే వొస్తా" అన్నాడు వీరభద్రరావు.

"తెలుగు సినిమా అంటున్నాంగా! జయమాలిని లేకుండా తెలుగు సినిమా యెట్లా వుంటుందోయ్ వెర్రిభద్రం"

"ఆమె రాత్రులకి వెళ్దాం" అన్నాడు వీరభద్రరావు. ఆ వాల్‌పోస్టర్లు కళ్ళలో మెదులుతూంటే.

"'ఆమె రాత్రులు' పేరు 'హెర్‌నైట్స్' అని మళయాళం సినిమా"

"దాన్లో జయమాలిని లేదా?" అన్నాడు వీరభద్రరావు.

"జయమాలిని దేనికి దాన్లో యమమాలిని వుంది తెల్లార్లూ"

"దెన్ వోకే" అన్నాడు వీరభద్రరావు వుత్సాహంగా.

ఆ వుత్సాహంలో "వో అమ్మీ తిక్కరేగిందా — తిమ్మిరెక్కిందా" అని పాట అందుకుని, తొడమీద చేత్తో వాయించు కొంటున్నాడు.

"యీ ధర్మారావుగాడి యమగోల భరిస్తూ కూచోటం కంటె చెట్టు నీడన అఖరికి యెండలో ఐనాసరే నుంచోటం హాయి" అన్నాడు శ్రీపతి.

"పెడలెను కోదండపాణి" అంటూ లేచాడు వరాహశాస్త్రి.

బయటికొచ్చారు. రామ్మూర్తి క్లాసుందని లోనకి వెళ్ళాడు.

వరాహశాస్త్రి లాబ్‌లోపనుందని సైన్సు బిల్డింగువైపు నడిచాడు.

"రాగసుధా రసపానము జేసి రంజిలవే వో మనసా" అనుకుంటూ

"మోహన్" అన్నాడు శ్రీపతి.

"చెప్పు శ్రీపతీ" అన్నాడు మోహన్‌రెడ్డి.

"చాలా కాలానికి నీ కళ్ళలో వెనకటి మెరుపు చూస్తున్నాను" అన్నాడు శ్రీపతి.

"అట్లనా?"

"అవును" అని, "కోర్టుకి వెళ్ళలేదా?" అన్నాడు.

"శే."

హోస్టలు గదికి చేరుకున్నారు.

"యీ రాత్రికి యిక్కడే వుండిపోండూ? తెల్లారిలేచి కోర్టుకి వెడుదువు" అన్నాడు.

"యిక కోర్టుకి వెళ్ళను" అన్నాడు మంచంమీద పడుకుంటూ,

"శుభం నీ వొంటికి కోర్టు సరిపడదోయ్"

"మనసుకి కూడా" అన్నాడు మోహన్‌రెడ్డి.

"నాకు రాత్రి కలలో గయత్రి కనిపించింది" అన్నాడు శ్రీపతి.

"వూఁ"

"ఆ కలలో నువ్వులేవు"

"వుఁ"

"యీ మధ్య మన రామ్మూర్తికి రవికీ పరిచయం పెరిగింది. రవి ద్వారా ప్రయత్నిస్తే యేఁవన్నా ఆమెకి దొరుకుతుందేమో —"

"వొద్దు."

"మోహన్, దీనంతటికీ వెనక యెవరిదో ప్రయివేటు వ్యక్తో వ్యక్తి అదో ప్రమేయం వుండాలి...." అని ప్రారంభించాడు.

మోహన్‌రెడ్డి నిద్రపోయాడు.

లేచేసరికి సాయంత్రం ఐదున్నర.

శ్రీపతి, విలియం వైట్ పుస్తకం "ది ఆర్గనైజేషన్ మ్యాన్" చదువుతూ వున్నాడు. మోహన్‌రెడ్డి లేవటం గమనించి, "స్నానించి రా" అన్నాడు.

మోహన్‌రెడ్డి బాత్రూంలోకి వెళ్ళివొచ్చాడు.

"వెళ్ళి టీ తాగుదామా?" అన్నాడు శ్రీపతి.

"యీ రాత్రికి వుండిపోవూ?" అన్నాడు శ్రీపతి.

"వుఁహూఁ"

"రేపు నేను రానా?"

"వుఁహుఁ"

"మళ్ళీ యెప్పుడొస్తావు?"

"వొచ్చినప్పుడు" అని మోహన్‌రెడ్డి శ్రీపతి దగ్గిరికి వెళ్ళి అతని చెయ్యి అందుకున్నాడు. శ్రీపతి లేచి నిలుచున్నాడు.

మోహన్‌రెడ్డి, శ్రీపతి చుట్టూ చేతులువేసి గట్టిగా కావిలించుకున్నాడు మోహన్‌రెడ్డి కళ్ళలో చెమ్మ.

నాలుగు క్షణాలు.

విడిపడి, "బస్సుదాకా రా" అన్నాడు మోహన్‌రెడ్డి.

శ్రీపతి, గోడకి వున్న మేకుకి తగిలించి వున్న తాళం తియ్యటానికి అడుగులు వేశాడు.

మోహన్‌రెడ్డి, తన జేబులోంచి తాళం చెవుల గుత్తి తీసి శ్రీపతి టేబిలు మీద పెట్టి, శ్రీపతి వైపుకి అడుగులు వేసి, అతని భుజంమీద చెయ్యి వేసి గుమ్మంలోకి నడిచాడు.

గదికి తాళం వేశాడు శ్రీపతి.

బస్టాపు. బస్సు ఖాళీగా వుంది. కదలబోతోంది.

మోహన్‌రెడ్డి పుట్‌బోర్డు మీద కాలువేసి, పక్కకి తిరిగి శ్రీపతి వంక చూస్తూ చెయ్యి వూపాడు. మెరుస్తున్న కళ్ళతో.

కోఠీలో బస్సు దిగాడు. రిక్షా యెక్కి రైలుస్టేషను దగ్గిర దిగాడు.

అరగంట స్టేషన్లో కూచున్నాడు రైలు కదులుతోంది. యెక్కిఉంచు న్నాడు.

రాత్రంతా కూచుని మేలుకుని చూస్తున్నాడు — యెక్కడో.

తెల్లవారుజాము నాలుగున్నర.

రైలు వొ చిన్న స్టేషన్‌లో ఆగింది

దిగాడు.

నడుస్తున్నాడు.

కంకరరోడ్డు, నడుస్తున్నాడు

పల్లెటూళ్ళు.

మట్టిరోడ్డు. నడుస్తున్నాడు.
బీడు భూమి. నడుస్తున్నాడు, కాలిబాటన.
నడుస్తున్నాడు, దారిలేని దారిలో.
యీ చీకటిలోంచి మహా మోహ మోహాన మౌన నిష్క్రమణ.

# 123

మగతగా పట్టిన నిద్రలోంచి లేచి, అటూ యిటూ చాప మీద నీరసంగా కదిలింది రమణి.

చిరిగిన పాత చాప. తల కింద దిండులాగా పాత గోనెసంచి చుట్ట. నాలుగైదు మట్టిపాత్రలు తెడ్డులాగా వాడుతున్న వొక కర్ర పుల్ల. మూడు చిన్న రాళ్ళతో అమర్చిన పొయ్యి. పొయ్యిలో బూడిద. పక్కన పుల్లల కంప, చితుకులు

బయటి నుంచి యేడుపు వినిపించి లేచి బయటికొచ్చి చూసి, "యేం రాజవ్వా? యేమాయె పిల్లగానికి?" అంది రమణి.

పిల్లడి కుడిచెయ్యీ భుజమూ చీరుకుపోయి నెత్తురొస్తోంది. యెడమ కాలూ చెయ్యీ చర్మం కందిపోయి నెత్తురు చమర్చుతోంది. వొంటిమీద దుమ్ము. యెడమభాగం మరింత దుమ్ముతో నిండింది. ఆరేళ్ళపిల్లడు.

"గిప్పుడె అర్ధగంటాయె. గింత బువ్వ పెట్టిన. అడుక్కొనెటందుకు పోయిండు. నేను గిర్నికి పోదమని బీగమేస్తున్న, గంతల మల్లితోల్కొచ్చె ఆ రిక్షోడు—వానింట్ల పీనుగెల్ల. నిల్వానన్న నిల్వాక—పొయ్యిండట" అని శోకాలు పెడుతోంది రాజవ్వ.

"ఆ పోరి యెవరు?" అంది రమణి మల్లిని చూసి.

మల్లికి పదహారేళ్ళుంటాయి. నల్లగా కళగా పొట్టిగా గుండ్రంగా పొంకంగా వుంది—దుండు ముక్కలా.

"గిర్నికి టేం ఐపోతున్నది. నేపోత. దవకానకు తీస్కపోరాజక్కా" అని మల్లి వెళ్ళిపోయింది.

"మన బస్తిలనె వుంటది. నాతోటి గిర్నిల పనిజేస్తది. పనిగూడ చెయ్యదు, పోరి బుద్ధి మంచిది కాదు. పోరగాళ్ళతోటి తిర్గుతది. వాండ్లె సిన్మలకు తీస్కపోతరు. యిస్నోలు పౌడర్లు గవీ కొనిస్తరు" అంది.

"బాగా దెబ్బలు తగిలినయ్. దవఖానాకు తీసుకుపో వెంటనే." అని, "నీ మగడు లేడా?" అంది రమణి.

"యింట్ల యెన్నడున్న కానొస్తడా! నాల్గు ముంతలు కలుతాగి రాత్తిరి కొస్తడు. పెత్తె గింప తింటడు. పైసలుంటె యివ్వు— అని సతాయిస్తడు" అంది రాజవ్వ

"యింకేం చెయ్యడా విన్ను?" అంది రమణి.

"పాపం వాన్కి యేమక్కరలే కల్లుంటె చాలు. వుంటె బుక్కెడు తిన్నడు అన్నమో గట్కనో. యిప్పుడేమి చెయ్యాలె—పొక్కిల పైసగూడ లేదు నా తాన. మోటర్ల తోల్క పోదమన్న గూడ—"అంది రాజవ్వ.

రాజవ్వ తెల్లవారుజామునే లేచి రెండిళ్ళలో పనిచేసి, వొచ్చి కాస్తంత వుడకేసుకుని పిల్లకికి పెట్టి తను తిని, పిండిమిల్లులో పనిచెయ్యటానికి వెడుతుంది.

రమణి లోనకి వెళ్ళి చాప అంచు పైకెత్తింది. నాలుగు రూపాయల నోట్లు కొంత చిల్లరా. గుప్పెటతో ఆ నోట్లూ చిల్లరా పట్టుకుని బయటికి వొచ్చి రాజవ్వ కిచ్చి, "రిక్షాలో తీస్కపో రాజవ్వా" అంది రమణి.

రాజవ్వ, పిల్లణ్ని భుజాన వేసుకుని వెళ్ళిపోయింది.

రమణి లోనకి వొచ్చి చాపమీద పడుకుంది.

ఆకలిగా వుంది. పొయ్యి కిందికి వుంది గాని పొయ్యి మీదకి యేమీ లేదు.

ఆ డబ్బుల్తో రెండు కిలోలు బియ్యం తెచ్చుకోవాలనుకుంది.

రమణి రెండు నెలల క్రితం యీ సిటీకి కొట్టుకొచ్చి పడింది. చిన్న గదిలో వుంది. అనారోగ్యం. చేతులోవున్న డబ్బులైపోయాయి. మళ్ళీ డబ్బులు రావటం లేదు చేతులోకి.

శరీరం శిధిలమైపోయింది. ఆశక్తమైపోయి శరీరం లోలోన దాహంతో తపించిపోతూ వేడెక్కి — జ్వరం వొచ్చినట్లుగా అవుతుంది. కళ్ళు మూసుకుంటుంది. గాఢగా కళ్ళలో నీళ్ళు చేతులు వక్షం చుట్టూ వేసుకుంటుంది ఆ చేతుల మధ్య పురుషులు నలిగిపోతున్నట్లూ నలిగిపోతున్న ఆ పురుషులు తనలోకి చొచ్చుకుపోతున్నట్లూ భ్రమ. భ్రమలోంచి మగత. మగతలోంచి నిద్ర నిద్ర లేచి—

పైన విలుచోలేక కాసేపు నేలమీద కూలబడింది. అవొక్క- డాక్టరుకి యింత చాంతాడు పొడవు రోగులు. యెంత పేపెనా అంతే వుండే చాంతాడు, యెప్పుడో టైం అవగానే తుంచితే తెగే చాంతాడు.

డాక్టరు— వొక్కో పేషంటుని వొకటి రెండు క్షణాలకంటే యెక్కువ సేపు చూసే వ్యవధి వుండదు. విసుగు, చీదర.

క్యూ రమణిదాకా జరిగింది.

రమణి స్టూలుమీద కూచుంది. వొకసారి రమణి వొంటి వొంకచూసి నోరు తెరవమంది. అరక్షణం— వొక్క- దృక్కు— చూపు మరల్చి పొట్ట భాగంకేసి చూస్తూ కాళ్ళు చూపెట్టమంది. చీర పైకి జరిపింది రమణి. పిక్కలు, మోకాళ్ళు, తొడలు.

"ఛీ రొచ్చుముండా, అవతలికి పో" అని కసిరింది డాక్టరు.

"షటప్ అట్ యాజ్ వన్ ఆఫ్ యువర్ బిజినెస్. యు ఆర్ యె పెయిడ్ సర్వెంట్— యె సర్వెంట్, యు ఆర్. వేర్ యోజ్ ఐ యామ్ వాట్ యె సర్వెంట్. ఐయామ్ ది మిస్ట్రెస్ ఆఫ్ మైసెల్ఫ్, మిస్ట్రెస్ ఆఫ్ మై ఫెట్" అంది రమణి.

విస్మయంగా గుడ్లప్పగించి చూసింది డాక్టరు. వెంటనే రమణి స్థితి గ్రహించింది. "సారీ ఆస్పత్రిలో మామ్మూలుగా ఇచ్చేమయ్యే మందు లతో నయం కాదు. అసలు నయం కాకనూ పోవొచ్చు— చీఫ్‌ని యింటి దగ్గర కలుసుకోమ్మా" అంది డాక్టరు, జాలిగానూ కసిగానూ అసహ్యం గానూ.

రమణి తిన్నగా గూటికి తిరిగి వొచ్చేసింది! అంతే. డబ్బులు లేవు డబ్బులుండవు. మందులు లేవు. మందులున్నా ఆ వ్యాధి నయమవదు.

వొకరోజు రాత్రి వో పాడుపడిన సత్రవకి వెళ్ళింది. వో బిచ్చగాడా సరసన చేరింది. రూపాయి యిచ్చాడు. మరసటి రోజు వెళ్ళింది ఆ బిచ్చ గాడు మగతగా పడవున్నాడు రోగంతో. మరో బిచ్చగాడి సరసనచేరింది తన దగ్గిరేం లేదు, రెండు రోజులైంది తిండి తిని అన్నాడు అతను. తన దగ్గిరున్న రూపాయి అతనికిచ్చింది వీధిలో నడుస్తోంది చిమ్మ చీకటిలో గుడ్డి దీపాల వెలుతురు. వో చెట్టు కింద వో బిచ్చగాడు సరసనచేరింది. ఆ బిచ్చగాడు మంచి పటుత్వంలో వున్నాడు. రెండు రూపాయల నోట్లు యిచ్చాడు.

నొప్పి, బాధ రాపిడి, మంట, రసి—

అతనిని కవ్వించి రెచ్చగొట్టి, మళ్ళీ మళ్ళీ వొకటీ రెండూ మూడూ నాలుగు—సార్లు.

తెల్లవారు జాము లేవలేకపోయింది. వొళ్ళుకూడా వచ్చివుండులా అనిపిస్తోంది.

అతను నిద్రపోతున్నాడు.

రాత్రంతా గుర్తొచ్చింది. వుండబట్టలేక అతని సరసనచేరి కావిలించు కుని కాళ్ళు బిగించింది. బిచ్చగాడు స్పృహలేకండా పడివున్నాడు.

పదిహేను రోజులైంది గుడిశలోంచి కదిలి. వొళ్ళు చాపకి అంటు కునిపోయింది. కానీ లోలోన ఆరాటం.

వొంటిగంటకు రాజవ్వ, పిల్లడికి బ్యాండేజీలువేయించి తీసుకొచ్చింది పిల్లణ్ని రమణి గుడిశలోకి తీసుకొచ్చి చాపమీద పడుకోబెట్టి, "మలాము రాసి కట్లు కట్టిన్రు. వాండ్లే గోళీలిచ్చిన్రు. యిదిరాసిచ్చిన్రు వాళ్ళ తావ లేదని. కొంటి, రెండు రూపాయలాయె. దేవతోలె సాయపడ్తివి. చచ్చి నీ కడ్పున పుడ్త. నా పిలగాని పానం కాపాడ్తివి జరంత చూస్తుంటవా? గిర్నికి పోత సగం దినం పైసలొస్తవి" అంది రాజవ్వ.

"అట్లానే. పోయిరా రాజవ్వా" అంది రమణి.

రాజవ్వ వెళ్ళింది.

పిల్లడు నిద్రపోయాడు. నిద్రలో దగ్గిరికి జరిగాడు. తన వొళ్ళు పిల్లడికి అంటకండా దూరంగా జరిగింది.

అరగంటకి లేచాడు. మంచినీళ్ళు అడిగాడు.

కుండలోంచి చిన్న ముంతతో నీళ్ళు ముంచి తీసింది. యివ్వబోతూ ఆగిపోయింది.

యింట్లో మరో ముంత లేదు తను తాగే ముంతతో తాగిస్తే వసివాడికి అని భయపడి, బయటికివెళ్ళి రాజవ్వ గుడిశలోకివెళ్ళబోతే తడిక గోళ్ళెంకి తాళం నొక్కివుంది.

అటు నాలుగడుగులునడిచి, వో చెట్టుఆకు—పెద్దది తుంపుకొచ్చింది దాంతో నీళ్ళు తాగించింది పిల్లడికి.

పిల్లడు బాధగా మూలుగుతున్నాడు.

మందులు తీసి చూసింది. పెయిన్ రిలీవింగ్

తుంపు వొకటుంది. కొస చించి మాత్ర తీసి ఆకులో నీళ్ళు తెచ్చి మాత్ర నోట్లోవేసి నీళ్ళు తాగించింది.

కబుర్లు చెబుతూ కూచుంది.

అరగంటకి పిల్లడు కబుర్లు చెబుతున్నాడు. నొప్పి తగ్గింది. వొరెండు మూడు గంటలు నొప్పి వుండదు. రిక్షా తనకి కొట్టుకోవటం సంగతీ, తన తోటి పిల్లల సంగతులు చెబుతున్నాడు.

నాలుగింటికే రాజవ్వ వొచ్చింది.

"పిలగాని కెట్లున్నదో అని గిర్నాయనకు చెప్పి జల్దీ వొచ్చేస్తి." అంది రాజవ్వ.

పిల్లడు చక్కగా కబుర్లు చెబుతూండటం చూసి స్థిమితపడి రమణిని "పుణ్యాత్మురాలివమ్మా" అని మెచ్చుకుని పిల్లణ్ణి తీసుకుని తన గదిలోకి వెళ్ళింది.

రమణి లేచి నీళ్ళతో ముఖం కడుక్కుంది. అంత సులభంగా చిరిగే అవకాశం లేని పాత నైలాన్ చీర. రంగు వెలిసి మాసినట్లుగా వుంది. విప్పి దులుపుతోంది. మురికి వోడుతున్న లోపావడా. చీర దులిపి, వొకటి రెండు చోట్ల దుమ్ము మరకలు కనిపించి వేళ్ళతో తుడిచింది పూర్తిగా పోక పోతే వుమ్మి తడిచేసి తుడిచింది. దుమ్ము మరక కనిపించటంలేదు. తడి మరక కనిపిస్తోంది.

దువ్వెన ముక్కతో తలదువ్వుకుంది. పౌడరు — అడుగుకొచ్చి చిల్లులోంచి పడక పోతే కొన్ని రోజుల క్రితం డబ్బా మధ్యలో పగలగొట్టి వేళ్ళ కొసతో తీసి రాసుకుంది. వుత్తరేకు మిగలగా వొంటిమూలకి విసిరింది.

దృష్టి పొయ్యిమీద పడి— పొయ్యి ముందుకూచుని పొయ్యిలోంచి మేలిరకం బూడిద వేళ్ళతో తీసి యెడమఅరిచేతులో వేసుకుని వొచ్చి అద్దం పెంకులో చూసుకుంటూ ముఖానికి రాసుకుంది.

చెప్పులు— యెప్పుడో యెక్కడో అనుకోకుండా అవి తనపాదాలకి వొచ్చాయి. పల్లెటూళ్ళో కుట్టిన ఆకు చెప్పులు. నైలాన్ బట్టలాగే ఆ తోలు వొక పట్టాన చిరగదు. మాసిపోయి వున్నాయి. పాత బట్టపీలికతో దులిపి తొడుక్కుంది. తడిక దగ్గిరికి లాగి—వీధిలో నడుస్తోంది.

ఐదు గంటలు.

నడుస్తోంది.

షామ్ థియేటర్. ఏ. జీ. ఆఫీసు — సెక్రటేరియట్ ముందు నిలుచుంది.

ఐదున్నర. ఆఫీసుల జనం. రద్దీ. తొందర.

వో బస్సులోకి చొరబడింది. ఆమె దగ్గిర పదిపైసల బిళ్ళకూడా లేదు.

నుంచుంది. ముందు, వెనక, ప్రక్కల జనం. సీట్లలో కూచున్న జనం స్థిమితంగా బయటికి చూస్తున్నారు.

బస్సు కదిలింది.

రెండు నిమిషాల. కండక్టరొచ్చాడు — టిక్కెట్లు యిస్తూ.

"దేర్, మై హబ్బీ విల్ టేక్" అంది.

"సీట్లో కూచుని ఆ రోజు దినపత్రిక చూస్తున్న వాడతను — కిస్సా కుర్సీకా కేసు, సంజయ్‌గాంధీని అరెస్టుచేసి తిహార్ జెయిల్లో పెట్టటం—వార్త. పైకిచదువుతున్నాడు. నలుగురూ అదేచర్చిస్తున్నారు తలోరకంగా. బస్సంతా అలజడితో నిండిపోయింది.

కండక్టరు టిక్కెట్లు యిస్తూ జనాన్ని చీల్చుకుంటూ ముందుకి సాగిపోతున్నాడు.

రమణి ముందు వో నలభయ్యేళ్ళతను ప్యాంటు. దాన్లోకి దూర్చిన షర్టు.

బస్సు కుదుపుకి రమణి అతని వీపుకితగిలింది. తల రవంత పక్కకి తిప్పితే చీరకొంగ కనిపించి పరవశించిపోయాడు. యింక తల పక్కకి తిప్ప కుండానే వెనక్కి చూస్తున్నాడు ఒక్రలోంచి.

గమనించింది.

హిప్ పోకెట్ లోంచి పది రూపాయల నోట్లకొత్తి అంచు బయటకి కనిపిస్తోంది.

రమణికి — సాధికారంగా తప్ప దొంగతనంగా తీసుకోవటం అలవాటు లేదు యింతవరకు.

బస్సు కదలికలో అప్పట్లుగా అతని మీద వాలి, మళ్ళీ వెనక్కి సర్దుకుంది.

అతని కళ్ళు ఆతని మాటలోకి వీపులోకి చొరబడాలని యత్నిస్తున్నాయి.

మళ్ళీ అతని మీదకి వొరిగింది.

చూడు పిన్నమ్మ పాడు పిల్లడు పైనపైన పడత నంటడు, పడత వుంటడు—అని అనుకుంటూ, మళ్ళీ అతని మీదకి వొరిగి కొన వేళ్ళతో నోట్ల అంచు పట్టుకుని కొద్దిగా లాగింది.

మళ్ళీ వెనక్కి జరిగింది.

'చూడు పిన్నమ్మా, చూడుపిన్నమ్మా, పాడుపిల్లడు—' అనుకుంటూ అతని వీపుకి తన వక్షం ఆనేలా జరిగింది, బస్సు కదలికలో. అతని పిర్రకీ ఆమె వొడికి మధ్య పవిట పొరల పక్కనుంచి ఆమె చేతివేళ్ళు.

చూడుపిన్నమ్మ పాడుపిల్లడు—తడిక చాటు చేసుకొని తలకిస్నానం, పవిటచాటు చేసుకోని తలకిస్నానం తడికచాటు చేసుకోని నా తలకి స్నానం చేస్తవుంటే, నీ జేబు స్నానం చేస్తవుంటే—చూడు పిన్నమ్మా పాడుపిల్లడు అనుకుంటూ నోట్లబొత్తి అరిచేతిలోకి తీసుకుంది. పవిట పొరల అడుగు నుంచి ఆ బొత్తి బ్లౌజు కింది అంచులోంచి, నలిగి సాగిపోయిన స్తనాల మీదకి తోసింది వేళ్ళతో.

యీసారి పక్షమూ పొట్టా అతనికి ఆనుకునేలా జరిగింది.

చూడు పిన్నమ్మ పాడుపిల్లడు పైనపైన పడతనంటడు పాడుపిల్లడు పైనపైన పడతనంటడు కండక్టరబ్బాయీ వొక బెల్లు కొట్టు నాయనా—అని అనుకుంటూ—

బస్సు ఆగింది వో స్టాపులో.

వెనక్కి తిరిగి జనాన్ని చీల్చుకుంటూ క్షణంలో దిగేసింది.

బస్సు కదిలింది.

పక్క సందులోకి చకచకా నడిచింది. పవిట పొరల కిందికి చెయ్యి దూర్చి వేళ్ళు బ్లౌజులోకి దూర్చి నోట్ల బొత్తి తీసింది.

లెక్కపెట్టింది. అన్నీ పదినోట్లే. పదకొండు. ఆ బొత్తి మధ్యలో తెల్ల కాగితంమడత. విప్పింది.

కందిపప్పు అరకేజీ, చింతపండు పావుకేజీ, వాము పదిగ్రాములు ధనియాలు పావుకేజీ,పంచదార రెండు కేజీలు, కాఫీ, టూత్‌పేస్ట్, పెన్సిళ్ళు, యెక్సర్‌సైజు బుక్కులు — వంద పేజీల మూడు, రెండొందల పేజీలు రెండు, కాశ్మీర్ బూకేపౌడర్ టిన్ను బొట్టు కుంకం ........

పాపం బక్కగుమాస్తా. పైనేమీ గిట్టుబాటు కాని సీటు కాబోలు.

పాపం — పాపమే — యెవరి పాపానికి వాళ్ళే కర్తలు— అనుకుంటూ నడిచింది.

నోటు బుక్కులు తప్పించి ఆ లిస్టులో పరుకులతోపాటు ఐదుకిలోలు బియ్యం కొనుక్కుని రిక్షాలో యింటికి చేరింది రమణి.

నొండుకుతింది. కట్టెపుల్లలు తెప్పించుకుంది.

యింకా కొద్దిగా డబ్బులున్నాయి.

రాజవ్వ వొచ్చింది. కబుర్లు.

రాత్రి.

పొద్దుపోయాక రాజవ్వ మొగుడు వొచ్చాడు, బాగాతాగి. పెళ్ళాంతో కొట్లాడాడు.

మెక్కి పడుకుని వుంటాడు. రాజవ్వని హింసించుకు తింటున్నాడు. పనీపాటా లేకండా తిరుగుతూ. తాగి వొస్తాడు తాగటానికి డబ్బులు రాజవ్వే యివ్వాలి పాపం—అనుకుంది రమణి.

యెప్పుడో నిద్రపట్టింది.

వుదయం బాగా పొద్దెక్కాక లేచింది.

రాత్రి కడుపునిండా తిన్నా సత్తువగా లేదు. లేకలేక అలాగే పడు కుంది. లోన మాత్రం ఆరాటంగానే వుంది.

పన్నెండింటికి లేచి అన్నం వుడకేసుకుని వుప్పూ నీళ్ళూ కలుపుకుని తింది.

పడుకుంది. మగత.

వొళ్ళు—లోనా పచ్చి పుండులా కుమపులా నొప్పి మంట రసి— లోలోన ఆరాటం.

యింకోరోజు, యింకోరోజు —మరింత క్షీణత.

లేచి అన్నం కూడా వుడకేసుకునే వోపికగా అనిపించక—అలాగే పడుకుంది మగత.

లేచింది. టీ తాగాలనిపించింది. టీ పొడి లేదు. కాఫీ కాచుకు తాగింది.

పడుకుంది, మగత నిద్ర.

రాత్రి ఐంది. యింకా మగత నిద్రే.

పది గంటలు.

ఆకలిగా వుంది. కానీ యేమీ తినాలనిపించటం లేదు.

చుట్టూ కలియజూసింది. పౌడరు, స్నో, తిలకం, దువ్వెన ముక్క, కాటుక, వంట సరుకుల తెరిచిన పొట్లాలు. మట్టి పాత్రలు — వొకటి మొన్న పగిలిపోగా యింకా మూడు వున్నాయి.

ఆ పాత్ర చూస్తే, తన చిన్నప్పుడు పాలకుండ గుర్తొచ్చింది. — దాన్లో చల్ల చిలికేది వాళ్ళమ్మ

కళ్ళలో నీళ్ళ తడి.

చిన్నగా నవ్వుకుంది.

లేచి కూచుని పౌడర్ చేతినిండా పోసుకుని ముఖానికి పూసుకుని అద్దంలో చూసుకుంది. ముఖం కనిపించలేదు. తెల్లగా పౌడరు.

చిన్నగా నవ్వుకుని పవిటతో తుడుచుకుంది.

కళ్ళకి కాటుక పెట్టుకుంది. నుదుట తిలకంబొట్టు పెట్టుకుంది.

వెల్లకిలా పడుకుంది.

రెండు నిమిషాలు.

పక్కకి తిరిగి ముడుచుకుని, తొడల మధ్య చేతులు పెట్టుకుని పడుకుంది.

పిడికిలితో పైకి నొక్కింది. పిడికిలి విప్పి రెండు వేళ్ళు చీర పొరల్లోంచి గుచ్చింది.

కళ్ళలో నీళ్ళు.

టీ తాగాలనిపించింది.

టీ పొడి లేదు. కాఫీ పొడి వుంది. యీసారి కాఫీ తాగదలచలేదు. టీయే తాగాలనిపించింది. దగ్గర్లోనే టీ బంకు వుంది.

వోపిక కూడదీసుకుని లేచింది.

నడుస్తోంది — తడబడుతున్న అడుగులతో.

రాత్రి పన్నెండున్నర.

నడుస్తోంది కళ్ళు తిరుగుతున్నాయి.

మరో అడుగు. మరో అడుగు.

పడిపోయింది నేలమీదకి. పక్కన చెత్త కుండీ — నిమ్మింటుది, నిండిపోయి, దాని చుట్టూతా చెత్తాచెదారం పోగులు.

స్పృహ లేదు.

అరగంట.

రివ్వున వీస్తున్న గాలి.

ఆకులూ చెత్తా చెదారం ఆమె మీదకి యెగిరిపడ్డాయి. వాటిలో యేవో పదార్థాలు. తిని పారేసిన ఆకులు, గుడ్డ పీలికలు.

మరో అరగంట.

వో కుక్క పోతూ పోతూ ఆగి, చెత్త కుండీ దగ్గిరికి వెళ్ళి, కుండీకి వొక కాలు ఆన్చి వుచ్చపోసి యివతలికి అడుగులు వెయ్యబోయి, ఆ చెత్తా చెదారంలో మూతి పెట్టి వాసన చూస్తూ కెలికింది. వొక ఆకుని యేదో పదార్థముంటే నాకింది. నాకేసాక మరింత ఆకలిగా అనిపించినట్టుంది—ఆ చెత్తా చెదారంలో అటూ యిటూ ముందు కాళ్ళతో జరిపి మూతి దూర్చి వాసన చూస్తోంది. యింకో ప్రక్కకి జరిగింది.

మూతికి బట్ట చుట్టుకుంది. పళ్ళతో పట్టి లాగింది. మూతికి గట్టిగా ఆనింది, చర్మం, గట్టిగా బొమిక.

కండలేని ఆమె కాలు.

పళ్ళతో నొక్కింది. వుత్త చర్మం. కండలేదు. బొమిక తగిలింది. వుత్సాహంగా పళ్ళతో బలంగా కొరికింది. వున్న కొద్దికండా నరాలలోంచి పళ్ళు దిగి, బొమికని, బలంగా నొక్కాయి పళ్ళు.

అంతలో పక్కకి నే మీదకి వొరిగింది కుక్క.

కుక్క గిలగిలా కొట్టుకుంది. మూతి దుమ్ముకి అతికింది.

కుక్క చచ్చిపోయింది కానీ రమణి యింకా బతికేవుంది—యింకో గంటో రెండు గంటలో వుండే కొనవూపిరితో.

## 124

"యింక నే వెళ్తా డియర్" అని అంటే, ఆశ్చర్యంగా కసిగా చూసి, "అగో! యిప్పుడె వాసి వొ శేదొ అప్పుడె పోతవా!" అంది గంగి అతనిమీదకి చెయ్యివేసి.

"చాలా పేపవలే!" అన్నాడు యెర్రగా బొద్దుగా అందంగా వున్న యువకుడు.

"యాడ? వొక్క ముద్దయిన మంచిగ పెట్టుకున్నవో లేదా!"

"వహటా! వది వది హేస ముద్దులు!" అన్నాడు తన పెదాలను నాలికతో తడుపుకుంటూ. వొత్తిడికి నలిగిన అతని పెదాలు, అలిసిన సౌంద ర్యంలా వున్నాయి.

"ముద్దు పెట్టుకోంగనె ముచ్చట తీరిపొయెనా! కమాన్ మై స్వీట్ స్వీట్ లవ్" అని అతనిని తనికి బాగా దగ్గిరిగా లాక్కుంది.

వోం వరుపు గిజగిజలాడింది.

మళ్ళీ నాలుగైదు ముద్దులు.

"రాజమండ్రి నుండి మా బాబాయొచ్చాడు. పొద్దుట వెళ్ళిపోతాడు. నా దగ్గిర తైలం అయిపోయింది— వో నాలుగైదు వందలు పుచ్చు కోవాలి"

అతని బాబాయంటూ యెవరూ లేరు. నాలుగైదు వందలు యిచ్చే చుట్టమెవరూ అందుబాటులో లేరు.

"పొద్దుగల కద పోయేది—రాత్రికి తీస్కో" అంది గంగి.

"రాత్రికి ఆయన యెవరింటి దగ్గిర మకాం వేసేది తెలియదు. పట్టు కోడం సాధ్యం కాదు"అన్నాడు.

కపోర్డు మీదున్న పర్సు అందుకుని వందనోట్లు నాలుగు తీసియిచ్చి, "మీ బాబాయి యిచ్చినాక యిచ్చేద్దువులే" అని, "నీలాగా మాట్లాడేనుకదా!" అని సంతోషంగా నవ్వింది.

అనుకరణలా అదోలాగా అనిపించినా, "అమోఘం. అద్భుతం. అన్నిట్లోనూ నీకు నువ్వే సాటి స్వీట్" అని ఆమె దగ్గిరికి జరిగాడు.

సంతోషంతో పొంగిపోయి, అతని మీదకి బొక్క బోర్లా జరిగి పెదాలమీద ముద్దెట్టుకుంటూ అతనిని భుజాపి పక్కకిజరిగి. అతనిని తనమీదకి లాక్కుంది

ఆమె వొళ్ళు—

ఈగుడికీ తిండికీ తిరుగుడికీ—వొళ్ళు కొవ్వు పట్టి కండలు తిరిగి— వెనకటి వొంపులన్నీ పోయాయి. మాంసపు తున్మ మొద్దుమీద చిన్నపిల్లలు యెక్కి తొక్కినట్టుంది గవర్నర్ బాడీగార్డుకి ఆడవేషం కట్టినట్లనిపిస్తుంది చీకట్లో దూరం నుంచి చూస్తే ఆ నలుపులో కాంతి అంతరించింది. బొగ్గు తనం బొంతతనం వొచ్చాయి తనంటే కుర్రాళ్ళకి ఆసక్తి కలగాలంటే

యెదురు డబ్బివ్వాల్సొస్తుంది. కొందరికి వుద్యోగాలిప్పించాల్సొస్తుంది. కొంద
రికి తదితరమైన పనులు చేయించిపెట్టాల్సొస్తోంది.

అరగంట.

అతను లేచి ప్యాంటు తగిలించుకున్నాడు.

"కూర్చో యిప్పుడే వొస్తా" అని బాత్రూంలోకి వెళ్ళి స్నానించి వొచ్చింది. వొంటికి యెర్రటి పెద్ద టర్కీటవల్ చుట్టుకుని. ఆ వొంటినలుపు మీద ఆ యెర్రదనం భయపెట్టేలాగా అనిపిస్తోంది.

పావడా యెక్కించుకుంటూ అతని వంక చూసింది. అతను కిటికీ లోంచి కిందకి పూల పొదల్లోకి చూస్తున్నాడు.

తనని గమనించనందుకు నిరుత్సాహపడి "యీ టవల్ మంచిగున్నదన్నవులే, నీకు ప్రెజెంట్ చేస్తా" అంది.

ఆమె వైపు తిరిగాడు.

సంతోషంగా అతని కళ్ళలోకి చూస్తూ—తెల్ల బ్లౌజు వేసుకుంది. వుల్లిపొరలాంటి తెల్ల చీర కట్టింది.

ఆ నలుపుమీద ఆ తెలుపు స్వచ్ఛంగానూ చల్లగానూ అనిపించటంలేదు.

ముస్తాబు అద్దం ముందు కూచుంది.

పావుగంట.

మెడమీద వీపుమీద పౌడరు చల్లుకుని అతనిని సహాయం చెయ్యమంది. వెళ్ళి చేత్తో పౌడరుని ఆమె చర్మానికి రుద్దుతున్నాడు. పౌడర్ సగం అతని అరిచేతిలో కలిసిపోయింది. మిగతా సగం ఆమె వొంటిమీద తెల్లటి పొరలా అతికింది.

తన రెండు చేతులూ వెనక్కి వొంచి అతని చుట్టూ తిప్పి, "డియర్ మై స్వీట్ స్వీట్ డా—లింగ్" అంటోంది. సంతోషంగా.

ఆమె భుజాలు పట్టుకుని లేవదీశాడు. గిరుక్కున తిరిగి, అతనిని ముద్దెట్టుకుని, "అట్ల షైర్‌కి పోదం. అటునుండి అటు నీవువెళ్ళిపోద్దువ్" అంది

మేడమీదున్న ఆమె పడకగదిలోంచి బయటికి వొచ్చారు. రెండో ప్రక్క రవి పడక గది.

కారులో కూర్చున్నారు.

నడుపుతోంది.

గోల్కొండ కంటోన్‌మెంట్ ప్రాంతం. సాయంత్రంవేళవిర్ల.

వంగా వొంటరితనపు తారురోడ్లు.

వాకచోట రోడ్డువారగా ఆపింది. పక్కకి తిరిగి అతని పెదాలమీద ముద్దిచ్చి, భుజం మీద తల ఆనించింది.

కబుర్లు.

కారులోని టేప్ రికార్డర్‌లో తిరుగుతూన్న కేసెట్‌లోని ఆఖరిపాట "గుడిసెవెనక గుడిసెదాన గుండెల రంఖ కదాన—" ఐపోయింది.

కారు బయల్దేరింది.

మెహిదీపట్నం రోడ్డు.

సరోజినీదేవి కంటి ఆస్పత్రి దగ్గిర ట్రాఫిక్ రద్దీ— పోలీసు చెయ్యెత్తాడు. కారు ఆగింది.

అటు ప్రక్కగా వున్న హిందూ మిలిటరీ హోటల్లోని రికార్డ్ ప్లేయర్ లోంచి—"బొబ్బర్లంక చిన్నదీ కొబ్బరిలాగ వున్నదీ— బెల్లం వల్లి బుల్లోడు అల్లంలాగ వున్నాడూ—" అని వినిపిస్తోంది.

# 125

యెం· యెల్· యే· బస్సు గంగారాం, మధ్యాహ్నం రెండున్నరకి కారు పోర్టికోలో ఆపి—దిగి, లోపలికి అడుగులు వేసి, "రవీ సాబ్ వున్నాడు కదా?" అన్నాడు.

"మినిస్టరుగారు పడుకుని వున్నారు"అన్నాడు రవి పర్సనల్ సెక్రటరీ

"యీ టైంల పండుకుని వుంటడని తెల్సు. అందుకోసమే ఫోన్ చెయ్యక నేనె వొస్తి. జరూర్ పని."

"మీ యిష్టం. వారాగ్రహించితే నా పూచీ లేదు"అన్నాడు సెక్రటరీ.

పైకి వెళ్ళి తలుపుకట్టాడు గంగారాం. తలుపు తెరుచుకోలేదు

దబదబా బాదాడు

తలుపు తెరుచుకుంది

ముఖంలోని చిరాకు తగ్గి—"వో నువ్వా గంగారాం! రా యెనీ థింగ్ అర్జెంట్?" అన్నాడు రవి

సోఫాలో కూచుంటూ, "చెప్పవల్సినది మస్తున్నది.కూకో రవీసాబ్"

అన్నాడు గంగారాం

"వాడు గోవర్ధన్‌రెడ్డి బై ఎలెక్షన్‌కి సీటు వచ్చేటి చేసి చెన్నారెడ్డికి దగ్గరైనవాడు. పీకు అన్ని ప్రాబ్లెమ్స్ వొస్తున్నాయి" అన్నాడు గంగారాం

"వెంగళరావు ప్రభుత్వం తరవాత రాష్ట్ర రాజకీయాలలో వెనకటి కాలపు కుల విధానం, వర్గవిధానం, వియోజకవర్గ బలం, వ్యక్తి బలం పని చెయ్యటం లేదుగా! రాజకీయం, చదరంగంనుండి పైకుంతపాళిగా మారింది" అన్నాడు రవి.

పదిహేండు యెమ్మెల్యేల సపోర్టు వున్నవాడు మినిస్టరవుతాడు వొకొక్కరికి లక్షరూపాయలిచ్చి కొనుక్కోవాలి—అని రాజకీయ వర్గాలలో పరిపాటిగా అనుకుంటున్నారు.

"అన్నిటికీ శ్రీమతి యేర్పాటైనది. వన్‌వే ట్రాఫిక్ వుండాల్నన్నా పోవాల్నన్నా యేపనీ కావాల్నన్నా పైసాతోటే. ముంచటి లెక్క యిన్ఫ్లుయెన్స్ గాని మరేదిగాని బేకార్ ఐపాయె" అన్నాడు గంగారాం.

"యేంటి అసలు సంగతి? యింత అర్జంటుగా పశ్నీ—" అని ఆగిపోయాడు.

క్రితం నెలలో తనని సమర్థించే వొక యెమ్మెల్యే జారుకుంటే మరో కతనిని పట్టుకుని కొనాల్సివొచ్చింది. లక్ష పాతికవేలు. గతిలేక గంగిని అడిగాడు.

"చూస్తివా పైస అంటె యేమ్మిదో! దునియ పూర పైసతోటి నడుస్తున్నది. అంత పైస యిస్తె యింక బ్యాంక్ బ్యాలెన్స్ నిల్ ఐతది. మర్ల ఆపదొస్తే షేర్లు అమ్మాల్నో బంగ్లా కుదువ పెట్టాల్నో — ఆ పని చేస్తె ప్రిస్టేజ్ పూర పోతది" అని డబ్బు యిచ్చింది.

ఆ తరవాత వొకతనిని గూండాలతో తన్నించాల్సి వొచ్చింది—పది వేల రూపాయలు యిచ్చి. మరొకతనిని బ్లాక్‌మెయిల్ చేస్తామని బెదిరించాల్సొచ్చింది. కొందరు గూండాలను మేపుతూ వుండాల్సొస్తుంది. వీటిలో యెక్కువగా గోవర్ధన్‌రెడ్డి వల్ల కలుగుతున్న సమస్యలు. అతను ముఖ్యమంత్రికి చాలా సన్నిహితం అయ్యాడు.

"వాడు లేడూ? మీ ఖమ్మంజిల్లా మెంబర్ చిప్పల రంగయ్య, వాన్ని గోవర్ధన్‌రెడ్డి తిప్పేసుక్కున్నడు. ఆ బద్మాష్ గోవర్ధన్‌రెడ్డి సాగా. సి. యం. తోటి అన్ని పనులు చేపించి పైస కమాయించి యిస్తున్నడు. యే పని కావా

ల్నిష్ష యీ బద్మాష్ గోవర్ధన్‌ని అడ్గితె చాలు. రేటు చెప్తడు. బస్, ్న యిస్తె చాలు పనిబపోతది ఆ బద్మాష్‌ని చావదన్నితె."

"నావల్ల మినిస్ట్రిలో యెవరికి ఆదాయం లేనట్లే. యేదో చెయ్యాలి లేకపోతే—"

"ముందు యీ ప్రోబ్లంలకెల్లి బయటపడాలి. ఆ కరీంనగర్ మెంబర్ ఆట్కాల ...పైసకుకూడమాట యినెటట్లులేదు."

పైన — అనేసరికి రవికి దడపుట్టింది

"నా నియోజకవర్గం ప్రజలందర్నీ అసెంబ్లీ మీదకి రెచ్చగొడతాను" అన్నాడు రవి— అసహాయంగా యేం చెయ్యాలో మార్గం కనపడక.

"నీ కాన్స్టిట్యుయెన్సీల నీకెంత స్ట్రెంగ్త్ వున్నదో అందర్కి-యెరికనె. అట్ల చేస్తె ఫాయిదేమున్నది? సిట్యువేషన్ యింక యెక్కువ కష్టమైపోతది. వాడు గోవర్ధన్ దాన్కి వేరె కలరింగ్ యిస్తడు—నువ్వు సి. యం. కి యెగనెస్ట్‌గా వున్నవని. దాన్కిది యెవిడెన్స్ అని ప్రోపగేట్ చేస్తడు. ఆ రామానంద్ కూడ చెయ్యిస్తడేమో నన్నట్లు కండ్లపడ్తున్నడు. యివాళ్రేపు గోవర్ధన్ సాలాకా చెమ్‌చా గంగారాంతోటి తిర్గుతున్నడు"

"మరేం చేద్దామంటావు?" అన్నాడు రవి.

"నా కేమి సమజ్ కాకున్నది. నువ్వే సోంచాయించు, రవీ సాబ్" అన్నాడు గంగారాం.

గంగారాం, అసెంబ్లీలో రవికి అతినమ్మకమైన ఐదారుగురు అనుచరులలో వొకడు.

"సరే నువ్వెళ్ళు. మీ అవ్వ కెట్లా వుంది?" అన్నాడు రవి.

"అట్లనె వున్నది. యింటెన్సివ్ కేర్‌ల పెట్టిన్రు"

గంగారాం లేచి వెళ్ళాడు.

రవి తలుపు వేసుకుని సోఫాలో వాలిపోయాడు. యీ రోజున తను కాంగ్రెస్ నాయకురాలు ఇందిరా గాంధీ కర్నాటక చిక్‌మగ్‌లూరు నుంచి గెలిచింది. ఆ సంతోషమూ యీ సాయంత్రం అందరూ కలిసి జరుపుకోవాల్సిన ఆవేడుక— యివేవీలేకుండా దిగులుగా ముఖం వాడిలిపోయింది.

అరిచేత్తో మొహం రుద్దుకున్నాడు.

వొక వారనలో యేదన్నా ఆలోచించే అవకాశం లేక బుర్ర వేడెక్కింది.

పది నిమిషాలు.

అతని కళ్ళముందు— "మంత్రుల శాఖలలో మార్పులు. కార్మికుల మంత్రి రవికి వుద్వాసన—" అని దినపత్రికలో తాటి కాయలంత అక్షరాలు కనిపించాయి.

కంపించిపోయాడు చెమటలు పట్టాయి. వొంట్లో యెంత కూడా సత్తువ లేనట్టుగా నీరసించిపోయాడు.

పది నిమిషాలు. కళ్ళముందు తనని సపోర్ట్ చేసే సభ్యులు కనిపించారు. కొన్ని ధైర్యంగా అనిపించింది.

ఆలోచిస్తున్నాడు బుర్ర వేడెక్కి పోయింది.

ఆలోచన సాగక బుర్ర మరింత వేడెక్కి పోయింది.

చటుక్కున లేచి, బాత్రూం తలుపు తెరిచి, షవర్ తిప్పి దాని కింద నుంచున్నాడు.

ఐదు నిమిషాలు చల్లటి నీళ్ళు.

తడిచిన పైజమా లాల్చీ బన్నీ అండర్ వియర్ తీసేసి, వొళ్ళు తుడుచుకున్నాడు.

వొచ్చి బట్టలు వేసుకున్నాడు.

సోఫాలో కూచున్నాడు నుదటిమీద పిడికిలిలో నొక్కున్నాడు.

ఐదు నిమిషాలు.

బుర్రలో మెరుపు తీగలా ఛక్‌మని వో ఆలోచన వొచ్చింది. తటాలున లేచి నిలుచున్నాడు. అంతలోనే కూలబడిపోయాడు.

ఫోను దగ్గిరికి వెళ్ళి రిసీవర్ యెత్తి డైరక్టరీలో వో నంబర్ చూసి తిప్పబోయి అంతలో—ఆగిపోయి వొచ్చికూలబడిపోయాడు. మళ్ళీ లేచాడు.

తలుపు తెరిచి బయటికి అడుగులు వేశాడు.

మెట్లు దిగుతున్నాడు.

చెప్పుల సవ్వడి విని పనిమనిషి చూసి, ఆ వేళప్పుడు రవి కిందికి రావటం ఆశ్చర్యంగా అనిపించి, పరుగున సెక్రటరీ గదిలోకి వెళ్ళి చెప్పాడు. కునికిపాట్లు పడుతున్న సెక్రటరీ దిగ్గునలేచి. యెదురువొచ్చి "సార్" అన్నాడు.

బయటికి వెళ్ళాలన్నట్టుగా చూశాడు రవి.

పోర్టికోలో కారు.

వెనకసీటు తలుపు తెరుచుకుంది. కూచున్నాడు. తలుపు మూసుకుంది

కారు కదిలింది. వీధి దాటుతుండగా యెక్కడికి వెళ్ళాలో చెప్పాడు.

సావుగంటకి— కారు, రామనాథం బంగళావున్న వీధిలోకి మళ్ళింది.

కారు రామనాథం యిల్లు దాటుతోంది. రవి మౌనంగా వుండి పోయాడు. కారు ముందుకు వెళ్ళింది.

యెటో తెలియక డ్రైవరు అడిగాడు— వీధి చివరన.

"పోనియ్" అన్నాడు రవి.

యెటో అర్థంకాక, యెడమకి తిప్పబోయి తిప్పకుండా కుడి వైపుకి తిరిగి నిదానంగా పోతున్నాడు డ్రైవరు.

కారు సాగిపోతోంది. నాలుగుమైళ్ళు వెళ్ళింది

రవి చెప్పాడు యెక్కడికి వెళ్ళాలో.

డ్రైవర్‌కి అర్థంకాక, "అటే పోయినం గద, సాబ్?" అన్నాడు.

"అట్లాగా, నేను గమనించలేదు" అన్నాడు రవి.

సావుగంటకి కారు మళ్ళీ రామనాథం బంగళావున్న వీధిలోకి తిరిగింది.

"ఆ పచ్చ బంగళా" అన్నాడు రవి.

కారు గేట్లోకి మళ్ళి పోర్టికోలో ఆగింది.

కారులో కూచునే తనొచ్చినట్లు వలానా వాళ్ళకి చెప్పమన్నాడు, రవి.

డ్రయివర్ వెళ్ళి—యెవరో మనిషి కనిపిస్తే, "మినిస్టర్ రవీ సాబ్ వొచ్చిండని వల్‌నీ మేమ్‌సాబ్‌కి చెప్పు" అన్నాడు.

సాయంత్రం ఐదు గంటలు.

వళిని, పడక గదిలో, అప్పుడే స్నానించి ముస్తాబు ముగించి, మెడకి, చెవులకి, చేతులకి చేతివేళ్ళకి కొత్తగా చేయించిన కెంపుల సెట్టు పెట్టుకుని లేచి నిలువుటద్దంలో తన వంక వొకసారి చూసుకుంది.

వలానా వాళ్ళొచ్చారని చెప్పిన మాట విని విస్మయంగా చూసి,నమ్మలేక, "యెవరొచ్చారు?" అని అడిగింది. పనిమనిషి మళ్ళీ చెప్పాడు యెవరొచ్చిందీ.

మెట్లు దిగుతోంది. మెట్లమధ్యలోవుంది. అక్కడికి—పోర్టికోలో కారు, కారులో కూచునివున్న రవి కనిపించి—చప్పుడవకుండా, మెట్లు దిగి యెడమ వైపువున్న డ్రాయింగ్‌రూంలోకి వెళ్ళి, "లోపలికి తీసుకురా" అంది

—కవిపిస్తే కారుదగ్గిరికి వెళ్ళి కలాం చేసినట్లుగా తీసుకురావాల్సొస్తుంది— అనుకుంటూ సోఫాలో కూచుంది.

గుమ్మంలో రవి చెప్పుల చప్పుడు

"రండి, రండి, మినిస్టరుగారికి సుస్వాగతం" అంది నళిని. వెట కారం జోడించిన అతి వినయంతో.

మినిష్టరౌసే స్వాగతం యెలా చెబుతారో బాగా స్వానుభవం వున్న రవి, బాధని అణుచుకుంటూ, కూచున్నాడు.

"యేం తీసుకుంటారు చెప్పండి. ఐనా మినిష్టర్లకి ఆతిథ్యం యివ్వ గలదాన్నా! షర్బత్‌లో బంగారం బొడి కలిపి యిస్తే సెప్టిక్ అవుతుంది. అందుకని అట్లాంటివి విడిగానే యిచ్చుకుంటాం. చెప్పండి, స్కాచ్ విస్కీ- ఫ్రెంచ్ షాంపేన్ వంటి సామాన్య పదార్థాల వరకూ యిప్పించగలను...."

"నళినీ—"

మాటలు ఆపి అతని ముఖంలోకి చూసింది.

"నళినీ నీతో కొంచెం రహస్యంగా మాటాడాలి. బెడ్‌రూంలోనో యెటో" అన్నాడు భారంగా.

"బెడ్‌రూం సీక్రెట్లంటే నాకు చచ్చే యిష్టం అనుకో అందునా నీతో! వాట్ ఎ లక్, కమాన్"—గలగలా అని ఉత్సాహంగా లేచి పైకి నడి చింది. ఆమె కూడా నడిచాడు పడకగదిలోకి నడిచారు గడియ తిప్పింది.

చెరో పేము కుర్చీలో కూచున్నారు.

"వూఁ చెప్పు. డియర్!" అంది వ్యంగ్యంగా.

"లోకేష్‌తో నీకు కాస్త పరిచయం వుందని—"అని ఆగిపోయాడు రవి. లోకేష్ అసెంబ్లీ సభ్యుడు.

యింక అతను యెందుకొచ్చిందీ నళిని వూహించుకోగలదు.

"యెంత నాకు పనుండి వచ్చినా, నా దగ్గిర కూడా పొలిటీషియన్స్ ఫ్రొలైట్‌నెస్ వొలకబోస్తే యెట్లా రవీ!" అని అతని కళ్ళలోకి కవ్విస్తున్న ట్లుగా చూసి, "లోకేష్ నా బోయ్‌ఫ్రెండ్‌లే" అని గొంతు బిగించి, "వొక మూర్ఖుడికి బుద్ధుండి వుంటే వొక్క బోయ్‌ఫ్రెండూ వుండని నాకు లోకేష్ బోయ్‌ఫ్రెండ్—వన్ ఆఫ్ ది రోగేషెస్" అంది.

మౌనంగా నేల చూపులు చూస్తున్నాడు.

"వూఁ చెప్పు" అంది.

"ప్రస్తుతం అతని సపోర్టు అవసరంనాకు. అతనికి నువ్వుచెప్తే—"
అని ఆగిపోయాడు.

లోకేష్‌కి అనుచరుడుగానో, సహచరుడుగానో వుండే సభ్యుడు వొకతను వున్నాడు.

"దేనికదే. నువ్వంటున్నది రాజకీయం నేను చెప్తే వింటాడా?" అంది. గొంతులో అతిశయం ధ్వని.

"నువ్వు చెప్తే కాదనడు" అన్నాడు రవి.

రవి నేల మీదకి చూస్తున్నాడు. సశివి అతని ముఖంలోకి చూస్తోంది.

"మరి నాకేం యిస్తావ్?" అంది.

"యెంతిమ్మంటావో చెప్పు" అన్నాడు

"చూడు రవీ! నువ్వెంత—వుంటావో పూడతావో తెలవని మినిస్టరువైనా నాకివ్వగల స్థితిలో వుండవు మీ మంత్రి పదవులు యే క్షణంలో పూడతయ్యో మీకే తెలవదు. కానీ యిండస్ట్రీస్ అధిపతులు మారరు" అంది.

"నీకివ్వగలవాడినని కాదు నా భావం. నువ్వు అడిగావు గదా అని అన్నాను" అని సంజాయిషీగా అన్నాడు.

చిన్నగా, "యెంతిస్తావు—అని అడగలేదు యేమిస్తావు—అని అడిగాను" అంది.

కుర్చీలోంచి లేచి రెండడుగులువేసి మంచం అంచుమీద కూచుని కాళ్ళు వూగిస్తూ, "యిట్లా రా మంచం మీదకి వో గంట పేస్తు" అంది సరదాగా.

బిక్క మొహం వేసుకుని చూసున్నాడు.

"రా" అన్నట్లుగా ముఖంతో నవ్వింది.

"నేను భార్యని తప్ప యే స్త్రీనీ తాకలే దెప్పుడూ. నాకు జీవితంలో తృప్తీ గర్వకారణమూ అదొక్కటే" అన్నాడు నిదానంగా.

"భర్తనొదిలి పరాయివాడితో వుండిపోయినందుకే నీ తల్లిని నువ్వు మన్నించలేకపోయిన వాడివి—నీ భార్య, కంటికి నదరుగా కనబడిన కుర్రాళ్ళకి దగ్గరచ్చి మరీ తిరుగుతాంటే—సిగ్గులేదూ ఆ మాట అనటానికీ, దాంతో పాటు వేదికలెక్కి ఆదర్శదంపతులమని దండలు వేయించుకోటానికీ?" అంది.

తల కిందికి వొంచేసుకున్నాడు.

కొన్ని క్షణాల మౌనం.

"అవతల నీ మినిస్టరు షిప్పు వూడిపోతాందని దిగాలు పడి లాభం లేదు. కార కర్తవ్యం ముఖ్యం" అని, వ్యంగ్యంగా, "నీకోసం కాదు దేశసేవ కోసం" అని, సరసంగా, "యిల్లారా బుద్ధిమంతుడల్లే" అంది.

రెప్పలు కొంచెం పైకెత్తి, "వక ముద్దు పెడతాను" అని, వెంటనే రెప్పలు వాల్చేశాడు.

పకపకా నవ్వి, "ముద్దు వరకూ ఐతే నీపత్నీవ్రతం చెడదన్నమాట ముద్దు అయినా కౌగిలయినా మరింకేదయినా పాతదే" అని క్షణం ఆగి, "కమాన్ లే" అంది గోముగా.

లేవబోయినట్లుగా కదిలాడు.

"నీ పుణ్యం. ఆ రాజకీయం గుడ్డలతోనా! అవి పీకేయ్" అంది.

దీనంగా చూశాడు.

"కాగా బట్టనివ్వకండా యేం చేద్దామః!" అని హాస్యంగా అని.

-" అంది గోముగా.

లాల్చీ విప్పాడు

"ఆ పైజమాకూడా లాగెయ్" అంది.

తీశాడు—కూచునే కుర్చీలో అటు యిటూ కదులుతూ.

బనీ అండర్‌వియర్‌లలో— చలికి వొణికిపోతున్నట్లుగా అవమానంగా చలిస్తున్నాడు.

ఫ్యాను గాలి, ఆహ్లాదంగా విస్తరిస్తోంది గది నిండా.

"రవీ! యెంతటి నీచస్థితికి దిగజారావో తెలుసా?" అంది.

గోడవైపు చూస్తున్నాడు.

"దేనికి?" అంది

మౌనంగా గోడవైపు చూస్తూ వుండిపోయాడు.

"చెప్పు దేనికి?" అంది

చూపు కిందికి వాల్చి, "రాజకీయం భయంకరమైంది. ఆ దాహం. ఆ వ్యసనం—జూదం కంటే తాగుడుకంటే ముండలకంటే—అన్నిటికంటే మించిన వ్యసనం. మహా మోహం అది. దాన్లో పడినవాడు దాన్లో అంతం కాక తప్పదు" అన్నాడు.

అతని కళ్ళలో నీటిపొర

కొన్ని క్షణాల మౌనం.

"ఆనాడు నువ్వు నన్ను ప్రేమించని నాడు మూర్ఖుడివని అను కున్నాను ఆ పనీ యీ పనీ చేసుకొని బతుకుతున్ననాడు కూలి వెధవ అన్నాను నటుగరితో— కానీ అప్పుడంతా నువ్వంటే చాలా గౌరవం నాకు. నువ్వు డ్రెస్సు మార్చి అసెంబ్లీకి వెళ్ళినాక పతనం అయినాక నీ మీద గౌర వం పోయింది. మాకు బాగా ఆస్తి వుందనీ అందంగా వుంటానని నాకు గర్వమే కావొచ్చు. ఆ గర్వం లోకం దగ్గిర. నీకే బుద్ధుంటే వుంటే నాకు యే బోయ్ ఫ్రెండూ వుండేవాడు కాదు. నేను నా చనటి బోయ్ ఫ్రెండ్సుతో గడుపుతాను గానీ నీలాంటి పతనమైన వాడితో కాదు. నాతో వాన్సిన రవి యేనాడో చచ్చిపోయాడు."

ఆమె కళ్ళనిండా నీళ్ళు గొంతు పూడుకుపోయింది. చకచకా నడిచి గది బయటికి వెళ్ళిపోయింది

ఐదు నిమిషాలు.

ఒంటరిగా కూచున్నాడు.

వొంట్లో, లేచి పిలుచునే సత్తువ వున్నట్లుగా కూడా అనిపించలేదు.

మరో ఐదు నిమిషాలు.

బట్టలు వేసుకున్నాడు.

లేచి బయటికి వొచ్చాడు.

డ్రైవరు, తలుపుతెరిచాడు కూచున్నాడు. తలుపు మూసుకుంది. కారుకదిలింది.

సీటు పైన అంచుమీద తల ఆనించాడు

పావుగంట.

కారు ఆగింది తలుపు తెరుచుకుంది.

యింట్లోకి నడిచాడు. మెట్లెక్కాడు తన పడకగది తలుపువేసుకుని ఫ్రిజ్ తెరిచి స్కాచ్ విస్కీసీసా తెచ్చుకుని సోఫాలో వొరిగాడు.

గొంతువెంట విస్కీ, కళ్ళవెంట నీళ్ళు.

నీళ్ళు— మూసుకుంటూ తెరుచుకుంటూ కొన్ని గంటలు గడిచాయి.

టెలిఫోను మోగింది.

అందుకోలేదు.

మోగుతూనే వుంది.

అందుకున్నాడు.

అవతలినుంచి, "హాలో రవీసాబ్! నేను లోకేష్ని. మంచిగున్నరా? మిమ్ములచూసి చాల దినాలాయె .... .... ...." అంటూ ఆప్యాయంగా వుత్సాహంగా చెప్పుకుపోతున్న లోకేష్ గొంతు.

# 126

భంజౌన తువ్వాలు వేసుకుని స్నానించటానికి వెడితే బాక్క-బాత్రూమూ ఖాళీ లేకపోవటంతో హాల్లోకి వొచ్చాడు శ్రీపతి. బల్లమీద దినపత్రికలు.

పతాక శీర్షిక. సభా హక్కులను భంగపరిచిన నేరానికి లోక్సభ, యిందిరా గాంధీని సభ సభ్యత్వం నుంచి బహిష్కరించి కారాగారవాసం విధించిందని.

ఆతిథ్యం తిహార్ జైలులో.

చూసి— పత్రిక తీసి చదవకుండా [illegible] మెట్లమీదకి అడుగులు [illegible]డు శ్రీపతి

—ఐదు పంచల గురివిందలు లోక్సభా వేదిక వరించిరించిన మేడి పళ్ళు సాధించిన ఘనకార్యం. ఆపాటి కుంటిసాకు యెవరి విషయంలో దొరకదు! చిక్మగ్లూరు నుంచి గెలిచి తను పార్లమెంటులో కాలుపెట్టిన పదిరోజుల్లోగా కెలికి కెలికి యీ పోయింటు లాగారు. బోనులో సింహం లాగా— సింహమా— సివంగా— పాపం ఆడకూతురు బొక్కతే యెల [illegible]క్షన్లో రాత్రీపగలూ చిక్మగ్లూరున పడిందని అంటే, ఆడది కాదురా అన్నారుగా— సింహమే మరి మూడొంతుల పార్లమెంటు సభ్యులు యెప్పుడో అప్పుడు ఆ సింహం ముందు ఆడవేషం కట్టినవాళ్ళే—చిక్మగ్లూరు జనతా యెలక్షన్ ప్రచారం ఫార్స్— పాపం ఆ జనతా అభ్యర్థి ఆ వీరేంద్ర వుత్తమబ్బు— ఐతే యేం, యెందరు లేరు! దేశంలో వున్న నాయకులందరూ— యెమర్జన్సీ రాక్షసిని నిరాకరించకండి అని ప్రచారం. జార్జ్ ఫెర్నాండెజ్, పొట్టకూటికోసం బొంబాయి తరలివెళ్ళాను గానీ నా అసలు వూరు కర్నాటకే అనీ, వుక్కు ఫ్యాక్టరీ మీకే

అర్సు నాకు అక్కర్లేదన్నా కూడా బలవంతంగా యిచ్చేటంత బలంగా చెప్పి అదీ చాలదేమోనని వ్యక్తుల మంత్రి విజూతో కూడా చెప్పించి— తోడికోడళ్ళ సాధింపులా యెమర్జన్సీ ఘాతుకాలంటూ వైన వైనంగా చెప్తుకుంటూ పోయాడు— డైనమైట్ జెయిలు కక్షవల్ల కావొచ్చు. యెమర్జన్సీలో పోలీసులు పెట్టిన హింసలు ప్రభుత్వాధికారులు పెట్టిన బాధలు, పండకుండా వుండపోయిన పొలాలు, చెట్లునాటించినందుకు, జనాభా పెంచవద్దన్నందుకు, యెన్నిటినో— అన్నిటిలోని సవాలక్ష లొసుగులకు శిక్షగా గెలిపించకండి— గెలిపిస్తే పార్ల మెంటులో ఆ పాతకి కాలుపెడితే దేశం నాశనమైపోతుంది— అని మొరా ర్జీలు చరణ్‌లు వొచ్చి యెమర్జన్సీ బూరదంతా ఆమె నెత్తినపోస్తే విప్పలు కుమ్మరిస్తే పేడజల్లితే పితూరీల్లాగా చిన్నం చితకా అన్నీ వల్లిస్తే అరిస్తే మొరిగితే, కరిస్తే— తొణక్కుండా బెణక్కుండా గాయపడిన పులిలా కాదంటే, వో మేకని ఆరగించి బయల్దేరిన పులిలా— యెమర్జన్సీలో కొన్ని పొరపాట్లు జరిగి వుండొచ్చు. అసలీ యెమర్జన్సీ యెందుకు పెట్టాల్సొచ్చింది? ప్రజలవల్ల కాదు వీళ్ళవల్లనేగా— అంటూ వంటరిగా యెవరినీ తిట్టిపొయ్యకుండా తను చెప్పాల్సిన ముక్కలు చెప్పినందుకు అన్నట్లుగా ప్రజలు గెలిపిస్తే— మహావీరులంతా దిక్కుమొహాలేశారు. గోసాయి చిట్కాలాంటి మెలికతో సింహాన్ని జెయిలులో పెట్టనైతే పెట్టారు గానీ— యీ సంత వక్కలు లోక్‌సభ స్మశానంలో .... .... ....

బ్రాత్‌రూం వైపు నడిచాడు. వొకటి ఖాళీ ఐంది— చొరబడ్డాడు.

—వొకరి మీద కక్షతో కలిస్తే ఐక్యత కొనసాగదు. కాంగ్రెసు మళ్ళీ చీలిందని గేలిచేశారు— చాలాసార్లు చీలింది— తనే చీల్చింది యెన్నిసార్లు చీల్చినా మూలకందం తనే అవుతూ వొచ్చింది జనతా చీలబోదని నిషేధ వుద్యాగ్రేసరుడు ఘోషిస్తున్నాడు! అసలది కలిసేడిసేనా చీలటానికి! చరణచౌధురి అనారోగ్యపు వాహ్యాళులూ అలక సరాగాలూ రాజీనామా ఉప సంహారింపునామా— రాయ్‌బరేలీ పచ్చ రుమాలు చింబోతుకి పుద్వాసన— డెలిన్‌క్వెన్ట్ హోం ఫర్ అడల్ట్స్ అని యేర్పాటుచేసి దాన్లో వెయ్యాలి వాడి లాంటివాణ్ని— మరేం చాతకాక, మన ప్రసక్తి కూడా లేకండా యీ నాయకులందరూ దేశానికి ఘటశ్రాద్ధం పెట్టేస్తారెప్పుడో— యిందిరైతే మనని అడిగి మనచేతే మనకి శ్రాద్ధం పెట్టించుతుందేమో— యీ నగరానికి నీళ్ళ

సమస్య తీరేదెప్పటి!? మధ్యాహ్నం నీళ్ళాగిపోతే సచ్చొంటితో బయటికొస్తే ప్రెస్సు ఫొటోగ్రాఫర్లు ఛాయాచిత్రాలు లాగి— జగ్‌జీవన్‌రాం సుపుత్రుడు సురేష్‌కుమార్ సుషమా చౌధురుల భంగిమల ఫొటోలు పత్రికల్లో అచ్చు వెయ్యలేదేం? రెండు పుష్కరాలు కాపరంచేసి, యిప్పుడీ సుషమాశ్లేష్మంలో పడి— నా పెళ్ళాం నాకంటే పెద్దది. నన్ను మోసంచేసి పెళ్ళిచేసుకుందనీ, అందుకని తనకు విడాకు లిప్పించమంటున్నాడు—యింకా నయం, నన్ను మోసంచేసి కడుపు చేయించుకుంది నేనసలు నపుంసకుణ్ని అని అనలేదు! బట్టల బిల్లుల బంగారం బిస్కట్ల కాంతిభాయి సంగతేం మాట్లాడడేం వుచ్చ సన్యాసి! అదంతా కెటికే చరణచౌధురుడు, ఆపరేషన్ చేసి కత్తులు కడుపు లోనే పెట్టి కుట్టేసే తన అల్లుడి మాటా బోలెడు లోపాయకారీ రాజకీయం నడిపే విజభార్య సంగతీ రానివ్వడేం! దేశానికి సరైన రాజకీయ పరిష్కారం — కాంతిలాల్ భాయ్‌ని రాష్ట్రపతిగా, బాల భానుణ్ని ప్రధానిగా, చౌధురి అల్లుణ్ని సురేష్‌బాబునీ కలిపి మిగతా శాఖలన్నీ యిచ్చేస్తే — నిప్పుల్లి అక్కరలేదు దేశం తగలబడిపోటానికి—ఆఁ ఆఁ ఐపోయింది. ఆగండయ్యా వున్నఫళంగా వొస్తే మీరే జడుసుకుంటారు—

శ్రీపతి బాత్రూంలోంచి బయటికొచ్చాడు.

"యిందిరా గాంధీని లోక సభ నుంచి బహిష్కరించి జైల్లోపెట్టారు యీ క్రూక్స్" అన్నాడు వొకతను.

"యేం, పెడితే?" అన్నాడు శ్రీపతి.

కారిడార్‌లో నడుస్తున్నాడు.

"యీ రాక్షసికి తగిన శిక్ష. బయటికిగెంటి జైల్లోకినెట్టారు."

"ఆ మాత్రానికే దేనికి?" అన్నాడు శ్రీపతి.

గదిలోకి వెళ్ళి ప్యాంటూ స్లాకూ వేసుకున్నాడు. బయటికొచ్చాడు.

అతు చెప్పులతో [illegible]న్నగా గీచిన గడ్డంతో వొకతను—

యిప్పుడు పాంకోళ్ళు బూట్లు మాసిన గెడ్డం ఫ్యాషనైతే యితగాడెవరో పాపం— అనుకుంటున్నాడు శ్రీపతి.

తెలుగు దినపత్రిక తిరగేస్తున్నాడు.

విద్యా ప్రమాణాలు పెంచాలి—రాష్ట్ర గవర్నర్ వుద్బోధ.

—అచ్చు తప్పుపడి విద్యా ప్రమాణాలు పెంచాలని అని వుండాల్సింది అప్పురహం. కమిటీలకి కొన్నరెన్నింకి తినుకుళ్ళ—బు వస్తే దేనికి

యేలినవారు చెన్నారెడ్డిగారు అన్ని యూనివర్శిటీలకీ ఒకే సిలబస్ వుండా లంటే బుర్రలూపుతున్నారు. వైస్ ఛాన్సలర్లు యేకగ్రీవంగా. వేరువేరు సిల బస్ లుండాలంటేనూ అలాగే బుర్రలూపుతారు అసలు సిలబసే వొద్దన్నా బుర్రలూపుతారు. బుర్రలూపటానిక్కాకపోతే కుర్చీల్లో దేని క్కూచుంటారు! మంత్రివారి నిరంకుశ పాలనకు—తులాభారం మంత్రిచెట్టుకి—ఆఫీసులు రాత్రుళ్ళే పనిచెయ్యాలన్నా, అధికారులూ, గుమాస్తాలూ బుర్ర లూపుతారు. బుర్రలూపే జాతి. కానీ బుర్రలున్నాయా అసలు—బుర్రవుంటే బుర్రలెందుకు వూపుతారు—

"హలో శ్రీపతీ డైనింగ్ హాలుకి వొస్తున్నారా?"

"ఆఁ" అన్నాడు శ్రీపతి.

—తనూ బుర్ర వూపాడు. లేకపోతే రావనాలి. రావనాలా—రానంటే భుక్తి—తనూ యీ జాతిలోవాడేగా—భుక్తి. భుక్తి కోసం బుర్రలూపటం. భుక్తికోసం కాదు—పదవుల కోసం. బుర్రలూపే పదవుల కోసం బుర్రలూపి బుర్రలూపే పదవుల్లో దూరి....

డైనింగ్ హాలు—

"యిందిరా గాంధీ వర్క్ యీజ్ వోవర్"

"నో. జనతా వర్క్ యీజ్ వోవర్."

—పాపం. యిందిరమ్మ పనై పోయిందనేదానికి యింగ్లీషు కావాలా! యింగ్లీషు మాట్లాడటమే రాదేం? యెలా వొస్తుంది? నేర్చుకుంటేగా? నేర్చు కోదలిస్తే ప్రభుత్వం నేర్చుకోనివ్వదు తెలుగు నేర్చుకోండి. గ్రాడ్యు యేషన్‌దాకా తెలుగు, అక్కడి నుంచి అమాంతం యింగ్లీషులో దిగండి. అప్పుడది హిబ్రూ భాషలాగా అనిపిస్తుంది. యింగ్లీషు రాదు. తెలుగూ రాదు. తెలుగు—తెలుగు మడికారం—తెలుగు— కొన్ని మడికా బొత్తిగా బాగనిపించవు—కాలం మారిపోయిందేమో— తెలుగుతనం తెలుగు పలుకు బళ్ళు—తెలుగు పలుకు బడెక్కడ —. ఢిల్లీ పాదుషాల పలుకుబడే—తెలుగుతనం లేదంటారా యీ నగరంలో— యిలాంటి పంచ కూళ్ళ కషాయం లాంటి, జనతా పార్టీ అంతటి పంచకూళ్ళ కషాయంలాంటి యీ సూడో మెట్రొపాలిటన్ సిటీలో యెక్కడ నుంచి వొస్తుంది? తెలుగు తనం, పల్లెటూళ్ళలోనే అంతరించిపోయింది. పల్లెటూళ్ళలో సినిమా తనం సినిమా మడికారం సినిమా తెలుగు. సాహిత్యం

లోనూ లేదు. గ్రామీణ వాతావరణ సాహిత్యంలోనే లేకపోతే నాన్ రూరల్ నాన్ అర్బన్ సబర్బన్ మనుషులతో తెలుగు నుడికారం వుంటేనా సాహిత్యంలో వుండటానికి! వుంటే అన్ రియలిస్టిక్ అవుతుంది. రియలిస్టిక్ సాహిత్యం—సాహిత్యం రియాలిటీ యెలా అవుతుంది డబ్బా కెమేరాతో బొమ్మల్లాగితే రియాలిటీ వుంటుంది— సోషలిస్టురియలిజం మార్క్సిస్టురియలిజం—నక్సలిస్టు రియలిజం—మార్క్సిజం లెనినిజం—విజం, మార్క్స లెనిజం—మోహన్—యెక్కడున్నావు మోహన్—అంత మౌనంగా—పాతిక పందల సంవత్సరాలనాడు సిద్ధార్థుడిలాగే వెళ్ళి పోయి వుంటాడు—తప్పకుండా నీ అరుణ కబురంపి వుంటుంది—అరుణంటే—అరుణంటే గాయత్రి. గాయత్రి యెలాగో మెలాయించుకుని యెక్కడో లేను కలలుగనే కలావని లోకి—రెండు కలల సీనులన్నా—పంచ రంగుల రొచ్చు సీన్లు పెట్టకుండా సినిమా బొమ్మ తయారవదు. మన అంకినీడు నాలుగెట్టాడు. ఐనా నలుగు పిండి ఐపోయాడు. ఆ పిల్ల నలుగు పిండి వాడదు. యింపోర్టెడ్ సబ్బిళ్ళ వాడుతుంది. జివెల్రీ వాడుతుంది, వీళ్ళివాడు తుంది.... ....

"వుయ్ విల్ గో అన్ స్ట్రయిక్ యెగెన్స్ యిందిరగాంధీస్ అరెస్ట్" అన్నాడు సుదాకర్.

"అకారణంగా అల్లర్లు మొదలెట్టితే మిమ్మల్నీ చెన్నారెడ్డినీ కూడా తిహార్ విహార యాత్రకి తీసుకెళ్తారు, మావాళ్ళు" అన్నాడు కులశేఖర రావు.

"షటప్. పీపుల్ ఆర్ ఆన్ హెర్ సైడ్" అన్నాడు సుధాకర్.

"దక్షిణాదిలోనేగా. అదీ రెండు రాష్ట్రాలు. తమిళనాడు ద్రవిడ నాడు, యెవరిదీకాదు. తెలుగువాళ్ళూ కన్నడవాళ్ళుపుట్టిబడుద్దాయిలు. అందుకే వీళ్ళిద్దరికీ వొకలాంటి లిపీ భాషా వుంది. దేశంఅంతటా దేవభాష దాని ఆధు నిక రూపమైన హిందీ భాష"

"అరెస్సెస్ కా సాలా చుప్ రహో"

"యేం కూశావురా బొవికలిరిచేస్తాను"

ప్లేట్లు యెగిరాయి.

కలబడ్డారు యిద్దరూ. నలుగురు ఐదుగురు—గుంపు.

—కలబడిన వాళ్ళేరీ? గుంపే కనిపిస్తోంది— యిద్దరూ కలిపి

వోమెన్ సినిమా వృదయ మాటకి యెంతక్కా చెట్టాపట్టాలేసుకెళ్ళి పోయి వుంటారీపాటికి. గుంపు మిగిలింది. కాలేజీల మూత రెండ్రోజులో నాల్రో జులో—వెర్రి గుంపు—మన గుంపింకా పేలు. వృత్త వెర్రి గుంపు. పడ మటి గుంపు మరీఅధ్వానం—అందుకే రిక్షమన్షి లోన్లి క్రవుడట్టూ వాపో తున్నాడు.

# 127

"రమా" అని పిలిచాడు శ్రీపతి.

తలుపు తెరిచి, చిర్నవ్వుతో లోపలికి ఆహ్వానించింది, రమాదేవి.

కూచుంటూ, "నన్ను రమ్మంటున్నావని మీ ఆయన నా రూంకొచ్చి మరీ చెప్పి వెళ్ళారు. యేవిటి విశేషం?" అన్నాడు శ్రీపతి.

"నాలుగు రోజుల క్రితం మా అక్కా నేనూ మీ వూరు వెళ్ళాం. యివాళ పొద్దుటే మీ వూరి నుండి తిరిగి వొచ్చాను. మీవూరి కబుర్లు చెపుదా మని కబురంపాను. లేకపోతే మీరు యెప్పుడో వొచ్చినప్పుడు వొచ్చినట్లు—అందుకని" అంది.

"యింతేనా, నే వింకేదో అర్జంటు పనేదైనా వుండి పిలిచావనుకుని పడుతూ లేస్తూ వొచ్చాను యీ మధ్యాహ్నం యెండ వేళ!" అని నవ్వాడు.

"విశేషం వుండబట్టే కబురెట్టాను. మీ అమ్మగారూ—"

"మా అమ్మగారూ మా వూరూ అంతా లక్షణంగా వున్నారని చెప్ప గానికన్న మాట!"

"అబ్బ చెప్పనివ్వండీ, మీ అమ్మగారు మీకు వొక పెళ్ళి సంబంధం చూశారు—" అంది.

"వొక్కటేనా!" అని నవ్వాడు.

"పెళ్ళి మాటెత్తగానే అట్లా పరిహాసం లోకి దిగుతారేం బాబూ!"

"వో పాతిక సంబంధాలు చూసి— వో శుభ దినాన వాళ్ళందర్నీ వరసగా నుంచోబెడితే—పోనీ కూచోబెడితే—వచ్చిన మేరకి వాళ్ళలో కొం దర్ని సెలక్టు చేసుకుని చేసేసుకుంటాను. కొందర్నంటే—చట్టం వొప్పుకోదు కదా—వెనకటి కాలంల్లో యీ సదుపాయం వుండేది. సీమ వాళ్ళొచ్చి యెగర

గొట్టేశాడు"

"చాలా మంచి సంబంధం అంట"

"మరింకేం శుభం. మంచి రోజు చూసి— యివ్వాళేం రోజు—" అని గోడమీది తెలుగు కేలండరు లోకి చూస్తూ, "శుక్రవారం డిశంబరు యిరవై యెనిమిది — డిశంబరూ గిశంబరూ మ్లేచ్ఛం కదూ— వూఁ— మార్గశిరం, ఆఖరి రోజు, అదే నుదుట సాదుబొట్టు లాగా ముచ్చటగా అమావాస్యచుక్క—చెడ్డరోజైతే కూడదు, మంచిరోజైతే గ్రహబలం ప్రతికూలిస్తే చిక్కొస్తుంది. యీరెంటికీ అతీతమైంది అమావాస్యచుక్క. అపధువు చుక్క అంతచక్కగానూ వుంటుందికదా. అమావాస్యపుట్టైతే ఆజన్మాంతం పుట్టుమచ్చలాగా చెరక్కుండా చెక్కుచెదరకుండా వుండిపోతుంది"

లోన గదిలో పసిబిడ్డ యేడుపు.

"వాపే బాబు లేస్తున్నాడు చూడు" అంది కూచునే.

"మా అమ్మగారు యిలా అని చెప్పమన్నారా? నీతో మాటల సందర్భంలో అంటే నువ్వు చెబుతున్నావా?" అన్నాడు.

పనిపిల్ల వొచ్చి తీసుకున్నట్లుంది— యేడుపు ఆగిపోయింది.

"రెండూను మూడోసంగతి వెంటనే వొచ్చి వెళ్ళమని చెప్పమని చెప్పారు"

"చీటికీ మాటికి వెళ్ళిరావటం నాకు సరిపడదు. వో చుక్కని చూసి అన్ని యేర్పాట్లూ చేసి టెలిగ్రాం యిస్తే ఆ ఘడియకి వెళ్ళి పుస్తె కట్టేసి వొస్తాను" అని నవ్వాడు.

"పల్లెటూరి నాటుపిల్లేం కాదు. సినిమా స్టారులా అందంగా వుంటుందట" అంది.

"సినిమా స్టార్లు అందంగా వుంటారా?"

"మీతో యేది మాట్లాడాలన్నా కష్టమే బాబూ"

"లేదు రమా. తెలియక అడుగుతున్నాను. సినిమాస్టార్లని నేనెప్పుడూ చూడలేదు, వాళ్ళు పొద్దున్నే మంచం మీంచి లేవగానే—"

రమాదేవి లోపలికి వెళ్ళి ఫ్రిజ్ తెరిచి జ్యూస్ కలుపుకొచ్చింది— రెండు గ్లాసులు.

"ఐతే యెప్పుడు వెళతున్నారు?" అంది.

వో గుక్క వేసి, "తురక నగరంలో వుంటున్నాను కాబట్టి అమా

వాప్యే శ్రేష్ఠమైన రోజా. కానీ ముందు యీ శరీరాన్ని శుద్ధి పరచటం భావ్యం. ఢిల్లీపట్నం వెళ్ళి యూరిన్ థెరపీ చేయిస్తాను. ప్రస్తుతం అది మొరార్జీ రాజౌషధం." అని లేవబోయాడు

"కూర్చోండి వెళ్దురుగాని"

"నీకు నిద్ర చెరుపు నాకు సిటీలో నాలుగింటికో మహా మిడతగాణ్ని కలుసుకోవాల్సిన పనివుంది. పని నాక్కాదు వాడికి" అని బయటికి వొచ్చాడు శ్రీపతి.

నడుస్తున్నాడు.

"హలో శ్రీపతీ"

"హలో చక్రధరం"

....హలో వక్రధరం — వీడు ఆ మింగుడు ప్రొఫెసర్ గాడి వుంపుడుగాడు. క్రితం నెల స్టూడెంట్లు ఆ మింగుడుగాణ్ని బెదిరించినప్పుడు. తన్నారని సాక్ష్యం యిచ్చాడు. ఆ ప్రొఫెసర్‌కంటే వీడింకా ఘోరమైన వాడు అందుకే వీడికి లెక్చరరుద్యోగం యిప్పించాడు. అసలు, బెదిరించాల్సింది.... బెదిరించటం కాదు, చితకతన్నాల్సింది వీణ్ని.... ...

బస్సెక్కాడు. ఖాళీగా వుంది.

— ఖాళీబస్సు యెండుటాకులా వడుస్తుంది. పదేళ్ళు కాపరం చేస్తే అందరూ యెండ టాకులే— —

కోఠీలో బస్సుదిగి మరో బస్సెక్కాడు.

— ఆ కడుపుతూన్న వృద్ధవడుచు — మెనో పాస్టల్ ప్రెగ్నెన్సీ ప్రెగ్నెంట్ బై ప్రెగ్నెంట్ విత్ — ప్రెగ్నెంట్ — వాడెవడో వెనక సీట్లో వగ్రవాదుల నినాదాల తుపాకులు పేలుస్తున్నాడు. యెవడు?

వెనక్కి తిరిగి చూశాడు.

— యెవడో రాధాపతి, యెవడికితెలుసు. యేదో శాస్త్రీయసాహిత్యం అంటూ వివరిస్తున్నాడు. శాస్త్రీయం అంటే సైంటిఫిక్‌అని కాబోలు. శాస్త్రీయ అవగాహన — మార్క్సిస్టు అవగాహన. శాస్త్రీయం అంటే మార్క్సియన్. మార్క్సియన్ కానిది అశాస్త్రీయం. బుగిలిన అరిస్టాటిల్ సిల్లొజిజం సిల్లీజిజం పిల్లజిజం చిల్లరిజం బస్సు కండక్టర్ల చిల్లరిజం చిల్లరజం — నాన్ మార్క్సియన్ ఫిజిక్సు సోషియాలజీ హిస్టరీ గట్రా అన్నీ అశాస్త్రీయం! అసలు, సాహిత్యం సైంటిఫికేంటి? కనీసం సిస్టమేటిక్ కూడా కాదు,

అలా అని ఖెయోటిక్ అనార్కికూ కాదు— స్పోంటేనియస్.... క్రియేటివ్ స్పోన్టేనిటీ సాహిత్యాన్ని సిస్టమేటిగ్గా సైంటిఫిక్గా పరిశీలించి విశ్లేషించి అవగాహన చేసుకోవటం వేరే సంగతి. అసలు సాహిత్యానికి కావాల్సింది, అనుభూతించటం. అనుభూతించాక పరిశీలించి విశ్లేషించి దొక్కచించి డోలు కట్టొచ్చు. చక్కరద్ది గుళికలివొచ్చు — యితగాడెవరో చాలా పెద్ద పెద్ద పేర్లు జారొదులుతున్నాడు నేమ్ డ్రాపింగ్లా——

బస్సు దిగాడు. పబ్లిక్ గార్డెన్ దగ్గిర. లోనకి నడుస్తున్నాడు.

పచ్చికమీద పీడవ వో సాయిబ్బు సంసారం.

— యీ సాయిబ్బుకి మదీనా బిల్డింగు పక్కన బట్టల షాపుంది. వాడు పత్నీవ్రతుడు....తన ముగ్గురి భార్యల్నీ తప్ప మరో ఆడదాన్ని కన్నెత్తి చూడడు. అవిగో మూడు బురఖాలూ — యీ బురఖా పద్ధతి వుండటం వొకందుకు మేలే. నానారకాల అనాకారి ముఖాల్ని చూడకండా తప్పుతుంది. వొక్కొక్కరికి ముగ్గురేసి చొప్పున తొమ్మిదిమంది— నవ రత్నాలు. కొన్ని ఆడరత్నాలు కొన్ని మగరత్నాలు. యిందుకే కాబోలు ఆరెస్సెస్ వాళ్ళ గోల—అటు ఆ పొద పక్కన ఆ కుర్రజంట — జానా బెత్తా. బెత్తెడు చోటు జానెడు గీటు జానా బెత్తకోనం బారెడు పడుగుచోటు లేదంటే చట్టం పోటు అందుకే పడరానిపాట్లు. యీ గార్డెన్ సూపర్నెంటు బొత్తిగా కామన్సెన్స్ లేనివాడిలా వున్నాడు. కొస్త పొదరిండ్లలా వుండే టట్లు చెట్లు నాటించితే వాడి సొమ్మేంపోను: కామన్ సెన్సు లేకపోయినా వోవర్ సెన్సు వున్నవాడై వుంటాడు. యేఁవోఁ, వాడి కూతురో వాడికొడుకో ఖర్మకాలి వాడి పెళ్ళామో యీ పొదరిళ్ళని వాడుకుంటే, పాపం—

"బాబూ పైసా ధర్మం—"

"దుక్కలా వున్నావు పని చేసుకోలేవూ?" అన్నాడు శ్రీపతి.

"దొరకకనేబాబూ యింటర్దాకా చదివీనుకూడా. యిలా సిటీకొచ్చి—యిక్కడా యే పనీ దొరికింది కాదు. దొంగతనాలకి దిగలేక యిలాగా బతుకు తున్నాను."

వో ఐదు నోటిచ్చి చక చకా నడుసున్నాడు శ్రీపతి.

—ఛ, యీ ప్రభుత్వానికి బుద్ధిలేదు. యీ ప్రజలకి బుద్ధిలేదు. దజన్ల కొద్దీ పిల్లల్ని యీని పడేస్తున్నారు. ఆ పైన గా దికింది పందికొక్కుల ప్రభుత్వం

నడుస్తున్నాడు. దారి పక్కన వడలూ చక్కిలాలూ అవీ బుట్టలో పెట్టుకుని అమ్ముకుంటున్న ముసలామె కాలికి శ్రీపతి బూటు తగిలింది.

'అయ్యో పాపం దెబ్బతగిలిందేమో' అనుకున్నాడు.

"నీ కాల్మొక్కుత బాంచన" అని తను అపరాధం చేసినట్లుగా అంది.

— పురాతత్వ శాస్త్రజ్ఞులు శ్రమపడి వెలికి తియ్యాల్సిన అవసరం లేకండా నిలిచిన తెలంగాణా ఫ్యూడల్ చారిత్రకఅవశేషం. యీ ఫ్యూడలిజం నవాబ్బాలకులు అబ్బించిన లక్షణం అనుకుంటాను. అన్నిటికీ వొంగి సలాం చెయ్యటం పౌరుల డ్యూటీ. duty. due tea.

కేంటీన్‌లోకి చొరబడి టీ తాగి బయటికి వొచ్చాడు.

వో జెండా కారు దూసుకుపోయింది రోడ్డుమీద.

— యే మినిష్టరు కారు? గోవర్ధన్‌రెడ్డి అసెంబ్లీలో చెన్నారెడ్డి గుడు గుడు గుంచంలో చేరాక రవికి కష్టాలు మొదలయ్యాయన్నారు — కష్టాలు. మినిష్టర్లు. మినిస్టర్ల కష్టాలు మినిష్టర్లవి — కార్ల లో కష్టపడి తిరుగుతూ — దేశసేవ — దేశ భక్తులు — దేశభక్తులు ....

నీలోఫర్ ఆస్పత్రి పక్క సందులో వో యింటి తలుపు తట్టాడు తెరుచుకుంది.

"రావోయ్‌శ్రీపతీ నీ కోసమే చూస్తున్నాను. యింతాలశ్యం చేశావేం" అని ఆహ్వానించాడు సూరపనేని బాపినీడు.

బాపినీడుకి నలభయ్ ఐదేళ్ళుంటాయి. బాపినీడుదీ శ్రీపతిదీ వొకే వూరు. యిటీవల ఆస్తి మరింత పెరిగాక రాజకీయాల్లోకి దిగి తెర వెనక రాజకీయాల్లో చేరాడు. రాజకీయ తార్పుడు పని. అసెంబ్లీ సభ్యుల క్రయవిక్రయాల పనిలో వున్నాడు. ప్రత్యేకం చెప్పకపోతే పదిశాతం కమీషను. సందర్భాన్నిబట్టి ముప్పయ్‌శాతం కూడా పుచ్చుకుంటూ వుంటాడు. "సి.యం యెవడైతే మనకెందుకు? మన యిల్లు మనం చక్కబెట్టుకోవాలిగానీ, కుర్చీ యెక్కి నానావావూ చాపటం తెలివితక్కువతనం" అంటూంటాడు.

"రావోయ్ శ్రీమతీ" అన్నట్లుగా అనిపించి శ్రీపతి నవ్వుకున్నాడు.

— శ్రీమతైతే చీకూ చింతావుండదు. మొగుడుతెస్తే వుడకెయ్యటం. కడుపుచేస్తే కనటం.... చస్తే ముండమొయ్యటం....

"యేంటో పరధ్యానంగా వున్నట్లున్నావు. కూర్చో. నేను రాత్రికి

మనూరెళ్తన్నాను. మీ అమ్మగారికేఁవన్నా చెపుతావా? మొన్న వొకసారి దివాణావి కెళ్తే, నిన్నుచూసి క్షేమసమాచారాలు తెలుసుకోమని చెప్పారు" అన్నాడు. మనిషియెక్కడికో బయల్దేరుతున్న తొందరలోవున్నట్లున్నాడు.

"హోటల్ యెమరాల్డ్‌లో కొత్త పనుంది. రా వెళదాం. కారులో మాట్లాడుకోవచ్చు"

బయల్దేరారు.

కూచున్నాడు. బాపినీడు కారు స్టార్టుచేస్తూ, "యింకా యెన్నాళ్ళుంటావ్ పెళ్ళి పెటాకులు లేకుండా?" అన్నాడు.

"నీ కూతుర్నిచ్చి చేసేదాకా."

"అది యింకో నాలుగేళ్ళన్నా ముందు పుట్టుంటే అట్టాగే యిద్దును. కానీ—డబ్బంటే యియ్యగలను కానీ—మీఅమ్మగారికి కావాల్సినవియెక్కడ నుండి తెచ్చేది!" అని నవ్వాడు.

'వీడు అంబోతు వీడి కూతురుచింబోతు అవుతుంది.' అనుకుని నవ్వుకున్నాడు శ్రీపతి.

కారు హోటల్ యెమరాల్డ్ ముందు ఆగింది.

లోనకి వెళ్ళారు. మొదటి అంతస్థులో గది. ఐదారుగురు కూచుని వున్నారు. వాళ్ళెవరూ శ్రీపతికి తెలియదు శ్రీపతి వాళ్ళకి తెలియదు.

బాపినీడు పరిచయం చెయ్యలేదు

అప్పటికే—సీసా, గ్లాసులు—సామగ్రి అంతా సిద్దపరిచి వుంది.

"యింతాలిశ్యం చేస్తే యెట్టా? మళ్ళీ సాయంత్రం యేడు గంటల బస్సులో యెల్లాలన్నావుగా?" అన్నాడు వో కోరా రంగు ఖద్దరు పంచా చొక్కా తువ్వాలతను.

గ్లాసులో విస్కీ పోసి, సోడాతో నింపుతున్నారు.

"మీరిది పుచ్చుకుంటారా? మీ బ్రాండేదో తెలీదు" అన్నాడువొకతను శ్రీపతితో.

"యేదైనా పర్లేదు. కంపెనీ కోసం, అంతే." అన్నాడు శ్రీపతి.

రాజకీయం విషయాలు మాట్లాడుతున్నారు. సి యం. యింత సంపాదించాడు, ఫలానా మంత్రి యింత సంపాదించాడు, ఫలానా మంత్రి ఫలానా దాన్ని వుంచుకున్నాడు వంటి కబుర్లు.

"శాస్త్రీ తింటావుగా కోడిమాంసవేఁ" అన్నాడు బాపినీడు.

"యిప్పుడు కుక్క మాంసమైనా బాగే సెయ్యగలను" అని పకపకా నవ్వి రెండు ముక్కలు నోట్లో వేసుకుని చప్పరించి నమిలి, విస్కీ వో గుక్క వేశాడు అతను.

"మన రామరాజుది పెద్ద పట్టులే. ఆడికి కోడి మొత్తం లేకపోతే ఆనదు."

మళ్ళీ రాజకీయాల కబుర్లు. ప్రస్తుత ప్రభుత్వం నుంచి గత వెంగళరావు ప్రభుత్వం కబుర్లు మాట్లాడుతున్నారు.

శ్రీపతి గ్లాసులో మొదటి రౌండు పోసిందే అలా వుండిపోయింది. నామమాత్రంగా వో గుక్క వేస్తున్నాడు అప్పుడప్పుడు.

"మన జిల్లా హరిజన మంత్రిని పీకించేసెయ్యాలి....కొమ్ములొచ్చినయ్. కోటా యేడిసింది కాబట్టి చేసేది లేదు. యింకో హరిజనుడికి యిప్పించుదాం. మనకి బాగా పనికొచ్చేవాణ్నెవణ్నన్నా చూడాలి" అన్నాడు బాపినీడు.

"కాలం మారిపోయిందిరా బాబూ—యిప్పుడు ఆళ్ళు మన మాటినేటట్టు లేరు. ఆళ్ళ మాట మనంవినాలన్నట్టుగా వుంది" అన్నాడు కోరాఖద్దరు బట్టలతను.

శ్రీపతి గ్లాసు పోసింది పోసినట్టుగానే వుంది.

అందరూ లేచారు.

"ప్రభుత్వం పొదుపు వుద్యమం చేపట్టింది. యేదీవేస్టుచెయ్యకూడదు. అందునా తీర్థం. దేవుడు క్షమించడు" అని వొకతను వొంగి శ్రీపతి వొదిలేసిన గ్లాసు అందుకుని గటగటా తాగేశాడు.

అందరూ బయటికొచ్చారు. కార్లో బయల్దేరారు. శ్రీపతి తనకి పనుందని వుండిపోయాడు అక్కడే. "మంచిది యీసారొచ్చినప్పుడు మళ్ళీ కట్దాం" అని బాపినీడు కారు స్టార్ట్ చేశాడు.

యెమరాల్డ్ హోటలు సందు దాటి రోడ్డుమీదకి వొచ్చి చైనీస్ రెస్టోరాం పక్కన నుంచున్నాడు శ్రీపతి.

యెదురుగా మూలమీద సినిమా బోర్డులు

—యీ బాపినీడుకి కొన్ని సినిమా పంపిణీసంస్థల్లో వాటాలున్నాయి భూములున్నాయి ఆ పైన రాజకీయం ప్రోకరింగుంది. మా భూములు పీడి చట్టానికే కొలుకిట్టి వందువల్ల మహా యిది వొలకబోస్తుంటాడు.... ఆ

అమ్మడు ఆ వాల్‌పోస్టరు మీద మహా వాగులు పోతోంది—మరికొస్త బట్ట కప్పుకుంటే యేం పోతుంది? లేదూ ఆ కొస్త తీసేస్తే యేం పోయింది? రాఖీ అమితాబ్ కస్మేవాదె—వయసు పిలిచింది—వయసు పిలుస్తోంది—వయసు లక్షణమె అంత—మస్లెష్టవ్వ్వ—ప్యాసాని అంతకంటే ఘోరంగా ఖూనీ చెయ్యటం యింకెవరికీ సాధ్యం కాదు. ఆ కవి ఆ గురుదత్తే వుండాలి. వేశ్య ఆ వహీదానే వుండాలి. ఆగాహ ఆరసగుల్లా మాలాసిన్హానే వుండాలి. ఆ సినిమా అలాగే తియ్యాలి. ఆ పాట అలాగే వుండాలి. కాదంటే యింకా బాగా తీసి బోరు కొట్టించా వొచ్చు........

"హలో శ్రీపతీ"

"హలో మునిరెడ్డీ, యెప్పుడొచ్చావు? రిసెర్చి వెలిగిస్తున్నావుగా తిరుపతిలో—కాలేజీ లేదూ?"

"క్లోజ్ చేసినారు. పేపర్లో చూడలేదా?" అన్నాడు మునిరెడ్డి

"అవును చూశాను. స్టూడెంట్లు తన్నుకున్నారా? యిక్కడి స్టూడెంట్లలాగా పరస్పరం యెదురుపడి తన్నుకుంటే బావుంటుంది; కిరాయి రౌడీలతో వాళ్ళని వీళ్ళూ వీళ్ళని వాళ్ళూ తన్నించటం రాణింపుగా వుండదు, విలువగా వుండదు...."

"రా, టిఫిన్ చేదాం ఆకలిగా వున్నది అన్నపూర్ణకి పోదామా లేక—"

"యెదురుగా తాజ్ కనిపిస్తోందిగా పద దాన్లోకి" అన్నాడు శ్రీపతి.

వెళ్ళారు తాజ్‌లోకి.

శ్రీపతి యేమీ తిననన్నాడు.

"నీవు లాలో చేరినావటకదా?" అన్నాడు మునిరెడ్డి.

"అవును!"

"ప్రాక్టీసు చేస్తావా?" అన్నాడు. భుజానికున్న షోల్డర్ బ్యాగ్ పక్కకుర్చీలో పెడుతూ.

"వొకటి నర్జిక్షుల ప్రాక్టీసులు పూర్తయ్యాక"

"యెవరెవరేమి చేస్తున్నారు?" అన్నాడు మునిరెడ్డి.

శ్రీపతి, కొందరి గురించి చెప్పాడు

మునిరెడ్డి తినటం ముగించాడు.

"ప్రైవేట్ కంపెనీలో యింటర్వ్యూ వుంటే వొచ్చినాను!

"దేన్లో?"

చెప్పాడు.

"యిప్తే రిసెర్చేం చేస్తావు?"

"వొదిలేశా"

కాఫీ—రెండు కప్పులు

"పెయింటింగ్ నేర్చినావటకదా?"

"నేర్చలేదు. నేర్చబోయి మానేశాను."

"యీసారి వొచ్చినప్పుడు నీ పెయింటింగ్స్ చూస్తాను. యేడుగంటల బస్సులో విజయవాడ పోవాలి. అక్కడ పని వున్నది. రేపు తిరుపతిలో అక్కడనుండి పోతాను." అని లేచాడు మునిరెడ్డి.

ఆరు గంటలు.

బయటకొచ్చారు, మునిరెడ్డి రిక్షా యెక్కాడు.

శ్రీపతి యెడమవైపుకి తిరిగి, కాలిబాటమీదనడుస్తూ జనాన్ని చూస్తూ ఆగుతూ—నడుస్తూ—

వో కారులోంచి శ్రీపతిని చూసిన వొకతను—బుర్రలో ఆలోచన మెరవగా కారు ఆపించాడు అందులో వొక స్త్రీ, యిద్దరు మగవాళ్ళు వున్నారు.

కాలిబాట మీద తాపీగా నడుస్తున్న శ్రీపతిని చూపెట్టి వాళ్ళు చెయ్యాల్సిన పని చెప్పాడు.

అతను—వెనక చిన్న పిల్లని యెత్తుకుపోబోయిన యిద్దరిలో టీ షర్టతను. ఆ తరవాత వాళ్ళు శ్రీపతి యెక్కడున్నా తారసపడతాడేమోనని చూశారు, అప్పుడప్పుడు గుర్తొచ్చి. వాళ్ళు పూర్ణమహల్ ముఠాలో వాళ్ళు. వాళ్ళది దాన్లో మూడోతరగతి స్థాయి.

ఆ తరవాత ఆరు నెలలకు వో సందర్భంలో అరెస్టయ్యారు, మరో యిద్దరితో. ఆ సూటతను తప్పించుకు పారిపోయి బొంబాయిలో బ్రాంచిలో పనిచెయ్యటం ప్రారంభించాడు. మిగతావాళ్ళు శిక్ష ముగిసిన మీదట యేడెనిమిది నెలల క్రితం జైలునుంచి విడుదలయ్యారు.

అందరూ కారు దిగారు.

"నువ్వు రావా?" అన్నాడు వొకతను.

"నన్ను చూస్తే వాడు పరుగో పరుగు" అని పకపకా నవ్వాడు, టీ

షర్టతను.

"పారిపోకుండా నేను పట్టుకుంటాలే!" అని చిన్నగా నవ్వింది ఆ స్త్రీ.

ఆ యిద్దరూ నిమ్మదిగా అడుగులు వేస్తున్నారు. టీ షర్టతను కాసేపు ఆగి అడుగులో అడుగు వేస్తున్నాడు. ఆమె చకచకా అడుగులు వేస్తోంది, శ్రీపతివైపుకి.

'దీన్ని కూడా పోలీస్టేషనుకి తీసుకెళ్తే దాని జాతకంతో పాటు అందరి బతుకులూ బయటపడతాయ్' అనుకుని, ఆమెని పిలిచి చూడకా వెళ్ళి "ఆ వెంటనే నువ్వు ఆటోలోనో రిక్షాలోనో వెళ్ళిపో. అక్కడి వుండొద్దు" అన్నాడు.

ఆమె శ్రీపతివైపు చకచకా నడిచి రెండు నిమిషాలలో శ్రీపతికి పక్కగా అడుగులు వేస్తోంది. సన్నగా పొడవుగా వుంది.

ఆ యిద్దరూ వీళ్ళకి కాస్త వెనకగా వున్నారు.

"గుడ్ యీ వెనింగ్ మిమ్మల్నెక్కడో చూసినట్లున్నాను" అంది

శ్రీపతి తల రవంత పక్కకితిప్పి, "క్వొయిట్ పాసిబుల్ — భారత దేశంలో యెక్కడైనా చూసివుండొచ్చు — యీ వూర్లో యీ వీధుల్లోనూ చూసి వుండొచ్చు" అన్నాడు.

"మీరు భలే మాట్లాడతారు. యిప్పుడు గుర్తొస్తోంది మిమ్మల్నెక్కడ చూసిందీ" అని సన్నగా నవ్వింది.

పక్కకి తిరిగి ఆమె మొహంవొంక చూశాడు. ఆమె కళ్ళలో వ్యాపారపు చపకలాకు తళుకు కనిపించింది.

"మీ సంగతేమోగానీ నన్ను మీ రెక్కడైనా చూశారంటే యే లంజల కొంపల్లోనో చూసివుండాలి." అన్నాడు

"అది అసంభవం. పెర్సీస్ న్యూయియర్ పార్టీ చూశాను" అంటి నడుస్తున్నారు.

ఆబిడ్స్ సెంటరుకివొచ్చారు. శ్రీపతి నిలుచుని జనాన్నిచూస్తున్నాడు. ఆమెకూడా నిలుచునిపోయి, "యెంతో చక్కని సాయంత్రం" అంది

"చక్కనో బుక్కనో — యీ సెంటర్లో యీ రద్దీలో సాయంత్రాలెప్పుడూ యిలాగేవుంటాయి" అన్నాడు

ఆమె చటుక్కున శ్రీపతి చేతుల్ని తన చేతుల్తో గట్టిగా పట్టుకుని ముద్దు పెట్టుకుంటూ కెవ్వుమనిఅరిచి గింజుకున్నట్టుగా కద

క్షణకాలపు కేకముద్దా ముద్దుకేక. గమనించారు కొందరు. కానీ ముంజేతుల దగ్గిర ఆమె శ్రీపతి చేతులు పట్టుకోవటం యెవరూ గమనించ లేదు.

ఆ మరుక్షణం ఆ యిద్దరూ అతని పక్కకి వొచ్చారు. కొట్ట బోయి నట్లుగా చెయ్యి యెత్తాడు వొకతను. రెండో అతను మీదమీదికి వెళ్ళాడు— ఆమెకి మడుగు కల్పిస్తూ.

సిగ్గుతో కుంచించుకు పోయినట్లుగా తల వొంచుకుని వొంగి —ఆ పక్కగా వున్న ఆటోలో కూచునేసింది. ఆటో డుర్ డుర్ మంటూ కదిలి వెళ్ళిపోయింది.

అటు, కాలేజీ కుర్రాళ్ళిద్దరు గట్టిగా యీలవేశారు. యిటు, ముప్పయ్ ఐదేళ్ళకే ముట్లుడిగిన వొకావిడ అసహ్యంగా చూసింది. వొక యువతి ఆర్తిగా వాలు చూపు చూసింది. యింకో యువతి ముఖం చిట్లించుకుంది. వో నడివయసతను ఆసక్తిగా చూస్తున్నాడు. వో ముసలాయన బోసినోటితో యికిలించాడు.

ఆగిన కార్లు ఆటోలు స్కూటర్లు రిక్షాలు. సైకిళ్ళు—

"యెవరామె?" అన్నారు వొకరెవరో.

"యెవరైతేనేం పాపం. పరువుపోయిందిగా. సిగ్గుతో కుంగిపోయింది పాపం" అన్నాడు వొకతను.

"యిదింకా బావుంది. నాకి పాపిష్ఠి కీర్తి అంటగడుతున్నారా" అన్నాడు శ్రీపతి. పదిమంది పకపకా నవ్వారు.

'యిందులో యేదో తిరకాసు గొడవుంది. అదెవిత్తో యెవరు పుర మాయించారో' అని అనుకుని తన చుట్టూ పరికించాడు.

యెవరూ అనుమానించాల్సినట్లుగా అనిపించలేదు అతనికి. అప్పటికి వాళ్ళు జారుకున్నారు.

"అడకూతురి పరువూమానం తీసేశాడు. తన్నండిపట్టుకుని" అంటూ వో నడివయసతను వొచ్చాడు ముందుకి.

"తన్నటానికి నువ్వెవడివి? యీ దేశానికి ప్రభుత్వం వుంది. రాజ్యాంగం వుంది. యంత్రాంగం వుంది. పోలీసులున్నారు. లాఠీలున్నాయి. తుపాకులున్నాయి. కోర్టులున్నాయి." అన్నాడు శ్రీపతి.

"ఆయన పెండమేమో" అన్నాడు వో యువకుడు కొంటెగా.

"పెండ్లమయితే మాత్రం చౌరస్తాల ముద్దుపెట్టుకుంటారు?"

"గల్లీల పెట్టుకోవచ్చునా?" అన్నాడు యింకొకతను.

"గల్లీల కూడా పెట్టుకోరాదు. యింట్ల పెట్టుకోవాల"

"యింట్ల యాడంటె ఆడ పెట్టుకోవచ్చునా?"

"యింట్ల మంది వుంటె, బెడ్‌రూంల పెట్టుకోవాల"

"యేమి, బయట పెట్టుకుంటె యేమి? బయటయితే చేదుగుంటదా ముద్దు?"

"ము-ము-ముద్దంటే చేదా" అని పాట అందుకున్నాడు వొకతను.

అవతలకి జారుకున్న ఆ యిద్దరూ — పోలీసులకి చెప్పి వంపించారు. అప్పటికి టీ షర్టతను కారు నడుపుకొచ్చాడు. దాన్లో కూచున్నారు. వెళ్ళిపోయింది.

యిద్దరు పోలీసులొచ్చారు. వొకతను పొట్టిగా గుబురు మీసాలు. రెండో అతను పొడవుగా గద్దముక్కు.

పొడవుగా వున్న పోలీసు శ్రీపతి చెయ్యిబట్టుకుని, "చలోరే పోలీస్ నాకా కో" అన్నాడు.

"ముందు చెయ్యి విడుస్తావా ముక్కుపచ్చడి చెయ్యనా" అని రెండో చెయ్యి పిడికిలి బిగించాడు, శ్రీపతి.

"చలో చలో ఆంద్రాసాలా" అన్నాడు గుబురు మీసాల పొట్టి పోలీసు.

"అగర్ మె ఆంద్రా సాలా హోతో తుమ్ తెలంగాణా సాలీ" అన్నాడు శ్రీపతి.

ఆ మాటలు అర్థమైనవాళ్ళు ఫక్కున నవ్వారు.

గుబురు మీసాల పోలీసు గుర్రుగా చూశాడు. చెయ్యి పట్టుకుని నుంచున్న గద్దముక్కు పోలీసు నవ్వు ఆపుకుంటూ "బక్వాస్ మత్‌కర్" అని చెయ్యి గుంజాడు.

"చెయ్యి విడుస్తావా లేదా?" అన్నాడు శ్రీపతి.

పోలీసు చెయ్యి విడవలేదు. శ్రీపతి చెయ్యి పైకిలేచి, పిడికిలి పోలీసు ముక్కుమీద బలంగా తగిలింది.

"నీ యవ్వ చస్తిరా" అని చెయ్యి వొదిలేశాడు. ముక్కుకి చెయ్యి అడ్డుపెట్టుకున్నాడు. ముక్కునుంచి రక్తం చిమ్మింది.

జనంలో— కొందరు విస్తుపోతూ కొందరు కోపంగా కొందరు అసహ్యంగా కొందరు దుగ్గగా మరికొందరు మెచ్చుకోలుగా కొందరు యీర్ష్యగా కొందరు చీదరింపుగా— చూస్తున్నారు.

జనానికి అవతల వున్న గుర్లింగం, శ్రీపతి దగ్గిరికి రావటానికి ప్రయత్నించాడు గానీ వీలుపడలేదు.

గంజిపెట్టిన కాకీరంగు బెల్‌బాటం నిక్కర్ల పోలీసులు, కాకి చొక్కాల తెల్ల ప్యాంట్ల పోలీసులు—

"నాకా మే లేజావ్" అన్నాడు వో తెల్ల ప్యాంటు పోలీసు.

"చలో" అని చెయ్యి పట్టుకోబోయిన కనిస్టీబుని విదిలించి, "పదండి" అన్నాడు శ్రీపతి.

పోలీస్ స్టేషను.

బెంచీమీద కూచున్నాడు శ్రీపతి.

"అడ కూకుండు నేలమీద" అన్నాడు వో కనిస్టీబు.

"నువ్వు కూర్చో అక్కడ" అన్నాడు శ్రీపతి.

"నేనేమిటిక్కి కూకుండాలె?"

"నేనుమాత్రం యెందుకు కూచోవాలి నేలమీద"

"యేమిటోక్కి, జరంత ఆగు యెర్కైతది. యస్సై సాబ్ రాంగనె నీకు లగ్గం శురూ ఐతది."

"మీ యస్సై యేడీ?"

"యస్సై సాబ్ అనాల. లేకుంటె.......…"

"అదేం కక్కుర్తి? మగవాణ్ణి"

అంతలో మోటారు సైకిలు వొచ్చి ఆగిన మోత. యస్సై లోనకి వొచ్చాడు.

పోలీస్ సెల్యూట్ చేసి, "సాబ్, యిగో, యె హరామ్‌కా బచ్చా ఆప్‌కో గాలియా దేగయ్" అన్నాడు.

గుబురు మీసాల పోలీసు, "వాన్ని ముక్కుమీద కొట్టిండు" అన్నాడు.

"యీజ్ యిట్ సో?" అన్నాడు.

"యే సంగతి?" అన్నాడు శ్రీపతి.

"వాన్ని ముక్కుమీద కొట్టినావా? అదేమి, నెత్తురుగూడ వొస్తున్నది" అన్నాడు యస్సై.

"కాలు జారి బొక్క బోర్లా పడిపోయినా చితికినా నెత్తురొస్తుంది. కానీ నేనేకొట్టాను."

"పోలీసుని కొడితే నేరమని తెలుసా?" అన్నాడు యస్సై యింగ్లీషులో.

"వాడు ముందు నేరం చేస్తే నేను నేరం చేశాను"

"యేమి నేరం చేసిండు?"

"పారిపోతున్న దొంగని పట్టుకున్నట్లు పట్టుకుని బూతులు కూశాడు. అందుకు కొట్టాను."

"ఐనా తన్నకూడదు. లా వుంది" అన్నాడు యస్సై యింగ్లీషులో.

"లా పోలీసులకి కూడా వుంటుంది"

టెలిఫోను మోగింది. యస్సై అందుకుని, "మర్డరా? యాద— వొస్తున్నా" అని ఫోను పెట్టేసి, "ఫోర్ నాట్ త్రీ, టు థర్టీటూ, మీరు రాత్రి రిక్షాలో" అని ఆర్డరు చెప్పి వడివడిగా బయటికివెళ్ళి మోటార్ బైక్ స్టార్టు చేశాడు ఒక కనిస్టేబుని వెనకాల కూచోబెట్టుకుని.

పోలీస్టేషనులో యిద్దరు పోలీసులున్నారు బయట తుపాకీపుచ్చుకుని వున్నతను కాక.

మూడు గంటలు గడిచాయి.

పదింబావు

ఆ సెంటరులో అప్పుడు శ్రీపతి తెలిసిన వాళ్ళు నలుగురైదుగురు వున్నారు. యెంత సిటీ ఐనా రెండుగంటల వ్యవధిలో వూరంతా పాకిపోయింది వార్త—టెలీఫోన్లలో బస్సుల్లో—శ్రీపతి బాగా తెలిసిన వాళ్ళందరికీ తెలిసింది.

"అబ్బాయ్ పోలీసెంకటసామీ—" అన్నాడు శ్రీపతి.

"యేమి దిల్లగిగున్నదా?" అన్నాడు వొచ్చి.

పదినోటు తీసిచ్చి, "నాకు టీ పట్రా, నువ్వు బిరియానీ తిను" అన్నాడు.

"హీఁహీఁ" అని యికలించాడు.

గంటపావు గడిచింది.

కారు ఆగిన చప్పుడు.

కారులోంచి వందన దిగింది. చకచకా లోపలికి నడిచింది. ఆమె

చూస్తే, కనిష్ఠబుకి అటకాయించే ధైర్యం చిక్కలేదు.

లోనకి వొచ్చింది. కుర్చీలో కూచుంది.

రెండు నిమిషాల మౌనం.

"యెందుకట్లా చేసిన్రు?" అంది, బాధగా చూస్తూ.

"యేమో. తెలియదు. అనిపించింది"

"నలుగురూ యేమనుకుంటారు! శ్రీపతిగారు యిట్లా — అని చెప్పుకుంటూంటే నేను—" అని యింగ్లీషులో అంటూ ఆగిపోయింది. ఆమె కళ్ళలో తడి.

"వున్నమాట అనుకోవటంలో విశేషమేం వుంది?" అన్నాడు.

వొక నిమిషం మౌనం.

"వీళ్ళు కోర్టులో కేసు పెడతారు. జైలు శిక్ష పడుతుంది" అంది.

"అవును పడుతుంది. చేసిన పనికి ప్రతి చర్య వుంటుందిగా — తాను చేసిన పని తనవరకే పరిమితం కానప్పుడు — చట్టం ఆమోదించని అంశం అయితే అంతేగా మరి"

"తెలిసి యెందుకు చేశారు నడివీధిలో! ఆమె పరువు మాటెట్లావున్నా మీరు— యెంతో విలువైన మీరు. నేను భరించలేకండా వున్నాను. అబ్బా అసలెందుకు చేశారిట్లా?"

"యెందుకూ కాదు. వూరికే —చెయ్యాలనిపించింది ఆ క్షణాన"

"క్షణికోద్రేకానికి లొంగిపోయి— తరవాత"

"క్షణికోద్రేకమూ లేదు. దీర్ఘోద్రేకమూలేదు. ఫన్నీ. కోర్టులో తెలుస్తుందిలే. రిగ్రెట్ దేనికి?"

"జైలు శిక్ష"

"పడనీ"

"నేను మా నాన్నగారికి చెప్పి విడిపించుతాను"

"నాకిష్టం లేదు."

"శిక్షపడటం యిష్టమా?"

"అదీకాదు."

"మరి?"

"యెవరూ యేమీ చెయ్యక్కర్లేదు. యిందులో మీరు కల్పించుకోవటం నాకిష్టంలేదు"

"మీకిష్టంలేని పని నేను చెయ్యలేను యిదేకాదు మీరు మానెయ్య మంటే డాన్స్‌కూడా మానేస్తాను. దయచేసి నన్ను మా నాన్నగారికి చెప్పి విడిపించనివ్వండి"

"వొద్దు వందనా. నేనేదో చేస్తే మీరు తప్పించటం యేమిటి? నేను చేసినదానికి నేనే బాధ్యత వహించటం గౌరవప్రదం"

మూడు నిమిషాల మౌనం.

"అంతే నంటారా?" అంది తెలుగులో.

"అంతేగా మరి."

"ఐ కాన్ట్ బేర్ దిస్- -" అంటూ లేచి తల వొంచుకుని వేగంగా నడిచింది బయటికి.

రాత్రి పదకొండున్నర.

భోజనం తెచ్చి పెడతామన్నారు పోలీసులు, "ఆకలిగా లేదు. మరో చాయ్ తెచ్చిపెట్టండి" అన్నాడు.

పన్నెండింటికి ఆ బల్లమీదే పడుకున్నాడు. తల కిందకి వో దుప్పటి మడిచి యిచ్చారు. నిద్రపోయాడు కాసేపటికి.

చలి. పాత వులెన్ వోవర్ కోటు కప్పారు పోలీసులు.

వుదయం యెనిమిదింటికి వొచ్చాడు యస్సై శ్రీపతి యింకా నిద్ర పోతూనే వున్నాడు.

"వీడేమి రాజాసాబోలే నిద్రపోతున్నాడు నాకాల" అన్నాడు యస్సై.

అంతలో టెలిఫోను మోగింది అందుకున్నాడు.

"యస్సార్" అంటూ చటుక్కున లేచి నుంచుని, "యస్సార్— వున్నాడు సార్—బాగానే ట్రీట్ చేశారు సార్. రాత్రంతా నేను లేను సార్. నో సార్—కేస్—మర్డర్— సార్ — యింకా నిద్ర లేవలేదు సార్. యస్సార్— అట్లాగే సార్." అని యింగ్లీషులో మాటాడి, ఫోను పెట్టే శాడు. చలికాలం వుదయం యెనిమిది గంటలవేళ ముఖానికి పట్టిన చమట తుడుచుకుని శ్రీపతి దగ్గిరికి వెళ్ళి, చేతో చిన్నగా తట్టి, "ప్లీజ్ గెటప్‌సార్" అన్నాడు యస్సై.

కళ్ళు తెరిచి యస్సైని చూసి, "అప్పుడే తెల్లారిందా" అన్నాడు.

"యెనిమిదిన్నర. లెండి కూర్చోండి. యిట్లా కుర్చీలో" అన్నాడు

గిమటో. వాక కపి

'యెక్కడో యేదో జరిగినట్లుంది. పోలీసుబుద్ధి వొదిలేసి సివిలు మాటలు మొదలెట్టాడు' అనుకుంటూ కుర్చీలో కూచున్నాడు. శ్రీపతి.

"యిక మీరు వెళ్ళొచ్చుసార్" అన్నాడు యింగ్లీషులో.

"అదెలా? కేసుకదా?"

"కేసూలేదు యేమీ లేదు."

"నడిబజార్లో అంతమంది సమక్షంలో విషయం. కేసు లేకపోతే రేపు ప్రజలు మిమ్మల్ని యేకిపారేస్తారు"

"కేసెడితే నా వుద్యోగం సాయంత్రానికల్లా వూడిపోతుంది సార్."

"యేఁవిఁటి సంగతి?"

"పైనుండి టెలిఫోను ఆర్డర్స్"

"యెవరు?"

"పై ఆఫీసరు"

"యే ఆఫీసరు?"

"అది కూడా చెప్పటానికి వీల్లేదట"

'వందన చేయించిందా? వుఁహూఁ, వందన నా మాటకి వ్యతిరేకంగా చెయ్యదు' అనుకున్నాడు శ్రీపతి.

"నేరంచేసినప్పుడు శిక్షించడటం పోలీసుశాఖవారి కర్తవ్యం" అన్నాడు శ్రీపతి.

"సాబ్ హమ్మల్ని చంపకణ్ణి" అన్నాడుయస్సైతెలుగులో ప్రాధేయ పడుతున్నట్టుగా"

"అంమనా నేమూలా స్టూడెంటుని. చట్టాన్ని అతిక్రమించినప్పుడు స్వయంగా శిక్షకి సిద్ధపడాలి" అన్నాడు శ్రీపతి.

కనిస్టేబు తెచ్చిన టీ అంసుకుని, "పుచ్చుకోండి సాబ్" అని శ్రీపతి ముందు పెట్టాడు.

శ్రీపతి టీ తాగుతూ, "టీ పుచ్చుకోవటంలో దోషం లేదు. కాగా, లాకప్‌లో వున్నప్పుడు అన్న పానాదులు పోలీసువారే చూడాల్సి వుంటుంది" అన్నాడు.

మరి కొంచెంసేపు యస్సైని యేడిపించి, బయటికొచ్చి బస్సెక్కి తిన్నగా హాస్టలికి వొచ్చాడు.

మూగాటి

"వొదిలేసిగ్రా? యెట్లా? లంచమిస్తివా?"

"వెళ్ళమని బతిమిలాడారు. ఫోనంటె లంచమిచ్చేలాగా వున్నారు. లంచం పట్టటం చాతకాక పుట్టిగానే వొచ్చేశాను" అన్నాడు.

స్నానించి— గదిలో గుప్పటి కప్పుకుని పడుకున్నాడు నిద్ర పట్టేసింది.

నిన్న సాయంత్రపువార్త ఆ రాత్రి తొమ్మిదింటికి తెలిసింది. స్వప్న రాగలీనకి. తెలిసిన గంటన్నరకి వాళ్ళ పింతండ్రి నాగిరెడ్డికి ఫోను చేసి, "బాబాయ్ నాకో చిన్న పని చేసిపెడతారూ?" అంది.

"చెప్పు తల్లీ. యేనాడూ నోరు తెరిచి, యిదికావాలీ అని నన్నేకాదు యెవరినీ అడగలేదు నువ్వు. యేం కావాలో చెప్పుతల్లీ" అన్నాడు నాగిరెడ్డి.

"నువ్వు చాలా విసుమంగా రూల్స్ పాటిస్తావని నాకు తెలుసు. కానీ యిది నాకు తప్పనిసరి విషయం. పోలీసు డిపార్టుమెంటుతో పని. మీకు నచ్చకపోవచ్చు. మంచిచెడుల ప్రసక్తి కాదు. వొక వ్యక్తి పోలీస్టేషన్లో వున్నాడు వొదిలెయ్యమనాలి."

"నేరాన్నిబట్టి వుంటుందిగా? సాధ్యంకానిదైతే యేమీ చెయ్యలేం—"

"సాధ్యం కానిదేం కాదు. అతను వొక స్త్రీని ఆబిడ్స్ సెంటర్‌లో ముద్దుపెట్టుకున్నాడు. పోలీస్టేషన్లో వున్నాడు

"ఆమె కేసు పెడితే—"

"ఆమె కేసు పెడితే వేరే సంగతి పెట్టరు మన సమాజంలో" అంది

"యెవరమ్మా అతను. మెంటల్ కేసా?"

"కాదు మా యిద్దరికీ బాగా సన్నిహితంగా తెలుసు. వివరాలు తెలివు. కానీ అతను అసభ్యంగా ప్రవర్తించడని పూర్తి నమ్మకం పోలీస్టేషన్లో కూడా యెవరు చెప్పించిందీ తెలియరాదు కేవలం పై అధికారి నుంచి ఆర్డర్స్ వొచ్చాయి —అని మాత్రమే చెప్పాలి. సాధ్యపడుతుందా బాబాయ్?" అంది

"వెరీ సింపుల్ కానీ చాలా ఫన్నీగా వుంది ఆ స్త్రీ కూడా సీన్లో వుండనప్పుడు పెద్ద సమస్య కాదులే" అన్నాడు నాగిరెడ్డి.

శ్రీపతి నిద్రపోతూనే వున్నాడు వొంటి గంట

జనం—తలుపు తీసి, శ్రీపతి నిద్రపోవటం చూసి మళ్ళీ తలుపు దగిరికి లాగిపోయారు

సాయంత్రం ఐంది.

"స్లీపింగ్ పిల్స్ యేమన్నా మింగి చచ్చిపోయుండేమొ! అని వొక తను అనుమానం వ్యక్తపరిచాడు.

అమాంతం గదిలోకి చొరబడ్డారు నలుగురు.

శ్రీపతి, నిద్రపోతున్న శ్వాస కదలిక.

చేత్తో తట్టి లేపారు.

కళ్ళు తెరిచి, "హలో" అన్నాడు శ్రీపతి.

"యేమి— యెంత సేపటినుండి నిద్ర?"

"నిద్రకి యెంత సేపనేవుంది? పడుకుంటే నిద్రొచ్చింది. నిద్రొస్తే పడుకున్నాను. లేవటం దేనికి నిద్రపడితే?" అన్నాడు శ్రీపతి.

ఆ రోజు పేపర్లో ఆబిడ్స్‌లో వో యువకుడు వొక యువతిని బహిరంగంగా ముద్దుపెట్టుకున్నాడు—అని. ఆ వివరాలు పత్రికా విలేఖరి యిచ్చినట్లు వుంది. పోలీసుల ప్రమేయం లేదు— శంఖుకో పొయ్యనిదే తీర్థం కానట్లు పోలీసులు సమాచారం విడుదలచెయ్యనిదే, అధికారికంగా నిజంకాదు. పోలీసుల రికార్డులో అసలు అలాంటి సంఘటన జరిగినట్లే లేదు.

రెండు రోజులు గడిచాయి.

మూడోరోజున రత్నాకరరావు వొచ్చాడు. వాళ్ళకి యీ విషయం తెలిసినా వొచ్చి పరామర్శించే విషయం కాదని రాలేదు.

"మీ అమ్మగారికి వొంట్లో బాగాలేదట." అన్నాడు రత్నాకరరావు.

"అలాగా అప్పుడప్పుడు అలాగే అవుతూ వుంటుంది, ఆవిడకి."

"సీరియస్‌గా వుందట"

"యెవరొచ్చారు?"

"మాకు టెలిగ్రాం వొచ్చింది. వెంటనే మిమ్మల్ని పంపమని. ప్లీజ్ బట్టలు సర్దుకోండి."

"అవసరం లేదు" అని వున్నపళంగా బయల్దేరాడు శ్రీపతి.

యింటి దగ్గిర చాలా జతల బట్టలు వుంటాయి.

రత్నాకరరావు స్కూటర్ స్టార్ట్ చేశాడు.

"బస్సులో వెడతాను. రైలు వుంటుంది యింకో గంటకి" అని స్కూటర్ మీద కూచున్నాడు.

"రమ కూడా వొస్తానంటున్నది" అన్నా

"వేరే పనుంటే సరే. యీమాత్రానికేఐతే తను అవసర.

స్కూటర్ ఆగింది.

గుమ్మంలో రమాదేవి. కళ్ళనిండా నీళ్ళు.

శ్రీపతిని చూసి మూతికి పమిటకొంగు అడ్డం పెట్టుకుంది.

యేదో అనుమానంగా అనిపించి, "టెలిగ్రాం యేది?" అన్నాడు శ్రీపతి.

"టెలిగ్రామా. టెలిగ్రామూ—రమా యెక్కడ పెట్టావు?" అని వెతికినట్లుగ అటూ యిటూ తిరిగి, "కనిపించటం లేదు. రైలుకి టైం అవుతొంది. టాక్సీ కోసం చెప్పాను—వొస్తుంది. అదిగో రానే వొచ్చింది" అన్నాడు రత్నాకరరావు.

టాక్సీ, రైలుస్టేషను, రైలు.

తెల్లవారుజామునికి విజయనాదలో వున్నారు. శ్రీపతి బస్టాండుకి ఆటో మాట్లాడుతూంటే, రత్నాకరరావు మధ్యలో అడ్డం వొచ్చి టాక్సీ మాట్లాడాడు నేరుగా వూరికి.

కూర్చున్నారు, అరగంట.

బంగళా ముందు టాక్సీ ఆగింది.

దిగారు.

ముఖాలు చూసి మునుముందు చూస్తూ లోపలికి వెళ్ళాడు శ్రీపతి.

బయటా యింటి నిండా జనం నిశ్శబ్దం.

యెవరో శ్రీపతి చెయ్యి పట్టుకుని మెట్లెక్కి- అతని తల్లి గదిలోకి—

మంచంమీద తల్లి—శాలువా కప్పివుంది.

తీసికెళ్ళినతను బావురుమన్నాడు.

యేడెనిమిదిమంది పైకి వొచ్చారు అంతలో.

స్టూలుమీద మౌనంగా కూచున్నాడు శ్రీపతి.

"మొన్నటివాకా బాగానే వున్నారు. నిన్న సడన్‌గా పడిపోయారు-"

శ్రీపతి మౌనంగానే వున్నాడు.

"డాక్టర్లు హార్ట్ యెటాక్ అన్నారు"

రెండు నిమిషాల మౌనం.

"విని భరించలేనిదేదో వినో తెలుసుకనో వుంటారు— అన్నారు డాక్టర్లు."

శ్రీపతికి అర్థం అయింది.

పోలీసుల వంచి తప్పించిన వాళ్ళు యీవిడనుంచి తప్పించలేక పోయారు—అనుకున్నాడు శ్రీపతి.

శ్రీపతి ముఖంలో పైకి యే భావమూ కనిపించటం లేదు యెవరికి.

అంత నిబ్బరంగా యెట్లా వున్నాడా—అని ఆశ్చర్యపోతున్నారు కొందరు. రాతిగుండె—అనుకున్నారు కొందరు. అసలు, తల్లి అంటే యెప్పుడూ పెద్ద యిది లేదు—అనుకున్నారు కొందరు. తల్లీ కొడుకులమధ్య పెద్ద అనుబంధం లేదు—అనుకున్నారు కొందరు.

శ్రీపతి మౌనంగా కిందిగి దిగి వొచ్చి తన గదిలోకి వెళ్ళాడు. కుర్చీలో కూచుని ; తల, వెనక అంచుమీద ఆనించి రెప్పలు వాల్చాడు.

పాదాల అలికిడి.

అలాగే వున్నాడు.

"యిట్లా సడన్‌గా యెందుకు జరిగిందో గ్రహించా రనుకుంటాను"

రెప్పలు విప్పాడు, రమాదేవి. దిగులుగా చూస్తోంది. బుగ్గలమీద యెండిన కన్నీటి చారికలు.

'నిన్న మొన్నటి తీరకాయపీచు సంబంధం యీమెకెందుకంత యిది ఆవిడ పోతే' అనుకున్నాడు.

రెండు నిమిషాలు మౌనం.

రమాదేవి బయటికి వెళ్ళింది.

దహన సంస్కారం యేర్పాట్లు జరిగాయి. గంధపు చక్కలు కూడా చేర్చారు.

మేనమామ వొచ్చి, "పద" అన్నాడు, శ్రీపతి లేచాడు.

బయటికొచ్చాడు.

కుండ పుచ్చుకోమన్నారు.

"నాకు వీటిలో నమ్మకంలేదు. దహనం యెవరైనా చెయ్యొచ్చు తోడ బుట్టినవాడిని—మీరు మరీ సమానంగా సన్నిహితులు" అన్నాడు శ్రీపతి.

అందరూ విస్మయంతో అవాక్కైపోయారు.

"పుత్రుడే చెయ్యాలి" అన్నాడు వొకతను.

"నాకు నమ్మకం లేనప్పుడు యెవరుచేస్తే యేంవుంది?"

"చెయ్యకపోతే ఆ ఆస్తి వారసత్వం హక్కు తలకొరివి పెట్టిన

వాళ్ళకి పోతుంది"

"పోనీండి" అన్నాడు శ్రీపతి.

శ్రీపతికి—వాళ్ళ తాత ఆస్తిలో సగం, తండ్రి ఆస్తిలో సగంవుంది. ఆదనంగా యిప్పుడు తల్లి పేర వున్న ఆస్తి అంతా వొస్తుంది.

"చెయ్యకూడదనే నమ్మకం వుందా?" అన్నాడు శాంతను.

"అదీ లేదు" అన్నాడు శ్రీపతి.

"ఐతే చెయ్యకూడదనేంలేదుగా, మేం అడుగుతున్నామని చెయ్యి, ఆవిడకి తలకొరివి యెవరైనా పెడతారు, బోలెడు ఆస్తి వొస్తున్నవాడైనా. కానీ కన్నకొడుకుతో తలకొరివి పెట్టించుకోలేకపోతే ఆవిడికి—"

నడుస్తున్నారు, స్మశానం చేరుకున్నారు

తలకొరివి పెట్టాడు

గంట సేపు

అందరూ తిరుగుముఖం పట్టారు

శ్రీపతి అక్కడే కూర్చున్నాడు. మధ్యాహ్నపు యెండ. యెండలో కూచుని కాలిన చితికేసి చూస్తున్నాడు.

లేచాడు, వొంగి గుప్పెట నిండా బూడిద తీశాడు. చెయ్యి తెరిచాడు. "వుఫ్" అని నిదానంగా వూదుతున్నాడు. బూడిద యెగిరి గాలిలో కలిసిపోతోంది. చేతిలో బూడిద ఐపోయింది. వృత్తచేతులో రేఖలు కనిపిస్తున్నాయి.

చూపుడు వేలు కణుపు మడిచి పెదవి మీద నొక్కుంటూ యెటో చూస్తున్నాడు, చూపు—దూరాన భూమీ ఆకాశం కలిసిన చోట నిలిచింది.

# 128

**తలుపు** చప్పుడు వినిపించి, తియ్యటానికి వొచ్చింది, శాంత, ఆదే చప్పుడు విన్న ఆమె తోటికోడలు, సుబ్రహ్మణ్యం అన్న భార్యకూడా వొచ్చి, శాంతని చూసి, మూతి విరుచుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ యింటికి రెండు గదులు. మధ్యలో హాలు. వెనక వంట గది. సుబ్రహ్మణ్యం అక్కకి చాలాకాలం వెనక పెళ్ళయి వెళ్ళిపోయింది. వొక

అన్న మెకానికల్ డిప్లొమా చదివి, రూర్కీలో వుద్యోగం. పెళ్ళాం పిల్లలతో అక్కడ వుంటాడు. యెప్పుడో రెండు మూడేళ్ళకొకసారి వొచ్చిచూసి పోతుంటాడు. రెండో అన్నకి వూళ్ళోనే వుద్యోగం—యు. డి. సి. యిద్దరు ఆడపిల్లలు శాంతకి వొకఆడపిల్ల. సుబ్రహ్మణ్యం చెల్లెళ్ళు యిద్దరు [illegible]ళ్లి యిద్దరుచదువుకుంటున్నారు. ఆపిల్లలు వీళ్ళద్దరిగదుల్లో కూచుని చదువుకుంటూ వుంటారు. రాత్రుళ్ళు మాత్రం హాల్లో తల్లీ తండ్రీ ఆ నలుగురు పిల్లలూ చాపలు పరుచుకుని పడుకుంటారు. వాళ్ళకి తోడు మనమరాళ్ళు చేరుతూంటారు.

శాంత, తలుపు తెరిచింది.

వీధిలో సుబ్రహ్మణ్యం రిక్షా దిగుతున్నాడు. పొద్దుట వెడితే సాయంత్రం గాని రాడు. మధ్యాహ్నానికి టిఫినుబాక్సు పట్టికెడతాడు.

రిక్షా దిగి, తెల్ల యూనిఫారం బట్టల్లో వున్న బ్యాంకు ప్యూనుని కావిలించుకున్నాడు, సుబ్రహ్మణ్యం. ప్యూను విడిపించుకుని కంగారుపడ్డాడు. సుబ్రహ్మణ్యం రిక్షా అతనికి షేక్ హ్యాండ్ యివ్వబోయాడు. అతనురెండు చేతులూ హ్యాండిల్ మీదవేసి వింతగా చూస్తోంటే అత[illegible]ంజెయ్యి పట్టుకుని వూపాడు.

ప్యూను రిక్షాలో కూచున్నాడు. రిక్షా కదిలింది.

రిక్షాకి సెల్యూట్ చేస్తూ, "హీఁహీఁ" అన్నాడు సుబ్రహ్మణ్యం.

గిరుక్కున వెనక్కి తిరిగి, గుమ్మంలో శాంతని చూసి, "హీఁహీ" అంటూ యన్. సి. సి. పెరేడ్‌లా అడుగులువేస్తూ, "భుట్టో యీజ్ హ్యాంగ్డ్ హీఁహీఁ". అని చంకలోని దినపత్రిక తీసి వూపాడు. ఆ వెర్రినవ్వు అర్థంకాక అయోమయంగా చూస్తోంది, శాంత.

"హీఁ హీఁ భుట్టో యీజ్ హ్యాంగ్డ్!" అని శాంత భుజంమీద వేళ్ళతో తట్టి "హీఁహీ" అన్నాడు.

భర్త చెయ్యి పట్టుకుని గదిలోకి తీసుకెడుతూ, "భుట్టో పాకిస్తాన్ ప్రధానమంత్రి కదండీ?" అంది.

"హీఁ హీఁ భుట్టో యీజ్ హ్యాంగ్డ్. వెనకెప్పుడో ప్రధాని. మిలిటరీ జనరల్ జియా కుర్చీ లాగేసుకున్నాడు. భుట్టో యీజ్ హ్యాంగ్డ్ హీఁ హీఁ" అని పత్రిక ఆమె మీదికి విసిరాడు.

"అయ్యో పాపం వురితీశారా?" అంది శాంత.

"హీఁహీఁ...."

ఆ వెర్రి నవ్వు అర్థం కానట్లుగా చూస్తూ, "బ్యాంకు లేదండీ? అందు కని సెలవిచ్చారా" అంది.

"ఘట్టో యీజ్ హ్యాంగ్డ్. హాలిడే హాలిడే హీఁహీఁ...." అంటు న్నాడు.

తలుపు దగ్గిరికి వేసి, "ఏమిటండీ ఆ నవ్వు?" అంది.

"హీఁహీఁ. ఘట్టో యీజ్ హ్యాంగ్డ్ హీఁహీఁ"

"యేమిటండీ ఆ వెర్రి నవ్వు?" అంది కసురుకుంటున్నట్లుగా.

"షటప్. వెర్రినవ్వు నీ మొహం. ఘట్టో యీజ్ హ్యాంగ్డ్ హీఁహీఁ" అంటున్నాడు.

గది బయటికొచ్చి తలుపు దగ్గిరికి వేసింది. హాల్లోంచి వంటింట్లోకి వెడుతున్న తోటికోడలిని చూసి, అత్తకి చెప్పాలని వొచ్చిన శాంత, మళ్ళీ గదిలోపలికి వొచ్చి తలుపు దగ్గిరికి వేసింది.

"ఘట్టో యీజ్ హ్యాంగ్డ్, హీఁహీఁ—హీఁహీఁ"

"సెలవుకదా—సినిమాకి వెడదాం సాయంత్రం" అంది.

"హీఁహీఁ. ఘట్టో యీజ్ హ్యాంగ్డ్. సినిమా. హీఁహీఁ!" అంటు న్నాడు.

ముందు గుమ్మం తెరిచిన చప్పుడయ్యి గది తలుపు తెరిచి చూసింది. యింటర్ చదువుతున్న మరిదిని లోనకి పిలిచింది. అతను వొచ్చాడు.

"ఘట్టో యీజ్ హ్యాంగ్డ్. కాలేజీకూడా హాలిడేనా! దేశానికూడా హాలిడే హీహీ" అని చిందులేస్తున్నాడు.

"యేమిటండీ ఆ వెర్రి నవ్వు?" అని చెయ్యి పట్టుకుని మంచం దగ్గిరికి తీసికెళ్ళబోతే, విసిరి విగుసుకుని నుంచున్నాడు. శాంత కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఆమె మరిది రెండో చెయ్యి పట్టుకున్నాడు. యిద్దరూ కలిసి మంచం మీద పడుకోబెట్టారు.

"ఘట్టో యీజ్ హ్యాంగ్డ్ హాలిడే. బ్యాంక్ హాలిడే. కాలేజీ హాలిడే. నేషనల్ హాలిడే. హాలిడే—హీఁహీఁహీఁ!" అంటున్నాడు.

"శాంకొదినా" అని మరిది పక్కకి పిలిచి యేమిటని అడిగితే రిక్షా రావటం దగ్గిర్నుంచి విషయం చెప్పింది

"భట్టో యాజ్ హ్యాంగ్డ్ . నేషనల్ హాలిడే—" అంటూ లేవ
బోతూంటే, యిద్దరూ పరుగున వెళ్ళి పడుకోబెట్టారు
శాంత అతని నుదుటిమీద అరిచెయ్యి అద్దింది. అతని తమ్ముడు ఛాతీ
మీద అరిచెయ్యి వేశాడు.

ఐదు నిమిషాలు

సుబ్రహ్మణ్యం నిద్రోయేశాడు.

"యేం జరిగిందో అసలు — ఆ బ్యాంకు ప్యూను తీసుకొచ్చిన వాడు
యేం చెప్పకండా పోయొచ్చాడు—" అంటోంది

ప్లాక్ జేబులోంచి కనిపిస్తున్న కాగితం వంక చూసి, తీశాడు అతని
తమ్ముడు. చదివి, "శాంతొదినా, సుబ్బన్నయ్యని వుద్యోగంలో నుండి
సస్పెండ్ చేసేరు" అన్నాడు.

శాంత బాణికిపోయింది చిన్నగా యేడుస్తోంది. అసలే తోటికోడ
లితో పొసగటం లేదు. యిప్పుడు తన మొగుడికి వుద్యోగం కూడా లేక
పోతే తనని మరీ చులకనచేసి పారేస్తుందనీ, ఆ వెర్రి నవ్వు యేమిటో
అర్థంకాక అయోమయంలోనూ యేడ్చేస్తోంది.

"బాబూ నువ్వెళ్ళి మావయ్యగారిని పిలుచుకురా" అంది. మరిది
వెళ్ళాడు.

అరగంటకి సుబ్రహ్మణ్యం నిద్ర లేచాడు. లేస్తూనే "భుట్టో యాజ్
హ్యాంగ్డ్ బై మార్నింగ్ యాజ్ హి గాట్ అప్. హిఃహీ" అనాడు.

"యేమండీ మీ వుద్యోగం"

"వూ నా వుద్యోగం?"

"మిమ్మల్ని వుద్యోగం నుంచి తీసేశారా?" అంది.

"నాకు వుద్యోగమేంటే పిచ్చి మొహమా! ప్రైమినిస్టరు భుట్టో
వుద్యోగం చేస్తాడటే, ఫూల్ భుట్టో యాజ్ హ్యాంగ్డ్ హిఃహిః"

మరో అరగంట.

సుబ్రహ్మణ్యం తండ్రి శాయోజీరావు వొచ్చాడు.

యిదేమిటో అర్థంకాక శాంత తోటికోడలు తను గది గుమ్మంలో
నుంచుని మరిదిని పిలిచింది చేత్తో 'ఆగు చెప్తా' అన్నట్లుగా చెయ్యిచూపి గది
లోకి అతను వొచ్చాడు.

"తండ్రి నాన్నగారూ విన్నారా ఝా వా ర్త. భుట్టో యాజ్ హ్యాంగ్

భుట్టో యీజ్ హ్యాంగ్డ్. హీహీ"

సస్పెన్షన్ సంగతి కొడుకు చెప్పగా విని దిగులుతో వొచ్చిన శాయోజీరావు సుబ్రహ్మణ్యాన్ని అలా చూసి, చిన్న కొడుకుతో, "హోటలు కెళ్ళి పెద్దాడికి ఫోను చెయ్యి వెంటనే రమ్మని"అన్నాడు.

అంతలో అతని తల్లి గదిలోకి వొచ్చింది

"అమ్మా, భుట్టో యీజ్ హ్యాంగ్డ్ అంటే నీకు తెలియదు కదూ భుట్టోని వురితీశాడు. హీహీ " అన్నాడు

కాసేపటికి పెద్ద కొడుకు వొచ్చాడు

"అన్నయ్యా భుట్టో యీజ్ హ్యాంగ్డ్ హీహీ"

పెద్దకొడుకుకి సస్పెన్షన్ కాగితం చూపెట్టి, "వెంటనే బ్యాంకుకివెళ్ళి అసలేం జరిగిందో తెలుసుకురా" అన్నాడు శాయోజీరావు.

అతను వెళ్ళాడు. వెడుతూ, భార్య సైగ చేస్తే వాళ్ళ గది గుమ్మం లోకి వెళ్ళగానే యేమిటని అడిగితే విషయం చెప్పాడు.

వెంటనే గదిలోకి వొచ్చి విచారం నటిస్తూ, "శాంతి యేం చేస్తా వమ్మా నీరాత అట్లా వుంది" అంది.

సుబ్రహ్మణ్యం అన్న బ్యాంకుకి వెళ్ళి సంగతులు తెలుసుకుని వెంక టావధాని యింటి అడ్రసు అడిగి అక్కడికి వెళ్ళాడు. యివన్నీ తెలుసుకుని యిల్లు వెతుక్కుంటూ వెళ్ళేసరికి — అప్పుడే బయటినుంచి గుమ్మంలోకి వొచ్చిన జయంతి యితన్నిచూసి, "యెవరు కావాలండీ?" అంది.

"వెంకటావధానిగారు."

తలుపుతట్టింది—

తెరుచుకోలేదు.

"యేమండీ" అని పిలిచింది.

తలుపు తెరిచి గిరుక్కున తిరిగి, కర్రకాలు టిక్కు టిక్కు మని పిస్తూ లోపలికి వెళ్ళి పడుకున్నాడు ముసుగెట్టుకుని.

లోపలికి వెళ్ళి "మీ కోసం యెవరో వొచ్చారు" అంది.

వెంకటావధాని మాట్లాడలేదు

"మిమ్మల్నేనండీ. యింటికి మనిషి వొస్తే"

"[illegible]"

ముందు గదిలోకి వెళ్ళి, "కూర్చోండి వొస్తారు" అని, వెనక్కి-తిరగబోతున్న జయంతితో ఆ మాటలు విన్న సుబ్రహ్మణ్యం అన్న, "అమ్మా నేను సుబ్రహ్మణ్యం అన్నయ్యన్ని, సుబ్రహ్మణ్యం తెలుసుగా. మీ వారూ వాడూ వొకేచోట వుద్యోగం—" అంటున్నాడు.

"తెలుసు. అలాగా, నమస్కారమండీ" అంది చిర్నవ్వుతో,

"అమ్మా జరిగిన విషయం—వీళ్ళిద్దర్నీ వుద్యోగం నుండి సస్పెండ్ చేశారట. మా వాడికి మతి చాంచల్యం వొచ్చినట్టు అనుమానంగా వుంది. సంగతులు తెలుసుకుందామని వొచ్చాను"

జయంతి దిగులుగా కుర్చీలో కూచుండిపోయింది.

రెండు నిమిషాల మౌనం.

"యెందుకట?"

"యేదో మిసప్రాప్రియేషన్ ఫోర్జరీ కేసులో వీళ్ళు కుమ్మక్కయ్యారని. వీళ్ళతోపాటు అకౌంటెంట్ని కూడా సస్పెండ్ చేశారు. బ్యాంకుకి వెళ్ళి యీ సంగతులు తెలుసుకుని వొస్తున్నాను. మా వాడు యేమీ చెప్పే స్థితిలో లేడు. వెర్రినవ్వు నవ్వుతూ వున్నాడు. యిక్కడికి వొస్తే మరికొన్ని సంగతులు తెలుస్తాయేమోనని వొచ్చాను"

జయంతి నీరసంగా లేచి లోనకి వెళ్ళి, మంచం అంచుమీద కూచుని దుప్పటి ముఖం మీంచి లాగి "వొంట్లో బాగాలేదా?" అంది.

మాట్లాడకుండా పడుకున్నాడు కళ్ళు తెరవకుండా.

"సస్పెండ్ చేశారటగా, దేవకీ?" అంది.

మాట్లాడలేదు.

"మాట్లాడండీ" అని అతని ముఖానికి అరిచేతులు అద్దింది. రెప్ప విప్పాడు.

ఆమె కళ్ళలోంచి బొట్లు రెండు మూడు అతని నుదుటిమీద పడ్డాయి.

వెంకటావధాని భోరుమని యేడ్చేస్తూ పక్కకి వొరిగి ఆమె వొళ్ళో ముఖం పెట్టుకున్నాడు.

వీపుమీద చెయ్యేసి సౌదార్యంగా తడుతూ, "పోన్లెండి గడవకపోదు. బాధపడకండి. కాగా సస్పెన్షనేగా. అసలేం జరిగింది చెప్పండి?" అంది.

"అన్యాయంగా మా యిద్దర్నీ ఆ రోగ్స్ సస్పెండ్ చేశారు జయంతీ" అన్నాడు వెంకటావధాని.

అంత దిగులులోనూ నవ్వొచ్చింది జయంతికి. నవ్వు ఆపుకుని "కేసులు దొరక్కపోతే పెళ్ళాం పక్క" పడుకుని ముక్కుపుడక కాజేసి, వాళ్ళింట్లో ముక్కుపుడక దొంగతనం జరిగిందని కేసు పెడతారట పోలీసు. పోలీసుద్యోగి కొడుకనిపించుకున్నారు అబద్ధాలకి. విషయాలు తెలిసినయ్. లెండి. ఆ వొచ్చిన వ్యక్తి సుబ్రహ్మణ్యం గారికి అన్నగారు. బ్యాంకుకి వెళ్ళి సంగతులు తెలుసుకొచ్చారు. గుమ్మంలో తారసపడ్డాం నేమిద్దరం. ఇప్పటికైనా చెప్పండి అసలు విషయం"

"వాళ్ళ తమ్ముణ్ని అడగొచ్చుగా యిక్కడికి దేనికి?" అన్నాడు.

"అతనికి మతి చాంచల్యం వొచ్చిందట. అందుకని యిక్కడికి వొచ్చారు. రండి— గుసుగుసలో గుద్దులాట లాగా దేనికి!" అని వెంకటావధానిని లేవదీసి బయటకి పట్టుకొచ్చింది.

కుర్చీలో కూచుని నేలకేసి చూస్తున్నాడు వెంకటావధాని.

"భట్టో యీజ్ హ్యాంగ్డ్ — బ్యాంక్ హాలిడే. నేషనల్ హాలిడే. హీ హీ అంటూ వెర్రిగా నవ్వుతున్నాడు మా వాడు"

"పాపం యివాళ భట్టోని వురితీశారు. ఆ వార్త పేపర్లో వుందిగా" అంది జయంతి.

వెంకటావధాని చెప్పటం తిక్కిరి బిక్కిరిగా మొదలెట్టినా, కొద్దేపటికి-పోలీసు కథనం రీతిలో చెప్పుకుపోతున్నాడు.

వింటున్నారు. మధ్యలో ప్రశ్నలు వెయ్యకుండా.

వివరాలివి: గుండు శరగోపం, చెరుకూరి వెంకటేశ్వరావులు అని ఉస్మానియా పూర్వ విద్యార్థులు— యెం. యె తప్పి, నిరుద్యోగులుగా వుంటూ బ్యాంకులను మోసగించటం ప్రారంభించారు. వాళ్ళతో వీళ్ళకి పరిచయం అయింది. ఆ ప్రలోభానికి లొంగి, వెంకటావధాని సుబ్రహ్మణ్యంలు వాళ్ళ అకౌంటెంట్‌ని కలుపుకుని దొంగచెక్కులు, డ్రాఫ్ట్లూ క్యాషు చేయిస్తూ వొచ్చారు. చెక్కులు చాలా పెద్దపెద్ద వ్యాపార సంస్థలకి సంబంధించినవి.

మొన్నటిరోజున వొక యాభయ్‌వేల రూపాయల డిమాండ్ డ్రాఫ్ట్ విషయంలో అనుమానం వొచ్చి— ఆ సంస్థకి ఫోనుచేసి, అలాంటి డ్రాఫ్ట్ వాళ్ళు యివ్వలేదని తెలుసుకుని, గప్‌చిప్‌గా యింకా రికార్డు తిరగేసి ఆడే వ్యక్తులు క్యాషు చేసుకున్న మరికొన్ని డ్రాఫ్టులు చెక్కులు తనిఖీ చేయ్యాగా అవీ ఫోర్జరీ అని తెలిసి.... రాత్రి శరగోపాన్ని వెంకటేశ్వరరావుని పోలీసు

లతో అరెస్ట్ చేయించి యీ వుదయం మాగ్గురికీ సస్పెన్షన్ ఆర్డర్స్ యిచ్చా రట. కేసు ఫైనలైజ్ అయ్యాక వుద్యోగంనుంచి తొలగిస్తారట.

"మంచిది వొస్తానమ్మా" అని సుబ్రహ్మణ్యం అన్న లేవబోతే, "కాఫీ తీసుకు వెళ్లదురు వుండండి కొస్త" అంది జయంతి.

"యిది కాఫీలూ ఆతిధ్యాలూ యిచ్చే పుచ్చుకునే సమయమా? నువ్వెంతో వుత్తమురాలిలా యోగ్యురాలిలా వున్నావు. అన్నట్లు వుద్యోగమా?" అన్నాడు సుబ్రహ్మణ్యం అన్న.

"అవునండీ. యిండియన్ బ్యాంకులో క్లర్క్‌గా చేస్తున్నాను" అంది.

"ఆ పని చేసే అవకాశం నీకూవుంది. బుద్ధినిబట్టి జాతకాలు వుంటయ్" అని అతను అంటూంటే, వెంకటావధానికి తన కాలు సంగతి గుర్తొచ్చింది.

సుబ్రహ్మణ్యం అన్న, యింటికి తిరిగొచ్చి జరిగిన సంగతులన్నీ వివరించాడు.

"హారి వీడి కడుపుడకా" అన్నాడు తండ్రి శాయోజీరావు.

"చిన్నప్పటినుంచీ వుత్త వెర్రి సన్యాసి. చెడు సావాసాలకి పోయి పాడైపోయి వుంటాడు. వాడికైతే వాడికి పుట్టిన బుద్దికాదిది" అంది తల్లి.

"పెళ్ళానికి చంద్రహారాలు చేయించాలనిపించి వుంటుంది" అంది శాంత తోటికోడలు.

ఆ మాట యెవరూ విననట్లుగా వుండిపోయారు.

"వారే మున్నా, గుండు శతగోపం తెలుసురా?" అన్నాడు సుబ్రహ్మణ్యం అన్న.

"హిఁహిఁ గుండుభట్లోనా? గుండు భట్లోకి గుండు తీసేశారు. వురేసి. వురి వురి —హ్యాంగింగ్. హిఁహిఁ"

శాయోజీరావు వెళ్ళి అతనికి తెలిసిన డాక్టర్ని తీసుకొచ్చాడు. వొచ్చి పరిశీలించి, "యిది మెంటల్ కేసండి. యెర్రగడ్డ హాస్పిటల్‌లో చూపెట్టండి" అని సలహా యిచ్చాడు.

"యివాళ అష్టమి అందుకే యీ కష్టం వొచ్చిపడింది" అందిశాంత.

"రేపునవమి. అందునా శ్రీరామనవమి. పుణ్యదినం. కష్టాలు తొలగి పోతయ్‌లే చెల్లెమ్మా బాధపడకు" అంది శాంత తోటికోడలు.

ఆ మాటలోని పరిహాసం, శాంతకీ శాయోజీరావుకీ అర్థమైంది.

మరనటి రోజు ఆఫీసులకి యెలాగూ సెలవు వుదయం యేడున్నరకి బయల్దేరి సుబ్రహ్మణ్యాన్ని యెర్రగడ్డ తీసుకువెళ్ళారు: అతని తండ్రి, అన్న.

అక్కడ డాక్టర్లు తక్కువ డ్యూటీ యెక్కువ.

పదకొండున్నరకి సుబ్రహ్మణ్యాన్ని వొక డాక్టరు పరీక్షించి, "మేము టఫ్ కేసెస్ మాత్రమే సేకప్‌చేసి అడ్మిట్ చేసుకుంటాం: యిది చాలా మైల్డర్ కేసు. రోజూ గానీ రోజు విడిచి రోజుగానీ వరసగా కన్సల్టింగ్ సైప్ ట్రీట్‌మెంట్ అవసరం. అంత వ్యవధి వుండదు మాకిక్కడ. కాగా మీకూ దూరాభారం. వూళ్ళో మానసిక వైద్యులెవరినన్నా సంప్రదించండి." అని సలహా యిచ్చాడు ఆ డాక్టరు.

"మామూలు డాక్టర్లంటే తెలుసుగానీ మానసిక వైద్యులు మాకెవరూ తెలియరండీ. మీ రెవరినన్నా సజెస్ట్ చేస్తే—"

"కొందరున్నారు. యీ మధ్య కొత్తగా వొక క్లినిక్ ప్రారంభమైందట. అవతారం మెంటల్ క్లినిక్. కనుక్కోండి."

"అడ్రసూ—"

"అడ్రసు నాకూ తెలియదు. టెలిఫోన్ డైరక్టరీలో చూడండి"

మధ్యాహ్నం రెండున్నరకి యింటికి తిరిగి వొచ్చారు.

భోజనం దగ్గిర కూచుని, "హిఁహిఁ. భుట్టోకి వుదయం లేవగానే బ్రేక్‌ఫాస్ట్ పెట్టారట, వురి తియ్యటానికి ముందు. చదవండి. డీటెయిల్స్ పేపర్లో యిచ్చారు. సీక్రెటేంకాదు, అందరికీ తెలుసు యెవరి నడిగినా చెప్తారు, భుట్టో వురితీత సంగతి. భుట్టో వురితీత. భుట్టో వురితీత హిఁహిఁ" అని వెర్రిగా నవ్వుతూనే అంటున్నాడు సుబ్రహ్మణ్యం.

ఐతే కడుపుకి సగానికిగానీ మరీ విందుగాగాని తింటున్నాడు రాత్రి పీక దాకా పట్టించాడు. వుదయం తినలేదు సరిగా. యీ పూటా సరిగాతినటం లేదు

అతని అన్న బయటికెళ్ళి, హోటల్లో టెలిఫోను డైరక్టరీలో నంబరు వెతికి ఫోను చేశాడు, అవతారం మెంటల్ క్లినిక్‌కి. సాయంత్రం ఆరున్నరకి రమ్మంటే బయల్దేరారు సుబ్రహ్మణ్యాన్ని తీసుకుని అతని తండ్రి, అన్న.

అవతారం మెంటల్ క్లినిక్ అంటే—ఆ మధ్యకాలంలో వుస్మానియా యూనివర్శిటీ కాలేజీలో యెమ్మెస్సీ సైకాలజీ చదివిన పానకాల శేషావతారం పచ్చిపులుసు కూర్మావతారం యిద్దరూ కలిసి ప్రారంభించిన క్లినిక్. యెమ్మెస్సీ సైకాలజీ తరవాత యిద్దరూ కలిసే బొంబాయిలోనూ, బెంగుళూరులోనూ క్లినికల్ అండ్ మెంటల్ సైకాలజీలో డిప్లొమాలు తీసుకున్నారు యేడాదిక్రితం యీ క్లినిక్ తెరిచారు. క్లినిక్ పేరు కింద పి. కె అవతారం, పి. యస్. అవతారం అనే పేర్లు డిగ్రీలూ డిప్లొమాలు, సంప్రదించే వేళలు రాయించారు.

అదోలాగా వెర్రి చూపులు చూసే పచ్చిపులుసు కూర్మావతారాన్ని పిచ్చిపులుసు కూర్మావతారం అని అంటూండేవాళ్ళు సెక్సీగా కనిపించే ఆడవాళ్ళని విలువుగుడ్లేసుకుని చూస్తుండేవాడు. అతను అలా చూస్తే ఆడవాళ్ళకి కోపమో యిష్టమో కలిగేదికాదు. పరిహాసంగా నవ్వొస్తుంది. అప్పుడప్పుడు వున్నట్లుండి అకారణంగా రెచ్చిపోయి మాట్లాడే పానకాల శేషావతారాన్ని పూనకాల శేషావతారం అని అంటూండేవాళ్ళు.

వీళ్ళు సుబ్రహ్మణ్యాన్ని తీసుకెళ్ళినవేళకి, యీమధ్యనే వొచ్చిన వొక హిస్టీరియా కేసు చూస్తున్నారు.

సైకోయెనాలిసిస్‌కి వాడే వెల్ యెక్విప్డ్ రిలాక్సింగ్ ఛెయిర్‌లో ఆమె పడుకునుంది. కాళ్ళు కింద వైష బోర్డుమీద ఆనించి తల మెత్తటి కుషన్ మీద ఆనించి.

చిన్నప్పుడు యెప్పటినుంచి బట్ట లేసుకునేదానివి? స్నానం చేసేటప్పుడు బట్టలు తీసేసి వొళ్ళు చూసుకునేదానివా? మీ ఆయనని మొదటిసారి చూసినప్పుడు నీకు యెలా అనిపించింది? ఆకలిబాగా వుంటుందా? సినిమాలు చూస్తావా? సంభోగం అంటే యిష్టమా? అయిష్టమా? మీనాన్నంటే ఇష్టమా అయిష్టమా? వంటి రకరకాల ప్రశ్నలు, మైల్డ్ యూఫోరిక్ డ్రగ్ యివ్వటం కబుర్లలోకి దించి వరసనే తన అన్ని విషయాలూ ధారగా చెప్పించటం. సజెషనూ కాంట్రాసజెషను వంటివన్నీ ఉపయోగిస్తుంటారు.

ఆమె రెప్పలు విప్పేసరికి—కూర్మావతారం ఆమె చనుకట్టువంక తదేకంగా చూడటం గమనించిన ఆమె, కూర్మావతారం ముఖంలోకిచూసింది 'హీఁ హీఁ' అని యికిలించాడు కూర్మావతారం, "బాగుంది అట్లా చూస్తే" అంది.

"హీఁ హీఁ" అని యికిలిస్తూ మళ్ళీ చూశాడు కూర్మావతారం.

"షటప్" అంది ఆమె.

చిన్నబుచ్చుకుని అంతలోనే తేరుకుని, "హిస్టీరియా కేస్ కద. యీ టెక్నిక్‌లో యిదొక తరీఖా" అన్నాడు కూర్మావతారం.

"నీ మొహం, హిస్టీరియా నీకా నాకా!" అంది

"హిస్టీరియా ఆడవాండ్లకొస్తది" అన్నాడు కూర్మావతారం.

"అందుకే నాకు హిస్టీరియా కాదు. ఆడపిల్లవి నీకే హిస్టీరియా" అంది.

"హీఁ హీఁ" అని మళ్ళీ ఆమె చనుకట్టువంక చూశాడు కూర్మావతారం.

అంతలో శేషావతారం, "యిటు చూడమ్మా నా వేలువంక" అని చూపుడు వేలు చూపెట్టాడు.

అతని వేలి కొనవంక చూసింది.

"యేమి కనిపిస్తున్నది?" అన్నాడు శేషావతారం.

"కాలు" అంది

"యిది కాలా?" అన్నాడు శేషావతారం.

"కాలు చూపెట్టావా, వేలు చూపెట్టావా?" అంది.

"వేలు" అన్నాడు శేషావతారం.

"వేలు చూపెడ్తే కాలు కనపడటానికి, నేనేమన్నా గుడ్డిదాన్నా పిచ్చిదాన్నా మీలాగా" అని నవ్వింది.

"దట్స్ రైట్ గ్రాస్ప్" అని మెచ్చుకుని, "మీ బావ అంటే యిష్టమేనా?" అన్నాడు శేషావతారం

"యిష్టమే" అంది.

"మీ బావ తాన యెన్నడైన పండుకొన్నవా?" అన్నాడు శేషావతారం.

"పడుకున్నా, చిన్నప్పుడు" అంది.

"పెద్దదానివైనంక పండుకోలేదా?" అన్నాడు శేషావతారం.

"బుద్ధిలేదూ అట్లాంటి మాటలడగటానికి! పెద్దయినాక అర్థమైనవాళ్ళ దగిరా పడుకుంటారా? నా మొగుడు దగ్గిర పడుకుంటా. యిష్టంగా అనిపిం

దగర కూడా పడుకోను"

"మగని తాన యేమిటిక్కి పండుకోవు?" అని అరిచాడు శేషావతారం.

"అనిపించక" అంది.

"మగడు తన తాన పండుకోమంటే పండుకోవాల. వద్దంటే వూకోవాల. యేమి చెప్తె అది చెయ్యాల" అన్నాడు శేషావతారం.

"యేం చెప్తే అది చెయ్యాలా? తన దగ్గిరేనా నీలాంటి వెధవ దగ్గిర పడుకోమని చెప్పినా వినాలా?" అంది.

"షటప్" అన్నాడు శేషావతారం.

"యూ షటప్" అంది.

"ఐ విల్ రేప్ యు" అన్నాడు కోపంగా శేషావతారం.

"ఐ విల్ ఆల్సో రేప్ యూ" అంది కోపంగా.

"విల్ యు ఆల్సో రేప్ మీ?" అన్నాడు కూర్మావతారం.

"హౌ కెన్ ఐ! యు ఆర్ యె వుమన్" అని నవ్వింది.

చిన్న బుచ్చుకున్నాడు కూర్మావతారం

"మీ అమ్మా నాన్నల తావ పండుకుంటవా?" అన్నాడు శేషావతారం.

"పడుకుంటా. నీదగ్గిర కూడా పడుకుంటా. అమ్మల దగ్గిర నాన్నల దగ్గిర అక్కల దగ్గిర చెల్లెళ్ళదగ్గిర వొదినల దగ్గిర అన్నల దగ్గిర తమ్ముళ్ళ దగ్గిర మరదళ్ళ దగ్గిర బావలదగ్గిర మొగుళ్ళ దగ్గిర నీ దగ్గిర పడుకుంటా" అని పిడికిళ్ళు బిగించింది. ఫిట్ వొచ్చింది

శేషావతారం ఆమె పిడికిళ్ళు పట్టుకున్నాడు. విదిల్చి కొట్టింది శేషావతారం బుగ్గకి తగిలి కందింది. నొప్పెడుతోంది శేషావతారానికి.

'దీని యవ్వా' అనుకుని, "చూడమ్మా యిప్పుడు నీకెట్లనిపిస్తున్నది అన్నాడు శేషావతారం.

ఆమె పలకలేదు.

వొంగి ఆమె అరికాళ్లో చక్కిలిగిలి పెట్టి "హీఁ హీఁ" అన్నాడు కూర్మావతారం.

ఆమె పలకలేదు.

"ఫూల్. ఆమెకు బదులు నువ్వు నగుతవేం?" అని అరిచాడు శేషావతారం.

"ఫూల్. ఆమెకు బదులు నువ్వు బిగుసుక్కొని పోతవేం?" అని నవ్వాడు కూర్మావతారం.

"యూ ఫూల్స్" అంది ఫిట్ విడుతూన్న ఆమె.

సంతోషంతో చిందువేసి శేషావతారం, కూర్మావతారం చెవిలో, "యీ కేస్ మబ్బోలె విడిపాయె—షి యీజ్ ఫ్రిజిడ్" అన్నాడు.

"యిడియట్. ఫ్రిజిడిటీకి ఫిట్సొస్తాయిగ?" అన్నాడు కూర్మావతారం.

"వుయ్ విల్ సెండ్ హెర్ ఫర్ టుడే" అన్నాడు శేషావతారం.

యిలా రకరకాలుగా మతి సరిగా లేక వొచ్చే, వీళ్ళ పెషెంట్స్‌తో వీళ్ళూ కలిసిపోయి నానా గొడవా చేస్తుంటారు. వీళ్ళ గొడవకి కొందరు పేషెంట్సు యాదృచ్ఛికంగా బాగయిపోతారు. కొందరు, నాలుగు రాళ్ళు విసిరితే వొక రాయి తగిలినట్లుగా బాగవుతారు. కొందరు, మళ్ళీ తిరిగి వొస్తుంటారు.

సుబ్రహ్మణ్యాన్ని లోపలికి తీసుక రమ్మన్నారు. తీసుకెళ్ళారు. శేషావతారం వాళ్ళిద్దర్నీ ముందు గదిలోకి తీసుకొచ్చి వివరాలు అడుగుతున్నాడు.

"నీ పేరేమ్టి?" అన్నాడు కూర్మావతారం.

"భట్టో"

"భట్టోమ వురి తీసిన్రు కదా?"

"అవును. నన్ను యివాళ పొద్దునే వురి తీయించాడు జియా."

"వురి తీసినంక యీడికెట్లొస్తివి?"

"నేను రాలేదు. నా ప్రేతం వొచ్చింది."

"నువ్వు ప్రేతానివా?"

"భట్టో ప్రేతాన్ని. భట్టో యీజ్ హ్యాంగ్డ్. హీఁ హీఁ" అని సుబ్రహ్మణ్యం నవ్వుతూంటె.

కూర్మావతారం, "హీఁ హీఁ, ఫన్నీ. వెరీ ఫన్నీ హీ హీ" అన్నాడు.

"హీఁ హీఁ. నిన్నెప్పుడు హ్యాంగ్ చేశారు?" అన్నాడు సుబ్రహ్మణ్యం

"హీఁ,హీఁ. నన్ను హ్యాంగ్ చెయ్యలే."

"హీఁ,హీఁ, ఫన్నీ. వెరీ ఫన్నీ. హ్యాంగ్ చెయ్యకపోతే ప్రేతాని

"నేను ప్రేతాన్నా?" అన్నాడు కూర్మావతారం.

"ప్రేతానివే నీకు నువ్వు కనిపించవు. అద్దంలో చూసుకో. ప్రేతాలు అద్దంలో కనిపించవు. నా కళ్ళతో చూడు కనిపిస్తావు. నువ్వు ప్రేతానివి. హిఁహిఁ నీ పేరేంటి?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"కూర్మావతారం"

"హిఁహిఁ. కూర్మ ప్రేతం. నేను భట్టో ప్రేతం. మనిద్దరం నేస్తాలం" అని కూర్మావతారం చెయ్యి అందుకుని షేక్ హ్యాండిచ్చాడు సుబ్రహ్మణ్యం.

అంతలో శేషావతారం వొచ్చాడు.

"వీడెవడు?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఆయన శేషావతారం" అన్నాడు కూర్మావతారం.

"పాఁవుఁ—పాఁవుఁ కాటు వేస్తుంది కాటువేసినా వురితీసినా వొకటే రెంటికీ చచ్చిపోతారు. పోరా శేషావతార్!" అన్నాడు సుబ్రహ్మణ్యం.

శేషావతారానికి మండుకొచ్చి, "నువ్వే పోరా" అని అరిచాడు.

"పాఁవుఁ పోతుందా? ప్రేతం పోతుందా? వొరే కూర్మం కర్ర పట్రా. యీ పాఁవుఁగాణ్ని పచ్చడి పచ్చడిగా చేద్దాం" అన్నాడు సుబ్రహ్మణ్యం

"హిఁహిఁ." అన్నాడు కూర్మావతారం.

కూర్మావతారం వంక చూసి, "షటప్" అన్నాడు శేషావతారం.

"హిఁహిఁ" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"యు ఆల్సో షటప్" అని సుబ్రహ్మణ్యాన్ని అన్నాడు శేషావతారం.

"వొరి పాఁవుఁగా—" అని యెగిరి శేషావతారం చంకన కూ[illegible]న్నాడు, సుబ్రహ్మణ్యం.

ఆ బరువుకీ వూపుకీ కిందికి వొరిగాడు శేషావతారం. పకరి ప్రక్కన పకరు పడ్డారు.

"హిఁహిఁ" అంటున్నాడు కూర్మావతారం.

"షటప్" అన్నారు శేషావతారం, సుబ్రహ్మణ్యంలు వొకేసారి.

'అట్లనే" అని మూతి మీద చెయ్యి వేసుకుని వాళ్ళ పక్కన కూచుని, "మనం దోస్తులం భట్టోభాయ్. నిన్న కదా యెట్ల

"ఫూల్. వురి కర్రతో యెట్లా తీస్తార్రా: తాడుతో. కర్రతో బాదబాదు తారు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అవును. భుట్టో దోస్త్! నువ్వు పాకిస్థాన్ ప్రెసిడెంట్‌వి. మంచిగ చదువుకున్నోనివి తెలివైనోనివి. అందుకే నీ కంత తెగ్గా— నిన్ను కాగి తాలు పౌడావుగ కట్టి వురి తీసిర్రులే."

"అవును" అని యేడుస్తున్నాడు సుబ్రహ్మణ్యం.

శేషావతారం చిటికె వేసి వుత్సాహంగా గెంతి, "భుట్టో దోస్తు. నిన్ను వురితీసినంక నీ భార్య బేగం సాయిబా, బిడ్డలూ యేడుస్తున్నరులే!" అన్నాడు.

సుబ్రహ్మణ్యం మరింత యేడవటం మొదలెట్టాడు.

శేషావతారం వుత్సాహంగా కూర్మావతారం చెవిలో, "గాట్ ది పోయింట్ హి మర్డర్డ్ ఎ పర్సన్ అండ్ కన్సీల్ చేసేటందుకు ఫోర్జరీకేస్‌తోటి కవరు చేసుకుంటున్నడు తను" అన్నాడు

"యిడియట్. వాని మొహం మర్డరర్ మొకమోలె వున్నదిరా?" అన్నాడు కూర్మావతారం గొంతు బిగించి చిన్నగా.

"యస్. వున్నది నీ మొకమోలె" అన్నాడు శేషావతారం.

"హిఁహిఁ" అన్నాడు కూర్మావతారం.

"హిఁహిఁ. హి హ్యాంగ్డ్ మి, కూర్మావతారం" అన్నాడు సుబ్రహ్మణ్యం.

శేషావతారంలేచి టేబిలు దగ్గిరికి వెళ్ళి యేదో రాసిపట్టుకొచ్చి, "నీకు రీ అప్పాయింట్‌మెంట్ ఆర్డర్స్ యిచ్చిర్రు చూడు" అన్నాడు సుబ్రహ్మణ్యంతో.

అందుకుని చూసి, "ఫూల్ యిది ఫోర్జ్‌డ్ పేపర్ లెటర్‌హెడ్ కాదు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"స్పెషల్ ఆర్డర్. బ్యాంక్ డైరక్టర్ పర్సనల్ స్లిప్‌లెటర్ ఆర్డర్" అన్నాడు శేషావతారం.

డైరెక్టర్‌కి ఆ పవర్స్ వుంటాయి అలా స్లిప్పులమీద కూడాచాలా ముఖ్యమైనవి కూడా రాసి పంపుతారు.

"యిది నీకెక్కడిది?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"బ్యాంక్ డైరక్టర్ యిచ్చిండు నీకిమ్మని" అన్నాడు శేషావతారం.

"వోరి చవటా, మా బ్యాంక్ డైరక్టర్ మగకాదు. ఆడ, ఆడది— లాగూ చొక్కా తొడుక్కునే ఆడది."

"దానికొక పెండ్లామున్నది." అన్నాడు కూర్మావతారం.

"నీలాంటి పెళ్ళాం" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"హిఁహిఁ" అన్నాడు కూర్మావతారం.

"హిఁహిఁ భుట్టో యీజ్ హ్యాంగ్డ్. హిఁహిఁ" అని వాళ్ళిద్దరి పిర్రల మీదా రెండు చేతుల్తో చరువులువేసి, ముందుకు అడుగులు వేశాడు, సుబ్రహ్మణ్యం.

"సీ హి హ్యాజ్ బికంజూబిలంట్. దారి కొస్తున్నడు" అన్నాడు శేషావతారం కూర్మావతారంతో.

గిరుక్కున వెనక్కి తిరిగి, "లెఫ్ట్ రైట్, లెఫ్ట్ రైట్, లెఫ్ట్‌రైట్, భుట్టో యీజ్ హ్యాంగ్డ్. హిఁహిఁ" అంటూ వెళ్ళి యేటవాలు కుర్చీలో కులాసాగా కూర్చున్నాడు, సుబ్రహ్మణ్యం.

కాళ్ళు వూగిస్తూ, "ఐయామ్ జియా. ఐ ఆర్డర్ యు కం హియర్ భుట్టో" అన్నాడు సుబ్రహ్మణ్యం దర్పంగా.

"కాని జియా సాబ్ నువ్వు భుట్టోను హ్యాంగ్ చేస్తివి.

"జియా ది గ్రేట్‌ని, చంపి మళ్ళీ బతికించగలను." సుబ్రహ్మణ్యం గొప్పగా మఖంపెట్టి.

"సీ హి యీజ్ కమింగ్ యిన్ టు ది ఫోల్డ్!" అన్నాడు కూర్మావతారం.

"యు ఆర్ వోన్లీ హ్యాంగ్ మెన్. యిన్‌సిగ్నిఫికంట్ హ్యాంగ్ మెన్. గెటవుట్." అని అరిచాడు సుబ్రహ్మణ్యం.

యిద్దరూ గుమ్మం వైపు నడుస్తున్నారు

"హిఁహిఁ" అంటున్నాడు సుబ్రహ్మణ్యం

"యీ పొద్దుకింక వద్దపేం— రాత్రికి కేసు మంచిగ స్టడీ చేద్దం. మర్ల రేపు తీస్కరమ్మందం. యీజీ. వెరీ సింపుల్ కేస్." అన్నాడు శేషావతారం.

"యిడియట్. సింపుల్ కేసెస్ ఆర్ ది మోస్టు డిఫికల్ట్ అవి చదవ్వలేః" అన్నాడు కూర్మావతారం.

చప్పుడవకుండా వాళ్ళ వెనక్కి వొచ్చి, "దిస్ యీజ్ కాన్స్పిరసీ

బిఫోర్ ది హ్యాంగింగ్" అని గట్టిగా అరిచాడు సుబ్రహ్మణ్యం.

జడుసుకుని యెగిరిపడ్డారు యిద్దరూ.

"హిఁహిఁ గుడ్ యు ఆర్ మై ఫ్రెండ్స్, ఫుట్టోస్ ఫ్రెండ్స్" అని వాళ్ళ భుజాలమీద చెయ్యివేశాడు సుబ్రహ్మణ్యం.

"హిఁహిఁ" అన్నాడు కూర్మావతారం.

"వెరీ నైస్ ఫ్రెండ్స్ వుయ్ ఆర్. మళ్ళ రేపు కల్సుకుందం. ముచ్చట్లు చెప్పుకుందం" అన్నాడు శేషావతారం.

"వొకే సీయూ మైడియర్ శేషాకూర్మా" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"నీకు కుర్మా, కోడి కుర్మా యిష్టమేనా?" అన్నాడు శేషావతారం.

కూర్మావతారం గుర్రుగా చూసి, "నీకు శేష కుర్మా అంటే పాము కుర్మా యిష్టమేనా?" అన్నాడు.

"షటప్. నేను బ్రాహ్మణ్ని. శాకాహారిని. సుబ్రహ్మణ్యాన్ని. పాముల దేవుణ్ని" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"యస్ యస్. నువ్వు పాములదేవువివి. పాములను పోషించగలవు చంపగలవు. యు ఆర్ స్నేక్ కింగ్. యు ఆర్ యె రూలర్" అన్నాడు శేషావతారం.

"యస్, నేను కింగ్‌ని. రూలర్‌ని. ఐ విల్ రూల్ ది రూల్స్. సీ, రూలింగ్ ది రూల్స్, రూలింగ్ ది రూల్స్. హిఁహిఁ బట్ ది రూలర్

రూల్డ్. అందుకే ఫుట్టో యీజ్ హ్యాంగ్డ్. ఫుట్టో యీజ్ హ్యాంగ్డ్, హీహిఁ"

"మళ్ళ మొదటికొస్తున్నడు" నీరసంగా అన్నాడు కూర్మావతారం, శేషవతారం చెవిలో.

"దట్ యీజ్ ఫైన్. వొక సర్కిల్ కంప్లీట్. ఐవట్లు యె చెయిన్ ఆఫ్ సర్కిల్స్ మన థెరపీ థియరీ అవర్ యిన్‌వెన్షన్" అన్నాడు శేషావతారం.

"పీడు యాడ?" అన్నాడు కూర్మావతారం, సుబ్రహ్మణ్యం కన పడక.

గది అంతా వెదికారు. డ్రాయరు కిందా, కుర్చీ వెనకా, అల్మారా వెనకా — వెదుకుతున్నారు.

తలుపు కొద్దిగా తెరిచి, "సార్" అన్నాడు శాయోజీరావు.

యిద్దరూ వెనక్కి తిరిగి గుమ్మం కి వెళ్ళారు.

గుమ్మం అవతల, "భట్టో యీజ్ హ్యాంగ్డ్ హిహి" అని అంటూ అన్న పక్కన సుందని గెంతుతున్నాడు సుబ్రహ్మణ్యం.

యిద్దరూ వెర్రిమొహం లేసుకుని బయటికొచ్చి, "రేపు రాత్రి" అని అన్నదమ్ములు ముందు వెడుతూంటే, "వుయ్ గాట్ ఆల్ ది బేసిక్ మేటర్. జెల్దీ క్యూర్ ఐపోతడు" అన్నాడు శాయోజీరావు.

'క్యూర్ అవుతాడో కూరవుతాడో—' అని దిగులుగా అనుకుంటూ, "అలాగేనండి. రేపు యిదే వేళకి తీసుకొస్తాం" అన్నాడు శాయోజీరావు.

# 129

తీగ లాగితే డొంకంతా కదిలినట్లు : వెంకటావధాని, సుబ్రహ్మణ్యంల సస్పెన్షన్‌కి కారకులైన వెంకటేశ్వరరావు. శఠగోపంలను పోలీసులు అరెస్టు చెయ్యడంతో, డొంకంతా కాకపోయినా కొంత మేరకి కదిలింది. రాతి పిండాల నుంచే కక్కించగల పోలీసులు వీళ్ళిద్దరినుంచి చాలా విషయాలు కక్కించారు.

ఐతే వాటిలో కొన్నిటిని సస్పిషన్ గ్రౌండ్స్ కూడా దొరకక వొదిలెయ్యగా ఐదారుగురిని అరెస్టు చెయ్యటానికి వీలైంది. యీ ఫోర్జరీ కేసు వెదుకులాటలో దొంగనోట్ల ముఠా వొకటి, స్మగ్లింగ్ ముఠా వొకటి అరబ్బు షేకులకి ఆడపిల్లల్ని మోసగించో మోజు పెట్టో అమ్మే పే ముఠా, వొకటి బయటపడ్డాయి.

దొంగనోట్ల చెలామణికి హోటల్ అన్నవన్ కేంద్రం అని అనుమానాధారాలు దొరికాయి. ఆ లింకులు అటు ఢిల్లీ దాకా యిటు కోయంబత్తూరు దాకా వున్నాయి. హోటల్ కిచెన్ హాలుకి ప్రక్క గోడలోని దొంగ అరలో దొంగ నోట్ల కట్టలు దొరికాయి. మేనేజరుచేత కక్కించిన విషయాల ఆధారంగా విజయ్‌కుమార్‌ని అరెస్టు చేశారు. డి. ఐ. జీ. గా పని చేస్తున్న వాళ్ళ చుట్టం మీదే రెండు యె. సి. బి కేసులు యిప్పటికే సాగుతూ వుండటంవల్ల అతను ఆదుకోలేకపోయాడు. ఐతే యిటీవల విరసం వొదిలేసి గోవర్ధన్‌రెడ్డికి దగ్గిరయ్యి అతనూ తమా కలిసి బినామీ పేర్లతో రెండు పెద్ద వ్యాపారాలు ప్రారంభించారు. ఆ దృష్ట్యా గోవర్ధన్‌రెడ్డి తెర వెనక

నుంచి పలుకుబడి వుపయోగించి బెయిల్ మీద విడుదల చేయించాడు. ఐతే గోవర్ధన్‌రెడ్డి పేరు మాత్రంగానూ రంగంలోకి రాలేదు. మూలవిరాట్టు, విజయ్‌కుమార్ పింతంత్రి తప్పుకోగలిగాడు. అతడిని అరెస్టు చెయ్యటానికి ఆధారాలు దొరికితే -- అపరిష్కృతంగా వున్న రెండు ఖూనీ కేసులు, వొక ఆత్మహత్య కేసు విడిపడే అవకాశామిండేవి. యీ అదును చూపి, విజయ్ కుమార్ మొదటి భార్య సీత వాళ్ళ తరపు లాయరు సీత మరణం హత్య అని కొన్ని పాయింట్లు లేవనెత్తి కేసుకి కొత్త మలుపు యిచ్చాడు.

పాతికవేల రూపాయల ఆ సిజూపి హోటల్లోని వొక వంటకవితో, ఆ గూడూ ఆ నోట్లూ తన వనేనవి చెప్పించాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ యిది కల్పించిన సాక్ష్యం అంటూ వాది చటం మొదలెట్టాడు. ఆపబ్లిక్‌ప్రాసిక్యూటర్ సీత వాళ్ళకి బంధువు.

మొత్తం్లో విజయ్‌కుమార్ బెంబేలెత్తిపోయాడు. కనకదుర్గ చివాట్లే సింది— యీ తప్పుడు పనులు చెయ్యకుండా చట్టబద్ధంగా వ్యాపారాలుచేసుకో వొచ్చుగా—అని. స్త్రీల విషయంలో విరసం విషయంలో వ్యాపారం పట్ల ఆసక్తి విషయంలో తను గీసిన గీటులో వుంటున్నాడని సంతోషిస్తోంది. వుండటం మొదలెట్టి వ్యాపారం మీదకి దృష్టి బాగామళ్ళి పీటిలోకిన్వయంగా దిగాడు. యిలాంటివి ప్రారంభించినట్లు ఆమెకు తెలియదు. కనకదుర్గ కాళ్ళు పట్టుకుని—తన ఫ్రెండ్ వందనకి చెప్పి వాళ్ళ నాన్న అడుకునేలాగా చూడ మని. "ఛీఛీ. యిట్లాంటి పనుల విషయంలో వందననిచస్తే అడగను" అంది "మీ నాన్నని రెండు లక్షలు సర్దమను. డబ్బు విరజిమ్మాల్సిన పరిస్థితి యీ ప్రస్తుత పరిస్థితిలో క్యాష్ సరిగా రొటేట్ అవదు" అని ప్రాధేయపడితే, "ఆ పనైతే చేయించుతాను" అంది యిప్పించింది. అది కొందరు అధికారు లకి పంచి, కేసు బలహీనపరిపించె ఆలోచనలో వున్నాడు. "నాపేరు గిట్ల బయటకు తెస్తివా, అస్సలుకె మోసమొస్తది" అని వార్నింగిచ్చాడు గోవర్ధన్ రెడ్డి. "ఛఛ, ప్రాణంపోయినా నిన్ను పీసులోకి తీసుకురాను"అన్నాడు విజయ్ కుమార్.

స్మగ్లింగ్‌కి సంబంధించి యింద్రారెడ్డి చిక్కాడు. యింద్రారెడ్డి పోలీసు కస్టడీలో వుండగా సూర్యప్రకాశ్ పేరు బయట పెట్టాడు. అతని "ఉంటి" వునికి యింద్రారెడ్డికికూడా తెలియదు. సూర్యప్రకాశ్‌ని అరెస్టు చెయ్యటానికి ఆధారాలెంత మాత్రం దొరకలేదు —యింద్రారెడ్డి మాటలు తప్ప. యింద్రా

రెడ్డి చెప్పిన ప్రకారం సూర్యమహల్‌కి వెళ్ళి గాలించారు. యెక్కడ వడితే అక్కడ తవ్వినా పడగొట్టినా భూగృహం అంటూ దొరకలేదు. సూర్య ప్రకాశ్ యెదురు కేసు పెట్టాడు—తన విరోధులతో కుమ్మక్కయి కక్ష సాధింపుగా చేశారని, నష్టపరిహారానికి పరువు నష్టానికీ, దావావేశాడు.

నేరం తనమీదనుంచి సూర్యప్రకాశ్ మీదకి వడితే తను స్వల్ప శిక్షతో త్వరలో బయట పడవొచ్చుననీ సూర్యప్రకాశ్‌కి ఆజన్మ ఖైదు వేస్తారనీ వూహించి తనకి తెలిసిన సమాచారం అందిస్తే—చివరికి యిలా అయ్యే సరికి యిప్పుడు వాణికిపోతున్నాడు యింద్రారెడ్డి — తను బయట పడిన మరుక్షణం తన ప్రాణాలు దక్కవని.

అరబ్బులకి ఆడపిల్లల్ని మాయజేసో మోసగించో అమ్ముకున్న నేరానికని, వెనక నిజాం కాలేజీలో చదివిన అక్తర్‌ని అరెస్టు చేశారు. అతని తండ్రి గవర్నమెంటు ప్రెస్సులో కంపోజిటర్‌గా చేస్తూండేవాడు, అప్పట్లో. యిప్పుడు వాళ్ళకో మంచి బంగళా వుంది. యీ విషయంలో అక్తర్‌కి తోడుగా యింద్రారెడ్డికూడా వున్నట్లుఅనుమానాధారాలు దొరికాయిపోలీసులకి.

సూర్యప్రకాశ్ విడిగా నడుపుతున్న మ్యాస్సేజ్ పార్లర్ మీదకూడా వొకేసమయంలో దాడిచేశారు. అప్పుడు నగ్నంగా వున్న యువతులు కొందరు మగాళ్ళకి వొళ్ళు పడుతూ సరససల్లాపాలలో వుండగా పట్టుకున్నారు. ఆ ఆధారంగా ఆ మ్యాస్సేజ్ పార్లర్‌ని మూయించారు. అందుగురించి, సూర్యప్రకాశ్‌ని అరెస్ట్ చెయ్యబోతే అదితనది కానేకాదనీ తానొక కస్టమర్‌ని మాత్రమేననీ, ఐతే తనెప్పుడూ అలాంటి సరససల్లాపాల అనుభవంలేదని చెప్పాడు. లైసెన్సులు రికార్డులు అవీ తీయించి చూస్తే, పేరు సూర్యప్రకాశ్ అనే వుందిగాని ఆ దరఖాస్తు ఫారాలమీదా యితరచోట్లా సూర్యప్రకాశ్ అని వున్న సంతకాలు అతని దస్తూరి కాదని తేలింది. కిరాయి మనిషితో చాడనే ఆరోపణలతో అరెస్ట్ చెయ్యాలని చూసినా వీలుపడలేదు. చివరికి ఆ ఆరోపణలతో కేసుపెట్టే ఆలోచనలో వున్నారు పోలీసులు.

యీ దాడులు జరిగిన వొక గంట తరవాత సూర్యమహల్ పరిసరాలలో యిద్దరువ్యక్తులు తుపాకీ కాల్పులకిగురై మరణించారు .వాళ్ళు సూర్యమహల్‌కి చెందిన వ్యక్తులు అని పోలీసులు నిర్ధారించలేకపోయారు వాళ్ళ పక్కనే తుపాకి కూడా పారేసివుంది. తుపాకీమీద యెలాంటి గుర్తులూ ముద్రలూ లేవు. నాటు తుపాకి,

# 130

శ్రీపతి, స్కైలాబ్ ఆస్ట్రేలియా భూభాగంమీద కూలినవివరాలు చదువుతూండగా వుత్తరాలొచ్చాయి. వాటిలో వొకటి రంగారెడ్డి దగ్గిర్నించి- శుభలేఖతో పాటు, తన పెళ్ళికి తప్పకుండా రావాలని ప్రత్యేకం వుత్తరం రాశాడు యింగ్లీషులో. చివర్న, "యింగ్లిష్ నాకు మంచిగొస్తదని కాదు. తెలుగు అంత గూడ రాదు. అందుకోసం యింగ్లిష్‌ల రాస్తి" అని తెలుగులో జోడించాడు

రంగారెడ్డి రెండు నెలల్క్రితం సిటీకి వొచ్చినప్పుడు, ప్రత్యేకం శ్రీపతిని వెదుక్కుంటూ హాస్టలికి వొచ్చాడు.

కాసేపు అవీ యివీ మాట్లాడి, "యీ రండ ముండలంటె మనసైత లేదు. యిట్లయితె హెల్త్ గూడ యెన్ని దినాలుంటది. పెండ్లి చేస్కుంటే యెట్లుంటదంటరు శ్రీపతిగారు?" అన్నారు రంగారెడ్డి.

"నాకు పెళ్ళి కాలేదుగా యెలావుండేదీ చెప్పటానికి"

"మజాక్ అనుడు కాదు సీరియస్‌గా ఆలోచన చేస్తున్న. పెండ్లి చేస్కోని మంచిగ పెండ్లంతోటి వుండిపోతె మేలుకాదు? యేమిట్కి గలీజు రండముండలెన్క తిరుగుడు"

"అనిపిస్తే చేసుకోగూడదని లేదు"

"కానీ వొక ప్రోబ్లమ్ వున్నది, అది మీరు సాల్వ్ చేసిపెడ్తరేమొ నని ఆశపడ్తున్న"

"నేనా? యేమిటి?"

"నాకిప్పుడు ముప్పయ్యేండ్లొచ్చె. యిరవై పాతికేండ్లామెను చేస్కుంటె, ఆమె కన్యగా వుండి వుంటదా అంతకాలం?"

"మనం వున్నాంగా?"

"అదేగద నా సమస్య. అందుకోసం మెచ్యూర్ కాని పిల్లను చేస్కోనాల."

"రజస్వల కాకపోవటం అంటే చట్ట ప్రకారం వివాహ వయసు వొచ్చి వుండే అవకాశం లేదు. అది నేరం అవుతుంది."

"ఆ ముచ్చటిక్కాదు. దానికేమి యెక్కువ వయసు చెప్తం పూర్త మననడిగెటోడెవడు"

"మరింకేం? వో పదిపన్నెండేళ్ళ పిల్లనిచూసి చేసుకోండి" అన్నాడు శ్రీపతి.

"చేసుకోవచ్చుగానీ — అంత చిన్నామెను చేసుకుంటె— ఆమెకు ముప్పయ్ ఐదేండ్లంట్ల వొచ్చేటప్పటికి నేను ముసలోణ్నై పోత గద! యిప్పటికె మస్తు పోటెన్సీ స్పెండ్ చేసిన. అప్పుడామె యెవనితోనన్న తిర్గితె

'అవసరం తీరాలిగా. మనకి సాధ్యపడనప్పుడు యేం చేస్తాం"!

"సొంత పెండ్లం అట్ల తిర్గితె యెట్ల? ఫెయిత్‌ఫుల్‌గ వుండాల. దీనికి పరిష్కారం యేమన్న చెప్పండి" అన్నాడు రంగారెడ్డి.

"దీన్ని పేరడాక్సికల్ పోయింట్‌గా చెప్పొచ్చు. మన వయసుకి తగిన యువతిని చేసుకుంటే కన్యగా వుండి వుండదేమోననే యిది. అనుమానం పెనుభూతం. పోనీ రజస్వలవని చిన్నపిల్లని చేసుకుంటే ఆమె మాంచి ప్రౌఢగా వుండే వేళకి మనం ముసలివాళ్ళ మైపోయి— యెప్పుడో అమావాస్యకో, పౌర్ణమికో, యెప్పుడన్నా తెల్లవారు జామున పైరుగాలికి తప్ప యేం చెయ్యలేని స్థితి" అన్నాడు శ్రీపతి.

"మరి దీనికి సొల్యూషన్ యేమ్టి?"

"దీనికి పూసే సొల్యూషనింకా తయారైనట్లులేదు" అని చిన్నగా నవ్వి, "రజస్వలకాని పిల్లనిచేసుకుని మనకి పటుత్వంపోయి ఆమె ప్రౌఢగా వున్నప్పుడు ఆమెకు విడాకులిచ్చి మరో రజస్వల కాని పిల్లని చేసుకుంటే సరి!"

"అప్పుడు గూడ సమస్యనే గద? మెచ్యూర్ కాంగనె కోర్కె మెద లవుతది."

"అందుకే మన పూర్వీకులు చిన్నప్పుడే పెళ్ళిళ్ళు చేసేవారు, మీ పదహారేళ్ళప్పుడు పదకొండేళ్ళ పిల్లతో పెళ్ళి చేసివుంటే యీ సమస్య వుండకపోను గద!" అన్నాడు శ్రీపతి నవ్వు ఆపుకుంటూ.

"మా అమ్మకు నాయ్నకు అంత గూడ జ్ఞానం లేకపాయె. అప్పుడె పెండ్లి చేసుంటె నేనీ రంత ముండలతోటి తిరగనె పోదు. ధూ గలీజ్ ముండలు.

"ఆలస్యంగా జ్ఞానోదయం ఐతే కష్టం"

"పెళ్ళంటూ చేసుకోకపోతే అసలు యీ సమస్యే రాదుకదా?"

"కాని అవసరం తీరెడిదెట్లా? యింక గూడ కొన్నేండ్లు అవసరం వుంటదిగద! కాంగ పెండ్లాం పిల్లలు వుండాలగదా? యిగో యీ పోరడు యీ పోరి సింగిరెడ్డి రంగారెడ్డి పిల్లలు అని చెప్పుకుంటెనెగద మనం బతికుండెడిది? లేకుంటె చచ్చిపోంగనె మననెవరు యేమిట్కి తలుస్తరు?"

"అందుకే సంతానం కలగనివాళ్ళు యే సత్రవో గుడో బడో యేదో కట్టిస్తుంటారు వాళ్ళపేర."

"రాయి రప్పలు బిడ్డల లెక్కవుతారు, కాంగ మన సొంత పిల్లలంటె ఆనందంగుంటది గద"

"మాచకమ్మ అని రజస్వలవని పెద్దవాళ్ళంటారు. వాళ్ళని చేసుకోవొచ్చు"

"చేస్కున్నంక రజస్వలైతరా?"

"వాళ్ళు యెప్పటికీ అవరు. అయ్యేవాళ్ళైతే యేప్పుడో అయ్యేవాళ్ళు"

"గిదింక మంచి జోక్! యీ సిటీల మస్తుమంది వున్నరు హిజ్రాలు వాండ్లే మేలుకద" అని నవ్వాడు రంగారెడ్డి.

"నూటికీ కోటికీ వో ఫ్రిజిడ్ వుండొచ్చు. అసలు సెక్సు కోర్కె వుండదు. అలాంటి స్త్రీని చూసి చేసుకోవటం వొక మార్గం"

"అంత గూడ కోర్కెలేకుంటె చేస్కున్నంక దగ్గరకు చేరనిస్తదా?"

"వుఁహూఁ దగ్గిరికెడితె గాడిద తన్నినట్లు తంతుంది" అని నవ్వాడు

"యివన్ని చూస్తె సన్యాసం పుచ్చుకోవాలన్నట్లా యేమి?"

"దేనికుండే బాధలు దానికుంటాయి. సన్యాసం బాధలు సన్యాసికుంటాయి. మరోమార్గం — వో కొండముచ్చు లాంటిదాన్ని చూసి చేసుకోవటం"

"అసుమంటి దాన్ని చేస్కుంటె తాకబుద్ధి కాదుగద! మర్ల రండ ముండలెక్క తిర్గాలె!"

"కాదంటే, మీ పెద్దవాళ్ళకి వొదిలెయ్. పెళ్ళిచూపులు కూడా వొద్దు. అన్నీ వాళ్ళమీదకి నెట్టి తిట్టి తప్పుకుంటూ వుండొచ్చు, దేనికీ మన పూచీ వుండదు"

"కాని మన పెద్దవాండ్లు మనం బిత్కినంత కాలం బత్కరుగద! వాండ్లు చచ్చిపోయినంక యెవర్ని తిట్టాలె?"

"మన పిల్లల్ని"

"మన పోరళ్ళను ఉద్దె వూకుంటరు! వుల్టా దబాయిస్తరు. మమ్మల్నెవరు కనమన్నరు? మేమడిగితిమా! అని అంటె చప్పుడు చెయ్యక నోరు మూసుకోవాల"

"యిదీ కాదంటే సిసలైన పరిష్కారం వొకటుంది, చెబుతాను. అది ప్రయత్నించి చూడండి, మీ వాళ్ళ పెళ్ళి సంబంధాలు చూశాక పెళ్ళి చూపులయ్యాక బాగా నచ్చిన వాళ్ళని సెలక్టు చేసుకుని పెట్టుకుని వొక్కొక్కరి పేరున — రూపాయి బిళ్ళతో టాస్ వెయ్యి. చిత్తుపడినా వొద్దు. బొత్తుపడినా వొద్దు. యెందుకంటే, చిత్తుపడితే వెనకకాలంలో, బొత్తు పడితే ముందుకాలంలో, విశేషానుభవం వుండే మనిషి అనిభావిద్దాం. అలా బొమ్మో బొరుసో కాక కాయిన్ గోడుమీద నిలిచి దొల్లుకుంటూ పోతే—వండగనాడు కూడా పాత మొగుడేనా అన్నట్లు యెప్పుడన్నా జస్ట్‌సింప్లీ ఫర్ యెక్స్‌ట్రా మెరిటల్ యెక్స్‌పీరియన్సెస్ సేక్ —వో పై చూపు చేవేదని ....అలాంటి కేసు ఐతే బాగా కష్టం వొస్తే వొప్పుకొని సర్దుకుపోవచ్చు. కాయిన్ గోడు మీద పడి నిలిచి, దొల్లిపోకండా పడిపోతే నిఖార్సయిన సరుకు అని నిర్ధారించుకో వొచ్చు. ఛీ అన్నా ఛా అన్నా తిట్టినా కొట్టినా విడవకండా పట్టుకు నుండిపోతుంది, యెటూ కన్నెత్తి చూడకండా"

"ఆఁ గిది మంచిగ కొడ్తున్నది. యీ అకేషన్‌ల హోటల్‌కి పోయి మంచిగ బిర్యానీ తిని—సీన్మకు— బ్లాక్‌బెల్ట్ జోన్ చూద్దం పదండి" అన్నాడు రంగారెడ్డి ఉత్సాహంగా.

ఆ తరవాత వూరెళ్ళాక పెళ్ళిచూపులకి వొప్పుకున్నాడు. వచ్చిన వాళ్ళ వివరాలు పుట్టినప్పటినుంచి వాళ్ళ బతుకంతా వివరాలన్నీ తెలుసుకుని చివరిగా సెలక్ట్ ఐన వాళ్ళ గురించి "లెట్ మీ నాట్ బి రెస్పాన్సిబుల్; లెట్ ది కాయిన్ బి రెస్పాన్సిబుల్" అని టాస్ వేస్తూపోయాడు.

తమాషాగా — తనకి అన్ని రకాలుగానూ బాగా నచ్చిన సంబంధం గురించి టాస్ వేసినప్పుడు కాయిన్ గోడుమీదనిలిచి యెటూ దొల్లిపోకండా పడింది.

"కాయిన్ యీజ్ రైట్. ఐయామ్ రైట్. లెట్ ది ఫేట్ అలౌ

బి రైట్" అనుకుని ఆ సంబంధం ఖాయపరచమన్నాడు.

ఆలా జరిగి—పెళ్ళి శుభలేఖలు అచ్చు అయ్యి యీరోజు ఆ శుభ లేఖ రంగారెడ్డి ఉత్తరాన్ని వెంటబెట్టుకుని శ్రీపతి దగ్గిరికి చేరింది.

# 131

## "జయప్రకాష్‌నారాయణ్ చచ్చిపోయిందట"

అంటూ ఆరోజు దినపత్రిక తీసుకొచ్చాడు, రాములు

రాంనగర్ పాకలో పడకకుర్చీలో కూచుని కళ్ళు మూసుకుని వున్న రవి, రెప్పలు విప్పి విక్షిప్తంగా చూసి పత్రిక అందుకుని చూస్తున్నాడు.

రెండు నెలల క్రితం రవికి మంత్రివర్గం నుంచి ఉద్వాసన చెప్పాడు ముఖ్యమంత్రి. ఆ స్థానంలో గోవర్ధన్‌రెడ్డి మంత్రి అయ్యాడు. ఐతే కార్మిక మంత్రిత్వశాఖ మరొకరికి మార్చి ఆ శాఖ గోవర్ధనరెడ్డికి యిచ్చాడు.

యిది జరిగిన రోజున బచ్చుగంగారామూ మిగతా అనుచరులూ సమావేశమై పరిస్థితి చర్చించారు. "యెందుకోసం యిట్లా చేసిందో యెక్స్‌ప్లనేషన్ యిమ్మనాలి" అని తీర్మానించారు. అప్పుడు నళినిచెప్పిన దగ్గిర్నుంచి లోకేష్ తన మద్దతు రవికే అందిస్తున్నాడు—అనుచరుడుగా చేరకపోయినా.

చివరికి ఢిల్లీ వెళ్ళి యిందిరాగాంధీకి జరిగిన అన్యాయం గురించివివరించాలని అందరూ కలిసి తీర్మానించారు. యీ మధ్యకాలంలో రవికిఆమెతో పరిచయం యేర్పడింది గానీ బాగా దగ్గిరిగా తెలియదు. అందరూ కలిసి వెళ్ళారు. "బలప్రదర్శనకా! వీళ్ళంతా దేనికి? వాళ్ళని పంపేసి విషయం నువ్వే చెప్పు." అంది. వివరించాడు రవి. "మీ ముఖ్య మంత్రితో మాట్లాడతాను. మంత్రి పదవే ముఖ్యంకాదు. కొందరు కొన్నాళ్ళుంటారు. మరికొందరు కొన్నాళ్ళుంటారు. యిప్పుడు నాకు యే పదవి వుంది?" అని అంది.

తిరిగి వొచ్చారు. "యీమె కర్నాటక ఆంధ్రా సపోర్టు తోటి బతుకుతున్నది. అందుకోసం వీన్కి బలం మస్తుగున్నది. యేమి చెప్తె అది చేసే లెక్కలేదు. ఆమె కూడ యెట్లంటె అట్ల చెప్పజాలదు. వీనికేమొ పైసతప్ప వేరెదేన్తోటిపనిలేదు. వాడుగోవర్ధన్ మస్తుకమాయించి యిస్తున్నడు. కాంట్రాక్టర్ల తాన లాఖోం రూపయేం చందాలు వసూలుజేసి యిస్తున్నడు. మనం

రవికి ఆ నేర్పు లేదు. యిప్పుడు యే నేర్పూ లేదు. ఆర్థిక శాస్త్రపఠనం యేనాడో ఆగిపోయింది. మంత్రి పదవి అధికార హోదాలు సన్మానాలు వంటివి తప్ప అతని మనసును కదల్చగలిగేవి మరింకేవీ లేవు.

యిప్పటికీ తన నియోజకవర్గంలో బాగా పలుకుబడి వుంది. అతనిని మంత్రి పదవి నుంచి తప్పించినందుకు అతని వోటర్లు ముఖ్యమంత్రిని దూషిస్తూవుంటారు. అంతవరకు సంతృప్తిగానీ, యింత స్వల్పమైన బ్రతుకుఅసహనంగా అనిపిస్తూ వుంటోంది. ప్రజల పనులు చేయించి పెడుతూనే వున్నాడు కానీ పూర్వపు వుత్సాహం, వుద్వేగం లేవు.

యిక్కడ వుండి పోయినరోజున రాములే వొండిపెడతాడు, రవికి. అతను యెలాగూ వొండుకు తింటాడు. రవివుంటే ప్రత్యేకంగా వంటచేస్తూంటాడు. మొదట్లో, యింటి నుంచి క్యారియరు పంపిస్తే వొద్దని చెప్పాడు. అప్పుడప్పుడు అక్కడా వుంటూంటాడు.

గంగికి కూడా ఆదాయం తగ్గింది — రవి మంత్రిపదవి పోవటంతోనూ, అతని నిర్లిప్తత వల్లా—ఐనా యిప్పటికే వున్న స్థితి వల్లా పరిచయాలూ ఆబ్లిగేషన్లవల్లా తానుగా కొన్ని పనులు చేయించగలదు. లాభం లేకండా యే పనీ చేయించిపెట్టదు యెవరికీ ఆ పైన కొన్ని సంస్థలలో షేర్సు వున్నాయి. కొన్ని వ్యాపారా లున్నాయి. బ్యాంకు బ్యాలన్సూ వుంది. పదిశాతం కుర్రాళ్ళమీదఖర్చు పెడుతుంది. గడిచిపోతోంది. ఐతే రవి మంత్రిగా వున్నప్పటి హోదా దర్జా ఆ యిది లేదని గిజగిజ లాడిపోతూ వుంటుంది వొకోక్కసారి.

రవి, వొకోక్కక్షణంలో భరించలేనట్లుగా పిచ్చెక్కినట్లుగా ఐపోతుంటాడు. యేవొక సమస్య గురించి కార్మికుల్ని రెచ్చగొట్టి గొడవచేయిస్తుంటాడు తాను బయటపడకండా. ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీకి గోవర్ధన్‌రెడ్డి వుత్తరాలు రాయించాడు. రవి, పార్టీకి పార్టీ నియమావళికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నాడని. ముఖ్యమంత్రి వొకసారి స్వయంగా వార్నింగిచ్చి, అవసరం ఐతే యిందిరాగాంధీ మందలింపు కూడా తప్పదని వాయించాడు, రవిని.

"వీడు యెట్లాంటె అట్ల నడుస్తున్నదిప్పుడు. మార్నింగ్ ఆఫీసులు పెట్టినా వాన్ వే ట్రాఫిక్‌లు పెట్టినా యేమి చెసినగూడ యెదురులేక నడుస్తున్నది వీని మాట" అని దగ్గగా అనుకుంటూ వుంటారు గంగారాంవాళ్ళు,

అప్పుడప్పుడు.

ఓ రోజున రవి పాకలో పడక కుర్చీలో నిద్రపోతూండగా విమల ప్రసాద్‌లు వొచ్చారు.

కారు చప్పుడికి మెలుకువొచ్చి రెప్పలు విప్పాడు.

లోనకి వొస్తూ, "అక్కడికి వెళ్తే యిక్కడున్నావని చెప్పారుబావా" అంది విమల.

నాడు తను తిరస్కరించినప్పుడు, పెళ్ళికి హాజరవనప్పుడు, వర్కర్‌గా ఫ్యాక్టరీలో పని చేస్తున్నప్పుడు, అసెంబ్లీకి యెన్నికైనప్పుడు, మినిస్టరుగా వున్నప్పుడు—నాడూ నేడూ అదే ఆప్యాయత! అని అనుకుని వేదనతో కంపించాడు. ఆమె "బావా" అనే ఆ పిలుపులో యిప్పుడు యిన్నాళ్ళకి యెంతో మాధుర్యం, ప్రేమ కనిపించాయి రవికి.

పరిశీలనగా చూశాడు.

అదే వెంకటగిరి చీరలు, అవే నగలు—అతి స్వల్పంగా. అదేరూపు అదే తీరు.

'ఆనాడు పరమ మూర్ఖంగా ప్రవర్తించానేమో అనిపిస్తోంది' అనుకున్నాడు. ఆ భావనకి ముఖం బాధతో వాడిలింది.

"యేం బావా అట్లా వున్నావు? వొంట్లో బాగాలేదా? యేమండీ మీరు వెళ్ళి డాక్టర్ని తీసుకురారూ, మా బావకి వొంట్లో బాగా లేదు—చిన్నప్పుడు తనకి తలనొప్పిగా వున్నా జ్వరంగా వున్నా నన్ను అకారణంగా తిట్టేవాడు" అని రవి వంక చూసి, "యేం బావా గుర్తుందా?" అంది.

"మరి వెళ్ళనా?" అన్నాడు ప్రసాద్.

రవి అందుకుని, "అబ్బే లేదండీ. నా వొంట్లో బాగానే వుంది. నిద్ర లేచానిప్పుడే. కొంచెం డల్‌గా కనిపిస్తున్నానేమో." అన్నాడు.

అంతలో కారుకోంచి వాళ్ళ పిల్లలు— ఆడ, మగ— యిద్దరూ వొచ్చారు గెంతుకుంటూ.

ఆ పిల్లనీ పిల్లణ్ణీ దగ్గిరికి తీసుకున్నాడు రవి. వొళ్ళు యేదో అనిర్వచనీయమైన భావంతో జలదరించింది.

"రేపు సత్యనారాయణ వ్రతం. తప్పకుండా రావాలి" అంది. అని, "మా నాన్న లేడులే వూళ్ళో. నీకేం అభ్యంతరం వుండక్కర్లా" అంది.

"మంచే నాకేం విమలా రావటానికి? వునా వొసా" అన్నాడు.

"నిజం!" అని సంతోషంతో పొంగిపోతూ, "బావా నువ్వు వస్తా వని చెప్పలేదుగానీ నాన్న యెన్నోసార్లు అన్నాడు. పోనీ నేనెళ్ళి పలకరించనా వొకసారి. అదేమన్నా పట్టుదలేమో, కావలసిన వాళ్ళం యెల్లకాలం దేనికి పట్టింపులు అన్నాడు" అంది.

'మంత్రి పదవి కూడా వూడిపోయి యిట్లా పాకలో పడివుంటేవీళ్ళకి ఆ ఆప్యాయత యింకా వుంది. నాలోనే యేదో లోపం వుందేమో—'అనుకుని "తప్పకుండా వొస్తాను విమలా. ప్రసాద్‌గారూ మీరు నుంచునేవున్నారు అయ్యో నేను గమనించనేలేదు"అన్నాడు.

"నేనంటే చిన్నప్పటినించీ నీతో తిట్లూ చివాట్లూ తిన్న దాన్ని కాబట్టి కూర్చోమనక పోయినా కూర్చున్నాను" అని చిన్నగా నవ్వింది విమల.

ఆ నవ్వు యెంతో స్వచ్ఛంగా ప్రవిమలంగా అనిపించింది రవికి.

అతని కుర్చీకి అటుగా దావమీద కూచునివుంది.

ప్రసాద్, వొక అడుగు అటువేసి మంచం అంచుమీద కూర్చున్నాడు

మరి కొద్దిసేపు కబుర్లు. రాములు వెళ్ళి కాఫీ కలిపి తెచ్చియిచ్చాడు.

వాళ్ళకి రాములుతెలుసు. గంగితో పెళ్ళి, యెమ్మెల్యే అవటం, మినిస్టరవటం—వీటి వేటికీ యెవరి యేలక్షణాలకి అంటకండా—నాటికీ నేటికీ అదే ఫ్యాక్టరీలో అదే పనిచేస్తూ, వొండుకుని తినివుంటాడనీ రవి అంటే యీ నాటికీ అతనికి వొకలాంటి గౌరవం అభిమానం అనీ.

"నువ్వుకూడా రావాలి రాములూ" అని చెప్పారు—విమల, ప్రసాద్ యిద్దరూ.

వెళ్ళిపోయారు

రవి అలాగే పడుకుని కనురెప్పలు వాల్చాడు. కళ్ళలోంచి చెమ్మవుబికింది.

రాములు ఫ్యాక్టరీకి వెళ్ళిపోయాడు.

అరగంటసేపు అలాగే పడుకుని లేచాడు రవి.

గుడిశ బయటికి వొచ్చి కాసేపు అటూ యిటూ మొక్కల్లో తిరిగాడు.

పూలమొక్కల్లో నడుస్తూ—

గులాబీ మొక్కలు—యెవగకండా అట్లాగే వుంకిపోయి గుంటపూలు పూసే వల్లగులాబీ మొక్కలు.

చెయ్యి గడ్డంకేసి రుద్దుకున్నాడు.

రెండు నిమిషాలు వాటి వంక చూస్తూ నుంచున్నాడు.

చటుక్కున వొంగి వాటిని పట్టుకుని బలంగా పీకి అవతలికివిసిరాడు.

ముళ్ళు గుచ్చుకుని అరిచేతుల్లో అక్కడక్కడ నెత్తురు చెమర్చింది.

వొచ్చి కుర్చీలో కూచున్నాడు.

చేతులవొంక చూసుకుంటూ, కుడి చూపుడు వేలితో యెడమ అరి చేతిలో చెమర్చిన నెత్తుటి బొట్లమీద రాశాడు. యెడమ చూపుడు వేలితో కుడి అరిచేతిలో చెమర్చిన నెత్తుటి బొట్లమీద రాశాడు· రెండు అరిచేతులూ వొకదానికొకటి ఆనించి జరిపి తెరచి చూసుకున్నాడు. చేతుల్లోని గీతలలో స్థిరపడింది నెత్తురు. వెనక్కి వొరిగి కనురెప్పలు వాల్చాడు.

పది నిమిషాలు.

చేత్తో గడ్డం రుద్దుకున్నాడు. లేచాడు

బయటికి వెళ్ళి పీకేసిన ఆ గులాబీ మొక్కలు తెచ్చి యధాస్థానంలో నాటి కుదురు చేశాడు రవి.

## 132

అప్పటిదాకా లేబొరేటరీలో పనిచేసి యింటి కొచ్చిన అనంత్‌రెడ్డి బాత్రూంలోకివెళ్ళి స్నానిస్తున్నాడు. స్నానిస్తుండగా, "ప్లజంట్ గా వుంది. యీవెనింగ్ అట్లా యెక్కడైనా పోతే—" అనిపించింది.

మస్తాబై వొచ్చి ఆ మాట అన్నాడు స్వప్నరాగలినతో.

పేము కుర్చీలో ఆమె. ఆమె పక్కన వున్న బల్లమీది టేప్‌రికార్డర్ లోంచి శుద్ధ ధన్యాసి రాగం—వయొలిన్.

ఆ లోపల్నుంచే "వూఁ" అంది, వయొలిన స్వప్నరాగలీన.

"యే లోకంలో వున్నావు స్వప్నా! సంగీతం వుంటే మరింకేం అక్కర్లేదు" అని మళ్ళీ చెప్పాడు.

"వెళదామంటారా?" అంది నిదానంగా.

"వూఁ. యెంత ప్లజంట్‌గా వుందో చూడు యీ సాయంత్రం

వెళ్దామా" అన్నాడు

"వో" అంది.

పావుగంటలో బయల్దేరారు. అతని దగ్గిరున్న మూడు గిటార్లలో చిన్నది తీసి భుజానికి తగిలించుకున్నాడు.

కారు వేగంగా పోతోంది.

వూరు దాటింది కారు. చుట్టూ మైదానాలు, బీడుభూములు.

"యెటు వెళ్దాం" అన్నాడు.

"యెటనేంవుంది? పోనీండి యెక్కడన్నా కూచోవాలనిపిస్తే కూచుందాం లేకపోతే యిలా వెళ్ళి అలా తిరిగి వొచ్చేద్దాం" అంది.

కారు వేగంగా పోతోంది.

పావుగంట.

దారిలో సడన్‌గా రోడ్డుమీదకి కోడెదూడ వొస్తే దాన్ని తప్పించటం కోసం స్టీరింగ్ గిర్రున తిప్పుతూ బ్రేక్ నొక్కాడు.

బలమైన కుదుపు. రోడ్డువారగా ఆగింది కారు. రోడ్డు అవతల పెద్ద గొయ్యి.

ముందుకి తూలి డాష్‌బోర్డు మీద వాలింది. చేతులు ఆనించబట్టి యెక్కడా దెబ్బ తగలలేదు. అరిచేతులు నొప్పిగా వొత్తుకున్నాయి. మోచేతులు పట్టినట్లుగా అయ్యాయి.

"చేతులు ఆనించక పోయివుంటే తల తగిలివుంటే చచ్చిపోయి వుందును యీపాటికి" అని చిన్నగా నవ్వింది.

ఆమె మూతి మీద అరిచెయ్యి ఆన్చాడు.

"నే చచ్చిపోతే యేం చేస్తారు?" అంది.

"నేనూ చచ్చిపోతాను"

"అబ్బ మీ మాట కాదు. నేను చచ్చిపోతే నన్నేం చేస్తారూ అని. నాతో పాటు ఆ పెయింటింగ్ కూడా దహనం చెయ్యండి" అంది.

"విశ్వలీవ" చిత్రలేఖనాన్ని, చక్కని కొయ్యచట్రం చేయించి పడక గదిలో గోడకు తగిలించి, తెర అమర్చింది. రాత్రి పడుకునేటప్పుడు తెర తొలగిస్తుంది. వుదయం లేస్తూనే తెర వేసేస్తుంది.

"యింత చల్లనివేళ చావు కబుర్లు దేనికి?" అన్నాడు.

"అవునవును. మళ్ళీ యీ కారు స్టార్టు చేసేలోగా నేను చచ్చిపోతే" అన్నాడు అనంత్‌రెడ్డి.

"షటప్" అంది కోపంగా అసహనంగా.

వొక నిమిషం ఆగి. "స్వప్నా, ఆ మాటకి నీకు అంతకోపం వచ్చి వదే, మరి నేనేమనాలి నిన్ను?" అన్నాడు నిదానంగా.

"లెంపలు వాయించాలి. యింకా కోపం వొస్తే మంచి ముద్దొకటి వ్వాలి" అని చిర్నవ్వింది.

ఆనవ్వు నవ్వడికి అతని గుండె జలతరంగిణిలా ఫలించింది.

కారు స్టార్టుచేసి రివర్స్ గేరులో కొద్దిగా వెనక్కి పోనిచ్చి, రోడ్డు మీదకి తిప్పుకుని— వేగంగా పోతున్నాడు.

"మీరు అంత వేగంగా వెడుతూంటే యివన్నీ నాకు సరిగా కనిపించ కండా తప్పించుకుని పారిపోతున్నాయి" అంది.

తృప్తిగా నవ్వి, వేగం తగ్గించాడు.

కారు సాగిపోతోంది.

"అటు వెళ్ళి కూచుందామా?" అంది వేలితో చూపెడుతూ.

"వో" అని వేగం తగ్గించి రోడ్డువారగా ఆపాడు.

దిగి. నడుస్తూంది.

అతను తాళాలు జేబులో వేసుకుని, గిటార్ భుజానికి తగిలించుకుని అడుగులు వేస్తూ వొచ్చి ఆమెను కలుసుకున్నాడు.

నడుస్తున్నారు.

గుట్టలు, లోయలలాంటి యెత్తుపల్లాలు. పొదలు, గడ్డి.

అటు దూరంగా— అడివి, కొండలు.

యేపుగా పెరిగిన పచ్చగడ్డి యెగుడు దిగుడుగా .... అంటకత్తె రేసిన లాన్‌లా కాక, సినవైన ప్రకృతిలా వుంది.

ఆ పచ్చగడ్డిలో అటూ యిటూ యిటూ అటూ నడుస్తున్నారు.

వొకచోట కూచునిపోయింది.

అతను అటూ యిటూ అడుగులు వేస్తూ, ఆమె వొంక చూస్తూ— ఆవపిండి రంగు చీర. ఆ రంగులో —పండిన ఆకులో పీనెల్లా, అడవిలో చిక్కిరొక్కిరుగా చెట్ల మీద అన్ని వైపులనుంచీ పాకిన తీగల్లా, చిక్కిరొక్కిరుగా పడిన దారాల్లా, యెర్రని గీతల చిక్కిరొక్కిరు గజిబిజి

యెర్రరంగు గీతలు. అదే రంగు బ్లొజు.

పచ్చగడ్డిలో కూచుని; చుట్టూ—ఆ రంగులను చూస్తూ, ఆధ్వనులను వింటూ, ఆ సౌరభాలను పీలుస్తూ—

వెల్లకిలా పడుకుంది. బొక్కబోర్లా పడుకుంది. యిటుపక్కకి వొత్తిగిలి పడుకుంది. అటు పక్కకి వొత్తిగిలి పడుకుంది.

గిటార్ వాయించమంది.

వాయిస్తున్నాడు.

వింటూ ప్రయాణిస్తోంది—

కాని గిటార్ కొంతదూరమే వెడుతుంది. అపైె వయొలిన్ లోంచి సితార్‌లోంచి మహాద్గాత్రంలోంచి వీణలోంచి లోతుకి — సర్వదిక్కుల లోలోతులకి ప్రయాణించే స్పందనాస్తిత్వం—

ఆపమన్నట్లు చేత్తో సూచించింది.

ఆతను గిటార్ అక్కడ గడ్డిమీద పెట్టి, ఆమె పక్కన కూచున్నాడు.

ఆమె యెడమ చేతిని అందుకుని వేళ్ళమీద పెదవులు అద్దాడు. అటు వొంగి పాదాలమీద ముద్దు పెట్టుకున్నాడు. అటు వొంగి నుదుటి మీద ముద్దు పెట్టుకున్నాడు.

యింద్రచాప ధనుర్వీణ మీటుతున్న రసనాద సౌందర్యంలా, ఆమె. మబ్బుల వైభవాన్ని తగ్గిస్తూ యెర్రని పడమటి ఆకాశం, రంగురంగుల మైపూతలు పూసుగుని వింత సొగసులు పోతోంది.

నీలం ఆకాశానికీ పచ్చని కొండలకీ మధ్యగా— కిందికి రాలి పడుతున్న నిప్పు మందారంలా, సూర్యబింబం .

అన్ని దిక్కుల నుంచీ, చీకటి వెలుగులోకి వ్యాపిస్తూంటే, ఆవెలుగు చీకటిని మెరిపిస్తూంటే ....అసురసంధ్య అవధరించింది.

ఆ అసురసంధ్య నుదుట కుంకుమ బొట్టులా, వినీలాకాశపు నీలి కమలనాభ గర్భంలోంచి వుద్భవించిన చంద్రబింబం చిర్నవ్వితే, యింకా తడి ఆరని బట్టలెరగని యిప్పుడే పుట్టిన పసిబాలగా, అంతకుముందెరగని వింతగాలి వొత్తిడికి సంతోషం పట్టలేక కెవ్వుమని నవ్వితే, పుడమితల్లి పరవశించిపోతోంది. ఆ పరవశింపుకి పొంగి పొరలిన స్తన్యం, సమస్త ప్రాణికోటిలో జీవధారగా ప్రవహిస్తోంది.

ఆశ్వయుజ సిద్ధార్థి పూర్ణిమా నిశ, సమస్త ప్రకృతినీ కౌగలించు కొంటోంది. ఆ రీతితో ఆ కౌగిట్లో తన్మయంగా వొదిగిపోయిన ప్రకృతి, లోతవవతతో జ్వలిస్తోంది.

అవతల దూరంగా, పచ్చని పర్వతాల సానువుల్లో— అడవి రగిలి, రంగుల మంటలూ పొగలూ.

ఆమె బొక్కబోర్లా తిరిగి....జరిగి—

కుడి చెయ్యి అతని ఛాతీమీద నుంచి అటు తిరిగి అతని యెడమ చెవి పక్కనుంచి జుట్టులోకి—

యెడమ చెయ్యి పచ్చగడ్డి మీదా, పచ్చగడ్డి వేళ్ళ బిగింపులోనూ.

స్తనాలు, అతని ఛాతీ పక్కగా మెత్తగా గుచ్చుకుంటున్నాయి.

కాలు, అతని మీదకి తిప్పబోయి చటుక్కున తీసేసి, పచ్చగడ్డిమీద అణిచింది. ఆ వొత్తిడికి అన్నట్లుగా, ఆమె కళ్ళలో తడి వులికింది.

తడి వేడెక్కింది.

తొడల మధ్యలో చీర పొరలు పచ్చగడ్డి కొనలు నలుగుతున్నాయి వొత్తిడికి.

అతని నుదుటిమీద పెదవులు అద్దింది.

అతని పెదవుల మీద పెదవులు అద్దింది. నాలికకొనతో అతని పెదవులమీద సుతారంగా మెత్తగా తాకింది. మూతి సున్నాలా చుట్టి, అతని పెదవి మూల ముద్దెట్టుకుంది.

పారిజాతం పూలు రాలినట్లుగా చిరుచిరు ముద్దులు.

అతని పెదవులకి తన పెదవులు అతికించింది.

తెల్లని చల్లని మంచు పర్వతం కరిగి, యెర్రని నెత్తురు పర్వతంలా నెత్తురు పర్వతం రగిలి, పేలిన అగ్నిపర్వతంలా —ఆమె సౌందర్య రస రౌద్రి.

పెదవుల్లోంచి జివ్వుమని షడ్రుచుల సంయోగంలోంచి ఆ స్త్రీత్వరుచి రుచికరంగా రుచిరంగా పెదవులలోని జలగా ప్రవహించి—మాధుర్యపుధార ప్రాణధార జీవధార తేనెధార పాలధార మంచుధారా అగ్నిధార ఆత్మధార.

పెదవులు దారగా పీల్చుతూంటే—ఆ ధారః కండరాలలో నరాలల్లో నెత్తుట్లో అణువణువులో వూపిరిలో జీవంలో ప్రవహించి ప్లావితంగా ప్రవహించి—ప్లావితంగా అవహించి ప్లావితపు నెత్తురు ప్రవహిస్తుంటే ప్రవహించి

ప్రకృతంతా ఆవహించి—

ఆ రసోద్వేగ స్వప్నరాగలీన, ప్రవహించి ఆవహించి ; సమస్త ప్రకృతిలోంచి, పాదాలలోంచి కాళ్ళలోంచి, తొడలలోంచి నడుంలోంచి వక్షంలోంచి స్తనాలలోంచి వీపులోంచి చేతుల్లోంచి కళ్ళల్లోంచి కనుబొమలలోంచి నుదుటిలోంచి శిరసులోంచిజుట్టులోంచి ప్రత్యణువులోంచి, మనోరసవాహి మానస శత సహస్ర తంత్రులై, వున్మాదంగా ప్రకంపించి విశ్వాయన ప్రకృతై, నీరూ నిప్పూ గాలీ నింగీ నేలా కాంతీ ఐ— పెనాలలోంచి అవిరామంగా అనంతంగా ప్రవహిస్తున్న రసధార స్ఖలించి— స్వప్న స్ఖలనం స్వప్నస్ఖలనమంచు స్ఖలనం తేనేస్ఖలనం అగ్నిస్ఖలనం పాలస్ఖలనం ప్లావిత స్ఖలనం— అణువణువునా అస్తిత్వం అంతటా రసజ్వలిత భగ్నజ్వాలాజ్వలన ప్రకంపనాంతర ఝరి.

స్ఖలనలీన రాగలీన స్వప్నలీన మౌనలీన నాదలీన విశ్వలీన స్వప్న విశ్వలీన విశ్వరాగ స్వప్నలీన విషాదాశ్రులీన ఆనందాశ్రులీన విషాదానందాతీత లీన తాదాత్మ్య రసోన్మాద జ్వలనలీన స్వప్న విశ్వైక్య రసయోగ విశ్వ సంప్లావిత నిర్వాణం—

మరికొన్ని క్షణాలకి ;

విద్యుదయస్కాంత వలయంలో అపరిమాణ రేణువులా చలించిన అనంత్‌రెడ్డికి, విశ్చల శిలా స్పర్శలా అనిపించి— పెదవులు తప్పించి, "స్వప్నా" అన్నాడు.

స్వప్న లేదు. స్వప్న, స్వప్న.

"స్వప్నా" అన్నాడు, స్వప్నంలోనే వుండే అనంత్‌రెడ్డి.

"—"

పక్కకి కదిలి జరగబోయి—

అతని కనుబొమ్మలు ముడిపడ్డాయి.

గిరుక్కున తిరిగి ఆమెని చూసి, వక్షం మీద చెయ్యివేసి కదుపుతూ "స్వప్నా" అన్నాడు. స్పృహ కోల్పోయిందనుకున్నాడు.

అమాంతం లేచి, వొక చెయ్యి మోకాళ్ళ కిందుగా, రెండో చెయ్యి వీపు కిందుగా దూర్చి, ఆమెని యెత్తుకుని నడిచి వొచ్చి కారులో పడుకో బెట్టాడు.

కారులో కూచున్నాడు. స్టార్ట్ చెయ్యబోయాడు. అతని కాళ్ళూచేతులూ

కారుతున్నాయి.

కారు తలుపు కొద్దిగా తెరిచి రోడ్డుమీదకి అటూ యిటూ చూస్తున్నాడు.

వో లారీ దూసుకు వెళ్ళిపోయింది. వో చిన్నకారు వొస్తోంది. లేచి రోడ్డు మధ్యలో నిలుచుని రెండు చేతులూ అడ్డంగా వూపాడు.

కారు ఆగింది.

కారులో యిద్దరు మగవాళ్ళు, యిద్దరు ఆడవాళ్ళు, ముగ్గురుపిల్లలు

స్పృహ కోల్పోయిందనీ, తను కారు నడిపే స్థితిలో లేనట్లూ చెప్పి వాళ్ళలో వొకరికి పిల్లైతే తనకారు డ్రైవ్‌చెయ్యమని అర్థించాడు. కళ్ళల్లో. నీళ్ళు.

కార్లు కదిలాయి.

యిరవై నిమిషాల్లో కార్లు వుస్మానియా ఆస్పత్రి ముందు ఆగాయి.

"మీకు శ్రమ యిచ్చాను. తరవాత కలుస్తాను" అని వాళ్ళ విజిటింగ్ కార్డులు తీసుకున్నాడు అనంత్‌రెడ్డి. వాళ్ళ కారు వెళ్ళిపోయింది.

లోనకి యెమర్జన్సీ రూంలోకి పరుగుతీశాడు.

లోనకి చేతులమీద పట్టుకుని తీసుకువెళ్ళారు.

డాక్టరు పరీక్షించి—మూడో నిమిషంలో, అనంత్‌రెడ్డి భుజంమీద చెయ్యివేసి, "సారీ" అన్నాడు. మరు క్షణంలో అనంత్‌రెడ్డి కుప్పగాకూలిపోయాడు. స్పృహ తప్పింది.

ఆస్పత్రి సిబ్బంది వైద్య సపర్యలతో అరగంటకి స్పృహవొచ్చింది. అతని కళ్ళవెంట నీళ్ళు ధారగా కారుతున్నాయి.

అడ్రను వివరాలు తదితర అంశాలు అడుగుతున్నారు.

కలం యిమ్మన్నట్లుగా చేత్తో సూచించాడు. కలం కాగితం యిచ్చారు శ్రీపతి హాస్టలు అడ్రసు రాశాడు. జేబులోంచి పర్సు తీశాడు.

ఆ రెండూ అందుకుని అడ్రసు చూసి క్షణకాలం ఆలోచించి—పర్సులోంచి యిరవై రూపాయల నోటు తీసి, ఆదీ అడ్రసు కాగితమూ వొక వార్డ్‌బాయ్‌కి యిచ్చి టాక్సీలో వెళ్ళి తీసుకురమ్మన్నాడు.

డాక్టర్ పర్సు అందించాడు. అందుకుని జేబులో పెట్టుకుంటూ వుండగా ఆమె పింతండ్రి నాగిరెడ్డి గుర్తొచ్చి ఫోన్నంబరు చెప్పాడు.

ఐదు నిమిషాలు. లేవబోయాడు. కళ్ళు తిరిగినట్లనిపించి మళ్ళీ పడ్డాడ

కున్నాడు.

"ఆయన, ఆయన మిసెస్ బజారు వెళ్ళారట రాగానే చెప్పి పంపుతా మన్నారు. వాళ పనిమనిషి వెంటనే బయల్దేరి వొస్తున్నట్లు చెప్పారు" అని ఫోనుచేసి వొచ్చిన నర్సు చెప్పింది.

వెల్లకిలా పడుకుని పైకి చూస్తూవున్నాడు. అతని కళ్ళముందుయేమీ కనిపించటంలేదు. కళ్ళలోంచి నీళ్ళు కారుతూనే వున్నాయి.

అరగంట—

పడుకునే శ్రీపతి చుట్టూ చెయ్యి తిప్పి అతనికి ముఖం ఆనించాడు అనంత్‌రెడ్డి. అతని కళ్ళవెంట నీళ్ళు కారుతూనే వున్నాయి.

శ్రీపతి ఆమెవైపుకి చూడకుండా ఆస్పత్రి సిబ్బందితో మాట్లాడుతు న్నాడు.

రెండు వైపుల సీట్ల మధ్య ఖాళీలో నిలువుగా కింద పడుకోబెట్టబో తూంటే— సీటు మీద పడుకోబెట్టమన్నాడు శ్రీపతి.

అనంత్‌రెడ్డి కింద కూచుని ఆమె మీద ముఖం ఆనించాడు. అతని కన్నీళ్ళతో చీర తడుస్తోంది. శ్రీపతి రెండో పక్క సీట్లో కూచుని బయటకి [illegible]

అంబులెన్సు బేగంపేటలో అనంత్‌రెడ్డి యింటిముందు ఆగింది.

యింట్లో పనిపిల్ల.

చూసి, పక్కవాళ్ళు ఐదారుగురు వొచ్చారు.

కింద యెండుగడ్డి వేసి పడుకోబెట్టాలంటే — శ్రీపతి, పడకగది మంచంమీద పడుకోబెట్టమన్నాడు.

వాళ్ళు వెళ్ళిపోయారు అదోలాగా చూసి

అనంత్‌రెడ్డి వున్నట్లుండి చటుక్కున ఆమెను చేతులతోయెత్తి లోని తీసికెళ్ళి మంచంమీద పడుకోబెట్టి, మంచం అంచుమీద కూచుని వొంగి తల దిండుమీద ఆనించుకున్నాడు. కన్నీళ్ళ [illegible]

శ్రీపతి టెలిఫోన్ దగ్గర కూచుని, డై[illegible]

రాసిన చిన్న పుస్తకం తీసి ఫోను చేస్తున్నా[illegible]

అంతలో వాగిరెడ్డి దంపతులు వొచ్చారు. అస్పత్రికి వెళితే తీసుకెళ్ళి నట్లు తెలిసి, వాళ్ళింటికెడితే అక్కడికి తీసుకురాలేదని తెలిసి యిటు

వొచ్చారు.

యెందరికో ఫోన్లు చెయ్యలేదు — ముఖ్యమైన కొద్దిమందికే.

తండ్రి శంకరరెడ్డి పినతండ్రి హరనాధరెడ్డి. ఆ యిళ్ళలో ఆడవాళ్ళు మరికొందరు. అప్పటికప్పుడు కార్లలో బయల్దేరివొచ్చారు తెల్లవారు ఝామునకే.

స్వప్న రాగలీనని, మంచంమీద వెల్లకిలా. పాపిట మొదట్లో కుంకుమ, చెమర్చిన నెత్తురు విస్తరించి యెండిన నెత్తుటి చారికలా వుంది. నుదుట కుంకుమ, అప్పుడే చెమర్చిన నెత్తుటి బిందువు బింబంలా విస్తరించి మెరుస్తున్నట్లుగా వుంది. నలిగిపోయిన ఆవపిండి రంగు చీర — ఆ రంగులో చిక్కురొక్కురు యెర్రరంగు గీతలు.

స్వప్న రాగలీన, మౌనశిలా రాగలీనగా పరుండివుంటే: ఆమెకి ఆ పేరు పెట్టిన హరనాధరెడ్డి వెర్రిచూపులు చూస్తూ నుంచున్నాడు.

సెలయేటి జాడలోని యిసకలో కొట్టుకున్న గులకరాళ్ళలోంచి ఆమె గొంతు చిర్నవ్వుతోంది—మౌనంగా.

చీకటి వాడిలో కేరింతలాడే వెలుగు పావలా ఆమెకళ్ళు, వాలిన రెప్పల కింది నుంచి కాటుకలా మెరుస్తున్నాయి.

తూర్పు సముద్రపుటలలలోంచి లేచి, పడమటి పర్వత పానవుల మీదికి జారి పరున్న సూర్యబింబంలా పవళించి వుంది.

విషయం తెలియకపోతే — ఆమె ప్రశాంతంగా నిద్రిస్తున్నట్లు. దీర్ఘనిద్ర.

వొంటిన నగలేమీ లేవు, నల్లపూసల సూత్రాలు తప్ప.

బ్రాహ్మలు పంచాంగం చూస్తున్నారు, దహన సంస్కారానికి. శని వారం వుదయం బహుళ పాడ్యమి రేవతీ నక్షత్రం. పనికొచ్చినా పనికిరాక పోయినా రోజంతా ఘడియలు తప్పవు.

వాళ్ళకి అభ్యంతరం లేకపోతే — ఆమెని నేలమీద పెట్టవొద్దనీ కర్రలతో పాడె కట్టవొద్దనీ స్మశానంలో కాకండా పచ్చికబయలులో దహనం సంస్కారం జరిపించమనీ శ్రీపతి అన్నాడు.

ఆ మాటలు వింటూనే హరనాధరెడ్డి కళ్ళు మెరిశాయి. అన్న శంకర రెడ్డికి చెబుతూంటే వుత్తరీయంతో కళ్ళు వొత్తుకుంటూ, "మీ యిష్టం" అన్నాడు చిన్నగా. బ్రాహ్మలకి చెబితే— బాగా గిట్టుబాటు అవుతుందని

వద్దేదన్నారు. అవసరాన్ని బట్టి, శాస్త్రంలో దేనికైనా సదుపాయం చూడ గలవాళ్ళు.

వున్నట్లుండి అనంతరెడ్డి బయటికి నడిచి వొక కారులో కూచున్నాడు అర్థంకాక అతని వొంక చూస్తున్న వాళ్ళతో, కారు పోనిమ్మన్నట్లుగా చేత్తో సూచించాడు. నాగిరెడ్డి, వాళ్ళ డ్రైవర్ని కూచోమన్నాడు· మరొకతనూ· కూచున్నాడు.

కారు సాగిపోతోంది.

"మోజంజాహి మార్కెట్ కి" అన్నాడు అనంత్ రెడ్డి.

మార్కెట్లో పువ్వులదుకాణాల్లో వున్న పువ్వులన్నీ వెనకగా బుట్టల్లో స్టాకువున్న పువ్వులన్నీ కారులో పెట్టించాడు అనంత్ రెడ్డి.

కారు యింటికి తిరిగివొచ్చింది. బుట్టలు లోనికి తెమ్మని చేత్తో సూచించాడు.

రకరకాల పువ్వులు. దోసిలితో తీసి ఆమె మీద పోస్తున్నాడు అనంత్ రెడ్డి. పువ్వులతో పాటు కళ్ళలోంచి నీళ్ళు పడుతున్నాయి, రాలి.

శ్రీపతి గంధం చక్కల చిత్రికపొట్టు తెప్పించాడు.

గంట సేపు.

కార్లు బయల్దేరాయి. ఆమె తండ్రి, పింగంద్రులిద్దరు, మరోనలుగురు శ్రీపతి. బ్రాహ్మలు.

అనంత్ రెడ్డి కూర్చోబోతూ, ఆగి—లోనకి వెళ్ళి "విశ్వలీన" చిత్ర లేఖనం చంకన పెట్టుకొచ్చాడు, దానికున్న తెరతోపాటు.

వూరిబయట పచ్చికబయలు.

అనంత్ రెడ్డి ఆమెను చేతులమీద యెత్తుకుని నడుస్తున్నాడు. కన్నీళ్ళు రాలి ఆమె మీద పడుతున్నాయి,

పచ్చికమీద శ్రీపతి పేర్పించిన గంధపు చిత్రికపొట్టుమీద—ఆమెను వెల్లకిలా పడుకోబెట్టాడు అనంత్ రెడ్డి. "విశ్వలీన" చిత్రలేఖనం తీసుకొచ్చి ఆమె వక్షం మీద బోర్లా పెట్టారు.

చితి పేర్చుతున్నారు.

యెటో చూస్తూ నిలుచున్నాడు శ్రీపతి.

బ్రాహ్మలు అనంత్ రెడ్డిచేత తలకొరివి పెట్టించారు.

ఐదు నిమిషాలు.

మంటలు జ్వాలలుగా పైకెగిసిపోతున్నాయి. వాటివంక చూస్తున్న అనంత్‌రెడ్డి కళ్ళు పొడిగా అవుతున్నాయి.

మంటలు జ్వాలలుగా పైకెగిసిపోతున్నాయి. చూస్తూ వుంచున్నాడు శ్రీపతి. యెన్నడూ కంటతడే యెరగని ఆతనికళ్ళు చిట్లినట్లుగా — అతని బుగ్గల మీదకి కన్నీటి ధారలు....దేనికి? ఆమె అతనికేమౌతుంది!

ఆదేరోజు రాత్రికి అనంత్‌రెడ్డిని మధ్యాహ్నానికి వొచ్చిన అతని తండ్రీ వాళ్ళ వూరు తీసుకెళ్ళాడు. అనంత్‌రెడ్డి, తన వెంట — గిటారు, ఆమె రికార్డ్ చేయించుకున్న కేసెట్లూ, ఆమె ఫోటోలు తీసుకొచ్చాడు.

మాట్లాడకండా పడుకుంటాడు రోజంతా. పలకరించినా పలకడు. తలతోటో చేత్తోటో అవుననో కాదనో ఏదో సూచిస్తాడు. యెప్పుడన్నా వొకటి రెండు మాటలు. ఆమె ఫోటో యెదురుగా కూచుని చూస్తూ కేసెట్స్ పెట్టుకుని వింటూ కూచుంటాడు. ముఖ్యంగా బాలమురళి గానంచిన "త్రిపుర సుందరీ నీ దివ్యరూపమును జూడ దనకు దొరికెనమ్మా — మందగమన నీ కటాక్ష బలమో — ముందటి పూజాఫలమో" మళ్ళీ మళ్ళీ రివైండ్ చేస్తూ వింటూనే వుండిపోతున్నాడు. అది, బాలమురళికృష్ణ గానించినదని అతనికి ప్రత్యేకం తెలియదు. అతను వింటున్నది ఆ సంగీతంలోని ఆపాట. అదివరకు, స్వప్నరాగలీన, కేసెట్స్ పెట్టుకుని వింటున్నప్పుడు తను విని వుంటాడుగానీ ప్రత్యేకం గమనించిలేదు. ఐతేస్వప్నరాగలీన: ఆ పాటకోసం కాక, ఆ పాటలోని సంగీతం కోసం— ముఖ్యంగా, బాలమురళి గానించిన ఆ రీతికి —ఆ రికార్డు టేప్‌కి యెక్కించింది.

పగలూ రాత్రీ—అలా కూచుని అలా వింటూ — యెప్పుడో వో కునుకు ....భోజనం, తింటే నాలుగు మెతుకులు.

అలా వారం రోజులు గడిచాయి.

వో రోజు సాయంత్రం గిటార్ తీసి వాయిస్తున్నాడు. అందులో లీనమై వాయిస్తున్నాడు. వాయిస్తూ వాయిస్తూ సడన్‌గా ఆగిపోయి —గిటార్ విసిరికొట్టాడు గుమ్మానికి. పగిలింది. విరిగింది. వెంటనే గట్టిగా అరిచాడు. తలుపుల మీద దబదబా బాదుతున్నాడు కొట్టుకుంటున్నాడు, ఛాతీమీద కొట్టు కుంటున్నాడు, పొత్తి కడుపుమీద కొట్టుకుంటున్నాడు.

విని— తండ్రీవాళ్ళూ వొచ్చి పట్టుకుని పడుకోబెట్టారు. అరగంటకి నిద్రపోయాడు. అర్ధరాత్రి

కోవటమో చేస్తున్నాడు.

మౌనంగా స్తబ్దుగా వుంటాడు. వుండుండి అలా కొట్టుకోవటం మొదలెడతాడు. గట్టిగా అరవటం. చేటినచ్చా విరగగొట్టడం. వొకోసారి యెదటి వ్యక్తిని కొడతాడు.

బెంగుళూరులో చూపెట్టారు, చివరికి మద్రాసు కిల్పాక్‌లో చేర్పించారు.

# 133

"యిగా పొద్దు పేపర్ చూస్తివా బ్రహ్మానందరెడ్డి యిందిరా కాంగ్రెస్‌లో చేరిండు, సిగ్గులే" అన్నాడు వినాయకరావు. వినాయకరావు జేజి వేదపారాయణ తమ్ముడు. యెం యే లో చేరాడు యీ సంవత్సరం.

"వాళ్ళందరూ మోఖా చూసొచ్చి చెయ్యిచ్చేటోళ్ళే. చరణ్‌సింగ్ తోటి కల్సి మినిస్టరయ్యి వాన్ని ప్రైమ్ మినిస్టర్ని చెయ్యలే" అన్నాడు నిఖిలానందభారతి, తెలుగులో నిఖిలానందభారతి దయానందభారతి తమ్ముడు లా లో చేరాడు.

"వాడు చరణ్ అందరికంటే బిగ్రేయర్ ట్రెయిటర్. జనతాని చీల్చినది వాడేగద!" అన్నాడు యింద్రసేనారెడ్డి. యింద్రసేనారెడ్డి గోవర్ధన్‌రెడ్డి తమ్ముడు. యెం. యె లో చేరాడు.

"వానికంటే గొప్పోడు బాబూ జగ్ జీవన్ కొ సాలా, వాడు మంచి గుంటే చరణ్‌సింగ్ యెట్లా మినిస్ట్రీ ఫాం చేసును." అన్నాడు వినాయకరావు.

"అది రాష్ట్రపతి మేజిక్. యిందిరనడిగిండు. ఆమె సపోర్టు లేదు. జగ్‌జీవన్‌ని అడిగిండు. వాని సపోర్టు లేదు. జన్‌తా సపోర్టులేదు. యింకెవరి సపోర్టు వున్నది? చవాన్ బ్రహ్మానందరెడ్డికాంగ్రేస్ సపోర్టు. అంతకే మెజారిటీ యెట్లొస్తది? నిన్ను ప్రైమ్ మినిస్టర్ని చేస్త—ఆతర్వాతపార్లమెంట్‌లో బలం ప్రూవ్ చేసోకో అంటడా రాష్ట్రపతి! వాడు రాష్ట్రపతేనా! చరణ్‌సాలా సంజీవ్‌రెడ్డి మామకు పదిరోవయ్ లక్షలైన యిచ్చి వుంటడు. లక్షల పైకం మింగేటప్పటికి—అంతరాత్మ లోపలికెల్లి కూతపెట్టింది. ఆదెట్ల చెప్పే అల

చేస్తున్న— అని వొర్లుతున్నాడు. ధూసిగ్గులే!" అన్నాడు యింద్రసేనారెడ్డి.

"లోపటికెల్లి అంతరాత్మ ఆస్మాత్ కూత అరువైతొమ్మిదిల యిందిరమ్మ కడుపుల శురూ అయ్యెనని మా అన్న చెప్పిండు" అన్నాడు నిఖిలానంద భారతి.

"వాడు కరుణాకర్‌రెడ్డి వొస్తున్నడు అటునుండి. పూరో—" అన్నాడు వినాయకరరావు.

"థక్‌నే కా క్యా? పూ ఖాడ్ తె క్యా!" అన్నాడు నిఖిలానంద భారతి.

"చలో పోదాం" అన్నాడు యింద్రసేనారెడ్డి.

అటునుంచి వొస్తున్నారు కాకాని లెనిన్‌బాబు, కొండా కరుణాకర్ రెడ్డి.

"హలో మిత్రో!" వంకర ధ్వనింపు పలకరింపుగా అన్నాడు కరుణాకర్ రెడ్డి వాళ్ళని చూసి. కరుణాకర్ రెడ్డి మోహన్‌రెడ్డి తమ్ముడు. యీసంవత్సరం యేమ్మెసీలో చేరాడు.

వాళ్ళు బయటికి నడిచారు.

లెనిన్‌బాబు, కరుణాకర్ రెడ్డి, కుర్చీలు జరుపుకుని కూచున్నారు.

"యీ నా కొడుకులు గిలగిల్లాడి చస్తున్నారు. నాలుగు పార్టీల జనతా యెనిమిది చెక్కలుగా పగిలింది!" అన్నాడు లెనిన్‌బాబు సంతోషంగా. లెనిన్‌బాబు విజయవాడలో బియ్యే చదివి, యీ సంవత్సరం యిక్కడ యెం. యె. సోషియాలజీలో చేరాడు.

"లా కాలేజీలోనూ యిక్కడా మనమే గెలిపిస్తమని— యేకాక ప్రెటెక్స్ట్ తోటి స్ట్రైక్ చెయ్యాలని చూస్తున్నారు వెధవలు" అన్నాడు కరుణాకర్ రెడ్డి.

"వొచ్చే జనరల్ యెలక్షన్ల తరవాత వీళ్ళనో పట్టుపట్టాలి" అన్నాడు లెనిన్‌బాబు.

వడ్లాది రామాచారి వొచ్చి వీళ్ళని చూసి, "హలో" అంటూ వొచ్చి కూచున్నాడు, అతను యెం. యె పొలిటికల్ సైన్స్‌లో చేరాడు.

"యేం రామాచారి యేమిటి విశేషాలు?" అన్నాడు కరుణాకర్ రెడ్డి.

"చాయ్ తాగుదామని వచ్చాను" అన్నాడు రామాచారి.

"అది వొక విశేషమేనా? తాగు. చాయ్ కాకపోతే వో పావు బాటిల్ బ్రాంది తాగు. వొంటికి మంచిది—మందు కదా!" అని నవ్వి, "ఏం క్లాస్

మేట్ ఆ నేతి శ్రీరంజని యేమంటోంది? నెయ్యి నీకు చాలా యిష్టం అను కుంటాను!" అన్నాడు లెనిన్‌బాబు.

"ఆమె ఫ్రెండ్ మండలి గవిరినాయుడికి నెయ్యంటే చాల యిష్టం" అని నవ్వాడు రామాచారి.

"వాళ్ళ నెయ్యంటేనేనా డాల్డా కూడానా!"

"డాల్డా, యికవిమిక్సీ జార్జ్‌కి యిష్టం!"అన్నాడు రామాచారి.

వరుముల కుచలకుమారి అని వో అమ్మాయి అతని క్లాసే. చేరిన మొదటి వారంలో డాల్డా వనస్పతి ప్రకటన బొమ్మ వున్న కాగితం అట్ట వేసిన యెక్సర్‌సైజు నోటు బుక్కు పట్టుకొచ్చేది క్లాసుకి. అందుకు, ఆమెకి ఆ పేరు పెట్టారు.

రామాచారి టీ తాగి చక్కా వెళ్ళిపోయాడు.

"బిల్లు మన మొహాన వేసిపోయాడు"అన్నాడు లెనిన్‌బాబు.

"చావనివ్వు. యెలక్షన్ టైంలో పనికొస్తాడు" అని లేచి, "రావటం లేదా?" అన్నారు కరుణాకర్‌రెడ్డి.

"ఆ విశ్వేశ్వర్‌తో పనివుంది వొస్తానన్నాడు. వాడికోసం చూస్తు న్నాను. అన్నట్లు నువ్వు హిస్టరీ డిపార్ట్‌మెంటువైపుకి వెళ్తే శ్రీదేవితో చెప్పు, సాయంత్రం వుండమని" అన్నాడు లెనిన్‌బాబు.

శ్రీదేవి, గాయత్రి చెల్లెలు. వీళ్ళ సపోర్టుతో లేడీస్ సెక్రటరీగా గెలి చింది.

కరుణాకర్‌రెడ్డి వెడుతూంటే గుమ్మంలో విశ్వేశ్వర్ యెదురయ్యాడు "మా లెనిన్‌బాబు నీకోసమే యెదురుచూస్తున్నాడు" అన్నాడు కరుణాకర్ రెడ్డి.

"జరంత లేటాయె" అని, "ఆప్ జైసా కోయీ—". అని పా కుంటూ వొచ్చాడు విశ్వేశ్వర్. కూచుంటూ "హలో కామ్రేడ్" అన్నాడు.

"నేను కామ్రేడ్ నేఁవిఁట్రోయ్!"అన్నాడు లెనిన్‌బాబు.

"లెనిన్‌వి కద!"

"మా నాన్నకి నే పుట్టినప్పుడు నా సంగతి తెలియక ఆ పేరుపెట్టాడు నాకు ముప్ఫయ్యేళ్ళొచ్చేసరికి అయిన సర్దైపోతాడని నా నమ్మకం. సర్దై పోవటం అంటే రైటైపోవటం. రైటిస్ట్, నాట్ లెఫ్టిస్ట్" అన్నాడు లెనిన్ బాబు.

"సెక్రెటరిస్టంటే?" అన్నాడు విశ్వేశ్వర్.

'నీ తలకాయ' అనుకుని, "విశ్వేశ్వర్, సాయంత్రం నాకో చిన్న పని చేసిపెట్టాలి మారెడ్‌పల్లిలో—"అంటున్నాడు లెనిన్‌బాబు.

"యీవెనింగ్ పిక్చర్ ప్రోగ్రాం వున్నది."

"నీకు సినిమా ప్రోగ్రాం వుండనిదెప్పుడుగానీ—"అని ఆ పని వివరిస్తున్నాడు లెనిన్‌బాబు.

విశ్వేశ్వర్, జ్ఞానేశ్వర్ తమ్ముడు. అన్నకిలాగే యితనికి సినిమాలు చూసే పిచ్చి, ఐతే రేసెస్ అలవాటవలేదింకా.

లెనిన్‌బాబు కూచున్న టేబిలు దగ్గిరికి సంధ్యావందనం నాగేశ్వరరావు నూకరాజు అప్పలరాజు వొచ్చారు.

"చదువుకోటానికొచ్చారా యిట్లా కేంటీన్‌లో కూచోటానికొచ్చారా?" అన్నాడు లెనిన్‌బాబు హాస్యంగా.

వీళ్ళుకూడా యూత్ కాంగ్రేస్ వర్గం.

"చదువుకోటానికి పుస్తకాలెక్కడ? అన్ని పుస్తకాలూ ఆ శోభ లైబ్రేరీనుండి లెక్చరర్లని మెప్పించి పట్టుకుపోయింది!" అన్నాడు అప్పలరాజు.

శోభారాణి వళిని చెల్లెలు. చదువంటే చాలా ఆసక్తి. బాగా చదువుతుంది. మంచి మార్కులొస్తాయి.

పలుగురైదుగురు వొచ్చి పక్కబల్లల దగ్గిర కూచ్చున్నారు.

అందులో తెలుగు రిసెర్చి స్కాలర్ వీరభద్రరావు, "చెన్నాపట్నం చిన్నదాన్ని చైనా బజారులో వున్నదాన్ని—"అని ప్రారంభించాడు అతని ప్రక్కన కూచున్న చెరుకూరిరామశర్మ. "అడగనా చెప్పనా"అంటూ ప్రారంభించాడు.

అంతలో సుధాకర్ వొచ్చాడు "హలో" అంటూ లెనిన్‌బాబు కూర్చున్న బల్లదగ్గిరికి.

"యేం, గురువుగారూ, తమరి దర్శనమే అపురూపమైపోయింది!" అన్నాడు లెనిన్‌బాబు.

"వూర్లో లేను. నేను చెప్పిన పని చేస్తివా మైడియర్ బాబూ లెనిన్ అన్నాడు సుధాకర్, సుధాకర్ లా లో చేరాడు.

అవతల బల్ల దగ్గిర వీరభద్రరావు, "పాల డిపో మీదుగా.... అట్టట్ట

....వొస్తే మా యిల్లు— అక్కడే—అక్కడే అక్కడే వుంది—" అని పాడుతున్నాడు వుత్సాహంగా. ఆతని పక్క కుర్చీలో కూచునివున్న పర్వతనేని రామిరెడ్డి. "సింగపూరు సింగారి వయసు పొంగు వయ్యారి రాజమండ్రి కోడలుగా రామంది.. "అని ప్రారంభించాడు.

"యెక్కడ స్వామీ, నీకేం, పని పూరమాయింది పాడుతున్నావు. వాడొక పట్టాన దొరకుతాడా!" అన్నాడు లెనిన్‌బాబు.

అంతలో లోపలికి వొచ్చిన శ్రీపతిని చూసి, "వెయ్యేత్తి రండిసార్" అన్నాడు సుధాకర్.

శ్రీపతి, లా ఆఖరి సంవత్సరం.

"యేం సుధాకర్, నువ్విక్కడే మువ్వన్నెల లెనిన్‌తో ముచ్చటలాడుతూ కూచుంటే. అక్కడ లా కాలేజీ తగలడిపోతోంది. పరమేశ్వరుడు నీమీద మూడో కన్ను తెరిచాడు లా కాలేజీలో దర్శనమిచ్చి!" అన్నాడు శ్రీపతి.

"ఆ పోరన్నెప్పుడో దొర్కబట్టుకొని బొక్కలిర్గదంత. నానంగతెర్కలేనట్లున్నది వాళ్కు! ఆ పొద్దే తప్పి వుందును. మధ్యలో మిమ్మల్ని చూసి వూర్కుంటి" అన్నాడు సుధాకర్.

"పోనివ్వయ్యా. వ్యక్తిగత ద్వేషం గర్హనీయమే నాకో" అన్నాడు శ్రీపతి.

"హలో శ్రీపతి, నీకోసం మీ కాలేజీకి కబురెట్టాను" అంటూ వొచ్చాడు రామ్మూర్తి. కూడా పొలిటికల్ సైన్సు కుక్కుటేశ్వరరావు—అతనిప్పుడు రీడర్.

లెనిన్‌బాబు, "గుడ్‌మార్నింగ్ సార్" అన్నాడు, తన లెక్చరర్ రామ్మూర్తితో. "కులాసా?" అన్నాడు రామ్మూర్తి పలకరింపుగా.

"పనున్నది పోతున్నం" అని లేచాడు సుధాకర్. అతనితోపాటు లెనిన్‌బాబు మిగతా యిద్దరూ లేచారు.

"మీ ఖలీల్ ముసఫా యేమంటున్నాడు?" అన్నాడు శ్రీపతి.

"చార్‌మినార్ వెళ్ళి వొక అత్తరు సీసా కొనితెచ్చి ఇద్దామనుకుంటున్నా"

నవ్వాడు రామ్మూర్తి.

కుక్కుటేశ్వరరావు మౌనంగా కూర్చున్నాడు.

"నీ పుణ్యం అటు వెళ్ళకిప్పుడు. ప్రస్తుతం కర్ఫ్యూ కొనసాగుతోం దక్కడ. యెంతైనా నీకు అప్పుడు మేస్టరు కదా గ్యాస్ పట్టించుకోకు" అన్నాడు శ్రీపతి.

"అనేకదా నేను వెనకాడుతున్నాను" అన్నాడు రామ్మూర్తి.

"యేంవిటి విశేషాలు?" అన్నాడు శ్రీపతి.

"యేమున్నయ్ పాతాలూ నెలజీతాలూ. శ్రీమతికి నిత్యనీరసపురోగం. పిల్లలకి అన్ని చిల్లర మల్లర జబ్బులు. ఆ పైన— అదుగో వాడు, యింట్లో హాయిగా మెక్కి, మా నాన్నగారి దగ్గిరనుండి కొంత గొప్పింపుకుని తాగుడూ సినిమాలూ. దీనికి తోడుగా రెవల్యూషనరీ బ్రిగేడ్ అంటూ వేషాలూ" అన్నాడు రామ్మూర్తి. కేంటీన్‌లో అవతలి బల్ల దగ్గిర్నుంచి వెడుతున్న తమ్ముడు నీలకంఠశర్మ వొంక చూపెడుతూ.

కుక్క శేశ్వరరావు, "యిప్పుడే వస్తా" అని అవతల వొకరి దగ్గిరికి వెళ్ళాడు.

నీలకంఠశర్మ పక్కన పాకుడు కాంతారావు వున్నాడు. వాళ్ళిద్దరూ విరసం శాఖలో సఖ్యులు.

"వొక్కొక్కరిది వొక్కో దృష్టి. దానిదేం వుందిలే" అన్నాడు శ్రీపతి.

"వీళ్ళకి తోడు ఆ పరమేశ్వర్రావొకడు. వాడి అన్న కులశేఖరరావు కనపడటం లేదీమధ్య యేమయ్యాడు? సోదర ద్వయం — ఆ ఆరెస్సెస్ వీరుణ్ని యీ కమ్యూనిస్టు వీరుణ్ని కాలేజీ యెలక్షన్లో పోటీకి నిలబెడితే తమాషాగా వుంటుంది" అన్నాడు రామ్మూర్తి.

"కులశేఖరుడు గత మోడాదినుంచీ పోర్టుఫోలియో లేని మంత్రిలాగా యిక్కడ కాలం వెళ్ళబుచ్చి యిటీవలే ఢిల్లీ వెళ్ళాడు, జీవనాధారం కోసం. యింకో నెలకి యెలక్షన్లు కదా. ఆ తరవాత జనసంఘ్ పరిస్థితి యెలా వుంటుందోనని. దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకుందావేఁని. దీపం యిప్పటికే కొడికట్టిందనుకో— మంచి వుద్యోగం గాని , యేదన్నా పర్మిట్ గానీ సంపాదించాలని వెళ్ళాడు.

"రాజకీయ వర్గాలవాళ్ళు. వాళ్ళకేం యేదోకటి సంపాదించగలరు" అన్నాడు రామ్మూర్తి.

"ప్రస్తుతం యేక్ రాత్ కా సుల్తాన్ చరణ్‌చౌధురి హయాంలో

వుల్లిపాయలు కూడా దొరక్క....."

"అవునయ్యా! వుల్లిపాయలు యేం ధరా యేం ధరా— మా ఆవిడకి యెక్కువగా వాడే అలవాటు లేకపోబట్టి సరిపోయింది. లేకపోతే నెల బియ్యం బిల్లు వుల్లిపాయలకి చాలదు" అన్నాడు రామ్మూర్తి.

"ఫిజిక్స్ డిపార్టుమెంటులో మొన్నేదో గొడవైందని విన్నానని చెప్పావు. అదేం లేదట" అన్నాడు శ్రీపతి.

"అనేత్ యెట్లా వున్నాడిప్పుడు?" అన్నాడు రామ్మూర్తి.

"ప్లీజ్ ఆ విషయం. అబ్బ ఆ పరిస్థితి చెప్పను కూడా చెప్పలేను, క్రితంవారమే మద్రాసుకి వెళ్ళొచ్చాను. గొలుసుల్తో కట్టేసి వుంచారు" అని కళ్ళు గట్టిగా మూసుకున్నాడు శ్రీపతి.

# 134

యా పందొమ్మిది వందల డెబ్బయ్తొమ్మిది ఆఖరి నెల ఆఖరి వారాల్లో లోక్‌సభ యెన్నిక సంరంభం దేశవ్యాప్తంగా ప్రారంభమయింది.

వెనకటిలాగా, క్రితంసారిలాగా— రెండు మూడు దిగ్గజాలు యెన్నికల రణరంగంలోకి దిగి హోరా హోరీ పరస్పరం విషద్రవం తొండాలతో చిమ్మటంకాదు. యీసారి, పాతిక పొట్టేళ్ళు, దేన్ని యేది కుమ్ముతుందో తెలియని అయోమయంలోపడి , పక్కన కనిపించిన దానినో పోటు పొడిచి తనపని తాను చూసుకుంటున్నట్లుగా వుంది పరిస్థితి.

రెండు కమ్యూనిస్టు పార్టీలు, కొన్ని కమ్యూనలిస్ట్ పార్టీలు, మూడు నాలుగు ప్రాంతీయ పార్టీలు వంటివి కాక— చరణ్‌సింగ్, మొరార్జీ, ఫెర్నాండెజ్, జగ్‌జీవన్‌రాం, అర్స్ చవాన్, వాజ్‌పేయి, యిందిరాగా, తలకో జండా తలకో దారి తలకో మాట—

దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే అన్నట్లు యీ సారి యెలక్షన్లో అందరూ మహానాయకులే, అన్నీ మహాపార్టీలే.

లక్షాది ప్రజలు— ఆటవిక లయాన్విత సంగీతంగా వెలువడిన అత్యాధునాతన పాశ్చాత్య మానసపు ఆవేదనల ఖేదమోద ప్రేలాపనలకు భారతదేశ భాషల సినిమా అనుకరణలు చప్పిడి మోతల సంగీతంలో వోలలాడిపోతుంటే; కోట్లాది ప్రజలు — నానారకాల యీతిబాధల దారిద్ర్యపు

వ్యధల విశ్వన గీతంలో కుంగిపోతూంటే — యెన్నికల కోలాహలపు వడగాడ్పుల సంగీతపు మ్రోతకి చెవులు చిల్లులడిపోతున్నాయి.

యీ పందొమ్మిది వందల యెనభయ్ కొత్త సంవత్సరం మూడో తేదీన దాదాపు అన్నిచోట్లా, ఆరో తేదీన కొన్నిచోట్లా యెన్నికలు జరిగాయి. త్రిపురవంటి సంకటపురం మినహాయింపుగా వుండిపోయింది.

రాయ్‌బరేలీ పెట్టిన వాత యింకా గుర్తుండీ, ఐనవాళ్ళంతా ఆపద సమయంలో తప్పుకుని తనకి వైరివర్గాలుగా యేర్పడితే— ధైర్యం చాలక, యెందుకైనా మంచిదని అక్కడా యిటు మెదక్‌నుంచీ నామినేషన్లు దాఖలు చేసింది యిందిరాగాంధీ—యేదెలా వున్నా ఆంధ్రప్రదేశ్‌లో తన గెలుపు ఖాయం అని.

రాజకీయ రంగంలో ధక్కా మొక్కీలు తిన్నవాళ్ళెవరూ తన తరపున లేకపోయినా, ఆత్మ స్థయిర్యంతో, ధైర్యంగా, దీక్షగా, "నేను నేనే: నాకు వోటు వెయ్యండి" అంటూ బయల్దేరింది.

మేకులాగా వుంటూనే మేకలాగా అవుతూండే సి. పి. ఐ., వొరలో పెట్టిన కత్తిలాగా సి. పి. ఐ. మార్క్సిస్టుపార్టీ, మీరేమైనా సరే ముందు మా సంగతి చూడండని అరుస్తూండే ద్రవిడ కజగ ద్వయంలతో పాటు, ముసలి చిరుతలా చరణ్‌సింగ్, రాజకీయ హెడ్‌మాస్టర్‌లా మొరార్జీ, దెబ్బ తిన్న పులిలా ఫెర్నాండెజ్, తోడేలులా జగ్‌జీవన్‌రాం, గుంటనక్కల్లా అర్సు చవాన్‌లు, పొగరుబోతు గోవులా వాజ్‌పేయిల వంటి వాళ్ళు — యెవరి బుద్ధులను బట్టి వాళ్ళు, యెవరి శక్తి యుక్తులను బట్టి-వారు దేశం కోసం యెన్నికల వ్యూహ వేదుకకి శక్తివంచన లేకుండా ప్రజాసేవ చేశారు.

యెన్నికలన్నాక— ప్రజలు, మూర్ఖులైనా మూఢులైనా విజ్ఞులైనా వాళ్ళదేకదా తీర్పు! యీసారి ప్రజలతీర్పు — దండించినా దీవించినా మాకు యిందిరమ్మ అభయహస్తమే కావాలన్నారు. క్రితంసారి బాలభానుడు, ప్రిన్స్ ది స్వీట్ బ్రూట్ సంజయుణ్ని యెగా పెగా వాయించిపంపిన ఆదే అమేథీ యీ సారి అమోఘంగా విజయ స్వాగతం పల్కింది.

యిందిరాగాంధీ —అప్పుడు డబ్బయ్యేడులో దే[illegible] పరాజయం పొందుతానని వూహించనట్లే, యిప్పుడీ యెనభయ్ ఆరంభ యెన్నికల్లో దేశవ్యాప్తంగా మహా విజయం [illegible] వూహించన

పోయింది.

ప్రజలకి— యెమర్జన్సీ పూర్వాపరాల కంటేకూడా గతరెండున్నరేళ్ళ జనతాపార్టీ పాలన భయభ్రాంతులను చెయ్యకపోయినా పరమ చీదరగా అపమర్దంగా అనిపించి వుండాలి.

కొంతకాలంగా మిడిసిపడుతూ వొచ్చిన నీలం వారి రాష్ట్రపతిత్వం యిప్పుడు యిందిరాగాంధీ దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి వుంది. యిందిరమ్మ అభయ హస్తం దేశానికే కాక దేశ రాష్ట్రపతికి కూడా శరణ్యం ఐంది.

యివాల్టి జనవరి పదిహేనో తేదీ దినపత్రిక చంకనపెట్టుకుని బస్సెక్కాడు శ్రీపతి.

బస్సులో— జరిగిన యెలక్షన్ల గురించీ లోకల్ పాలిటిక్స్ గురించీ కొత్త కేంద్ర మంత్రివర్గం గురించీ —రకరకాల మాటలు వ్యాఖ్యలు కసుర్లు విసుర్లు అక్కసులు ఆనందాలు.

శ్రీపతి, బస్సు దిగి నడుస్తున్నాడు.

—జనతా అభ్యర్థిగా అక్కిగా యెన్నికయ్యి అక్కిగా రాష్ట్రపతి ఐన సంజీవరెడ్డి మహా అదృష్టవంతుడనుకున్నారు. జనం జనతా పార్టీ కుక్కలు చించిన విస్తరిలాగా ఐపోతే అక్కిగా మంత్రాంగం తంత్రాంగం చేసే అవకాశం చిక్కింది. అవి నీలం వారి సహజసిద్ధ లక్షణాలు. రాజ్యాంగాన్నీ వో పిసరంత అనుంటా పెట్టి, నీవు నేర్పిన విద్యయే నీరజాక్షీ అని అంతరాత్మ ప్రబోదాన్ని లేన్నాడు. యిప్పుడీ పార్టీల్లో యే వొక్కదానికీ సరిపడా మెజారిటీరాదు. యే యిద్దరూ నికరంగా కలవలేరు. అంచేత, నీలం వారి అధినాయక పరిపాలన తప్పదు - అని రాజకీయ పామరులు పండితులు అందరూ అనుకున్నారు. యెవరూహించాం మరోమహావింత జరుగుతుందని! రాష్ట్రపతి నామమాత్రపు అధినాయకుడుగా కాక సర్వం స్వహాధికారం చెలాయిస్తాడనుకున్నారు. జన గణ మన అధినాయక జయహే— అని టాగోరు మన యిష్టా యిష్టాల ప్రసక్తి లేకండా మనని పరిపాలించే పరాయిరాజును పొగిడినట్లు, నేరుగా ప్రజలు యెన్నుకోని పుత్సవిగ్రహానికి జన గణ మన యద నాయక జయహే— అని ప్రజలు కీర్తించేవారు. అలాంటిది—మరణశిక్ష పడిన వాళ్ళకి ప్రాణభిక్ష పెట్టగల రాష్ట్రపతికి యిప్పుడు తనకే కుర్చీభిక్ష అవసరం ఐంది. భిక్ష వెయ్యగల వ్యక్తి — యేమైనా చెయ్యగల వ్యక్తి—

మెడలో పూలమాలలా వెయ్యొచ్చు, కత్తివేటుతో పీకతప్పించనూవొచ్చు....

శ్రీపతి నడుస్తున్నాడు.

"నీ కాల్మొక్కుత దొరా, మంచిగున్న వా"

శ్రీపతి తల పక్కకి తిప్పి చూశాడు బిచ్చకత్తె, చిన్న చక్రాల బండిలో ఆమె కుంటిమొగుడు. ఆ బండి యీడుస్తూనో తోస్తూనో వీధులలో అడుక్కుంటుంది.

—యీ ప్రమ్మ—కాదు అనసూయ సిటీ అనసూయ, నిజభర్తని ఆ బండిలో కూచోబెట్టుకుని బండి లాగుతూ వీధుల్లో అడుక్కుంటుంది. వెనకోసారి విద్యార్థి వీరుల కత్తిపోట్ల సందర్భంలో హాస్టళ్ళు మూసేస్తే సిటీలో మెస్సులో ఆశ్రయం పొందినప్పుడు—ఆ వీధి కొసన వున్న చెట్టు కింద వీళ్ళ కాపరం యేం తోచకో దేనికో వాళ్ళ జీవనాన్ని పరిశీలించబట్టి తెలిసింది. ఆదివారాలు అడుక్కోటానికి వెళ్ళేదికాదు. విధిగా కోడికూర—కూరకాదు, కోడిని డ్రెస్సింగ్ చేసి, చీరి అక్కర్లేని పేగులూ గట్రా తీసేసి మాంచి మసాలా నరుకు నూనె అవీ నింపి సజ్జన్‌లాగా సేది. అప్పుడా కోడి చూడటానికి, బూరు పీకిన కోడిలా వుండేది. దాన్ని వో కర్రకి తగిలించి పేళ్ళ మంటమీద కాల్చేది. దీనికి యే హోటల్ బంజారాలోనో ఐతే వందరూపాయలకి తగ్గకుండా వసూలు చేస్తారు. వారం రోజులలో అప్పుడప్పుడు దొరికిన రూపాయలు రూపాయలు బస్సుతి బియ్యం విడిగా దాచి వొండేది. ప్రతి ఆదివారం యిలాంటి విందు భోజనం భర్తకి పెట్టి తనూ తినేది. యివంతా గమనించి వోసారి చేయిచ విప్పితే దేవి కుండే కష్టాలు దాని కుంటాయన్న విజ్ఞానము తెలియవచ్చింది. యీ పుణ్య భూమిలో పాపభీతితో ధర్మం చేసే వాళ్ళకి కొదవలేనందువల్ల ధర్మాత్ములకి కొదవలేదుగానీ, అన్నిటికీ వున్నట్టే బిచ్చమెత్తుకోటానికుండే సామాజిక రాజకీయ సమస్యలు దానికున్నాయి. నగరంలో బిచ్చపు మండలాధిపతులు న్నారట. వాళ్ళు నగరాన్ని బిచ్చపు వార్డులుగానూ, కీలకస్థానాలను బిచ్చపు సెంటర్లుగానూ విభజించి—వాళ్ళ వాళ్ళ బలాబలాలను బట్టి వాటికి అధిపతు లవుతారట. బిచ్చగాళ్ళు వాళ్ళ రోజు కమిషన్, పండగ స్పెషళ్ళు యిస్తుం డాలట. ప్రభుత్వోద్యోగులకిలాగే వీళ్ళకీ వొక మండలం నుంచి యింకో మండలానికో వొక సెంటరునుంచి యింకో సెంటరుకో ట్రాన్స్‌ఫర్ కావా లంటే లంచం యిచ్చుకోవాలట—కొన్నాళ్ళు చూపిస్తూ పొగడబాకోపాయి.

యిలా యాచించటం అవమానకరంగా అనిపిస్తుందట వాళ్ళకి. అవును మరి, దేశాన్ని యాచించటం వేరు. ఆఖరికి బిచ్చగాళ్ళు కూడా యెలా అంటే అలా చిత్తమొచ్చినట్లుగా వుండి యిష్టమొచ్చినచోట ఆడుక్కోవటానికి లేదన్న మాట! బ్రతుకంటేనే సామాజిక మనుగడ. కానీ యీ చట్రం లోనే తాముగా నిలవాలి. వ్యక్తిత్వం కాపాడుకోవాలి—పేరడాక్సికల్. పేరడాక్సికల్‌గానే మనిషి చారిత్రక ఆర్థిక సామాజిక బద్ధం. కానీ వొకో వెర్రి వెంగళప్ప యీ పరిధిని దాటి వూపిరి పీలుస్తాడు అప్పుడు వాడి కొంప మునిగిపోతోంది. వాడి కొంప మునగకపోతే సమాజంకొంప మునుగుతుంది. వొక్కోసారి రెండు కొంపలూ జమిలిగా మునిగిపోతాయి. బుద్ధుడు సోక్రటీసు బ్రూనో కోపెర్నికస్ న్యూటన్ డార్విన్ ఫ్రాయిడ్ యిబ్సెన్ స్పెంగ్లర్ ఐన్‌స్టీన్ హైజన్‌బర్గ్ మార్క్స్—వీళ్ళందరూ కొంప ముంచుకున్నవాళ్ళో కొంప ముంచినవాళ్ళో—రెండూనో. అలా వర్తమాన చారిత్రక సామాజిక పరిధి నధిగమించి వూపిరి పీల్చి కొంప ముంచటం లోంచి కొంప మునుగుతూ వినూత్నంగా తేలుతుంది. యిది కూడా చారిత్రక నియతే. అందుకే చారిత్రికత తననితాను చీల్చుకుంటూ తిరస్కరించుకుంటూ పెంపొందించుకుంటూ కొనసాగుతుంది. హెగెలు, యీ చారిత్రక అస్తిత్వాన్ని బూడిద అంటే—కాదు బుసి అన్నారు మార్క్స్. యింకో బూర్క్స్, బుసి కాదు మసి అంటాడు. ఐతే వీళ్ళంతా తనదే తుదివాక్యం పరమపదం అని భ్రమిస్తారు. భ్రమించపోతే అలా క్రమించలేరు. అది, పరిధి నధిగమించేతనపు పరిమితి. యివన్నీ నేసేనంటూ చారిత్రకత, తన కథ కొనసాగిస్తూనే వుంటుంది—అగామిగిద్దుడు గిక్రటిన్ గ్రైన్ స్టీన్ గార్విన్ గ్రైజన్‌బర్గ్ గ్రాయిడ్ గిబ్సెన్ గార్క్స్‌లు, కాలిలో ముల్లులా నరాలలో డయాలిటిక్ నెత్తుర్లా గుచ్చుకుంటూ పాకుతూ వుంటే— యివన్నీ నేసేనంటూ చారిత్రకత తన కథ కొనసాగిస్తూనే వుంటుంది. యీ చారిత్రక సామాజికత ముక్కుకి సూటిగా దాని దారిన అది పోదు. దానితో అది విభేదిస్తూ, దాని మీద అది ఆధారపడుతూ నానా గొడవగా నానా రీతులలో పరస్పర ఆధారత్వాన్ని అల్లుతూ వుంటుంది. యీ విశ్వంలో యెక్కడో వొకమూల యేదో జరిగితే దాని ప్రభావం యెన్నెన్ని చోట్లనో వుంటుంది. యీ భూమ్మీద వొక చోట యేదో జరిగితే యెన్ని చోట్లో యేవో ఐపోతుంది. నేనిలా పెళ్ళీ పెటాకులూ లేకుండా వుండిపోతే అది నావరకే పరిమితం కాదు. దేశ

జన సంపదని పెంచని నేరం చేసినవాడినన్న మాట. వో అరబ్బు బుడే సాయిబ్బుకి పుల్లిసాయులు కావాలిస్తే కూరగాయలు కావాలిస్తే బుల్లెమ్మలూ కావాలిస్తే వైట్‌హౌస్‌లో క్రెమ్లిన్‌లో కుట్రాన్ బాంబు సంతకం చేస్తే పీకింగ్‌లో బెటాలియన్ చెంగ్ చుంగ్ మినపగింజ కళ్ళతో దూరంగా చూపు సారిస్తే అక్కడ ఢిల్లీ పాదుషా వారు వాళ్ళ మనవడి పుట్టినరోజు వంద కోసం బాంబరు విమానాలో బార్లీ గింజలో కొంటే—యిక్కడ మన తిండిలో పడకలో నడకలో తభిసిక్కొస్తాయి. చూడగా ఆదిమ మానవుడివేపీ లేకండా—కానీ వాణ్ణెవరు బలవంతం చేశారిలా యిందాకా పాక్కుంటూ రమ్మని ! బహుశా అది ప్రాణి మూలతత్వమేమో యిలా పోయి పోయి సాఫీగానూ పోదు, మధ్యలో—బుడక వేస్తుంది, మునిగిపోతూంటుంది. బుటకేస్తూనే మునిగిపోతూనే మెలాయించుకొస్తుంది ......

శ్రీపతి నడుస్తున్నాడు.

రోడ్లమీదా గోడలమీదా చెట్లమీదా వాహనాలమీదా మనుషులమీదా గాలిలోనూ యిందిరాగాంధి ఫొటో కాగితాలు. కాంగ్రెసేది? కాంగ్రెసు సభ్యులేరి? యిందిరే యిండియా యిండియాయే యిందిర—అని వొకప్పుడని జారుకున్న బారువాలూ బీరువాలూ యెక్కడా కనిపించటంలేదు.

—కాంగ్రెసే యిందిరగా యిందిరే కాంగ్రెసుగా, ఆమె రాజకీయ జీవితం సాగుతూ వొచ్చింది. యిందిర యిండియా ఐనా, యిండియా యిందిర కాదు.

శ్రీపతి నడుస్తున్నాడు—చూస్తూ.

—సర్వం యిందిరామయం. యింది రామం. అందులో ఆపద సమయంలో జారుకోకండా అంటిపెట్టుకుని వుండిపోవటమే కాక అలాంటి సమయంలోకూడా తనని కొలిచిన వాళ్ళకే చోటు పెట్టింది. అన్నీ చేసీ చివరి గడియల్లో యెందుకైనా గాని వొచ్చి కావిలించుకున్న కాములాంటి వాళ్ళకి వొక్క మినిస్ట్రీ కాసు కూడా రాల్చలేదు. అందరికంటే పీపీ అదృష్టవంతుడు. యిప్పుడీమె—నేనేం చేసినా ప్రజలకోసమే చేస్తాను. నన్నలాగిలాగా చెయ్యమని ప్రజలు యెన్నుకున్నారంటుంది. ప్రజాస్వామ్యం మైనారిటీ స్వామ్యం ప్రజానియంతృత్వం నియంత నియంతృత్వం రాజా నియంతృత్వం రాణీ నియంతృత్వం యేదొక నియంతృత్వం — మెజారిటీ అభిప్రాయం తప్పు అని వివిధ రంగాలలో యెప్పటికప్పుడు ముందుకాలంలో

నిర్ధారణవుతూంటుంది. మహాజాక్రసీ, నీరోక్రసీ 'బీకొన్హాక్రసీ' ఔరంగజేబాక్రసీ, జారాక్రసీ, స్టాలినాక్రసీ హిట్లరాక్రసీ జ్యూరాక్రసీ ప్రజాక్రసీ యిందిరాక్రసీ విజయేందిరాక్రసీ అఖిలభారత విజయేందిరా క్రసీ—

# 135

యిది సంజయ్ ఋతువు యిందిరా పవనాలు వీస్తున్నాయి. యేఋతువైనా యేపవనాలైనా మారటం ప్రకృతిధర్మం మార్పు మారే రీతీ, అప్పటి కాలగతిననుసరించి వుంటుంది.

సంక్రాంతి సెలవులు ముగిసి—విద్యాలయాలు తెరిచారు, యివాళ.

శ్రీపతి లా కాలేజీకి వెళ్ళబోతూ యిటు తిరిగి, వుస్మానియా విశ్వ విద్యాలయం భవనం మెట్లెక్కుతున్నాడు.

నేను మారనని మొండికేసినట్టుగా యీ భవనం అప్పటికీ యిప్పటికి అలాగే వున్నట్లనిపిస్తుంది. అన్ని మార్పులూ వొకేలాగా వుండవు. లో మార్పు, పూర్తిగా మారక బయటపడుతుంది. పై మార్పు మూలంలో మారకండానే మారినట్లు కనిపిస్తుంది. దేవతకెప్పుడూ ముప్ఫయ్ మూడేళ్ళేనట. శ్రీపతీ అలాగే కనిపిస్తాడు. యీ భవనమూ అంతే. అప్పటికీ యిప్పటికీ ప్రౌఢలాగే వుంది. కానీ, యెప్పుడో వుండుండి కొంత కాలం తరవాత చూస్తూండగా కళ్ళముందు ముసలిదై పోతుంది. అంచేత దేవతలూ అంతేననుకోవాలేమో. దేవతలున్నారా? మనలో యెందరమో దేవతలం— యెందరమో దెయ్యాలంలాగా. దేవతలూ మనుషులే. దెయ్యాలూ మనుషులే.

శ్రీపతి, మెట్లెక్కి ఆ మెట్లపైన, గుమ్మానికి యివతలగా యెడమ రాతి స్తంభానికి భుజం ఆన్చి బరువంతా యెడమ కాలిమీద మోపి, కుడిచేతి మడిచిన చూపుడువేలి కణుపుతో పెదాలమీద నొక్కుంటూ, ముందుకి దూరంగా, కిందికి చూస్తున్నాడు.

వొచ్చిపోతున్న బస్సులు కార్లుస్కూటర్లు, అటూయిటూ వెడుతున్న, మెట్లెక్కి పైకి వొస్తున్న జనాన్ని గమనించటంలేదు అతను. అలా అని పరిసరాలను గమనించలేని స్థితి అనీ కాదు.

రిటైర్డ్ ప్రొఫెసర్ జీలకర్ర దీక్షావధాన్లు కొడుకు, సంస్కృత

లెక్చరర్‌గా పనిచేస్తున్న జె. జె అవధాని బెల్‌బాటం స్ట్రైప్‌కట్ యెల్లెవేటెడ్ షూజ్ బండి చక్రాల షోకు కళ్ళజోళ్ళు కాక, గావంచా జందెప్పోగు బోడి గుండు పిలకతో వొచ్చినా— తొమ్మిదింటికే వొచ్చి బస్టాపు దగ్గిర చేరిన రామినీడు వీరభద్రరావు విశ్వేశ్వర్‌ల బృందం ; బస్సులోంచి దిగుతున్న ఆడపిల్లల మీద మురికి జోక్స్ వేస్తూ పిల్లి నక్కా కుక్కా కోడి కూతలతో కాలేజీ లోపలిదాకా సాగనంపటంలో పాకం మరీ ముదిరి యేదో గొడవ జరిగినా—(రిటైర్డ్ యింగ్లీష్ ప్రొఫెసర్ సి. టీ. జట్కావాలా కొడుకు కెమిస్ట్రీ లెక్చరర్ పిటీ. జట్కావాలా పాల తెలుపు లఖ్నవీ పైజమా కుర్తాలో కాక ; ఫుల్ సూట్‌లో వొచ్చినా—సోషియాలజీ ప్రొఫెసర్ బన ఖలీల్ ముస్తఫా షేర్వాని రూమీ టోపీ తీసేసి బంగాళీ ధోవతీ జుబ్బాలో వొచ్చినా—ఆమధ్య డాక్టరేట్ పుచ్చుకుని మూణ్నెల్ల క్రితం హిస్టరీ లెక్చరర్ అయిన త్రిపురసుందరి అందంగా హుందాగా కాక : గజ్జెల గుర్రంలాగ మెల్లెక్కినా—

యిలాంటివి యేమైనా జరిగితే ప్రత్యేకం గమనించనూ గమనిస్తాడు, శ్రీపతి.

అంతకుముందు దమ్మిడీ ఆస్తిలేకపోయినా ప్రస్తుతం సిటీలో మూడు యిళ్ళ స్థలాలు, వొక హౌసింగ్ బోర్డు కొంప యెలాట్‌మెంటు, రీడర్ షిప్పూ సంపాదించిన కుక్కుటేశ్వరరావు వొచ్చి స్కూటర్ ఆపాడు.

వో చెట్టుకింద నుంచుని కరుణాకర్ రెడ్డి, అప్పలరాజు రామశర్మలతో యేదో చెబుతూ అటుగా వెళుతున్న యింద్రసేనారెడ్డి వంక చూపెట్టి యేదో అని నవ్వుతున్నాడు.

అటు వెళుతున్న యింద్రసేనారెడ్డి అతని పక్కనున్న వినాయక రావుతో, వొచ్చే యేడు కాలేజీ యూనియన్ యెలక్షన్ వ్యూహం గురించి చెబుతున్నాడు.

లైబ్రరీనుంచి నాలుగు దిండు గ్రంథాలు మోసుకొస్తున్నాడు రామ్మూర్తి—తన సంసారాన్ని మోస్తున్నట్లుగా.

బస్సు దిగి, "శివ దీక్షాపరురాలనురా శిర మెంతైన విడువజాలనురా —దీక్ష యెంతైనా విడువజాలనురా" అని గొంతులో అనుకుంటూ సైన్సు బిల్డింగ్ వైపుకి వడుస్తున్నాడు వరాహశాస్త్రి. ప్రస్తుతం పూల్ ఆఫీసర్‌గా వుంటున్నాడు, జూఆలజీ డిపార్టుమెంటులో.

తమ సబ్జెక్టులో విశేషమైన కృషిచేసి డాక్టరేటు పోస్టు డాక్టరేటుచేసి యింకా నిరుద్యోగులుగా వున్నవాళ్ళకి డిపార్టుమెంటులో మరింత కృషి చేస్తుండమని, యు. జి. సి. వాళ్ళ తాత్కాలిక జీవనాధారంగా చేసే యేర్పాటు అది.

"నీకేమోయ్ ఆఫీసర్‌వి!" అని సరదాగా మిత్రులు అంటే—

"ఫూల్ అంటే గుంట. ఫూల్ ఆఫీసరంటే గుంటలోపడి కొట్టుకుంటున్న వాడు అని అర్థం. అదైనా మేలే. ఫూలైనా కాదు, ఫూల్ ఆఫీసర్. ఫూల్ అంటే యేం చాతకాని దద్దమ్మ అని అర్థం. యే వుద్యోగమూ సంపాదించుకోడవలేని చవట కదా అని జాలిపడి చదువుల పురుగులెమ్మని కనికరించి— మనోవర్తిచ్చి మొగుడు తగిలేసిన పెళ్ళాంలా, యూజీసీ వాళ్ళిస్తున్న భృతితో రోజులు వెళ్ళదీస్తున్నవాడు అని అర్థం. యిహపోతే, కొన్నాళ్ళు చూసి—యీ ముండ యెన్నాళ్ళకీ చావటంలేదు యెంత కాలమని మనోవర్తిచ్చేదని వో వైకుంఠ మాత్ర వేయించినట్లుగా; నాల్రోజుల తరవాత పీడొక్కటం వస్త్రం సమర్పిస్తారు. యేడ్చినా బతక్క తప్పనప్పుడు, నవ్వుతూనే బతుకుదాం. దేనికైనా పెట్టి పుట్టాలి!" అని ఛలోక్తిగా అంటూంటాడు వరాహశాస్త్రి.

అదే బస్సులోంచి దిగిన శ్రీదేవి వడివడిగా నడిచి వొచ్చి మెట్లెక్కుతోంది. కాలుజారి పడబోయి, నిలదొక్కుకుని మెట్లెక్కి లోనకి వెళ్ళింది.

—పడితే దెబ్బ తగిలివుండును. యేం చెప్పగలం, యే నవరగం తనో తగిలితే యెంత చిన్నగా తగిలినా యిట్టే పోతుంది ప్రాణం మీద నుంచి బస్సు వెళ్ళిపోయినా చెక్కుచెదరకుండా వున్నవాళ్ళున్నారు. ముల్లు గుచ్చుకుని నిలువెల్లా విషంతో చివికిపోయి చచ్చిపోయిన వాళ్ళున్నారు. పూర్తి ఆరోగ్యంతో వుత్సాహంగా సోఫాలో కూచుని, "హలో" అని చిర్నవ్వుతో పలకరిస్తున్న మనిషి పలకరిస్తున్నట్టే గుండె ఆగిపోయి ప్రాణం పోనూ వొచ్చు—వొచ్చు—గుండె ఆగిపోయి ప్రాణం పోయినట్లు డాక్టర్లు నిర్ధారించారు. గుండె ఆగిపోయి ప్రాణం పోయిందా, ప్రాణంపోయి గుండె ఆగిపోయిందా అని నేవడిగితే రెండూ వొకటేగా అన్నాడు, డాక్టరు. గుండె వుంది కదా మరి ప్రాణం యెక్కడికి పోయింది? ప్రాణం గుండెలో వుంటుందా? గుండె వుండి మనిషి వున్నా మనిషి పోయిందంటున్నారు. ప్రాణంపోతే ప్రాణంతోపాటు మనిషికూడా పోతే మనిషి చచ్చిపోయినట్లు

యెలా అనుకోవటం? మరణం అంటే పంచభూతాల్లో కలిసిపోటమా? ఆ పంచభూతాల శరీరం యింకా అక్కడే వుందిగా? పుట్టటం అంటే పంచ భూతాల్లోంచి రావటమా? వొచ్చి? పంచభూతాత్మకం. పంచభూతాలే ఐనా యిలా యెలా జరుగుతుంది? పంచభూతాల్లోంచి ప్రాణం ప్రయాణించి — ప్రయాణించి— ప్రయాణించేశాకగా తెలిపేది! ప్రకృతంతా ప్రాణమే కదా— ప్రాణం పోవటం అంటే ప్రకృతై పోవటమా? ప్రాణం పోకముందు? ప్రాణం విడిగా బొందిలో వుందనా? యీ బొంది ప్రకృతి కాదూ? సర్వం ప్రకృతే. సర్వం ప్రాణమే. మరి జననమేఁవిఁటి? మరణవేఁవిఁటి? జనన మంటే మరణించటమేమో, మరణించటమంటే జన్మించటమేమో— జనన మరణ సంఘాతమే ప్రకృతేమో— సంఘాతమూ కాదేమో — సంయోగ మేమో—రాగలీన స్వప్నలీన—సర్వమూ పోయినా స్వప్న పోదు. స్వప్న, స్వప్నకదా. పోదు. స్వప్న, రాగలీనకదా, రాగలీన స్వప్న పోదు.

అందరూ పోతారు. ప్రతిదీ పోతుంది. యెవరూ పోరు. యేదీపోదు పోనిదే రావటం యెలా? రానిదే పోవటం యెలా? యీ రావటం పోవటం లోంచి—

అన్నీ యధావిధి సాఫీగా కొనసాగుతున్నాయి యీమండే వగపెండ వెన్నెలవేళ మేలుకున్నవారి వ్యధా విధి తప్ప—అన్నీ యధావిధిగా సాఫీగా సాగిపోతున్నాయి.

క్షణం వెనక క్షణం ముందు క్షణం లోన క్షణం కింద క్షణం పైన క్షణం పక్క క్షణం క్రితం క్షణక్షణం, క్షణికం; క్షణిక క్షణిక క్షణంలో పుట్టుకే గిట్టుకలా అసలు ఆరంభమే అవనట్లుగా, గిట్టుకే పుట్టుకలా అసలు అంతమే అవనట్లుగా; క్షణక్షణాల క్షణికాల, క్షణికక్షణికాల క్షణాల; అంత లోనే అంతమయ్యే క్షణికాల దొంతర, యెంతకీ అంతమవని దొంతర క్షణి కాల, విశ్వాంతర్వ్యాపిత సంకీర్ణ క్షణికాలు అంతలోనే అంతమయ్యే యెంతకీ అంతమవని నిరంతర క్షణికం అనుక్షణికం.

స మా ప్తం —

# the meta-physique

[తన డిజైర్ అన్డ్ లిబరేషన్ నుంచి కొన్ని పంక్తులు]

"Reality is perpetually made. Realities, through realizedness, are their reality. Here it is realities; here they are reality. The ultimateness of reality is perpe-tuated by reality it self.

Reality is caused. Reality, as the caused cause i[illegible] and through itself, is the perpetual cause of itself. The multi-dimensional multi-directionality of reality renders single primal static uncaused cause impossible. A cause is a causing caused causing.

An existence is a non-isolated single individual passeage of intensity. Growing and decaying are the personate routes of convolution of an existence. Evolu-tion and involution are the impersonate routes of con-volution of an existence in so far as it is referential to the context of cosmic historicity.

The desire that liberates and the liberation th[illegible] disires are the spiral spinal swinging current— whic[illegible] is the i[illegible] inflorescent fusional-trajectory of orgas-micecst[illegible]sy." C. R. [illegible]